
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120034517

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# గీతా వ్యాసములు

## ద్వితీయ సంపుటము

1. కర్మ భక్తి జ్ఞాన సమన్వయము
2. పరమ రహస్యము

ఆంగ్లమూలము : శ్రీ అరవిందులు

ఆంధ్రానువాదము : శ్రీ చెలసాని నాగేశ్వరరావు

అరవింద సొసైటి తెనాలి



పృథివీచరిత్రకు శ్రీకారము చుట్టిన దగ్గఱ నుండియు,
శ్రీ అరవిందుడు ఏదియో యొక రూపమున, ఏదియో యొక నామముతో
మహత్తర పృథివీపరివర్తనలను అధిష్ఠించి నడుపుచునే వచ్చిరి.

—శ్రీ మాత.



భూమి పుట్టిన దగ్గఱనుండియు దివ్యచేతనా కిరణము నొక దానిని అభివ్యక్తము చేయగల అవకాశము ఎక్కడ, ఎప్పుడు ప్రాప్తించినను, అక్కడ నే నవతరించితిని.

—శ్రీ మాత.

# విషయ సూచిక



## మొదటి భాగము

### కర్మ భక్తి జ్ఞాన సమన్వయము.

## రెండవ భాగము

## పరమ రహస్యము

# మా మాట

"భగవంతుడు గీతను నా హ స్తములం దుంచెను," అని శ్రీ అరవిందుడు స్వయముగా వచించెను. దీనివలన గీతపై శ్రీ అరవిందుని వ్యాఖ్యానమున కున్న విశిష్టత మనకు విదిత మగును. ఇతర వ్యాఖ్యాతలు గాంచని లోతులకు దిగి, అందు నిగూఢముగా నున్న భావముల నిగ్గును వెలార్చిన వాడు శ్రీ అరవిందుడు – అని యావ్యాఖ్యానమును జదివి నపుడు మనము గ్రహించగలము. దీని నధ్యయనము జేసి దివ్య జీవనోన్ముఖుల మగుదుము గాక !

అనువాదకుడు, శ్రీ చె. నాగేశ్వరరావుగారును తన ప్రతిభతో శ్రీ అరవిందుని చేతనయందు మునిగి, యెంతో శ్రద్ధతో మూలమున కెంతయు న్యాయము చేకూర్చిరి. శ్రీ అరవిందుని వాఙ్మయము ఎంత మహిమాన్వితమో అంత సూక్ష్మము గాన అందొక్క మాటకూడ మార్చుట సాధ్యము గాదని శ్రీమాత నుడివిరి. కావున శ్రీ అరవిందుల రచనల ననువదించుట యెంత కష్ట సాధ్యమో గమనింప గలము. ఇందు అనువాదకుడు కృతకృత్యుడయ్యె ననుటలో నతిశయో క్తిలేదు. వారి ప్రతిభా వ్యుత్పత్తులకు మా నమోవాకములు. వారి జీవిత చరిత్రాంశములను ప్రథమ సంపుటము నందు బొందు బఱచితిమి.

అరువది వత్సరముల క్రితమే ఆంగ్లమున 'Essays on the Gita' వెలువడి నప్పటికి తెలుగులోకమునకు దూరముగనే యుండిన యీ గ్రంథరాజమును నేటికి రెండు సంపుటములుగా తెనుగున ప్రప్రథమముగా 'గీతావ్యాసములు' – అను పేరుతో పాఠకలోకమున కందించ గలుగుచున్నందుకు సంతసించుచున్నాము. ప్రథమ సంపుటము శ్రీ అరవిందుల జన్మదినోత్సవము, 15–8–77 న వెలువడగా ఈ ద్వితీయ సంపుటము అంతటి పర్వదినమగు 24–4–78 న వెలువడుట ముదావహము.

ప్రథమ సంపుటమును దిలకించి వారి యమూల్యాభిప్రాయముల దయతో నొసంగిన విజ్ఞులు శ్రీ బి. డి. జెట్టి (ఉపరాష్ట్రపతి) గారికి, గ్రంథమును కూలంకషముగా పరిశీలించి, సమీక్ష జేసిన పెద్దలు శ్రీ టి. కోదండరామరావుగారికి,

యీ సమీక్షను తమ పత్రికలో ప్రకటించిన 'శ్రీరామకృష్ణప్రభ' సంపాదకులకు మా వందన శతంబులు.

ప్రొఫెసరు వి. మధుసూదనరెడ్డిగారు, ప్రొఫెసరు దివాకర్ల వేంకటావధాని గారు, శ్రీ వేలూరి సహజానందగారు, శ్రీ కమలాకర వెంకటరావుగారు, మఱియు డాక్టరు వెం. నా. శర్మగారు - వీరి యభిప్రాయముల పూర్తి పాఠములు ప్రథమ సంపుటమునందు ప్రకటింపబడగా, ఈ ద్వితీయ సంపుటమున వానిలోని కొన్ని ముఖ్యాంశముల ప్రకటించితిమి. ఆ యీ మనీషులకు మా కృతజ్ఞతాభివందనములు మరల మరల సమర్పించుకొనుచున్నాము.

ఎంతటి యుత్కృష్ట గ్రంథమైనను వెలుగును చూడవలెనన్న ధనము కావలెను గదా. ఇందుకు స్వయముగా ముందుకు వచ్చి సొమ్ము సమర్పించిన ధన్యాత్ములకు మా హృత్పూర్వక నమస్సులు. శ్రీ మాతారవిందులు తమ కృపా విశేషమును వారిపై వర్షించుగాక !

ఈ గ్రంథమును ప్రచురించుటకు దయతో ననుమతి నొసంగిన శ్రీ అరవిందా శ్రమ కాపీరైటు డిపార్టుమెంటువారికి, దీని ముద్రణ కవసరమైన కాగితమును తగ్గింపుధర కందజేసిన కేంద్రప్రభుత్వము వారికి మా నమస్కారములు.

ఈ సంపుటమును శ్రద్ధతో, చక్కగా ముద్రించిన గోల్డెన్ ప్రెస్, తెనాలి వారెంతయు ప్రశంసార్హులు.

ఎన్ని యాటంకములు వచ్చినను, వాటినన్నింటిని తన పరోక్ష కటాక్షముతో వారించి, మా యందరి కృషికి విజయము చేకూర్చి, ఇపుడు తన సూక్ష్మ దివ్యశరీర మున మన యోగక్షేమముల నరయుచున్న శ్రీ మాత పాదారవిందములకు ప్రణతు లొనర్చి, యీ కృషిని యామె దివ్యచరణాబ్జములకు భక్తితో సమర్పించుకొను చున్నాము.

ఓం

శ్రీ మాతా మిరా శరణం మమ.

ఇట్లు,

శ్రీ అరవింద సొసైటి,

తెనాలి.

# నివేదన

గీతపై శ్రీ అరవిందుని వ్యాఖ్యానము మున్ముందు 'ఆర్య' పత్రికయందు క్రమముగా వ్యాసరూపమున ప్రకటింపబడెను. మఱియు నా వ్యాసములలో రెండు పరంపరలు గలవు. ఇందలి ప్రథమ పరంపరకు విషయము గీత యందలి మొదటి ఆఱు అధ్యాయములు మఱియు నీ విషయము స్థూలముగా గీతా–కర్మయోగమగును. కనుక ప్రథమసంపుటముగా ప్రకటింపబడిన ఈ ప్రథమ పరంపరయొక్క అనువాదము నకు 'గీతావ్యాసములు, ప్రథమ సంపుటము : కర్మయోగము'–అని నామకరణము చేయబడినది.

పోతే, ద్వితీయ పరంపరలో తిరిగి రెండు విభాగములు గలవు. ఇందలి ప్రథమ విభాగము గీతయొక్క ద్వితీయ షట్కమగు 7–12 అధ్యాయములను అధికరించియుండును, మఱియు దీని విషయము స్థూలముగా 'కర్మ భక్తి జ్ఞాన సమన్వయము.' కాగా ద్వితీయ విభాగము గీతయొక్క తృతీయ షట్కమగు 13–18 అధ్యాయములను లక్షించును, మఱియు నిందు 'పరమ రహస్యము' వెల్లడించబడును. అందుచేత ఈ రెండు విభాగములతో గూడిన గీతావ్యాసముల ద్వితీయ పరంపరయొక్క అనువాదమును ద్వితీయ సంపుటముగా ప్రకటించుచు దానికి 'గీతావ్యాసములు, ద్వితీయ సంపుటము : కర్మ భక్తి జ్ఞాన సమన్వయము మఱియు పరమ రహస్యము' – అని పేరిడి యున్నాము.

గీతాబోధన చరమ అధ్యాయములయందే తన పరమోన్నత శిఖరముల నందుకొనును, మఱియు నచ్చటనే శ్రీ అరవిందుని వ్యాఖ్యాప్రతిభయు పరాకాష్ఠ నందుకొని ఆ శిఖరముల మన కావిష్కరించి చూపును. కనుక జిజ్ఞాసుమహాశయులు శ్రద్ధగా నీ ద్వితీయ సంపుటమును గూడ అధ్యయనము జేతురు గాక ! మఱియు నందుకు సహాయకముగా ప్రథమ సంపుటమునందలి ప్రస్తావనను గూడ బాగుగా నవగతము గావించుకొనెదరు గాక !

అనువాదకర్త

# ప్రస్తావన

## 1. "బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే"

ప్రతి అధ్యాయాంతమున గీతామకుటమునందు గన్పించు ఈ వర్ణనమే గీతా స్వరూపమును మనకు వెల్లడించును. దీనిని బట్టి, గీత బ్రహ్మవిద్య మఱియు యోగ శాస్త్రము, అనగా బ్రహ్మవిద్య నది జీవనమున కన్వయించి, జీవనసమస్యను పరిష్కరించ సమకట్టిన యోగశాస్త్రము—విద్య దర్శించిన దానిని యోగ మనుష్ఠించును. గీతయొక్క పుట్టుకయు మన కా విషయమునే సూచించును: విషాదగ్రస్తుడైన అర్జునుని కర్తవ్యోన్ముఖుని జేయుటకే గీత వెలసెను గదా.

కాని అది ప్రధానముగా యోగశాస్త్రమే యైనను, యోగాభ్యాసవిషయమున బుద్ధికి బొడము శంకలను బాపుటకు గీత దార్శనిక విషయములను గూడ [illegible] విచారించును.

## 2. ద్విప్రకృతులు, త్రిపురుషులు

ఉదాహరణకు, ఇట్టి విచారణయందు వెలువడినవే గీతకు మకుటాయమానము లైన, ద్విప్రకృతులు మఱియు త్రిపురుషులకు సంబంధించిన సిద్ధాంతములు. ఇవియే గీతయొక్క ఉత్తమ రహస్యము, [1] పరమ గుహ్యము (15-20). కనుక వీనిని గుఱించి ముందు దిఙ్మాత్రముగా దెలిసికొందము. వీని తత్త్వము బోధపడినచో, గీతయందలి తక్కిన దంతయు తన నిజరూపమున మనకు దెల్లమగును. ఈ ఉత్తమ రహస్యము ఉపనిషత్తులయందు సైతము వికీర్ణమై, గర్భితముగా నున్నను, వానిని గుదిగూర్చి, నిర్దిష్టముగా ప్రతిపాదించిన ఘనత గీతామాతకే దక్కెను, మఱియు నా ప్రతిపాదనను కరతలామలకము గావించిన అపూర్వ ప్రతిభ శ్రీ అరవిందునికే

---

[1] ఈ కుండలీకరణమునందలి మొదటి సంఖ్య గీతయొక్క అధ్యాయమును, రెండవది అధ్యాయమునందలి శ్లోకమును దెలుపును.

చెల్లును. తక్కిన వ్యాఖ్యానము లన్నియు ఈ ద్విప్రకృతులను, త్రిపురుషులను ఇంచుమించు దాటవేయగా, శ్రీ అరవిందుడు వీనిని తన యావత్ప్రతిభతో వివరించి, జీవనప్రహేళికను పరిష్కరించి, తన దివ్యజీవన-లక్ష్యమునకు వానిని సోపానములు గావించుకొనును.

## 3. జీవనప్రహేళిక

అయితే జీవనప్రహేళిక స్వరూపము ? మనము జీవించుటకు కర్మ చేయక తప్పదు (3-8), మఱియు మనలో కర్మ నెరపునది ప్రకృతియే గాని, ఆత్మ గాదు (13-30). ఇక నీ ప్రకృతి తన త్రిగుణములచేత జీవుని భ్రమింపజేయుచు (7-13), ఏకాత్మ నెఱుంగ నీయక, భేదభూమికలోనే అతనిని బంధించియుంచును. ప్రకృతి వలయములో నున్నంత కాలము జీవున కీ భ్రమబంధనములు దప్పవు. పోతే ప్రకృతిని విడిచి, జీవుడు ప్రకృతికి పరమునం దుండు ఆత్మలో నెలకొను నేని, అక్కడనతనికి భ్రమబంధనము లుండవు గాని, అచట నతడు నిష్క్రియతలో మునిగి పోవును. ఏలన ప్రకృతి కావల క్రియ గాని, క్రియాసంకల్పము గాని, క్రియాసంకల్పము గాని యుండజాలదు.

ఇట్లు ప్రకృతిలో నున్నపుడు ముక్తి యుండదు, ఆత్మలో నున్నపుడు కర్మ యుండదు. కావున విముక్త కర్మ అసంభవము. అందుచేతనే జీవనసమస్యకు పరిష్కారము లేదు ; ఇదియే జీవనప్రహేళిక.

కావుననే మాయావాదము జీవనసన్యాసమును ప్రబోధించగా, బౌద్ధమతము మఱియొక అడుగు ముందునకు వేసి, జీవననిర్వాణమునే వక్కాణించును. మాయావాదమున నిష్క్రియాత్మస్థితి రూపమగు ఆంతరజీవన ముండును గాని, బౌద్ధమున అదియు నిర్వాణము నందును (ఆఱిపోవును).

ప్రకృతితో నారంభించిన ఈ ప్రహేళికను-ఈ ముడిని - విడదీయుటకు గీత ముందు ప్రకృతిని వివేచించును.

## 4. అపర ప్రకృతి

మన కిపుడు పరిచితమైన ఏయీ ప్రకృతి గలదో, అది అష్టవిధము : పంచ భూతములు, మనస్సు, బుద్ధి మఱియు అహంకారము ననునవి దీని అవయములు

(7-4). పైగా నీ ప్రకృతి త్రిగుణాత్మకము, కావున దీని ప్రతి అవయవము త్రిగుణమయము. సాంఖ్యశాస్త్ర మీ ప్రకృతి దగ్గఱనే ఆగిపోవును. మఱియు నిది జడము, పురుషుడు చేతనుడు గావున, ప్రకృతిపురుషు లిరువురు రెండు విభిన్న ప్రాథమిక వస్తువు లని సాంఖ్యమునకు చెప్పక తప్పలేదు.

ఇచ్చటనే ఆగిపోయినచో, గీతయు ఆత్మకును, విశ్వప్రకృతికిని మధ్య ఒక పూడ్చరాని అఖాతమునే ప్రతిపాదించి యుండును. ఏలన అపుడు విశ్వప్రకృతి గుణముల మాయాశక్తి మాత్రమే యగును (7-14), మఱియు విశ్వము గుణముల మాయాజాలమే యగును. కావున సత్యాత్మకును, మిథ్యాజగత్తునకును ఎట్టి సక్రియ సంబంధము నుండదు [1] (2-1-5). కాని గీత ఈ అష్టవిధ బాహ్య ప్రకృతితో నాగి పోదు; గీతయొక్క సమ్యగ్దర్శనమున ఇది <u>అపర</u> ప్రకృతి (7-5) మాత్రమే.

## 5. పర ప్రకృతి

గీతకు ఈ అపర ప్రకృతికంటె భిన్నమగు మఱియొక శ్రేష్ఠ వస్తువు గలదు, మఱియొక ఉచ్చతర తత్త్వము గలదు, అది ఆధ్యాత్మిక ప్రకృతి; దానినే గీత <u>పర</u> ప్రకృతి యని పిలుచును (7-5). ఇది పరమపురుషుని, భగవంతుని ప్రకృతి - "మే ప్రకృతిం" (7-5). ఇదియే సర్వభూతములకు ఆద్య మూలము (7-6).

అపర ప్రకృతి జీవునియొక్క బాహ్య రూపము కాగా, పరప్రకృతి అతని స్వరూపమే యగును - "పరా ప్రకృతిర్ జీవభూతా" (7-5). అజ్ఞమగు అపర ప్రకృతి సర్వజ్ఞమగు ఈ పరప్రకృతియొక్క ఒక సంతానమే (derivation), ఒక క్రీనీడయే (2-1-5) - అని శ్రీ అరవిందుడు ఉభయమునకు గల తారతమ్యమును దెలుపును.

తర్వాతి శ్లోకము (7-6)లో "ఏత ద్యోనని భూతాని"-అని గలదు. (ఏతత్ =) ఈ యుభయ ప్రకృతులు సర్వభూతములకు యోని యని ఇతరులు వ్యాఖ్యానించగా,

---

[1] ఇట్లు కుండలీకరణమునందు రెండు గాక, మూడు సంఖ్య లున్నచో, మొదటిది గీతావ్యాసములయొక్క రెండవ పరంపరను, అనగా నీ రెండవ సంపుటమును, రెండవది ఆ పరంపరలోని వ్యాససంఖ్యను, మూడవది ఆ వ్యాసములోని పేరాను సూచించును.

(ఏతత్ =) ఈ పరప్రకృతి సర్వభూతములకు యోని యని శ్రీ అరవిందుని వ్యాఖ్యానము. ఏలన అపరప్రకృతి పరప్రకృతియొక్క ఒక క్రీనీడ మాత్రమే.

మఱియు (7–6) శ్లోకము మొదటి పంక్తిలో, 'ఏతత్తు' = ఇదియే సర్వ భూతములకు యోని యని శ్రీ కృష్ణుడు చెప్పి, రెండవ పంక్తిలోనే – నేనే సర్వ భూతములకు యోని – నని చెప్పికొనును. కావున ఈ ఏతత్తునకును, పరమ పురుషునికిని భేదము లేదు, అభేదమే గలదు–అను యొక నిగూఢ రహస్యమును శ్రీ అరవిందుడు వెలికి లాగును. అందుచేత సర్వభూతములకు యోనియైన ఈ 'ఏతత్తు' అపరప్రకృతి మిశ్రము లేని పరప్రకృతియే గావలెను.

సారాంశముగా, పరప్రకృతికిని, పరమపురుషునికిని అభేదము, మఱియు నా పరప్రకృతియే భూతముల యోని – యని మనకు శ్రీ అరవిందుని వ్యాఖ్యానము వలననే దెలియును. దీనినే శ్రీ అరవిందు డింకను ఇట్లు మనకు వివరించును.

"ఈ సర్వోన్నత క్రియాశక్తియందు పురుషప్రకృతులు రెండును ఒకటియే. అచ్చట ప్రకృతి పురుషునియొక్క సంకల్పము మఱియు కార్యనిర్వాహక సామర్థ్యము మాత్రమే – ప్రకృతి వేఱుగా నొక వస్తువు గాదు, శక్తిలోపల నుండు పురుషుడే ప్రకృతి" (2–1–5). ఉదాహరణకు, నా శక్తి – అని నపుడు, ఆ శక్తి నానుండి వేఱుగా లేదు, తన లోపలి నేను – గానే యున్నది.

## 6. జీవనసమస్యా పరిష్కారము

ఇట్లు నిమ్న ప్రకృతియే సర్వప్రకృతి గాదు గావున, నిమ్న ప్రకృతి నుండి పైకెగసి, ఆత్మస్థులమైనపుడు సైతము మనము నిష్క్రియతలో మునిగిపో నవసరము లేదు. ఆత్మకు ఆధ్యాత్మిక ప్రకృతి గలదు, మఱియు నా ప్రకృతియే సర్వకర్మలకు మూలసంకల్పము గాన, ఆత్మయందును మనము సర్వకర్మలు చేయగలము (4–18), అథవా మనద్వారా సర్వకర్మలు జరుగగలవు. పైగా నచ్చట అజ్ఞాన జన్యమగు భేదము, బంధము నుండవు గాన, అవి యన్నియు విముక్త కర్మలు, ప్రహృష్ట కర్మలు సైతము నగును, అనగా స్వేచ్ఛా ప్రహర్షములు ఈ కర్మల స్వరూపలక్షణములు.

ఇట్లు పరప్రకృతి యొకటి యుండుటవలన, ఆత్మయందును మనకు బాహ్య జీవన ముండును మఱియు నా జీవనము విముక్తమే గాక, ప్రహర్షపులకితమును.

ఇదియే తన పరప్రకృతిద్వారా గీత మనకు జూపు జీవనసమస్యకు పరిష్కార మార్గము.

ఏ సంకుచిత సన్న్యాసమార్గమునో గాక, గీతయొక్క సమగ్రమార్గము నవలంబించి, గుణక్లిష్ట ప్రకృతినుండి గుణాతీత ఆత్మలోనికి బయనించి నప్పుడే, మన కీ పరప్రకృతి పట్టువడును, మనము జీవనసమస్యను దివ్యముగా పరిష్కరించుకొనగలము. " యోగస్థః కురుకర్మాణి " (2–48) = కర్మప్రభువుతో యోగ యుక్తుడవై కర్మచేయుము - ఒక్క మాటలో, నిదియే గీతామాత మనకు జూపిన జీవనసమస్యా పరిష్కారము.

విముక్త కర్మ ఎట్లు సంభవము ? – అను శంకను బాపుటకు ఆవశ్యకము కాగా, గీత పరప్రకృతి యను దానిని ఆవిష్కరించి మించినది. ఇక నిపుడు, ఆత్మయే ఎట్లు ఈశ్వరుడు కాగలుగును ? – అను సందేహ నివృత్తికి పురుషోత్తమ తత్త్వమును ప్రతిపాదించి మఱింత గణుతికెక్కను.

## 7. ఆత్మయే ఈశ్వరుడా ?

పరప్రకృతి పరమపురుషుని ప్రకృతి యనియు, ఆ పురుషుడే సృష్టికర్తయగు నీశ్వరు డనియు ఈ ప్రస్తావనయొక్క 5 – వ ప్రకరణములో జెప్పుకొంటిమి. పోతే 6 – వ ప్రకరణమునందు పర ప్రకృతి ఆత్మప్రకృతి యని చెప్పి, తదాత్మకే ఇంచుమించు ఈశ్వరభావమును కట్టబెట్టియున్నాము. ఇంకను, గీత సైతము ఆరంభమున, రెండవ అధ్యాయమునందు, "అవినాశియగు నాత్మయే ఈ జగత్తు నంతను విస్తరింపజేసెను". (2–17) – అని పలికినది.

కాని ఈ అవినాశి ఆత్మ, అనగా అక్షరాత్మ నిష్క్రియము, నిర్వ్యక్తికము, సర్వసమము. అది సర్వకర్మలను సమభావమున, సాక్షిగా అవలోకించునే గాని, ఏ కర్మను ప్రత్యేకించి సంకల్పించదు, శాసించదు. అట్టి ఆత్మ ఈశ్వరు డెట్లగును ? కానిచో, గీతయు నట్లెందుకు వచించెను ?

ఎందు కన, ఆనాడు వ్యవహారమునం దున్న సాంఖ్య, యోగ, వేదాంతములను గీత చేపట్టి, వానికి తన విచారణలో క్రమారోహణపద్ధతిని పూర్ణరూపములు గల్పించును.

కాగా, అప్పటి వేదాంతమునందు పురుష లిరువురే యుండిరి-క్షరుడు మఱియు అక్షరుడు. క్షరుడు జీవుడు, ప్రకృతిగతుడగు వైయక్తిక, వికారి, పురుషుడు; పోగా అక్షరుడు ప్రకృతి కతీతుడగు నిర్వ్యక్తిక, నిర్వికారి, నీరవ పురుషుడు. ఆ వేదాంతమున ఇతనికి పైన ఎవడును, ఏదియు లేదు. కావున నితడే పరమ పురుషుడు గావలెను. మఱియు గీతకు మాయ గాక, పరమ పురుషుడే జగత్కర్త గావున, ఈ అక్షరపురుషుడే ఈశ్వరుడు సైతము గావలెను. కావుననే గీత 2-వ అధ్యాయమున ఆత్మనే ఈశ్వరుడుగా ప్రస్తావించెను.

కాని ఇది యుక్తియుక్తము గాదు. అందుచేత గీత అక్షరపురుషుని లోపలి నుండి వ్యవహరించుచున్న తృతీయ పురుషుని, పురుషోత్తముని క్రమముగా ఆవిష్కరించి, తన త్రిపురుష సిద్ధాంతమును ప్రతిపాదించి మించును : ఇదియే గీతాధిక్యమని శ్రీ అరవిందుడు కొనియాడును.

## 8. పురుషోత్తముడే ఈశ్వరుడు

4-వ అధ్యాయమున ముందుగా, "నేను ఈశ్వరుడను ...." (4-6) - అని శ్రీకృష్ణుడు తనను ప్రకటించుకొని, తర్వాత అదే అధ్యాయమున, "సర్వ భూతములను నీవు ముందు ఆత్మయందును, పిమ్మట నాయందును జూచెదవు." (4-35) - అని పలికి, ఆత్మకును తనకును గల అతిముఖ్యమగు ఆధిక్యమును సూచనామాత్రముగా దెలిపి, ఆత్మ గాక, తాను, అనగా పురుషోత్తముడే ఈశ్వరుడని చెప్పకయే చెప్పినవా డగును. ఇట్లు ఉత్తరోత్తరము పురుషోత్తమ తత్త్వమునకు రూపురేఖలను దిద్దుచు, చివరకు 15-వ అధ్యాయమున మాత్రమే అతని పూర్ణరూపమును మన ముందుంచును -

"క్షరాక్షరులకంటెను అన్యుడగు ఉత్తమ పురుషుడు గలడు, అతడు పరమాత్మ యని చెప్పబడును; (పరమాత్మగా) నతడు లోకత్రయమును ఆవేశించి భరించును మఱియు నతడు అవ్యయ ఈశ్వరుడు (ఈశ్వరుడయ్యును అవ్యయుడు)" (15-17). మఱియు నిచ్చట మాత్రమే గీతోపదేష్టయగు పరమ గురువు తన నిజస్వరూపమును స్పష్టముగా వెల్లడించును-

"నేను క్షరునికంటెను మించినవాడను, అక్షరునికంటెను గూడ నుత్తముడను. కావుననే లోకవ్యవహారము నందును, వేదవాఙ్మయమునందును పురుషోత్తముడ నని ప్రసిద్ధికెక్కితిని." (15-18)

ఇట్లు ఆత్మ ఈశ్వరుడు గాకపోయినను, ఆత్మకు పైన కర్మలను సంకల్పించు ఈశ్వరు డున్నాడు గాన, ఆత్మస్థితియందు మన కర్మలు, గీతా సమగ్రమార్గము ననుసరించినచో, ఆగిపోనవసరము లేదు, ఆగిపోవు, ఆగిపోగూడదు; ఏలన మన కర్మలు ఈశ్వరసంకల్పము.

## 9. పురుషోత్తముని మహిమ

కవులు సైతము ఏ విషయమున మోహవశు లగుదురో (4–16), అట్టి మహామహిమతో ఈ పురుషోత్తముడు విలసిల్లును. చూడుడు : అతడు సర్వమునకును మూలము (7–6), అతనినుండియే సర్వము వెలువడును (10–8). ఇట్లు అక్షరమును, క్షరమును అతనినుండి అభివ్యక్తమైనవే – అతనిలో అతడుగనే శాశ్వతముగా నుండియుండి, "సనాతనః" (15–7), అతనినుండి అభివ్యక్తమైనవే. అనగా నతడు ఏకకాలమున క్షరాక్షరములు రెండును అగును–మాఱుచుండు క్షరము నగును, మాఱని అక్షరము నగును; ప్రకృతియు నగును, సత్తయు నగును ; ఇదియే కవులు సైతము, అక్షరాత్మవఱకు మాత్రమే వెళ్ళిన కవులు సైతము, ఊహించలేని అద్భుత మహిమ.

అటులే అతడు కర్త మఱియు అకర్త – రెండును – "కర్తారం అకర్తారం" (4–13); ఆత్మరూపమున అకర్త మఱియు అంతరాత్మ రూపమునను, అంతరాత్మ వెనుక నున్న అంతర్యామి ఈశ్వరరూపమునను అతడు కర్త (18–61). ఇట్లు సృష్టిక్రియకు ప్రాతిపదికయైన సర్వద్వంద్వములును (13–27) అతనియందు సమన్వయమును, సామరస్యమును మాత్రమే గాక, ఏకతను గూడ ప్రాపించును.

## 10. అనంతముయొక్క తర్కము

కాని, పురుషోత్తముడు మాఱుచునే మాఱనివాడు : ఈ విషయమున పై వివరణచేత హేతుబుద్ధికి ఇంచుక ఆలంబనము లభించినను, మఱికొంత ప్రకాశము లభించిన బాగుండు నని దాని కనిపించును. అందులకే శ్రీ అరవిందు డిట్లు మరికొంత ప్రకాశము నిచ్చును–

"ఏవి విరుద్ధములుగా గన్పించునో, అట్టి ద్వంద్వముల సమకాలీనత ఎట్లు సంభవము ? – అని మనము ప్రశ్నింతు మేని, దానికి సమాధాన మిదియే : సంపూర్ణ

ఆధ్యాత్మిక స త్తయొక్క స్వభావమే అది యగును; అట్టి స త్త సదా అనంతము యొక్క ఈ ద్వివిధ సంతులిత స్థితిని గలిగియుండును." (2-21-6). మఱియు, క్షరాక్షరములకును, ఉ త్తమునికిని అంతస్తునందు గల వ్యత్యాసమును పురస్కరించు కొని శ్రీ అరవిందుడు విషయము నిట్లు విశదముచేయును-

"పురుషో త్తముడు క్షరాక్షరములు రెండును ఎట్లగుననిన, అతడు క్షరాక్షరముల కంటెను ఇతరుడు, మఱియు వానిని విడిగా దీసికొనినను, కలిపి తీసికొనినను, వాని కంటెను (అనంతముగా) నధికుడు." (2-24-15)

ఈ వివరణ యందలి కీలక మేమన- పురుషో త్తమత త్త్వము అనంతము. సాంతమునకు వ ర్తించు తర్కము, అనంతమునకు వ ర్తించదు. అనంతమునకు అనంతతర్కము వేఱుగా నుండును. ఈ తర్కము చెప్పునదేమన, అనంతముయొక్క స్వభావమే విరుద్ధధర్మముల సమకాలీనత. అనంతము అనంతము గావుననే, సాంతమగు వ స్తువులచేత పరిచ్ఛిన్నము గాక, తాను తానుగనే యుండును, విరుద్ధ సాంతవ స్తువులు కాగలుగును.

ఉదాహరణకు, ఆకు వేఱు, పూవు వేఱు; ఆకు పూవు గాలేదు, పూవును ఆకు గాలేదు. అనగా సాంత వస్తువులు ఒకటి మఱియొకటి గాజాలవు. అయితే ఏక కాలమున చెట్టు ఆకు, పూవు - రెండును అగును. ఆకు మఱియు పూల దృష్ట్యా చెట్టు అనంతము. చెట్టు రెండింటికంటె నధికమై, రెండింటియొక్క స త్త మఱియు ప్రకృతియై, రెండును అగును, తాను తానుగను ఉండును. ఇట్లు అనంత తర్కము నాశ్రయించి, బుద్ధికి మరికొంత తృ ప్తిని గల్గించును.

## 11. గీతాద్వైతము

తన చరమ పరిణామమునందు జీవుడు - ప్రకృతిగత అంతరాత్మ పురుషో త్తమునియందు నివసించును - "నివసిష్యసి మయ్యేవ" (12-8) - అనియే గీత చెప్పును గాని, అ తనిలో లయముజెందు నని చెప్పదు. అనగా జీవుడు పురుషోత్తమునియొక్క ఒక "సనాత నాంశము" (15-7). పురుషోత్తముడు కేవల మేక మాత్రుడు గాడు, అతడు అనేకుడైన ఏకుడు - The One that is Many. ఏకమైన ఆత్మ, అక్షరుడు, అతని ఏకతాపార్శ్వము కాగా, అనేకమైన అంతరాత్మ,

క్షరుడు, అతని బహుతాపార్శ్వ మగును. అనేకము ఏకముయొక్క ఆధారముపై ప్రవర్తించును. ఇవి రెండును సృష్టిక్రియయందు పరస్పరపూరకములు.

ఇట్లు అద్వైతుల ఆత్మయు, విశిష్టాద్వైతుల జీవుడును – బహుసంఖ్యాకుడగు జీవుడును – తదతీతుడు, తన్మూలము నగు పురుషోత్తమునికి రెండు పార్శ్వములు గావున, శుద్ధాద్వైతమును, విశిష్టాద్వైతమును గీతయొక్క పూర్ణాద్వైతమునకు రెండు పార్శ్వము లగును.

ఇవి గీతయొక్క సిద్ధాంత భాగములోని, అవగాహనకు ఆవశ్యకమగు కొన్ని అతి ముఖ్య విషయములు. ఇపుడు వీని వెలుగులో గీతయొక్క యోగభాగమును మనము సుఖముగా గ్రహించగలము.

## 12. యోగసంసిద్ధి స్వరూపము

ముందు గీతాలక్ష్యమగు యోగసంసిద్ధిని రేఖామాత్రముగా దర్శించి, తర్వాత ఆ సంసిద్ధికి గీత చూపిన మార్గమును దెలిసికొందము.

ప్రకృతిపురుషులకు, మనము 5-వ ప్రకరణములో జూచి నట్లు, అభేదము గాన, పురుషుని ప్రతి అవస్థయందును ప్రకృతి యుండును. కాగా క్షరుని ప్రకృతి క్షరప్రకృతి యనియు, అక్షరుని ప్రకృతి అక్షర ప్రకృతి యనియు – ఇచ్చట ప్రకృతి నివృత్తిదశలో నుండును – ఉత్తముని ప్రకృతి పరప్రకృతి యనియు పిలువబడును. క్షర లేక గుణమయ, అపరప్రకృతినుండి వెలువడి, అక్షరప్రకృతిద్వారా పరప్రకృతి లోని కారోహించుటయే యోగసాధన. అచ్చట నెలకొని పురుషోత్తముని సత్తతో సంపూర్ణ సాయుజ్యమును (4-10), అతని ప్రకృతితో సమగ్ర సాధర్మ్యమును (14-2) బొందుటయే యోగసిద్ధికి మించిన యోగసంసిద్ధి. ఈ సంసిద్ధిస్వరూపమును మన మూహించగలమా ? అప్పుడు భగవంతునివలెనే మూడు స్తరములందును ఏక కాలమున వర్తించుచు, అచలస్థితియందే గాక, జీవనవ్యవహారములందును భగవంతుని వలెనే మనము పూర్ణుల మగుదుము – Be you perfect as God is perfect.

## 13. గుహ్య - సాధన

జనతా బాహుళ్యమునందు జీవుడు (అంతరాత్మ) అపర ప్రకృతిలో మాత్రమే మునిగియుండును. అందుచేత అతనికి గుణపరము, గుణవిముక్తము నగు తన

అక్షరాత్మ జ్ఞాన మృండదు; తనను గుణమయ ప్రకృతినిర్మాణమగు అహంకారముగా భావించుకొనును. ఈ దశలో నున్న జీవునికి అక్షరాత్మ మఱుగునం దుండును గావున, గీత ఈ ఆత్మను గుహ్యము (రహస్యము) అనును. ఈ గుహ్య సాధనయే అతని ప్రథమ మహాసోపానము. ఏలన ఆత్మస్థితియందు అతనిని వేధించిన అహంకారము నశించి, అతడు గుణవిముక్తు డగును.

అపర ప్రకృతిలో నున్నపుడు అతడు ఏది చేసినను, తన అహంకారము యొక్క కామతృప్తికే చేయును, ఫలాసక్తియే అతని ప్రథమ బంధనము. కావున నతడు ఫలాసక్తిని వీడి (2–47), ఫలమును భగవంతున కర్పించుచు, కర్మను యజ్ఞముగా జేయవలెను (3–9).

పిమ్మట, ఇపు డతనికి ఫలసంగము తగ్గినది గాన, అహంకారము పల్చబడి, దాని వెనుక నున్న తన శాశ్వత స్వభావము గోచరించ నారంభించును. కనుక అతడు అహంప్రేరిత కర్మను గాక, స్వభావనియతమగు కర్మనే (18–47) చేయుచు, దానిని యజ్ఞముగా నర్పించును. ఫలమును గోరక, సమదృష్టితో చేయు నీ యజ్ఞకర్మవలన అతనికి అంతరంగమున శాంతి చోటుచేసికొని (12–12), క్రమముగా నతనిని శాంతి స్వరూపమగు అక్షరాత్మలోనికి గొనిపోవును. ఇట్లు నిష్కామకర్మ యజ్ఞము గీతకు యోగారంభము కాగా, ఆ యజ్ఞఫలము అహంవినాశకమగు ఆత్మప్రాప్తి యగును.

ఈ ఆత్మప్రాప్తి నేతినేతి – నిషేధక ప్రక్రియద్వారా జరుగ లేదని గమనిం చుట చాల ముఖ్యము. ఒకవేళ అట్లే జరిగి యుండినచో, సక్రియాత్మ నిష్క్రియ మగు అక్షరాత్మలో లీనము కాగా, సాధన అంతటితో నాగిపోయియుండును. పోగా, గీతయొక్క యజ్ఞకర్మరూపమగు ఈ విధాయక ప్రక్రియలో కర్మయోగము మున్ముందు ప్రాధాన్యము వహించినను, జ్ఞానయోగ లక్షణమగు శాంతియు, భక్తియోగ లక్షణమగు సమర్పణయు – ఫలసమర్పణయు – నిప్పటికే అంకురించియున్నవి.

ఇట్టి త్రివిధయోగముద్వారా శాంతాత్మలో ప్రవేశించుటవలన, అచ్చట కర్మలు ఆగిపోవు. కర్మలు అక్షరాత్మశాంతినుండియే వెలువడుచున్నవి, ప్రకృతియే కర్మలు చేయుచున్నది, నేను అకర్తను (13–30) – అను స్పష్టదర్శనము లభించును. అనగా క్షరప్రకృతి యందలి ఫలత్యాగముతో బాటు, ఇచ్చట నక్షరాత్మయందు ఆంతర కర్మసన్యాసము – "నైష్కర్మ్యము" (18–49) – సైతము సిద్ధించును. ఇది "కర్మ

యందు అకర్మను, అకర్మయందు కర్మను" (4–18) జూచు స్థితి. అనగా కర్మ జరుగుచునే యుండును, నేను కర్మచేయుటలేదు – అను [1] జ్ఞానమును ఉండును.

ఇది జ్ఞానకర్మల ప్రత్యక్ష సమన్వయము, అయితే సమన్వయము మాత్రమే. ఏలన వీని సామరస్యమును, సమైక్యమును ఇంకను బైన సిద్ధించును. ఇప్పటికి గుహ్యమగు ఆత్మ ప్రాప్తించినది, జీవుడు బ్రహ్మభూతు డైనాడు (18–54).

## 14. గుహ్యతర - సాధన

ఈ ఆత్మ సర్వాత్మయు గావున, నిర్వ్యక్తికము. కనుక నిచ్చట మాత్రమే జీవుని, ఆత్మజ్ఞానము లేనపుడు పట్టి పీడించిన మిథ్యా వ్యక్తిత్వము, అహంకారము సర్వథా నశించిపోవును. అట్లు నశించిపోగా, జీవునికి తన నిజస్వరూపము దెలియ వచ్చును. జీవలోకమున, అనగా అభివ్యక్తియందు తాను పురుషోత్తముని ఒక సనాతనాంశము (15–7)–అని కనుగొనును. [ఆత్మయందు జీవుని మిథ్యావ్యక్తిత్వము నశించినను, అతని సత్యశాశ్వతమగు ఆధ్యాత్మిక వ్యక్తిత్వము నశించదు. కావుననే అతడు జ్ఞానదశయందును భగవంతుని ప్రేమాదులను అభివ్యక్తముచేయు కేంద్రముగా వర్తించగలుగును.] మఱియు తాను అన్వేషించుచు వచ్చిన భగవంతుడు – పరమ తత్త్వము – నిష్క్రియ శాంతాత్మ గాక, ఈ పురుషోత్తముడే యని ఇపు డతడు చూచును.

తన మూల మిట్లు దెలిసినది గనుక, తన వ్యక్తిత్వము నశించలేదు గనుక, బిడ్డకు ఎంతో కాలమునకు జూచిన తల్లిదండ్రులయందు వలె, అతనికి తన మూల మగు పురుషోత్తమునియందు ప్రేమ అకారణముగా, అనివార్యముగా పెల్లుబుకును. కర్మశక్తియగు సంకల్పము, జ్ఞానశక్తియగు బుద్ధితో బాటు, ప్రేమశక్తియగు హృదయమును ఇపు డతనియందు ప్రస్ఫుటముగా, ప్రగాఢముగా పనిచేయ నారంభించును. కారణము అతని హృదయము నావరించి యుండిన కామాదులు పవిత్రమగు (4–38) శుద్ధాత్మలో నిపుడు కడిగివేయబడినవి.

---

[1] మనకు జ్ఞానము సిద్ధించినదో, లేదో నిర్ణయించుకొనుటకు నిది గట్టి గీటు– రాయి. ఈ నికషోపలముపై జ్ఞానులుగా తేలువా రెంద రుందురు!

ఇట్లు గీతా పూర్ణయోగమున జ్ఞానము భక్తికి సాధకమే గాని, బాధకము గాదు. భక్తి కర్మజ్ఞానముల మహోజ్జ్వల కిరీటము (18-54).

ఈ ప్రేమ అతని బుద్ధికి పురుషోత్తముని నిగూఢ రహస్యములను అతి సన్నిహితముగా ఆవిష్కరించును - అని శ్రీ అరవిందుడు దెలుపును (2-24-32). కనుక సాధకుని అక్షరాత్మ జ్ఞానము పురుషోత్తముని పూర్ణజ్ఞానములోని కుదరించ బడును. ఇట్లు, కొందరు భక్తులు తలపోయు నట్లు, భక్తియందు జ్ఞానము అప్రధానము కాదుసరిగదా, అది తన పూర్ణరూపము ధరించును. జ్ఞాని పర భక్తుడగును (18-54), భక్తుడు పూర్ణ జ్ఞాని యగును (18-55).

అక్షరాత్మయందు కర్మమార్గము జ్ఞానమార్గముతో గలిసి ద్విమార్గము కాగా, ఈ ద్విమార్గము పురుషోత్తమునియందు భక్తితో గలిసి త్రిమార్గము, పూర్ణమార్గము, అగును.

ఈ పురుషోత్తమునే గీత గుహ్యతర మనును. కారణము ? ఈ పురుషోత్తముడు ఆత్మకంటెను ఎక్కువ మఱుగున యుండును. ఆత్మను కనుగొనిన పిమ్మటనే ఇతనిని కనుగొన నగును. నిజమే, కాని ఇందుచేత గీత అతనిని గుహ్యతర మనుటలేదు. ఇక నెందుచేత ననగ—

గుణమయ ప్రపంచము నిర్గుణ ఆత్మకంటెను వేఱుగా గన్పించగా, నిక పురుషోత్తమునియందు, అతడే తన పర ప్రకృతితో ఈ సర్వము నయ్యె నని దెలియవచ్చును, "వాసుదేవుడే ఈ సర్వము" (7-19) నని సాధకుడు జూచును. అతడే అభివ్యక్తినిమిత్తము జీవరూపమున ప్రపంచమున వ్యవహరించుచున్నాడు. అతడే ఆ జీవునివెనుక హృదయస్థుడగు నీశ్వరుడుగా నుండి (18-61), జీవుని, జగత్తును నడుపుచున్నాడు. అతడు జీవుని ఉద్ధరించుటకు కంకణము గట్టుకొనిన (12-7) సుహృదుడు (5-29), ప్రియతముడు (7-17), అతడే ప్రేమకు విషయమును, మూలమును. ఇట్లు పురుషోత్తమ సత్యము ఇహపరములను ఏకముచేయును గావునను, దానివల్లనే ప్రేమ సంభవమగుచున్నది గావునను, అది గుహ్యతరము - అని శ్రీ అరవిందుడు గూడ గుహ్యతర వ్యాఖ్యానము చేయును (2-22-18).

పరప్రకృతియందు సర్వము నేకమగును గాన, ఇక్కడ మాత్రమే త్రిమార్గము నందలి కర్మజ్ఞానప్రేమలు సమన్వయ, సామరస్యదశలను దాటి, సర్వథా ఏకాత్మక మగును, ఏకమగును. కర్మ పైకి వెళ్ళి, జ్ఞాన రూపము ధరించును (4-33), అయితే

కర్మయజ్ఞము కొనసాగుచునే యుండును గాని, కర్మ జ్ఞానములో అదృశ్యము మాత్రము గాదు. అటులే జ్ఞానము భక్తిలోని కుద్ధరించబడి భక్తి యగును (7-18).

## 15. గుహ్యతమ - సాధన

మంచిది; కాని పురుషోత్తముడే సర్వమూలము, పరమ తత్త్వము గదా. అయినపుడు అతడే గుహ్యతమము గావలెను. అగుచో, అతనిని గుహ్యతర మని మాత్రమే క్రిందటి ప్రకరణములో గీత ఎందుకు చెప్పినది ? ఇది దోషము గాదు; ఏలన అచ్చట అతనియొక్క ఒక సత్యమును గుహ్యతర మని చెప్పి, ఇచ్చట అతని యొక్కయే మఱియొక సత్యమును గుహ్యతమ మని చెప్పబోవుచున్నది. చూడుడు :

పరమునం దున్న పురుషోత్తముడే అవరము (ప్రపంచము) గూడ - వాసు దేవుడు గూడ - నయ్యె నను సత్యము గుహ్యతరము. పోగా, ఆ పరుడగు పురుషోత్తముడు నానావిధ ధర్మముల ననుసరించి అవరమును నడుపుచున్నను, తాను సర్వథా ఆ ధర్మములకు పరుడుగనే యుండును, సర్వధర్మములకు పైన ఏ ధర్మ ములు బంధించని అనంతుడుగనే యుండును. ఇది అతనియొక్క గుహ్యతమ సత్యము.

మఱియు సాధనదృష్ట్యా, ఆత్మలోనికి మన సత్తావిముక్తి గుహ్యమును. పరమాత్మలోనికి మన సత్తావిముక్తి గుహ్యతరమును కాగా, మన ప్రకృతి పరివర్తనము, మన ప్రకృతియొక్క దివ్యీకరణము గుహ్యతమ మగును. ఏలన ఈ పరివర్తనము నింతదనుక ఏ సంప్రదాయము తన లక్ష్యముగా లక్షించియుండలేదు. ఇట్టి గుహ్యతమ ప్రకృతిపరివర్తనకు గావలసిన సాధనాబీజములు గలిగియుండుటచే- ముఖ్యముగా నిందుచేతనే - పురుషోత్తముని ధర్మాతీతత్త్వము గుహ్యతమ మగును. ఈ సాధనావాక్యమునే గీత "సర్వగుహ్యతమం" (18-64) అని చెప్పుకొనును. ఇదియే గీతయొక్క చరమ వచనము, గీతయొక్క మహావాక్యము.

## 16. గీతామహావాక్యము

"సర్వధర్మములను బరిత్యజించి, న న్నొక్కనినే శరణుబొందుము. నేను నిన్ను సర్వపాపములనుండియు విడిపింతును; శోకింపకుము." (18-66).

గీతయొక్క ఈ మహావాక్యమునందు సైతము ఇతర వ్యాఖ్యానములు 'విడిపింతును' – అను మాటనుబట్టి సత్తావిముక్తినే చూచుచుండగా, శ్రీ అరవిందుడు దీని నిట్లు వ్యాఖ్యానించును –

“పరమపురుషుడు ఏ ధర్మములు బంధించని అనంతుడు గనుక, మనము సైతము ఈయా ధర్మములపై నాధారపడుటను సర్వథా పరిత్యజించగలిగి, ఈ సర్వస్వతంత్ర, సనాతన పురుషునికి మనను మన మర్పించుకొనగల మేని మఱియు, కేవలము అతనికే మన సర్వసత్తను సర్వథా తెఱచి యుంచుటకు మాత్రము జాగ్రత్తపడుచు, మనలోని భగవంతునియొక్క ప్రకాశము, శక్తి మఱియు ఆనందములయందే నమ్మక ముంచగలుగుదు మేని మఱియు నిర్భయముగాను, నిస్సంకోచముగాను అతనియొక్క మార్గదర్శనమునే అంగీకరించగలుగుదు మేని, అప్పుడది మన సత్యతమ, మహత్తమ విమోచన మగును మఱియు నది మన ఆత్మయొక్కయు, ప్రకృతియొక్కయు పరిపూర్ణ మఱియు అనివార్య సంసిద్ధిని (పరివర్తనమును) గొనివచ్చును.” (2–22–19).

శ్రీ అరవిందున కీ విశిష్టార్థ మెట్లు స్ఫురించెను ? ఇతరులకు విడుదల యన జీవనమునుండి విడుదల కాగా, శ్రీ అరవిందుని కది భిన్నధర్మముల సంఘర్షమునుండి జీవనముయొక్క విడుదల. ఏలన ఈ ధర్మసంకటమునుండి ఉద్ధరించబడుటకే, “నేను నీ శిష్యుడను, నీ శరణాగతుడను, నా కేది శ్రేయమో యుపదేశింపుము.” – అని అర్జునుడు మొఱపెట్టుకొనెను (2–7). ఈ దృష్టితో శ్రీ అరవిందుడు ఈ మహావాక్యమును మఱియు నిట్లు వివరించును–

ఇట్లు మనస్సు ఏ ధర్మమునందు చిక్కుకొనక, ప్రతిపదమునందును మన జీవనమును, కర్మలను ఆ సజీవ అనంతుడే నిర్ణయించుట కవకాశ మీయవలెను. అపుడు “యోగేశ్వరుడగు కృష్ణుడే” (18–78) మన కర్మలను నిర్ణయించును, వానిని తానే చేపట్టును, మఱియు మనద్వారా నిర్వహించును. ఇదియే కృష్ణసారథ్యముయొక్క ఆంతర్యము. ఆ సారథ్యము అర్జునునికే గాదు, మనకును గలదు ;

అట్టియెడ మనకు సమస్యలే యుండవు – సమస్యలు పరిష్కరింపబడునను గాదు, అసలు సమస్యలే యుండవు (2–24–36) – అని శ్రీ అరవిందుడు వివరించును. అనంతుడే మనలో కర్మ చేయునపుడు, మన కే కర్మసమస్య

లుండును ? అజ్ఞానోపహతమగు పృథక్కార వ్యక్తిత్వమే లేని సమస్యలను గల్పించును. ఇపు డా పృథక్కార వ్యక్తిత్వము స్థానమున అంతరాత్మ వచ్చి, తన మూలమే తనద్వారా వ్యవహరింప ద్వారము తెఱచియుంచినది. కావున దాని కిపుడు ఏ సమస్యలు లేనేలేవు.

ఇదియే జీవనసమస్యకు శ్రీ కృష్ణుడు మన ముందుంచిన పూర్ణపరిష్కారము. ఇది తప్ప మరియొక పరిష్కారము లేనేలే దని చివరకు నీవు కనుగొనగలవు - అని ఆ దేవదేవుడు మనలను హెచ్చరించును. ఈ పరిష్కారము గీతామహావాక్యము నందు మనకు ప్రసాదించబడినది. ఇట్లు ఈ మహావాక్యము పార్థివజీవనమును దివ్యజీవనములోనికి నడుపు మహాసేతువు.

ఇట్లు గీతాసిద్ధాంతమును గుఱించియు, గీతాయోగమును గుఱించియు మనము సూత్రప్రాయమగు నొక అభిప్రాయమును ఏర్పఱచుకొని యున్నాము. ఇపుడు గీతారహస్యములను శ్రీ అరవిందుని వ్యాఖ్యానము ఎట్లు తెల్లముచేయునో తెలుపు కొన్ని విశేషములను జూతము. ఈ పరిశీలన వలన ఇతర వ్యాఖ్యానములకును, ఈ వాఖ్యానమునకును గల మహదంతరమును, ఈ వ్యాఖ్యానమునకు గల అపూర్వ వైశిష్ట్యమును మనకు బోధపడగలవు.

## 17. అవతార ప్రయోజనము

అవతార మెందుకు వచ్చును ? సాధురక్షణము, అసాధుశిక్షణము మఱియు ధర్మసంస్థాపనము (4.8) – అని గీతయే ప్రకటించుచున్నది గదా, సందేహ మెందుకు ? అని ఇతర వ్యాఖ్యానము లన్నియు సారాంశముగా జెప్పును. కాని, అది గౌణము మాత్రమే, ముఖ్యప్రయోజనము కాదు. పైపైన జదువువారికి మాత్రమే అట్లు గోచరించును. ఆ మాత్రము ఒక విభూతి సైతము సాధించగలదు– అని శ్రీ అరవిందుడు ఆక్షేపించును.

మానవతకును, దివ్యతకును మధ్యగల అడ్డుగోడను భేదించుకొని, భగవంతుడు మానవరూపము ధరించును. అనగా అవతారము మానవతనుండి దివ్యతలోనికి మార్గమేర్పఱచును. ఈ మార్గముద్వారా మానవుడు భగవంతునిలోని కారోహించును. వేఱు మాటలలో దేవుడు మానవునిలో జన్మించగా, మానవుడు దేవునిలో తిరిగి జన్మించును. మానవుని ఈ దివ్యజన్మయే అవతార ముఖ్య ప్రయోజనము. పోతే

మన మనుకొను ధర్మసంస్థాపనము రాజకీయస్వాతంత్ర్యమువలె దీనికి పూర్వాంగము మాత్రమే.

లోతుగా జదివిన, తర్వాతి రెండు శ్లోకములలోని "నన్ను బొందును" (4–9), "నా భావమును బొందును" (4–10) – అను పదములు జీవుని దివ్య పునర్జన్మనే సూచించు నని శ్రీ అరవిందుడు చూపును.

అందువల్లనే అవతార పురుషులు – "I am the gate and the path = నేను కవాటమను మఱియు మార్గమను" అని వెల్లడింతురు. శ్రీమాత కండ్లలోనికి జూచిన, ఈ వాక్యముయొక్క సత్యము మన కించుక బొడకట్టగలదు.

## 18. అవతరణయొక్క ఆవశ్యకత

భగవంతుడు మానవుని పరిమిత ప్రకృతిలోనికి దిగి, అచ్చట తన స్వరూప జ్ఞానమును గోల్పోవకయే సచేతనముగా వ్యవహరించగలడు – అను అతిముఖ్య సత్యమును భగవదవతరణము మనకు నిరూపించును. ఇట్లు భగవంతుడు ఏ కృష్ణశరీరములోనికో మాత్రమే అవతరించుట గాక, అతని తేజము, శక్తి మఱియు సన్నిధి మన శరీరములోనికి సైతము అవతరించగలవు. ఈ అవతరణ పరమావశ్యకము గూడను. ఏలన–

"మానవ సత్తను రూపాంతర మొందించుటకు మానవ ప్రయత్నముతో బాటు, భగవంతుని తేజము, సన్నిధి మఱియు శక్తి ఎక్కువెక్కువగా ఆ సత్త లోనికి దిగి చేయూత నీయవలెను; లేనిచో క్రింది దశ పై దశలోనికి అడుగువేయు స్థానమున ఆవశ్యముగా జరుగవలసిన మార్పు సంభవము గాదు. కావుననే సాధన యొక్క చరమ ప్రక్రియగా అశేష ఆత్మసమర్పణ మనకు పరమావశ్యక మగును." (2–17–6, పాదటీక) – అని వక్కాణించి, శ్రీ అరవిందుడు తన అనుభవము నుండి గీతామహావాక్యము వెనుక నున్న ఉపపత్తిని మనకు విశదపఱచును. సమర్పణావశ్యకతను ఈ రీతిగా నిరూపించిన విశిష్టత వీరికే దక్కును.

## 19. "శరణం వ్రజ"

భగవంతుని శక్తి నీలోనికి దిగి నిన్ను విడిపించనిదే, నీ వెన్నటికిని పర ప్రకృతియొక్క పరమ స్వాతంత్ర్యములోని కారోహించజాలవు. కాని అట్లా శక్తి

దిగుటకు నీ స్వసంకల్పములు దాని కడ్డురారాదు. కావుననే నీవు సర్వాత్మనా భగవంతునికి సమర్పించుకొనుము — "శరణం వ్రజ". దీనిని నీకు చరమ సాధనగా నుపదేశించుచున్నాను (18–66) – అని గీతామాత మనల నుద్బోధించును; ఇది గీతా చరమవాక్యానికి శ్రీ అరవిందుని వ్యాఖ్యానము.

ఇట్లుండ శ్రీ శంకరుడు – తాము ఆత్మ యను జ్ఞానము లేనివారికే ఈశ్వరాధీన గాని, అక్షరోపాసకులకు గాదు. అక్షరోపాసకులు (12–3) స్వతంత్రముగనే కైవల్యప్రాప్తి నందగలరు; వారిని ఈశ్వరు డుద్ధరించు (12–7) ప్రసక్తియే ఉదయించదు–అని (12–12) శ్లోకముక్రింద వ్యాఖ్యానించును. మఱియు శ్రీ శంకరుడు గీతామహావాక్యమును (18–66) గూడ దాదాపు ఇదే ధోరణిలో వ్యాఖ్యానించును. ఏలన ఆయనకు ఆత్మను – అక్షరపురుషుని – మించిన ఈశ్వరుడును లేడు, అపర ప్రకృతిని మించిన పర ప్రకృతియు లేదు. ఒకవేళ ఈశ్వరు డున్నచో, అతడును భేదభూమికలోనివాడే, కనుక ఈశ్వరోపాసన చిత్తసమాధానముకొఱకు ప్రారంభ దశలో మాత్రమే.

ఎంతటి వ్యత్యాసము! పరప్రకృతిని, పురుషోత్తముని మనము చర్చించుకొని యుండనిచో, ఈ వ్యత్యాసము మన కర్థమయ్యేడిది గాదు.

## 20. "సుసుఖం కర్తుం"

గీతా మహావాక్యము ననుసరించి ఈశ్వరునకు మన సర్వసత్తను సమర్పించు కొనినపుడు, అతని శక్తియే, అతడే మన సాధనను చేపట్టును, అతడే మనలోని సాధకు డగును, అతడే మనలను సంసిద్ధికి గొనిపోవును, అనివార్యముగా గొనిపోవును. కావున నీ సమర్పణాయోగమున సంసిద్ధిని బొందుట కడు సులభము—"సుసుఖం కర్తుం" (9–2) – అని శ్రీ అరవిందుని వ్యాఖ్యానము.

అవ్యక్తోపాసకులకు మనస్సునకు గావలసిన ఆలంబన ముండదు, కాన వారి ఉపాసన కష్టబహుళము. కాగా ఈశ్వరోపాసకులకు దృఢమగు ఆలంబన ముండును, అందుచేత వారి సాధన సులభము (12–5) – అని చెప్పు భక్తుల మతమును గాదు శ్రీ అరవిందుని వ్యాఖ్యానము. ఈశ్వరుడే సాధకు డని భక్తులును శ్రీ అరవిందునివలె చెప్పలేదు గదా.

## 21. " మోక్షయిష్యామి "

మోక్షయిష్యామి = విడిపింతును : ఇది మహావాక్యములోని మఱియొక పదము. విడుపునకు రెండు పక్షములు గలవు : దేనినుంచి విడుదల పొందు చున్నామో, అది యొకటి; దేనిలోనికి విడుదల పొందెదమో, అది మఱియొకటి. సాంప్రదాయి కాద్వైతమున మనము అపర ప్రకృతినుండి అక్షరాత్మలోనికి ముక్తుల మగుదుము. కాని ఇదియు పూర్ణ ముక్తి గాదు. ఏలన ఇచ్చట మనము నిష్క్రియ తకు, నిర్వ్యక్తికతకు, బహుత్వశూన్యమగు ఏకత్వమునకు బద్ధులమై యుందుము. కావుననే ఈశోపనిషత్తు దీనిని గూడ ఒక అంధకారమే యనును (మంత్రము-12).

కాగా గీతా-మహాదర్శన మేమన, సత్త, ప్రకృతి, చైతన్యము, ఆనందము- అన్నియు క్షరము, అక్షరము, అతీతము నను భేదముచే త్రివిధము. ఉదాహరణకు, ఒకే సత్త ఏకకాలమున ఈ మూడు అవస్థలయందును వర్తించును. కావున సత్తతో తనకు గల అభేదబలముచేత అంతరాత్మ ఈ మూడు స్తరములలోనికి ఏకకాలమున విడుదల బొందగలదు. ఇది అంతరాత్మ సత్తయొక్క పూర్ణ విముక్తి.

మఱియు ప్రకృతివిషయమునందును, అపర ప్రకృతిలోని ప్రతి అంశముయొక్క ప్రతిరూపము పైన పర ప్రకృతిలో గలదు. కావున అంతరాత్మయే గాక, అపర ప్రకృతి సైతము పరప్రకృతిలోనికి విడుదల బొందగలదు. ఈ విడుదలచేత మనస్సు అతిమన స్సగును, ప్రాణము దివ్యప్రాణ మగును, శరీరము దివ్యశరీర మగును.

ఇదిగో, ఇది యంతయు మోక్షయిష్యామి - పదములో నున్న అర్థ మని శ్రీ అరవిందుడు మనకు దెలుపును. ఈ పూర్ణతకు గారణము, ఇచ్చట విడిపించువాడు స్వయముగా నీశ్వరుడు.

## 22. " మా శుచః "

మా శుచః = శోకింపకుము : ఇది మహావాక్యములోని కడపటి పదము. " నేను నిన్ను విడిపింతును గనుక శోకింపకుము. " - ఇది ఇతరుల వ్యాఖ్యానము కాగా, " నేను నిన్ను ఏ మార్గమున విడిపింతునో, దానిని గుఱించి భయపడకుము, శోకింపకుము. " - అని శ్రీ అరవిందుని వ్యాఖ్యానము.

పూర్వాపర సంబంధమును శ్రీ అరవిందు డెంత జాగ్రత్తగా గమనించునో, ఈ వ్యాఖ్యచేత మనకు విదితమగును. "నన్నీ ఘోర మారణకర్మయందు ఎందుకు నియోగించుచున్నావు ?" అనియే గదా అర్జునుడు ఆదిలో (3-1) మొఱ పెట్టుకొనెను. తర్వాత ఇట్లు పైకి అకుశలము (18-10) గను, ఘోరము (3-1) గను గన్పించు కర్మయే గీతోపదేశమునకు మూలము.

ఘోరము, సౌమ్యము : ఈ ఉభయవిధ కర్మలద్వారాను భగవంతుడు లోక సంగ్రహమును (3-20) సాధించును. భౌతిక భూమికలో భూకంపాదులు భూస్వరూప పరివర్తనకు అవసరమైనట్లే, సాంఘిక, రాజకీయ రంగాలలోను వాని పరివర్తన కొఱకు యుద్ధాదులు ఆవశ్యక మగును. ఈ విషయమును స్పష్టముగా గుర్తించియే శ్రీ అరవిందుడు, మన మింకను రుద్రునకు చెల్లించవలసిన ఋణ మున్నది - అని హెచ్చరించును. నేను లోకములను మట్టుపెట్టుటకు విజృంభించిన కాలస్వరూపుడను (11-32) - అని భగవంతుడే చెప్పుచుండ, గీతలో కేవలము అహింసనే దర్శించు వారి దర్శనము పాక్షికదర్శనమే యగును.

## 23. సిద్ధిస్వరూపము

బాగున్నది, అయితే "మాశుచః"-తో గూడిన, "శరణం వ్రజ" - పూర్వక మైన "మోక్షయిష్యామి" - వలన మనకు గలుగు సిద్ధిస్వరూప మేమిటి ?

"నివసిష్యసి మయ్యేవ" (12-8) = నాయందే నివసించెదవు : అంతరాత్మ శాశ్వతముగా భగవంతునియందు నివసించును. ఇదియే పరమసిద్ధి స్వరూపము.

ఇంతేనా ? ఇది యింకను భేదదర్శనములోనిదే, ఇది కైవల్యముకంటెను చాల తక్కువ - అని కేవలాత్మవాదులు చులకన చేయవచ్చును. కాని ఇది గీతను లోతుగా అధ్యయనము చేయకపోవుటచేత నేర్పడిన భ్రాంతాభిప్రాయమే - అని శ్రీ అరవిందుడు సమాధానించును. ఏలన అంతరాత్మ స్వరూపతః పురుషోత్తము నితో సర్వథా, అనగా సచ్చిదానందములు మూడింటియందును, అభిన్నము, ఏకము నయ్యును, స్వభావతః, అనగా అభివ్యక్తియందు; అతని యొక్క ఒక సనాతనాంశముగ నుండును - పరిమితి యున్నపుడే అభివ్యక్తి సంభవము గనుక.

కావున గీత "మద్భావ మాగతాః" (4-10) - అని ఒక వైపున వక్కాణించుచునే, "నివసిష్యసి మయ్యేవ" (12-8) - అని రెండవ వైపున వివరించును.

మఱియు నిట్లు స్వరూపతః మనము పరమపురుషుడమే గాన, నాయందు నివసింతువు - అని చెప్పినపుడు, నీ స్వరూపమునందు నీవు నివసింతువు - అని చెప్పినట్లగును. "స్వే మహిమ్ని ప్రతిష్ఠితః"-అని దీనినే ఛాందోగ్యోపనిషత్తు అధికారముగా నుద్ఘాటించును.

ఇచ్చట భగవంతుని సత్తతో సాయుజ్యమును ఉండును - "విశతే తదనంతరం" (18-55), భగవంతుని ప్రకృతితో "సాధర్మ్యమును" (14-2) ఉండును. తాదాత్మ్యరూపమగు కైవల్యము ఈః సంసిద్ధిలో ఒక భాగము మాత్రమే.

ఇంకను వాస్తవజీవనమునందు ఈః సంసిద్ధిమహిమ ఎటు లుండునో, మనము ఊహించనైన నూహించలేము. కనుక గీత మనకు మఱియొక సూత్రము నిచ్చును-

## 24. "మయి వర్తతే"

"సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే" (6-31) = నాతో సమగ్రయోగమునుబొందిన యోగి ఏయే రీతుల వర్తించినను, నాయందేవర్తించును. ఇంకను మన కిది అస్పష్టముగనే యున్నది. 'నాయందే'-అనుటలోని బలమేమియో మనకుదెలియదు. భగవంతుడు అదృశ్యుడు, అస్పృశ్యుడు, అచింత్యుడు.... అను పాట వినుటకు అలవడిన మనపై శ్రీ అరవిందుడు తన అనుభవబాంబును విసరును. 'మయి వర్తతే' - అను పదమునకు మనలను చకితులను గావించు ఆయన వాఖ్యానమును వింటము -

"మాటలు మఱియు పేరులు, అటులే సంకేతాత్మక ప్రతిమలు మఱియు కల్పనలచేత దప్ప భగవంతుని ఊహించుకొనలేని భౌతిక మనస్సు మాత్రమే భగవంతుడు మఱియు భగవత్స్వరూపము (spirit) ఒక అస్పష్ట భావన యని తలంచును. కాని స్వరూపము స్వరూపమును జూచును; శారీరిక చేతన స్థూల ద్రవ్యము నెంత స్పష్టముగా జూచునో, అంత ప్రత్యక్షముగాను, అంతకంటె నెక్కువ ప్రత్యక్షముగాను, ఎంత ఆంతరంగికముగా జూచునో, అంత ఆంతరంగికముగాను, అంతకంటె నాంతరంగికముగాను దివ్యీకృతచేతన భగవంతుని జూచును. అది భగవంతుని చూచును, స్పృశించును, చింతించును మఱియు నింద్రియములతో

గ్రహించును. ఏలన ఆధ్యాత్మిక చేతనకు అభివ్యక్త జగత్తంతయు ద్రవ్యమయ ప్రపంచముగా గాని, ప్రాణమయ ప్రపంచముగా గాని, చివరకు మనోమయ ప్రపంచముగా గాని కాక, చిన్మయ ప్రపంచముగానే గోచరించును; దాని దృష్టి కీ మూడు ప్రపంచములును భగవదాలోచన, భగవచ్ఛక్తి మఱియు భగవద్రూపము మాత్రమే యగును. ఇదియే 'మయి వర్తతే' అను గీతావచనమున కర్థము." (2-9-4) - అని శ్రీ అరవిందుడు వెల్లడించును.

ఇది అద్భుతము గాదూ! అసలు లేనే లే డనియో, ఉన్నచో మనకు నిశ్చల సమాధియందే గాని, బాహ్య-జీవనమున అందనే అందడనియో అనుకొనుచు వచ్చిన భగవంతుడు ఈ సంసిద్ధియందు ఎల్లెడల మనకు దగులును, వ్యవహార మంతయు అతనితోనే ! ఇదిగో, ఇదియే మన మిపుడు ఊహించజాలని ఈ సంసిద్ధియొక్క మహామహిమ.

## 25. రామరాజ్యము - భగవద్రాజ్యము

ఈ పరకాష్ఠను రామరాజ్య మందమా ? ఆ పదము సరిపోదు. ఏలన, "రామో విగ్రహవాన్ ధర్మః" = రాముడు రూపము ధరించిన ధర్మము. కావున రామరాజ్యము ధర్మనిష్ఠము, ధర్మాత్మకము. కాని ఈ సాత్త్విక ధర్మమును గూడ నతిక్రమించి, "సర్వధర్మాన్ పరిత్యజ్య" (18-66), సర్వధర్మాతీతుడగు పురుషోత్తమునియందు మనము నెలకొని నపుడే (12-8), మఱియు మన చేతనయొక్క స్థానమున అతని చేతన వ్యవహరించి నపుడే - "మచ్చిత్తః" (18-57), ప్రపంచ మంతయు పై విధముగా భగవంతుడే యగును. గుణాతీతమగు ఈ రాజ్యమునకు నడిపినవాడు కృష్ణుడు గావున, దీనిని కృష్ణరాజ్య మని పిలుతము, లేక ఇచ్చట సర్వము భగవంతుడుగనే గోచరించును గాన, దీనిని భగవద్రాజ్య మందము. రామావతార, కృష్ణావతార కార్యములను గుఱించి శ్రీ అరవిందుడు వెలిబుచ్చిన అభిప్రాయమును బట్టియే ఇక్కడ ఈ వివేచన చేయబడినది.

ఇట్టి అపూర్వ విశేషములు శ్రీ అరవిందుని వ్యాఖ్యానమునందు ఇంకను ఎన్నో ఎన్నో గలవు. కాని మన 'ప్రస్తావన' గుంటూరు చేంతాడు కాగూడదు. కావున ఈ విశేషములను త్రవ్వితీయుట నిక్కడ ఆపివేతము. ఇపుడు ఉపసంహారమున గీత పట్ల శ్రీ అరవిందుని అభిప్రాయమును దెలిసికొందము.

## 26. గీత అద్వితీయ గ్రంథము

కర్మయోగ విషయమున, కర్మయోగముద్వారా జీవనసమస్యను పరిష్కరించు విషయమున గీతను బోలిన గ్రంథరాజము ఈ ప్రపంచమున మఱియొకటి లేదు. కావుననే భగవద్గీతపై [1]రెండు సంపుటములు వ్రాయు నంతటి శ్రమజేసితిని, కాలము వెచ్చించితిని – అని శ్రీ అరవిందుడు గీతామహత్త్వమును గొనియాడును. ఇట్లు జీవనసమస్యను పరిష్కరించిన గీతోపదేశమును తన వ్యాఖ్యానముద్వారా తన దివ్య జీవనలక్ష్యమునకు సోపానసరణి గావించుకొనెను శ్రీ అరవిందుడు – అని వ్యాఖ్యానము లోతుగా జదివిన మనము పసికట్టగలము.

అయినను గీతనే (15-15) ఉదాహరించుచు, జ్ఞాన భాండారము హృదయములో నున్నది. వేదములు అక్కడినుండి వచ్చినవే గాని, ఆ భాండారములోని ఒక అంశము మాత్రమే. అటులే గీతయు సర్వసంపూర్ణ మనుకొనజాలము. అది దాని లోపము గాదు. అభివ్యక్తి ఎపుడును అసంపూర్ణమే గావున, అభివ్యక్త విశ్వము, అభివ్యక్త గ్రంథములు అపూర్ణము గాక తప్పదు – అని శ్రీ అరవిందుడు నుడువును.

"కావున," శ్రీ అరవిందు డింకను చెప్పును, "గీతోపదేశముయొక్క నాలుగు గోడల మధ్యను సైతము మనము తలదాచుకొనవలసిన పని లేదు. అట్లు చేసినచో, మన ఆధ్యాత్మిక జీవితమును మనము మన స్వీయ సత్త మఱియు శక్యతల నుండి కాక, గతమునకు జెందినవారి సత్త, జ్ఞానము మఱియు స్వభావమునుండియే సృజించుకొనుటకు యత్నించిన వార మగుదుము. మనము గతించిన ఉషోదయములకు గాక, భావి మధ్యాహ్నములకు చెందుదుము." (I-1-9).

ఇటుల నుడివియు, గీతయొక్క ఒక మహాసామర్థ్యమును శ్రీ అరవిందుడు మఱల నిట్లుగ్గడించును : గీతలో దేశకాల బద్ధమైనది మిక్కిలి తక్కువ. ఏ దేశము, ఏ కాలమునకు నైనను అనురూపముగా మాఱగల మహాసామర్థ్యము దానిలో నున్నది. ఉదాహరణకు, గీతలోని యజ్ఞమును దీసికొందము. అది మానవులకు, దేవతలకు మధ్య జరుగు ఆదానప్రదాన మని గీత చెప్పును. సందర్భమును బట్టి ఈ

---

[1] ప్రారంభమున శ్రీ అరవిందుని 'గీతావ్యాసములు' రెండు సంపుటములుగా ప్రచురింపబడెను.

దేవతలలో సాంప్రదాయిక దేవతాత్వము చాల తక్కువ. కావున యజ్ఞ మన భగవంతునికి మనకు మధ్య గాని, మనకు ప్రకృతికి మధ్య గాని, మనకు నితరులకు మధ్య గాని జరుగు ఆదానప్రదాన మని తెలును. ఈ యజ్ఞము సర్వ దేశకాలములకు వర్తించును. ఏలన ఇట్టి యజ్ఞక్రియ లేనిదే సృష్టి ఒక్క క్షణము కూడ మనుగడ సాగించలేదు.

గీతలో విడిచివేయబడిన దానిని ఒకొకప్పుడు శ్రీ అరవిందుడు తన అనుభవము నుండి ఎట్లు పూరించునో, ఒక దృష్టాంతముద్వారా చెప్పుట ఈ సందర్భమున ఉచితమగును.

## 27. పరప్రకృతియందు గుణస్వరూపము

అపరప్రకృతియందు ప్రకాశము, ప్రవృత్తి మఱియు జడతయను రూపములతో నుండు సత్త్వ, రజస్, తమో గుణములు వేఱువేఱుగా నుండి, పరస్పర ఆధిక్యము కొఱకు పెనగులాడుచు, సంక్షోభమును బుట్టించును. కాగా పరప్రకృతియందు వీని మూల స్వరూపములు జ్యోతి, శక్తి మఱియు శాంతి. అక్కడ నివి ఒకదాని వెలుపల నొకటి యుండవు, ఒకదానితో నొకటి కలహించుకొనవు. అవి సమతూకములో నుండు నని చెప్పుటయు సరిపోదు. అక్కడ ప్రతిగుణము తక్కిన రెంటియొక్క ఒక పార్శ్వముగా నుండును, మఱియు తమ పూర్ణత (perfection) యందు అన్నియు అవిభాజ్యముగాను, ఏకముగాను విలసిల్లును (2-17-5) - అని గుణరహస్యమును వెల్లడించి, శ్రీ అరవిందుడు దీనికి సంబంధించి పాదటీకలో నిట్లు పేర్కొనును -

" ఇది (నా) అధ్యాత్మి కానుభవమునుండి ప్రవేశపెట్టిన విషయము గాని, గీతనుంచి సేకరించినది గాదు. గీత గుణాతీతత్వమును ప్రబోధించి, దాని స్వరూపమును స్వానుభవమున దెలిసికొన సాధకునకే విడిచివేయును." ఇట్టివారు గాక, గీతావ్యాఖ్యానమును జేయ ఇతరు లెవ రర్హులు ?

## 28. ఋషి ఋణము

మానవుడు మానవతనుండి దివ్యతలోనికి ఆరోహించు మార్గమున ఒక దశగా శ్రీ వేదవ్యాసుడు గుణాతీతత్వము చెప్పగా, శ్రీ అరవిందుడు ఆ గుణాతీతత్వ స్వరూపమును వర్ణించి, ఆ ఉపదేశమును పూర్ణము చేయును. చరమ దశగా సర్వ సమర్పణను జెప్పి, ఈ దశయందు భగవంతుడే నిన్ను విడిపించును - అని వేద

వ్యాసుడు ఆశ్వాస మీయగా, విడిపించుటయే గాదు, నీ యోగమును భగవంతుడే చేపట్టి నిన్ను సంపూర్ణ సంసిద్ధికి గొనిపోవును - అని శ్రీ అరవిందుడు చరమోప దేశములోని పూర్ణార్థమును దెలుపును.

ఇట్లు మానవుని దివ్యభవితవ్యమును దర్శించి, దానికి బంగారు బాట వేసి, ఆ భవితవ్య సంసిద్ధికి తమ యోగశక్తి నంతను ధారవోయుచున్న ఈ మహర్షి ద్వయముయొక్క - శ్రీ వేదవ్యాస శ్రీ అరవిందులయొక్క - ఋణమును మన మెట్లు తీర్చుకొనగలము !

దేవఋణమును దీర్చుటకు యజ్ఞము చేయవలెను, పితృఋణము దీర్చుటకు పిండప్రదానము చేయవలెను; పోగా ఋషిఋణము దీర్చుటకో - వారి గ్రంథములను అధ్యయనము చేయవలెను : లోకసంగ్రహార్థమే వచ్చిన ఆ మహనీయులు మన నుంచి అపేక్షించున దంతయు నిదే !

## 29. ధన్యుల మనుకొందుము

కావున శ్రీ వేదవ్యాసుని గీతాయోగమును, శ్రీ అరవిందుని గీతావ్యాసములను మనము శ్రద్ధగా, లోతుగా అధ్యయనము చేతము గాక ! వారి దృక్కోణమునుంచి, వారి చేతనలో ప్రవేశించి అధ్యయనము చేతము గాక ! అపుడు ఆ వ్యాఖ్యానము ఆవిష్కరించు గీతలోని భవ్య విశేషములు మన హృదయమును స్పృశింప నారంభించును. ఇక నపుడు ఎంత సమయము అధ్యయనమునకు వెచ్చించినను, అది అంతయు స్వల్పమే యనిపించును. అది వృథా అనిపించక పోగా, అంతకు మించి ఫలప్రద మగు సమయవినియోగ ముండ దని మనము భావింతుము, చదివి వందుకు ధన్యుల మనుకొందుము !

ఇట్టి అధ్యయనమునకు పూర్వపీఠికగా దోడ్పడు నిమిత్తమే మన మీ ప్రస్తావనలో కొన్ని ముఖ్యవిషయములను ప్రస్తావించుకొని యున్నాము. ఈ ప్రస్తావన అట్లే తోడ్పడి, పూర్ణాధ్యయనమునకు ప్రోత్సాహము నిచ్చు గాక !

భవదీయ

అనువాదకుడు

# గీతా - వ్యాసములు

## 1. [1] రెండు ప్రకృతులు

1. గీతయొక్క మొదటి ఆఱు అధ్యాయములు గీతాబోధనల ఒక ప్రవిష్ట విభాగముగా వివరింపబడినవి; అవి గీతాసాధనకును, జ్ఞానమునకును ప్రాథమికాధార మగును. అటులే మిగిలిన పండ్రెండు అధ్యాయములను సన్నిహిత సంబంధము గల రెండు విభాగములుగా వివరించవచ్చును, ఇవి రెండును ఈ ప్రాథమికాధారముపై తక్కిన గీతాసిద్ధాంతమును బెంపొందించును. గీతయొక్క ప్రథమ [2]షట్క మెటుల కర్మజ్ఞానములకు సంబంధము కలిపి, వానిని సమన్వయపఱచెనో, అటులనే ద్వితీయ షట్కము దివ్యపురుషుని స్వరూపమును విశాల రూపమున తాత్త్వికముగా ప్రతిపాదించి, తదాధారముపై భక్తి జ్ఞానములకు సంబంధము కలిపి, వానిని సమన్వయపఱచును. వీని మధ్యను, 11-వ అధ్యాయమున విశ్వరూప దర్శనము వచ్చి, ఈ భక్తిజ్ఞాన సమన్వయమునకు ఒక సక్రియ రూప మిచ్చి, దానికి జీవనకర్మలతో సంబంధము గలుపును. ఇట్లు మఱల నంతయు అర్జునుని మూల ప్రశ్నమునకే వచ్చును (11-34), విచారణ యంతయు నీ ప్రశ్నమునే చుట్టి, ప్రదక్షిణమును బూర్తిచేయును. పిమ్మట తృతీయ షట్కమున గీత పురుష ప్రకృతులను విశ్లేషించి చూపి, జ్ఞానసహితమగు నిష్కామకర్మ ఏ భక్తియందు పర్యవసించగా, జ్ఞానకర్మ ప్రేమలు మూడును ఏకమగునో, ఆ భక్తిని నిరూపించును (18-54); అటనుండి గీత తన పరమ చరమ వచనమున కెగసి, జీవితేశ్వరునకు ఆత్మసమర్పణయే పరమ రహస్యమని ప్రతిపాదించును (18-66).

---

[1] గీత : అధ్యాయము 7, శ్లోకములు 1-14.

[2] షట్కము = ఆఱు అధ్యాయముల సమూహము.

2. ఈ ద్వితీయ భాగమునందు గీతాప్రతిపాదనము ఎక్కువ సంక్షిప్తముగాను, సుగమముగాను నుండును. ప్రథమ షట్కమునందు ఆధారసత్యమునకు కీలక మనదగు నిర్వచనము ఇంకను చేయబడలేదు ; కఠినతలు తలయెత్తినపుడు, అవి తాత్కాలికముగా పరిష్కరించబడును ; ఇచ్చట ప్రగతి సూటిగా గాక, మఱుగుపడుచు, మెలికలు దిరుగుచు, క్లిష్టముగా సాగును ; ఎంతయో, ఇంచుక సూచిత మగును గాని, దాని అభిప్రాయము స్పష్టముగాదు. అయితే ఈ ద్వితీయ భాగమున నిరూపణ ఎక్కువ సంక్షిప్తముగాను, నిర్దిష్టముగాను నుండును. కాని నిరూపణ సంక్షిప్తము గావునన్నే మనము సావధానముగా సాగవలెను, లేనిచో దారి తప్పి, వాస్తవార్థమును తప్పిపోదుము. ఏలన మన మిచ్చట ఆధ్యాత్మికానుభవము యొక్క సురక్షిత క్షేత్రమున చరించక, ఆధ్యాత్మికము, మఱియు తఱచు విశ్వాతీతము నగు సత్యముయొక్క బౌద్ధిక ప్రతిపాదనలను విచారించవలసియుండును: దార్శనిక ప్రతిపాదన మనస్సు నిమిత్తము, ఏది నిజముగా అనంతమో, దానిని సాంతముగా నిర్వచించు ఒక ప్రయత్నము, కావుననే దానియం దెప్పుడును ప్రమాద ముండును ; అట్టి ప్రతిపాదన చేయక తప్పదు గాని, అదెప్పటికిని మిక్కిలి తృప్తికరము, మిక్కిలి నిశ్చితము గాజాలదు, దాని కంతిమరూప మనునది యుండదు. సర్వోన్నత సత్యమును జీవించగలము, దర్శించగలము, కాని పాక్షికముగా మాత్రమే భాషించగలము. అయినను ఇవ్విషయమున ఉపనిషత్తుల పద్ధతియు, భాషయు మాత్రమే ఎక్కువ తగియుండును ; ఏలన వాని పద్ధతి రూపకమును, సంకేతమును ధారాళముగా నుపయోగించును, మఱియు వాని భాషారూపము అంతర్జ్ఞాన స్ఫోరకము గాన, అది బౌద్ధిక పరిభాషయొక్క కఠోర పరిమితత్వమును భగ్నముచేయగా, పదములయొక్క గర్భితభావములు తరంగ పరంపరగా వెలికి ప్రవహించును. కాని గీత ఈ భాషారూపము నాశ్రయించ జాలదు ; ఏలన ఒక బౌద్ధిక క్లిష్టతను విడదీయ దాని రూపకల్పన చేయబడినది ; ప్రాణ ప్రేరణలు, భావావేగములవలన సంఘర్ష మేర్పడినపుడు, దానిని పరిష్కరించవలసిన హేతుబుద్ధి ఎటును తెగజెప్పలేక నిర్వీర్యము కాగా, అట్టి బుద్ధికి దారిజూపు గీత రచింపబడినది. గీత హేతువును హేతుమార్గముననే హేత్వతీత సత్యమునకు దీసికొని పోవలెను. బుద్ధికి ఆధ్యాత్మికతత్త్వముల అనుభవముండదు ; కావున ఆ తత్త్వములపై నాధారపడి, చూపిన పరిష్కారము ప్రామాణిక మని

బుద్ధికి నిశ్చయము గలుగవలె ననిన, ఆ తత్త్వముల బౌద్ధిక ప్రతిపాదన దాని హేతువును తృప్తి పఱచవలెను.

3. ఇంతవఱకు బుద్ధిముందుంచబడిన ఆ తత్త్వసత్యములు బుద్ధికి పూర్వమే పరిచితములు మఱియు పరిష్కార ప్రారంభమునకు మాత్రమే పర్యాప్తములగును. వానిలో ప్రథమ సత్యము సర్వాత్మకును ప్రకృతిగతమగు వ్యష్ట్యాత్మకును గల విభేదము. అహంకార క్రియలోపల బద్ధుడై నివసించునంతవఱకు, వ్యష్టిపురుషుడు త్రిగుణ కర్మలకు అవశ్యముగా బద్ధుడగునని ఈ విభేదమూలమున తెలుపబడినది– ఈ గుణకర్మలే శరీరస్థమగు బుద్ధి, మనస్సు, ప్రాణము, ఇంద్రియముల కర్మ పరిధిని, పద్ధతినిగూడ నిర్ణయించును. కాగా, ఈ పరిధిలోపల పరిష్కారమేలేదు. కావున నీ పరిధికి వెలుపల, గుణ ప్రకృతికి పైన విరాజమానమగు ఏకమాత్ర అక్షరాత్మయందు, నీరవ పురుషునియందు పరిష్కారమును వెదకవలెను, ఏలన అపుడు అనర్థమూలమగు కామాహంకారముల కర్మను గడచి గట్టెక్కుదుము. కాని అక్షరాత్మలోనికి చేయు ఆరోహణ మాత్రమే పరిష్కారము గాదనిపించును, అది సూటిగా అకర్మకు దారితీయు ననిపించును; ఏలన ప్రకృతి కావల కర్మకరణము నుండదు, కర్మకారణము, అనగా కర్మ నిర్ణాయకము నుండదు – ఎందుచేతనన అక్షరాత్మ నిష్క్రియము, సర్వసమము నగుటచే దేనిని నిర్ణయించదు. కావున కర్మ యజ్ఞముల అధీశ్వర రూపమున గీత భగవద్భావమును ప్రవేశపెట్టును (5–29), మఱియు నీ భగవంతుడు అక్షరాత్మకంటెను అధికుడు, అతనియందే విశ్వజీవన కీలక మున్నది – అని స్పష్టముగా వచింపక, కేవలము సూచించును. కావున అక్షరాత్మద్వారా ఈశ్వరస్థితి కెగసి, ప్రకృతి కర్మలయందు కొనసాగుచునే, కర్మలనుండి ఆధ్యాత్మిక విముక్తి ననుభవించుట సాధ్యమే. కాని యిచ్చట దివ్య గురువు మఱియు కర్మసారథి రూపమున అవతరించిన ఈ పరమపురుష డెవరో, ఆత్మతోను, జీవునితోను అతనికిగల సంబంధము లేవియో ఇంకను వచింపబడలేదు. మఱియు నీశ్వర మూలకమగు కర్మసంకల్పము త్రిగుణాత్మిక ప్రకృతి యందలి కర్మసంకల్పముకంటెను ఎట్లు భిన్నము కాగలదో తెలియదు. మఱియు నది యిదియే యగుచో, దాని ననుసరించు అంతరాత్మ తన స్వరూపమునందు గాక పోయినను, తన కర్మయందు గుణాధీనము గాక ఎట్లు తప్పించుకొనగలదు ? ఇక నదీనమే యగుచో, ప్రతిజ్ఞాతమైన ముక్తి భ్రాంతిమయము లేక అసంపూర్ణము

నగును. సంకల్పము ప్రకృతియొక్క సామర్థ్య విశేషముగాను, క్రియాశక్తిగాను గన్పట్టును. అయినప్పుడు త్రిగుణాత్మక ప్రకృతికంటెను ఉచ్చతర ప్రకృతియొకటి గలదా ? అహంకారము, కామము, మనస్సు, ఇంద్రియ సమూహము, ప్రాణావేగముల శక్తికంటెను భిన్నమగు వ్యావహారిక సృష్టి, సంకల్ప, క్రియలనుసాధించు మఱియొక శక్తి గలదా ?

4. కావున ఈ సందేహావస్థయందు, దివ్యకర్మకు ఆధారము కాగల జ్ఞానమును పూర్ణతరముగా ప్రతిపాదించుటయే కర్తవ్యమగును. మఱియు ఆ జ్ఞానము భగవంతునియొక్క సంపూర్ణ, సమగ్ర జ్ఞానము గావలయును ; ఏలన దానిచేతనే కర్మమూలము, కర్మవిముక్తుడు నగు భగవంతుని దెలిసికొని, కర్మి అతని విముక్తిలో పాల్గొనగలుగును. ఇంకను, గీతా ప్రథమ షట్కము ఏ ప్రతిజ్ఞతో సమాప్తమగునో, దానిని పోషించగల ప్రకాశము నీ జ్ఞానము గానిరావలయును (6–47) ; అనగా ఆధ్యాత్మిక చేతన మఱియు కర్మలకు గల ఇతర ప్రేరణలు మఱియు శక్తులకు పైన భక్తి శ్రేష్ఠత నది స్థాపించవలెను. అందులకు, భక్తి ప్రేమల పరమశిఖరమగు పరిపూర్ణ ఆత్మసమర్పణయందు ఎవరికి మాత్రమే అంతరాత్మ తనను నివేదించుకొనగలదో, అట్టి సర్వభూతమహేశ్వరుని జ్ఞానమే అది గావలెను. దీనినే గురువు ఏడవ అధ్యాయముయొక్క ప్రారంభ శ్లోకములందు ఉపక్రమించగా, గీతాశేషమంతయు దీని పరిణతినే సాధించును. అతడిట్లు ప్రారంభించును– "నాయందు నీ మనస్సును గిలించి, నన్నె ఆశ్రయముగా గొని (సచేతన సత్తాక్రియలకు సర్వాధారము, నివాసము, శరణ్య స్థానముగా గొని) యోగసాధన చేయుచు, నెట్లు సంశయ రహితముగా, సమగ్రముగా నన్ను తెలిసికొనగలవో, వినుము (7–1). నీ కిపుడు విజ్ఞాన సహితమగు జ్ఞానమును లోప రహితముగా, అశేషముగా వివరింతును ; దీని నెఱిగిన, నిక నెఱుంగవలసిన దేదియు నిచ్చట మిగిలియుండదు (7–2)." దీని అభిప్రాయ మేమన, భగవంతుడే సర్వము– "వాసుదేవః సర్వం" (7–19), కావున తన సమస్త శక్తులు, మఱియు తత్త్వములందు నతడు సమగ్రముగా జ్ఞాతమగుచో, సర్వము జ్ఞాతమగును– శుద్ధాత్మయే గాదు, ప్రపంచమును, క్రియయు, ప్రకృతియు జ్ఞాతమగును. అప్పు డిక జ్ఞాతవ్య మేమియు మిగులదు. ఇట్లిచ్చట మన దృష్టి సమగ్రముకాదు గనుకనే, అతి విభజనకరమగు "మనోబుద్ధులు" మఱియు అహంకారముయొక్క పృథక్కార

భావములమీద నిష్ఠితము గనుకనే, వస్తు విషయకమగు మన మనోబోధము ఒక విధమగు అజ్ఞానమగును. ఈ అహంకారిక దృష్టినుండి తప్పుకొని, మన మేకీకర జ్ఞానము నాశ్రయించవలెను. ఇది జ్ఞాన, విజ్ఞానభేదముచేత ద్వివిధము—జ్ఞాన మన స్వరూప జ్ఞానము, విజ్ఞాన మన సమగ్రవిషయ జ్ఞానము; ఒకటి పరమాత్మయొక్క అపరోక్షమగు ఆధ్యాత్మిక బోధము (awareness), రెండవది అతని అభివ్యక్తి లోని ప్రకృతి పురుషాది తత్త్వముల యథార్థ, ఘనిష్ఠ జ్ఞానము. సర్వము తన దివ్య మూలమునందు జ్ఞానము చేతను, తన ప్రకృతిసత్యమునందు విజ్ఞానము చేతను తెలియబడగలదు. ఈ పూర్ణ జ్ఞానము అపరూపము, అతి కఠినము నని గీత తెలుపును— "వేలకొలది మానవులలో ఒకానొకడు సిద్ధినిమిత్తము ప్రయత్నించును, ప్రయత్నించి, సిద్ధి నందుకొనినవారియందు (సైతము) ఒకానొకడు నన్ను నా సర్వ తత్త్వములందును—తత్త్వతః—తెలిసికొనును (7–3)."

5. ఇవు డీ పూర్ణజ్ఞానమును ప్రారంభించి, ప్రతిష్ఠించుటకు గీత రెండు ప్రకృతుల మధ్య, బాహ్య, ఆధ్యాత్మిక ప్రకృతుల మధ్య, ఒక గంభీర, గురుతర వివేచన చేయును; ఈ విశ్లేషణమే గీతాయోగముయొక్క వ్యావహారిక ప్రాతిపదిక. "పంచ భూతములు, మనస్సు, బుద్ధి, అహంకారము — ఇది నా అష్టవిధ విభక్త ప్రకృతి (7–4). కాని ఇది నా అపర ప్రకృతి, దీనికంటెను భిన్నమగు నా పర ప్రకృతి నెఱుంగుము, ఇదియే జీవుడగును, దీనిచేతనే ప్రపంచము ధరించబడును (7–5). "ఇచ్చట మనకు గీతయొక్క ప్రథమ, నూతన తాత్త్వికభావము గన్పించును, దీని సాహాయ్యమున గీత సాంఖ్యభావములతో ప్రారంభించి, వాని నతిక్రమించి, సాంఖ్యపదములకు వేదాంతార్థము నీయగలుగును. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము నను పంచభూతములు — ఇవి లోహాదులవలె వివిధ వస్తువులు గావు, జడసత్తయొక్క వివిధావస్థలు—, ఇంద్రియ సహిత మనస్సు, సంకల్పసహిత బుద్ధి, అహంకారము : ఇవి ఎనిమిదియు సాంఖ్య ప్రకృతియొక్క అంగములగును. సాంఖ్య మింతటితో ఆగిపోవును, అందుచేతనే అది పురుష ప్రకృతుల మధ్య పూడ్చరాని అఖాతమును చెప్పక తప్పలేదు ; అవి రెండు మిక్కిలి విభిన్న, ప్రాథమిక వస్తులని చెప్పవలసివచ్చినది. గీతయు, నిచ్చటనే ఆగిపోవుచో, ఆత్మకును, విశ్వప్రకృతికిని మధ్య అదే అసాధ్య విరోధమును ప్రతిపాదించవలసి వచ్చును ; అవు డీ విశ్వ ప్రకృతి త్రిగుణముల మాయామాత్ర మగును, మఱియు

విశ్వజీవనము కేవలము మాయాఫలిత మగును; మఱేమియు గాజాలదు. కాని ఉన్నదీ సాంఖ్య ప్రకృతియే గాదు, మఱియొక ఉచ్చతర తత్త్వము, భాగవత ప్రకృతియు గలదు – "పరా ప్రకృతిర్ మే" (7–5). భగవంతుని ఈ పర ప్రకృతియే సృష్టికిని, సృష్టి శక్తికిని మూలము; అజ్ఞానమయ నిమ్నప్రకృతి దీని జన్యమే, దీని నల్లని నీడయే. ఈ సర్వోత్తమ శక్తితత్త్వము (dynamis) నందు ప్రకృతి పురుషులిరువురు నొకటిగా నుందురు. అచ్చట ప్రకృతి పురుషుని యొక్క సంకల్పము మఱియు క్రియాశక్తి మాత్రమే; అతని సత్తా-వ్యాపారము మాత్రమే గాని, అది పృథగ్భూత సత్త గాదు, అది శక్తి రూపమున నున్న పురుషుడే.

6. ఈ పరప్రకృతి విశ్వ వ్యాపారమునందు అంతఃస్థితమగు ఆధ్యాత్మిక సత్తయొక్క శక్తిసన్నిధిమాత్రమే గాదు. అగుచో, అప్పుడది విశ్వవ్యాపి ఆత్మ యొక్క నిష్క్రియ సన్నిధియే యగును. ఏలన ఈ ఆత్మయు అన్నిటియందును అంతస్థముగా నుండి, తాను నిష్క్రియ మయ్యును, తన సన్నిధిచేత ఒక విధముగా విశ్వకర్మ కారణమగును. మఱియు నీ పరప్రకృతి అష్టవిధ ప్రకృతికి బీజావస్థ యగు సాంఖ్యుల "అవ్యక్తమును" గాదు, (ఇది పురుషునికంటెను భిన్నముగదా). ఇక నీ అవ్యక్తమునకు వేదాంతార్థ మిచ్చినను, అది పరప్రకృతి గాజాలదు. ఏలన వేదాంతావ్యక్తము బ్రహ్మ లేక ఆత్మయందు [1]వ్యావృత్తముగా నుండుశక్తి; దీని నుండియే విశ్వము వెలువడి, దీనిలోనికే తిరిగి వచ్చును. ఈ వ్యావృత్తశక్తి పర ప్రకృతియొక్క ఆధ్యాత్మిక స్థితులలో నొకటి మాత్రమే. కాగా పరప్రకృతి పరమ పురుషునియొక్క పూర్ణ చిచ్ఛక్తి యగును, ఇది జీవ జగత్తులకు మూలము. అక్షరాత్మయందది వ్యావృత్తమై యుండును, అనగా నిష్క్రియముగా నివృత్తియం దుండును; క్షరాత్మయందును, జగత్తునందును అది ప్రవృత్తిలోనికి వచ్చును. అక్కడది తన సక్రియ సన్నిధిచే బ్రహ్మలోకల సర్వభూత పరిణామమును సాధించును, మఱియు వానిలోపల వానిమూలభూత ఆధ్యాత్మిక ప్రకృతిగా నిలచును, ఇదియే వానిఅంతరంగ బహిరంగ వ్యాపారము వెనుకనిలచియుండు స్థాయి సత్యము. ఇది భూతముల "స్వభావము" (8–3), అనగా వాని మూలభూత గుణము మఱియు శక్తి; ఇది వాని సంభూతిని నిర్ణయించు వానిలోపలి స్వతత్త్వము, వాని జీవనము

[1] వ్యావృత్తము = Involved, సంకుచితము, నిలీనము, నిమగ్నము.

వెనుక నుండు దివ్యశక్తి. గుణఖేలనము ఈ పరమతత్త్వమునుండి ప్రభవించి, పరిణమించిన ఒక పరిమిత వ్యాపారము మాత్రమే. నిమ్న ప్రకృతియొక్క ఈ నామరూప కర్మ మంతయు, ఇంద్రియగత, మానసిక, బౌద్ధిక ప్రయాస మంతయు ఒక బాహ్యఘటన మాత్రమే, ఇది లోపలి స్వభావ రూపమగు ఆధ్యాత్మిక శక్తి చేతనే సంభవము ; దానినుండియే వచ్చును, దానియందే, దానిచేతనే వర్తించును. దృశ్య ప్రకృతియందే నివసించుచు, అది మనకు గలిగించు అభిప్రాయములనుబట్టియే వస్తువులను నిర్ణయింతుమేని, మన సక్రియసత్తయొక్క వాస్తవసత్యము నెప్పుడును మన మందుకొనజాలము. వాస్తవసత్య మీ ఆధ్యాత్మిక శక్తియే, దివ్యస్వభావమే, వస్తువుల యందలి ఈ ఆత్మగుణమే ; దీనినుండియే వస్తువులు తమ శక్తులను, ప్రవృత్తి బీజములను గ్రహించును. ఆ సత్యమును, శక్తిని, గుణమును ప్రాపించి నప్పుడు, మనము మన [1] సంభూతి వాస్తవ ధర్మమును, మన జీవన దివ్యతత్త్వమును ప్రాపించినవార మగుదుము—అజ్ఞానమునందు జీవన ప్రక్రియనే కాక, జ్ఞానమునందు దాని మూలమును, నియమమును గూడ ప్రాపించినవార మగుదుము.

7. ఇట్లు చెప్పుట ఆధునిక చింతనా విధానమున కనురూపమగు భాషలో గీతాభావమును ప్రస్తావించుటయే యగును. పర ప్రకృతినిగుఱించి గీత చెప్పునదియు వస్తుతః ఇదియే నని మనము చూడగలము. ఏలన "ప్రకృతిం మే పరాం" (7–5)—ఇది నా పర ప్రకృతియని కృష్ణుడు ముందుగనే చెప్పును. మఱియు నిచ్చటి 'నా' పురుషోత్తముని (15–18), దివ్యపురుషుని, పరమాత్మను, విశ్వాతీత, విశ్వవ్యాపి తత్త్వమును బరామర్శించును. మఱియు నిచ్చటి పరప్రకృతి కర్థము పురుషోత్తమునియొక్క మూలప్రకృతికి, సృజనశక్తికి మాత్రమే వర్తించును. ఏలన "ఇదియే భూతయోని" యని కృష్ణుడు వక్కాణించును (7–6), మఱియు నదే శ్లోకముయొక్క రెండవపంక్తిలో, "నేను సర్వజగత్తునకు ఆదియు, నంతము" నని తెలుపును (7–6). ఇంకను "నాపైన మఱేదియు లే"దని వక్కాణించును (7–7). ఇట్లు పురుషోత్తముడును, పరప్రకృతియు నేకము చేయబడిరి : ఒకే తత్త్వమును చూచు రెండు విధములుగా వారు ముందుంచబడిరి. ఏలన ప్రపంచమున కాద్యంతములు నేనే నని కృష్ణుడు ప్రకటించినపుడు, తన సత్తయొక్క పర

---

[1] సంభూతి = **Becoming**, అగుట, సత్తయొక్క పరిణామము.

ప్రకృతియే ఈ ఆద్యంతము లని మనకు స్పష్టమే. ఒకే పరతత్త్వము తన అనంత చేతనయందు పరమపురుషుడును, తన అనంత శక్తియందు పరప్రకృతియు నగును–అనగా అనంతచేతనయే తన అంతర్వర్తి దివ్య శక్తియందును, తన అలౌకిక దివ్యక్రియయందును పరప్రకృతి యగును. చేతనయందుండి ఈ సచేతన శక్తియొక్క పరిణామగతియే ప్రపంచ ప్రభవము (7–6) – "పరా ప్రకృతిర్ జీవభూతా" (7–5), క్షరవిశ్వమునందు దాని వ్యాపారము, పోగా పరమాత్మయొక్క అక్షర భావములోనికిని, స్వాత్మలీన వ్యాపారములోనికి వ్యావర్తనముద్వారా ఆ సచేతనశక్తియొక్క ఉపసంహరణమే ప్రపంచ ప్రళయ మగును. కావున ప్రారంభమున గీత పరప్రకృతికిచ్చిన అర్థమిదియే.

౮. కావున పరప్రకృతి స్వయంభూపురుషునియొక్క దేశకాల రహితమగు చేతనశక్తి యగును; దీనియందుండియే సర్వభూతములు అభివ్యక్తములగుచు, కాలాతీత భావమునుండి కాలములోనికి వచ్చును. కాని కాలగతియందు ఈ బహువిధ విశ్వసంభూతి కొక ఆధ్యాత్మిక ప్రాతిపదికను గల్పించుటకు పరప్రకృతి జీవరూపము ధరించును. వేఱు శబ్దములలో, పురుషోత్తమునియొక్క సనాతన [1] అనేకాత్మ విశ్వముయొక్క సర్వరూపములందును వ్యష్టిపురుషరూపమున ప్రకటిత మగును. సర్వభూతములు ఏకాత్మచే అనుప్రాణితములు, సర్వభూతములు తమ వ్యక్తిత్వము, క్రియలు, మఱియు రూపములందు ఏకపురుషునియొక్క అనేకాత్మచే ధరింపబడి యుండును. పరప్రకృతి సంభూతిప్రకృతియేగాని, సత్తాప్రకృతి కానేకాదు, అనగా నది కాలమునందభివ్యక్తమైన జీవమాత్రమేగాని, మఱేమియు గాదని తలపోయుట తప్పే యగును. అట్టిది పరమ పురుషునియొక్క పరప్రకృతి కాజాలదు. కాలమునందు పైతము అది జీవునికంటె కొంత అధికము; ఎంత అల్పము గానిదో, జగత్తునందు దాని ఏకమాత్ర సత్యము అనేకత్వ ప్రకృతియే కాగా, జగత్తునందు ఏకత్వప్రకృతి యనునది యుండదు. గీత చెప్పునదిది కాదు; పరప్రకృతి తన మూలమునందు జీవుడే– "జీవాత్మికాం" అని కాక, అది జీవమయ్యెను– "జీవభూతాం" (7–5) – అనియే చెప్పును; ఈ భేదముయొక్క భావ మేమన, ఇచ్చట జీవరూపమున తన అభివ్యక్తికి ముందే యది తన మూలమునందు

[1] అక్షరము పురుషోత్తముని ఏకాత్మ, క్షరము అనేకాత్మ.

జీవునికంటెను అన్యము మఱియు అధికము ; అది ఏకమాత్ర పరమాత్మయొక్క ప్రకృతి. గీత తర్వాత వచించు నట్లు జీవుడు ఈశ్వరుడే (13–23) గాని, ఈశ్వరుని ఆంశికాభివ్యక్తిగా మాత్రమే అత డీశ్వరుడు – "మమై వాంశః" (15–7). విశ్వము నందలి, లేక అసంఖ్యాక విశ్వములందలి జీవు లందరు కలిసియు తమ సంభూతి యందు పూర్ణభగవంతుడు గా జా ల రు, ఆ ఏకునియొక్క ఆంశికాభివ్యక్తియే యగుదురు. వానియందు అవిభాజ్యసత్తారూపమగు బ్రహ్మము విభక్తమైనట్లు వసించును—"అవిభక్తంచ భూతేషు విభక్త మివ చ స్థితం" (13–17). రెండును సత్యమే యైనను, ఏదియు భ్రాంతి గాకున్నను, ఏకత్వము అధికతరసత్యము కాగా, బహుత్వము అల్పతర సత్యమగును.

9. జీవేశ్వర సంబంధము : పరప్రకృతినుండియే ప్రపంచము తన సర్వభావములతో ప్రభవించుచున్నది, మఱియు నదియే ప్రళయకాలమున సర్వ భావసహిత ప్రపంచమును తనలోని కుపసంహరించుకొనుచున్నది (7–6) ; అటులే ఈ ఆధ్యాత్మికప్రకృతియొక్క ఏకత్వముచేతనే ప్రపంచము ధరించబడి యున్నది. కాని పరమాత్మలోపల ప్రపంచముయొక్క అభివ్యక్తియందును, స్థితికాలమున దాని ధారణమునందును, ప్రళయకాలమున దాని ఉపసంహరణము నందును జీవుడే బహువిధ ప్రపంచభావమున కాధారము ; జీవుడు అనేకాత్మ యని మనము చెప్పుకొనవచ్చును, అధవా మన మనుభవించు అనేకత్వముయొక్క ఆత్మ యనియు చెప్పుకొనవచ్చును. జీవుడు తన సత్తయందు సదా భగవంతునితో ఏకమే, తన సత్తయొక్క శక్తియందు మాత్రమే అతనికంటె భిన్నము–ఇచ్చటను, ఉభ యుల శక్తులు వేఱువేఱను అర్థమున గాక, జీవుడు భగవంతునియొక్క వ్యష్టికృత ఆంశికశక్తికి మాత్రమే ఆధార మను అర్థమున భిన్నము. కావున సర్వవస్తువులు ఆద్యంతములందే గాక, తమ జీవన తత్త్వమునందును పరమపురుషుడే యగును. అన్నింటియొక్క ప్రాథమికప్రకృతి భగవత్ప్రకృతియే ; తమ నిమ్న విభేదక వ్యాపారమునందు మాత్రమే అవి భిన్నముగా గన్పించును, శరీరప్రాణ మనో బుద్ధి ఇంద్రియాహంకారముల ప్రకృతిగాగన్పట్టును. కాని ఈ శరీరాదులు పాంచభౌతిక వికృతులు (derivatives), అవి మన స్వభావస్వరూపముల మూలసత్యము గావు.

10. మద్భావము, స్వభావము, భావములు : ఇట్లు భగవంతుని పర ప్రకృతిని విశ్వాతీతముగా నున్న, మూలభూతమగు విశ్వసత్యము, శక్తియు

ననియు, విశ్వమునందలి అభివ్యక్తికి ఆధ్యాత్మిక సత్యరూపమగు ప్రథమాధార మనియు దెలియవచ్చును. కాని ఈ పరప్రకృతికిని, నిమ్నదృశ్యప్రకృతికిని అనుసంధాన (link) మేది? నాయందు, కృష్ణుడు వచించును, ఇది యంతయు, ఇక్కడున్నదంతయు, సూత్రమునందు మణులవలె, కూర్చబడినది (7–7). కాని ఇది యొక ప్రతిమానము మాత్రమే గాన, దీనిని ఎక్కువ సాగలాగరాదు; ఏలన మణులు దారముచేత ఒకదానితో నొకటి కలిసియుండును, ఇవ్విషయమున అవి దారముపై నాధారపడును — ఇదియే వానికిని, దారమునకును గల ఏకత్వము లేక సంబంధము. కావున మన మిపుడు ప్రతిమానమును విడిచి, ప్రతిమేయమును జూతము. అది పురుషోత్తముని పరప్రకృతి, అతని సత్తయొక్క అనంత చిచ్ఛక్తి; అది స్వసంవిదము, సర్వసంవిదము, సర్వజ్ఞము; అది బాహ్యభూతముల నన్నింటిని అన్యోన్యసంబద్ధముగా నడుపును; వానిలో ప్రవేశించును, వానిలో నిలిచి, వానిని ధరించును; వానిని తన అభివ్యక్తిక్రమమున అల్లును. ఈ ఏకమాత్ర పరమశక్తి అన్నింటియందును ఏకాత్మగనే గాక, ప్రతిదానియందును జీవుడుగా, అనగా వైయక్తిక ఆధ్యాత్మికసన్నిధిగా అభివ్యక్తమగును; ఇది సర్వప్రకృతిగుణముల సారముగా గూడ నభివ్యక్త మగును, [ఉదాహరణకు, జలమునందు రసముగా (7–8)]. కావున ఈ సారగుణములు వస్తువుల వెనుకనుండు ఆధ్యాత్మికశక్తులు. ఈ సర్వోన్నతగుణము త్రిగుణక్రియ గాదు; ఏలన ఈ గుణక్రియ గుణముయొక్క బాహ్యరూపము గాని, దాని ఆధ్యాత్మికసారము గాదు. ఈ సారగుణము ఏకమయ్యును, బాహ్యపరివర్తనలయొక్క పరివర్తనీయ అంతఃశక్తి యనవచ్చును. ఈ స్వభావగుణము సంభూతియొక్క మూలసత్యము, ఈ సత్యము సంభూతి రూపములను ధరించుచు, వానికి ఒక ఆధ్యాత్మిక దివ్య అంతర్యము నిచ్చును. త్రిగుణక్రియలు బుద్ధ్యాదులయొక్క బాహ్యమగు అస్థిర సంభూతులు — "సాత్త్వికా భావా, రాజసాః, తామసాః చ" (7–12), కాని జీవతత్త్వము గుణభావము గాక, "స్వభావ" మగును, ఇది సారము, స్థిరము, ఆద్యము, ఘనిష్ఠము నగు సంభూతిశక్తి. గుణసంభూతియొక్కయు, జీవసంభూతియొక్కయు మూలధర్మమును నిర్ణయించున దీ స్వభావమే. ప్రతి జీవియందు నుండు నీ తత్త్వము ఈశ్వరునియొక్క అతీత దివ్యసంభూతినుండి — "మద్భావము నుండి" (14–19) — జనించి, దానితో సరాసరి సంబంధము గలిగియుండును. ఇట్లు మద్భావమునకు స్వభావముతోను, స్వభావమునకు బాహ్యగుణ భావముతోను సంబంధ ముండును,

అనగా దివ్యప్రకృతికి అంతరాత్మప్రకృతితోను, అంతరాత్మప్రకృతికి బాహ్య సంకరప్రకృతితోను సంబంధ ముండును, ఈ సంబంధమే దివ్యప్రకృతికిని, నిమ్న ప్రకృతికిని మధ్యగల అనుసంధానము. నిమ్నప్రకృతియొక్క హీనశక్తులు మఱియు విలువలు పరమశక్తియొక్క పూర్ణశక్తులు మఱియు విలువలనుండి ఉత్పన్నములు గావున, తమ మూలమును, సత్యమును మఱియు తమ స్థితిగతుల ప్రధానధర్మమును గనుగొనుటకు వానినే తిరిగి చేరుకొనవలెను. అటులే అంతరాత్మ లేక జీవుడును, బాహ్యగుణముల నికృష్ట ఖేలనములో చిక్కుకొనియున్న జీవుడును, తన విశుద్ధ స్వభావక్రియ నాశ్రయించి, తన స్వీయసత్తయొక్క ఉచ్చతర ధర్మమునకు తిరిగిరావలెను ; అక్కడతడు తన దివ్యప్రకృతియొక్క సంకల్పమును, శక్తిని, సక్రియతత్త్వమును, అత్యున్నత కర్మ విధానమును కనుగొనగలడు.

11. తర్వాతి శ్లోకములలోనే ఈ సంగతి స్పష్టమగును; గీత యిచ్చట అనేక ఉదాహరణలిచ్చి, భగవంతుడు తన పరప్రకృతిశక్తిరూపమున చరాచరభూతములం దెట్లు వ్యక్తమగునో, కర్మచేయునో చూపును. ఛందస్సు ననుసరించి, క్రమముమాఱి వచ్చిన ఈ దృష్టాంతములను యథోచితమగు దార్శనికక్రమములో పెట్టవచ్చును. ప్రథమతః, దివ్యశక్తియు, సన్నిధియు ద్రవ్యముయొక్క పంచ ప్రాథమికావస్థలలోపల – పంచభూతములలోపల – పనిచేయును – “ నేను జలములలో రసము, ఆకాశమునందు శబ్దము, భూమియందు గంథము, అగ్నియందు తేజము. ” (7–8, 9), మఱియు నీ పరంపరను పూర్ణముజేయుటకు, వాయువునందు స్పర్శము– అని మనము కలుపవచ్చును. అనగా, తన పరప్రకృతిరూపమున భగవంతుడే వివిధ ఇంద్రియ సంబంధములకు ఆధారభూతమగు శక్తియగును. పంచభూతములు నిమ్నప్రకృతియందలి పరిణామాత్మక లేక ద్రవ్యాత్మ కాంశము. కాగా పంచ తన్మాత్రలు – శబ్దస్పర్శరూపరస గంధములు – గుణాత్మకాంశము. ఈ తన్మాత్రలు శక్తియొక్క సూక్ష్మరూపములు, ఇవి ద్రవ్యముయొక్క స్థూలరూపములతో ఇంద్రియచేతనకు సంబంధము కలుపును – ఇవియే మన బాహ్యప్రపంచజ్ఞానమున కాధారము. భౌతికదృష్టిని బట్టి, ద్రవ్యము మూలవస్తువు, ఇంద్రియసంబంధములు తజ్జన్యములు ; కాని ఆధ్యాత్మికదృష్టి ననుసరించి, సత్యము దీనికి వ్యతిరేకము. ఇచ్చట ప్రకృతిశక్తియే, అనగా సత్తకు గల సామర్థ్యము మఱియు గుణములే,

ఏకమాత్ర, ఆద్య,సనాతనతథ్యము; ఈ ప్రకృతిశక్తియే ఇంద్రియములద్వారా తనను దాను పంచభూతములుగా, అనగా ద్రవ్యముగా అంతరాత్మకు వ్యక్తముచేసికొనును. మఱియు నింద్రియములందు సారభూతము, మిక్కిలి ఆధ్యాత్మికము, మిక్కిలి సూక్ష్మము నగు నే అంశము గలదో, అది స్వయముగా ఆ సనాతనగుణము మఱియు శక్తియొక్క పదార్థమే. కాని ప్రకృతిగతశక్తి ప్రకృతిరూపమున నున్న సాక్షాత్తు భగవంతుడే; కావున తన శుద్ధరూపమున ప్రతి ఇంద్రియమును తన సత్క్రియ చిచ్ఛక్తిరూపమున నున్న భగవంతుడే యగును.

12. ఈ సత్యము ఈ పరంపరయొక్క ఇతరపదములనుండి ఎక్కువ ప్రకటమగుమ - "నేను చంద్రసూర్యుల ప్రకాశమును, నరులయందు నరత్వమును (7-8), బుద్ధిమంతుల బుద్ధిని, తేజోవంతుల తేజమును (7-10), బలవంతుల బలమును, తాపసుల తపస్సును అయియున్నాను (7-9)". "నేను సర్వభూతము లందు - జీవనమను (7-9)." ఇట్లు ప్రతివస్తువునందు దాని మూలగుణము యొక్క ఏ శక్తి గలదో, ఈ యేశక్తిమీద దాని సంభూతి నాధారపడియుండునో, ఆ శక్తియే ఆ వస్తుస్వభావమునందు భగవచ్ఛక్తియొక్క ఉపస్థితిని సూచించు విశిష్టలక్షణముగా వీయబడినది. ఇంకను "నేను వేదములందు ప్రణవమను (7-8)" ప్రణవ మనగా మూలాక్షరమగు ఓం-కారము, ఇదియే అపౌరుషేయవేదముయొక్క శక్తిశాలి, సృజనాత్మకశబ్దము లన్నింటికి మూలము; ఇది వాక్శబ్దముల శక్తి యొక్క ఏకమాత్ర వ్యాపకసూత్రీకరణము, కావున నిది వాక్శబ్దముల ఆధ్యాత్మిక శక్తి నంతటిని, బీజసత్త నంతటిని ధరించును, సంగ్రహించును, సమన్వయించును, మఱియు వెలికిబంపును; ప్రణవద్రవ్యమునుండియే భాషాశబ్దము లల్ల బడును, ఈ శబ్దముయొక్క వికసితపరిణామములే ఇతరశబ్దము లని తలంచబడును. ఈ వివరణవలన మన కిది స్పష్టము : ఇంద్రియములు లేక జీవనము లేక ప్రకాశము, బుద్ధి, మున్నగు వాని బాహ్యపరిణామములు పరప్రకృతిని తెలియజేయు రూపములు గావు, ఆధ్యాత్మికశక్తియుక్తమగు వాని మూలగుణమే, వాని "స్వభావమే" (8-3) పరప్రకృతిని దెలుపుమ. ఇంద్రియాదిరూపమున అభివ్యక్తమగుచున్న మూలసత్త యొక్క బలము, దాని చేతనయొక్క ప్రకాశము, దాని శక్తియొక్క సామర్థ్యము: ఇవియొక విశుద్ధ, ప్రాథమిక చిహ్నమున ప్రకటమై నపుడు స్వభావమగును. ఈ బలము, ప్రకాశము, సామర్థ్యము : ఇదియే తక్కిన వస్తువు లన్నింటికి బీజము.

కావున ఈ పరంపరయందలి మిక్కిలి వ్యాపక పదము నిట్లు గీత వచించును – "నన్ను, ఓ పార్థ, సర్వభూతముల సనాతన బీజముగా నెఱుంగుము (7–10)." ఈ సనాతన బీజము ఆధ్యాత్మికసత్త్వముయొక్క మూలశక్తి, సత్తయందలి సచేతన సంకల్పము; గీత ఇతరత్ర చెప్పునట్లు (14–3), భగవంతు డీ బీజమునే మహద్బ్రహ్మయందు, అతిమానస విశాలతయందు స్థాపించును, దానినుండియే సర్వ భూతములు బాహ్యప్రపంచమున జన్మించును. ఏ భగవత్సత్తాబీజము సర్వభావము లందును వాని మూలగుణముగా నభివ్యక్తమగుచు, వాని స్వభావముగా నుండునో, ఈ సనాతనబీజ మదియే.

13. మూలగుణముయొక్క మూలశక్తికి, నిమ్న ప్రకృతియొక్క బాహ్య జన్యములకు (derivations), అనగా విశుద్ధ వస్తుతత్త్వమునకు, నిమ్న వస్తు రూపములకు గల వ్యావహారికభేదము ఈ పరంపరాంతమునందు స్పష్టముగా సూచింపబడినది – "నేను కామ, రాగ వివర్జితమైన బలవంతుల బలమును, నేను భూతములందలి తమధర్మమునకు విరుద్ధముగాని కామమును (7–11)." పోగా మనో ఽవస్థలు, కామవికారములు, ఆవేగక్రియలు, ఇంద్రియప్రతిక్రియలు, బుద్ధియొక్క పరిమిత, ద్వంద్వమయఖేలనము, వేదన మఱియు నైతికభావముయొక్క వృత్తులు– ఇవి ప్రకృతియొక్క గౌణములగు ఆంతరికభావములు – "భావాః" (7–12), ఈ సాత్త్విక రాజసిక, తామసిక భావములు త్రిగుణవ్యాపారములు : ఇవి స్వరూపముగా పరమ ఆధ్యాత్మికప్రకృతియొక్క విశుద్ధకర్మ గావు, దానినుండి ఉత్పన్నమైన జన్యములని గీత మనకు దెలుపును – "అవి నానుండియే," "మత్తఏవ" వానికి మఱియొక మూలము లేదు, "కాని నేను వానియందు లేను, అవి నాయం దున్నవి (7–12)." ఇచ్చట సూక్ష్మమైనప్పటికి, బలమైన విభేదము గన్పించును. భగవాను డిట్లు చెప్పినట్లగును – "నేను మూలప్రకాశమును, బలమును, కామమును, శక్తిని, బుద్ధిని, కాని వీని జన్యములగు సాత్త్వికాదిభావములు నా మూలతత్త్వము గావు, నా మూలమున నేనవిగాను, మఱియు నేను వానియందు లేను; అయినను అవి నానుండి వచ్చినవే; మఱియు నా సత్తయం దుండునవే." కావున మన మీ వచనముల ఆధారము పైననే పరప్రకృతినుండి నిమ్నప్రకృతిని, నిమ్నమునుండి తిరిగి పరమునకు వస్తుసంక్రమణమును వీక్షింపదగును.

14. "నేను బలవంతుల బలమును" – అను ప్రథమవచనము దుర్బోధము గాదు. తనలో బలరూపమగు దివ్యప్రకృతి యున్నప్పటికి, బలవంతుడును కామరాగములలోనికి పడిపోవును, పాపములోనికి జారిపడును, శ్రమపడి పుణ్యమును సాధించును. కాని దీనికి కారణము, అతడు తన బాహ్య కర్మయందు గుణముల పట్టులోనికి దిగజారునే గాని, ఆ కర్మను తన శుద్ధదివ్య ప్రకృతినుండి శాసించుటలేదు. అయితే నిమ్నక్రియలచేత ఆ దివ్యబల మేమాత్రము వికృతము గాదు, ఎట్టి మలినీకరణము, ఎట్టి పతనము ప్రాప్తించినను, అది తన మూలమునందు యథాతథముగనే యుండును. కాగా భగవంతు డతని బలము నందుండి, ఆ బలముచేతనే తన నిమ్నజీవనముయొక్క కలతలయం దుండి అతనిని వెలికి నడుపుచుండును; దీని ఫలితముగా నతడు వెలుగును తిరిగి పొంది, ఆ వెలుగు చేత తన జీవనమును సమగ్రముగా ప్రదీప్త మొనరించి, తన ఉచ్చతరప్రకృతి యందలి దివ్యేచ్ఛయొక్క శుద్ధశక్తిచేత తన యిచ్ఛను, దాని కర్మలను శాసించ గలుగును–అస్తు, కాని భగవంతుడెట్లు కామము కాగలడు ? (7–11). నిర్జించవలసిన మహాశత్రువుగా ని కామము నిరూపించబడినది గదా ? (3–41) కాని ఈ కామము గుణముల నిమ్నప్రకృతికి జెందిన కామము, దీని మూలము రజోగుణము – "రజోగుణ సముద్భవః" (3–37). కాగా శ్లోకము (7–11) ప్రస్తావించిన కామము ఆధ్యాత్మికము, ధర్మమునకు విరుద్ధముగాని యిచ్ఛ.

15. కాని ఆధ్యాత్మికకామమున కర్థము నైతికస్వభావము గల సాధుకామ మగునా, సాత్త్వికకామ మగునా ? – ఏలన సాధుత సదా తన మూలమునందును, ప్రేరకశక్తియందును సాత్త్వికమే యగును. అపుడిచట పరస్పరవ్యాఘాతము స్పష్టముగానే తలయెత్తును–ఏలన అనంతర పంక్తియందే సర్వ సాత్త్వికవికారములు దివ్యములు గావనియు, నిమ్న విక్రియలు మాత్రమే యనియు ప్రకటింపబడినది (7–12). నిశ్చయముగా, భగవంతుని సమీపింప దలచినచో, పాపమును పరిత్యజించవలసినదే ; కాని భగవత్తత్త్వములో ప్రవేశింప దలచినచో, పుణ్యమును (సాధుతను) గూడ అతిక్రమించవలసినదే, సాత్త్వికస్వభావము నందుకొనవలెను, కాని పిమ్మట దాని నతిక్రమించవలెను. దివ్యప్రకృతి వెగయుటకు వలయు విశుద్ధికి నైతికకర్మ ఒక సాధన మాత్రమే, కాని ఆప్రకృతి స్వతః ద్వంద్వములకు బైనుండును. నిజాని కట్లు గానిచో బలవంతుడును రాజసికావేగములకు అధీను డగును గాన, అతని

యందును విశుద్ధమగు నెట్టి దివ్యసన్నిధి గాని, దివ్యబలము గాని యుండజాలదు. ధర్మము, ఆధ్యాత్మికార్థమున, సదాచారము గాని, నీతిమత్త్వము గాని కాదు. అన్యత్ర (18–47) గీత నిర్దేశించు నట్లు, ధర్మ మన స్వభావనియతమగు కర్మ, వ్యక్తి నిజప్రకృతియొక్క మూలనియమముచే నియతమగు కర్మ. మఱియు స్వభావ మన భగవత్ప్రకృతియొక్క విశుద్ధగుణము, ఈ గుణమునందు ఆ ప్రకృతియొక్క సచేతన ఇచ్ఛాబలమును, విశిష్టకర్మశక్తియు నిండియుండును. కావున ఇచ్చట కామ మన మనయందు పనిచేయు భగవదిచ్ఛ యగును, ఇది నిమ్నప్రకృతి సుఖమును గాక, తన స్వీయఖేలనము, మఱియు స్వీయపరిపూర్తికి సహజమగు ఆనందము నన్వేషించును. కావున ఇచ్చటి కామము స్వభావనియమము ననుసరించి తన సచేతన క్రియాశక్తిని ప్రసరింపజేయు దివ్యమగు జీవనానందమును కామించు కామము.

16. సర్వ భావములు తన సత్తయం దున్నను, భగవంతుడు ఆ భావము లందు, సాత్త్విక భావములందు సైతము, లే డని చెప్పుటకు (7–12) మఱల నర్థ మేమి ? ఒక అర్థమున అతడు వానియం దుండుట అనివార్యము, లేనిచో వానికి మనుగడయే లేదు. కాగా ఉద్దేశించిన అర్థమేమన, భగవంతుని పరమ ఆధ్యాత్మిక ప్రకృతి వానియందు బంధించబడదు ; అవి భగవంతుని సత్తయందుండు వికారములు, అహంకారాజ్ఞానముల క్రియ వానిని ఆ సత్తనుండియే సృజించును. అజ్ఞానము సర్వమును తలక్రిందుగాజూపును, మఱియు కనీసము ఆంశికముగా మిథ్యానుభవమును గలిగించును. ఎట్లన, ఆత్మ శరీరమునం దున్న దనియు, అది ప్రాయః శరీరజన్య మనియు మనము దలంతుము ; మన అనుభవము సైతము నదియే ; కాని నిజానికి శరీరమే ఆత్మయం దున్నది, మఱియు ఆత్మజన్యమై యున్నది. భౌతిక మఱియు మానసికఘటనల మహారాశియందు, పురుషుని మనలోని ఒక స్వల్పభాగముగా మనము దలపోతుము – "అంగుష్ఠమాత్ర పురుషుడు" (కఠ ఉప.) : వస్తుతః ఈ మహారాశి, ఎంత సాటోపముగా గన్పించినను, పురుషుని అనంతసత్తయందు కడుచిన్న వస్తువు. ఇటుల నిచ్చటను భగవంతుడు భావములం దున్నా డనుటకంటెను, అవియే అతనియం దున్న వని చెప్పుటొప్పును. వస్తువులను తలక్రిందుగా జూపించి, వానికి హీనతత్త్వము నాపాదించు త్రిగుణముల ఈ నిమ్నస్వభావమే భ్రమకారకశక్తియగు మాయ యనబడును. మాయ సర్వథా లేనే లే దనియు, లేక అది మిథ్యావస్తువులతోనే

వ్యవహరించు సనియు దీని అర్థము గాదు; పరంతు అది మన జ్ఞానమును తికమక చేయును, మిథ్యామూల్యములను సృజించును, మనలను అహంకారమున మఱుగు పఱచును, మఱియు నట్లు మన జీవనముయొక్క పరమసత్యమును దాచివేయును – అనియే దీనికర్థము. భ్రాంతికరమగు నీ మాయ మనమేయగు భగవంతుని, అనంతాక్షరతత్త్వమును మనదృష్టినుండి మాయముచేయును–"గుణమయములగు ఈ త్రివిధభావములచేత ఈజగమంతయు మోహితమై, వీనికంటెను పరుడను,అక్షరుడను అగు నన్ను గుర్తించదు(7–13)".మన అస్తిత్వముయొక్క పరమసత్యము భగవంతుడే నని మనము చూడగలుగుదు మేని, అపుడు మన దృష్టికి తక్కిన దంతయు గూడ మాఱిపోయి, తన వాస్తవరూపమును ధరించును, మఱియు మన జీవనకర్మలు దివ్యమూల్యములను బొంది, దివ్యప్రకృతి ధర్మము ననుసరించి వర్తించును.

17. కాని ఇంతకు భగవంతుడే సర్వత్ర యున్నప్పటికి, మఱియు దివ్యప్రకృతియే సమ్మోహకమగు గుణభావముల మూలమునందు సైతము ఉన్నప్పటికి, ఇంకను మనము జీవుడము మఱియు పరప్రకృతియే స్వయముగా జీవుడయినప్పటికి, ఈమాయను దాట నెందుకింత కష్టమగుచున్నది? ఇది భగవంతుని మాయయే గనుక; "దైవీహ్యేషా గుణమయీ మమ మాయా" (7–14)– "ఇది గుణమయమగు నా దివ్యమాయ." ఈ మాయ స్వయముగా దివ్యమే, మఱియు భగవంతుని ప్రకృతియొక్క ఒక పరిణామమే, అయితే ఈ భగవంతుడు దేవతల ప్రకృతిని గలిగియున్న భగవంతుడు. ఈ మాయ దివ్యము – "దైవీ", అనగా దేవతల మాయ, లేక, అట్లు చెప్పదలంచినచో, దేవాధిదేవుని మాయ, అయితే ఈ దేవాధిదేవుడు విభక్తమగు తన ఆంతరిక (Subjective) మఱియు నిమ్న విశ్వభావములందు – సాత్త్విక, రాజసిక, తామసిక భావములందున్న భగవంతుడు. ఇట్లు విశ్వావరణరూపమున నున్న మాయను భగవంతుడు మన బుద్ధిచుట్టును అల్లియున్నాడు; బ్రహ్మ, విష్ణు, మఱియు రుద్రుడు దాని దారములను జటిలముగా నేసియున్నారు; పరమశక్తి, పరప్రకృతి దాని ప్రతిదారమునందును గుప్తముగా నున్నది. ఈ జాలము పనిని మనయందు సమాప్తముగావించి, దానిద్వారానే ముందుకు వడిచి, దాని ప్రయోజనము తీరిన పిమ్మట, దానిని వెనుక విడిచివేయవలెను; దేవతలను విడిచి, మూలభూతుడగు దేవాధిదేవునికి మఱలవలెను. అతనియందు దేవతలు మఱియు వారికర్మల పరమార్థమును, మన స్వీయ అక్షరాస్తిత్వముయొక్క

గూఢతమ ఆధ్యాత్మికసత్యములను ఏకకాలమున కనుగొనగలము. “నా వైపుకు తిరిగి నన్ను ఆశ్రయించిన వారుమాత్రమే ఈ మాయను తరించగలరు (7–14).”

## 2. [1] భక్తిజ్ఞానముల సమన్వయము

1. గీతలో ప్రసంగవశమున తాత్త్వికభావములు రాశులుగా తలయెత్తినను, గీత ఆధ్యాత్మికతత్త్వశాస్త్రము గాదు; కారణము, గీత ఎట్టి ఆధ్యాత్మికసత్యమును తాత్త్వికదృష్టితో లేవనెత్తదు. అది అత్యున్నత సత్యమును అత్యున్నత వ్యావహారికోపయోగము నిమిత్తమే అన్వేషించును గాని, బౌద్ధిక లేక ఆధ్యాత్మికతృప్తికొఱకు సైతము గాదు; మనలను ప్రమాదమునుండి కాపాడి, మర్త్యమగు అపూర్ణతనుండి అమరమగు పూర్ణతకు గల మార్గమును తెలుచు శక్తినిగానే అది సత్యము నన్వేషించును. కనుక ఈ అధ్యాయముయొక్క మొదటి పదునాలుగు శ్లోకములందు మన కావశ్యకమగు నొక ప్రముఖదార్శనికసత్యమును ప్రతిపాదించి, వెంటనే తర్వాతి పదునాలు శ్లోకములందును దాని వ్యావహారికోపయోగమును దెలుపును. ఆ సత్యమును కర్మ జ్ఞాన భక్తుల సమన్వయమునకు మూలము గావించును – ఏలన కర్మజ్ఞానముల ప్రాథమికసమన్వయము ఇతఃపూర్వమే సాధించబడినది (4–41....).

2. ఇపుడు మనముందు మూడు శక్తులు గలవు – జీవుని పరమసత్యమగు పురుషోత్తముడు, సర్వాత్మ మఱియు జీవుడు. లేక నిట్లు చెప్పవచ్చును – పరమ పురుషుడు, అక్షరబ్రహ్మము, అనేకాత్మ; ఈ అనేకాత్మయే మన ఆధ్యాత్మిక వ్యక్తిత్వమునకు కాలాతీత ఆధారము, సత్య సనాతన వ్యష్టిపురుషుడు – “మమైవాంశః సనాతనః” (15–7). ఈ ముగ్గురును భగవదాత్మకులే, ఈ ముగ్గురును భగవంతుడే. సత్తయొక్క పరమ ఆధ్యాత్మిక ప్రకృతి, పరప్రకృతి పురుషోత్తమ ప్రకృతి యగును; ఇది అవచ్ఛేదక అజ్ఞానమునకు అధీనము గాదు. అదే దివ్య ప్రకృతి నిర్గుణాత్మయందును గలదు, కాని ఇచ్చట దది తన సనాతన విశ్రాంతి,

---

[1] గీత : అధ్యాయము 7, శ్లోకములు 15–28.

తుల్యత, (eqilibrium), నిష్క్రియతావస్థయం దుండును. చివరకు, అదే పర ప్రకృతి కర్మచేయు నిమిత్తము బహురూప వ్యష్టిపురుషుడు, జీవు డగును. కాని ఈ పరప్రకృతియొక్క అంతరక్రియ సదా ఆధ్యాత్మిక దివ్య కర్మగా నుండును. పరమపురుషుని సత్తయొక్క చిన్మయసంకల్పమే జీవుని మూలగుణముయొక్క వివిధమగు నాధ్యాత్మికశక్తిరూపమున తనను దాను ప్రకటించుకొనును ; మూల భూతమగు నీ ఆధ్యాత్మికశక్తియే జీవుని స్వభావ మగును. ఈ స్వభావమునుండి సరాసరి ప్రభవించు సమస్తకర్మయు, సంభూతియు ఆధ్యాత్మిక కర్మయు, దివ్య సంభూతియు నగును. కావున తేలిన దేమన, మానవుడు తన ఆధ్యాత్మికవ్యక్తిత్వ మును తిరిగి చేరుకొన యత్నించవలెను ; తన కర్మల నన్నింటిని ఆ వ్యక్తిత్వము యొక్క దివ్యశక్తినుండియే ప్రవహింపజేయవలెను ; మనోభావము మఱియు ప్రాణకామనలద్వారా కాక, క్రియ నంతను అంతరాత్మ మఱియు దాని స్వభావముల ద్వారానే వికసింపజేయవలెను ; మఱియు తన కృత్యముల నన్నింటిని భగవత్సం కల్పముయొక్క ఒక విశుద్ధస్రోతస్సులోనికి, తన జీవనము నంతను దివ్యప్రకృతి యొక్క ఒక సక్రియసంకేతములోనికి మార్చివేయవలెను.

3. ప్రాకృతజీవుడు - దివ్యజీవుడు : కాని గుణమయ నిమ్నప్రకృతియు గలదు, దీని స్వభావము అజ్ఞానస్వభావము, దీని క్రియ అజ్ఞానక్రియ, ఈ క్రియ సంకీర్ణము, వ్యత్యస్తము, విపరీతముగా నుండును ; ఇది అహంకారరూప మగు ప్రాకృతవ్యక్తి క్రియగాని ఆధ్యాత్మికవ్యక్తి క్రియ గాదు. అహంకారము యొక్క ఈ మిథ్యావ్యక్తిత్వమునుండి బైటబడుటకే మనము నిర్వ్యక్తికాత్మ నాశ్ర యించి, దానితో నేకముగావలెను. అపుడు అహంకారవ్యక్తిత్వమునుండి విడివడి, పురుషోత్తమునితో సత్యవ్యక్తికి గల సంబంధమును గనుగొనగలము. ఈ సత్య వ్యక్తి, వైయక్తికుడు గనుక, క్రియయందును, కాలాధీన అభివ్యక్తియందును పురుషోత్తమునియొక్క ఆంశికశక్తి మఱియు రూపవిశేషమే యైనను, సత్తయం దతనితో సాక్షాదేకము. అటులే నిమ్నప్రకృతినుండియు విముక్తులమై, పర, దివ్య, ఆధ్యాత్మికప్రకృతిని బొందగలము. కావున కామాత్మనుండి వ్యవహరించుట అంత రాత్మనుండి వ్యవహరించుట గాజాలదు ; ఏలన కామాత్మ ఉన్నత అంతరసత్త గాక, నిమ్న బాహ్యరూపము మాత్రమే. అనగా, అంతఃప్రకృతి లేక స్వభావము ననుసరించి వర్తించుట యన అహంకారముయొక్క ఆవేగములనుండి వర్తించుట గాజాలదు,

అటులే గుణముల అస్థిర ఖేలనమునుండి పుణ్యపాపములను ఉదాసీనముగానో, సకామముగానో ఆచరించుటయు గాజాలదు. ఆవేగమునకు లోబడిన ఎట్టి పాపాను వర్తనమును అత్యున్నత నిర్వ్యక్తికాత్మయొక్క ఆధ్యాత్మికశమమునకు గాని, దివ్య వ్యష్టి – పురుషునియొక్క ఆధ్యాత్మికకర్మకు గాని మార్గ మెంతమాత్రము గాదు. పోగా ఈ వ్యష్టిపురుషుడు పరమపురుషుని సంకల్పముయొక్క ఒక వాహినియు, పురుషోత్తమునియొక్క ఒక ప్రత్యక్ష సంభూతియు నగును.

4. <u>ముందు సత్త్వగుణాధిపత్యము</u> : దివ్యజన్మకు, అనగా ఉచ్చతర జీవనమునకు ప్రప్రథమనియమము రాజసికకామమును, దాని సంతానమును వధించుట యని గీత ఆదియందే విధించియున్నది (3–41), మఱియు దాని కర్తము పాపబహిష్కరణము. పాప మన నిమ్నప్రకృతియొక్క కర్మవిధానము; ఇది ప్రకృతిపై పురుషునియొక్క నియంత్రణమును, ఆధిపత్యమును ధిక్కరించి, మూఢ లేక ఘోర, తామసిక లేక రాజసిక ప్రవృత్తుల నీచపరితృప్తికొఱకు ప్రయత్నించును. నిమ్నప్రకృతి చేయు నీ బలాత్కారమును బాపుకొనుటకు, ఆ ప్రకృతియొక్క ఉత్తమమగు సత్త్వగుణమును మన మాశ్రయించవలెను; ఏలన ఇది సదా సామరస్య పూర్ణమగు జ్ఞానప్రకాశమును, ధర్మయుక్తమగు కర్మనియమమును వెదకుచుండును. ప్రకృతియందు నివసించుచు, గుణముల వివిధవృత్తులను అనుమతించుచుండు పురుషుడు, మన సత్తయందు అట్టి కర్మనియమము నన్వేషించు సాత్త్వికవృత్తికిని, సాత్త్వికసంకల్పమునకును అనుమతి నీయవలెను. మన ప్రకృతియందలి సాత్త్విక సంకల్పము మనను శాసించవలెను గాని, రాజసిక, తామసికసంకల్పము గాదు. ఇదియే యథార్థ నైతిక సంస్కృతియొక్క అర్థము, ఇదియే సమున్నత కర్మవివేచన యొక్క అభిప్రాయము. ఈ సత్త్వధర్మము మనయందలి ప్రకృతియొక్క నిమ్నము, అస్తవ్యస్తమునగు కర్మనుండి ఉన్నతము, వ్యవస్థితమునగు కర్మపరిణామమునకు బ్రయత్నించును; ఇది దుఃఖమును, అశాంతిని గొనితెచ్చు అజ్ఞానావేగములందు గాక, అంతఃసుఖమును, సమతను, శాంతిని బుట్టించు జ్ఞానము మఱియు ప్రబుద్ధ సంకల్పములందు బనిజేయజూచును. ఉత్తమగుణమగు సత్త్వశాసనమును ముందు మనలో వికసింపజేయ మేని, గుణములను దాటి పోజాలము.

5. <u>సత్త్వగుణమును దాటుట సులభతరము</u> : " మూఢులు, నరాధములు

వగు పాపకర్ములు నన్ను బొందరు ; కారణము, మాయ తమ జ్ఞానము నపహరించగా, వారు ఆసురప్రకృతి నాశ్రయింతురు" (7–14) – అని పురుషోత్తముడు హెచ్చరించును. వంచనశిల్పియగు నహంకారము అంతరాత్మను వంచించుటయే ఈ విమూఢత కర్థము. పాపకర్ముడు మానవప్రకృతియొక్క నిమ్నతమ స్తరమున తన ప్రియతమాహంకారమును సర్వదా తృప్తిపఱుపజూచును, అహంకారమే అతని వాస్తవభగవంతుడు ; కావుననే అతడు భగవంతు నందుకొనజాలడు. త్రిగుణముల మాయావ్యాపారములోనికి లాగివేయబడిన అతని మనోబుద్ధులు అంతరాత్మకు సాధనములుగా గాక, అతని కామములకు స్వయంవంచిత కరణములుగా పనిచేయును. అతడు నిమ్నప్రకృతినే జూచును గాని, తన శ్రేష్ఠాత్మను, ఉత్తమసత్తను, అనగా తనలోపలి, ప్రపంచములోపలి భగవంతుని జూడడు. ఆతడు కామాహంకారముల పరముగానే ప్రపంచలక్ష్యమును తన బుద్ధికి వివరించి చెప్పును ; కామాహంకారములనే సేవించును. ఎట్టి ఉచ్చతర ప్రకృతిని, ధర్మమును ఆకాంక్షించక, కామాహంకారములనే సేవించుట అసురుని మనఃస్వభావములను గలిగియుండుటయే యగును. ఆవశ్యకమగు ప్రథమసోపానముగా, ఉచ్చతరప్రకృతిని, ధర్మమును ఆకాంక్షించవలెను ; కామనియమముకంటె శ్రేష్ఠమగు నియమమును పాలించవలెను ; అహంకారముకంటె నుదాత్తమగు భగవద్రూపమును గుర్తించి, పూజించవలెను ; ఒక యోగ్యచింతకుడును, యోగ్యకర్తయు గావలెను. ఇదియు స్వయముగా సరిపోదు ; ఏలన సాత్త్వికమానవుడు సైతము గుణవిమోహమునకు వశుడే ; కారణము, అతడింకను ఇచ్ఛాద్వేషములచేత నియంత్రితుడే – "ఇచ్ఛాద్వేష...." (7–27), అతడింకను ప్రకృతిరూపముల పరిధిలో చరించువాడే, అతని కింకను సర్వోన్నత, అతీత, సమగ్రజ్ఞాన మబ్బలేదు. అయినను తన నైతికలక్ష్యమునందు సంతత ఊర్ధ్వముఖాకాంక్షచేత నతడు తుదకు పాపగ్రహణమునుండి, అనగా రాజసిక కామావేశముల గ్రహణమునుండి ముక్తుడగును, మఱియు త్రివిధమగు మాయాశాసనమునుండి విమోచనసమర్థమగు విశుద్ధప్రకృతిని బొందును. పుణ్యముచేతనే మానవుడు పరమును బొందజాలడు, కాని [1]పుణ్యముచేత పరమును బొందు అధికార

[1] స్పష్టముగానే ఇది ఆంతరపుణ్యము, అనగా విచారము, భావము, స్వభావము, ప్రేరణ, ప్రవర్తనలయందు సాత్త్విక స్వచ్ఛత గాని, సాంప్రదాయిక లేక సామాజిక సుగుణము గాదు. – శ్రీ అ.

మును బొందగలడు. ఏలన ప్రచండరాజసికాహంకారమును లేక ప్రమాధతామసికా హంకారమును వదిలించుకొని, క్రిందికి నెట్టివేయుట కష్టతరము; కాని సాత్త్వికా హంకార మంత కష్టముగాదు, పైగా నది అభ్యాసముచేత తగినంత సూక్ష్మము, ప్రసన్నము నైనపుడు, దానిని అతిక్రమించి, రూపాంతరమొందించుట లేక మార్చు మాపుట సులభముసైతము నగును.

6. భక్తిప్రవేశము: కావున మానవుడు మున్ముందుగా నైతికము — "సుకృతి"—గావలయును; పిమ్మట కేవలనైతికమగు జీవనవిధానమునకు పైనుండు ఉన్నతులకు, అనగా ఆధ్యాత్మికప్రకృతియొక్క ప్రకాశము, విశాలత, శక్తిస్థానములకు కెగయవలెను; అచ్చటతడు "ద్వంద్వమోహమున" (7–27) కావల వర్తించును. అచ్చటికి నతడు తన వైయక్తికహితమును లేక సుఖమును అన్వేషించడు, అటులే తన వైయక్తికదుఃఖమును లేక వేదనను జూచి భయపడడు, ఏలన అతడు దీనిచే వీనిచే ప్రభావితుడు గాడు; మఱియు "నేను పుణ్యాత్ముడను," "నేను పాపాత్ముడను" అనియు నడడు, పరంతు తన సమున్నత దివ్యప్రకృతియందు భగవదిచ్ఛ ననుసరించి లోకసంగ్రహార్థము కర్మ సేయును. ఇందునిమిత్తము ఆత్మజ్ఞానము (4–23), సమత (2–48), నిర్వ్యక్తికత (2–45) ప్రథమావశ్యకము లని మనము చూచియే యున్నాము, మఱియు నివియే కర్మజ్ఞానముల సమన్వయమునకు, మఱియు ఆధ్యాత్మికతకును, ప్రపంచమునందు ప్రవృత్తికిని మధ్య సమన్వయమునకును మార్గ మని తెలిసికొనియే యున్నాము. కాని గీత యిపుడు తన కర్మయోగమును జ్ఞానయోగముతో నేకముగావించిన కర్మయోగికి మఱియొక అధికతర ఆవశ్యక వస్తువును విధించుచున్నది. కర్మజ్ఞానములే కాక, ఇపు డతనినుండి భక్తియు నపేక్షింపబడుచున్నది — పరమపురుషునియందు ప్రేమ, అతని ఆరాధన, అతని విషయకమగు అంతరాత్మకామన. ఇంతదనుక నీ భక్తి ప్రకటముగా విధించబడ నప్పటికి, దానికి మార్గము వేయబడనది, చూడుడు: దివ్యగురువు తన యోగము యొక్క ఒక మలుపుగా, ఈశ్వరునికి జేయు యజ్ఞములోనికి సర్వకర్మల పరివర్తన మును విధించును (3–9, 4–23), మఱియు దాని పర్యవసానముగా సర్వకర్మలను నిర్గుణాత్మలోనికి గాక, ఎవనినుండి సమస్తసంకల్పమును, శక్తియు ప్రభవించునో, అట్టి పరమపురుషునిలోని కర్పింపవలె నని చెప్పును (3–30). అక్కడ నేది గర్భితముగా నుండెనో, ఇచ్చటది ప్రకటింపబడగా, గీతాధ్యేయమును మన

వానియొక్క పరస్పరాభిముఖమగు రెండు పార్శ్వములు మాత్రమే యని తెలియ వచ్చును. కృష్ణు డిట్లు తెలుపును – " అక్షర, నిర్వ్యక్తిక పురుషుడు (అనగా ఆధ్యాత్మిక సత్త) గలడు, మఱియు క్షర, సవ్యక్తికపురుషుడు గలడు (15–16). ఇంకను మఱియొక ఉత్తమపురుషుడు గలడు ; పరమాత్మ యనబడు నితడు లోకత్రయము నావేశించి భరించును, ఇత డీశ్వరుడు, అవ్యయుడు (15–17). క్షరమున కతీతము గాను, అక్షరమునకు పరమునందును నున్న ఈ పురుషోత్తముడనే నేను (15–18). న న్నిట్లు పురుషోత్తమునిగా నెఱింగినవాడు తన సర్వ - జ్ఞానముతోను, సర్వభావము తోను నన్ను భజించును (నాయందు భక్తిపూర్ణుడై యుండును) (15–19). " సమగ్ర జ్ఞానముతోను, సమగ్ర ఆత్మసమర్పణముతోను గూడిన ఈ భక్తికే ఇపుడు గీత పూర్ణరూప మివ్వనున్నది.

9. <u>జ్ఞానసహిత భక్తి ఉత్తమము</u> : [1] ఏలన గీత శిష్యునినుండి అపేక్షించునది జ్ఞానసహిత భక్తి యని గమనించవలెను ; గీతాదృష్టిలో తదితర భక్తిరూపములు స్వయముగా మంచివే గాని, అవి హీనరూపములు ; అవి అవాంతరభక్తి గావచ్చును గాని, ఆత్మయొక్క పరమోత్కర్షమును సాధించు పరభక్తి గాజాలవు. రాజసికాహంకారముయొక్క పాపమునకు స్వస్తిచెప్పి, భగవదభిముఖముగా పయనించు వారిలో గీత చతుర్విధభక్తులను జూచును (7–16)–1. ఆర్తుడు : శోకసంతాపములనుండి రక్షణ స్థానముగా భగవదభిముఖమగు వాడు, 2. అర్థార్థి : లౌకిక ప్రయోజనము నిమిత్తము అతని నన్వేషించువాడు, 3. జిజ్ఞాసువు : జ్ఞానము నపేక్షించి అతని నాశ్రయించు వాడు, 4. జ్ఞాని : జ్ఞానముతో నతని భజించువాడు. ఈ భక్తు లందరిని గీత ఆమోదించును గాని, చివరివాని పైననే తన సంపూర్ణసమ్మతిని ముద్రించును. ఈ భక్తి విధము లన్నియు ఉదారములే – " ఉదారాః సర్వ ఏవైతే " (7–18), కాని జ్ఞాన సంపన్న భక్తి అన్నింటిని మించును – " విశిష్యతే " (7–17). ఇచ్చట మన మిట్లు పరిగణించవచ్చు : ప్రథమభక్తి ప్రాణిక–భావిక [2] ప్రకృతికి సహజమగు భక్తి ;

---

[1] ఈ ' ఏలన'కు 8 – వ పేరా అంతముతో సంబంధము.

[2] భక్తిచరిత్రయందు ఉత్తరకాలీనభక్తి తన మూలమునందు అంతరాత్మభక్తి యగును ; అది తన హీనరూపములందు, లేక మిక్కిలి బాహ్యాభివ్యక్తియందు మాత్రమే ప్రాణిక–భావికము. – శ్రీ అ.

ద్వితీయభక్తి వ్యావహారిక, సక్రియప్రకృతికి జెందును; తృతీయభక్తి తర్కమయ బౌద్ధికప్రకృతికి జెందును; చతుర్థభక్తి అత్యున్నతమగు అంతర్జ్ఞానమయసత్తకు జెందును, ఈ భక్తి తక్కిన ప్రకృతినంతను ఉద్ధరించి, భగవంతునితో ఏకముచేయును. అయినను, వ్యావహారికముగా తక్కిన భక్తిరూపములు పూర్వాంగము లనుకొన వచ్చును. ఏలన గీతయే ఇట్లు నుడువును: సమగ్రజ్ఞానమును బొంది, జన్మజన్మ మున దాని ననుష్ఠించిన పిమ్మటనే, అనేకజన్మల అంతమునందే జ్ఞానభక్తుడు పరాత్పరుని ప్రాపించగలడు (7-19). కారణము, వాసుదేవుడే సర్వమను జ్ఞాన ప్రాప్తి మిక్కిలి దుష్కరము, మఱియు నట్టి జ్ఞానమును బొందగలిగి, తన సంపూర్ణ సత్తతోను, తన ప్రకృతియొక్క సర్వప్రకారములందును, సర్వతోముఖమగు తన జ్ఞానముయొక్క విస్తృతశక్తిచేతను పరాత్పరునిలో ప్రవేశింపగలిగిన "మహాత్ముడు" ఈ పృథివియందు కడు దుర్లభుడు (7-19) – "సర్వవిత్, సర్వభావేన" (15-19).

10. <u>సకామభక్తి గుణదోషములు</u>: ఇపు డీ శంక బొడమును – భగవంతునికొఱకు భగవంతుని గాక, లౌకికలాభములకొఱకో, శోకనివృత్తికొఱకో భగవంతు నన్వేషించు భక్తి యెట్లు ఉదారమగును? ఇట్టి భక్తియందు అహంభావము, దౌర్బల్యము, కామము ప్రాబల్యము వహించవా? మఱియు నిది నిమ్న ప్రకృతి వ్యాపారము గాదా? ఇంకను, ఎచ్చట "వాసుదేవః సర్వ మితి" (7-19)-యను సమగ్రజ్ఞానము లేదో, అచ్చట భక్తుడు తన స్వీయావసరము, స్వభావము, ప్రకృతులకు అనురూపమగు భగవంతుని భిన్నభిన్న నామరూపములను గల్పించుకొని, సాహాయ్యార్థము లేక తన లాలసల పూరణార్థము వానినే పూజించును. భగవంతుని స్థానమున అతడు ఇంద్రునో, అగ్నినో, విష్ణువునో, శివునో కల్పించును; లేక దివ్యీకృత క్రీస్తునో, బుద్ధునో కల్పించును; అథవా ప్రాకృతగుణముల ఒక సముచ్చయమును గల్పించును, అనగా, దయాప్రేమల సౌమ్యభగవంతునో, ధర్మన్యాయముల తీక్ష్ణభగవంతునో, క్రోధదండముల భీషణభగవంతునో కల్పించును; లేక వీనిలో కొన్నింటియొక్క మిశ్రరూపమునో కల్పించును; కల్పించి ఆ దేవత ముందు సాగిలబడి, లౌకిక శుభమునో, దుఃఖనివారణమునో, భ్రాంతిమయము, స్వమతాంధము, బౌద్ధికము, అసహిష్ణువు నగు జ్ఞానమునకు సాంప్రదాయిక సమ్మతినో ఆ దేవతనుండి కోరుకొనును. ఒక దశవఱకు నిది యెంతయు మంచిదే. కాని సర్వ

వ్యాపి వాసుదేవుడే యిది యంతయు (7-19) నని యెఱింగినవాడు సుదుర్లభుడు. నానావిధ బాహ్యకామనలు మానవులను పెడదారి బట్టించి, అంతర్జ్ఞానము యొక్క కార్యపద్ధతిని హరించి వేయును - "కామైః తైః తైః హృతజ్ఞానాః" (7-20). ఇట్లు పరదేవతాజ్ఞానమును గోల్పోయి, తమ కామముల కనురూపముగా నుండు ఇతరదేవతల నాశ్రయింతురు - "ప్రపద్యంతే అన్యదేవతాః" (7-20). మఱియు విట్లు తమను సంకుచితపఱచుకొని, తమ ప్రకృత్యవసరము దీర్చు ఈ యా నియమమునో, ఆచారమునో స్థాపింతురు. మఱియు దీనియందంతటను వారు ఒక అదమ్య వైయక్తికనిర్ణయమునే, తమ ప్రకృతియొక్క ఈ సంకుచితావసరమునే అవలంబించి, దానినే పరమసత్యముగా గొందురు - అనంతమును, దాని విశాలతను అవలంబింప వారింకను అసమర్థులు. ఈ దేవతారూపములం దున్న భగవంతుడే, వారి శ్రద్ధ పూర్ణమగు నేని, వారికి కామ్యముల నిచ్చును ; కాని ఈ కామ్యఫలము లును, భోగములును తాత్కాలికములు, మఱియు క్షుద్రబుద్ధియు, అపక్వహేతువును మాత్రమే వీని అన్వేషణమును తమ మతము మఱియు జీవనముల సూత్రము గావించుకొనును. మఱియు నీ మార్గమున ఏ మేరకు ఆధ్యాత్మికప్రాప్తి గలుగునో, ఆమేర కది దేవతల ప్రాప్తియే యగును. ఇక నీ దేవతలు క్షరప్రకృతిరూపములం దున్న భగవంతుడు మాత్రమే గాని, స్వస్వరూపమునం దున్న పూర్ణభగవంతుడు గాడు. కాని ఎవరు అతీత, పూర్ణభగవంతు నారాధింతురో, వారు దీని నంతను అలింగనముగావించుకొని, రూపాంతర మొందింతురు, అనగా దేవతలను తమ ఉత్తమసత్యమునకును, ప్రకృతిని తన ఉత్తమ శిఖరములకును లేవనెత్తుదురు, మఱియు స్వయముగా దేవతలను దాటి వెళ్ళి, పూర్ణభగవంతునే చేరుకొందురు - "దేవాన్ దేవయజో యాంతి, మద్భక్తా యాంతి మామపి" (7-23).

11. విమ్నభక్తి పరభక్తికి మార్గము : అయినను, ఈ భక్తుల దృష్టి అపూర్ణ మనిచెప్పి, భగవంతుడు వీరిని నిరాకరించడు. కారణము, భగవంతుడు తన అతీతసత్తయందు అజుడు, అవ్యయుడు, ఈ ఆంశికరూపముల కన్నింటికి పరుడును గావున, ఏ ప్రాణికిని సులభముగా తెలియబడడు. అతడు తన అమేయమాయా పటలమునందు స్వయమావృతుడై యుండును (7-25). ఇది అతని యోగమాయ - 'యోగ' మనగా, దీనిచేత అతడు ప్రపంచముతో నొకటిగా నుండియు, దాని కావల నుండును ; హృదయములందుండియు, ప్రతిప్రాణికిని ప్రకటము గాడు.

ప్రకృతియందలి అభివ్యక్తులన్నియు అతని కర్మలు, శక్తులు, ముసుగులే యైనను, ప్రకృతిగతుడగు మానవుడు వానిని భగవంతుడే యని భావించును (7–24). భగవంతుడు గత, వర్తమాన, భావిభూతము లన్నింటిని ఎఱుంగును గాని, అతని నెవ్వరు నెఱుంగరు (7–26). ఇట్లు తన క్రియాకలాపముతో భూతములను మోహమున ముంచిన పిమ్మట, ఆ క్రియలయం దతడు వాని నేమాత్రము కలిసికొనడేని, అపు డిక మానవునికి భగవత్ప్రాప్తిని గుఱించిన ఎట్టి ఆశయు నుండదు. కావుననే తమ ప్రకృతి ననుసరించి, వా రే మార్గమున భగవంతుని సమీపింతురో, అట్టి భక్తినే భగవంతు డంగీకరించి, దానికి తన దివ్యప్రేమతో సమాధాన మిచ్చును (4–11), ఇంతకు దేవతాదిరూపములు భగవంతునియొక్క ఒక అభివ్యక్తియే, దానిద్వారా అపూర్ణ మానవబుద్ధి భగవంతుని స్పృశించగలుగును, అటులే మన అంతరాత్మ అతనివైపుకు తిరుగుటకు ఈ కోరికలును ఒక ప్రథమసాధనమే ; మఱియు భక్తి ఎంత సంకుచితమైనను, అది కేవలము వ్యర్థము, విఫలము గాదు. ఏలన ప్రతి భక్తికిని విశ్వాసము పరమావశ్యకము– "ఏయే భక్తుడు నా ఏయే రూపమును విశ్వాసముతో నర్చింపగోరునో, అతని ఆ విశ్వాసమును నేను దృఢము, అచలము గావింతును " (7–21). తన అర్చనావిధానమునందలి ఆ విశ్వాసబలముచేత నతడు తన కామమును బొందుటయే గాక, అప్పటికి తనకు తగిన ఆధ్యాత్మికోపలబ్ధిని గూడ బొందును. భగవంతు నుండి తన సర్వకల్యాణమును బొందజూచుచు, చివరకు భగవంతుని యందే తన సర్వకల్యాణమును బొందజూచు స్థితికి వచ్చును. అటులే భగవంతునిపైననే తన సర్వసుఖములకు నాధారపడుచు, చివరకు భగవంతునియందే తన సర్వసుఖమును నెలకొల్ప నేర్చుకొనును. అటులే గుణరూపములందు భగవంతుని దెలిసికొనుచు, చివర కతనిని సర్వముగాను, సర్వవస్తువుల ప్రభవమగు సర్వాతీతముగాను [1] తెలిసికొనును.

---

[1] పరాత్పరప్రాప్తికి పిమ్మట సైతము, అల్పతరమగు మూడు భక్తిభావములకును ఒక తావుండును, అయితే అప్పు డవి సంకుచిత వైయక్తికరూపమున గాక, పరివర్తితరూపమునం దుండును. ఏలన అపుడును ప్రపంచమునందలి దుఃఖమును, అశుభమును, అజ్ఞానమును దొలగించి, పరమకల్యాణమును స్థాపింప నుత్కటేచ్ఛ యుండవచ్చును. – శ్రీ అ.

12. భక్తిజ్ఞానము లేకము : ఇట్లు ఆధ్యాత్మికవికాసముచేత భక్తి జ్ఞానముతో నేకమగును. జీవుడు ఒకే భగవంతునియందు రమించ నారంభించును – ఈ భగవంతునే అతడిపుడు సమస్తసత్తగను, చేతనగను, ఆనందముగను, మఱియు సర్వవస్తువులు, ప్రాణులు, ఘటనలుగను తెలిసికొనియున్నాడు ; మఱియు నీ భగవంతునే ఆత్మయందును, ప్రకృతియందును, తదతీతమగు పరముగను దర్శించి యున్నాడు. అతడతనితో సదా "నిత్యయుక్తుడు" (12–2). అతని సమస్త జీవనమును, సత్తయు స్వయముగా నిపు డొక సనాతనయోగము – ఎవనికంటెను పరతరము లేదో (7–7), అట్టి పరమపురుషునితో యోగము; ఎవనికంటెను అన్యము లేదో, అట్టి విశ్వపురుషునితో యోగము. ఎట్టి అంశికదేవతయందు, విధియందు, లేక సంప్రదాయమునందు గాక, అతని భక్తి యంతయు ఒక్క భగవంతునియందే కేంద్రీకృతమై యున్నది – "ఏకభక్తిః" (7–17). ఈ అనన్యభక్తియే అతని సంపూర్ణ జీవనధర్మము, ఇపుడతడు సమస్త మతవిశ్వాసములను, ప్రవర్తనా నియమములను, వైయక్తికలక్ష్యములను అతిశయించియున్నాడు. సర్వానందమయుని బొందియున్నాడు గాన, ఇపుడతనికి దూరముచేయవలసిన దుఃఖ మేదియు లేదు. సర్వపరిపూర్తిని క్షణములో సాధించు సర్వశక్తి యొడిలో నున్నాడు గాన, అతనికి వేటాడవలసిన కామము లేవియు లేవు. తా, నే జ్యోతిలో నివసించుచున్నాడో, దానినుంచి సర్వజ్ఞానము నతనిపైకి ప్రవహించును గాన, అతని కిపు డే సందేహము లును లేవు. అతడు భగవంతుని పరిపూర్ణముగా ప్రేమించును, మఱియు నతనికి ప్రియుడు ; అతడు భగవంతునియందు రమించు నట్లే, భగవంతుడును అతనియందు రమించును (7–17). ఇతడు జ్ఞానవిలసితుడగు భగవద్భక్తుడు – "జ్ఞానీ భక్తః". మఱియు నీ జ్ఞాని, నా ఆత్మయే యని భగవంతుడు పలుకును (7–18) ; ఇతరులు భగవంతునియొక్క ప్రకృతిగతమగు రూపములనే బొందుచుండగా (7–23), ఇతడు సరాసరి పురుషోత్తముని ఆత్మసత్తను, విశ్వసత్తనే బొందును ; కారణము అతడతనితో నిత్యయుక్తుడు. అతనికి పరప్రకృతిలో తిరిగి దివ్యజన్మ ఘటిల్లినది – ఈ దివ్యజన్మ సత్తయందు సమగ్రము, సంకల్పమునందు సంపూర్ణము, ప్రేమయందు అనన్యము, జ్ఞానమునందు సంసిద్ధము. ఈ దివ్యజన్మ మిక్కిలి యుక్తమే, కారణము, దీనివలన జీవుడు తనను దా నతిశయించి, తనయొక్క సంపూర్ణము, అత్యున్నతము వగు సత్యమును గనుగొనగలిగెను.

# 3. [1] పరమ పురుషుడు

1. రెండు ప్రధానభావములు : ఇప్పటికే ఏడవ అధ్యాయమున జరిగిన చర్చ పూర్ణతరము, సునిర్దిష్టము నగు నొక నూతన ప్రాతిపదికను మనకు సమకూర్చును. ఆ చర్చాసారాంశ మిది : మన మంతర్ముఖులమై, ఒక మహత్తరచేతనకును, ఒక పరమ అస్తిత్వమునకును అభిముఖముగా నడువవలెను ; అయితే ఈ గమనమునందు మన విశ్వప్రకృతిని సర్వథా త్యజించరాదు, దాని సారతత్త్వమును పైకి గొనిపోయి, ఆధ్యాత్మికముగా పూర్ణముగావించదగును. మర్త్యమగు మన అపూర్ణత నుండి దివ్యపూర్ణతలోనికి మార్పు మాత్రమే జరగవలెను. దీని సంభవతకు ఆధారముగా నున్న ప్రథమ భావ మిది : మానవునియందలి వైయక్తికాత్మ తన సనాతన స్వరూపమునందును, మూలశక్తియందును పరమాత్మయొక్క ఒక తేజఃకిరణము, అతని సత్తయొక్క ఒక సత్త, అతని చేతనయొక్క ఒక చేతన, అతని ప్రకృతి యొక్క ఒక ప్రకృతి ; కాని ఈ మనోమయ, అన్నమయ జీవితములయొక్క అంధకారమునందు అది తన ప్రభవమును (source), సత్యతను, స్వభావమును స్వల్పముగా మఱచిపోవును. ఇక ద్వితీయభావ మేమన, అభివ్యక్తియందు అంతరాత్మ ప్రకృతి ద్వివిధము — 1. మూలప్రకృతి, దీనియం దది తన స్వీయ, సత్య, ఆధ్యాత్మిక సత్తతో నేకమై యుండును, 2. గౌణప్రకృతి, దీనియం దది అహంకారాజ్ఞానములు గల్పించు కల్లోలమున కధీనమై యుండును. ఈ రెండవ దానిని త్రోసిపుచ్చి, ఆధ్యాత్మిక ప్రకృతిని తిరిగి పొంది, దానిని పూర్ణము, సశక్తికము, సక్రియము చేయవలెను. ఆంతర స్వయంపరిపూర్తిద్వారా, ఒక నూతన ధామమును తెఱచి, ఒక నూతన శక్తియందు తిరిగి జన్మించి, భాగవతప్రకృతిని తిరిగి చేరుకొని, ఎవని నుండి మన మీ మర్త్యరూపములోనికి దిగివచ్చినామో, తిరిగి మన మట్టి భగవంతుని అంశ మగుదుము.

2. భక్తి సర్వోత్తమసాధనము : గీతాసమకాలీనమగు సాధారణ భారతీయ మనోవృత్తి నిషేధాత్మకము కాగా, ఇచ్చట తక్కువ నిషేధకము (negative),

[1] గీత : అధ్యాయము 7, శ్లోకములు 29, 30 ; మఱియు అధ్యాయము 8.

ఎక్కువ విధాయకము (affirmative) నగు గీతాప్రవృత్తి గన్పించును. సిద్ధియందు మానవుని ప్రకృతియొక్క ఆత్మవినాశనమునకు బదలు పరప్రకృతియందు దాని పరిపూర్తిరూపమగు విశాలతరపరిష్కార మిచ్చట దర్శన మిచ్చును. భక్తి సంప్రదాయముల నిన్న మొన్నటి వికాసముయొక్క ఛాయలు సైతము ఆనాటి గీతయందు బొడకట్టును. అయినను గీతాదృష్టిలో, అహంకారము మఱుగున గుప్తముగా నుండి మనకు ముందు దర్శనమిచ్చు తత్త్వము ప్రశాంతము, విశాలము, నిర్వ్యక్తికము నగు అక్షరాత్మ ; దీనియొక్క సమతయందును, ఏకత యందును క్షుద్రమగు మన ఆహంకారికవ్యక్తిత్వము రూపుమాసిపోవును, దీని ప్రశాంతశుద్ధతయందు కామప్రేరణలు కరిగిపోవును. మన ప్రథమానుభవ మిట్లున్నను, సమగ్రతరమగు మన ద్వితీయదర్శన మొక సజీవానంతుని, అపరిమేయ దివ్యపురుషుని ఆవిష్కరించును ; అతనినుండియే మన సర్వస్వము ప్రభవించును, అతనికే మన సర్వస్వము జెందును - పురుషప్రకృతులును, బ్రహ్మజగత్తులును, ఆత్మభావమునందును, పురుషభావమునందును మన మతనితో నేకమైనపుడు, మనము మనలను గోల్పోవుటకు బదులు, అతని సర్వాధిక్యమునందు నెలకొని మన యథార్థ స్వరూపమును దిరిగి పొందుదుము. మఱియు నిది ఏకకాలమున మూడు సమకాలీన వృత్తులచే సాధించబడును - 1. అతని మఱియు మన ఆధ్యాత్మిక ప్రకృతియందు నెలకొని, ప్రవర్తించు కర్మలద్వారా ఒక సమగ్ర ఆత్మదర్శనము, 2. ఎవనియం దంతయు నుండునో, ఎవ డంతయునో, అట్టి దివ్యపురుషుని జ్ఞానముద్వారా ఒక సమగ్ర ఆత్మవికాసము, మఱియు - 3. ఇది సర్వశ్రేష్ఠము, నిశ్చాయకము నగు వృత్తి - మన సంపూర్ణ సత్తయొక్క భక్తిప్రేమలద్వారా ఈ విశ్వాత్మునికి, పరమాత్మ నికి ఒక సంపూర్ణ ఆత్మసమర్పణము ; మన కర్మాధీశ్వరునికి, మన హృదయనివాసికి, మన జీవనాధారమునకు ఆకర్షింపబడి, ఇట్లు సమర్పించుకొందుము. మన సర్వస్వము నకు మూలమైన వానికి మన సర్వస్వము నర్పించుకొందుము. సంతతసమర్పణముచే మన జ్ఞానశక్తి అతని జ్ఞానముగాను, మన సమస్తక్రియ అతని శక్తిప్రకాశముగాను మాఱును. మన ఆత్మసమర్పణయందలి ప్రేమవేగము మనను పైకి అతనిదగ్గరకు గొనిపోయి, అతని గభీరతమహృదయరహస్యమును మనకు తెఱచిచూపును. ఇట్లు ప్రేమ, యజ్ఞముయొక్క త్రిసూత్రమును పూర్తిచేసి, ఉత్తమరహస్యము (4-3) యొక్క త్రయాత్మక కీలకమును సిద్ధపఱచును.

3. <u>అంత్యజ్ఞాన మెట్లు గలుగును ?</u> — మన ఆత్మసమర్పణయందు, సమగ్ర జ్ఞానము దాని కార్యసాధక శక్తికి ప్రథమనియమము. కావున ముందు మన మీ దివ్య పురుషుని తన దివ్యసత్తయొక్క సమస్తశక్తులు మఱియు తత్త్వములందు—"తత్త్వతః" (7-3)—తెలిసికొనవలెను. కాని ప్రాచీనుల దృష్టికి, తత్త్వజ్ఞానముయొక్క మూల్య మంతయు మనలను జరామరణములనుండి ఒక పరమభావముయొక్క అమృతత్త్వము లోనికి విడిపించు సామర్థ్యమునందే యుండెను. కావున తన శ్రేష్ఠరూపమునం దీ విముక్తియు ఆధ్యాత్మిక ఆత్మపరిపూర్తినిమిత్తము తాను వివరించిన ప్రక్రియయొక్క ఒక చరమఫల మెటు లగునో, గీత మన కిపుడు చూపును. ఫలదృష్ట్యా పురుషోత్తమ జ్ఞానము, పరిపూర్ణబ్రహ్మజ్ఞానము ఒకటే యని గీత వచించును. ఎవరు తమ ఆశ్రయముగా, తమ దివ్యజ్యోతిగా, తమ ఉద్ధారకర్తగా, తమ ఆత్మలను గ్రహించి, ధరించువానిగా నన్ను ఆశ్రయింతురో, కృష్ణుడు చెప్పును, జరామరణమోక్షము నిమిత్తము తమ మర్త్యభావమునుండి నావైపుకు మఱలుదురో, వారు బ్రహ్మను, సమగ్ర ఆధ్యాత్మికప్రకృతిని, సమస్తకర్మను దెలియగలరు, (7-29). మఱియు వారు న న్నెఱుంగుదురు గావునను, మఱియు నదే కాలమున జడప్రకృతిని, దైవ ప్రకృతిని, యజ్ఞేశ్వరసత్యము నెఱుంగుదురు గావునను, ప్రయాణకాలముయొక్క విషమక్షణమునందు సైతము నా జ్ఞానమును గలిగియుండి, తమ సంపూర్ణచేతన యందును నాతో నేకమైయుందురు (7-30). కనుక వారు నన్ను బొందుదురు. నిర్వ్యక్తిక బ్రహ్మమున తమ వ్యక్తిత్వమును గోల్పోవువారియంత నిశ్చయముగాను, నా భక్తులు సాక్షాత్తు నా పరమపదమును బొందుదురు. ఇట్లు గీత మహత్త్వపూర్ణము, నిశ్చయకరము నగు సప్తమాధ్యాయమును సమాప్తము గావించును.

4. <u>విశ్వతత్త్వములు :</u> ఇచ్చటి ఈ పారిభాషికపదములు ప్రపంచము నందు భగవదభివ్యక్తియొక్క ప్రధాన, మూలభూత సత్యములను సంక్షేపముగా మనకు దెలుపును. ప్రపంచముయొక్క ప్రవర్తకము (originative) మఱియు నిర్వాహకము (effective) నగు తత్త్వము లన్నియు, సమగ్ర ఆత్మజ్ఞానముయొక్క పునఃప్రాప్తికి అంతరాత్మకు గావలసిన దంతయు నిచ్చట గలవు. 1. "తద్ బ్రహ్మ," ఆ బ్రహ్మ ; 2. "అధ్యాత్మం", ప్రకృతిగతమగు ఆత్మతత్త్వము ; 3. "అధిభూతం" మఱియు "అధిదైవం", సత్తయొక్క విషయగతరూపము మఱియు విషయిగత రూపము ; 4. చివరకు "అధియజ్ఞః", కర్మయజ్ఞరూపమగు విశ్వతత్త్వరహస్యము.

నేను, కృష్ణుడు పలుకును, వీని యన్నింటికి పైనుండు పురుషోత్తముడును, అయినను ఏకకాలమున వీని యన్నింటిద్వారాను, క్రమముగా వీనిద్వారాను నన్ను దెలిసికొన వలెను– తిరిగి నన్ను బొందగోరు మానవచేతన కిది యొక్కటే సంపూర్ణమార్గము. కాని ఈ పదముల అర్థము స్వయముగా స్పష్టము గాదు, కనీస మవి విభిన్నవ్యాఖ్యల కవకాశ మిచ్చును; కావున వెంటనే వాని వివక్షితార్థమును స్పష్టీకరింపు మని అర్జునుడు గోరగా, కృష్ణుడు సంక్షిప్తసమాధాన మిచ్చును – గీత ఎచ్చటను శుద్ధ తాత్త్వికవివరణ కెక్కువ కాలము వెచ్చించదు; అంతరాత్మ సత్యమును గ్రహించి, తదనుభవపథమున సాగుటకు వలసినంతయే, వలసినరీతిగనే గీత తత్త్వముల వివరించును. అస్తు. 'తద్బ్రహ్మ' పదమును ఉపనిషత్తులు ప్రాకృతపురుషునికి ప్రతి రూపుడగు స్వయంభూపురుషుని పరముగానే అసకృత్తుగా ప్రయోగించియుండగా, గీత దీనిని అక్షరమగు ఆత్మభావపరముగా నుద్దేశించినట్లు గన్పించును; ఇది భగవంతునియొక్క పరమ ఆత్మప్రకటనము, దీని అవికార్యనిత్యత్వముపైననే పరిణామ శీలియగు సవికారజగ మంతయు నాధారపడియుండును–"అక్షరం పరమం" (8–3). అధ్యాత్మ మన, పరప్రకృతిగతమగు (7–5) అంతరాత్మసత్తయొక్క ఆధ్యాత్మికసంభూతియు, ధర్మమును. కర్మ యన, సృష్టి ప్రవృత్తి మఱియు శక్తియు వగు 'విసర్గమునకు' (8–3) పేరు; ఈ విసర్గము స్వభావమునుండి, అనగా మొదటిదియగు ఆత్మసంభూతినుండి సర్వవస్తువులను సృజించును, మఱియు దాని ప్రభావము క్రింద ప్రకృతియందు వాని బాహ్యసంభూతిని సాధించును. పోగా అధిభూత మన, బాహ్య లేక క్షరసంభూతిఫలితమగు బాహ్యజగత్తు – "క్షరభావః" (8–4). అధిదైవత మన, పురుషుడు (8–4), ఇతడు నిమ్నప్రకృతిగతమగు అంతరాత్మ లేక విషయి (subjective) పురుషుడు; ఇతడు తన మూలస్వభావమునుండి కర్మచేత ప్రకృతియందు సాధించబడిన క్షరసంభూతి నంతను విషయముగా నీక్షించుచు, నుపభోగించును. చివరకు అధియజ్ఞుడు, యజ్ఞకర్మల అధీశ్వరుడు – అన నేనే యని కృష్ణుడు నుడువును, ఈ అధియజ్ఞుడు సదేహములగు సర్వభూతముల దేహములందు గుప్తముగా నుండు పురుషోత్తముడు (8–4). కావున ఉన్న దంతయు నీ తత్త్వముల సూత్రములోనికి వచ్చివేయును.

5. తత్త్వముల సంబంధములు : ఈ సంక్షిప్తవివరణకు వెనువెంటనే గీత జ్ఞానముచేత చరమముక్తికి సంబంధించిన భావమును వివరింపదొడంగును –

ఈ జ్ఞానమును సప్తమాధ్యాయ చరమశ్లోకమున గీత సూచించియే యున్నది. తర్వాత ఈ విషయమును గీత మఱల (8–9,10) చేపట్టి, అభ్యాసమునకు, అంతఃసాక్షాత్కారమునకు అధికతర ప్రకాశ మిచ్చును గాన, అప్పటివఱకు వేచియుందము. కాని ఇంకను ముందుకు సాగకపూర్వము, ఈ బ్రహ్మాది తత్త్వముల మధ్యగల సంబంధములను అర్థముచేసికొను టావశ్యకము. ఏలన ఇచ్చట విశ్వక్రమమునకు సంబంధించిన గీతాభావము సూచితమైనది. ముమ్మందు బ్రహ్మము గలదు, ఇది అత్యున్నతము, స్వతఃసిద్ధము నగు అక్షరభావము ; దేశ–కాల–నిమిత్తములకు లోబడి సాగు విశ్వప్రకృతిఖేలనము వెనుక, సర్వభూతములును ఈ అక్షరబ్రహ్మమే యైయున్నవి. ఏలన దాని స్వతఃసిద్ధ సత్తచేతనే దేశకాలనిమిత్తములు వర్తించ గలుగును ; సర్వగతమైనను, అవిభాజ్యమగు దాని అవికార్య ఆధారము వినా, అవి తమ విభజనలు, ఫలితములు, మఱియు మానములయందు ప్రవర్తింపజాలవు. అయినను ఈ అక్షరబ్రహ్మ స్వయముగా నేదియు చేయదు, దేనిని చేయించదు, దేనిని నిర్ణయించదు ; అది అపక్షపాతి, సమము, సర్వధరము, కాని అది వరించదు, ప్రారంభించదు. అయితే ప్రారంభించున దేది ? నిర్ణయించున దేది ? పరుని దివ్య సంకల్పమున కేది సాధనము ? కర్మను నియమించుచు, సనాతనసత్తనుండి కాలము లోపల విశ్వసంభూతిని విస్తరింపజేయున దేది ? స్వభావరూపమున నున్న పరప్రకృతి. ఈ ప్రకృతిక్రియకు తన అవిచల అక్షరాత్మను పురుషోత్తము డాధారముచేయును. ఇట్లతడు తన దివ్యసత్తను, చేతనను, సంకల్పము లేక శక్తిని ప్రకటించును : ఏతత్త్రియమే పరప్రకృతి– "యయేదం ధార్యతే జగత్" (7–5). పరప్రకృతియం దుండు పరమపురుషుడు తన సత్తయందు జీవుని ఆధ్యాత్మిక స్వభావమునకు సంబంధించిన సత్యమును వేఱుచేసి, తన ఆత్మజ్ఞాన ప్రకాశమున దాని సక్రియ భావమును కనుగొనును. ప్రతి జీవుని జీవాత్మయొక్క ఏ అంతఃస్థిత సత్యము మఱియు తత్త్వము గలవో, ఏది తన క్రియచేత తన అభివ్యక్తిని సాధించుకొనునో, అన్నింటియందును ఏ మూలభూత దివ్యప్రకృతి వాని సమస్త పరివర్తనలు, భ్రష్టాచారములు, పునఃపతనముల వెనుక స్థిరముగా నుండునో, అదియే స్వభావము. స్వభావగతమైన దంతయు విశ్వప్రకృతిలోనికి విడువబడును, అపు డా ప్రకృతి పురుషోత్తముని అంతశ్చక్షువుక్రింద దాని బాహ్యరూపమును సాధించును. మూఱని స్వభావమునుండి, అనగా ప్రతిసంభూతికిని మూలమగు సత్తనుండి, ఆ స్వభావమును ప్రకటించు వివిధభావములను ప్రకృతి సృజించును,

నామరూపములందును, దిక్కాలములందును, కార్యకారణ నియమము ననుసరించి సర్వపరివర్తనలను బహిర్గతముచేయును.

6. <u>ప్రకృతిగత ఆత్మ క్షరపురుషుడు</u> : ఇట్లు ఒక స్థితినుండి మఱియొక స్థితిలోనికి పరివర్తనను సాధించుచు, తత్త్వమును బహిర్గతము చేయునది కర్మ యనబడును ; ఈ కర్మ ప్రకృతిశక్తి, ప్రక్రియాదేవత. దీని ప్రథమరూపము స్వభావమును తన సృజనాత్మకక్రియలోనికి విడిపించుట- "విసర్గః" (8-3) -" యగును. ఇచ్చట సృజన మన భూతసృష్టి-"భూతకరః", మఱియు వాని అంతరంగ రూపమగు భావసృష్టి- "భావకరః". కర్మయొక్క సృజనాత్మకశక్తియే ఈ సృష్టి కంతటికి కారణము. ఈ క్షరభావము, "అధిభూతము" (8-4) అంతయు ప్రకృతి శక్తుల సంఘాతమునుండి వెడలుచున్నది. ఈ అధిభూతమే జగత్తు మఱియు పురుష చేతనకు విషయము. ప్రకృతిస్థుడగు నీ పురుషుడే (13-22) భోక్తయు, ద్రష్టయు నగు దేవత ; మనస్సు, సంకల్పము, ఇంద్రియము, మున్నగునవి పురుషుని చేతన సత్తయొక్క శక్తులు, వీనిద్వారానే అతడు ప్రకృతిక్రియ తనయందు ప్రతిబింబించు కొనును, వీనినే "అధిదైవ" మందురు. కావున ప్రకృతిస్థుడగు నీ పురుషుడే "క్షరపురుషుడు", భగవంతుని సనాతన కర్మరూపము. ప్రకృతినుండి బ్రహ్మ - ములోనికి ఉపసంహరించుకొనిన ఈ పురుషుడే "అక్షర పురుషుడు", భగవంతుని సనాతన మౌనరూపము. కాని క్షరపురుషుని రూపమునందు, శరీరమునందు పరమ పురుషుడు నివసించును, ఇతడు ఏకకాలమున అక్షరసత్తయొక్క శాంతిని, క్షరక్రియ యొక్క భోగమును గలిగియుండు పురుషోత్తముడు. ఇతడు ఎక్కడో పరమున పరమపదమునం దుండుటయే గాక, మానవుని హృదయమునందును ప్రకృతియందును గలడు. అచ్చట అతడు ప్రకృతికర్మల నొక యజ్ఞముగా స్వీకరించును, మఱియు మానవుని బుద్ధిపూర్వకమగు నాత్మసమర్పణకు వేచియుండును ; కాని మానవుని అహంకారావస్థయందు సైతము అతడు అతని స్వభావముయొక్క అధీశ్వరుడుగాను, కర్మలయొక్క నియామకుడుగాను నుండును, అతని కంటిక్రిందే ప్రకృతి మఱియు కర్మనియమము పనిచేయును. అంతరాత్మ అతనినుండియే వెలువడి, ప్రకృతి పరివర్తనల ఖేలనమున ప్రవేశించెను ; అక్షరాత్మద్వారా తిరిగి అతని దగ్గరకే, అతని పరమధామము (15-6) నకే వచ్చిచేరును.

7. అంత్యస్మృతి ప్రాధాన్యము : ఈ లోకములోనికి దిగిన మానవుడు ప్రకృతికర్మల కధీనుడై ఇహపరముల మధ్య తిరుగుచుండును. ప్రకృతిమయుడగు పురుషుడు – ఇది యతనిని దెలుపు సూత్రము, అనగా నితనియందలి ఆత్మ దేనిని చింతించునో, ధ్యానించునో, చేయునో, సదా అదియే యగును. అత డేదిగా నుండెనో, అది యంతయు నతని యిప్పటి జన్మను నిర్ణయించెను ; ఇక నత డీ జీవితమున ఏదిగా నున్నాడో, దేనిని చింతించునో, చేయునో, అదియంతయు పరలోకములలోను, భావిజన్మలలోను అత డేమి యగునో దానిని నిర్ణయించును. జన్మ యొక సంభూతి (becoming) యగుచో, మరణము గూడ నొక సంభూతియే గాని, వినాశ మెంత మాత్రము గాదు. " త్యక్త్వా కలేవరం " (8–5) – శరీరమును విడిచి, ఆత్మ తన మార్గమున బోవును. సంధిక్షణమగు నంతిమక్షణమునందలి భావముపై భావి యెంతగనో ఆధారపడును. ఏలన అంతిమక్షణమున ఆత్మచేతన ఏ సంభూతిరూపమున నిలిచియుండునో, మఱియు నే రూపముతో దాని మనోబుద్ధులు జీవితము పొడవునను నిండియుండెనో (8–6), ఆ రూపమునే అది పొంది తీరును ; కారణము, ప్రకృతి కర్మద్వారా ఆత్మయొక్క ఆలోచనలకును, ఊర్జములకును (energies) కార్యరూప మిచ్చును ; నిజాని కదియే ప్రకృతి సంపూర్ణవృత్తి. కావున మానవాత్మ పురుషోత్తమపదము నందగోరుచో, రెండు ఆవశ్యకతలు, రెండు నిబంధనలు గలవు. ఒకటి, తన పార్థివజీవనమున మానవుడు తన ఆంతరజీవితము నంతను తన ఆదర్శమున కనుగుణముగా మలచవలెను ; రెండవది, తన ప్రయాణసమయమున తన అకాంక్షాసంకల్పములను నిలబెట్టుకొనవలెను. " అంతకాలమున నెవడు నన్నే స్మరించుచు", కృష్ణుడు చెప్పును, " తన దేహమును విడిచి, పయనించునో, అతడు నా భావమును బొందును. " (8–5), అనగా పురుషోత్తమభావమును బొందును. అతడు భగవంతుని మూలసత్తతో నేకమగును, అదియే జీవుని పరమసంభూతి – " పరో భావః ", అదియే తన స్వరూపములోనికిని, తన మూలములోనికిని తిరిగివచ్చు కర్మయొక్క చరమఫలము. తన మూలభూత ఆధ్యాత్మికప్రకృతియగు స్వభావమును మఱుగుపఱచు విశ్వపరిణామఖేలనము ననుసరించి, అనుసరించి అంతరాత్మ తన చేతనయొక్క ఆ యా బాహ్యభావములద్వారా పయనము సాగించి, తన స్వభావమునకు దిరిగి వచ్చి, తద్వారా తన యదార్థమగు ఆత్మను, సత్తను కనుగొని, తన మూలభావమును బొందును, ఈ మూలభావమే ఆరోహణదృష్ట్యా

దాని పరభావము, ఈ పరభావమే భగవంతుని 'మద్భావము'. ఒకానొ కార్థమున అంతరాత్మ భగవంతు డగు నని మనము చెప్పవచ్చును ; ఏలన తన నిమ్నప్రకృతి మఱియు సత్తల చరమ పరివర్తనద్వారా, అది తనను భగవంతుని ప్రకృతితో సంయుక్తముగావించుకొనును.

8. స్మృతి ప్రభావము : మరణకాలమునందలి మనఃస్థితికి గీత పెద్ద ప్రాధాన్య మిచ్చును-చేతనకు గల స్వయంసృజనాత్మకశక్తిని మనము గుర్తించనిచో, ఈ ప్రాధాన్యము మనకు విశదము గాదు. ఆలోచన, అంతర్దృష్టి, శ్రద్ధ దేనియందు గట్టి పట్టుతో సంపూర్ణముగా కుదురుకొనునో, దానిలోనికే మన అంతఃసత్త రూపాంతరము నొందుటకు ప్రవృత్తమగును. ఉచ్చతరమగు ఆధ్యాత్మిక మఱియు స్వయం పరిణత అనుభవములలోనికి వెళ్లినపుడు, ఈ ప్రవృత్తి మనచేతులలో నొక నిర్ణాయక శక్తి యగును. ఏలన ఈ అనుభవములు బాహ్యవస్తువులపై చాల తక్కువ ఆధారపడును. దేనియందు మనము మనస్సును గీలించి, దేనిని సదా ఆకాంక్షింతుమో, దాని మనము అవిరతముగా నగుచుండుట నచ్చట గాంచగలము. కావున అచ్చట ఆలోచన తెగిపోయినను, స్మృతి వ్యభిచరించినను, అది జరుగుచున్న మార్పును ఆపివేయుటయే యగును, లేక దానివలన మనము పూర్వస్థితికి జాఱిపోవచ్చునుగూడ. కనుక మన మీ నూతనభావమును దృఢముగా స్థాపించుకొనువఱకును ఈ ప్రమాదముండును. అట్లు స్థాపించుకొని, దానిని మన అనుభవమునకు సామాన్యము (normal) గావించుకొనినపుడు, దాని స్మృతి స్వయముగానే నిలిచియుండును ; ఏలన ఇప్పుడది మన చేతనకు సామాన్యరూప మైనది. మర్త్యలోకమును వీడి వెడలు సంధిసమయమునందలి చేతనావస్థయొక్క ప్రాముఖ్య మిపుడు మనకు స్పష్టము. కాని యిది మన పూర్వజీవనప్రవాహముతోను, పూర్వమనఃస్థితితోను ఎట్టి సంబంధములేని, లేక వానిచేత తగినంతగా సిద్ధముచేయబడని కేవల మరణశయ్యాస్మృతి గాదు; పూర్వసన్నాహపూర్వకమైన స్మృతికే ఉద్ధరించు శక్తి యుండును. ఇచ్చట గీతాభావమునకును, జనతామతము అనుమతించు అనుకూల విషయాసక్తికిని ఎట్టి పొంతనయు లేదు. పూర్వజీవితము నెంత అపవిత్రముగా గడిపినను, మరణకాలమున పురోహితుడు వచ్చి, జలము ప్రోక్షించి, క్షమాపణమంత్రము చదివినచో, అది తప్పక 'క్రైస్తవ' మరణ మగును, లేక పవిత్ర కాశీనగరమున గాని, పావనగంగానదియందు గాని మరణించుటయే స్వర్గవిమాన మగును – అని తలంచు

జనతామతముతో గీత కెట్టి సామ్యమును లేదు. అంత్యక్షణమున మనస్సు నే దివ్యభావముపై స్థిరముగా నిలుపదగునో, భౌతిక జీవనమున ప్రతిక్షణము నా భావములోనికి అంతరాత్మ పెరుగుచు, వచ్చియుండవలెను – "తద్ భావ భావితః" (8–6). "కావుననే," దివ్యగురువు పలుకును, "సర్వకాలములందు నన్ను స్మరించుము, యుద్ధము సేయుము; ఏలన నీ మనోబుద్ధులు సదా నాయందే నిలుపబడి, నా కర్పితము లగునేని, నన్నే నిశ్చయముగా చేరెదవు (8–7). చలించని అభ్యాసయోగమునందు పరమపురుషునితో సంయుక్తమైన చేతనతో నతనిని సర్వదా చింతించుచు, సాధకుడా దివ్య, పరమపురుషుని ప్రాపించును (8–8)".

9. పరమపురుషవర్ణన : ఇపు డా పరమపురుషుని ప్రథమవర్ణన మనకు లభించును – ఈ పురుషుడు అక్షరపురుషునికంటె పరుడును, అధికుడును; ఇతనినే గీత పిమ్మట పురుషోత్తము డని పిలుచును (15–8). తన కాలాతీత నిత్యత్వమునం దితడును అక్షరుడు మఱియు నభివ్యక్తి కతీతుడు – "అవ్యక్తోఽ క్షరః" (8–21), మఱియు నిచ్చట కాలమునందు వివిధసంకేతములు మఱియు ప్రచ్ఛన్నవేషముల ద్వారా అతని అస్పష్టచ్ఛాయలు మాత్రమే మనకు గోచరించును. అయినను అతడు కేవలము నిర్విశేషము మఱియు "అనిర్దేశ్యము" (12–3) నగు సత్త గాడు; అథవా అతడు అనిర్దేశ్య మనుటకు గారణము, మనస్సు తెలియగల సూక్ష్మముకంటెను అతడు సూక్ష్మతరము, మఱియు నతని రూపము చింతనకు అతీతము – "అణోరణీయాంసం, అచింత్యరూపం" (8–9). ఈ పరమపురుషుడు సర్వద్రష్ట, కాలమునకు పితామహుడు, మఱియు తన ఆత్మదృష్టియందును, సర్వవిజ్ఞానమునందును అధీశ్వరుడు, అనుశాసకుడు; ఇతడే సర్వవస్తువులను తన సత్తయందు యథాస్థానమున నిలుపును – "కవిం, పురాణం, అనుశాసితారం, సర్వస్య ధాతారం" (8–9). ఈ పరమపురుషుడు వేదవిదులు వర్ణించు స్వయంభూ అక్షరబ్రహ్మము; యతిపుంగవులు వీతరాగులై ప్రవేశించున దితనియందే, మఱియు నితని నిచ్ఛించియే వీరు బ్రహ్మచర్యము [1] నభ్యసింతురు (8–11). ఈ సనాతన సత్యమే సత్తయొక్క సర్వోచ్చపదము (8–11); కావున నిది కాలగతమగు అంతరాత్మప్రయాణముయొక్క పరమగమ్యము, అయితే యిది స్వయముగా నొక గతి గాదు, స్థితి, ఆద్యము, పరమము నగు స్థితి లేక స్థానము – "పరం స్థానం ఆద్యం" (8–28).

---

[1] ఇచ్చటి భాష యథాతథముగా నుపనిషత్తులనుండి గ్రహింపబడినది – శ్రీ అ.

మనస్సునందుంచునిమిత్తము గీత యిచ్చట ప్రపంచయుగముల ప్రాచీనసిద్ధాంతము నవలంబించును. ఈ సిద్ధాంతము ననుసరించి, బ్రహ్మదేవుడు విశ్వమును సృజించుచు, లయముచేయుచుండును. కల్పమనబడు సృష్టికాలము అతని కొక పగలు, అంతే పరిమాణము గల లయకాలము అతని కొక రాత్రి. ప్రతికల్పమునందును వేయి మహాయుగము లుండును (8-17). పగలు ప్రారంభించగనే, భూతము లన్నియు అవ్యక్తమునుండి నిర్గమించి, వ్యక్తమగును; రాత్రి రాగనే, అన్నియు సందులో నదృశ్యము లేక లీనమగును. ఇట్లీ భూతములన్నియు సృష్టిలయచక్రమున వివశముగా దిరుగుచుండును. మఱల మఱల నని పుట్టుకలోనికి వచ్చి — "భూత్వా భూత్వా" (8-19), మఱలమఱల అవ్యక్తములోనికి బోవుచుండును. కాని ఈ అవ్యక్తము భగవంతునియొక్క ఆద్య దివ్యభావము గాదు; అతని సత్తయొక్క మఱియొక అవ్యక్తభావము గలదు (8-20), అది ఈ అవ్యక్తమునకు బరము, విశ్వాతీతము, సదా ఆత్మస్థితము; అది ప్రపంచాభివ్యక్తికి వ్యతిరేకము గాక, దాని కెంతో పైన, మాఱకయుండు సనాతనభావము; సర్వభూతములు నశించుచుండగా, నశింప నగత్యములేని భావ మది (8-20). "అవ్యక్తుడు, అక్షరుడు ననబడు నతనినే పరమగతి యందురు; అతనిని బొందినవారు తిరిగి రారు; అది నా పరమధామము" (8-21). ఏలన ఆ ధామమును బొందిన అంతరాత్మ ప్రపంచముయొక్క అభివ్యక్తి ప్రళయముల చక్రమునుండి తప్పించుకొనియున్నది.

12. <u>పరుడును సంబంధరహితుడు గాడు</u>: గీత ప్రస్తావించిన ఈ సృష్టిసిద్ధాంతమును మనము స్వీకరించినను, కొట్టివేసినను — "అహోరాత్ర విదుల" (8-17) జ్ఞానమునకు మన మిచ్చు విలువపై నిది ఆధారపడియుండును — గీత తన బోధనపరముగా దీని కిచ్చు మలుపు ముఖ్యము. ఈ పరమావ్యక్తమునకు ప్రపంచము యొక్క వ్యక్తావ్యక్తములతో నెట్టి సంబంధ మున్నట్లు గన్పించదు గాని, ఇది అనిరుక్తము, అనిర్వచనీయము నగు కేవలబ్రహ్మము గావలయును — అను ఆలోచన మనకు అనాయాసముగానే బొడవవచ్చును; అపుడు పరమపురుషుని బొందుటకు అనురూపమార్గము అభివ్యక్తియందు ప్రాప్తించిన పరిణామమునంతను వదిలించు కొనుటయే యగును గాని, బుద్ధిజ్ఞానము, హృదయప్రేమ, ఇచ్ఛాసంకల్పము, ప్రాణశక్తులయొక్క సంయుక్త ఏకాగ్రతయందు సమస్తచేతసను పైకి గొనిపోవుట గాజాలదు. సంబంధశూన్యమగు — "అవ్యవహారమగు" (మాం. ఉ.) కేవల

బ్రహ్మముపట్ల, ముఖ్యముగా భక్తికి తావులేదు. అయినను గీత ఇట్లు వక్కాణించును, - పరమపురుషుని పదము విశ్వాతీతము, సదా అవ్యక్తమే- "కాని ఎవనియందు సర్వభూతములు నుండునో, ఎవనిచేత నీ ప్రపంచము విస్తరింపజేయబడినదో, ఆ పరమపురుషుడు అనన్యభక్తిచేతనే లభ్యమగును." (8-22). అనగా నా పరమపురుషుడు మన భ్రమలకు దూరముగా, సర్వసంబంధ రహితముగా నుండు కేవల బ్రహ్మము గాడు, పరంతు అతడు ద్రష్ట, స్రష్ట మఱియు నీశ్వరుడు-"కవిం అనుశాసితారం, ధాతారం" (8-9), మఱియు నతని ఏకముగాను, సర్వముగాను - "వాసుదేవః సర్వ మితి" (7-19) ఎఱింగి, ప్రేమించుటచేత, సర్వవస్తువులందును, శక్తులందును, క్రియలందును గల అతనితో మన సమస్తచేతనయొక్క యోగమును సాధించుటద్వారా పరమసమగ్రతను, పరిపూర్ణసిద్ధిని, ఆత్యంతికముక్తిని బొంద జూడదగును.

13. మానసిక, బాహ్యముల సంబంధము : పిమ్మట మఱింత విచిత్ర విషయము గన్పించును-ప్రాచీన వేదాంతయోగులనుండి గీత దీనిని స్వీకరించినది. పునర్జన్మను బొందగోరినపుడు, లేక తప్పించుకొన జూచినపుడు, యోగి తనశరీరమును విడువవలసిన పరస్పరభిన్న కాలముల నిది నిర్దేశించును. అగ్ని, ప్రకాశము, దినము, శుక్లపక్షము, ఉత్తరాయణము - ఈ కాలములందు దేహము విడిచిన బ్రహ్మవిదులు బ్రహ్మను బొందుదురు (8-24). పోగా ధూమము లేక మంచు, రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనము - ఈ కాలములందు దేహము విడిచిన యోగి చంద్రజ్యోతిని బొందును. ఇవి శుక్ల, కృష్ణ మార్గములు; ఉపనిషత్తులలో వీనిని దేవమార్గ, పితృమార్గములందురు. వీని నెఱింగిన యోగి మోహము నందడు, దారి తప్పడు. శుక్ల కృష్ణమార్గములకు జెందిన ఈ [1] భావనవెనుక నెట్టి మానసిక-

[1] యోగానుభూతి నిజానికి మనకు జూపునదేమన, ఈ భావము అన్నియెడల సర్వథా వర్తించకపోయినను, దీని వెనుక నొక మానసిక - భౌతిక సత్య మున్నది, ఉదాహరణకు, ప్రకాశశక్తులకు, అంధకారశక్తులకు మధ్య జరుగు ఆంతరసంఘర్షమున ముందువి దినము లేక సంవత్సరముయొక్క తేజోమయసమయమందు సహజప్రాబల్యము గలిగియుండగా, తర్వాతివి చీకటి సమయమందు ప్రబలియుండును. - శ్రీ అ.

భౌతిక సత్యము లేక సంకేతపద్ధతి యున్నను, ఏ మలుపుతో గీత ఈ ప్రకరణమును ముగించుచున్నదో, దానిని మాత్రమే మనము గమనించవలెను; "కావున సర్వ కాలములందు యోగమునందుండుము" (8–27). ఒక్క విషయము : పై భావన మనకు రహస్యవాదుల (mystics) యుగమునుండి సంక్రమించినది. వీరు ప్రతి భౌతికవస్తువునందు ఒక మానసికవస్తువుయొక్క సశక్తిక సంకేతమును జూచుచుండిరి, ఉదాహరణకు, వెలుగునందు జ్ఞానసంకేతమును, అగ్నియందు ఆధ్యాత్మిక శక్తి సంకేతమును వారు గాంచిరి.

14. స్మృతి నియమములు : ఇంతకు యోగమునం దుండుటయే, సమస్త సత్తను భగవంతునితో నేకముచేయుటయే ముఖ్యము – చింతనాధ్యానములనే గాక, సమస్తజీవనమును, అనగా క్రియను, శ్రమను, యుద్ధమును సైతము భగవంతుని యొక్క ఒక స్మృతినే చేయునంత సంపూర్ణముగను, సర్వప్రకారము గను భగవంతునితో సమస్తసత్తను ఏకముచేయుటయే ముఖ్యము. "నన్ను స్మరించుము, యుద్ధముచేయుము" (8–7) – దీని అర్థమేమి ? సామాన్యముగా మన మనస్సునంతను ఆక్రమించివేయు లౌకికసంఘర్షమునందు ఒక్క క్షణము గూడ ఈశ్వరస్మరణమును గోల్పోవరాదు, మఱియు నిది ఎంతో కష్టముగను, ప్రాయః అసంభవముగను గన్పించును. దీనికి వలయు నితరనియమములు సిద్ధించినపుడే, ఇది సర్వథా సాధ్యమగును. అవి యేవి యన, 1. ఏ యేకాత్మ మన బుద్ధికి భగవంతుడుగా నుండునో, అన్నింటియందలి ఆ యేకాత్మతో చేతనయందు మన మేకముకావలెను, 2. మన చక్షువులు, ఇతర ఇంద్రియములు సైతము సర్వత్ర దివ్యపురుషునే దర్శించవలెను, అపుడు అప్రబుద్ధమగు ఇంద్రియము దర్శించునట్లు దేనిని మనము దర్శింపజాలము, పరంతు దాని రూపమున గుప్తము, వ్యక్తకము గూడనై యుండు భగవంతునిగనే దానిని దర్శింపగలము, మఱియు 3. మన సంకల్పము చేతనయందు పరమసంకల్పముతో నేకముగావలెను, మఱియు సంకల్పముయొక్క, మనస్సుయొక్క, శరీరముయొక్క ప్రతిక్రియ దానినుండి వచ్చినదిగనే, దాని చలనముగనే, దానితో పూర్ణము లేక అనన్యముగనే అనుభూతము గావలెను; అదిగో అప్పుడు గీతావిధిని సమగ్రముగా సాధించగలము. అప్పు డిక భగవంతుని స్మృతి తెగిపోవుచుండు మనఃక్రియ గాక, మన కార్యకలాపముయొక్క సహజస్థితియు, ఒక విధముగా మన చేతనయొక్క సారతత్త్వమును అగును.

10. <u>ఉత్క్రమణ ప్రక్రియ :</u> మరణముద్వారా జీవనమునుండి నిర్గమించి, యోగి యే స్థితియందు పరమ దివ్యగతిని బొందునో, గీత యిపు డా చరమ మనఃస్థితిని వర్ణించును. దాని అంగములు : అచల మానసము, యోగబల యుక్తమైన అంతరాత్మ, భక్తియందు భగవంతునితో సంయోగము - ఈ ప్రేమసంయోగము జ్ఞానముద్వారా సంభవించు నిరాకార ఏకీకరణముచే నెట్టివేయ బడదు, పరమ యోగశక్తిలో సంగముగా అది చివరివరకు నిలిచియుండును - మఱియు పూర్తిగా పైకి నాకర్షింపబడి, అంతర్దృష్టిస్థానమగు భ్రూమధ్యమున స్థాపింపబడిన ప్రాణశక్తి (8-10). ఈ స్థితియందు ఇంద్రియద్వారము లన్నియు మూయబడును, మనస్సు హృదయమున నిరుద్ధమగును, తన విక్షిప్తగతినుండి ప్రాణశక్తి మస్తకములోనికి లాగబడును (8-12) ; బుద్ధి ఓంకారోచ్చారణయందును, దాని భావనాత్మకచింతన పరమపురుషుని స్మృతియందును కేంద్రీకృతమగును (8-13)- "మా మను స్మరన్ ". ఇది సుప్రసిద్ధమగు యోగి ప్రయాణపద్ధతి, సనాతన పరమ పురుషునికి యోగి చేయు చరమ, సంపూర్ణసత్తాసమర్పణము. కాని ఇంతకు నిది యొక ప్రక్రియ మాత్రమే ; పరమగతికి ముఖ్యనియమమేమన, భగవంతునియొక్క సంతత, అనన్యస్మరణము, యుద్ధమునందు సైతము స్మరణము- " మా మనుస్మర యుధ్యచ " (8-7), మఱియు సమస్త జీవనకర్మను నిత్యయోగములోనికి మార్చుట- " నిత్యయోగ " (8-14). ఎవ డిట్లు చేయునో, అతనికి నేను సులభుడను-అని భగవానుడు చెప్పును. అతడు పరమసిద్ధిని ప్రాపించు మహాత్ముడు.

11. <u>పూర్ణయోగమునందు సైతము అపునరావృత్తి :</u> ఇట్లు నిష్క్రమించి అంతరాత్మ పొందు స్థితి విశ్వాతీతము. విశ్వమునందలి ఉచ్చతమలోకములు సైతము పునర్జన్మ కధీనములే, కాని పురుషోత్తముని బొందిన ఆత్మపై నెట్టి పునర్జన్మ విధించ బడదు (8-16). కావున కేవల జ్ఞానముద్వారా ప్రాప్తించు నిర్విశేష బ్రహ్మమునం దే ఫలము లభించునో, భక్తిజ్ఞానకర్మల సమగ్రసాధనద్వారా ప్రాప్తించు, కర్మప్రభువు, సర్వభూతసుహృదుడు నగు స్వయంభూభగవంతునియందును అదే ఫలము లభించును. అత డట్టి వా డని తెలిసికొని, ఆ రూపఘుననే బొందినచో, పునర్జన్మకును, కర్మ నియమమునకును బద్ధుడు గాడు; అనిత్యము, అసుఖము నగు మర్త్యజీవనమునుండి (9-33) శాశ్వతముగా తప్పించుకొనగోరు ఆత్మ తన కోరిక నిట్లు పూరించుకొన గలదు. జన్మచక్రమును, దానినుండి విమోచనమును మఱింత కచ్చితముగా

మనస్సుముం దుంచునిమిత్తము గీత యిచ్చట ప్రపంచయుగముల ప్రాచీనసిద్ధాంతము నవలంబించును. ఈ సిద్ధాంతము ననుసరించి, బ్రహ్మదేవుడు విశ్వమును సృజించుచు, లయముచేయుచుండును. కల్ప మనబడు సృష్టికాలము అతని కొక పగలు, అంతే పరిమాణము గల లయకాలము అతని కొక రాత్రి. ప్రతికల్పమునందును వేయి మహాయుగము లుండును (8–17). పగలు ప్రారంభించగనే, భూతము లన్నియు అవ్యక్తమునుండి నిర్గమించి, వ్యక్తమగును ; రాత్రి రాగనే, అన్నియు నందులో నదృశ్యము లేక లీనమగును. ఇట్టి భూతములన్నియు సృష్టిలయచక్రమున వివశముగా దిరుగుచుండును. మఱల మఱల నని పుట్టుకలోనికి వచ్చి – "భూత్వా భూత్వా" (8–19), మఱలమఱల అవ్యక్తములోనికి బోవుచుండును. కాని ఈ అవ్యక్తము భగవంతునియొక్క ఆద్య దివ్యభావము గాదు ; అతని సత్తయొక్క మఱియొక అవ్యక్తభావము గలదు (8–20), అది ఈ అవ్యక్తమునకు బరము, విశ్వాతీతము, సదా ఆత్మస్థితము ; అది ప్రపంచాభివ్యక్తికి వ్యతిరేకము గాక, దాని కెంతో పైన, మాఱకయుండు సనాతనభావము ; సర్వభూతములు నశించుచుండగా, నశింప నగత్యములేని భావ మది (8–20). "అవ్యక్తుడు, అక్షరుడు ననబడు నతనినే పరమగతి యందురు ; అతనిని బొందినవారు తిరిగి రారు ; అది నా పరమధామము" (8–21). ఏలన ఆ ధామమును బొందిన అంతరాత్మ ప్రపంచముయొక్క అభివ్యక్తి ప్రళయముల చక్రమునుండి తప్పించుకొనియున్నది.

*12.* <u>పరుడును సంబంధరహితుడు గాడు</u> : గీత ప్రస్తావించిన ఈ సృష్టిసిద్ధాంతమును మనము స్వీకరించినను, కొట్టి వేసినను – "అహోరాత్ర విదుల" (8–17) జ్ఞానమునకు మన మిచ్చు విలువపై నిది ఆధారపడియుండును – గీత తన బోధనపరముగా దీని కిచ్చు మలుపు ముఖ్యము. ఈ పరమావ్యక్తమునకు ప్రపంచము యొక్క వ్యక్తావ్యక్తములతో నెట్టి సంబంధ మున్నట్లు గన్పించదు గాన, ఇది అనిరుక్తము, అనిర్వచనీయము నగు కేవలబ్రహ్మము గావలయును – అను ఆలోచన మనకు అనాయాసముగానే బొడవవచ్చును; అపుడు పరమపురుషుని బొందుటకు అనురూపమార్గము అభివ్యక్తియందు ప్రాప్తించిన పరిణామమునంతను వదిలించు కొనుటయే యగును గాని, బుద్ధిజ్ఞానము, హృదయప్రేమ, ఇచ్ఛాసంకల్పము, ప్రాణశక్తులయొక్క సంయుక్త ఏకాగ్రతయందు సమస్తచేతనను పైకి గొనిపోవుట గాజాలదు. సంబంధశూన్యమగు – "అవ్యవహారమగు" (మాం. ఉ.) కేవల

అపుడు జీవుడు పురుషోత్తమునితో స్వాభావికము, ఆధ్యాత్మికము నగు తన సముచిత సంబంధమును గలిగియుండును, మఱియు మన జీవసమంతయు నొక యోగముగా నుండును; సిద్ధమైయున్నను, సదా స్వయంసాధకమగు నొక ఏకతగా నుండును.

# 4. రాజగుహ్యము

1. భగవంతునియందే తన అస్తిత్వము : సత్య మింతవఱకు మెట్టు మెట్టుగా నారోహించి, ప్రతిమెట్టునందు సమగ్రజ్ఞానముయొక్క ఒక నవ్యపార్శ్వము నావిష్కరించి, దానిపై ఆధ్యాత్మికస్థితి మఱియు కర్మలయొక్క ఒక నూతనఫలిత మును స్థాపించుచువచ్చినది – ఇపుడా సత్య మంతయు మిక్కిలి ప్రాముఖ్యముగల యొక మలుపు తిరుగనున్నది. కావున అర్జునుడు మెలకువతో వినగలందులకు, గురు వతని దృష్టిని నిర్ణాయకమగు ఆ మలుపువైపున కాకర్షింప జాగ్రత్తవహించుచున్నాడు. గురు విపుడు సమగ్ర భగవంతుని జ్ఞానమునకును, దర్శనమునకును అతని మనస్సును ఆయత్తపఱచి, ఏకాదశాధ్యాయముయొక్క విశ్వరూప దర్శనమునకు గొనిపోవ నున్నాడు; ఆ దర్శనము వలన ఈ కురుక్షేత్రవీరుడు తన సత్తా, కర్మ, కార్యముల ప్రవర్తకుడును, భర్తయు తనయందలి, ప్రపంచమునందలి భగవంతుడే యని ఎఱింగినవా డగును. అయినను తనయందు, ప్రపంచమునందు గల దేదియు అతనిని బంధించదు; కారణము, సర్వము నతని నుండియే ప్రభవించి, అతని అనంత సత్తయందే కొనసాగుచు, అతని ఇచ్ఛచేతనే ధరించబడును, అతని దివ్య ఆత్మ జ్ఞానమునందే తన అర్థమును గనును, అతడే తన ఆది మధ్యాంతముగా నుండును. నేను భగవంతునియందే ఉన్నాను, అతనియందలి శక్తిచేతనే కర్మచేయుచున్నా-నని అర్జునునికి బోధము గలుగవలెను ; అర్జునిని కర్మకలాపము దైవక్రియ కొక నిమిత్తము మాత్రమే. అతని అహంకారికచేతన పురుషోత్తముని అమరవిస్ఫులింగము గాను, అంశముగాను తనయందున్న వాస్తవపురుషుని మఱుగుపఱచు ఆవరణము మాత్రమే.

2. <u>అంతర్దర్శనముచేత సర్వసంశయనివృత్తి</u> ; అర్జునుని మనస్సులో మిగిలియుండగల సంశయమును బాపి, తనకు బల మిచ్చి, తాను వెనుదగ్గిన కర్మను జేయించుటకే విశ్వరూపదర్శనము. ఏలన మార్చరాని విధముగా నివ్వబడిన ఆ కర్మాదేశమునుండి అతడు వెనుదగ్గజాలడు; ఏల మార్చరా దనిన, అది తనయందలి భగవంతు డిచ్చిన ఆదేశము, మఱియు నిపుడు ప్రపంచమునందలి భగవంతుడుగూడ అదే ఆదేశము నివ్వనున్నాడు (11-33). ఈ భగవంతుడు విశ్వరూపము ధరించిన కాలపురుషుడుగా (11-32) మహాభయానక స్వనముతో అతనికి యుద్ధాదేశము నిచ్చును. ఆత్మవిముక్తిని సాధించుకొనుము, విశ్వ రహస్యప్రణాలికయందు నీ కర్మను నిర్వహింపుము – విముక్తకర్మలు రెండును ఒకే వ్యాపారము గావలెను – అని కాలపురుషుడు బోధించును. ఆత్మజ్ఞానము మఱియు నీశ్వరప్రకృతుల జ్ఞానముయొక్క అధికతర ప్రకాశ మర్జునునికి వివరింపబడుచుండగా, నతని బౌద్ధిక సంశయములు విడిపోవుచున్నవి. కాని బౌద్ధికసమాధానమే చాలదు; అంధప్రాయమగు తన బాహ్య మానవదృష్టిని ప్రదీప్తముగావించు నంతర్దృష్టిచే నతడు చూడవలెను ; అప్పు డతడు తన సమస్తసత్తయొక్క సమ్మతితోను, తన సర్వావయవములందు పరిపూర్ణ శ్రద్ధతోను కర్మచేయగలుగును; తన ఆత్మకు నాత్మయు, తన సత్తకు స్వామియు, అటులే ప్రపంచాత్మకు నాత్మయు, సర్వసత్తకు స్వామియు నగు వానియందు పరిపూర్ణభక్తితో కర్మచేయగలుగును.

3. <u>రెండు సంభవమార్గములు</u> : ఇంతదనుక జ్ఞానసౌధమునకు పునాది వేయబడినది, లేక దాని కావశ్యకమగు ప్రథమసామగ్రి లేక పరంజా మాత్రము సమకూర్చబడినది, కాని యిపుడు దాని ఆకృతి యంతయు నతని ఉన్మీలితనేత్రముముం దుంచబడును. ఈ అధ్యాయము తర్వాత రాబోవున దంతయు ఈ ఆకృతివిభాగములను విశ్లేషించి, వాని తత్త్వమును జూపును గాన, ఆ మేరకు దానికి ప్రాముఖ్య ముండును. కాని యే దివ్యపురుషు డతనితో భాషించుచున్నాడో, అతని సమగ్రజ్ఞానము సారతః ఇపు డతని కంటిముం దుంచబడును, ఫలితముగా నతడు తన కర్తవ్యమును చూచుటకు మాత్రమే అవకాశ ముండును గాని, ఎన్నుకొనుటకు గాదు. అజ్ఞానము మఱియు అహంకారికకర్మగ్రంథికి అర్జును డవశ్యముగా బద్ధుడు గాడని ఇంతవఱకు చేయబడిన ఉపదేశ మతనికి చూపెను. అంతకు పూర్వ మర్జును డా స్థితితోనే సంతుష్టుడై

యుండెను ; కాని యుద్ధారంభమున ఘోరవిషాదము పైకొనినపుడు, ఆ స్థితికి సహజములగు పరిష్కారము లేవియు నతనిని తృప్తిపఱచలేకపోగా, జీవనకర్మల సన్న్యాస మొక్కటే అతనికి పలాయనద్వారముగా గన్పట్టెను. అప్పు డతనికి కర్మచేయుటకును, జీవించుటకును రెండు పరస్పరవ్యతిరేక మార్గములు గలవని చూపబడెను – 1. అహంకారికాజ్ఞానమునందలి మార్గము, 2. దివ్యమగు తన అంతరాత్మయొక్క విమలజ్ఞానమునందలి మార్గము. ఇట్టియెడ అతడు కామముతో, ఆవేశముతో, అహంకారరూపమున గుణప్రేరితుడై పుణ్యపాపాది ద్వంద్వసంకుల మున కధీనుడై కర్మచేయవచ్చును; అపు డతడు తన కర్మల శుభాశుభఫలితములతో వ్యాకులుడై యుండును, ప్రపంచయంత్రాంగమునకు బద్ధుడై యుండును, కర్మాకర్మ వికర్మల మహాజంజాలమున చిక్కుకొనగా, పరివర్తనశీలమగు వాని విపరీత వేషములు మఱియు ఆభాసములు తన హృదయమును, మనస్సును, అంతరాత్మను కలచివేయు చుండును. కాని అత డజ్ఞానకర్మలకు సర్వథా బద్ధుడు గాడు, ఇష్ట మయితే, అతడు జ్ఞానకర్మలను జేయవచ్చును. అత డిచ్చట ముందు ఉచ్చతరమేధావిగను, జ్ఞాతగను, యోగిగను, ముముక్షువుగను, తర్వాత ముక్తపురుషునిగను, కర్మచేయవచ్చును. ఈ మహాసంభవతను గుర్తించి, దీనిని సాధించునట్టి జ్ఞానము మఱియు నాత్మదర్శనము లందు మనోబుద్ధులను నిల్పదగును: శోకమోహములనుండి తప్పించుకొనుటకు, మానవప్రహేళికనుండి బైటబడుట కిదియే మార్గము.

4. ఆత్మ ముక్తిస్థానము : మనలోపల నొక ఆత్మ గలదు; అది శాంతము, సమము, కర్మలకంటెను పరము (superior) అది బాహ్యజాలమున బద్ధముగాక, తదాధారరూపమున దానిని నిరీక్షించును, అది కర్మమూలము, అంతర్వర్తి సాక్షి యైనను, దానియందు చిక్కుకొనదు. అనంతము సర్వభృత్తు, అన్నింటియందు నేకాత్మయగు నది ప్రకృతిక్రియ నంతను నిష్పక్షపాతముగా నిరీక్షించుచు, అది ప్రకృతిక్రియయే గాని, తన క్రియ గాదని గాంచును. అహంకారమును, దాని సంకల్పమును, దాని తెలివియు – అన్నియు ప్రకృతియొక్క ఒక యంత్రాంగమే యనియు, వాని కర్మ లన్నియు జటిలమగు ఆమె త్రిగుణవ్యాపారముచేతనే నిర్ణయింపబడు ననియు ఆత్మ గాంచును. సనాతనాత్మ స్వయముగా వీనినుండి సదా విముక్తము ; కారణము దానికి జ్ఞానము గలదు ; ప్రకృతియు, నహంకారమును,

ప్రాణుల వైయక్తికసత్తయునే సర్వాస్తిత్వము గావని ఆత్మకు దెలియును. ఏలన అస్తిత్వము దివ్యము లేక తుచ్ఛము, అద్భుతము లేక శోకమయము నగు నొక బాహ్యాదృశ్యము, క్షరభావదృశ్యము మాత్రమే గాదు. సనాతనము, అక్షరము, అవ్యయము, కాలాతీతము నగు నొకానొక ఆత్మభావమును గలదు; ప్రకృతి పరివర్తనలచేత నది ప్రభావితము గాదు. అది వాని నిష్పాక్షిక సాక్షి; ప్రభావితము చేయదు, ప్రభావితము గాదు: కర్మ చేయదు, కర్మవిషయము గాదు; పుణ్యశీలియు గాదు, పాపశీలియు గాదు; పరంతు అది నిత్యశుద్ధము, సంపూర్ణము, విశాలము, అక్షతము. అది అహంకారజీవుని పేధించు దుఃఖమును గాదు, ఆకర్షించు సుఖమును గాదు; ఎవనికిని మిత్రము గాదు, శత్రువును గాదు; పరంతు సర్వుల ఏకమాత్ర, సమ ఆత్మ. మానవున కీ ఆత్మబోధము లేదు; కారణము, అతడు తన బహిర్ముఖ మనస్సులో మునిగియున్నాడు; లోపల నివసింప నేర్చుకొనగోరడు, లేక నేర్చుకొన లేదు; అతడు సంగము వీడి, తన కర్మనుండి వెనుకకు తగ్గి, దానిని ప్రకృతికర్మగా నిరీక్షించడు. అహంకారమే అవరోధము, తనను భ్రాంతిచక్రమునకు బంధించు అక్రమవిధానము; కావున అక్షరాత్మలో అహంకారవినాశమే ముక్తికి ప్రథమ నియమము. ఒక మనస్సు మఱియు అహంకారమాత్రముగా నుండక, సర్వాత్మ వగుము : ఇది ముక్తిసందేశముయొక్క మొదటి మాట.

5. <u>కామత్యాగము ప్రథమసోపానము :</u> కావున అర్జునున కివ్వబడిన ప్రథమోపదేశ మిది – కర్మఫలాపేక్షను సర్వథా విసర్జించుము (2–47); కర్తవ్య కర్మను (3–19) నిష్కామముగా జేయు కేవలకర్తవు గమ్ము; కర్మఫలమును విశ్వకర్మల నియామకుడగు వానికి (5–29) విడిచివేయుము. ఎందుచేత విడువవలెను ? స్పష్టముగానే అర్జును డా నియామకుడు గాడు గనుక. అతని స్వీయాహంకార తృప్తి నిమిత్తము ప్రకృతి తన కర్మయందు నియుక్తము గాలేదు; అతని అభిరుచుల పూరణార్థము విశ్వజీవనము సాగుటలేదు; అతని బౌద్ధిక అభిప్రాయములు, నిర్ణయ ములు, ప్రమాణములను సమర్థించుటకు విశ్వమానసము పనిచేయుటలేదు, మఱియు నీ క్షుద్రబుద్ధిరూప న్యాయాధీశునికి అది తన బ్రహ్మాండలక్ష్యములను, పార్థివపద్ధతు లను నివేదింప నవసరము లేదు. తమ వ్యక్తిత్వమునందు నివసించుచు, దాని స్వల్ప, సంకుచిత దృక్కోణమునుండియే సర్వమును జూచు అజ్ఞజీవులు మాత్రమే యిట్టి హక్కులను ప్రతిపాదింతురు. ప్రపంచముపై తనకు గలదనుకొను ఈ హక్కునుండి

ముందు వెనుకకు తగ్గి, కోట్ల ప్రాణులలో నొకడుగా కర్మ చేయుచు, తనచే గాక, విశ్వకర్మచేతను, ప్రయోజనముచేతను నిర్ణయించబడిన ఒక లక్ష్యమునకు తనవంతు ప్రయత్నమును సమకూర్చవలెను. కాని అత డింకను ముందుకు బోవలెను; కర్తృత్వభావమును పరిత్యజించి, సమస్తవ్యక్తిత్వమునుండి విముక్తుడై, తన యందును, ఇతరులయందును పనిచేయునది విశ్వబుద్ధి, సంకల్పము, మనస్సు, ప్రాణము నని అతడు దర్శించవలెను. ప్రకృతియే వైశ్వ (universal)) కర్త్రి; తనయందు ప్రకృతి చేయు కర్మఫలములు తనకు జెందనట్లే, తన కర్మలును ఆమె కర్మలే యగును. అత డాధ్యాత్మికముగా నీ రెండు పనులు చేయగలిగినచో, తన కర్మబంధనజాలము దూరముగా తొలగిపోవును; ఏలన బంధనగ్రంథి యంతయు అహంకారికకామము మఱియు కర్తృత్వములందే నిలిచియుండును. ఆవేగము, పాపము, వైయక్తిక సుఖదుఃఖములు అతని ఆత్మనుండి అంతరించును; ఇపుడు లోపల నివసించు నా ఆత్మ శుద్ధము, విశాలము, శాంతము, అందరు మఱియు నన్నింటిపట్ల సమము. కర్మ అతని అంతరంగమున నెట్టి ప్రతిక్రియ పుట్టించదు, అతని ఆత్మయొక్క శుద్ధత మఱియు శాంతిపై నెట్టి మచ్చను గాని, గుర్తును గాని దిగవిడువదు. అతడిపుడు విముక్తము, అస్పష్టము నగు ఆత్మసత్తయొక్క అంతః సుఖమును, విశ్రాంతిని, ఆరామమును (5-24), అవిచ్ఛేద్య ఆనందమును అనుభ వించును. లోపల గాని, వెలుపల గాని అతని కిపుడు వెనుకటి క్షుద్రవ్యక్తిత్వ ముండదు; ఏలన లోపల, నందరితోను ఏకాత్మత ననుభవించును, అటులే వెలుపల, తన బాహ్యప్రకృతి వైశ్వమనస్సు, ప్రాణము, సంకల్పములయొక్క అవియోజ్య అంశమైనట్లు తన చేతనకు బోడమును. పృథక్కారియగు నతని అహంకారిక వ్యక్తిత్వము ఆధ్యాత్మికసత్తయొక్క నిర్వ్యక్తికత్వములోనికి గ్రహించబడి, స్వాహాయగును, అటులే పృథక్కారియగు నతని అహంకారికప్రకృతి విశ్వప్రకృతి క్రియతో నేకమైపోవును.

6. <u>దివ్యనివృత్తి దివ్యప్రవృత్తి</u> కాధారము : కాని ఈ విముక్తి సమకాలీనములు, అయినను ఇంకను సమన్వయము సాధించబడని రెండు దర్శనములపై నాధారపడియుండును - స్పష్టమగు ఆత్మదర్శనము, స్పష్టమగు ప్రకృతిదర్శనము. ఈ విముక్తి వైజ్ఞానికము, ధీయుతము నగు నిస్సంగత గాదు; ఆత్మజ్ఞానము లేకయే, ప్రకృతిని మాత్రము కొంత స్పష్టముగా దర్శించిన జడవాది

దార్శనికునికి సైతము ఈ నిస్సంగత నిక్కముగా సంభవమే. మఱియు నీ విముక్తి, తన బుద్ధి చేయు చతురవివేచనచే అహంకారముయొక్క స్థూలతరరూపములనుండి తప్పించుకొను మిథ్యావాది పండితునియొక్క బౌద్ధికనిస్సంగతయు గాదు. ఇది విశాలతరము, సజీవతరము, పరిపూర్ణతరము నగు ఆధ్యాత్మిక నిస్సంగత, ఇది ప్రకృతికంటెను పరము, మనోబుద్ధులకంటె నధికము నగు ఆత్మదర్శనముచేత లభించును. కాని ఈ నిస్సంగత సైతము విముక్తి మఱియు నాత్మజ్ఞానమునకు సంబంధించిన ప్రారంభికరహస్యము మాత్రమే, అది దివ్యగుహ్యముయొక్క సంపూర్ణసూత్రము గాదు; ఏలన దీనిచేతనే ప్రకృతిరహస్యము మనకు బోధపడదు, మఱియు నిది మన ప్రాకృత, సక్రియ సత్తను మన ఆధ్యాత్మిక స్వయంభూసత్తనుండి వేఱుచేసి మాత్రమే విడుచును. అట్లుగాక, దివ్యనివృత్తి వెనుకటి అహంకారిక ప్రవృత్తిని తొలగించి వచ్చు, దివ్యప్రవృత్తికి ఆధారము గావలెను, అటులే దివ్యశమము దివ్యకర్మకును, దివ్యగతికిని ఆధారము గావలెను. ఈ సత్యము పొడవున (all along) దివ్యగురువు దృష్టియం దుండనే యున్నది; కావుననే అతడు కర్మయజ్ఞమును (4-23), మన కర్మనియామకునిగా ఈశ్వరుని గుర్తించుటను (5-29), అవతార, దివ్యజన్మల సిద్ధాంతమును నొక్కి చెప్పుచువచ్చెను; అయినను ఈ సత్యమును గౌణముగానే యుంచి, శమాత్మకవిముక్తియొక్క ప్రథమావశ్యకతకే ప్రాధాన్య మిచ్చెను. ఆధ్యాత్మికశమము, అసంగము, సమత మఱియు నేకత్వలకు, ఒక్క మాటలో, అక్షరాత్మను దర్శించి, తద్భావమును బొందుటకు దారితీయు సత్యములు మాత్రమే పూర్తిగా వివరింపబడినవి, వాని సామర్థ్యమునకు, ఆశయమునకు మాత్రమే పూర్ణవ్యాప్తి కల్పించబడినది. ఈ సత్యపూరకము, ఆవశ్యకము నగు తదితర మహాసత్యము ఇంతదనుక కొంత మఱుగున నుంచబడినది; అది పొడవున సూచించబడినను, వివరింపబడలేదు. ఇప్పు డది అనంతరాధ్యాయములలో త్వరత్వరగా బహిర్గతము చేయబడును.

7. <u>ఆత్మ భగవంతునికి దారి</u> : భగవదవతారము, దివ్యగురువు, ప్రపంచ కర్మయందు మానవాత్మయొక్క సారథియు నైన కృష్ణుడు ఆదినుండియు తన రహస్యమును – ఇదియే ప్రకృతి గంభీరతమ రహస్యము – ప్రకటించుటకు భూమికను సిద్ధముచేయుచునే వచ్చెను. ఈ సన్నాహసంగీతమునందు ఒక స్వరము పదా పలుకుచు, అతని సమగ్రసత్యముయొక్క పరమసామరస్యమునకు సూచనగా,

ప్రస్తావనగా పనిచేసినది. ఆ స్వరము పరమపురుషునికి సంబంధించిన భావము - ఈ పరమపురుషుడు మానవునియందును, ప్రకృతియందును నివసించుచున్నను, మానవునికంటెను, ప్రకృతికంటెను అధికుడు; ఇతడు అక్షరాత్మయొక్క నిర్వ్యక్తికత ద్వారా ప్రాప్తించినను, అక్షరాత్మ ఇతని పూర్ణమర్మము గాదు. తిరిగి తిరిగి వినిపించిన ఆ స్వరముయొక్క అర్థ మిపుడు తెల్ల మగును. రథస్థుడగు దివ్యగురువు వాణిద్వారా ఆ ఏకమాత్రభగవంతుడు దాని అర్థము నిటుల దెలుపును - తానే జ్ఞానకర్మల సమన్వయ రహస్యమని యిటుల దెలుపును : " నీయం దున్న నేను, ఈ (తన) మానవశరీరమందున్న నేను, ఎవనికొఱకు అంతయు మనుచు, శ్రమించుచున్నదో, అట్టి నేను ఏకకాలమున స్వయంభూ ఆత్మయొక్కయు, విశ్వకర్మయొక్కయు రహస్య మను. ఈ ' నేను ' పరమ - నేను, విశాలతను మానవ వ్యక్తిత్వము సైతము దీనియొక్క ఆంశిక, ఖండమాత్ర అభివ్యక్తియే, ప్రకృతి యంతయు దీని హీనతర క్రియాకలాపమే. అంతరాత్మ స్వామిని, ప్రకృతికర్మల ప్రభువును అగు నేను ఏకమాత్ర జ్యోతిని, సంపూర్ణశక్తిని, అద్వితీయ సత్తను. నీయందలి ఈ భగవంతుడు మహాజ్ఞాన సూర్యుడు, ఇతని తేజమున నీ అక్షరాత్మకును, క్షరప్రకృతి కిని గల భేదమును దెలిసికొందువు. కాని యీ తేజమున కావల దాని మూలమును వీక్షింపుము, అపుడు దేనియందు వ్యక్తిత్వము మఱియు ప్రకృతి - వీని ఆధ్యాత్మిక సత్యము తిరిగి పొందబడునో, అట్టి పరమాత్మను దెలిసికొందువు. కావున సర్వ భూతములలోను నన్ను చూడగలందులకు, (ముందు) సర్వభూతములలోను ఆత్మను జూడుము (4-35); సర్వభూతములను ఏకమాత్ర ఆధ్యాత్మిక ఆత్మయందును, సద్వస్తువునందును గాంచుము, ఏలన అదియే సర్వభూతములను నాయందు గాంచుటకు మార్గము. పరబ్రహ్మమగు భగవంతుని జూడగలందులకు, అన్నింటియందు నున్న బ్రహ్మమును దెలిసికొనుము. నిన్ను స్వయముగా దెలిసికొనుము, నీవుగా నుండుము, అపుడు నీవు నాతో ఏకముకాగలవు-కాలాతీత ఆత్మ ఎవని నిర్మలప్రకాశమో, లేక పారదర్శకజవనికయో (తెర) అట్టి నాతో ఏకము కాగలవు. భగవంతుడనగు నేను ఆత్మయొక్కయు, పురుషునియొక్కయు పరమసత్య మను.

8. <u>అతీతభగవంతుడు - అంతర్వర్తి భగవంతుడు :</u> ఒకే భగవంతుడు ఆత్మయొక్కయే కాక, ప్రకృతియొక్కయు, తన స్వీయ వ్యక్తిత్వముయొక్కయు ఉచ్చతరసత్య మని అర్జునుడు గాంచవలెను - ఏకకాలమున వ్యష్టిసమష్టుల నిగూఢ

రహస్యము. భగవంతుడు ప్రకృతియందు సమష్టిసంకల్పరూపమున నుండును; తననుండి ప్రభవించు కర్మలకంటె తా నధికుడు, ప్రకృతికర్మలు, మానవుని కర్మలు, వాని ఫలితములు అతనికే చెందును. కావున మానవుడు కర్మలను యజ్ఞముగా జేయవలెను, అదియే అతని కర్మసత్య మగును. అహంకారము గాక, ప్రకృతియే కర్మకర్త్రి; కాని ప్రకృతి ఆ పరమపురుషుని ఒక శక్తిమాత్రమే, అతడే ఆమె కర్మలు, తపస్సులయొక్కయు, యుగాలు సాగు ఆమె విశ్వయజ్ఞము యొక్కయు నధీశ్వరుడు. ఇట్లు తన కర్మలు భగవంతుని కర్మలే గనుక, మానవుడు తన కర్మల నన్నింటిని తనయందలి, ప్రపంచమునందలి ఆ భగవంతునికే అర్పింపవలెను. ఇచ్చట, మానవాత్మ తిరిగి భగవంతునియందు దివ్యజన్మ (4–10) నందుటకు రెండు నిబంధనలు గన్పించును– 1. ముందు కాలాతీత అక్షరాత్మయొక్క జ్ఞానము, మఱియు తద్వారా కాలాతీత భగవంతునితో సాయుజ్యము, 2. విశ్వప్రహేళిక వెనుక నివసించు నట్టి, అనగా సర్వభూతములందును, వాని క్రియాకలాపములందును ఉండునట్టి భగవంతునియొక్క జ్ఞానము. ఇట్లు మాత్రమే మన ప్రకృతిని మఱియు సత్తనంతను సమర్పించుటద్వారా దిక్కాలములయందు సర్వము నైన ఏకునితో సజీవసాయుజ్యము నందగలము. పూర్ణ ఆత్మవిముక్తి-యోగముయొక్క ప్రణాళిక యందు భక్తిస్థానము మన కిక్కడ గన్పించును. భక్తి యన అక్షరాత్మ లేక క్షరప్రకృతికంటె మహత్తరమగు వానిని గుఱించిన ఉపాసన మఱియు ఆకాంక్ష. అపుడు జ్ఞాన మంతయు నొక ఉపాసన మఱియు నాకాంక్ష యగును, అటులే కర్మ యంతయు నొక ఉపాసన మఱియు నాకాంక్ష యగును. ఈ భక్త్యుపాసనయందు ప్రకృతికర్మయు అంతరాత్మవిముక్తియు నొకటియై, పరమాత్మ కెగయు ఏకమాత్ర ఉద్గమన మగును. చరమముక్తి, అనగా నిమ్నతరప్రకృతినుండి ఉచ్చతర ఆధ్యాత్మిక భావములోనికి చేయు ప్రస్థానము అంతరాత్మ నిర్వాణము (వినాశము) గాదు – దాని అహంకారరూపము మాత్రమే నిర్వాణము జెందును – పరంతు భక్తిజ్ఞానకర్మలతో గూడిన మన ఆత్మ యంతయు భగవంతుని విశ్వభావమునుండి వెడలి, అతని విశ్వాతీత భావమునకు పయనించుటయే యగును, వినాశము గాక, పరిపూర్తియే యగును.

9. నిర్వ్యక్తిక సవ్యక్తికసమన్వయము : పైన ప్రస్తావించబడిన జ్ఞానమును స్పష్టపఱచునిమిత్తము, ఇంకను మిగిలియున్న రెండు శంకలను తీర్చుటకు దివ్యగురు

నుపక్రమించును - 1. నిర్వ్యక్తికాత్మకును, మానవవ్యక్తిత్వమునకును మధ్యగల విరోధము, 2. పురుషునకును, ప్రకృతికిని మధ్యగల విరోధము. ఈ విరోధములు రెండును కొనసాగు నంతవఱకు, ప్రకృతియందును, మానవునియందును గల భగవంతుడు అస్పష్టముగను, అహేతుకముగను, అవిశ్వసనీయముగను నిలిచిపోవును. గుణకృతమగు యాంత్రికబంధనమే ప్రకృతి యనియు, ఆ బంధనాధీనమగు అహంకారికసత్తయే ఆత్మయనియు చెప్పబడును. కాని అదే వాని పూర్ణసత్యమగుచో, అవి దివ్యము కావు, కాజాలవు. ప్రకృతి - అజ్ఞము, యాంత్రికమునగు ప్రకృతి - భగవంతుని శక్తి కాజాలదు; కారణము, దివ్యశక్తి తన కర్మయందు విముక్తము, తన మూలమునందు ఆధ్యాత్మికము, తన మహత్త్వమునందు ఆధ్యాత్మికము గావలెను. అటులే ప్రకృతియందు బద్ధము, అహంకారికము, కేవలము మనోమయము, ప్రాణమయము, అన్నమయము నగు అంతరాత్మ భగవంతుని అంశము, స్వయముగా భాగవతసత్త గాజాలదు; కారణము, భాగవతసత్త తాను భగవంతుని ప్రకృతినే కలిగియుండి, విముక్తము, ఆధ్యాత్మికము, స్వయంవికాసశీలము, స్వయంసిద్ధము, మనఃప్రాణశరీరములకంటెను పరము గావలెను. పై రెండు శంకలును, అవి గొనివచ్చు అస్పష్టతలును తేజోమయమగు నొక సత్యకిరణముచేత సమాప్తమగును. ఎట్లు ? యాంత్రికప్రకృతి ఒక అపరసత్యము మాత్రమే ; అది హీనతర బాహ్యక్రియ యొక్క ఒక పద్ధతి మాత్రమే. ఆధ్యాత్మికమగు నొక పరసత్యమును గలదు, అది మన ఆధ్యాత్మికవ్యక్తిత్వముయొక్క, మనయందలి యథార్థపురుషునియొక్క ఆధ్యాత్మికప్రకృతి. భగవంతు డేకకాలమున నిర్వ్యక్తికము, సవ్యక్తికము. అతని నిర్వ్యక్తికత మన మానసికానుభూతికి కాలాతీతమగు సత్తాచేతనానందముల ఒక అనంతమగును; పోగా నతని వ్యక్తిత్వము సత్తయొక్క ఒక చేతనశక్తిగను, జ్ఞానము, సంకల్పము, మఱియు బహురూపస్వీయాభివ్యక్తిచేత ప్రాప్తించు ఆనందము - వీని యొక్క చేతనకేంద్రముగను తన నిచ్చట జూపుకొనును. మన సత్తయొక్క స్థితిశీల (static) తత్త్వమున మన మా ఏకమాత్ర నిర్వ్యక్తికత యగుదుము (నిర్వ్యక్తిక ఆత్మ యగుదుము) ; కాగా మన ఆధ్యాత్మిక పురుషరూపమున మనయందలి ప్రతియొకడును ఆ మూల చేతనశక్తియొక్క బహుత్వ మగుదుము, (అనగా నతని వ్యక్తిత్వ మగుదుము). కాని ఈ విభేదము భగవంతునియొక్క స్వయమభివ్యక్తి నిమిత్తమే; వెనుకకు వెళ్లి చూచినచో, దివ్యనిర్వ్యక్తికత అదే సమయమున అనంత 'అతడు'గా, పరమాత్మగా, పరమపురుషుడుగా గన్పట్టును. ఈ 'అతడు' 'నేను

అతడేను' - "సోహం" (బృ. ఉ.) - అను మహావాక్యములోని మహా-నేను ; ఈ నేను-నుండియే సర్వవ్యక్తిత్వమును, సర్వప్రకృతియు ప్రసరించి, నిర్వ్యక్తిక ప్రపంచరూపమున లీల నెరపును. "సర్వం ఖ ల్విదం బ్రహ్మ" (ఛాం. ఉ.), "ఈ ఉన్న దంతయు (సత్త యంతయు) బ్రహ్మ" - అని ఉపనిషత్తు చెప్పును ; ఏలన తననుదాను నాలుగు క్రమగత చేతనాస్థితులయందు చూచుకొను ఆత్మయే బ్రహ్మ. ఇట్లుండ, "వాసుదేవుడే సర్వము" (7-19) నని గీత చెప్పును, ఈ వాసుదేవుడు సత్తావంతుడైన సనాతన పురుషుడు. (కనుక సత్తారీత్యా నిర్వ్యక్తి బ్రహ్మము సవ్యక్తికవాసుదేవుడే). ఇతడు బ్రహ్మము (10-20), ఇతడు తన ఉచ్చతర ఆధ్యాత్మికప్రకృతినుండి సర్వమును ధరించుచు, సర్వమును బుట్టించును, మఱియు నిమ్నప్రకృతియందు బుద్ధి, మనస్సు, ప్రాణము, ఇంద్రియము మఱియు దృశ్యజగద్రూపమగు సర్వవస్తువులు సచేతనముగా నగును. కాగా సనాతనపురుషుని ఆధ్యాత్మిక ప్రకృతియందు జీవు డతడే యగును, అతని సనాతన బహుత్వ మగును, తన చేతనశక్తియొక్క బహుకేంద్రములనుండి తనను దర్శించుకొను దర్శనరూపు డగును. భగవంతుడు, ప్రకృతి, జీవుడు : ఇవి సృష్టియొక్క మూడు అవయవములు, మఱియు నీ మూడును ఒకే సత్తే యగును. (వాసుదేవుడు, ఆత్మ, ప్రకృతి, జీవుడు - బ్రహ్మసత్తే ఈ నాలుగు రూపములను ధరించును).

10. అభివ్యక్తిక్రమము : ఈ సనాతనపురుషుడు విశ్వమునందు తన నెట్లు అభివ్యక్తము గావించుకొనును ? మున్ముందు కాలాతీతము, సర్వగతము, సర్వధరము నగు అక్షరాత్మరూపమున, ఇది తన కాలాతీతతయందు సత్తయే గాని, సంభూతి గాదు. అటు పిమ్మట, ఈ సత్తా గర్భమున "స్వభావ" మనబడు స్వసంభూతియొక్క ఒక మూలశక్తి లేక ఆధ్యాత్మిక తత్త్వము ఉండును ; దీనిద్వారా ఆత్మ స్వవిషయకదృష్టిచేత తన సత్తయందు గలదాని నంతను నిర్ణయించి ప్రకటించును, వెలికిదెచ్చి సృజించును. ఆ స్వభావశక్తి సత్తయం దిట్లు నిర్ణీతమైన దాని నంతను "కర్మ" (8-3) యనబడు విశ్వక్రియలోనికి విడిచిపెట్టును. సృష్టి యంతయు ఈ స్వభావవ్యాపారమే, కర్మయే. కాని యిచ్చ టిది బుద్ధి, మనస్సు, ప్రాణము, ఇంద్రియము, ఇంద్రియవిషయమగు జడప్రపంచరూపమగు క్షరప్రకృతియందు పెంపొందింపబడును, మఱియు నిట్టి ప్రకృతి మూలప్రకాశమునుండి ఖండింపబడి,

అహంకారముచే పరిమితమై యుండును. అయినను ఈ ప్రకృతికర్మ లన్నియు ఆమెయందలి అంతరాత్మ ఆమెయందు గుప్తముగా నున్న పరమాత్మకు సమర్పించు యజ్ఞమగును, మఱియు కావున నీ పరమాత్మ అందరియందును వారి యజ్ఞప్రభువుగా నివసించును, అతని సన్నిధియు, శక్తియు దానిని నియమించును, అతని ఆత్మజ్ఞానము, సత్తానందమును దానిని స్వీకరించును. దీని నెఱుంగుట సమీచీనమగు విశ్వజ్ఞానమును, విశ్వమునందలి భగవద్దర్శనమును గలిగియుండుట యగును, మఱియు అజ్ఞానవిముక్తికి ద్వారము కనుగొనుట యగును. ఏలన తన కర్మలను, తన చేతన నంతను సర్వమునందును గల భగవంతుని కర్పించుటచేత మానవుని కీ జ్ఞానము కార్యసాధకమై, తన ఆధ్యాత్మిక భావమునకును, దానిద్వారా క్షరప్రకృతికి పరమున వెలుగొందు సనాతన, విశ్వాతీత సద్వస్తువునకు తిరిగిరా శక్తి నిచ్చును.

11. <u>రాజగుహ్యము :</u> ఈ సద్వస్తువే సత్తారహస్యము, దీనినే గీత యిపుడు ప్రచురఫలితము నిచ్చునట్లుగా మన ఆంతరజీవనమునకును, బాహ్య కర్మలకును ఆనువర్తింపజేయ నున్నది. గీత యిపుడు ప్రవచింపబోవునది రహస్యాతి రహస్యము (9–1). అర్జునునకు తన సత్తాప్రభువు వాగ్దానము చేసిన జ్ఞానము సమగ్ర భగవంతుని జ్ఞానము - "సమగ్రం మాం" (7–1), అతని వివిధతత్త్వముల విజ్ఞానముతో గూడిన అతని మూలసత్తాజ్ఞానము (9–1), ఈ జ్ఞానము లభించిన, నిక తెలియవలసిన దేదియు మిగులదు. అర్జునుని మానవమనస్సును విమూఢముగావించి, తన దైవనియుక్తకార్యమునుండి అతని సంకల్పమును విముఖముచేసిన అజ్ఞానగ్రంథి యంతయు పూర్తిగా విచ్ఛిన్నమగును. ఇది రాజవిద్య, రాజగుహ్యము - విద్యలకు విద్య, రహస్యములకు రహస్యము (9–2). ఇది యొక విశుద్ధ, పరమప్రకాశము, దీనిని ప్రత్యక్ష, ఆధ్యాత్మికానుభవముచే ఋజువుచేసికొనవచ్చును, లోపలనే సత్యముగా దర్శింపవచ్చును. ఇది ధర్మసమ్మతమైన జ్ఞానము, సాక్షాత్తు సత్తాధర్మము (law). గ్రహించి, దర్శించి, దీనిలో నివసింప శ్రద్ధగా ప్రయత్నించి నపుడు, దీనిని సాధింప సులభము (9–2).

12. <u>కాని విశ్వాస మావశ్యకము :</u> విశ్వాసము లేనిచో, సాధకుడు విమర్శనాత్మకబుద్ధినే నమ్ముకొనియున్నచో, ఆ మహత్తరజ్ఞానమును జీవించి, అనుభవింప సంభవము గాదు. ఏలన తార్కికబుద్ధి బాహ్యసత్యములపైననే ఆధార

పడి, అంతర్దృష్టజ్ఞానమును అసహనముతో సందేహించును. కారణము, ఈ అంతర్జ్ఞానము బాహ్యప్రకృతియొక్క విభజనలు, మఱియు అపూర్ణతలతో మేళవించదు, మఱియు దానిని దాటి వెళ్లి, మన ఇప్పటిజీవనముయొక్క ప్రథమ, వాస్తవసత్యము లగు దుఃఖమును, బాధను, పాపమును, లోపమును, ప్రమాదమును, ఒక్క మాటలో, "అశుభమును" (9-1) దాటించి, మనల నావలకు గొనిపోవు సత్యమును ప్రతిపాదించుచున్నట్లు గన్పించును. ఈ ఉచ్చతరసత్యము మఱియు ధర్మమునందు విశ్వసించలేని అంతరాత్మ మృత్యువు, భ్రమప్రమాదము, అశుభములకు అధీనమగు సాధారణ మర్త్యజీవన మార్గమునకు తిరిగిరాక తప్పదు (9-3)- తాను సందేహించు భగవంతునిలోనికి తాను పెరుగలేదు గదా! ఏలన ఇది నివసించవలసిన, అంతరాత్మయొక్క వర్ధమానప్రకాశమున నివసించవలసిన సత్యము గాని, మనస్సుయొక్క అంధకారమున తర్కించి, నిర్ణయించవలసిన సత్యము గాదు. సాధకుడు దానిలోనికి పెరుగవలెను, అది కావలెను- దాని ప్రామాణ్యమును పరీక్షించుట కదియే మార్గము. నిమ్నతరాత్మను అతిక్రమించుటచేతనే ఎవడైనను వాస్తవ దివ్యాత్మ కాగలడు, మఱియు తన ఆధ్యాత్మికభావముయొక్క సత్యమును జీవించగలడు. ఎవ దేని దీనికి ప్రతిగా నిలబెట్టగలిగిన ఆభాస (apparent) సత్యము లన్నియు నిమ్నప్రకృతియొక్క ఆభాసములే. నిమ్నప్రకృతియొక్క అశుభమునుండి విముక్తి ఉచ్చతర జ్ఞానము నాశ్రయించుటచేతనే ప్రాప్తించగలదు, అచ్చట బాహ్యశుభ మంతయు మన అంధకార సృష్టి మాత్రమే యని నిరూపించబడును, అప్పుడు దానికి తన చరమ మిథ్యాత్వముపట్ల నమ్మకము కుదురును. కాని దివ్యప్రకృతియొక్క విముక్తిలోని కిట్లు పెరుగవలె ననిన, మన ప్రస్తుత పరిచ్ఛిన్నప్రకృతిలోపల గుప్తముగా నున్న ఈశ్వరు నంగీకరించి, విశ్వసించవలెను. అపుడే ఈ యోగసాధన సంభవము, సులభము కాగలదు; ఏలన మన సంపూర్ణప్రకృతివ్యాపారము నంతను ఈ ఆంతర దివ్యపురుషుని హస్తములలోని కర్పించివేతుము. ఈ దివ్యపురుషుడు మన సత్తను తన సత్తలోనికి గ్రహించి, దానిని తన శక్తిజ్ఞానములతో పూరించి- "జ్ఞానదీపేన భాస్వతా" (10-11)-మనయందు దివ్యజన్మను క్రమేణ సరళముగను, అమోఘముగను సాధించును; మన మలిన, అజ్ఞానమయ ప్రకృతిని చేపట్టి, దానిని తన తేజోవిశాలతలలోనికి రూపాంతర మొందించును. సంపూర్ణవిశ్వాసముతోను, నిరహంకారముగాను దేనిని మనము నమ్ముదుమో, ఈశ్వరప్రేరితులమై దేనిని బొందసంకల్పింతుమో,

లోపలి భగవంతుడు దానిని నిశ్చయముగా బొందించును. కాని యిపుడు బాహ్యానికి మనముగానే కన్పించుచున్న ఆహంకారిక మనః ప్రాణములు లోపలి భగవంతుని హస్తములలోనికి పరివర్తననిమిత్తము తమనుదాము ముందు సమర్పించుకొనవలెను.

# 5. దివ్యసత్యము, దివ్యమార్గము

1. భక్తియే దివ్యమార్గము : గీత పిమ్మట పరమ, సమగ్రరహస్యము నావిష్కరింపదొడంగును; ఇదియే సాధకు డన్వేషించు ఏకమాత్రధ్యేయము మఱియు సత్యము, ఇదియే అతని ఆధ్యాత్మికాంగములు మఱియు వాని సమస్తవృత్తుల ఏకమాత్ర సంసిద్ధి ధర్మము, దీనియందే అతడు నివసింప నేర్చుకొనవలెను. ఈ పరమరహస్యము సర్వాతీత భగవంతుని గహనతత్త్వము; ఇతడు సర్వము, సర్వగతుడు నైనప్పటికి, విశ్వము మఱియు దాని సర్వరూపములకంటెను ఎంతో అధికుడు మఱియు నన్యుడు; దేనియందు నత డిముడడు, ఏదియు నతనిని వాస్తవముగా ప్రకటింపదు, బాహ్యరూపములతో ముడివడియుండు నేభాషయు అతని అచింత్యస్వరూపముయొక్క సత్యమును సూచింపజాలదు. కావున మన సంసిద్ధి ధర్మము మన ప్రకృతి యంతయు తన దివ్యమూలము, భర్తయు నగు నతనిని ఆరాధించుచు, అతనికి ఆత్మసమర్పణ జేసికొనుటయే యగును. ప్రపంచము నందలి మన జీవితము నంతను-దానియొక్క ఈ యా అంశమును మాత్రమే గాదు- భగవదభిముఖమగు ఏకమాత్ర గతిగా మార్చుటయే మన ఏకైక చరమమార్గ మగును. ఒక దివ్యయోగముయొక్క శక్తిచేతను, గుహ్యావిధానముచేతను అతని అనిర్వచనీయ రహస్యస్థితినుండి వెలువడి, మనము బాహ్యవస్తువుల ఈ పరిచ్ఛిన్న ప్రకృతిలోనికి వచ్చియున్నాము. అదే యోగముయొక్క ఒక విలోమ (reverse) గతిచేత మన బాహ్యప్రకృతియొక్క అవధులను దాటి, దేనిచేత మనము భగవంతునియందు నివసింపగలమో, అట్టి యొక మహత్తరచేతనను తిరిగి పొందవలెను.

2. భగవంతుడు సత్త, ప్రపంచము సంభూతి : భగవంతుని పరమసత్త అభివ్యక్త ప్రపంచమున కతీతము; అతని సనాతనమూర్తి ద్రవ్యమునందు వ్యక్తము గాదు, ప్రాణము చేత గృహీతమునుగాదు, మనస్సుచేత చింత్యమును గాదు–"అవ్యక్త మూర్తి" (9–4), "అచింత్య రూప" (8–9). మనము చూచునది అతడు రచించుకొనిన రూపము గాని, అతని స్వరూపము గాదు. ప్రపంచముకంటెను అన్యమగు ఒకడు, లేక ఒకటి గలదు, అది అకథ్యము, అచింత్యము, అది అవర్ణనీయముగా అనంతమగు భగవత్తత్త్వము; అనంతతను గుఱించిన మన అతివ్యాపక లేక అతిసూక్ష్మభావనలకుసైతము అది అందక యుండును. విశ్వ మనబడు నిది యంతయు నొక మహాజాలము, ఇది అవధులు గన్పించని ఒక మహాగతి, దీనియం దెంత వెదకినను గతియేగాన స్థితి గన్పించదు, దీనిని నడుపుటకు వలయు ధ్రువకేంద్రము గానరాదు; ఇట్టి విశ్వము భగవంతు డనబడు అత్యున్నత అనంతము చేత తననుండియే విస్తరింపజేయ బడినది (9–4), ఈ విశ్వాతీత నిగూఢతత్త్వమునందే ప్రతిష్ఠితమై యున్నది; స్వయముగా అవ్యక్తము, అచింత్యము నగు భగవంతుని యొక్క ఆత్మనిర్మాణము మీద ప్రతిష్ఠితమై యున్నది. సర్వదా మాఱుచు, గతిశీలమైయుండు చరాచర భూతములు వ్యష్టిరూపమున గాని, సమిష్టిరూపమున గాని అతనిని తమలో నిముడ్చుకొనజాలవు. అతడు వానిలో లేడు; వానిలో గాని వానిచేత గాని అతడు జీవించడు, చరించడు, తన అస్తిత్వమును గలిగియుండడు – భగవంతుడు సంభూతి గాడు. అవియే అతనిలో నున్నవి, అతనిలో చరించుచు, నివసించును, అతనినుండియే తమ అస్తిత్వమును బొందును; అవి అతని సంభూతులు, అతడు వాని సత్త – "మత్స్థాని సర్వభూతాని, న చాహం తే ష్వవస్థితః" (9–4). అచింత్యము, దిక్కాలాతీతము నగు తన సత్తయొక్క అనంతతయందు అవధులు గన్పించ నప్పటికి స్వల్పమగు నీ విశ్వదృశ్యమును అనంతదేశకాలములందు అతడు విస్తరింపజేసెను.

3. ఆత్మలోకము–భౌతికలోకము : సర్వము నతనియం దుండును–అని చెప్పుటయు సంపూర్ణసత్యము గాదు, సంపూర్ణముగా వాస్తవసంబంధము గాదు. ఏలన ఇట్లు చెప్పుట అతనికి దేశభావము నాపాదించుటయే యగును, కాని అతడు దేశాతీతుడును, కాలాతీతుడును. దేశకాలములు, వీనితో ముడివడిన అంతస్థత, వ్యాప్తి, అతిక్రమణము–అన్నియు అతని చేతనయొక్క పదములు (అవయములు)

మఱియు ప్రతిమలు. ఈశ్వరశక్తియోగ మొకటి గలదు- "మే యోగమైశ్వరం" (9-5); దీనిచే పరముడు తన కాలాతీతానంతమును ఆధ్యాత్మికానంతము గావించి, దానియందు తన స్వీయరూపములతో గూడిన ఆత్మలోకమును సృజించును - భౌతిక విస్తారము ఈ ఆధ్యాత్మికవిస్తారముయొక్క ఒక ప్రతిమ మాత్రమే; ఈ ఆత్మ లోకముతో నొకటిగా అతడు తననుదాను జూచుకొనును, దానితోను, దానియం దున్న భౌతికలోకముతోను తాదాత్మ్యము జెందును. అయితే ఈ 'చూచుకొనుటయే' అతని సంపూర్ణదర్శనము గాదు, సంపూర్ణదర్శనమున అతడు ఏకకాలమున సర్వముతో నేక మయ్యును, సర్వము నతిక్రమించును. అనగా, అత డీ ఆత్మలోకముకంటెను గూడ అన్యుడు. అంతయు నిచ్చట అతని విశ్వవిద (world-conscious) అనంతమునం దుండగా, ఈ అనంతము తిరిగి భగవంతుని విశ్వాతీత సత్యతయొక్క ఒక స్వీయ భావనగా ధరించబడును, ఇట్లు ఇదియే భగవంతుని పరమగుహ్యము : అతడు విశ్వాతీతు డయ్యును విశ్వబాహ్యుడు గాడు. ఏలన అతడు తన ఆత్మరూపమున దానిని వ్యాపించియుండును. ప్రకాశమయము, నిర్లిప్తము నగు భగవంతుని ఆత్మ అంతట నుండును- "మమ ఆత్మా" (9-5); ఈ ఆత్మ ప్రపంచసంభూతితో సంతతసంబంధము గలిగియుండి, సర్వభూతములను తన కేవల (simple) సన్నిధిచే అభివ్యక్తిలోనికి దెచ్చును- "భూతభృన్ నచ భూతస్థో మమాత్మా భూతభావనః" (9-5). కనుకనే ఈ పదముల ప్రయోగము : సత్తయు, సంభూతియు-అనగా ఆత్మ యనబడు స్వతఃసిద్ధమగు సత్త, భూతము లనబడు ఆత్మపై నాధారపడు సత్తలు, అనగా అక్షరసత్త, క్షరసత్తలు. కాని ఈ రెండు భావములయొక్క పరమసత్యమును, వాని ద్వంద్వవిరోధపరిష్కారమును వానికి పరమగు దానియందు కనుగొనవలెను. ఈ పరమే పరమపురుషుడు, ఇతడే తన "యోగమాయచేత" (7-25), అనగా తన ఆధ్యాత్మికచేతనయొక్క శక్తిచేత రెండింటిని అభివ్యక్తముచేయుచు, ఆత్మను, ఆత్మలోని దృశ్యవస్తువులను తనయందు గలిగియుండును. మన ఆధ్యాత్మికచేతన యందు అతనితో సంయోగము నంది నపుడే, అతని సత్తతో మనకు గల వాస్తవ సంబంధములను చేరుకొనగలము.

4. <u>ద్వైతము</u> : దార్శనికముగా చెప్పినపుడు, ఈ గీతాశ్లోకముల (9-4,5) అభిప్రాయ మిది; కాని వీని కాధారము ఆధ్యాత్మికానుభూతియే గాని, బౌద్ధికవిచారణ గాదు. ఈ శ్లోకములకు విశాలమూలము కొన్ని ఆధ్యాత్మికసత్యములు గాన, అవి

సమన్వయ సాధకములు. ప్రపంచమున గుప్తముగానో, వ్యక్తముగానో ఉండగల పరమ లేక విశ్వపురుషునితో మనము సచేతనసంబంధములను ఏర్పఱచుకొన దలంచి నపుడు, మనకు నానావిధ అనుభవము ప్రాప్తించును, మఱియు నీ అనుభవమునందలి ఒకొక అంశమును దీసికొని, బుద్ధి సృష్టికి సంబంధించిన ఒకొక మూలభావము నేర్పఱచును. మున్ముందు మనకీ స్థూలానుభవము తగులును: భగవంతుడు మనకంటెను, ప్రపంచముకంటెను మిక్కిలి భిన్నము, అధికము నగు నొకానొక వస్తువు: మనము మన బాహ్యాత్మలలో నివసించుచు, ప్రపంచముయొక్క బాహ్య ముఖమునే చూచుచున్నంత కాలము ఇట్టి అనుభవమే కలుగును. కారణము, భగవంతుని పరమసత్యము విశ్వాతీతము గావున, దృశ్య మంతయు (ద్రష్టయగు) స్వసంవిద సత్తకంటె నితరముగా గన్పించును, ఒక హీనసత్యముయొక్క మూర్తిగానో, చివరకు మిథ్యగానో కన్పించును. మన మీ భేదమునందు మాత్రమే నివసించు నపుడు, భగవంతుడు విశ్వబాహ్యుడై నట్లు గాంతుము. భగవంతుడు విశ్వాతీతుడు గనుక విశ్వములో మాత్రమే లేడను అర్థమున ఇది సత్యము గాని, విశ్వము భగవత్సత్తకు వెలుపల నున్నదను అర్థమున గాదు. ఏలన ఏకమాత్ర సనాతన భగవత్సత్తకు వెలుపల నేదియు లేదు. భగవంతునియందే మనము నివసించు చున్నాము, చరించుచున్నాము, మన సత్తను గలిగియున్నాము — అను అనుభవము ప్రాప్తించి నపుడే, మన కీ పై సత్యము ఆధ్యాత్మికముగా విదితమగును — మన మతనికంటె నెంత భిన్నముగా నున్నను, మన ఉనికియే అతనిపై నాధారపడును, మఱియు విశ్వ మంతయు అతని సత్తయందలి ఒక దృశ్యమును, గతియు మాత్రమే.

5. <u>జగత్తు తక్కువ సత్యము గాని, మిథ్య గాదు</u> : కాని మన ఆత్మ సత్తయు, భగవంతుని ఆత్మసత్తయు ఒకటియే యను మఱికొంత పరతర అనుభవ మును మనకు గలుగును. మన మందరియొక్క ఏకాత్మను గుర్తించి, దాని బోధమును, దర్శనమును గలిగియుందుము. ఇపుడు మన మతనినుండి సర్వథా భిన్నుల మని చెప్పజాలము; స్వయంభు వగు నతని కాత్మయు గలదు, దృశ్యరూపమును గలదు, ఈ ఆత్మయం దందరు నొకటియే, కాని దృశ్యమునం దందరు భిన్నము. ఆత్మైక్యము నందు అనన్యనిమజ్జనముచే, దృశ్యము స్వప్నసదృశము, మిథ్యాభూతము నను అనుభవమునకు సైతము రావచ్చును. అట్లు గాక, ఆత్మదృశ్యములపై సమముగా దృష్టిని కేంద్రీకరింతుమేని, మన కీ ద్వివిధానుభవము సైతము గలుగగలదు :

1. సత్తయం దతనితో మనకు స్వతఃసిద్ధ ఏకత్వము గలదు, కాగా 2. ప్రకృతియం దతనితో సంబంధములను గలిగి యుండి, అతనినుండియే పుట్టిన ఒక స్థాయి రూపమున నివసింతుము. విశ్వమును, విశ్వమునందు మన అస్తిత్వమును భగవంతుని స్వసంవిదసత్తయొక్క ఒక స్థిర, వాస్తవరూపముగా మనకు గన్పించును. ఈ అల్పతర సత్యమునందు మన మతనితోను, అతని శక్తులేయగు చరాచరములతోను భిన్న సంబంధములను గలిగియుండి, విశ్వప్రకృతిగతమగు విశ్వాత్మతో వ్యవహరింతుము. ఈ సంబంధములు విశ్వాతీతసత్యమగు ఏకత కంటెను అన్యములు, సత్తాశక్తినుండి పుట్టిన జన్యములు, మఱియు నిట్లవి అన్యములు, జన్యములు గావున, విశ్వాతీత కేవలబ్రహ్మ నుపాసించు కేవలసాధకులు వానిపై సాపేక్ష లేక సంపూర్ణమిథ్యాత్వము నారోపింతురు. కాని అవి అతని సత్తనుండియే పుట్టిన సద్రూపములు గాని, శూన్యమునుండి సృజింపబడిన మిథ్యారూపములు గావు. ఏలన పరమాత్మ సర్వత్ర దర్శించునది సదా తనను, తన రూపములనే కాని, తన కంటె నత్యంతభిన్నమగు వస్తువులను గాదు. మఱియు నీ సంబంధములకు మూలమగున దేదియు విశ్వాతీతము నందు లేనేలేదని చెప్పజాలము. ఒకవేళ ఇవి మూలమునుండియే వచ్చినను, అచ్చట వీని కాధారము, సమర్థనరూపము నగున దేదియు, వీని సనాతన సత్యమగున దేదియు లేదని పలుకజాలము.

6. <u>మాయావాద</u> మొక <u>అతిశయోక్తి</u> : మఱల, ఆత్మకును, ఆత్మ రూపములకును గల భేదమును మనము మఱియొక విధముగా సాగదీసినచో; ఆత్మ సర్వగర్భము, అంతర్వర్తియు నని చూడవచ్చును, సర్వగతాత్మయొక్క సత్యమును మన మంగీకరించవచ్చును; అయినను ఆత్మరూపములు ఆత్మభిన్నములు మఱియు క్షణికములుగా మాత్రమే కాక, మిథ్యాచ్ఛాయలుగా గూడ మనకు బొడమవచ్చును. జగత్తుయొక్క క్షరభావములను తనలోపల ధరించుచు, స్వయముగా నక్షరమగు ఆత్మానుభవము - భగవత్సత్తానుభవము - మనము బొందవచ్చు; అటులే దీనికంటె వేఱుగనో, సమకాలముననో, ఒకదానిపై నొకటిగనో భగవదనుభవమును, మనయందు సర్వభూతములందు అంతర్వర్తియగు భగవదనుభవమును బొందవచ్చును. అయినను విశ్వము సత్తయొక్క ఒక ప్రతిమగానో, ప్రతీకగానో మనకు గన్పించవచ్చును, ఈ ప్రతీకను బట్టి మన మతనితో అర్థవంతమగు సంబంధముల నేర్పఱచుకొని, క్రమముగా నతని జ్ఞానములోనికి పెరుగవలసియుండును. కాని దీనికి రెండవ వైపున,

మనము మఱియొక ఆవిష్కరణాత్మక ఆధ్యాత్మికానుభవమును బొందవచ్చును : దీని యందు సాక్షాత్తు భగవంతుడే సర్వవస్తువులు - సర్వమునందును అక్షరభావమున నివసించు ఆత్మయే గాక, బాహ్యాభ్యంతర సంభూతి యంతయు భగవంతుడే - యని చూచుట తప్పనిసరి యగును. అపు డంతయు మనయందును, విశ్వమునందును అభివ్యక్త మగుచున్న దివ్య సద్వస్తువే యగును. ఈ అనుభవము వ్యావర్తక (exclusive) మగుచో, విశ్వదేవతావాది (panthiestic) తాదాత్మ్యము ప్రాప్తించును : విశ్వమే భగవంతుడు. కాని విశ్వదేవతావాది దర్శనము ఆంశికదర్శనము మాత్రమే. ఈ విశ్వవిస్తారమే సర్వసత్త గాదు; దీనికంటెను అధికతరమగు నొక సనాతనము గలదు, దానిచేతనే దీని అస్తిత్వము సంభవమగుచున్నది. విశ్వ మతని సంపూర్ణ సత్తయందు భగవంతుడు గాదు, పరంతు అతని సత్తయొక్క ఒక ఆత్మ ప్రకటనము: సత్యము, స్వల్పము నగు గతివిశేషము. ఈ ఆధ్యాత్మికానుభవము లన్నింటికి, అవి ప్రథమదృష్టికి ఎంత విభిన్నములు, విరుద్ధములుగా నున్నను, సమన్వయము సాధ్యమే; ఇందు నిమిత్తము, ఏయొక అనుభవమును మాత్రమే నొక్కి చెప్పుటను మానుకొని, ప్రపంచభావముకంటెను భగవత్సత్త అధికతర మనియు, అయినను సమస్త వ్యష్టిసమష్టిరూపము లా భగవంతుడే గాని, మఱేమియు గాదనియు - మన మీ సరళసత్యమును గాంచవలెను. ఈ రూపములు భగవంతుడే యైనను, తమ సముచ్చయమునందు సైతము సంపూర్ణభగవంతుడు గావు; అవి అతని ద్యోతకములు, కాని అవి అతని సత్తయొక్క అవయవము, పదార్థము గానిచో, ద్యోతకములును గాజాలవు. భగవంతుడు పరమసత్యము, అవి అతని ద్యోతక [1] సత్యములు.

---

[1] పరమసత్యము ముందు అవి తక్కువ సత్యములుగా గోచరించినను, అవి అగుటకు సత్యములే. శంకరుని మాయావాదము ధరించు తర్కవిధానము వెనుక నున్న ఆధ్యాత్మికానుభవమునే జూతుమేని, రూపముల సాపేక్షసత్యముయొక్క అత్యుక్తి మాత్రమే అది యని తెలియును. మనస్సునకు పైన నీ సమస్యయే అంతరించును, కారణము, అది అక్కడ ఎప్పుడును ఉండనే లేదు. అచ్చట విభిన్న సాంప్రదాయముల వెనుక నున్న పృథగనుభవములు తమ విభిన్న బౌద్ధికసిద్ధాంతము లను విడిచివేసి సామరస్యము నొందును, ఇంకను పైకి, అతిమానస అనంతములోనికి వాని నుద్ధరింతుమేని, అక్కడవి సామరస్యమునే గాక, ఏకీభావమునుగూడ నందును. - శ్రీ అ.

7. భగవద్భావముయొక్క స్థాయిలు : "వాసుదేవః సర్వం ఇతి" (7-19) - అను వాక్యముయొక్క తాత్పర్య మిదియే; ఏది విశ్వమో, ఏది విశ్వమునం దున్నదో, ఏది విశ్వాతీతమో, అది యంతయు భగవంతుడే. గీత ముందు అతని విశ్వాతీతభావమును నొక్కి చెప్పును. అట్లు చెప్పనిచో, మనస్సు తన సర్వోత్తమ లక్ష్యమును గోల్పోయి, విశ్వలీల వైపునకు దిరుగును, లేదా విశ్వమునందలి భగవంతునియొక్క ఒక ఆంశికానుభవమునందు ఆసక్తమగును. తర్వాత గీత దేనియందు సర్వము వర్తించుచు, కర్మచేయునో, భగవంతుని అట్టి విశ్వభావమును ప్రకాశించును. ఏలన ఈ భావమే విశ్వకృషిని అర్థవంతము చేయును, మఱియు నీ భావమునందే కాలపురుషుని రూపమున స్వయందృష్టమైన భగవంతుడు (11-32) విశ్వకర్మ నొనర్చును. పిమ్మట, మానవదేహమునందు దివ్యనివాసిగా భగవంతుని ఆశ్రయింపు మని (18-62) గీత గట్టి పట్టు పట్టును. ఏలన అతడు సర్వభూతములందు గల అంతర్యామి; అతనిని గుర్తించనిచో, మనము వైయక్తిక జీవనము యొక్క అర్థమునే కోల్పోదుము, మన పరమ ఆధ్యాత్మిక సంభవతల వెనుకనున్న దైవిక తన అత్యధికశక్తినుండి వంచితమగును, అంతేగాదు, మానవాత్మల మధ్య సంబంధములు తుచ్ఛము, పరిమితము, అహంబద్ధము నగును. చివరకు, ప్రపంచము నందలి సర్వవస్తువులందును భగవదభివ్యక్తిని గీత విస్తరశః ఒత్తిచెప్పును, అటులే ఏకమాత్ర భగవంతుని యొక్క ప్రకృతి, శక్తి, మఱియు తేజములనుండి సర్వము యొక్క ఉత్పత్తిని ప్రకాశించును (10-39). ఏలన భూతోత్పత్తి నిట్లు చూచుటయు భగవంతుని జ్ఞానము బొందుటకు మిక్కిలి ఆవశ్యకము. ఏలన దీనిపై నాధారపడియే సమస్త సత్తము, సమస్తప్రకృతియు సమగ్రముగా భగవదభిముఖ మగును; ప్రపంచమునందు దివ్యశక్తియొక్క కర్మలను మానవు డామోదించును; అతని మనోబుద్ధులను భగవత్కర్మయొక్క ఆదర్శరూపములోనికి తిరిగి పోతపోయ సంభవమగును – ఈ భగవత్కర్మ ఆరంభమునందు విశ్వాతీతము, హేతువునందు విశ్వగతము నయి, జీవుని వ్యక్తిత్వముద్వారా ప్రసారితమగును.

8. ప్రతిస్థాయికి భిన్నధర్మములు : పరమపురుషుడు, విశ్వచేతన వెనుక నుండు అక్షరాత్మ, మానవునియందలి వైయక్తికేశ్వరుడు, మఱియు విశ్వప్రకృతి యందును, ఆమె కర్మలు మఱియు ప్రాణులయందును, గుప్తముగా బద్ధము లేక

ఆంశికముగా అభివ్యక్తము నగు భగవంతుడు — ఈ నలుగురును ఒకే సత్యము, ఒకే భగవంతుడు. కాని ఈ ఒకే భగవంతునియొక్క ఒక స్థితిధర్మము లని మనము గట్టిగా చెప్పగలిగిన సత్యములను అతని యితరస్థితులకు అన్వయించుటకు ప్రయత్నించినపుడు, అవి వ్యతిరేకమగును, లేదా తమ అర్థమును మార్చుకొనును. ఉదాహరణకు, భగవంతుడు సదా ఈశ్వరుడే; కాని మన మందుచేత అతని మూల ఈశ్వరత్వమును ఒకేవిధముగా, నే మార్పును జేయక, అతని అన్ని స్థితులకు వచ్చిగా వర్తింపజేయలేము. విశ్వప్రకృతియందు అభివ్యక్తమైన భగవంతుడుగా నతడు ప్రకృతితో ఘనిష్ఠతాదాత్మ్యము నొంది కర్మచేయును. అప్పు డతడు స్వయముగా ప్రకృతియే యని చెప్పవచ్చును, అయినను ప్రకృతికర్మలలోపల నతని భావము (spirit) పనిచేయుచు, సర్వమును ముందే చూచి, ముందే సంకల్పించి, ప్రకృతిచేత వివశముగా కర్మచేయించును, ఫలవిషయమున అధిశాసించును. పోగా, అన్నింటియొక్క ఏకమాత్ర శాంతాత్మగా, నదే భగవంతుడు అకర్త; ఇచ్చట ప్రకృతి మాత్రమే కర్త్రి. అతడు కర్మల నన్నిటిని ప్రకృతికే విడిచివేయగా, ఆమె మన స్వభావమును బట్టి వానిని నిర్వర్తించును— "స్వభావస్తు ప్రవర్తతే (5-14)." అయినను అత డిచ్చటను ప్రభువు మఱియు విభువు; కారణము, అతడు మన కర్మను నిరీక్షించుచు, ధరించును, మఱియు తన మౌన అనుమతిచే ప్రకృతికి కర్మచేయు అధికార మిచ్చును. ఇచ్చటి భగవంతుడు తన వ్యాపక, అచల సన్నిధిద్వారా పురుషోత్తముని శక్తిని ప్రకృతిలోనికి ప్రసరింపజేయుచు, తన సాక్ష్యాత్మయొక్క సమదృష్టిచేత ఆమె క్రియలను ధరించియుండును. ఇక, విశ్వాతీత పురుషోత్తముడుగా నదే భగవంతుడు సర్వమును ప్రారంభించును; అతడు సర్వాతీతుడు, సర్వమును అభివ్యక్తము కా బలాత్కరించును, అయినను తాను సృజించినదానిలో మునిగిపోడు, ప్రకృతికర్మలలో చిక్కుకొనడు. అతడు సర్వోపరిసంకల్పము, ఇది ప్రకృతి కర్మ కర్మల సర్వావశ్యకతలకు పూర్వమే సిద్ధమగు సంకల్పము. పోగా, వ్యక్తియం దతడు అజ్ఞానసమయమున రహస్య ఈశ్వరుడుగా నుండి, సర్వమును ప్రకృతి యంత్రమున బలాత్కారముగా త్రిప్పును; ఏకకాలమున సాధకమును, బాధకమును అగు అహంకారము గూడ ఈ యంత్రాంగములోని ఒక అవయవమే; కాని ప్రతి వ్యక్తిలోను పూర్ణభగవంతు డున్నాడు గావున, అజ్ఞానమును దాటుటద్వారా ఈ భ్రామ్య భ్రామక సంబంధమును మన మధిగమించగలము. ఏలన సర్వభృత్తగు ఏకాత్మతో తాదాత్మ్యము జెంది, మనము సాక్షియు, అకర్తయు కాగలము. అథవా

మన వైయక్తిక పురుషునికి మనలోని పరమేశ్వరునితో సమీచీన (right) సంబంధమును గల్పించి, తన ప్రకృతిభాగమునందా పురుషుని ఈశ్వరునియొక్క నిమిత్త కారణము మఱియు నుపకరణము గావించవచ్చును; అటులే తన పురుష భావమునందా పురుషుని లోని ఈశ్వరుని విముక్తప్రభుతలో భాగస్వామి గావించవచ్చును. గీతయందీ చతుర్విధవివేచనను మనము స్పష్టముగా గ్రహించవలెను. ఒకే సత్యముయొక్క అర్థము దాని కితరముతో గల సంబంధమును బట్టి మాఱుచుండుటను మనము గుర్తించి, దాని కవకాశ మీయవలెను. లేనిచో, ఏ విరోధము లేని చోట, మనకు విరోధము గన్పించును, అసంగతి గన్పించును, లేక అర్జునుని వలె విపరీతముగా గన్పించు వాక్యమును (4-18) విని మనమును దిగ్భ్రాంతి జెందుదుము.

9. <u>నిజానికి పరస్పరవిరోధము లేదు</u> : "అన్నియు నాయందు నిలిచి యున్నవి, నేను వానియందు నిలిచి లేను" (9-4). — అని పురుషోత్తమపరముగా గీత వక్కాణించి, వెనువెంటనే మఱల నిట్లు చెప్ప నారంభించును, "మఱియు నన్నియు నాయందు నిలిచియు లేవు; నా ఆత్మ సర్వభూతములను తనయందు ధరించును, నది వానియందు నిలిచి లేదు," (9-5). మఱియు పరస్పరవిరోధము గన్పించు రీతి నిట్లు చెప్పును — భగవంతుడు మానవదేహమున తన నివాసము నేర్పఱచుకొనెను, "మానుషీం తనుం ఆశ్రితం" (9-11), మఱియు భక్తి జ్ఞాన కర్మల పూర్ణయోగముద్వారా అంతరాత్మవిముక్తికి ఈ సత్యమును గుర్తించుటావశ్యకము (18-62). ఈ వాక్యములు పైకి మాత్రమే పరస్పర-అసంగతములు. విశ్వాతీత భగవంతుడుగా, అతడు భూతములయందు లేడు, మఱియు నవి గూడ వానియందు లేవు; ఏలన సత్తాసంభూతుల నడుమ మనమే విభేదమును జూతుమో, అది దృశ్యజగత్తున అభివ్యక్తికి మాత్రమే వర్తించును. విశ్వాతీతావస్థయందు అంతయు కాలాతీత సత్తయే మఱియు నన్నియు, అక్కడ కూడ బహుత్వ మున్నచో, కాలాతీత సత్తలే, మఱియు నచ్చట అంతర్నివాస మపేక్షించు దిక్సంబంధి (spatial) భావమునకు ప్రవేశము లేదు; ఏలన దృశ్యజగత్తున భగవంతుని యోగమాయ సృజించు దిక్కాలకల్పనలు (concepts) విశ్వాతీత నిరపేక్ష సత్తను అవచ్ఛిన్నము గావించవు. అచ్చట దేశకాలములందు సహవర్తనము (co-existence) గాక, ఆధ్యాత్మికతాదాత్మ్యము, ఆధ్యాత్మిక సమవర్తనము (coincidence) పునాదిగా నుండవలెను. కాని, దీనికి ప్రతిగా, దిక్కాలములందు విశ్వవిస్తారమును సాధించిన

అవ్యక్త, విశ్వాతీత పురుషోత్తముడు ఆ విస్తారమునందు తనలో సర్వభూతములను భరించు సర్వాత్మగా వ్యక్తమగును – "భూతభృత్" (9–5). మఱియు నీ సర్వవ్యాపియగు నాత్మద్వారా, పరమాత్మ గూడ విశ్వమును భరించుచున్నా డని చెప్పవచ్చును; అతడు దాని అదృశ్యాధ్యాత్మికాధారము, మఱియు సర్వభూతముల సంభూతికి ప్రచ్ఛన్నాధ్యాత్మిక కారణము. మనలోని రహస్యపురుషుడు మనయొక్క తలపులు, కర్మలు, గమనములను ధరించునట్లే, అతడు విశ్వమును ధరించును. అతడు మనఃప్రాణశరీరములను వ్యాపించి, వానిని తనలో ధరించు నట్లును, తన సన్నిధిచేత వానికి ఆధారముగా నున్నట్లును గన్పించును; కాని ఈ వ్యాప్తి వస్తుతః ఒక చేతనాక్రియయే గాని, భౌతికవ్యాప్తి గాదు; శరీరము సైతము సత్తాచేతనయొక్క ఒక సంతతక్రియ మాత్రమే.

10. అక్షరానంతము – క్షరానంతము : పరమాత్మ సర్వభూతములను భరించును (contains); అన్నియు నతనియందు అవస్థితములై యున్నవి, అయితే భౌతికాకాశమునందు గాదు, స్వయంభూసత్తయొక్క ఆధ్యాత్మికవిస్తారమునందు; భౌతిక మఱియు ఆకాశాత్మక దేశము (space)ను గుఱించి మనకు గల అతికఠిన అభిప్రాయము భౌతికమనస్సు మఱియు నింద్రియముల భాషలో ఆధ్యాత్మికవిస్తారము యొక్క అనువాదమే యగును. వాస్తవానికిక్కడ సైతము సర్వము ఆధ్యాత్మిక సహావర్తనము, తాదాత్మ్యము, సమవర్తనమే. కాని పరమచేతనను మనము తిరిగి ప్రాపించువఱకు ఈ మౌలికసత్యముతో వ్యవహరించజాలము. అంతదనుక అది ఒక బౌద్ధికభావనగనే యుండును, వ్యవహారమున దానికి ప్రతిరూపము గోచరించదు. కావున దేశకాలపరిభాషలోనే గురువు అర్జునున కిట్లు చెప్పును, "సర్వగతమగు మహావాయు వెట్లు ఆకాశమున వసించునో, అటులే సర్వభూతములు నాయందు వసించు నని నీవుభావించదగును." (9–6). దీనినిబట్టి విశ్వసత్త సర్వగతము మఱియు అనంతము, మఱియు స్వయంభూ పరమాత్మసత్తయు సర్వగతము మఱియు అనంతము; కాని స్వయంభూ ఆనంత్యము స్థిరము, అచలము, అక్షరము కాగా, వైశ్వ (universal) ఆనంత్యము ఒక సర్వవ్యాపి చలనము–"సర్వగతః" (9–6). ఆత్మ ఏకము; అనేకము గాదు; కాని విశ్వము సర్వభూతములుగా ప్రకటమగుచు, సర్వభూతసముచ్చయముగా గన్పించును. ఒకటి సత్త; రెండవది సత్తాశక్తి, ఈ శక్తి ఆధారభూతమగు అక్షరాత్మ యొక్క ఆ సత్తయందు చరించుచు, సృజించుచు, చేష్టించును. ఆత్మ ఈ భూతము

లన్నింటియందు గాని కొన్నింటియందుగాని వసించదు, అనగా దేనియందు నిముడదు- సర్వరూపములు మూలమున ఆకాశమునుండియే ఉత్పన్నమైనను, ఆకాశము ఏరూపములోను ఇముడనట్లు. అటులే సర్వభూతములు కలిసి ఆత్మ నేర్పఱచవు-తన రూపములు లేక శక్తులయొక్కరాశి ఆకాశము నేర్పచని యట్లే. కాని చలనమునందు సైతము భగవంతుడు గలడు; ప్రతిప్రాణిలో నివసించు ఈశ్వరుడుగా నతడు అనేకమునందు వసించును. ఒకే కాలమున అతని కీ రెండు సంబంధములును వర్తించును. ఒకటి విశ్వచలనముతో ఆత్మసత్తకు గల సంబంధము; రెండవది, అంతర్వర్తిత్వము, విశ్వసత్తకు తన స్వీయరూపములతో గల సంబంధము. ఒకటి సర్వమును తనయందిముడ్చుకొను తన అక్షరత్వరూపమున స్వయంసిద్ధమగు సత్తాసత్యము; రెండవది అదే సత్తయొక్క- శక్తిసత్యము, ఈ శక్తి తనను మఱుగుపఱచునట్టియు ప్రకటించునట్టియు తన చలనముల పాలనమునందును, చేతనీకరణము నందును వ్యక్తమగును.

11. <u>అనుగమించుచునే అధ్యక్షుడు :</u> విశ్వావస్థకు పైనుండి పరమపురుషుడు తన ప్రకృతి నదిమి, దానిలో లీనమై యున్నదాని నంతను సనాతన పునరావృత్తిచక్రమున వెలికి బంపును (9-8). విశ్వమునందలి సర్వభూతములు ఈ ఒత్తిడికిని, అభివ్యక్తసత్తయొక్క- ధర్మములకును లోబడి ప్రవర్తించును, ఈ ప్రవృత్తివలన భగవంతుని విశ్వరూపము విశ్వసామరస్యములతో విలసిల్లుచు వ్యక్తమగును. ఈ దివ్యప్రకృతి క్రియయందు- " ప్రకృతిం మామికాం ", " ప్రకృతిం స్వాం " (9-7,8) - జీవుడు తన సంభూతిచక్రము ననుగమించును. ఆమె యాత్రమలుపుల ననుసరించి, జీవు డీయా వ్యక్తిత్వ మగును; ప్రకృతియొక్క- ఉచ్చతర మఱియు ప్రథమగతియందు గానిండు, లేక నిమ్నతర మఱియు ద్వితీయగతియందు గానిండు, అజ్ఞానము లేక జ్ఞానమునందు గానిండు, దివ్యప్రకృతియొక్క- ఒక అభివ్యక్తిగా జీవుడు సదా తన సత్తాధర్మము ననుసరించియే ప్రవర్తించును. కల్పక్షయమునందు (9-7), జీవుడు ప్రకృతి క్రియనుండి వెలువడి, ప్రకృతిని నిష్క్రియతామౌనములలోనికి తిరిగివచ్చును. అజ్ఞానదశయందు జీవుడు ప్రకృతి భ్రమణమున కధీనుడై, స్వరాట్టు గాక, ఆమె శాసనమునం దుండును- " అవశం ప్రకృతేర్ వశాత్ " (9-8). దివ్యచేతనకు తిరిగి వచ్చుటచేతనే జీవుడు ప్రభుతను, స్వేచ్ఛను బొందగలడు. భగవంతుడును సృష్టిచక్రము <u>ననుగమించును,</u> అయితే దాని కధీనుడై కాక, దానిని చైతన్యవంతము గావించు పురుషుడు మఱియు

మార్గదర్శిగా. ఇచ్చట అతని సమస్తసత్త దానిలో మున్నగదు, అతని సత్తాశక్తి మాత్రమే దాని ననుగమించుచు, తీర్చిదిద్దును. అతడు తన స్వీయప్రకృతిక్రియ "కధ్యక్షుడు" (9–10)–అతడు (జీవునివలె) ప్రకృతిలో జనించిన పురుషుడు గాడు, అభివ్యక్తియందు గన్పించు దాని నంతను ప్రకృతి తననుండి పుట్టింప, ప్రకృతిని ప్రేరేపించు సృజనాత్మకపురుషుడు. అతడు తన శక్తిరూపమున ప్రకృతితో నుండి, ఆమె కర్మలను చేయించుచున్నను, ఆ కర్మలకు వెలుపల గూడ నుండును, విశ్వాతీతప్రభుతయందు విశ్వకర్మకు పైన విరాజిల్లు చున్నట్లుండును; ప్రకృతియందు లగ్నముగావించు నెట్టి దుర్దమకామముచేతను ఆమెయం దాసక్తుడు గాడు, కావుననే ఆమె కర్మలచేత బంధింపబడడు (9–9), కారణము, అత డా కర్మలకు అనంతముగా పైనను, పూర్వమునను నుండువాడు, కాలచక్రములందు ఆ కర్మల సర్వప్రవృత్తికి ముందు, నడుమ, తర్వాతను ఏకరీతిగా నుండువాడు. వాని మార్పులు అతని అక్షరసత్త కెట్టి మార్పును గల్గించవు. విశ్వము నంతటిని వ్యాపించి, ధరించు నీరవ అక్షరాత్మ దాని వికారములచే ప్రభావితము గాదు; కారణము, అది వానిని ధరించుచున్నను, వానిలో పాల్గొనదు. కాగా ఈ అధికతర, విశ్వాతీత పరమాత్మయు ప్రభావితము గాదు; కారణము, అది వానికి పరమునను, శాశ్వతముగా పూర్వమునను ఉండును.

12. <u>సమగ్ర, పరిపూర్ణమార్గము</u>: కాని, మఱియు, ఈ క్రియ దివ్య ప్రకృతిక్రియ గావునను – "స్వాం ప్రకృతిః" (9–8)– దివ్యప్రకృతి దేవునినుండి విడివడి యుండదు గావునను, ఆమె సృజించు ప్రతిదానియందును భగవాను డంతర్వర్తిగా నుండితీరును. ఈ సంబంధము అతని సత్తయొక్క సంపూర్ణ సత్యము గాదు, అయినను మన మీ సత్యము నేమాత్రము నుపేక్షింపజాలము. అతడు మానవదేహమున నివసించుచున్నాడు. ఎవ రతని ఈ సన్నిధి నుపేక్షింతురో, ఈ సన్నిధి ధరించిన ముసుగు కారణముగా, దాని నెవరు అవమానింతురో, వారు ప్రకృతిరూపములకు విమూఢు లగుదురు (9–11), లోపల గుప్తముగా భగవంతు డున్నా డని వారు కనుగొనజాలరు – ఈ భగవంతుడు తక్కిన దేహములందు యోగమాయసమావృతుడై నప్పటికి, అవతారదేహమున బాహ్యచేతనయందు గూడ తెలియబడును. ఎవరు మహాత్ములో – తమ అహంభావమున ఆవృతులు గారో – ఎవరు అంతర్నివాసి భగవంతుని కున్మీలితు లగుదురో, వారు పరిమిత – మానవ

ప్రకృతిచేత నిచ్చట పరిచ్ఛిన్నుడై నట్లు గన్పించు ఈ రహస్యభగవంతుడును, మనము వెలుపల పరమభగవంతునిగా నుపాసించు పరంజ్యోతియు నొకటే యని తెలిసికొందుము (9-13). ఈ గుప్త భగవంతుడే తన ఉత్తమ స్థితియందు సర్వభూతవిభూతుడు, అధీశ్వరుడు నవియు, మఱియు ప్రతిప్రాణియందును గూడ నితడు పరదేవతగానే యున్నా డనియు నెఱుంగుదురు. ఇతడు గాక, తక్కిన దంతయు అభివ్యక్తినిమిత్తము విశ్వమువం దతడు ధరించిన పరిమితత్వమే. ఇంతయు, అతని ప్రకృతియే విశ్వమువం దంతయు నయ్యెను గావున, ప్రతివస్తువు తన స్వరూపమున భగవంతుడే గాని, మఱేదియు గాదని, అంతయు వాసుదేవుడే యని వారు గాంతురు; మఱియు నతని విశ్వాతీత భగవంతునిగనే కాక, ఇచ్చట నతని ఏకత్వరూపమునను, ప్రతిప్రాణియందును గూడ నుపాసింతురు. (9-15). వారీ సత్యమును దర్శించుటయే గాక, దానియందు నివసింతురు, కర్మ చేతురు; అతనినే వారు విశ్వాతీతభగవంతునిగను, విశ్వమయభగవంతునిగను, ప్రతివస్తువునందు గల అంతస్థభగవంతునిగను ఆరాధింతురు, అనుజీవింతురు, సేవింతురు (9-14) - కర్మయజ్ఞముచేత సేవింతురు, జ్ఞానముచేత నన్వేషింతురు, సర్వత్ర అతనిని తప్ప అన్యము నేమియు జూడరు (9-15), మఱియు తమ సంపూర్ణసత్తను - దాని ఆత్మయందును, బాహ్యాభ్యంతర ప్రకృతియందును - అతనిలోనికే లేవనెత్తుకొందురు. ఇదియే సమగ్ర, పరిపూర్ణమార్గ మని వారికి దెలియును (9-34); ఏలన ఇది విశ్వాతీతము, విశ్వగతము, వైయక్తికము నగు ఏకమాత్ర భగవంతుని సంపూర్ణసత్యముతో గూడిన మార్గము.

# 6. కర్మ, భక్తి, జ్ఞానము

1. <u>సమగ్రజ్ఞాన సంగ్రహము</u> : కావున నిదియే సంపూర్ణసత్యము, అత్యున్నత, అతివిశాలజ్ఞానము. 1. భగవంతుడు విశ్వాతీత, సనాతన పరబ్రహ్మము; అతడు (ఇది) తన దేశకాలాతీత అస్తిత్వముచే దేశకాలములందు తన సత్తాప్రకృతుల విశ్వాభివ్యక్తి నంతను ధరించును. 2. భగవంతుడు పరమాత్మ; ఇతడు

విశ్వముయొక్క రూపములను, గతులను ఆత్మవంతము గావించును. 3. భగవంతుడు పురుషోత్తముడు; ఈ విశ్వమునందు గాని, ఏ విశ్వమునందు గాని సమస్తాత్మ మఱియు ప్రకృతి, అనగా సమస్తసత్త మఱియు సంభూతి ఇతనియొక్క స్వభావనయే, స్వతపస్యయే. 4. భగవంతుడు అవర్ణనీయ పరమేశ్వరుడు; ఇతడు ప్రకృతియందభివ్యక్తమైన తన శక్తిని తన ఆధ్యాత్మిక నియంత్రణచే నియమించి, ప్రపంచ యుగములను, ఆ యుగములందు ప్రాణుల ప్రాకృతవికాసమును బయల్పఱచును. ఈ యీశ్వరునుండియే నిర్గమించి, జీవుడు, అనగా వ్యష్టిపురుషుడు, ప్రకృతిగత అంతరాత్మ ఇచ్చట విశ్వచక్రములలోనికి వచ్చును – ఈ జీవుడు అతని సత్తచేత సత్తావంతుడు, అతని చిత్ప్రకాశముచేత సచేతనుడు; అతని సంకల్ప, శక్తులచేత ఈ జీవునికి జ్ఞాన, సంకల్ప, క్రియలయందధికారము; అతని విశ్వభోగముచేత నితని జీవనభోగము.

2. <u>మిక్కిలి దగ్గరి మార్గము</u> : మానవునియందలి అంతరాత్మ ఇచ్చట భగవంతునియొక్క ఆంశికాభివ్యక్తి, ప్రకృతికర్మల నిమిత్తము అతడట్లు స్వయం పరిమితుడగును–" ప్రకృతిర్ జీవభూతా " (7–5). ఆధ్యాత్మికమూలమునందు అతడు భగవంతునితో నేకమే. దివ్యప్రకృతికర్మలయందింకను అతడతనితో నేకమే యైనను, ఇచ్చట వ్యావహారికభేదము గన్పించును, ప్రకృతిగతభగవంతునితోను, ప్రకృతికి పరుడగు భగవంతునితోను అనేక, గంభీరసంబంధము లేర్పడును. కాని నిమ్నప్రకృతికర్మలయందు, అజ్ఞానముచేతను, అహంకారిక పృథగ్భావముచేతను అతడు ఏకమాత్రభగవంతునికంటె మిక్కిలి అన్యుడుగా గన్పించును; మఱియు నీ పృథక్కరచేతనయందు తన అహంకారిక సుఖము మఱియు ప్రయోజనము నిమిత్తమే ఆలోచించుచు, సంకల్పించుచు, కర్మచేయుచు, భోగించుచు నున్నట్లు తోచును. కాని నిజానికి అతనిసత్త, ఆలోచన, సంకల్పము, క్రియ, భోగమంతయు భగవంతుని సత్త, ఆలోచన, సంకల్పము, క్రియ, ప్రకృతిభోగముయొక్క ఒక ప్రతిబింబము మాత్రమే – అయితే అతడజ్ఞానమునందున్నంత కాలము ఈ ప్రతిబింబము అహంమయము, వికృతము నగును. తన యీ సత్యమును తిరిగి ప్రాపించుట అతని విముక్తికి ప్రత్యక్ష సాధనము, అజ్ఞానాధీనతనుండి తప్పించుకొనుటకు విశాలతమ, నికటతమద్వారము నగును. జీవుడొక పురుషుడు, అనగా మనస్సు మఱియు బుద్ధి, సంకల్పము మఱియు సశక్తిక్రియ, భావము మఱియు సంవేదనము (sensation),

జీవనానందముకొఱకు ప్రాణమయకామన - వీనిరూపమగు ప్రకృతితో గూడిన ఒక అంతరాత్మ; కావున జీవుని ఈ శక్తుల నన్నింటిని భగవదున్ముఖము చేయుటచేతనే తన అత్యున్నతసత్యమునకు జీవుని ప్రత్యావర్తనము సంపూర్ణముగా సంభవమగును. అతడు పరమాత్మ మఱియు బ్రహ్మజ్ఞానముతో (దేనినైన) దెలిసికొనవలెను: అతడు తన ప్రేమ మఱియు ఆరాధనలను పరమపురుషునికి మఱల్చవలెను; అతడు తన సంకల్పము మఱియు కర్మలను జగదీశ్వరునికి అధీనముచేయవలెను. అప్పుడతడు నిమ్నప్రకృతినుండి ఉన్నతప్రకృతిలోనికి జరుగును: అజ్ఞాన చింతన, సంకల్పము, మఱియు కర్మలను త్రోసివేసి, తన దివ్యతాదాత్మ్యమునందు పరమాత్మ యొక్క ఒక ఆత్మగా, పరమచైతన్యముయొక్క ఒక శక్తి మఱియు వెలుగుగా చింతించును, సంకల్పించును, మఱియు కర్మచేయును. ఇప్పుడతడు బాహ్యస్పర్శలను, వేషములను, రూపములనే గాక, భగవంతుని ఆంతర అనంతము నంతను అనుభవించును. ఇట్లు దివ్యభావముతో నివసించుచు, తన సంపూర్ణాత్మను, అంతరాత్మను (జీవభావమును), ప్రకృతిని భగవదభిముఖముగా నడుపుచు, అతడు పరబ్రహ్మ రూపమగు సత్యతమ సత్యములోనికి స్వీకరించబడును.

3. <u>హృదయపురుషుడు పరమపురుషుడే</u>: సర్వము వాసుదేవుడే యని తెలిసికొని, ఆ జ్ఞానమున నివసించుటయే రహస్యము. మొదట జీవు డతనిని, సర్వమును దనయందు గలిగి, సర్వమునందు నుండు అక్షరాత్మగా నెఱుంగును. అపు డతడు నిమ్నప్రకృతియొక్క సంక్షోభమునుండి వెనుకకు తగ్గి, ఈ స్వయంభూ ఆత్మయొక్క సహజనిశ్చల శాంతిలో నివసింపసాగును. నివసించుచు, భగవంతుని యొక్క ఈ ఆత్మతో సంతత ఏకతను సాధించును. పిమ్మట నతడు క్షరప్రపంచము యొక్క ఈ సనాతన, ఆధ్యాత్మిక అక్షరాధారమునుండి తన దృష్టిని తతోధిక, సనాతన, విశ్వాతీత సత్పురుషుని వైపునకు ద్రిప్పును. ఇక జీవు డతనిని సర్వ వస్తువులయందలి దివ్యనివాసిగా, మానవహృదయమునందలి స్వామిగా, రహస్య ఈశ్వరునిగా నెఱింగి, తన ప్రాకృతసత్తకును, తన సత్తయొక్క ఈ ఆంతర స్వామికిని మధ్య నున్న తెరను ద్రొలగించుకొనును. అపుడు అంతర్నివాసి భగవంతుని సంతతానుభవమునకు అనురూపముగావించబడిన తన సంకల్పమును, చింతనను, కర్మను జ్ఞానపూర్వకముగా ఈశ్వరసంకల్పము, చింతన, మఱియు కర్మలతో నేకము గావించును, అతనినే అన్నింటియందును దర్శించి, ఆరాధించును, మఱియు సర్వ

మానవకర్మను దైవప్రకృతి పరమాశయమునకు అనుగుణముగా మార్చును. తన చుట్టును గల సర్వముయొక్క మూలము, సారతత్త్వము ఈశ్వరుడే యని అత డెఱుంగును. ఉన్న వస్తువు లన్నియు తమ బాహ్యరూపమున ఆ ఏకమాత్ర, అచింత్య సద్వస్తువుయొక్క ముసుగు లనియు, తమ అంతఃప్రవృత్తియందు దాని సాధనములు మఱియు సంకేతము లనియు అతడు దర్శించును; అతడు సర్వత్ర ఆ ఏకతను, బ్రహ్మమును, పరమపురుషుని, సర్వాత్మను, వాసుదేవుని, సర్వము నైన మూలసత్తనే కనుగొనును. ఇందుచేతను గూడ సాధకుని అంతరజీవన మంతయు తన చుట్టును గల చరాచరమునం దంతటను ఇపుడు స్వయంప్రకటితమైన అనంతముతో సమస్వరము, సామరస్యపూర్ణము నై చెలంగును; కాగా నతని బాహ్యజీవన మంతయు విశ్వకార్యముయొక్క ఒక యథార్థ ఉపకరణక్రియ యగును. అతడు సర్వాత్మద్వారా పైకిజూచుచు, ఇహపరములందు ఏకమాత్ర సత్తయగు పరబ్రహ్మమును గాంచును. అతడు అన్నింటియందును గల అంతర్నివాసిద్వారా పైకిజూచుచు, తన పరమావస్థ యందు సర్వనివాసమున కావల నుండు అతీతపురుషుని జూచును. విశ్వమునం దభివ్యక్తమైన ఈశ్వరునిద్వారా పైకి జూచుచు, అభివ్యక్తికి పరమునం దుండి, దానిని శాసించు పరమేశ్వరుని గనుగొనును. ఇట్లు అనంతమగు జ్ఞానోత్ఫుల్లనము ద్వారా, ఊర్ధ్వదృష్టి మఱియు నాకాంక్షద్వారా అతడు దేని వైపునకు ' సర్వభావముతో ' (15-19) అనివార్యముగా దిరిగెనో, దాని కెగయును.

4. సమన్వయ వివరణము : ఇట్లు సర్వభావముతో అంతరాత్మ భగవదభిముఖ మగుటయే జ్ఞాన భక్తి కర్మల గీతాసమన్వయముయొక్క ఆధారరాజము. అతని నిట్లు సమగ్రముగా నెఱుంగుట యన, ఆత్మయందును, సమస్తాభివ్యక్తియందును, అభివ్యక్తి కావలను అతని నేకమాత్రునిగా నెఱుంగుటయే - ఇది యంతయు ఏకకాలమున సంయుక్తముగా నెఱుంగుట. అయినను ఇట్టి శుష్కజ్ఞానము సైతము చాలదు; దానితో బాటు భగవదభిముఖగా హృదయము మఱియు నంతరాత్మలయొక్క ప్రగాఢ ఉద్గమన ముండవలెను, దానిచేత సర్వాలింగకమగు ప్రేమ, ఆరాధన, ఆకాంక్ష ప్రదీప్తము గావలెను. నిశ్చయముగా, ఆకాంక్షచేత అనుగతము, ఉద్గమనముచేత ఉజ్జీవితము గాని జ్ఞానము సత్యజ్ఞానము గాదు; ఏలన అది ఒక బౌద్ధికదర్శనము, నిష్ఫల విచారణాప్రయాసము మాత్రమే కాగలదు. భగవద్దర్శనము తప్పక భగవదా రాధనను, సోత్సాహాన్వేషణను గొనివచ్చును-ఈ ఉత్సాహము స్వయంభూ భగవంతుని

పరమే కాక, మనయందలి, ప్రపంచమునందలి భగవత్పరము గూడను. బుద్ధితో నెఱుంగుట అర్థముచేసికొనుట మాత్రమే, అది ఉపయుక్త ప్రారంభము గావచ్చును, కాకపోవచ్చును - జ్ఞానమునందు ఎట్టి చిత్తశుద్ధి, సంకల్పమునం దెట్టి సాక్షాత్కార ప్రేరణ, అంతరాత్మపై నెట్టి శక్తి ప్రభావము, అంతఃపురుషునిలో నెట్టి పిలుపు లేనిచో, కాదుగూడ. కారణము, మేధ బాహ్యముగా నర్థముచేసికొనెనే గాని, అంతరాత్మ ఏమియు దర్శించ లేదనియే దాని కర్థమగును. అంతఃసత్తతో దెలిసి కొనుటయే యదార్థ జ్ఞానము, మఱియు అంతఃసత్తను ప్రకాశము స్పృశించినపుడు, ఆ ప్రకాశమున దృష్టమగు దాని నది ఆలింగనముచేసికొన రెపరెపలాడును, దానిని బొంద నభిలషించుచు, దానిని తనలో రూపొందించుకొని, తద్రూపము నందుటకు ప్రయాసపడును. ఈ అర్థమున, జ్ఞాన మన (పూర్వమే యున్న) తాదాత్మ్యమునకు కనువిప్పుట యగును, మఱియు నీ తాదాత్మ్యమును అంతఃపురుషుడు చేతనానందముల చేతను, ప్రేమచేతను, ప్రాప్తిచేతను సాధించుకొనును గాన, ప్రబుద్ధమైన జ్ఞానము - సత్యమును ఏకమాత్రపరిపూర్ణము నగు నిట్టి సిద్ధిని సాధించు అప్రతిహత సంవేగ మును బుట్టింపవలెను. ఇచ్చట జ్ఞానవిషయము బాహ్యవస్తువు గాదు, పరంతు మన సర్వసత్తయొక్క ఆత్మయు, నధీశుడు నగు దివ్యపురుషుడు. అతనియం దొక ప్రబలానందము, అతనిపట్ల ప్రగాఢము, సజీవము నగు ప్రేమారాధనలు ఈ జ్ఞానముయొక్క అనివార్యఫలితము, జ్ఞానముయొక్క సాక్షాదాత్మయు గావలెను. మఱియు నీ ఆరాధన హృదయాన్వేషణ మాత్రమే గాదు, పరంతు సర్వభావ సమర్పణము. కావున ఈ ఆరాధన యజ్ఞరూపము గూడ ధరించవలెను; మన కర్మ లన్నియు నీశ్వరునికి సమర్పింపబడును, సక్రియమగు మన బాహ్యాభ్యంతర ప్రకృతి యంతయు తన ప్రతివృత్తియందును ఆరాధ్యదైవమునకు నివేదించబడును. మన ఆంతరవృత్తు లన్నియు అతనియందే వర్తించుచు, తమ శక్తిమూలముగను, తమ ప్రయత్నగమ్యముగను ఆత్మయు, నధీశుడు నగు నతనినే అన్వేషించును. పోగా మన బాహ్యవృత్తులు ప్రపంచమునందు గల భగవంతుని వైపుగా వర్తించుచు, అతని సేవ నారంభించును, ఈ సేవను ఎవనియందు మనము విశ్వముతోను, విశ్వ ప్రాణులతోను ఏకాత్మకులముగా నుందుమో, అట్టి అంతఃస్థభగవంతుడు నడుపును. ఏలన పురుషోత్తముడే యగు నీ అంతఃస్థభగవంతునికి ప్రకృతియు, ప్రకృతిగత ఆత్మయు బాహ్యాంతరశరీరము లగును. ఇట్లు ఏకమాత్ర ఆత్మ మఱియు పురుషుని యందు మనస్సు, హృదయము, మఱియు సంకల్పములయొక్క సమన్వయము

సిద్ధించును; దీనితో బాటు ఈ పూర్ణ సాయుజ్యమునందు, ఈ విశ్వతోముఖ భగవత్సాక్షాత్కారమునందు, ఈ దివ్యయోగమునందు జ్ఞాన భక్తి కర్మల సమన్వయ మును సిద్ధించును.

5. <u>దివ్యయోగము కష్టమగుటకు గారణము :</u> ఈ యోగమున పాదము పెట్టుట సైతము అహంబద్ధ ప్రకృతికి మిక్కిలి కష్టము; కాగా మార్గమున చివరి సారిగా, శాశ్వతముగా పాదముపెట్టిన పిమ్మట సైతము విజయోపేత సామరస్య పూర్ణ పూర్ణయోగము సులభము గాదు. మర్త్యమానసము ఆవరణలను (veils), ఆభాసములను (appearances) అజ్ఞముగా నమ్మి, భ్రాంతమగును; అది మానవ శరీరమును, మానవమానసమును, మానవజీవనవిధానమునే చూచును గాని, ప్రతి ప్రాణిలోపల నివసించు భగవంతుని విమోచకదర్శనమును ఒక మెఱపుగా గూడ బొందదు. తనయందున్న భగవంతు నది చూడదు, ఇతరులయం దున్న భగవంతుని జూడజాలదు; మానవజాతియందు అవతారముగను, విభూతిగను భగవంతుడు తన నభివ్యక్తము చేసికొనుచున్నప్పటికి, దానికి చూడ కండ్లు లేవు, అది అతనిని ఉపేక్షించును లేక అవమానించును – "అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితం" (9-11). మఱియు నది సజీవప్రాణులయందే అతని నుపేక్షించి నపుడు, జడప్రపంచమున అసలు చూడనే లేదు; కారణము, అది బాహ్యప్రపంచమును పృథక్కరమగు అహంకారకారాగారమునుండి పరిమితమగు మనోగవాక్షముద్వారా చూచును. అది ప్రపంచమునందలి భగవంతుని జూడదు, ఇక సర్వభూత మహేశ్వరుడును, వానిలోపల నివసించువాడును అగు పరమపురుషుని గుఱించి దాని కేమియు తెలియదు. ఏ దర్శనముచేత ప్రపంచమునందలి సర్వము భగవంతుడుగా గన్పించసాగునో, మఱియు అంతరాత్మ స్వయముగా తన అంతర్గతదివ్యతకు మేల్కొని భగవదంశము, భగవత్సదృశము నగునో, అట్టి దర్శనమునకు మర్త్యమానస మంధము. విషయములను విషయములకొఱకును, బుద్ధీంద్రియ శరీరముల పార్థివ తృష్ణాతృప్తికిని వేటాడు అహంకారజీవనమును మాత్రమే అది అనాయాసముగా జూచును, దానియందే ప్రబలముగా సక్తమగును. ఎవరు మనోవృత్తి యొక్క ఈ బహిర్ధావనమునకు సర్వథా అంకితమగుదురో, వారు నిమ్నప్రకృతిలో చిక్కుకొని, దానియందే సంసక్తులై, దానినే తమ ఆధారభూమి గావించుకొందురు. వారు మానవునియందలి రాక్షసప్రకృతికి గుఱియగుదురు – మానవునియందలి ఏ

రాక్షసుడు తన ప్రాణికాహంకారముయొక్క ప్రచండ తృప్తినిమిత్తము సర్వమును ఆహుతిచేసి, దానినే తన యిచ్ఛ, చింతన, క్రియ, భోగములయొక్క తమోమయ దేవతను గావించుకొనునో అట్టి రాక్షసప్రకృతికి గుఱియగుదురు. (9-12). అథవా వారు తమలోని ఆసురప్రకృతికి గుఱియై, దురహంకారపూర్ణమగు స్వేచ్ఛచేతను, స్వయంపర్యాప్తచింతనచేతను, స్వవిషయక కర్మచేతను, సదా మేయుచునే సదా అతృప్తముగా నుండు ఆసురప్రకృతియొక్క భోగలాలసచేతను వ్యర్థచక్రమున ముందుకు నెట్టబడుచు, భ్రమించుచుందురు. కాని వేఱుచేయునట్టి ఈ అహంచేతన యందే చెడ్డపట్టుతో నివసించుచు, దానినే మన సర్వ కార్యకలాపములకు కేంద్రము చేయుట యన, సత్యమగు ఆత్మబోధమునకు సర్వథా దూరమగుటయే యగును. ఈ అహంచేతన దారితప్పిన ఆత్మోపకరణములపై బఱపు సమ్మోహనము ఒక మాయయై జీవితమును ఒక నిరర్థక చక్రభ్రమణమునకు బంధించును. దివ్యసనాతన ప్రమాణమును బట్టి చూచిన, అట్టి జీవితముయొక్క సమస్తాశయు, కర్మయు, జ్ఞానమును వ్యర్థములు (9-12); ఏలన అది మహత్తర ఆశను బహిష్కరించును, విమోచకకర్మను వెలివేయును, జ్యోతిర్మయజ్ఞానమునకు స్వస్తిచెప్పును. మఱియు దృశ్యమును జూచి, దృశ్యసత్యమును జూడజాలని జ్ఞానము మిథ్యాజ్ఞానము; క్షణికము వెంటబడి, సనాతనమునకు దూరమగు ఆశ గ్రుడ్డి ఆశ; దేనివలన గలిగిన లాభము దానివలన గలిగిన నష్టముచేత సున్నయగునో, అట్టి కర్మ నిష్ఫలకర్మ, 'సిసిఫస్' చేసిన నిరంతర పరిశ్రమ మాత్రమే యగును.

6. <u>జీవన మంతయు నిత్యయోగము</u> : అయితే యథాశక్తి దివ్యతర ప్రకృతియొక్క తేజోవిశాలతలకు ఉన్మీలితులగు మహాత్ములు మాత్రమే ముందు సంకుచితము, క్రమముగా చెప్పరానంత విశాలమునై, విముక్తి, సంసిద్ధులకు గొనిపోవు మార్గము నాశ్రయించినవారు (9-13). మానవునియందలి దేవుని వృద్ధియే మానవుని సముచితకార్యము; నిమ్నతరమగు నీ ఆసుర, రాక్షసప్రకృతిని దృఢభావమున దివ్యప్రకృతిలోనికి త్రిప్పుటయే మానవజీవితముయొక్క ప్రచ్ఛన్నమర్మము. ఈ <u>వృద్ధి</u> వృద్ధి జెందినకొలది ఆవరణము తొలగి, కర్మయొక్క అధికతరాశయమును, జీవనముయొక్క వాస్తవసత్యమును అంతరాత్మ చూడగలుగును. మానవుని లోపలి భగవంతునికి, ప్రపంచమునందలి భగవంతునికి కన్ను తెఱచుకొనును. లోపలిగా జూచుచు, వెలుపలిగా అనంతసత్తను జూడసాగును - ఈ అవ్యయ సత్తయే (9-13)

సర్వభూతములకు జన్మస్థానము, ఇదియే (ఇతడే) అన్నింటియందు నుండును, ఇతని చేతనే, యితనియందే అన్నియు సదా యుండును. కావున నీ అంతర్దర్శనము, జ్ఞానము నంతరాత్మను పట్టివేసినపుడు, అంతరాత్మయొక్క సమస్తాకాంక్షయు భగవంతుని యందు ఒక అత్యుత్కటప్రేమ మఱియు అగాధభక్తిరూపము ధరించును. పోగా మనస్సు ఆ సమగ్రభగవంతుని యందు అనన్యముగా ఆసక్తమగును; అతని నిమిత్తము గాక, అది దేనికిని ఎట్టి విలువ నివ్వదు, ఆ సర్వానందమయ పురుషుని యందే అది రమించును. అప్పుడు భక్తుని సమస్తవాక్కును, చింతనయు ఒక అఖండకీర్తన (9–14) మగును–తన మహిమాతిశయమునం దిపుడు స్వయముగా నావిష్కరించుకొనిన విశ్వవ్యాపక మహత్త, తేజము, సౌందర్యము మఱియు సత్యములయొక్క కీర్తన మగును, మఱియు పరమాత్మ, మఱియు అనంతపురుషుని యొక్క పూజన మగును. భేదించుకొని వెలికి వచ్చుటకు అంతరాత్మ పడిన సుదీర్ఘ ప్రయాస మంతయు నిపుడు తనలోని భగవంతుని దర్శించుటకును, ప్రకృతిలోని భగవంతుని దర్శించుటకును వలయు నొక ఆధ్యాత్మిక ప్రయత్నరూపము ధరించును. జీవన మంతయు నొక నిత్యయోగ (9–14) మగును, మఱియు దైవమానవభావముల ఏకీకరణ మగును. సంపూర్ణభక్తియొక్క రీతి యిది; సనాతన పురుషోత్తమునికి అంకితమైన హృదయము సమర్పించు యజ్ఞముద్వారా మన సమస్తసత్త మఱియు ప్రకృతియొక్క సమగ్రసముద్ధరణము నీ భక్తి సాధించును.

7. <u>జ్ఞానము భక్తిని బుట్టించును</u> : జ్ఞానమున కధికప్రాధాన్య మిచ్చువారు సైతము భగవద్దర్శనమువలన అంతరాత్మపైనను, ప్రకృతిపైనను ప్రసరించు నిత్య వర్తమానము, తత్పరతాజనకము, కార్యసాధకము నగు శక్తిచేత అదే స్థానమును ప్రాపింతురు. వారిది జ్ఞానయజ్ఞము, జ్ఞానగర్భమగు అవర్ణనీయ ఆనందాతిరేకముచేత వారు పురుషోత్తముని ఉపాసింపసాగుదురు–"జ్ఞానయజ్ఞేన యజంతో మాం ఉపాసతే" (9–15). ఈ సమ్యగ్ జ్ఞానము భక్తిపూర్ణము, ఏలన అది తన కరణములందు సమగ్రము, తన లక్ష్యమునందు సమగ్రము. అది పరమతత్త్వము నొక నిర్విశేష ఏకత్వముగనో, అపరిచ్ఛేద్య కేవలముగనో భావించి అనుసంధించు జ్ఞానము గాదు. అది పరముని మఱియు విశ్వాత్మకునియొక్క హృదయంగమ అన్వేషణము మఱియు ఆలింగనము; అది అనంతుని తన అనంతతయందును, అనంతుని సమస్తసాంతము నందును అనుసంధించుట యగును; అటులే ఆ జ్ఞానము ఏకుని తన ఏకతయందును,

ఏటిని తన వివిధతత్త్వములు, అసంఖ్యాకముఖములు, శక్తులు, రూపములందును దర్శించుటయు, కౌగిలించుటయు నగును; ఇచ్చటను, అచ్చటను, సర్వత్రను, కాలాతీతముగను, కాలమునందును, ప్రపంచమున మనకు తారసిల్లు కోటి కోటి ప్రాణులయందును ఆ ఏకమాత్రునే దర్శించుట యగును–" ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖం " (9–15). ఈ జ్ఞాన మనాయాసముగా నొక ఆరాధనయు, నొక విశాల భక్తియు, నొక వ్యాపక ఆత్మసమర్పణయు, నొక సమగ్ర ఆత్మ నివేదనము నగును, కారణము, అది యొక పరమాత్మజ్ఞానము, ఒక పరమసత్తతో సంపర్కము, విశ్వాతీతుడు, విశ్వమయుడు నగు నొక పరమపురుషుని ఆలింగనము– ఈ పరమపురుషుడు తనను సమీపించినపుడు మనపై తన అనంతానందముయొక్క విధుల నెట్లు కుమ్మరించునో, అటులే మన సర్వస్వమును తా నపహరించును.

8. <u>కర్మయు భక్తిగా మాఱుట</u> : కర్మయోగము సైతము ఆత్మనివేదన రూపమగు నొక ఉపాసన మఱియు భక్తిలోనికి మాఱును; ఏలన అది ఏకమాత్ర పురుషోత్తమునికి జేయు మన సమస్తసంకల్పము మఱియు దాని కార్యకలాపముల యొక్క సంపూర్ణయజ్ఞము. బాహ్య వైదికయజ్ఞ మొక శక్తిశాలిసంకేతము; దాని ఫలము స్వల్పమైనది, అదియును స్వర్గోన్ముఖము. కాని దేనియందు సర్వమయ భగవంతుడే యజ్ఞక్రియ, యజ్ఞము, యజ్ఞసంబంధి ప్రతివిభాగము నగునో, అదియే వాస్తవయజ్ఞము (9–16). ఈ అంతరయజ్ఞముయొక్క సమస్తక్రియలు మఱియు రూపములు మనయందలి అతని శక్తియొక్క స్వయంనియమనము, స్వయంప్రకట నము నగును, మన ఆకాంక్షద్వారా ఇట్టి శక్తి తన మూలమున కారోహించును. మనయందలి దివ్యనివాసియే స్వయముగా నగ్నియు, ఆహుతియు; ఎట్లన ఈ అగ్ని భగవదభిముఖ సంకల్పము, ఇక నిట్టి సంకల్పము మనయందలి భగవంతుడే. అటులే ఆహుతియు మన సత్తాప్రకృతులయందలి భగవద్భావముయొక్క ఒక రూపమును, శక్తియు మాత్రమే. అతనినుండి స్వీకరించబడిన దంతయు తిరిగి దాని మూలసత్యమునకే సేవారాధనల రూపమున అర్పించబడును. దివ్యమనీషి (Thinker) స్వయముగా మంత్ర మగును; ఎట్లన భగవదభిముఖమగు చింతనయందు అతని ప్రకాశము తనను ప్రకటించుకొనును, మఱియు నీ చింతనకు శరీరమగు మంత్రశబ్దమునందు–ఆవిష్కరణాత్మకమంత్రశబ్దమునందు—ఆ ప్రకాశము కార్యకారి యగును, అనగా మంత్రము అతని ప్రకాశముయొక్క మూర్తీభావము. ఇంకను,

ప్రకాశనశీల భగవంతుడే వేదమును, వేద్యమును (9-17). అతడు జ్ఞానమును, జ్ఞానవిషయమును – రెండును. ఋగ్వేదము, అనగా జ్ఞానకిరణములతో బుద్ధిని దీపింపజేయు ప్రకాశమయమంత్రము; యజుర్వేదము, అనగా కర్మను సరిగా నియమించునట్టి శక్తిమయమంత్రము; సామవేదము, అనగా అంతరాత్మ దివ్యాకాంక్షను ఫలింపజేయు ప్రశాంత, సామరస్యమయ సాధనమంత్రము – ఇవి స్వయముగా బ్రహ్మమే, భగవత్సత్తయే. దివ్యచేతనామంత్రము తన ఆవిష్కరణప్రకాశమును గొనివచ్చును; దివ్యశక్తిమంత్రము తన కార్యసాధనసంకల్పమును గొనివచ్చును; దివ్యానందమంత్రము జీవనమునందలి ఆధ్యాత్మికానందముయొక్క సమసాఫల్యమును గొనివచ్చును. పోగా ఓంకారము గలదు, ఇది సనాతన, మూలశబ్దము. ఇది తన అంశికరూపమున ఇంద్రియగ్రాహ్య రూపములందు వ్యక్తమగును; ఈ రూపములు దేనికి ప్రతీకములో, అట్టి స్వయంభావనరూపమగు అంతరజగత్తునందును వ్యక్తమగును; ఈ ఉభయజగత్తుల వెనుక తనలోదాగుండు, అనంతునియొక్క ఇంద్రియాతీతశక్తియందును వ్యక్తమగును : ఈ తృతీయ రూపమున, ఓంకారము శబ్దార్థములకు, నామరూపములకు, సర్వమునకు మూలము, బీజము, గర్భము నగును. ఇక తన సమగ్రరూపమున ఓంకారము పరమ అగ్రాహ్యము, ఆద్య ఏకత్వము, కాలాతీతగుహ్యము నగు స్వయంసిద్ధ, [1] దివ్యసత్తయగును. ఇట్లీ అంతరయజ్ఞము ఏకకాలమున కర్మ భక్తి జ్ఞానములు – మూడు నగును.

9. <u>మృత్యు వతని ముసుగు</u> : ఏ అంతరాత్మ ఇట్లు సనాతనపురుషునెఱుంగునో, ఆరాధించునో, తన కర్మల నన్నింటిని అతనికే అర్పించునో, ఆ ఆత్మకు భగవంతుడే అంతయు, అంతయును భగవత్సత్తయే. అది భగవంతుని తన బిడ్డలను పోషించుచు, కాచి రక్షించు తండ్రిగా నెఱుంగును. మనలను తన యొడిలో ధరించుచు, మనపై తన ప్రేమమాధుర్యమును గుమ్మరించుచు, ప్రపంచమును తన సౌందర్యరూపములతో నింపుచు నుండు దివ్యమాతగా నది భగవంతు

---

[1] ఓం=అ+ఉ+మ. అ – కారము స్థూల, బాహ్యజగత్తుయొక్క ఆత్మ – విరాట్టు. ఉ – కారము సూక్ష్మ, అంతరజగత్తుయొక్క ఆత్మ – తైజసుడు. మ–కారము గుప్త, అతీంద్రియ సర్వశక్తిమత్తయొక్క ఆత్మ – ప్రాజ్ఞుడు. ఓం – కారము కేవల తురీయము. (మాం. ఉ.) – శ్రీ అ.

నెఱుంగును. దేశకాలసంబంధములయందు సర్వమును బుట్టించువారిని బుట్టించు ప్రథమసృష్టికర్తగా–"పితామహః" (9–17) – అది అతని నెఱుంగును. అది అతనిని విశ్వభాగ్యవిధాతగాను, ప్రతివ్యక్తి భాగ్యవిధాతగాను దెలియును. కనుక నెవడు తనను సనాతనునికి సమర్పించుకొనెనో, అతనిని విధియు, అనిశ్చితపర్యవసానమును భయపెట్టజాలవు; అశుభ, దుఃఖముల సమస్యయు నతని వ్యాకుల పఱచదు. జ్ఞానముగల ఆత్మకు భగవంతుడే మార్గము, భగవంతుడే ప్రయాణ గమ్యము – ఈ మార్గమున ఆత్మవినాశముండదు, మఱియు నీ గమ్యమునే నిపుణముగా నడుపబడు అతని పదములు ప్రతిక్షణము నిశ్చయముగా చేరుకొనుచున్నవి. తన సత్తయొక్కయు, సమస్తసత్తయొక్కయు ప్రభువుగను, తన ప్రకృతియొక్క భర్తగను, అంతరాత్మయొక్క భర్త, అనురక్షకుడు, పాలకుడుగను, తన సమస్తభావములు మఱియు కర్మల సాక్షిగను అతడు భగవంతు నెఱుంగును (9–18). భగవంతు డతని గృహమును, దేశమును, తన అభిలాషలకు, కామనలకు ఆశ్రయస్థానము, మఱియు సర్వభూతములకు ప్రాజ్ఞసుహృదుడు (9–18). అతని దృష్టి మఱియు అనుభవమునకు బాహ్యభూతముల సృష్టిస్థితిలయము లన్నియు నా ఏకమాత్రుడే, ఇతడే తన కాలగతమగు స్వీయాభివ్యక్తిని సంతతపునరావృత్తి చక్రమున వ్యక్తముచేయుచు, పాలించుచు, ఉపసంహరించుచుండును. అతడే పుట్టి, గిట్టుచున్నట్లు గన్పించు సర్వమునకు అవ్యయబీజము, మూలము, మఱియు లయావస్థయందు దాని విశ్రాంతిస్థానము (9–18). సూర్యుడు మఱియు నగ్నియొక్క వేడిలో తపించున దతడే (9–19); వర్షమును వదలువాడును, బిగబట్టువాడును అతడే; ఒక్కమాటలో అతడే ఈ సమస్తభౌతిక ప్రకృతియు, దాని వ్యాపారమును. మృత్యువు అతని ముసుగు, అమృతత్వ మతని స్వీయావిష్కరణము. మనము 'ఉన్న' దని చెప్పున దంతయు – సత్తు – అతడే, మఱియు మనము 'లే' దనుకొనున దంతయు అనంతమున గుప్తముగను, అవర్ణనీయుని నిగూఢసత్తయొక్క ఒక భాగముగను ఉండనేయున్నది.

10. బాహ్యమతము, బాహ్యఫలము : అత్యున్నత జ్ఞానము మఱియు భక్తి తప్ప అన్యవస్తువేదియు, సంపూర్ణ ఆత్మనివేదనము, మఱియు సమర్పణము తప్ప అన్యమార్గ మేదియు సర్వము తానే యగు పరమపురుషుని దగ్గరకు దీసికొనిపోజాలదు. అన్యమతము, అన్యపూజ, అన్యజ్ఞానము, అన్యప్రయత్నము – వీనికిని

సదా ఫలము లుండును గాని, అవి తాత్కాలికములు, మఱియు దైవసంకేతముల, దైవరూపముల భోగమునకు మాత్రమే పరిమితములు. మన మనస్తత్వముయొక్క ప్రవణతను బట్టి, మన మనుసరించుటకు సదా రెండు మార్గములు తెఱచుకొని యుండును : బాహ్యతరజ్ఞానము మఱియు నాంతరతమ జ్ఞానము, బాహ్యతరప్రయత్నము మఱియు నాంతరతమప్రయత్నము. బాహ్యమత మొక బాహ్యపూజనము మఱియు నొక బాహ్యభోగముయొక్క అన్వేషణము నగును. ఈ మతావలంబులు తమ నడతనుండి పాపమును గడిగివేసి, అట్లు బాహ్యవిధానరూపమగు శాస్త్రము విధించిన అర్హతను సంపాదించి, బాహ్యదేవతతో బాహ్యసంయోగమునిమిత్తము వైధికయజ్ఞము నాచరింతురు. కాని వారి లక్ష్యము పార్థివజీవనముయొక్క అనిత్య సుఖదుఃఖములకు బిమ్మట స్వర్గలోకముల భోగానుభవము; ఈ భోగము భూలోక భోగముకంటెను విశాలతరమే, కాని అది యింకను వైయక్తికము మఱియు ప్రాపంచికమే యగును. మఱియు దేనిని వారు ఆకాంక్షింతురో, దానిని శ్రద్ధచేతను, తదుచితప్రయత్నముచేతను బొందుదురు; ఏలన స్థూలజీవనము, పార్థివక్రియయే మన వైయక్తిక సంభూతియొక్క సకలవిషయము గాదు, లేక విశ్వప్రక్రియయొక్క సమస్తప్రకారము గాదు. విశాలతర భోగము నివ్వగల లోకాంతరములును గలవు— "స్వర్గలోకం విశాలం" (9–21). ఇట్లు ప్రాచీనకర్మవాది వేదత్రయముయొక్క బాహ్యర్థము నెఱింగి, తనను పూతపాపుని గావించుకొని, దేవతాసంయోగసాధనమగు సోమపానము గావించి, యజ్ఞముచేతను, సత్కర్మలచేతను స్వర్గఫలమును గోరుచుండెను. ఇహమున కావల పరము గలదను గట్టి నమ్మకము, దానినిమిత్తము చేయు ప్రయత్నము జీవునికి తన గతియందు స్వర్గసుఖముల ప్రాప్తికి వలయు బలమును సమకూర్చును. కాని మర్త్యజీవనముయొక్క యథార్థలక్ష్యము నింకను గుర్తించి, సాధించలేదు గనుక, జీవు డీ జీవనమునకు తిరిగిరాక తప్పదు. (9–21). జీవు డిచ్చటనే–ఎచ్చటనో కాదు–పరమదైవమును కనుగొనవలెను; అపరిపూర్ణము, భౌతికము నగు మానవప్రకృతినుండి అంతరాత్మ దివ్యప్రకృతిని పెంపొందించవలెను; భగవంతుడు, మానవజాతి, మఱియు విశ్వములతో నేకతద్వారా సత్తయొక్క సంపూర్ణ విశాలసత్యమును కనుగొని, జీవించుచు, దాని అద్భుతరూపమును వ్యక్తము చేయవలెను. ఇది సుదీర్ఘమగు మన పరిణామచక్రమును సమాప్తముగావించి, పరమఫలితములోనికి ద్వారము తెఱచును. అది మానవజన్మచేత అంతరాత్మకివ్వబడిన అవకాశము, మఱియు దీని ప్రయోజనము సిద్ధించనంతవఱకు, జన్మచక్ర

మాగదు. మన జన్మయొక్క ఈ చరమావశ్యకతదిశగా భగవత్ప్రేమికుడు అనన్య ప్రేమారాధనద్వారా పురోగమించును; పరమ మఱియు విశ్వాత్మకభగవంతునే తన జీవన సంపూర్ణలక్ష్యము గావించుకొనును - ఈ లక్ష్యము అహంకారిక తృప్తియును గాదు, స్వర్గలోకమును గాదు-మఱియు తన విచారణా, దర్శనముల సమస్తధ్యేయము చేసికొనును. భగవంతుని తప్ప దేనిని చూడకుండుట, ప్రతిక్షణము అతనితో యోగమునం దుండుట, సర్వభూతములయందలి అతనిని ప్రేమించుట, సర్వవస్తువుల యందలి అతని రసమునే గ్రోలుట - ఇది అతని ఆధ్యాత్మికజీవనముయొక్క సంపూర్ణస్థితి. (9-22). తన భగవద్దర్శన మతని జీవితమునుండి వేఱుచేయదు, అటులే దానివలన జీవనసమృద్ధి కే లోపము నుండదు; ఏలన ప్రతిశుభమును, అతని బాహ్యాంతరయోగక్షేమములను భగవంతుడే స్వయముగా, అయాచితముగా నతనికి సమకూర్చును - " యోగక్షేమం వహామ్యహం " (9-22). స్వర్గలోక, భూలోకసుఖము లివు దతని సంపత్తియొక్క ఒక స్వల్పచ్ఛాయామాత్రము; ఏలన అత డెటుల భగవంతునిలోనికి పెరుగునో, అటులే భగవంతుడును తన ప్రకాశ శక్త్యానందములతో వెలువడి, అతనిపై ప్రవహించును.

11. <u>అవిధిపూర్వకయజనము</u> : సాధారణమతము పూర్ణదైవము కంటె నితరమగు ఆంశికదేవతలకు జేయు యజన మగును. గీతాకాలమునాటి ప్రాచీన వైదికమతముయొక్క బాహ్యాపార్శ్వమునుండి గీత సరాసరి తన దృష్టాంతములను గొనును; ఉదాహరణకు, పైన చెప్పబడిన బాహ్యాపూజనమును " అన్యదేవతలకు " (9-23) జేయు యజ్ఞముగా గీత వర్ణించును - అన్యదేవత లనగా వివిధదేవులు, దివ్యీకృతపితరులు, పంచభూతాధిదేవతలు - " దేవాన్, పితౄన్, భూతాని " (9-25). మానవులు సాధారణముగా తమ జీవితమును, కర్మలను, తాము దర్శించు లేక భావించు రూపమున భగవంతునియొక్క ఆంశికశక్తులకు లేక పార్శ్వములకు నివేదింతురు - వీనిలో నధికభాగము వారి దృష్టికి ప్రకృతియందలి ప్రముఖవస్తువులను చేతనీకరించు అధిదేవతలు లేక తమ మానవతనే ప్రతిబింబించు దివ్యసంకేతములు. ఈ నివేదనను వారు విశ్వాసముతో జేతురేని, ఆ విశ్వాసము సముచితమే యగును; ఏలన భగవంతుడు, తనయొక్క ఎట్టి సంకేతము, రూపము లేక భావన భక్తునియం దున్నను, దాని నామోదించి, దానిద్వారా అతనిని కలిసికొనును-" యాం యాం తనుం శ్రద్ధయా అర్చతి " (7-21). శుద్ధమగు సమస్త మతవిశ్వాసము

మఱియు అనుష్ఠానము నిజానికి ఏకమాత్ర పరమభగవంతుని అనుసంధానమే యగును; కారణము అత డొకడే మానవుని తపోయజ్ఞముల ప్రభువును, అతని ఆకాంక్షాప్రయత్నముల అనంతభోక్తయునై యున్నాడు (9–24). అర్చనా రూప మెంత స్వల్పము లేక నీచ మైనను, దేవతాభావ మెంత పరిమిత మైనను, నివేదనయు, శ్రద్ధయు నెంత సంకుచిత మైనను, అహంకారార్చన యను తెరవెనుకకు బోదలంచు కృషి యెంత ప్రతిబద్ధ మైనను, అది మానవాత్మ విశ్వాత్మల నడుమ సంబంధసూత్ర మగును, దానిద్వారా సమాధానము వచ్చును. అయినను ఈ సమాధానము, యజ్ఞఫలము భక్తుని జ్ఞానము, విశ్వాసము, కర్మలను బట్టియే యుండును గాని, వాని పరిమితత్వములను అతిక్రమించజాలదు. కావున సత్తా సంభూతులయొక్క సంపూర్ణసత్యము నివ్వజాలు అధికతర భగవద్–జ్ఞానము దృష్ట్యా, ఈ నిమ్నతర నివేదనము అత్యున్నత యజ్ఞధర్మము ననుసరించి చేయబడలే దని తేలును. ఈ నిమ్నయజ్ఞము పరమేశ్వరుని సమగ్ర జ్ఞానము మఱియు నతని స్వీయాభివ్యక్తి యొక్క యథార్థతత్త్వము పైనను ఆధారపడక, బాహ్య మఱియు నాంశికరూపముల యందే సంసక్తమగును – "న మాం అభిజానంతి తత్త్వేన" (9–24). కావున నీ యజ్ఞము లక్ష్యమునందు పరిమితము, ప్రేరణయందు ప్రాయః ఆహంకారికము, కర్మయందు ఆంశికము మఱియు భ్రాంతము నగును – " యజంతి అవిధిపూర్వకం " (9–23). భగవంతుని సంపూర్ణదర్శనము సంపూర్ణ, సచేతన ఆత్మసమర్పణమొక్క నిబంధన మగును. ఇది లేని యజ్ఞము అసంపూర్ణము, ఆంశికము నగు వస్తువులను బొంది మఱల వానినుండి పడిపోయి, అధికతరప్రయత్నమున, విశాలతరభగవ దనుభవమున తనను వృద్ధిగావించుకొనుటకు భువికి తిరిగి రావలసియుండును. కాని విశ్వాతీత, విశ్వమయభగవంతుని మాత్రమే సర్వథా భజించువారు (9–25) తక్కిన దేవతాభక్తు లార్జించు సమస్త జ్ఞానమును, సకలఫలమును బొందుదురు ; అయితే వారు సర్వరూపములందు భగవంతుని సత్యమును గాంచినను, ఏ దేవతా రూపముతోను ఆగిపోరు. ఈ సాధన పురుషోత్తమ ప్రాప్తిమార్గమున దివ్యసత్త యొక్క సర్వరూపములను ఆలింగనముజేసికొనును.

12. <u>"నాయందు వారు, వారియందు నేను"</u> : ఈ పరిపూర్ణ ఆత్మనివేదన, ఈ అనన్యసమర్పణ గీత తన సమన్వయమునకు మకుటము గావించు పరభక్తి యగును. ఈ భక్తిచేత సమస్తక్రియయు, కృషియు విశ్వాతీత, విశ్వమయ

భగవంతునికి జేయు ఒక నివేదనలోనికి మార్చబడును. "నీవేది చేతువో, ఏది భుజింతువో, ఏది యజ్ఞమున ఆహూతి జేతువో, ఏది యిత్తువో, ఏ తపఃశక్తిని లేక సంకల్పశక్తిని ప్రయోగింతువో, దానిని నా కర్పింపుము" (9-27). ఇచ్చట అత్యల్ప జీవనఘటనయు, తనునుంచి లేక తనకున్నదానినుంచి చేసిన అతి సామాన్యదానమును, లఘుతమక్రియయు నొక దివ్యార్థమును సంతరించుకొని, భగవంతునికి స్వీకారయోగ్య నైవేద్య మగును (9-26); దీనిద్వారా భగవంతుడు భక్తుని అంతరాత్మను, జీవనమును తనవి చేసికొనును. ఈ నైవేద్యవిషయమున కామాహంకారములు చేయు విభేదములు అదృశ్యమగును. కర్మలయొక్క శుభఫలము నిమిత్తము ప్రయాసయు, అశుభఫలమునుండి పలాయనము నిచ్చట యుండవు; ఏ పురుషోత్తమునికి సమస్తకర్మయు, ఫలమును శాశ్వతముగా జెందునో, అతనికే సమస్త క్రియయు, ఫలితమును సమర్పించబడును; కావున నిక బంధన ముండదు. ఏలన పరిపూర్ణ ఆత్మసమర్పణచేత హృదయమునుండి ఆహంకారికకామ మంతయు నంతరించును, మఱియు అంతరాత్మ పృథక్జీవనముయొక్క అంతఃసన్యాసముద్వారా భగవంతునికి, అంతరాత్మకు పూర్ణసంయోగము సిద్ధించును. సమస్తసంకల్పము, క్రియ, ఫలితము భగవంతునివే అయి, అవి పరిపూతము, ప్రదీప్తమునగు ప్రకృతిద్వారా దివ్యరూపమున పనిచేయును; అవి యిక పరిమిత, వైయక్తికాహంకారమునకు జెందవు. సాంతప్రకృతి యిట్లు సమర్పితమై, అనంతముయొక్క ఒకవిముక్తవాహిని యగును; అంతరాత్మ తన ఆధ్యాత్మికసత్తయందు, అజ్ఞాన, పరిమితత్త్వములనుండి ఉద్ధరించబడి, సనాతనునితో తనకు గల ఏకతకు తిరిగి వచ్చును. దివ్యసనాతనుడు సర్వభూతములయందును అంతర్నివాసిగ (18-61) నుండును: ఇతడు అందరియందును సముడు, మఱియు నందరికి సమసుహృదుడు, పిత, మాత, పితామహుడు (9-17), ప్రియుడు, సర్వ ప్రాణుల భర్త. అతడు ఎవనికిని శత్రువు గాడు, ఎవనికిని పక్షపాతి ప్రియుడు గాడు; ఎవనిని అతడు త్రోసిపుచ్చలేదు, ఎవనిని శాశ్వతముగా శిక్షించలేదు, ఎవనిని స్వైరకామాచారముచే అనుగ్రహించలేదు: అజ్ఞానమునందు తిరిగి తిరిగి, చివరి కందరును సమముగా నతనినే చేరుకొందురు. కాని పరిపూర్ణభక్తి మాత్రమే మానవునియందు భగవంతుని, భగవంతునియందు మానవుని అంతర్నివాసమును ఒక సచేతన వస్తువుగా జేయగలదు, తత్పర పరిపూర్ణసంయోగముగా మార్చగలదు (9-29). పరమునియందు ప్రేమ, సంపూర్ణ ఆత్మసమర్పణ - ఇవియే దివ్య ఏకతకు సూటి మఱియు క్షిప్రమార్గము.

13. పాపులకు సైతము ప్రవేశము : శ్రద్ధ మఱియు చిత్తశుద్ధి పూర్వకము గాను, ఒక ప్రాథమిక సంపూర్ణతతోను ఒకసారి మన మీ సమగ్ర ఆత్మసమర్పణ గావింతు మేని, మన అందరియందును సమముగా గల భగవత్సన్నిధి తదితర పూర్వనియమమును దేనిని అపేక్షించదు. అందరును ఈ ద్వారమునకు రావచ్చును, అందరును ఈ ఆలయమున ప్రవేశించవచ్చును. సర్వ-ప్రేమికుని భవనమున మన లౌకికభేదము లంతరించిపోవును. అచ్చట పుణ్యాత్మునికి అధికాదరము గాని, పాపాత్మునికి కేవలతిరస్కారము గాని యుండదు. శాస్త్రవిధిని తు-చ తప్పకుండ పాలించుచు, శుద్ధజీవనుడగు బ్రాహ్మణుడును, పాపము మఱియు దుఃఖమయయోని యందు జన్మించి, ప్రజలచేత తిరస్కృతుడగు చండాలుడును ఈ మార్గమున కలిసి పయనించి, పరమముక్తి మఱియు సనాతనునియందు సమున్నతనివాసములకు సమము, వివృతము నగు ద్వారమును గనుగొనగలరు. స్త్రీపురుష లుభయులు భగవత్సమ్ముఖమున తమ సమానాధికారమును బొందుదురు (9–32); ఏలన భగవదాత్మ శరీరభేదమును గాని, సాంఘికవ్యత్యాసములు మఱియు ప్రతిబంధములను గాని పాటించదు : మధ్యవర్తి గాని, బాధక నియమము గాని లేకయే అందరు సరాసరి అతనిదగ్గరకు వెళ్లగలరు. "మిక్కిలి దురాచారుడగు," గురువు చెప్పును, "మానవుడు సైతము అనన్య సంపూర్ణప్రేమతో నా వైపునకు దిరుగు నేని, అతడు సాధు వనియే తలంచవలెను, ఏలన అతని స్థిరమగు ప్రయత్నసంకల్పము సమీచీన, సంపూర్ణసంకల్పము (9–30). శీఘ్రముగా నతడు ధర్మాత్ముడై, శాశ్వతశాంతిని బొందును" (9–31). వేఱు మాటలలో, సంపూర్ణ ఆత్మసమర్పణ సేయు సంకల్పము దివ్యాత్మద్వారములను పూర్తిగా తెఱచి, తనకు సమాధానముగా మానవునిలోనికి భగవంతునియొక్క సంపూర్ణావతరణమును, ఆత్మసమర్పణమును గొనివచ్చును, మఱియు నిది ఆధ్యాత్మికప్రకృతిలోనికి నిమ్నప్రకృతియొక్క క్షిప్రపరివర్తన ద్వారా మనలోని సర్వమును దివ్యజీవనధర్మమునకు అనురూపముగా రూపొందించి, తద్రూపము గావించును. ఆత్మార్పణ సంకల్పము తన బలముతో భగవంతునికి, మానవునికి మధ్యనున్న తెరను తీసివేయును; అది ప్రతితప్పును బాపును, ప్రతివిఘ్నమును రూపుమాపును. ఎవరు తమ మానవబలమునే ఆశ్రయించి, జ్ఞానసాధనచే గాని, సదాచారప్రయత్నముచే గాని, కఠోరతపముచే గాని బ్రహ్మను బొంద నాకాంక్షింతురో, వారు ఎంతో కష్టవ్యాకులముతో గాని పైకి పెరుగరు;

పరంతు అంతరాత్మ తన అహంకారమును, కర్మను భగవంతునికే అర్పించి నప్పుడు, అతడే దిగివచ్చి, మన భారమును వహించును. అజ్ఞుల కతడు దివ్యజ్ఞానముయొక్క వెలుగును దెచ్చును, దుర్బలులకు భగవదిచ్ఛయొక్క బలమును దెచ్చును, పాపికి దివ్యశుద్ధతయొక్క విముక్తిని దెచ్చును, దుఃఖితులకు అనంతమగు ఆధ్యాత్మిక హర్షానందములను దెచ్చును. వారి దుర్బలత గాని, వారి మానవబలముయొక్క పతనములు గాని ఈ విషయమున అడ్డురావు. "ఇది నా ప్రతిజ్ఞ: నన్ను ప్రేమించు వాడు నశించడు" (9-31)-అని భగవంతు డర్జునునికి ఘోషించును. పూర్వ ప్రయత్నసన్నాహములు, బ్రాహ్మణుని శుద్ధతాపవిత్రతలు, కర్మ జ్ఞానములందు ప్రముఖులగు రాజర్షుల ప్రకాశమయ బలము-వీనికి స్వమూల్య మున్నది, ఏలన ఇవి అపూర్ణ మానవజీవుడు ఈ విశాలదర్శనమును, ఆత్మసమర్పణమును చేరుకొను టను సులభతరము గావించును (9-33). కాని ఇట్టి పూర్వసన్నాహము లేకపోయినను, దివ్యప్రేమికునియందు శరణు బొందువా రందరు తత్క్షణమే తమయందు భగవంతుని ద్వారములు తెఱచుకొనుటను గనుగొనగలరు-ధనార్జనకు సహజమగు సంకుచితత్వము తోను, వస్తూత్పాదనశ్రమతోను ఒకప్పుడు వ్యాకులుడై యుండిన వైశ్యుడు, వేయి కఠోర ప్రతిబంధములచే బాధితుడైన శూద్రుడు, సామాజిక దురన్యాయములకు గుఱియై, తన వికాసమునందు ప్రతిహతయైన స్త్రీ, ఇంకను తమ గతకర్మ విధించిన పాపజన్మ గల (9-32) జాతిబాహ్యులు, అస్పృశ్యులు, చండాలురు: వీరి నందరను భగవంతు డాహ్వానించును. బాహ్యవిభేదములు బహిర్ముఖమనస్సునకు బాధాకరముగా గ్రుచ్చికొనును గావున, మానవులు వాని కంత ప్రాముఖ్య మిత్తురు; కాని ఆధ్యాత్మిక జీవనమునందు, దివ్యతేజముయొక్క సమతాసమ్ముఖమున మఱియు నిష్పక్షపాత దివ్యశక్తియొక్క విశాలతాసమ్ముఖమున అవి లుప్తమగును.

14. <u>దివ్యప్రేమ సమన్వయశిఖరము</u> : ఈ పార్థివప్రపంచము ద్వంద్వ సంకులము, అప్పటప్పటి క్షణికసంబంధములకు బద్ధము; మానవుడు వీనియందు సక్తుడై, అవి విధించు ధర్మమే తన జీవసధర్మముగా నిచ్చట జీవించునంత కాలము, ఇది సంఘర్షము, దుఃఖము, శోకములతో గూడిన ప్రపంచమే యగును. (9-33). విముక్తికి మార్గము బాహ్యమునుండి అంతరమునకు, భౌతికజీవనము సృజించు ఆభాసమునుండి దివ్యసత్యతకు మఱలుటయే యగును - భౌతికజీవనము మనస్సుపై తన భారమును మోపి, దానిని ప్రాణశరీరముల గాడులలో బంధించుచుండగా, దివ్య

సత్యత ఆధ్యాత్మిక స్వాతంత్ర్యముద్వారా అభివ్యక్తమై మనను విడిపింప వేచి యున్నది. ఆవరణరూపమగు ప్రపంచప్రేమ సత్యరూపమగు భగవత్ప్రేమలోనికి మారవలెను. ఈ రహస్య మెఱింగి, ఒకసారి అంతఃస్థితభగవంతుని కౌగిలించు కొందుమేని, మన సమస్తసత్తయు, సమస్తజీవనమును దివ్యసముద్ధరణమునకు, అద్భుత పరివర్తనమునకు లోనగును. తన బాహ్యకర్మలలోను, రూపములలోను లీనమైయుండు నిమ్న ప్రకృతియొక్క అజ్ఞానస్థానమున జ్ఞానచక్షువు సర్వత్ర భగవద్దర్శనమునకు, మూలసత్తయొక్క ఏకతా విశ్వమయతలకు ఉన్మీలిత మగును. ప్రపంచముయొక్క బాధాశోకములు సర్వానందమయుని ఆనందమున అంతరించును; మన దుర్బలత, భ్రాంతి మఱియు పాపము సర్వాలింగకము, సర్వపరివర్తకము నగు సనాతనునియొక్క బలము, సత్యము మఱియు శుద్ధతలోనికి మార్చివేయబడును. మనస్సును దివ్యచేతనతో నేకముచేయుట, భావమయప్రకృతి (హృదయము) నంతను సర్వభూతస్థితుడగు (6-31) భగవంతునియొక్క అఖండప్రేమవృత్తిగా జేయుట, మన కర్మల నన్నింటిని (సంకల్పశక్తిని) సర్వలోకమహేశ్వరునికి (5-29) అఖండ యజ్ఞము చేయుట, మఱియు మన పూజాకాంక్షలను అతని అఖండారాధనగను, ఆత్మ సమర్పణగను జేయుట, సర్వాత్మను సంపూర్ణయోగమున భగవదభిముఖముగా నడిపించుట - ఇదిగో, ఇదియే మర్త్యజీవనమునుండి దివ్యజీవనములోని కెగయు మార్గరాజము (9-34). ఇదియే దివ్యప్రేమ మఱియు భక్తిని గుఱించిన గీతోపదేశము; దీనియందు జ్ఞానము, కర్మ మఱియు హృదయలాలస ఒక పరమ ఏకీకరణమున ఏకమగును, వాని విభేదములు విలీనమగును, వాని ప్రత్యేకతంతువులు పెనవేసి కొనును; ఇది యొక సమున్నతసంయోగము, సువిశాల తాదాత్మ్యసాధకగమనము.

# 7. గీతా మహావాక్యము

1. <u>"అహం", "మాం" పదముల పరమార్థము :</u> ఇపుడు మనము గీతాయోగముయొక్క హృదయమునకు వచ్చివేసితిమి, ఇదియే గీతోపదేశముయొక్క సంపూర్ణ సజీవకేంద్రము. అహంకారమునుండియు, నిమ్నప్రకృతినుండియు ఉప

సంహరించుకొని, అంతరాత్మ అక్షరాత్మలోని కారోహించుట ప్రథమసోపానము, ప్రావేశిక పరివర్తనము మాత్రమే యని ఇపుడు మనకు స్పష్టముగా దెలియును. మఱియు "అహం" (7-6), "మాం" (7-14)-అని పలుకుచు వచ్చిన, మానవ రూపము ధరించిన భగవంతునికి ఆదినుండియు గీత అంత ప్రాముఖ్య మెందు కిచ్చెనో-దీనినిగూడ మన మిప్పుడు చూడగలము. ఎందు కన, ఇతడు నిగూఢుడు, సర్వవ్యాపియు నగు నొక మహాపురుషుడు; ఇతడు లోకమహేశ్వరుడు (5-29), మానవాత్మ నియామకుడు (9-11); ఏ అక్షరాత్మ సదా శాంతము, అచలమో, మఱియు నేది ప్రాకృతవిశ్వముయొక్క బాహ్యాంతరదృశ్యములచేత సదా అస్పష్ట ముగా నుండునో, దానికంటెను ఈ భగవంతు డధికుడు.

2. <u>ఒక ముఖముద్వారా మూలమునకు</u> : సమస్తయోగము ఒక భగవదన్వే షణము, సనాతనపురుషునితో సంయోగము దిశగా ఒక పరివర్తనము (turn). భగవంతుని మఱియు సనాతనుని మన మే మేర కెఱుంగుదుమో, దానిని బట్టియే అన్వేషణామార్గమును, సంయోగప్రగాఢతయు, సాక్షాత్కారసమగ్రతయు నేర్పడును. మనః ప్రధానుడగు మానవుడు తన సొంతమనస్సుయొక్క ఒక సమీపద్వారమును దెఱచి అనంతమును సమీపించును. అతడు తన మనస్సు గ్రహించగల ఒక భావనను వెదకును, తదుచితమగు తన ప్రకృతియొక్క ఒక శక్తి నెన్నుకొనును, అది స్వోన్నతిని సాధించుకొని, అట్లు లభించిన బలముచే పయనించి, అనంతసత్యము యొక్క ఒక ముఖమును స్పృజించును - అనంతసత్యమునకు అనేకముఖములు, వాచకశబ్దములు, స్వసంకేతములు గలవు. ఇట్లు స్పృశించిన ముఖమును మానవుడు సాకల్యముగా జూడ ప్రయత్నించును, అపుడు ప్రత్యక్షానుభవముద్వారా ఆ రూపము వెనుకనున్న అపరిమేయ సత్యము నతడు చేరుకొనగలుగును. ద్వార మెంత స్వల్ప మైనను, అది తన నాకర్షించు విశాలతలోని కొక ముందుచూపు నిచ్చుచో, తన ఆత్మను పిలుచుచున్న అనంతముయొక్క అగాధగంభీరతకు, అగమ్య ఉన్నతికి అది యొక మార్గద్వార మగుచో, దానితో నతడు తృప్తిపడును. మఱియు ననంత మతని ఆ మార్గముననే స్వీకరించును-"యే యథా మాం ప్రపద్యంతే" (4-11).

3. <u>"నేతి నేతి" ఫలితము</u> : దార్శనికబుద్ధి నిషేధాత్మకజ్ఞానముద్వారా సనాతనతత్త్వమును బొందజూచును. జ్ఞానము చేయు పని సమ్యగ్గ్రహణము,

మఱియు పరిమిత బుద్ధివిషయమున దీని కర్థము, నిర్వచించి, నిర్ణయించుటే యగును. కాని అనిర్ణేయమగు దానిని నిర్ణయించుటకు ఏకైకమార్గము ఒకవిధమగు సార్వత్రిక నిషేధమే యగును–" నేతి నేతి ". కావున ఇంద్రియములు, హృదయము మఱియు బుద్ధిచేత దేని దేనిని పరిమితముచేయ వీలగునో, దానినంతను సనాతనముయొక్క భావననుండి కొట్టివేయ మనస్సు పూనుకొనును. ఇట్లు ఆత్మ అనాత్మలకు, అనగా సనాతన సత్తకు మఱియు దాని రూపములకు నడుమ పూర్ణవ్యతిరేకము కల్పించబడును–బ్రహ్మమాయలకు, అనగా అవర్ణనీయ సత్తకు, దానిని ప్రకటింప బూనియు, ప్రకటింపజాలని సర్వమునకు నడుమ ఒక అఖాతము సృష్టించబడును–అటులే కర్మ నిర్వాణములకు, అనగా విశ్వశక్తియొక్క సంతతానిత్యక్రియకు, మఱియు జీవన వృత్తి, మనోవ్యాపారము, శక్తిభావము లేని ఒక అనిర్వచనీయ పరమ అభావమునకు నడుమ గోడ కట్టబడును. సనాతనాభిముఖముగా సాగు ప్రబలమగు ఈ జ్ఞానప్రవృత్తి క్షణికమగు సర్వమునుండియు వేఱుచేయును. అది జీవనమూలమునకు జేరుటకు జీవనమును నిషేధించును; మన సత్తయొక్క నామరూపరహిత వాస్తవికతను జేరుకొనుటకు మనకు గన్పించు మన సత్తారూపమును చెక్కివేయును. అనగా హృదయకామనలు, సంకల్పకర్మలు, మనోభావనలు నిరాకరించబడును; చివరకు జ్ఞానము సైతము నిషేధింపబడి సమము, అజ్ఞేయము నగుదానిలో అంతమొందింప బడును. ఆత్యంతిక నిష్క్రియతలో పర్యవసించు అధికాధిక నివృత్తిమార్గముద్వారా మాయాకల్పిత అంతరాత్మ, లేక మనము మన–మని పిలుచుకొను సంస్కారముల మూట వ్యక్తిత్వభావముయొక్క వినాశములో ప్రవేశించును, జీవనరూపమగు అనృతము నంతమొందించును, స్వయముగా నిర్వాణములో రూపుమాసిపోవును.

4. <u>భక్తికర్మల సార్థకత</u> : కాని స్వ-నిషేధాత్మకమగు ఈ కఠిన వివేచనా పద్ధతి, కొన్ని విశిష్టప్రకృతుల నది ఎంతగా ఆకర్షించినను, దేహము ధరించిన మానవాత్మ నది సామాన్యముగా తృప్తిపఱచదు; కారణము, అది వివిధప్రకారమగు నతని ప్రకృతి పరిపూర్ణసనాతనుని చేరుకొనచేయు ప్రయత్నమునకు అవకాశమివ్వదు. నిషేధపరము, మననశీలము నగు అతని బుద్ధియే గాక, అతని ఆకాంక్షామయ హృదయము, కర్మప్రవణసంకల్పము, ఇంద్రియాత్మకమనస్సు గూడ సనాతనుడు మఱియు అనంతుని మార్గమున సప్రయాసముగా ముందుకు సాగుచు, అతనియందు తమ దివ్యమూలము, తమ సత్తాప్రకృతుల సార్థకతను అన్వేషించును. ఈ ఆవశ్యకత

నుండియే ప్రేమమతమును, కర్మమతమును ఉద్భవించును; ఈ మతములు మిక్కిలి క్రియాశీలము, వికసితము నగు మానవశక్తులను తృప్తిపఱచి, భగవన్మార్గమున నడుపును - ఇదియే ఈ మతముల సామర్థ్యము; వీనినుండి ప్రారంభించి నపుడే జ్ఞానము గమ్యము చేరుకొనగలదు. లోపలి ఆత్మను, బైటి వస్తువులను గూడ తీవ్రముగా, దృఢముగా నిషేధించు బౌద్ధమతము గూడ ఒక దివ్య కర్మానుష్ఠానము పై ఆరంభమున ఆధారపడవలసివచ్చెను. మఱియు భక్తికి బదులు సర్వభూతములందు ప్రేమకరుణలను ప్రవేశపెట్టవలసివచ్చెను; ఏలన ఆ విధముగనే అది మానవజాతి కొక అవ్యర్థమార్గమును, విమోచకమతమును కాగలిగెను. కర్మను, మనఃసృష్టులను మిథ్య యని అత్యంతతార్కికొనసహనముతో కొట్టివేయు మాయావాదము సైతము మానవునికి, ప్రపంచమునకు, ప్రపంచమునందలి దేవునికి వ్యావహారిక సత్యతను తాత్కాలికముగా నంగీకరించెను; లేనిచో అది ఎక్కడ నిలబడును, ఎట్లు తన ప్రయాణమున కుపక్రమించును? దేనిని మాయావాదము నిరాకరించెనో, మానవుని బంధనమునకును, అతని విమోచనప్రయత్నమునకును కొంత సత్యత నివ్వ దానినే ప్రతిపాదింపవలసివచ్చెను.

5. <u>వివిధమార్గముల లోపములు</u> : కాని కర్మప్రధాన, భావప్రధానమతముల కును ఒక దుర్బలత గలదు - అవి ఒక దివ్య (సాంత) వ్యక్తిత్వమునందును, సాంతముయొక్క దివ్యగుణములందును మితిమీఱి సంలగ్నమగును. మఱియు, ఆ మతములకు అనంత భగవత్సత్తను గుఱించి ఒకభావన యున్నను, అవి సంపూర్ణ మగు జ్ఞానతృప్తి నీయవు; ఏలన ఆ జ్ఞానముయొక్క చరమ, విశ్వాతీతప్రవృత్తుల యందు చివరంట వారు దాని ననుగమించరు. ఈ మతములు సనాతనునియందు సంపూర్ణలయమును, తాదాత్మ్యముచేత పరిపూర్ణసంయోగమును అందుకొనజాలవు- కాన మానవాత్మ జ్ఞానమార్గమున గాకపోయిన, మార్గాంతరముచేనైనను ఆ తాదాత్మ్యము నొకరోజున చేరితీరవలెను. అదియే గదా ఏకత్వమున కాధారము. పోగా, మననశీల, నివృత్తిపర ఆధ్యాత్మికతకును ఒక దుర్బలత గలదు - అది మితిమీఱిన నిషేధ ప్రక్రియచే నీ తాదాత్మ్యస్థానమును చేరుకొనును, మఱియు నే మానవాత్మయొక్క ఆకాంక్ష ఈ తాదాత్మ్యసాధనకు సంపూర్ణార్థముగా నుండెనో, దానినే చివరకు ఒక శూన్యములోనికో, ఒక మిథ్యాకల్పనలోనికో మార్చివేయును; ఏలన మానవాత్మయు, దాని ఆకాంక్షయు వినా, విముక్తికిని, సంయోగమునకును ఎట్టి అర్థము నుండదు.

మఱియు నీ విచారమార్గము జీవసత్తయొక్క ఇతరశక్తులను ఇంచుక గుర్తించినను, వాని క్రియను సాధనాప్రారంభమునకు మాత్రమే పరిమితము చేయును; కావున నీ క్రియ సనాతనానంతమునందు ఎట్టి పూర్ణ, లేక తృప్తికర పరిణామమునకు ఎప్పుడును చేరుకొనదు. అయినను, జ్ఞానమార్గము అనుచితముగా ప్రతిబంధించు నీ వస్తువులును–శక్తిశాలిసంకల్పము, ప్రబలమగు ప్రేమాకాంక్ష, ప్రత్యక్షప్రకాశము మఱియు సచేతన మానసికసత్తయొక్క సర్వాలింగనసమర్థ అంతర్జ్ఞానము – ఇవి యన్నియు భగవంతునినుండియే వచ్చినవి, భగవంతుని మూలశక్తులనే తెలుపుచున్నవి, మఱియు వీని సృష్టికి ఔచిత్యము ఆ మూలమునందే యుండవలెను, అటులే భగవంతునియందు వీని పరిపూర్తికి ఒక సశక్తికమార్గ ముండవలెను. ఈ శక్తులయొక్క స్వతఃసిద్ధ ఆంకాంక్షను సఫలముచేయక విడిచిపేయు నెట్టి భగవద్–జ్ఞాన మైనను సమగ్రము, పరిపూర్ణము, సర్వథా తృప్తికరము కాజాలదు; అటులే భగవంతునియొక్క ఈ యితరమార్గముల వెనుకగల ఆధ్యాత్మికసత్యమును ఏది తన తపోమయ అన్వేషణ యందు అసహనముతో త్రోసివేయునో, లేక శుద్ధజ్ఞానముయొక్క స్వాతిశయమున తృణీకరించునో, అది పూర్తిగా విజ్ఞమగు విజ్ఞత కాజాలదు.

6. <u>గీతామహత్త్వము దాని సమన్వయాత్మకభావనయందు గలదు</u> : ఈ భావన విశ్వమునందు వర్తించు మానవాత్మయొక్క సంపూర్ణప్రకృతిని గుర్తించి, భగవంతుని సత్యమును, శక్తిని, ప్రేమను, సత్తను బొందవలసిన బహుముఖ ఆవశ్యకత మానవాత్మకు గలదని చూపును; ఈ సత్యాదుల వైపునకే మానవజాతి తిరుగుచున్నది–సంసిద్ధి మఱియు సమరత్వము, మఱియు ఒకానొక అత్యున్నత శాంతి, శక్తి, ఆనందముల నిమిత్తము తిరుగుచున్నది. భగవంతుడు, మానవుడు మఱియు విశ్వములను గుఱించిన ఒక సమగ్ర, ఆధ్యాత్మిక దృష్టి దిశగా గీతయందొక ప్రబల, విశాలప్రయత్నము గన్పించును. అయితే ఈ పదునెనిమిది అధ్యాయాలలో గీత ప్రతివిషయమును, మినహాయింపు లేకుండ, చేపట్టిన దనియు, ఏ ఆధ్యాత్మికసమస్యను అపరిష్కృతముగా విడువలే దనియు చెప్పజాలము. కాని గీత ఒక విశాలపథకమును సిద్ధముచేసిపెట్టిన దని చెప్పకతప్పదు; కాగా మనము చేయవలసినది వివరములను పూరించుటయే, అందలి అంశములను అనుసరించి ముందుకు వెళ్లుటయే, సూచనలకు పూర్ణరూప మిచ్చుటయే, అస్పష్టవిషయములను విశదముచేయుటయే; ఇట్లు చేసిన, మన బుద్ధి లేవదీయు అధికతర సమస్యలకు, మన అంతరాత్మ కుండు అధికతర

ఆవశ్యకతలకు అనుసంధానసూత్రము లభించును - తన ప్రశ్నపరంపరనుంచి గీత స్వయముగా నెట్టి వినూత్న పరిష్కారమును వెలికి దీయదు. తాను లక్షించిన సమగ్రతను చేరుకొనుటకు షడ్దర్శనములకు వెనుకనున్న ఉపనిషత్తుల మూల వేదాంతమునకు వెళ్లును; ఏలన అచ్చట మనకు ఆత్మ, మానవుడు మఱియు విశ్వము లను గుఱించి అత్యంతవిశాలము, గంభీరమునగు సజీవ సమన్వయదర్శనము గన్పించును. కాని అంతర్దర్శనము మఱియు సంకేతమయ భాషయొక్క ప్రకాశమయ ఆవరణములోపల ఆచ్ఛన్నమై యుండుటచే ఉపనిషత్తుయం దేది బుద్ధికి స్పష్టముగాదో, దానినే గీత తర్వాత ప్రచలితమైన బౌద్ధికచింతన మఱియు వివిక్తానుభవముయొక్క వెలుగునందు వెలుగులోనికి దెచ్చును.

7. <u>భగవంతుడు సంబంధరహితుడు గాడు</u> : తన సమన్వయగృహమున "అనిర్దేశ్యమును, అక్షరమును, అవ్యక్తమును" (12-3) ఉపాసించు నేతినేతి-చింతకులకు గూడ గీత స్థానమిచ్చును. ఈ నిర్గుణోపాసకులును పరమాత్మయు, పరమేశ్వరుడు నగు పురుషోత్తమునే - "మాం" (12-4)- పొందుదురు. ఏలన పురుషోత్తముని స్వయంభూసత్త ఒక "అచింత్యరూపం" (8-9), ఒక ఊహాతీత సద్వస్తువు (**Positive**). నిర్ద్వంద్వము లన్నింటికి మూల నిర్ద్వంద్వము, బుద్ధివృత్తికి మిక్కిలి పరము. నిషేధాత్మకనిష్క్రియత, ఉపశమము, అటులే జీవనకర్మల సన్యాసముతో గూడిన ఏ మార్గముచేత మానవులు అస్పృశ్యబ్రహ్మమును స్పృశింప గడంగుదురో, దానిని గూడ గీత అనుమతించును గాని, ప్రోత్సహించదు. ఈ నిషేధాత్మక జ్ఞానము సత్యముయొక్క ఒక పార్శ్వము నాశ్రయించి, సనాతనుని సమీపించును, మఱియు దేహధారియగు నాత్మకు ఈ పార్శ్వమును చేరుకొనుట మిక్కిలి కష్టము - "దుఃఖం దేహవద్భిర్ అవాప్యతే" (12-5). ఈ జ్ఞానము సునిపుణము, అనవసరముగా కష్టతమమునగు మార్గమున ముందుకు సాగును - "మంగలికత్తి వాయివలె సన్నము, నడచుటకు కష్టము" (కఠ ఉప.). సర్వసంబంధములను నిరాకరించుటచే గాక, సర్వసంబంధములద్వారానే మానవు డనంతభగవంతుని సహజముగా సమీపించగలడు, మఱియు మిక్కిలి సులభముగా, విశాలముగా, సన్నిహితముగా బొందగలడు. ఇంతకు, మానవుని మానసిక, ప్రాణిక, భౌతికసత్తతో పరముని కెట్టి సంబంధములు లేవను దర్శనము విపులతమము లేక సత్యతమము నగు సత్యము గాదు, అనగా నతడు "అవ్యవహార్యము" (మాం. ఉ.)

గాదు; అటులే వస్తువుల వ్యావహారిక సత్యము, సంబంధనిష్ఠ సత్యము–"వ్యవహార"– అత్యున్నత ఆధ్యాత్మికసత్యమునకు – "పరమార్థ" – సర్వథా వ్యతిరేకము గాదు. పైగా, పరమసనాతనుడు వేయి సంబంధములద్వారా మన మానవజీవనముతో రహస్య సంపర్కము, సంయోగము గలిగియున్నాడు, మఱియు మన ప్రకృతియొక్కయు, విశ్వప్రకృతియొక్కయు సమస్త, ముఖ్య ప్రకారములద్వారా – "సర్వభావేన" (18–62) – ఆ సంపర్కము ఇంద్రియగమ్యము చేయబడగలదు, అటులే ఆ సంయోగము మన అంతరాత్మకు, హృదయమునకు, సంకల్పమునకు, బుద్ధికి, సత్తకు వాస్తవముచేయబడ గలదు. కావున నీ రెండవ మార్గము మానవునికి సహజమును, సరళమును – "సుఖం ఆప్తుం" (5–6). భగవంతుడు తనను జేరరానివానిగా జేసికొనడు; మన కొక్కటి మాత్రమే కావలెను, ఒక్క నియమమును మాత్రమే అతడు పెట్టును – మన అజ్ఞానావరణమును భేదించుటకు అనన్య, అదమ్యసంకల్పము, మఱియు మనఃప్రాణహృదయముల సంపూర్ణ నిరంతర అన్వేషణము, ఎల్లపుడు తనకు దగ్గరగా, తనలోనే, తన అంతరాత్మగా, తన ఆధ్యాత్మిక సారముగా, తన సగుణ నిర్గుణరూప రహస్యముగా, తన పురుషప్రకృతులుగా నున్న వానికొఱకు అన్వేషణము. ఇదియే మన కెదురగు కఠినత; తక్కిన దంతయు మన జీవన ప్రభువే స్వయముగా చూచుకొని, సాధించును–"అహం త్వా మోక్షయిష్యామి మా శుచః" (18–66).

8. అక్షరాత్మయు సంబంధరహితము గాదు : గీతోపదేశముయొక్క ఏ భాగమునందు గీతాసమన్వయము శుద్ధజ్ఞానము వైపునకు మిక్కిలి వంగునో, అచ్చట సైతము గీత మనల నీపూర్ణతరసత్యమునకును, గర్భిత అనుభవమునకు సిద్ధపఱచును, నిజానికి, గీత అక్షరాత్మసాక్షాత్కారాని కిచ్చు రూపమునందే ఈ భావ మిమిడి యున్నది. చూడుడు : ఈ అక్షరాత్మ ప్రకృతికర్మలలో సక్రియముగా ప్రవేశింపకున్నను (5–15), అది సర్వథా సంబంధరహితము, సంయోగదూరము గాదు. అది మన సాక్షియు, భర్తయు (9-18), అది మౌన అనుమతి నిచ్చును–"ప్రభుః" (5–14); దానికి ఆకర్షణీయమగు ఆనందమును గలదు (5–24). అంతరాత్మ ప్రశాంతాత్మయందు నెలకొనినపుడు సైతము బహిర్ముఖ ప్రకృతిక్రియ సంభవమే. ఏలన ఈ శాంత, సాక్ష్యాత్మ అక్షరపురుషుడు (15–16), మఱియు పురుషునికెపుడును ప్రకృతితో సంబంధ ముండును. కాని ఇపు డీ ద్వితీయషట్కము నందు నిష్క్రియ, సక్రియరూపమగు నీ ద్వంద్వముయొక్క హేతువు తన పూర్ణార్థ

మున ప్రకటింపబడినది - ఈ సర్వగత, శాంతాత్మ దివ్యపురుషునియొక్క ఒక పార్శ్వము మాత్రమే యని ప్రకటింపబడినది (12-4). అన్ని మార్పులకు నాధార ముగా నుండి, ఎట్టి మార్పు జెందని ఏకాత్మరూపమున ఎవడు ప్రపంచమును వ్యాపించునో, అతడు మానవునియందలి భగవంతుడుగాను, సర్వప్రాణిహృదయము సందలి ఈశ్వరుడుగాను గూడ నుండును, అటులే మన సమస్త అంతరంగసంభూతి యొక్కయు, మఱియు నంతర్ముఖ, బహిర్ముఖ క్రియయొక్కయు సచేతన కారణమును, చాలకుడును అగును. అవగా యోగుల ఈశ్వరుడును, జ్ఞానుల బ్రహ్మమును ఒకటి యే యగుదురు; ఆ ఒకటి పరమాత్మయు మఱియు విశ్వాత్మయు, పరమపురుషుడును మఱియు విశ్వపురుషుడును.

9. ఇష్టదేవత వేఱు : ఈ పరమపురుషుడు అననేక బాహ్యమతములు చెప్పు పరిమిత, వైయక్తిక భగవంతుడు గాడు. ఏలన అట్టి భగవంతు లందరు తదితరము, సృజనచాలనాత్మకము నగు పరిపూర్ణ వైయక్తికసత్యముయొక్క ఆంశిక, బాహ్యనిర్మాణములు. ఇదియే పరమపురుషుడు, పరమాత్మ; సర్వదేవతలు ఇతని యొక్క ముఖములు, అటులే సర్వ వ్యష్టివ్యక్తిత్వము విశ్వప్రకృతియందు ఇతని పరిమితప్రాదుర్భావము. ఇతడు మూల దైవముయొక్క ప్రత్యేకనామరూపాత్మక మగు "ఇష్టదేవత" గాడు, ఒకానొక భక్తుని విశిష్టాకాంక్షల మూర్తీభావము గాడు. అట్టి నామరూపము లన్నియు సమస్తభక్తుల, సర్వమతముల మహేశ్వరుడగు ఏకమాత్ర దేవునియొక్క శక్తులు మఱియు ముఖములు మాత్రమే. ఇతడు దేవ దేవుడు. ఈ యీశ్వరుడు భ్రాంతిజనకమగు మాయయందు నిర్గుణబ్రహ్మముయొక్క ఒక ప్రతిబింబము గాదు. ఏలన విశ్వములోనుండియే గాక, సమస్తవిశ్వముయొక్క వెలుపలనుండియు దానిని బాలించు ప్రభువుగ నున్నాడు. అతడు పరమేశ్వరుడగు పరబ్రహ్మము, ఏలన అతడు పరమాత్మ మఱియు పరమపురుషుడు, మఱియు తన అత్యున్నత మూలభావమునుండి విశ్వమును బుట్టించి, పాలించును-స్వయంవంచితుడు గాక, తన సర్వజ్ఞ సర్వశక్తిమత్త్వముతో బాలించును. మఱియు విశ్వమునం దతని దివ్యప్రకృతియొక్క వ్యాపారము మన లేక అతని చేతన కల్పించు ఒక మాయా జాలము గాదు. ఉన్న మాయయంతయు నిమ్నప్రకృతియొక్క అజ్ఞానముమాత్రమే; ఈ మాయయు అస్పృశ్యమగు బ్రహ్మాధారమున, లేని వస్తువులను సృజించదు, పరంతు తన అంధ, భారాక్రాంత, పరిమితక్రియ కారణముగా అహంకారరూపకము

(figure) చేతను, తదితరమగు మనఃప్రాణశరీరముల అపర్యాప్తరూపకములచేతను సృష్టియొక్క గంభీరతర సత్యతలను కేవలము వికృతము గావించును. ఒక పరమ, ఒక దివ్య ప్రకృతి గలదు, ఆమెయే విశ్వముయొక్క యథార్థ సృష్టికర్త్రి. సర్వ ప్రాణులు, సకల వస్తువులు ఒకే దివ్యసత్తయొక్క సంభూతులు; సమస్తజీవనము ఒకే ఈశ్వరశక్తియొక్క ఒక క్రియాప్రకారము; సర్వప్రకృతి ఒకే అనంతునియొక్క ఒక అభివ్యక్తి. అతడు మానవునిలోని భగవంతుడు; జీవుడు అతని పూర్ణాత్మనుండి వెలువడిన అంశికాత్మ; అతడు విశ్వమునందలి భగవంతుడు; దేశకాలగతమగు నీ ప్రపంచము దృశ్యమగు అతని స్వీయవిస్తారము.

10. <u>నిష్క్రియతాదాత్మ్యము—సక్రియ ఏకత</u> : సత్తయొక్కయు, అతిసత్తయొక్కయు ఈ విశాలదర్శనమును చేయించుటయందే గీతాయోగము తన సమన్వయ గాంభీర్యమును, అనుపమవైపుల్యమును అందుకొనును. ఈ పరమపురుషుడే సర్వమునందు గల అవిక్రియ, అవ్యయ ఏకాత్మ; కావున ఈ ఏకాత్మయొక్క ఆధ్యాత్మిక భావమునకు మేల్కొని, దానితో తన ఆంతర నిర్వ్యక్తికసత్తను ఏకముచేయదగును. అటులే ఈ పరమపురుషుడు మానవుని సర్వకర్మలను ప్రారంభించి, నడుపు అతని లోపలి ఈశ్వరుడు; కావున మానవు డీ ఈశ్వరునికి మేల్కొని, తన గర్భాలయము లోనే యున్న అతనిని దర్శించి, అతని నావరించి మఱుగుపఱచుదాని యంతటినుండి బైటబడి, తన ఆత్మయొక్క అంతరతమాత్మయు, తన చేతనయొక్క అధికతరచేతనయు, తన ఇచ్ఛాకర్మ లన్నింటియొక్క గుప్తస్వామియు, తన బహువిధ సంభూతియొక్క మూలము మఱియు గమ్యరూపమున తనలోపలి సత్తయు నగు ఈశ్వరునితో నేకీభూతుడు గాదగును. మన సర్వస్వముయొక్క మూలమగు నితని దివ్యప్రకృతి నిమ్నతర ప్రాకృతవికారములచేత దట్టముగా నావరింపబడి యుండును; కావున మానవుడు సదోషము, మర్త్యము నగు తన నిమ్న, బాహ్యప్రకృతినుండి నిర్గమించి, అమరత్వ సంసిద్ధులకు ఆలవాలమగు తన మూల, దివ్యప్రకృతిని జేరుకొనవలెను. ఈ భగవంతు డన్నింటియందును ఆత్మరూపమున ఏకము—ఈ ఆత్మ అన్నింటియందును నివసించును, అన్నియు నీ ఆత్మయందు నివసించును ,చరించును; కావున మానవుడు సర్వప్రాణులతోను తన ఆధ్యాత్మిక ఏకతను గనుగొని, అన్నింటిని ఆత్మయందును, ఆత్మను అన్ని భూతములందును చూడవలెను, అంతేకాదు, సర్వవస్తువులను, ప్రాణులను తానుగానే చూడవలెను—"ఆత్మౌపమ్యేన సర్వత్ర" (6–32)–మఱియు నా చూపు

ననుసరించి చింతించవలెను, భావించవలెను, చేష్టించవలెను. ఇక్కడ లేక ఎక్కడైనను గలదాని కంతకు ఈ భగవంతుడు మూలము, మఱియు తనప్రకృతిచేత ఈ అసంఖ్యాక భూతము లన్నియు నయ్యెను - "అభూత్ సర్వభూతాని" (ఈశ. ఉప.); కావున చరాచరవస్తువు లన్నింటియందును మానవుడా ఏకమాత్రునే చూచి, ఆరాధించవలెను; సూర్యునియందు నక్షత్రమునందు, పుష్పమునందును, మానవునియందు, ప్రతిప్రాణియందును, రూపములందు, శక్తులందును, ప్రకృతిగుణములందు, సత్త్వములందును అతని అభివ్యక్తినే పూజించవలెను - "వాసుదేవః సర్వ మితి" (7-19). దివ్య దర్శనముచేతను, దివ్యసానుభూతిచేతను, చివరకు ఒక పటిష్ఠ ఆంతరతాదాత్మ్యము చేతను అతడు విశ్వముతో నేకీభూతుడై విశ్వమయుడు గావలెను. ఒక నిష్క్రియ, నిస్సంబంధతాదాత్మ్యము ప్రేమను, క్రియను వెలివేయును; కాని ఈ పృథుతర, సంపన్నతర ఏకత కర్మలచేతను, ఒక విశుద్ధ ప్రేమభావముచేతను తననుదాను పూర్ణముగావించుకొనును : ఈ ఏకత మన సమస్తకర్మలు మఱియు భావముల ప్రభవము (source), గృహము, సారము, ప్రేరణ మఱియు దివ్యప్రయోజనము నగును. "కస్మై దేవాయ హవిషా విధేమ" - ఏ దేవునికి మనము మన సమస్త జీవనమును, కర్మను ఒక నివేదనగా సమర్పించవలెను? ఈ (విశ్వమయ) భగవంతుడే, ఈ ప్రభువే మన యజ్ఞాధికారి. నిష్క్రియ, నిస్సంబంధ తాదాత్మ్యము ఆరాధన మఱియు భక్తియొక్క ఆనందమును బహిష్కరించును; కాని భక్తి ఈ సంపన్నతర, సంపూర్ణతర, ఘనిష్ఠతరసంయోగమునకు ఆత్మయే, హృదయమే, శిఖరమే యగును. ఈ భగవంతుడే సర్వసంబంధముల పరిపూర్తిరూపము - ప్రతిప్రాణియొక్క అంతరాత్మకు పిత, మాత, ప్రేమికుడు, సుహృదుడు, మఱియు శరణ్యము. ఈ భగవంతుడే రహస్యజ్ఞానము చెప్పు ఏకమాత్ర పరమ మఱియు విశ్వమయ దేవుడు, ఆత్మ, పురుషుడు, బ్రహ్మము, మఱియు నీశ్వరుడు. అతడు తనయందే తన దివ్య యోగముచేత ఈ సర్వప్రకారములందును ప్రపంచము నభివ్యక్తముచేసెను. భూత సముదాయము లతనిలో ఏకముగా నుండును, మఱియు నతడు వాని నానారూపము లలో నేకముగా నుండును. ఈ సర్వరూపములందును ఏకకాలమున బొడముచున్న అతని అభివ్యక్తికి మేల్కొనుట అదే దివ్యయోగముయొక్క మానవపార్శ్వ మగును.

11. మహావాక్యస్వరూపము : ఇదియే తన బోధనయొక్క ఉత్తమ, సంపూర్ణసత్యము, ఇదియే తాను ప్రకటింతు నని మాట యిచ్చిన సమగ్రజ్ఞానము

(7-2) – అని పూర్ణముగా, నిర్ద్వంద్వముగా స్పష్టపఱచుటకు, గతోపదేశముయొక్క ఫలితార్థమును తిరిగి వక్కాణించి, భగవదవతారము తన పరమవచనము – "పరమం వచః" (10-1) – ఇదియే గాని, మఱేదియు గాదని ప్రకటించును. ఏది సనాతనునియొక్క ఉత్తమజ్ఞానము, ఉత్తమపూజనము? అతడు అభివ్యక్తమైనదానికంతకు పరమ, దివ్యమూలము (10-2), మఱియు నీ జగత్తు మఱియు దానియందలి ప్రాణులయొక్క మహేశ్వరుడు (10-3), వస్తువు లన్నియు అతని సత్తయొక్క సంభూతులే – అవి అతని నెఱింగి, పూజించుటయే అతని ఉత్తమజ్ఞానము మఱియు పూజనము : ఈ విస్పష్టప్రకటన పరమవచనముయొక్క ప్రథమభాగము. ఏకీకృత భక్తిజ్ఞానములే పరమయోగ-మనునది దాని ద్వితీయభాగము (10-8); సనాతన భగవంతునితో సంయోగమును బొందుటకు ఈ యోగము సహజ, విహితమార్గము (10-7). ఈ మార్గనిర్వచనమును మఱింత అర్థవంతము చేయుటకు, దీనియందలి భక్తిమహత్త్వమును మఱింత దీప్తిమంతము చేయుటకు, శిష్యుని మనోహృదయములచే దాని అంగీకారమును గురువు తన తర్వాతి ఉపదేశమున కొక నిబంధన గావించును – "నీ ఆత్మహితమును గోరి," గురువు పలుకును, "నే నీ పరమ వచనమును నీకు ప్రకటించెదను; కారణము, నాయందు నీ హృదయమున కిపుడు ప్రీతి గలుగుచున్నది," – "తే ప్రీయమాణాయ వక్ష్యామి" (10-1). భగవంతుని యందు హృదయమునకు గలుగు ప్రీతియే యథార్థభక్తియొక్క సంపూర్ణద్రవ్యము మఱియు సారము – "భజతాం ప్రీతిపూర్వకం" (10-10). పరమవచనము ప్రోక్తమైన వెంటనే, దానికి తన అంగీకారము ప్రకటించునట్లును (10-14), సర్వ వస్తువులందును భగవంతుని జూడగల వాస్తవవిధానమును గుఱించి ప్రశ్నించునట్లును (10-17) అర్జునుడు అంతఃప్రేరితు డగును; ఈ ప్రశ్నమువెంటనే సహజముగా విశ్వపురుషరూప భగవద్దర్శనమునకు సమయము వచ్చును, చివరకు దాని నుండి ప్రపంచకర్మ చేయ ప్రచండాదేశము ఉద్భవించును (11-33).

12. భగవంతుడు అజుడు, అనాది : భగవంతుని గుఱించిన ఏ భావమును గీత సర్వ జీవనగుహ్యముయొక్క రహస్యముగాను, విముక్తికి దారితీయు జ్ఞానముగాను నొక్కిచెప్పునో, అది కాలగతవిశ్వప్రక్రియకును, కాలాతీత నిత్యవస్తువునకును మధ్య సేతువును బంధించును, అంతేకాని, అది ఈ రెండింటిలో దేనినితీసివేయదు, దేని సత్యతను తగ్గించదు. మన ఆధ్యాత్మికభావనయొక్కయు, ఆధ్యాత్మికానుభవము

యొక్కయు వివిధభూమికలను-విశ్వదేవైక్యవాద, ఈశ్వరవాద, అతీతత్వవాద భూమికలను-అది సమరసముగావించును. అభావమేమన, భగవంతుడు ఆది లేనట్టి అజసనాతనుడు; అతనికి మూలమగు పూర్వవర్తి ఏదియులేదు, ఉండజాలదు; కారణము, అతడు అద్వితీయుడు, కాలరహితుడు, మఱియు నిరపేక్షుడు (absolute). "దేవతలుగాని, మహర్షులుగాని నా పుట్టుకనెఱుంగరు....(10-2), ఆది లేనట్టి అజునిగా నన్నెఱింగినవాడు....(10-3)"-ఇవి యిక్కడి మహావాక్యముయొక్క ప్రారంభవచనములు. ఈ జ్ఞానము పరిమితికరము గాని, బౌద్ధికము గాని కాదు, పరంతు శుద్ధము, ఆధ్యాత్మికము; ఏలన ఈ అతీతపురుషుని స్వరూపము మనశ్చింతన కందని రూపము - "అచింత్యరూపము" (8-9); కావున ఈ జ్ఞానము మర్త్యమానవుని సమస్త అజ్ఞానవిమోహమునుండియు, పాప, దుఃఖ, అశుభముల సమస్త బంధనమునుండియు విడిపించు నని ఈ మహావాక్యము సమున్నతవాగ్దానము చేయును (10-3). ఈ పరమ ఆధ్యాత్మికజ్ఞానప్రకాశమున నివసించగల మానవాత్మ విశ్వముయొక్క భావాత్మక లేక ఇంద్రియగోచరమగు దృశ్యజాలమునుండి ఉద్ధరించబడును. అది ఒక అనిర్వచనీయశక్తిలోనికెగయును-ఈ శక్తి ఇహపరములందు ఏకరూపముగానుండి, సర్వమును అతిక్రమించుచునే, సర్వమునకు పూరకమగు అద్వైతశక్తి. అతీతానంతముయొక్క ఈ ఆధ్యాత్మికానుభవము విశ్వమే భగవంతుడను భావనయొక్క పరిధులను భంగించును. ఈ భావన భగవంతుని ప్రపంచాభివ్యక్తియందు బంధింపప్రయత్నించును, మఱియు నతని నెఱుంగుటకు తదభివ్యక్తినే ఏకమాత్ర సాధనముగా మనముందుంచును; కాని అతీతానుభవము దిక్కాలరహితమగు సనాతనునిలోనికి మనకు విడుదల గల్పించును. "దేవతలు గాని, దానవులు గాని నీ అభివ్యక్తి నెఱుంగరు (10-14)" - అని అర్జునుడు తన సమాధానమున గట్టిగా పలుకును. అనగా, సంపూర్ణవిశ్వము లేక అసంఖ్యాకవిశ్వములు సైతము అతని నభివ్యక్తము చేయలేవు, అతని అవర్ణ్యతేజమును, అతని అనంతమహత్త్వమును తమలో నిముడ్చుకొనజాలవు. ఇంతకంటెను తక్కువ కోవకు జెందిన భగవద్-జ్ఞానమంతయు సదా అనభివ్యక్తము, అవర్ణనీయము నగు అతీతభగవంతుని సత్యతపై నాధారపడుటచే మాత్రమే సత్య మగును.

13. "సర్వవిధముల నేనే ఆదిని" : కాని ఈ దివ్య పరతత్త్వము ఒక నిషేధమును గాదు, అటులే విశ్వముతో సర్వసంబంధశూన్యమగు ఒక కేవలమును

(absolute) గాదు. అది ఒక పరమ సద్భావము (positive), అది కేవలములకు కేవలము. విశ్వముయొక్క (మాతాపిత్రాది) సర్వసంబంధములు ఈ పరము నుండియే వెలువడును; సర్వభూతములు దీనికే తిరిగి వచ్చి, దీనియందే తమ అపరిమేయ అస్తిత్వమును గనుగొనును. "ఏలన నేను దేవతలు మఱియు మహర్షుల యొక్క సర్వథా మూలమను" (10-2). దేవతలు మహత్తరమగు అమరశక్తులు మఱియు అమృతవ్యక్తిత్వములు, వీరు విశ్వబలములను (forces) సచేతనముగా అనుప్రాణితము గావించుచు, తన్మయముగా నుండుచు, వానిని నడుపుదురు. దేవతలు సనాతన, ఆద్యదేవతయొక్క ఆధ్యాత్మికరూపములు, అతనినుండి బహువిధ ప్రపంచ ప్రక్రియలలోనికి దిగుదురు. అసంఖ్యాకులు, సార్వత్రికులు నగు దేవతలు సత్త యొక్క ప్రాథమికతత్త్వములనుండియు, వాని సంమిశ్రరూపములనుండియు ఏక మాత్రుని అనేకరూపమగు సృష్టిజాలము నల్లుదురు. వారి సమస్త స్వీయసత్తయు, స్వీయప్రకృతియు ప్రతిప్రకారమునను, ప్రతితత్త్వమునను, ప్రతిపేటయందును అతీత అనిర్వచనీయమునుండియే ప్రభవించును. ఇచ్చట ఏదియు ఈ దైవప్రతినిధుల చేత స్వయముగా నిర్మించబడదు, స్వయంపర్యాప్తముగా చేయబడదు. ప్రతివస్తువు తన మూలమును, కారణమును, సృజింపబడుటకు మూలహేతువును, కొనసాగుటకు సంకల్పమును స్వతఃసిద్ధ పరమపురుషునియందే కనుగొనును – "అహం ఆదిః సర్వశః" (10-2). విశ్వములోని దేనికిని తన వాస్తవకారణము విశ్వములో లేదు. అంతయు నీ అతిలోక అస్తిత్వమునుండియే ప్రవర్తించును.

14. <u>మహర్షులు, మనువులు</u> : వేదములో వలె నిచ్చటను సప్తమూల ఋషులు – "మహర్షయః సప్త పూర్వే" (10-6) – అని పిలువబడు మహర్షులు ఒక భాగవత ప్రజ్ఞయొక్క – "ప్రజ్ఞా పురాణీ" – ధీశక్తులు, ఈ ప్రజ్ఞయే తన స్వసంప్రజ్ఞ (self-conscious) అనంతతనుండి సర్వవస్తువుల పరిణామమును సాధించినది, తన సారతత్త్వముయొక్క సప్తతత్త్వములద్వారా వాని ప్రకటరూపమును సాధించినది. వేదములందలి సర్వధారక, సర్వప్రకాశక, సర్వవ్యంజకమగు సప్తధీవృత్తుల – "సప్త ధియః" మూర్తీభావమే సప్త ఋషులు – సర్వవస్తువులు ఏడేడు చొప్పున ఏర్పడియుండుటను ఉపనిషత్తు చెప్పును–"సప్త సప్త". ఈ ఋషులతో గూడి, మానవుని పితలగు నలుగురు సనాతనమనువులును వత్తురు – నలుగు రేలన, భగవంతుని సక్రియ స్వభావము చతుర్విధము, మఱియు మానవజాతి

దీనిని తన చతుర్విధ శీలమున (చాతుర్వర్ణ్యమున) వ్యక్తముచేయును. ఈ మనువులును, వారి పేరే సూచించునట్లు, మనఃప్రధానపురుషులు. తన క్రియనిమిత్తము వ్యక్తము లేక లీనమగు మనస్సుపై నాధారపడు సమస్తప్రాణమునకు వీరు సృష్టికర్తలు (10-6), లోకమునందలి ప్రాణు లందరు వారి సంతతియే - "ఏషాం లోక ఇమాః ప్రజాః" (10-6). మఱియు నీ మహర్షులును, మనువులును స్వయముగా పరమపురుషునియొక్క శాశ్వత మానసికసంభూతులు, అతని ఆధ్యాత్మిక పరభావము నుండి విశ్వప్రకృతిలోనికి జనించినవారు - విశ్వమున సర్వమునకు మూలమగు వీరికి అతడు మూలము. సర్వసత్తలకు సత్త, సర్వాత్మకు ఆత్మ, సర్వమనస్సునకు మనస్సు, సర్వప్రాణమునకు ప్రాణము, సర్వరూపమునకు ద్రవ్యమునగు ఈ అతీతకేవలము (పరమపురుషుడు) మన స్వరూపమునకు సర్వథా వ్యతిరేకము గాదు; పరంతు మనయొక్కయు, విశ్వముయొక్కయు సత్తాప్రకృతుల సమస్త తత్త్వములు మఱియు శక్తులయొక్క ఉత్పాదకము, ప్రకాశకము నగు స్వతఃసిద్ధ కేవలము.

15. <u>అతీతము గావుననే సర్వము</u> : మన అస్తిత్వముయొక్క ఈ అతీత మూలము మననుంచి దాటరాని ఒక అఖాతముచే వేఱువడి లేదు, మఱియు నతడు తననుండి పుట్టిన ప్రాణులను తన సంతతి గాదని నిరాకరించడు, లేక వానిని భ్రమరూపము లని గర్హించడు. అతడు సత్త, అందరు అతని సంభూతులు. అతడు ఒక రిక్తము (void) నుంచి గాని, ఒక శూన్యమునుంచి గాని, అవాస్తవికమగు స్వప్నగర్భమునుండి గాని సృజించడు. తనయందుండియే అతడు సృజించును, తనలోనే అతడు సంభవించును (రూపము లగును). అన్నియు అతని సత్తయందే యున్నవి, అన్నింటి సత్తయు అతని సత్తయే. విశ్వము భగవంతుడు - అను చూపున కీ సత్యమునం దవకాశము గలదు గాని, యిది దానిని మించును. వాసుదేవుడు సర్వము- "వాసుదేవః సర్వం" (7-19). నిజమే, కాని ఏది విశ్వమునందు గన్పించుట లేదో, ఏది ఎప్పుడును వ్యక్తము గాదో, అది యంతయు గూడ వాసుదేవుడు గావుననే, కన్పించున దంతయు వాసుదేవుడు. అతని సత్త ఎన్విధముగను అతని సంభూతిచేత పరిచ్ఛిన్నము గాదు; అత డేమాత్రము ప్రపంచసంబంధముచే బద్ధుడు గాడు. అంతయు నగుచునే, అతడు తదతీతముగా నుండును; సాంత రూపములను ధరించుచునే, అత డనంతుడుగా నుండును. ప్రకృతి తన మూలమున అతని ఆధ్యాత్మిక శక్తి, ఆత్మశక్తి; ఈ ఆధ్యాత్మిక శక్తి సంభూతియొక్క అనంత, ప్రధాన

గుణములను వస్తువుల అంతర్భాగముగా పెంపొందించి, పిమ్మట రూప, క్రియాత్మక మగు వాని బాహ్యరూపముగా ఆ గుణములను మార్చును. ఏలన ఆమె అనుసరించు మౌలిక, రహస్య క్రమమున వ్యష్టియొక్కయు, సమష్టియొక్కయు ఆధ్యాత్మిక సత్యము ముందు వచ్చును, ఈ సత్యము గభీరతాదాత్మ్యములకు సంబంధించినది. పోగా గుణ, స్వభావములకు సంబంధించిన వాని మానసికసత్యము తన సమస్త అకల్పితాంశమునందు ఆధ్యాత్మికసత్యముపై నాధారపడును, అది ఆత్మనుంచి ఉత్పన్నమగును. చివరకు, ఆవశ్యకతయందు కనిష్ఠము, క్రమమునందు అంత్యము నగు రూపక్రియాత్మక దృశ్యసత్యము ఆంతర గుణస్వభావములనుండి ఉత్పన్నమై, తన బాహ్య నిర్మాణములయందు వానిపైననే ఆధారపడును. లేక యిట్లు చెప్ప వచ్చును : దృశ్యసత్యము అంతరాత్మ గుణముల ఒక వ్యక్తీకరణము కాగా, ఈ గుణముల ప్రాదుర్భావమునకు గారణ మొక ఆధ్యాత్మిక సత్యము.

16. "భూతములు, భావములు, సంభవము" : సాంతమగు ఈ బాహ్య సంభూతి దివ్య అనంతుని వ్యక్తముచేయు ఒక వ్యాపారము. ప్రకృతి తన గౌణ రూపమున నిమ్నప్రకృతి యగును, ఇది అనంతునియొక్క అసంఖ్య-సంభవతల యందు కొన్ని సమూహముల నెన్నుకొని వానికి కార్యరూపముగల్పించు గౌణక్రియ. రూపము మఱియు ఊర్జము (energy), క్రియ, మఱియు గతి – వీనితో గూడిన ఈ సమూహములు విశ్వైక్యములో నొక అంశముగా పరిమితసంబంధమును, పరస్పరాను భవమును గల్గించును. అయితే తన నిమ్నవ్యవస్థయందు ప్రకృతి, భగవంతుని ఒక వ్యంజకశక్తిగా, తమోమయ విశ్వ-అజ్ఞానము గల్పించు విపర్యయములచే వికృత మగును, మఱియు ఆమె దివ్యాశయములు మన మానసిక మఱియు ప్రాణికానుభవము యొక్క ఆహంకారిక యాంత్రికక్రియయందు అదృశ్యమగును. కాని యిచ్చట ఈ స్థితియందును సర్వము పరమపురుషునియం దుండియే ఘటించు ఒక జన్మ, ఒక సంభూతి, ఒక పరిణామము–"ప్రభవము, భావము, ప్రవృత్తి" (10–8), అనగా సర్వము అతీతునియందుండి ప్రకృతిక్రియద్వారా జరుగు ఒక పరిణామప్రక్రియ. "అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే", "నేను సర్వమునకు జన్మస్థాన మను, నానుండియే సర్వము కర్మ, గతిరూప వికాసములోనికి ప్రవృత్త మగును." (10–8). "బుద్ధి, జ్ఞానము, అజ్ఞానసమ్మోహమునుండి విముక్తి, క్షమ, సత్యము, దమము, శమము, అహింస మఱియు సమత, తుష్టి, తపము, మఱియు

దానము " (10-4,5)-ఇట్టి ప్రశస్తసృష్టి మాత్రమే భగవంతునుండి వచ్చుట లేదు; మర్త్యమానసమును కలవరపెట్టి, దానిని అజ్ఞానసమ్మోహములకు గుఱిచేయు ద్వంద్వములును అతనినుండియే వచ్చుచున్నవి- "సుఖము మఱియు దుఃఖము, ఉత్పత్తి మఱియు లయము, భయము మఱియు అభయము, యశము మఱియు అయశము " (10-4)-ఇదియు, నిట్టిదియే యగు ప్రకాశాంధకారముల పరస్పర క్రీడనము, స్నాయవీయ (nervous) మనస్సును వేధించు సహస్ర తంతు సంమిశ్రము గూడ అతనినుండియే వచ్చును. తమ పృథగ్భూత వైవిధ్యములతో నిచ్చట గానవచ్చు సమస్త ఆంతరికసంభూతులు భగవంతునియొక్క ఒకే మహాసంభూతి యందు అంతర్భాగములు, అవి తమకు పరమునందుండు అతనినుండియే తమ జన్మను, సత్తను బొందును. ఈ పరుడు (Transcendent) వీనిని తెలిసియే పుట్టించును, వీని నానాభూత జ్ఞానమునందు తగుల్కొనడు, తన సృష్టిచేత పరాజితుడు గాడు. అగుట - అర్థముగల భూ-ధాతువునుండి ఏర్పడిన " భవంతి, భావాః, భూతానాం " (10-5) - అను శబ్దములు గట్టిబలముతో ఒకే చోట వచ్చుటను మనము గమనించదగును. చరాచరము లన్నియు భగవంతుని సంభూతులు - " భూతాని "; అతనివే యగు ఈ భూతముల ఆంతరికావస్థలు మఱియు వృత్తులు వీని మానసిక సంభూతులు - " భావాః "; అత్యున్నత ఆధ్యాత్మిక స్థితులే గాక, మన యీ న్యూనతర మానసిక భావములును [1] పరమపురుషునినుండి సంభవించు సంభూతులే - " భవంతి మత్త ఏవ " (10-5). ఇట్లు గీత సత్తాసంభూతులకు గల విభేదమును గుర్తించి, వక్కాణించును, అయినను ఆ విభేదము నొక విరోధములోనికి మార్చదు. ఏలన అది సమగ్ర ఏకత్వమునకు స్వస్తిచెప్పుటయే యగును. భగవంతుడు తన అతీతభావమున ఏకము, సర్వాధరమగు, వస్తువుల ఏకాత్మరూప మున ఏకము, తన విశ్వప్రకృతియొక్క ఏకతారూపమున ఏకము. ఈ ముగ్గురును ఒకే భగవంతుడు; అంతయు అతనినుండియే ఉత్పన్నమగును, అంతయు అతని సత్తనుండియే సంభూతి నందును, అంతయు నతని సనాతనాంశమే లేక కాలా తీతునియొక్క కాలగతవిస్తారమే. గీతాగతిని మన మనుసరింత మేని, పరము

[1] ఇచ్చట ఈశ ఉపనిషత్తును జూడుడు : "ఆత్మా అభూత్ సర్వభూతాని"- ఆత్మ సర్వభూతము లయ్యెను. ఆత్మ యన స్వయంభూతత్త్వము అని ఇచ్చట విశిష్టార్థము మనకు స్ఫురించును. -శ్రీ అ.

(Transcendence) నందును, స్వతఃసిద్ధము (Absolute) నందును సర్వవస్తువుల పరమనిషేధముకొఱకు మనము జూడగూడదు, ప్రత్యుత వాని గుహ్యార్థముయొక్క నిశ్చితకీలకమునకును, వాని జీవనముయొక్క సమన్వయసాధకరహస్యము నిమిత్తమును జూడవలెను.

17. <u>సాక్షి గాదు, మహేశ్వరుడు</u> : కాని అనంతుని మఱియొక పరమ సత్యత గలదు, విమోచక జ్ఞానముయొక్క ఒక అపరిహార్యాంశముగా దానిని గూడ గుర్తించితీరవలెను. ఈ సత్యత ఏమన, భగవంతు డెటుల విశ్వమును దానిలోపల నుండి సన్నిహితముగా బాలించునో, అటులే దానిపై నుండియు దాని నపేక్షించును. తానే సర్వసృష్టి అయ్యును, దానిని అనంతముగా అతిశయించియుండు పరమపురుషుడు తన సృష్టికి దూరముగా నుండు, దాని సంకల్పరహితకారణము గాడు. అతడు అనిచ్ఛాపూర్వక ఉత్పాదకుడు గాడు; అందుచేతనే తన విశ్వశక్తియొక్క ఈ ఫలితముల బాధ్యత నంతను నిరాకరించడు, లేక తన చేతనకంటె మిక్కిలి భిన్నమగు ఒక మాయికచేతనపై ఆ ఫలితముల నారోపించడు, లేక వానిని ఒక యాంత్రిక నియమమునకో, ఒక విశ్వకర్మకో, తత్త్వముల ఒక ఆసురికసంఘర్షమునకో వదిలివేయడు, అతడు ఒక ఉదాసీన, పృథగ్భూత సాక్షి గాడు, కావున సర్వము స్వయముగా రూపుమాయువఱకు, లేక తన అచల, మూలతత్త్వమునకు తిఱిగివచ్చువఱకు పట్టనట్లు వేచియుండడు. అతడు లోకములు మఱియు లోకులయొక్క మహేశ్వరుడు—“లోక-మహేశ్వరః” (5-29), మఱియు సర్వమును లోపలనుండియే గాక, పైనుండియు, అనగా తన పరమ పరిస్థితినుండియు బాలించును. విశ్వమును అతిశయించని శక్తి విశ్వమును బాలింపజాలదు. దివ్యపరిపాలన ఒక సర్వశక్తశాసకుని స్వేచ్ఛామయ ప్రభుతను సూచించును గాని, విశ్వముయొక్క బాహ్యప్రకృతిచేత పరిమితమై, సంభూతిని సాధించు ఒక స్వయంబాలకశక్తిని గాని, యాంత్రికవిధానమును గాని సూచించదు. ఇది ఈశ్వరవాది కంటితో విశ్వమును జూచుట యగును ; అయితే యిది ప్రపంచమునందలి పరస్పరవిరోధములకు జడిసి, ముడుచుకొను ఈశ్వరవాదము గాదు. దీని దృష్టిలో భగవంతుడు సర్వజ్ఞుడు, సర్వశక్తుడు నగు అద్వితీయ ఆద్యపురుషుడు; ఇతడే సర్వమును తనయం దభివ్యక్తము చేయును - శుభాశుభములు, సుఖదుఃఖములు, తేజస్తిమిరములు - సర్వమును తన స్వీయసత్తయొక్క ద్రవ్యముగనే అభివ్యక్తము చేసి, అట్లు తనయందే అభివ్యక్తము చేసిన

దానిని తానే పాలించును. తన సృష్టిచేత అబద్ధుడు, దాని ద్వంద్వములచే అప్రభావితుడు, ఈ ప్రకృతి నతిక్రమించియు, దానితో సన్నిహితసంబంధము గలవాడు మఱియు ప్రకృతిగత జీవులతో ఘనిష్ఠముగా అభిన్నుడు, వాని సత్త, ఆత్మ, పరమాత్మ, ప్రభువు, ప్రేమికుడు, సుహృదుడు, ఆశ్రయము నగు అతడు వానిలోపలనుండియు, పైనుండియు, వాని అజ్ఞానదుఃఖములు, శుభాశుభములద్వారా వానిని సర్వదా నడుపును; ప్రతివానిని తన ప్రకృతిద్వారాను, అందరిని విశ్వప్రకృతిద్వారాను ఒక పరమతేజమునకు, ఆనందమునకు, అమరత్వమునకు, అతీతత్వమునకు నడుపును. ఇదియే పరిపూర్ణ విమోచనజ్ఞానము. మనయందలి మఱియు ప్రపంచమునందలి భగవంతుడు ఏకకాలమున అతీతానంతుడు గూడ నని తెలుపునదియే ఈ జ్ఞానము. తన దివ్యప్రకృతిచేత, తన సత్తయొక్క కార్యసాధకశక్తిచేత అంతయు నయిన ఒక ఆదిపురుషుడగు నతడు అంతను తన అతీతభావమునుండి పాలించును. అతని ఘనిష్ఠసన్నిధి ప్రతిప్రాణియందును గలదు, మఱియు నతడు సమస్తవిశ్వఘటనలకు కారణము, అధీశుడు, చాలకుడు ; అయినను అతడు తన సృష్టిచే పరిమితుడు గాకపోవుటకు గారణము, అతడు దానికంటె ఎంతో అధికుడు, ప్రబలుడు, అనంతుడు.

18. <u>ఆధ్యాత్మికవిమోచన స్వభావము</u> : ఈ జ్ఞానలక్షణము మూడు ప్రతిజ్ఞాశ్లోకములలో స్పష్టముచేయబడును. "ఎవడెవడు," భగవానుడు ప్రవచించును, "నన్ను ఆదిలేని అజునిగను, లోకమహేశ్వరునిగను ఎఱుంగునో, వాడు వాడు మర్త్యులలో అసంమూఢుడై నివసించుచు సర్వ పాపాశుభములనుండియు విముక్తుడగును (10–3). నా యీ విభూతిని – సర్వవ్యాపక ఈశ్వరత్వమును – మఱియు నా యీ యోగమును (ఐశ్వరయోగమును – ఈ యోగముచే అతీతుడు సర్వభూతములకంటె నధికుడయ్యు, వానితో ఒకటిగా నుండును, వానిలో నివసించును, తన ప్రకృతియొక్క సంభూతులుగా వానిని తనలోపల ధరించును) ఎవడె ఱుంగునో, వాడు అవికంపమగు యోగముచే నాతో యుక్తుడగును (10–7). వ్యష్టిసమష్టులకు నేనే మూల మని, వ్యష్టిసమష్టులు నానుండియే తమ క్రియను, గతిని సాధించుకొను ననియు బుధు లెఱింగి, నన్ను ప్రేమింతురు, పూజింతురు (10–8).... మఱియు నేను వారికి బుద్ధియోగమును ప్రసాదింతును, వారు దానిచేత నాదగ్గరకు వత్తురు (7–10), ఇంకను వారి నిమిత్తము వారి అజ్ఞానాంధకారమును

నాశముచేతును (7–11)." ఈ ఫలితము లవశ్యముగా ఈ జ్ఞానస్వభావమునుండియే మఱియు ఈ జ్ఞానమును ఆధ్యాత్మికాభివృద్ధిలోనికి, ఆధ్యాత్మిక అనుభవములోనికి మలచు యోగమునుండియే ఉద్భవించును. ఏలన మానవమనస్సుయొక్క కలవర మున కంతకు, అతని మనోవ్యథ కంతకు ఇంద్రియాచ్ఛాదితమైన మర్త్యమానసము నకు సహజమగు భ్రాంతజ్ఞానము మఱియు భ్రాంతసంకల్పమే మూల మని జాడ తీసిన మనకు దెలియును – ఈ భ్రాంతజ్ఞానసంకల్పములే "సంమోహము". కాని మానవు డెపుడు సర్వవస్తువుల దివ్యమూలమును దర్శించునో, విశ్వదృశ్యమునుండి దాని అతీతసత్యతను మఱియు నా సత్యతనుండి దాని దృశ్యరూపమును వీక్షించునో, అపు డతడు బుద్ధిసంకల్పములు మఱియు హృదయేంద్రియముల విమోహమునుండి విముక్తుడగును, ప్రబుద్ధుడు, స్వేచ్ఛామయుడు నయి చరించును – "అసంమూఢః మర్త్యేషు" (10–3). ప్రతివస్తువున కిక దాని ఇప్పటి బాహ్యమూల్యమును గాక, దాని అలౌకిక, వాస్తవమూల్యమును గల్పించుచు, అతడు ఇహపరముల అనుసంధానములను (links). సంబంధములను గనుగొనును ; అతడు సమస్త జీవనకర్మలను తమ సమున్నత, వాస్తవలక్ష్యమునకు మఱల్చుచు, తనలోపలి భగవంతునుండి ప్రవహించు తేజశ్శక్తులచే వానిని బాలించును. ఇట్లతడు పాపమును, ప్రమాదమును, దుఃఖమును బుట్టించు మిథ్యాబౌద్ధికజ్ఞానమునుండియు, మిథ్యాసంకల్పజన్య ప్రతిక్రియ నుండియు, ఇంద్రియావేశమునుండియు తప్పించుకొనును – "సర్వపాపైః ప్రముచ్యతే" (10–3). ఏలన ఇట్లతడు విశ్వాతీతమునందును, విశ్వాత్మకమునందును నివసించుచు, తన స్వీయవ్యక్తిత్వమును, ఇతరుల వ్యక్తిత్వమును తమ అధికతర మూల్యములందు దర్శించుచు, పృథక్కారము, అహంకారికము నగు ఇచ్ఛాజ్ఞానముల అనృతావిద్యలనుండి విముక్తుడగును.

19. <u>అవికంపయోగము</u> : కావున గీతాదృష్టిలో విముక్తమానవుని జ్ఞానము నిషేధప్రాప్తము, సంబంధరహితము నగు నిర్వ్యక్తికతయొక్క ఒక చేతన గాదు, కార్యశూన్యమగు ఒక మౌనస్వరూపము గాదు. ఏలన విముక్తమానవుని మనోఆత్మలు, విశ్వమహేశ్వరుని ప్రవర్తక, పరిచాలక సన్నిధి విశ్వమునం దంతటను వ్యాపించి – "విభూతిం" (10–7) యున్న దను సంతతభావము మఱియు సమగ్రానుభవము నందు గట్టిగా కుదురుకొని యుండును. విశ్వవ్యవస్థకు తన సత్తయొక్క అతీతత నత డెఱుంగును, కాని దానితో దివ్యయోగముద్వారా తన ఏకతను గూడ నత

దెఱుంగును-" యోగంచ మమ " (10-7). మఱియు నతడు అతీతము, వైశ్వము (universal), వైయక్తికము నగు అస్తిత్వముయొక్క ప్రతిపార్శ్వమును పరమ సత్యముతో దానికి గల యథాసంబంధమున చూచి, దివ్యయోగముయొక్క ఏకత యందు తన యథాస్థానమున దాని నుంచును. అత డిక దేనిని దాని పృథగ్భావమున జూడడు - ఈ పృథగ్దర్శనము సమష్టిమర్మము నసలు వివరించదు, లేక ఏకపక్ష ముగా వివరించును. మఱియు నతడు సర్వమును కలగాపులగముగాను జూడడు - ఈ సంకరదర్శనము మిథ్యాప్రకాశమును, అస్వస్తక్రియను బుట్టించును. అతీత భావమున పదిలపడి, అతడు విశ్వభారముచేతను, కాలము మఱియు ఘటనల కల్లోలముచేతను ప్రభావితుడు గాడు. వస్తువుల ఉత్పత్తివినాశముల సంరంభము నడుమ అక్షుబ్ధమగు అతని అంతరాత్మ అవిచలితము, అవికంపము, సుస్థిరము నగు యోగముద్వారా విశ్వమునందేది ఆధ్యాత్మికమో, దానితో యుక్తమైయుండును. ఈ సంరంభ మంతటిద్వారా అతడు యోగేశ్వరుని నిత్యత్వమును దర్శించుచు, ఒక ప్రశాంత సార్వత్రికత మఱియు సర్వభూతములతో నేకతనుండి కర్మచేయును. అయితే ఈ ఘనిష్ఠసంపర్కము పృథక్కర నిమ్నప్రకృతియందు మనోఆత్మల సంలగ్నతను సూచించదు; కారణము, అతని ఆధ్యాత్మికానుభవమున కాధారము హీనతర దృశ్యరూపము మఱియు గతియు గాక, ఆంతర విశ్వాత్మయు, అతీత పరమాత్మయు నగును. అతడు భగవంతునితో సదృశప్రకృతి, సదృశధర్మము గలవాడగును - "సాధర్మ్య మాగతాః" (14-2); కావున అతడు తన విశ్వ భావమునందుసైతము విశ్వాతీతుడుగను, మనఃశరీరప్రాణముల వ్యష్టిభావమునందు సైతము విశ్వాత్ముడుగను వర్తించును. ఒకసారి సిద్ధించి, అవిచలము, ప్రతినివిష్టము నగు నీ యోగముచేత - "అవికమ్పేన యోగేన" (10-7) - అతడు దివ్యాత్మతో తన ఏకతనుండియు, జగదీశ్వరునితో తన సంతతసంయోగమునుండియు ఎట్టి పతనము లేకయే, ఎట్టి ప్రకృతిస్థితి నైన అవలంబించగలడు, ఎట్టి మానవదశ నైన స్వీకరించగలడు, ఎట్టి ప్రపంచక్రియ నైన చేయగలడు - "సర్వథా వర్త మానోపి స యోగీ మయివర్తతే" (6-31).

20. <u>పరస్పరపరిపూర్తి</u> : ఈ బౌద్ధిక జ్ఞానము భావిక హార్దిక, ప్రాణిక భూమికలోనికి మార్చబడినపుడు, అది అక్షుబ్ధప్రేమయు, ప్రగాఢభక్తియు నగును - మన పైనున్న ఆద్య, అతీతభగవంతునియందును, మానవునియందు, ప్రకృతియందు

సదా ఉపస్థితుడైయున్న ఈశ్వరునియందును ప్రేమభక్తి యగును. అది మున్ముందు ఒక బుద్ధిజ్ఞానము; తర్వాత అది భావిప్రకృతియొక్క ఒక ఆధ్యాత్మికీకృత "భావము" (10-8) చేత సమన్విత మగును. మనోహృదయముల ఈ పరివర్తనము సర్వ ప్రకృతియొక్క ఒక సంపూర్ణ పరివర్తనమునకు నాందీప్రస్తావన. నూతనమగు ఒక అంతరజన్మము మఱియు సంభూతి (పరిణామము) మన భక్తిప్రేమల పరమ లక్ష్యముతో ఏకీభావమునకు మనల సిద్ధపఱచును - "మద్భావాయ" (13-19). ఇపుడు ప్రపంచమునం దంతటను, దాని పైనను జూడబడిన దివ్యపురుషునియందు ప్రేమవలన గలుగు ఒక ప్రగాఢప్రీతి (10-10) ఉదయించును. ఈ ప్రగాఢానందము మనస్సుయొక్క విక్షిప్తము, బాహ్యము నగు సుఖస్థానమును తానే ఆక్రమించును, అథవా తక్కిన సుఖము నంతను తనలోని కాకర్షించుకొని, మనోహృదయభావము లను, ఇంద్రియవృత్తులను ఒక అద్భుత రసక్రియ (alchemy) ద్వారా రూపాంతర మొందించును. చేతన యంతయు భగవన్మయము కాగా, భగవంతుని సమాధానమే దానిని నింపివేయును (10-9); జీవనప్రవాహ మంతయు ఆనందానుభవరూప అఖండసాగరమున గలిసిపోవును (10-9); అట్టి భగవద్భక్తుల సమస్తవాక్కును, బుద్ధియు భగవంతుని గుఱించి పరస్పర కథనము, బోధనము నగును (10-9); ఆ ఏకమాత్ర హర్షమునందే సత్తయొక్క సమస్తతృప్తియు, ప్రకృతియొక్క సర్వ క్రీడయు కేంద్రిత మగును (10-9). చింతనయందును, స్మృతియందును క్షణక్షణము సంయోగ ముదయించుచుండగా, ఆత్మయందు ఏకతానుభవము సదా నిలిచియుండును (10-10); ఈ అంతఃస్థితి ప్రారంభించిన క్షణమునుండియు-దాని అపూర్ణదశయందు సైతము - భగవంతుడు పూర్ణబుద్ధియోగముతో దానిని ధ్రువీకరించును (10-10). భగవంతుడు మనలోని భాసుర జ్ఞానదీపమును పైకెత్తి, దానిచే పృథక్కర బుద్ధి సంకల్పముల అజ్ఞానాంధకారమును రూపుమాపును; రూపుమాపి, మానవచేతనయందు తన నావిష్కరించుకొనును. కర్మజ్ఞానముల ప్రకాశమయసమన్వయముపై నాధారపడిన బుద్ధియోగముచేత నిమ్నము, క్లిష్టము నగు మనఃశ్రేణులనుండి సత్క్రియప్రకృతిపైన భాసించు సాక్ష్యాత్మయొక్క అక్షరశాంతిలోనికి సంక్రమణము ముందు సాధించబడెను, కాని యిప్పుడు, సమగ్రజ్ఞానముతో భక్తిప్రేమల ప్రదీప్తసమన్వయముపై నాధార పడిన ఈ అధికతర బుద్ధియోగముచేత అంతరాత్మ ఒక వ్యాపక ఆనందావేశమునందు స్వయంసిద్ధము, సర్వోత్పాదకము నగు భగవంతుని సంపూర్ణ, అతీతసత్యమున

కెగయును. పర్యవసాన మేమన, సనాతను డిట్లు వైయక్తికసత్తయందును, ప్రకృతి యందును పరిపూర్తి నందగా, వైయక్తికపురుషుడు కాలగతమగు జన్మనుండి సనాతనునియొక్క అనంతములోనికి ఉద్ధరించబడి పూర్ణుడగును.

# 8. విశ్వాతిరూప భగవంతుడు

1. దార్శనిక, మానసిక సమన్వయము : ఇప్పు డొక ముఖ్యసోపానము నకు వచ్చియున్నాము—ఆధ్యాత్మికవిముక్తి మఱియు దివ్యకర్మకు సంబంధించిన గీతా సిద్ధాంత ప్రతిపాదనమునకు దార్శనిక మఱియు మానసికసమన్వయము సమకూర్చ బడినది. అర్జునుని బుద్ధికి భగవత్స్వరూపము ప్రకటింపబడినది. ఎట్లు ? పరమ మఱియు విశ్వసత్తారూపమునను, దివ్య మఱియు వైశ్వపురుష రూపమునను, అంతర్నివాసియగు మన జీవనస్వామిరూపమునను భగవత్స్వరూపము బుద్ధిజిజ్ఞాస కును, హృదయవీక్షణమునకును జూపబడినది—ఇట్టి భగవంతునే మానవుని భక్తి జ్ఞానసంకల్పములు అజ్ఞానము కల్పించిన పొగమంచులో నన్వేషించుచుండెను. ఇప్పు డిక విశ్వతోముఖ విరాట్పురుషదర్శనము మిగిలి యున్నది, దీనితో మఱియొక పార్శ్వమున భగవద్దర్శనము సంపూర్ణమగును.

2. సమన్వయ సంగ్రహము : దార్శనిక సమన్వయము సంపూర్ణమైనది. నిమ్నతరప్రకృతినుండి పురుషుని వేఱుచేయుటకు సాంఖ్యము స్వీకరించబడినది — బుద్ధివివేచనద్వారా ప్రాప్తించు ఆత్మజ్ఞానముచేతను, ప్రకృతిగుణముల అధీనతనుండి పైకెగయుటచేతను ప్రకృతిపురుషులను వేఱుపర్చవలెను. కాగా 'పరపురుషుడు' మఱియు 'పరప్రకృతి' యొక్క (7-5) ఏకతను విశాలముగా ప్రకటించి, గీత సాంఖ్యమును పూరించి, దాని పరిమితులను అతిక్రమించును. అహంకారము చుట్టును నిర్మించబడిన ప్రాకృత, పృథక్కరవ్యక్తిత్వమును తుడిచివేయుటకు దార్శనికుల వేదాంతము స్వీకరించబడినది. క్షుద్ర సవ్యక్తికసత్తను విశాల నిర్వ్యక్తికసత్తయందు లయముచేయుటకును, పృథక్కర భ్రాంతిని బ్రహ్మ-ఏకత్వమునందు రూపుమాపి,

అహంకారముయొక్క భ్రాంతదర్శనస్థానమున అన్ని వస్తువులను ఏకాత్మయందును, ఏకాత్మను అన్నివస్తువులయందును చూచు సత్యదర్శనమును స్థాపించుటకును వేదాంతపద్ధతి ప్రయోగింపబడినది. చలము మఱియు అచలము, క్షరము మఱియు అక్షరము, క్రియ మఱియు నైష్కర్మ్యము దేనినుండి ఉత్పన్నమగునో, అట్టి పరబ్రహ్మమును యథాతథముగా ప్రకటించి, గీత వేదాంతసత్యమును పూర్ణము చేయును (10–12). ఎవ డిచ్చట సర్వప్రకృతియందును రూపము ధరించునో, సర్వవ్యక్తిత్వమునందును స్వయముగా వ్యక్తమగునో, సర్వక్రియయందును తన ప్రకృతిశక్తిని ప్రయోగించునో, అట్టి పరమాత్మను, పరమేశ్వరుని సన్నిహితముగా ప్రకటించి, గీత వేదాంతముయొక్క సంభవనీయ పరిమితులను అధిగమించును. ఈశ్వరునికి, ప్రకృతియొక్క దివ్యప్రభువునకు సంకల్ప, బుద్ధి, హృదయముల, సమస్త ఆంతరసత్తయొక్క ఆత్మసమర్పణము నిమిత్తము యోగము స్వీకరింప బడినది. ప్రకృతిగత జీవుడు ఎవని అంశమో, అట్టి ఆదిదేవుడే ఈ యీశ్వరుడని ప్రకటించి, గీత యోగమును పూర్ణముచేయును (10–3). ఒక పరిపూర్ణ ఆధ్యాత్మికఏకతయొక్క ప్రకాశమునందు అన్ని వస్తువులును ఆ యీశ్వరుడే యని అంతరాత్మకు చూపించి, గీత పరిపూర్ణితయోగముయొక్క సంభవనీయ పరిమితులను అధిగమించును.

3. మానసికసమన్వయము : ఈ దార్శనికసమన్వయమునుండి ఒక సమగ్ర దృష్టి – మానసికసమన్వయము – సిద్ధించును. ఒకే దివ్యపురుషుడు ఏకకాలమున అతీత సద్వస్తువు, విశ్వమునకు విశ్వాతీత మూలము ; అటులే సర్వవస్తువుల నిర్వ్యక్తికాత్మ, విశ్వమునకు ప్రశాంతగృహము; మఱియు సర్వసత్తలు, వ్యక్తిత్వములు, శక్తులయందలి అంతర్వర్తిభగవంతుడు – సత్తారూప ఆత్మయు, కార్యసాధక ప్రకృతియు, సర్వభూతముల బాహ్యాంతరసంభూతియు నగు అంతర్యామిభగవంతుడు– అను సమగ్రదృష్టి సిద్ధించును. ఏకమాత్రుని ఈ సమగ్రదర్శనము మఱియు సమ్యగ్ జ్ఞానమునందు జ్ఞానయోగము శ్రేష్ఠముగా పూర్ణమైనది (10–8). సర్వకర్మలను కర్మ ప్రభువునకు (5–29) సమర్పించుటచేత కర్మయోగమునకు పరాకాష్ఠ ప్రాప్తించినది ; ఏలన ప్రకృతిగతమానవుడు ఇపు డతని ఇచ్ఛాపరికరము మాత్రమే. ప్రేమ మఱియు భక్తియోగము తన విపులతమరూపమున ప్రోక్తమైనది (9–34). భక్తిజ్ఞానకర్మల ప్రగాఢపరిసమాప్తి జీవేశ్వరుల సువిశాల, పరమసంయోగమునకు దారితీయును.

ఈ సంయోగమున జ్ఞాన మావిష్కరించిన రహస్యములు బుద్ధికివలెనే హృదయము నకును వాస్తవమగును. ఈ సంయోగమున కర్మయోగమునందలి కఠినమగు ఆత్మ సమర్పణము ఒక సజీవ ఏకతయొక్క సుఖమయ, స్వేచ్ఛామయ, ఆనందపూర్ణ ప్రకటన మగును. ఇట్లు ఆధ్యాత్మికముక్తికి సంపూర్ణసాధనము చెప్పబడినది; దివ్య కర్మయొక్క సంపూర్ణమగు పునాది వేయబడినది.

4. విభూతిస్వరూపము : దివ్యగురువుచే తన కిట్లు ప్రసాదించబడిన జ్ఞాన మంతయు అర్జును డంగీకరించును. అతని మనస్సు ఇప్పటికప్పుడే సందేహ ములనుండియు, జిజ్ఞాసలనుండియు విముక్తమైనది; ప్రపంచముయొక్క దురవ గాహమగు బాహ్యరూపమునుండి దాని పరమార్థమునకును, మూలమునకును, దాని అంతఃసత్యతలకును దిరిగిన అతని హృదయము ఇప్పటికప్పుడే వ్యథాశోకములనుండి విముక్తమై, దివ్యావిష్కరణముచే లభించిన హర్షముతో స్పృష్టమైనది. తన అంగీ కారమును దెలుపుటకు ఏ శబ్దములను ప్రయోగింప నర్జునుడు ప్రేరితు డగునో, అవి మఱియొకసారి బలముగా, పట్టుతో ఈ జ్ఞానము పరమగంభీరము, సర్వసమగ్రము, చరమసంపూర్ణము సని చాటును. అర్జునుడు ముందు తనతో భాషించుచున్న కృష్ణుడు అవతారము, మానవరూపమున భగవంతు డని అంగీకరించును; అతడు పర బ్రహ్మము, విశ్వాతీతసర్వము, స్వతఃసిద్ధతత్త్వము – "పరం బ్రహ్మ, పరం ధామ" (10–12) – అభివ్యక్తప్రపంచమునుండి అంతరాత్మ పైకెగసినపుడు ఈ పరధామమున నివసించగలదు. అర్జును డతని పరమపవిత్రముగా – "పరమం పవిత్రం" – నంగీకరించును; ఈ పవిత్రత నిత్యముక్తసత్త్వముయొక్క స్వభావము; స్థిరప్రశాంతమగు అక్షరాత్మయొక్క నిర్వ్యక్తికతయందు అహంకార మును రూపుమాపుటద్వారా ఈ పవిత్రసత్త్వమును చేరుకొనగలము. పిమ్మట అత డతనిని శాశ్వత దివ్యపురుషునిగా నంగీకరించును – "పురుషం శాశ్వతం దివ్యం" (10–12). తర్వాత అత డతనిని ఆదిదేవునిగా స్తుతించును, అజునిగా ఆరాధించును, సర్వవ్యాపి, సర్వాంతర్వర్తి, స్వయంవిస్తారక అజవిభునిగా ఆరాధించును – "ఆదిదేవం, అజం విభుం" (10–12). "నహితే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః"–"దేవతలు గాని, దానవులు గాని, హే భగవన్, నీ అభివ్యక్తి నెఱుంగరు (10–14)"; ఏలన అతని నభివ్యక్తముచేయ నేదియు పర్యాప్తము గాదు. ఇట్లు అర్జును డతనిని ఎట్టి వర్ణనకు అందని అద్భుతముగా నంగీకరించును; కాని అతనిని

అదే సమయమున సర్వభూతముల ఈశునిగను, వాని సంభూతికి ఏకైక, దివ్య, నిమిత్తకారణముగను, దేవదేవునిగను, విశ్వము నభివ్యక్తము చేసి, దానిని పైనుండి తన పరమ మఱియు విశ్వప్రకృతియొక్క శక్తిచేత శాసించు విశ్వేశ్వరునిగను అంగీకరించును-"భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే" (10-15). చివరకతనిని మన లోపలను, చుట్టును సర్వవస్తురూపమున గల వాసుదేవునిగా నంగీకరించును- ఈ వాసుదేవుడు విశ్వవ్యాపి, సర్వాంతర్నివాసి, సర్వఘటకము (all constituting) నగు తన "విభూతి" నామక సంభూతిశక్తుల ప్రభావముచే సర్వము నగును (10-16)- "యాభిర్ విభూతిభిర్ లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి."

5. <u>శ్రద్ధ - సాక్షాత్కారము</u> : తన హృదయముయొక్క ఆరాధనతోను, ఇచ్ఛయొక్క అనువర్తనముతోను, బుద్ధియొక్క అవగాహనతోను అర్జునుడా సత్యము నంగీకరించినాడు. ఈ జ్ఞానముతోను, ఈ ఆత్మసమర్పణముతోను భగవదుపకరణముగా వ్యవహరించుట కతడిప్పటికే సిద్ధపడియున్నాడు. కాని గభీరతరమగు ఒక సంతత, ఆధ్యాత్మికసాక్షాత్కార కామన అతని హృదయసంకల్పములలో రేకెత్తినది. ఈ సత్య మెట్టి దనిన, ఇది పరమాత్మకు మాత్రమే తన స్వీయ ఆత్మజ్ఞానమునందు స్పష్టమగును. కావుననే అర్జును డిట్లు ఘోషించును, "నీవు మాత్రమే, ఓ పురుషోత్తమ, నిన్ను నీచేతనే తెలిసికొందువు" - "ఆత్మనా ఆత్మానం వేత్థ" (10-15). ఇది ఆధ్యాత్మికతాదాత్మ్యముచే ప్రాప్తించు జ్ఞానము; ప్రాకృతమానవుని యొక్క హృదయము, సంకల్పము, బుద్ధియు సహాయము వినా, తమకుదామే దీనిని చేరుకొనజాలవు - ఇవి సత్యముయొక్క అపూర్ణ మానసికప్రతిబింబములను మాత్రమే పొందగలవు, మఱియు నీ ప్రతిబింబములు సత్యము నెంత ప్రకటించునో, అంతకు మించి దానిని మఱుగుపఱచును, వికృతపఱచును. ఇది ఒక గుప్తజ్ఞానము; కావున ఎవరీ సత్యముఖమును దర్శించియున్నారో, దీని వాణిని ఆలకించియున్నారో, దీనితో తమ ఆత్మయందును, అంతరాత్మయందును ఏకమైయున్నారో, అట్టి మహర్షుల నుండి ఈ జ్ఞానమును శ్రవణముచేయవలెను-"ఋషు లందరు, నారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసుడు, మున్నగు దేవర్షులును నీ యీ సత్యమునువచింతురు." (10-13). అథవా మానవు డీ జ్ఞానమును హృదయస్థ భగవంతునుండి వచ్చు ప్రకాశము (revelation) మఱియు స్ఫూర్తి (inspiration) ద్వారా గ్రహించవలెను - ఈ భగవంతుడు మనలో సముజ్జ్వల జ్ఞానదీపమును లేవనెత్తును (10-11). "స్వయం

చైవ బ్రవీషి మే " (10-13)-" నీవు స్వయముగా గూడ దీనిని చెప్పుచున్నావు. " ఒకసారి ప్రకటింపబడి నపు డీ జ్ఞానము మనస్సుయొక్క అనుమతిచేతను, ఇచ్ఛ యొక్క సమ్మతిచేతను, హృదయముయొక్క హర్షము మఱియు వినతిచేతను అంగీకరింపబడవలెను - ఈ మూడును సంపూర్ణ మానసికవిశ్వాసముయొక్క - శ్రద్ధయొక్క-అవయవములు. మఱియు అర్జును డట్లే అంగీకరించెను, "నీవు చెప్పు దీని నంతను నా మనస్సు సత్యముగా దలంచుచున్నది " (10-14). కాని ఇంకను మన సత్తయొక్క సాక్షాదాత్మయందే ఈ సత్యమును లోతుగా పొందవలసిన ఆవశ్యకత మిగిలియుండును, మఱియు ఈ సత్యమునకు అత్యంత సన్నిహితమగు అంతరాత్మ కేంద్రమున దీని నిత్య, అవర్ణనీయ, ఆధ్యాత్మికసాక్షాత్కారమును గుఱించిన అంతరాత్మాపేక్షయు మిగిలియుండును - మానసిక సాక్షాత్కారము ఈ సాక్షాత్కారముయొక్క పూర్వరూపము లేక ఛాయామాత్రము, ఈ సాక్షాత్కారము లేనిదే సనాతనునితో సంపూర్ణసంయోగము సాధ్యము గాదు.

6. <u>పాపాత్మునిలో భగవంతు నెట్లు చూడగలము ?</u> : ఇప్పు డా సంతత సాక్షాత్కారానికి మార్గము చూపబడును. స్వయంసిద్ధమగు మహత్తర దివ్యతత్త్వముల విషయములో మనస్సునకు కష్టము లేదు; చూడుడు : అది పురుషోత్తమ భావమునకు ఉన్మీలితము కాగలదు, అటులే అక్షరాత్మఅనుభవమునకును, అంతఃస్థిత భగవంతుని సాక్షాద్దర్శనమునకును, సచేతన విశ్వపురుషుని సంపర్కమునకును తన నేత్రము విప్పగలదు. మనస్సులో ప్రకాశమయ భావ మేర్పడినపుడు, మానవుడు వెంటనే మార్గమున అడుగిడగలడు, పిమ్మట సాధారణ మానసబోధముల నతిక్రమించుటకు కొంత కష్టపడినను, చివరకు మన సత్తకును, సర్వసత్తకును వెనుకనుండు ఈ మౌళికసత్యముల స్వానుభవమును బొందును-" ఆత్మనా ఆత్మానం " (10-15). ఈ సత్యములు స్పష్టముగనే దివ్యసత్యములు గనుక, ఒకసారి భావించినపుడు, మానవుడు వీనిని శీఘ్రముగా సాధించగలడు. ఈ సమున్నత రూపములందు భగవంతుని దర్శించుట కడ్డువచ్చున దేదియు మన మానసిక సంస్కారమునందు లేదు. కాని సృష్టియొక్క బాహ్యసత్యములందును, ప్రపంచసంభూతియొక్క మాయావేషములందును భగవంతుని దర్శించుటయందే కష్టము గలదు; ఏలన ఏకతాసాధక భావన కిచ్చటి దంతయు అడ్డుతగులును. ఉదాహరణకు, చరాచరములు, ఉదాత్తనీచములు, సౌమ్యరౌద్రములు, శుభాశుభములు - ఒకే సమయమున భగవంతు నిట్టి

ద్వంద్వములందును, ద్వంద్వములుగను ఎట్లు చూడగలము ? విశ్వమునందు భగవంతుడు విస్తరించియున్నా డను భావము నంగీకరించి, జ్ఞానతేజమునందును, శక్తిమహత్త్వమునందును, సౌందర్యలావణ్యమునందును, ప్రేమవితరణమునందును. ఆత్మవిశాలతయందును మన మతనిని చూచినప్పటికీ, ఈ సమున్నతవస్తువుల నంటిపెట్టుకొని, వాని నావరించి, మఱుగుపఱచు వాని వ్యతిరేకవస్తువులందును మన మెట్లు భగవంతుని చూడగలము ? మానవమనస్సునకును, ప్రకృతికిని సహజముగు పరిమితు లున్నప్పటికీ, భక్తునియందు భగవంతుని జూడగలమేమో కాని, అతనిని ద్వేషించు దుష్టునియం దెట్లు చూడవచ్చును ? పరతత్త్వముయొక్క పరమపవిత్రతను, ఏకతను అన్వేషించు జ్ఞాని ఈ ద్వంద్వవిభేదములను గాంచి, "ఇది కాదు, ఇది కాదు" – "నేతినేతి" – అని వానిని కఠోరముగా త్రోసిపుచ్చును. పోగా మన మాట : సుముఖముగనో, విముఖముగనో ప్రపంచమునందలి అనేకవస్తువులపట్ల మనము మన అనుమతిని దెలిపినను, విశ్వమున భగవంతు నంగీకరించినను, అధిక సంఖ్యాక వస్తువులను "ఇది కాదు, ఇది కాదు" అని మనము కొట్టివేయుచునే యుండవలదా ? ఇంద్రియవిషయమునందును, బాహ్యరూపమునందును పాదుకొని యున్న మానవమనస్తత్త్వమునకు అన్ని వస్తువుల విషయమున తన బుద్ధి-అనుమతిని, ఇచ్ఛాసమ్మతిని, హృదయవిశ్వాసమును దెలుపుట కష్టమే యగును. అందునిమిత్తము కనీసము కొన్ని ప్రబలసంకేతములు గావలయును, కొన్ని అనుసంధానములు మఱియు సేతువులు, కొన్ని ఆలంబనలు గావలయును.

7. <u>విభూతి యనగ</u> : వాసుదేవుడే సర్వము – అను జ్ఞానావిష్కరణమును అర్జును డంగీకరించును మఱియు దాని హర్షముచే అతని హృదయము నిండియున్నది. కారణము, ద్వంద్వమయ ప్రపంచముయొక్క భ్రాంతిజనకసమస్యల నడుమ అతని మనస్సు ఒక జాడకొఱకు, ఒక మార్గదర్శక సత్యమునిమిత్తము ఆరాటపడుచుండెను; అట్టి మనస్సుయొక్క వ్యాకులము మఱియు విభేదములనుండి వాసుదేవజ్ఞానము తన నుద్ధరించుచున్నట్లు అతనికి దెలియవచ్చెను, మఱియు నది అతని శ్రవణమునకు అమృతముగా (10–18) నున్నది. అయినను అర్జునునకు పూర్వోక్త సంకేతములు మఱియు ఆలంబనల ఆవశ్యకత గన్పించుచున్నది. సంపూర్ణ దృఢ సాక్షాత్కారములో నుండు కఠినత నధిగమించుట కవి ఆవశ్యకమని అతని కనుభవమగుచున్నది; లేనిచో ఈ జ్ఞాన మెట్లు హృదయమునకు, ప్రాణమునకు వాస్తవ

మగును ? అతడు మార్గదర్శక సంకేతముల నపేక్షించును, తన సంభూతియొక్క దివ్యశక్తులను అశేషముగా సైతము చెప్పవలసిన దని భగవంతు నర్థించును, తనను (అజ్ఞునిని) భ్రమపెట్టు నెద్దానిని పరిష్కరింపక విడువరా దని యాచించును. “ సంభూతియొక్క నీ సర్వోచ్చశక్తియందు, ” అర్జును డడుగును, “ దివ్యమగు నీ ఆత్మాభివ్యక్తులను - ఆత్మవిభూతులను - అశేషముగా వర్ణింపుము - ఏ విభూతుల చేత నీవు లోకములను, లోకులను వ్యాపించుచున్నావో, వానిని వర్ణింపుము (10-16). సర్వత్ర, ప్రతిక్షణము, ఓ యోగీశ్వరా, నిన్ను జింతించుచు నేను ని న్నెట్లు తెలియగలను, మఱియు నేయే ప్రముఖ సంభూతులందు నిన్ను చింతించదగును ? ” (10-17). అత డింకను ని ట్లర్థించును - ఏ యోగముచేత నీవు సర్వముతో ఏకముగను, సర్వమునందు ఏకముగను ఉన్నావో, ఏ యోగముచేత అన్నియు నీ సత్త యొక్క సంభూతులుగను, నీ ప్రకృతియొక్క వ్యాపక లేక ప్రముఖ లేక ప్రచ్ఛన్న శక్తులుగ నున్నవో, దానిని విస్తారముగా, మఱింత అధికముగా చెప్పుము ; అది నా కమృతతుల్యము, ఎంత విన్నను తనివితీరదు (10-18). గీత దేనిని స్వయముగా స్పష్టరూపమున ప్రకటించదో, ఈ అమృత-వచనము గీతయందలి దాని సంకేత మాత్రము ; అయితే అది ఉపనిషత్తులందు తఱచుగా వచ్చును, దానిని తర్వాతి కాలమున వైష్ణవ, శాక్తమతములు తమ ప్రగాఢతర భగవద్దర్శనమునందు పెంపొం దించినవి. ఇంతకు నది ఏమిటి ? అది ప్రపంచమునందలి భగవంతునియందు మానవునికి లభించగల హర్షము, సార్వత్రికానందము, దివ్యమాతృ ఖేలనము, భగవల్లీలయొక్క మాధుర్యసౌందర్యములు.

8. రూపము విభూతిసంకేతము : దివ్యగురువు శిష్యుని ప్రార్థన నంగీకరించును, కాని సంపూర్ణసమాధానము సంభవము కాదని ముందుగనే జ్ఞాపకముచేయును. ఏలన భగవంతు డనంతుడు, అతని అభివ్యక్తి అనంతము. అటులే అతని అభివ్యక్తిరూపములును అసంఖ్యాకములు. ప్రతిరూపము తనలో గుప్తముగా నున్న ఒక దివ్యశక్తికి - విభూతికి - సంకేతము; కావున ప్రతిపరిమితవస్తువు అనంతముయొక్క ఒక ఆవిష్కరణమును తనలో వహించుచున్నది. అటులే, భగవంతుడు పలుకును, నీకు నా విభూతులను చెప్పెదను ; కాని ప్రధానవిభూతులను మాత్రమే ఒక సూచనగా, దృష్టాంతరూపమున చెప్పెదను, ఆ దృష్టాంతములందు భగవంతుని శక్తిని ఎక్కువ తేలికగా చూడగలవు -

"ప్రాధాన్యతః" (10–19), "ఉద్దేశతః" (10–40). భగవంతుని ఆత్మవిస్తారము యొక్క వివరములకు అంతము లేదను మాట ప్రకరణారంభమునందే కాక, అంతమునందును (10–40) చెప్పి, దానిని అధికముగను, అసందిగ్ధము గను గురువు వక్కాణించును. పిమ్మట తక్కిన అధ్యాయమునం దంతటను విశ్వముయొక్క వస్తువులందును, వ్యక్తులందును గల భగవచ్ఛక్తియొక్క ప్రధానసూచనలు మఱియు ఉత్కృష్టసంకేతముల సంక్షిప్తవర్ణన మనకు లభించును. ఈ వర్ణనయం దేక్రమము పాటించబడ లేదని ముందు మన కనిపించినను, వెదకినచో దీనిలోపల నొక సూత్రము ప్రాప్తించును, దీనిని బట్టి మనము విభూతిభావముయొక్క అంతరాశయ మును, పరిణామములను జేసుకొనగలము. ఈ అధ్యాయనామము విభూతియోగము— ఇది మిక్కిలి ఆవశ్యకయోగము. ఏలన ఈ యోగముద్వారా శుభాశుభములు, పూర్ణతాపూర్ణతలు, ప్రకాశాంధకారములతో గూడిన తన సమస్తవిస్తారమునందు భగవంతుని విశ్వసంభూతితో మనము నిష్పక్షపాతముగా తాదాత్మ్యము నందవలెను; నిజమే, కాని అదే సమయమున ఆ సంభూతియందు ఒక ఆరోహణశీల పరిణామశక్తి, వస్తువులయందు దాని ప్రాకట్యముయొక్క ఒక వర్ధమాన ప్రగాఢత, సోపానగతము రహస్యము నగు ఒకనొక వస్తువును గలదని గుర్తించవలెను; గుర్తించి నపు డీ వస్తువు అడుగున గల ఆవరణాత్మక ఆభాసరూపములనుండి ఉత్తరోత్తరము ఉచ్చతరమగు రూపవిశేషములద్వారా విశ్వమయభగవంతుని విశాల ఆదర్శప్రకృతి దిశగా మనలను గొనిపోవును.

9. <u>ఆత్మ ప్రథమవిభూతి :</u> విభూతులయొక్క ఈ సంక్షిప్తపరిగణనము అభివ్యక్తియొక్క సమస్తశక్తికి మూలమగు మూలతత్త్వముయొక్క కథనముతో ప్రారంభమగును. ఈ మూలతత్త్వము ప్రతి జీవునియందును, వస్తువునందును గుప్త ముగానైనను, కనుగొనగలిగిన విధముగా నివసించు భగవంతుడు; ప్రతివస్తువు మఱియు ప్రాణియొక్క మనస్సు మఱియు హృదయములోపల, ఒక గుహలోవలె, నతడు వాసముచేయును; అతడు ప్రాణి బహిరంతర సంభూతియొక్క, గర్భాలయ మున నుండు అంతరతమాత్మ; వర్తమానము, గతము లేక భావి సర్వభూతములకు ఆదియు, మధ్యము, నంతము నగు వా డతడు (10–20). ఏలన ప్రకృతిగతమగు అంతరాత్మను తనకు ప్రతినిధిగా ప్రకృతిలోనికి బంపి, దాని దృష్టికి మఱుగునం దుండు ఈ తేజోమయ అంతర్నివాసియే కాలమునందు మన వ్యక్తిత్వముయొక్కయు,

దేశమునందు మన దృశ్యభావముయొక్కయు పరిణామమును అనుక్షణము సాధించు చున్నాడు - కాలము మఱియు దేశము మనలోని ఈ భగవంతునియొక్క సంకల్పాత్మక గతియు, విస్తారము నగును. అంతయు స్వదర్శియగు నీ ఆత్మయే, అంతయు స్వప్రతినిధియగు నీ పురుషుడే. సర్వదా చరాచరభూతముల లోపలినుండి ఈ సర్వచేతనుడే (All - conscient) తన అభివ్యక్త ఆత్మను గుణశక్తులయందు వికసింపజేయును; అటులే దానిని విషయరూపములందును, అంతఃకరణములందును వికసింపజేయును, జ్ఞాన వాక్ చింతనలయందును వికసింపజేయును, వృక్షజీవనము, పశుజీవనము మఱియు మానవ, అతిమానవజీవరూపమునను వికసింపజేయును.

10. <u>విశిష్టవిభూతుల సార్థక్యము</u> : గుణము మఱియు రాశియొక్క విశేషముల చేత గాని, మూల్యముల విభేదము మఱియు ప్రకృతివిరోధములచేత గాని అంధీభూతము గాని అంతర్నేత్రముతో మనము వస్తువులను వీక్షింతుమేని, సర్వవస్తువులు నిజానికి ఈ అభివ్యక్తియొక్క శక్తులే, ఈ విశ్వాత్మయొక్క విభూతులే యనియు, మఱేమియు కాజాలవనియు మనము చూచెదము; ఈ మహాయోగియొక్క యోగమే, ఈ అద్భుత ఆత్మస్రష్టయొక్క ఆత్మసృష్టులే యని చూచెదము. విశ్వమునందు తన స్వీయ అసంఖ్యసంభూతులయొక్క అజుడు, సర్వవ్యాపియు నగు ఈశ్వరు డతడు - "అజో విభుః" (10-12); అన్ని వస్తువులు తన ఆత్మప్రకృతియందు అతని శక్తులు మఱియు నిష్పన్నరూపములు, అనగా విభూతులు. అతడు వాని సర్వస్వమునకు మూలము, వాని ఆది (10-20); అతడు తమ నిత్యపరివర్తనశీల అవస్థయందు వాని ఆధారము, వాని మధ్యము; అతడు వాని అంతము గూడను, అనగా ప్రతి సృష్టవస్తువునకు తన సమాప్తి లేక విలయావస్థయందు దాని పర్యవసానము లేక విఘటనము (విశ్లేషణము) నగును. అతడు తన చేతనయందుండియే వానిని బహిర్గతము గావించి, వానిలో దాగియుండును, అతడు తన చేతనలోనికే వానిని ఉపసంహరించగా, అవి అతనిలో కొంత కాలము లేక సర్వకాలము దాగియుండును. మనకు పైకి గన్పించునది ఏకుని ఒక సంభూతిశక్తి మాత్రమే : మన గోచరము మఱియు దృష్టి నుండి అదృశ్యమగునది ఆ ఏకుని అదే సంభూతిశక్తియొక్క కార్యరూపము. సర్వశ్రేణులు (classes), జాతులు (genera), ఉపజాతులు (species), వ్యక్తులు అట్టి విభూతులే. అయినను అతడు మనకు తన సంభూతియందలి శక్తిద్వారానే కన్పించును గాన, దేనికి ఉత్కృష్టమూల్య ముండునో, లేక ఏది ఉత్కృష్టశక్తితో వ్యవహ

రించునో, దానియందు అతడు విశేషముగా మనకు గన్పించును (10-41). కావున ప్రతిజాతియందును ఎవరెవరియందు ఆ జాతికి చెందిన ప్రకృతిశక్తి అత్యున్నతము, అతిప్రముఖము, మిక్కిలి ప్రభావోపేతముగా ఆత్మప్రకాశకము నగు తన అభివ్యక్తి నందుకొనునో, వారియం దా భగవంతుని మిక్కిలి ఎక్కువగా మనము చూడగలము. ఒక విశిష్టార్థమున విభూతు లన నివియే. అయినను అత్యున్నత విభూతి సైతము అనంతునియొక్క ఒక మిక్కిలి ఆంశికప్రకాశనము మాత్రమే; సంపూర్ణవిశ్వము సైతము అతని మహత్త్వముయొక్క ఒక అంశముచేత మాత్రమే అనుప్రాణితమై యున్నది, అతని జ్యోతియొక్క ఒక కిరణముచేతనే ప్రదీప్తమైయున్నది, అతని ఆనందము మఱియు సౌందర్యముయొక్క ఒక క్షుద్రశీకరముచేతనే వైభవవిలసితమై యున్నది (10-42). సంక్షేపముగా నిదియే ఈ విభూతిపరిగణనయొక్క సారము, దీనినుండి వెలువడు ఫలితము, దీని అర్థముయొక్క హృదయకేంద్రము.

11. <u>అక్షయకాలము, అనంతదేశము</u> : భగవంతుడు అక్షయ, అనాది, అనంతకాలము; ఇది సంభూతియొక్క అత్యంత ప్రత్యక్షశక్తి మఱియు సమస్త విశ్వగతియొక్క సారతత్త్వము – "అహం ఏవ అక్షయః కాలః" (10-33). ఆ కాలగతియందు భగవంతుడు సర్వవస్తువులను తమతమ స్థానములందు నియమించి, నిలబెట్టు దివ్యశక్తిగా మన భావన లేక అనుభవమునకు గోచరించును, దీని కతని కర్మలే నిదర్శనము. పోగా తన ద్విగ్రూపమునందు ఆ భగవంతుడే ప్రతిదిశయందు కోటి శరీరములతో, కోటి మనస్సులతో ప్రతిభూతమునందు వ్యక్తమగుచు గన్పించును; అతని ముఖములను మన మన్ని వైపుల గాంతుము – "ధాతా అహం విశ్వతోముఖం" (10-33). ఏలన ఏకకాలమున ఈ అసంఖ్యాభూతము లన్నింటి యందును అతని ఆత్మ, బుద్ధి మఱియు శక్తియొక్క రహస్యవిధానము పనిచేయుచుండును; అటులే సృష్టివిషయకమగు అతని దివ్యప్రతిభయు, నిర్మాణవిషయకమగు అతని అద్భుత కౌశలము, సంబంధములు మఱియు ఫలితములయొక్క అతని అనింద్యవ్యవస్థీకరణము పనిచేయుచుండును. మన కతడు విశ్వమునందు విశ్వవ్యాప్త మృత్యుపురుషుడుగను గోచరించును; తన సృష్టిని చివరకు నాశముజేయుచే ఈ పురుషుని పనిగా గన్పించును–"సర్వహరమగు మృత్యువును నేను" (10-34). అయినను భగవంతుని సంభూతిశక్తి తన పనియం దాగిపోదు; ఏలన పునఃసృష్టి శక్తి వినాశశక్తివెంట పనిచేయుచునే యుండును – "మఱియు నిక ఉత్పన్నము

కాగల సర్వమునకు నేను పుట్టుకను గూడను" (10-34). వస్తువులయందలి దివ్యాత్మ వర్తమానముయొక్క ధారణశక్తి, గతముయొక్క ఉపసంహరణశక్తి, భావియొక్క సృజనశక్తియునై యున్నది.

12. <u>ప్రతిజాతియందు సర్వోత్తమము</u> : పిమ్మట సర్వజీవసత్త్వములందు, అనగా విశ్వవ్యాపిదేవతలు, అతిమానవ, మానవ, అవమానవ ప్రాణులందు మఱియు నీ సర్వగుణములు, శక్తులు, విషయములందును తన శ్రేణియందు ఏది ప్రముఖము, ప్రధానము, గుణమునందు సర్వోత్తమమో, అది భగవంతుని సంభూతియొక్క ఒక విశిష్టశక్తి యగును. వీనిని భగవంతు డిట్లు పరిగణించును-నేను ఆదిత్యులయందు విష్ణువును (10-21), రుద్రులయందు శివుడను, దేవులయందు ఇంద్రుడను, దైత్యులయందు ప్రహ్లాదుడను, పురోహితులందు ముఖ్యుడగు బృహస్పతిని, సేనానాయకులందు యుద్ధదేవతయగు స్కందుడను, మరుత్తులలో మరీచిని, యక్ష రాక్షసులలో ధనాధిపతియగు కుబేరుడను, వసువులలో అగ్నిని, పుట్టించువారిలో మన్మథుడను, దేవర్షులలో నారదుడను, ధర్మపాలకులలో ధర్మాధిపతియగు యమధర్మ రాజును, వాయుషులలో వాయుదేవతను. పిమ్మట సృష్టి రెండవ కొనకువెళ్లి, భగవంతు డింకను చెప్పును - ప్రకాశములందు, జ్యోతులందును నేను భాసుర సూర్యుడను, నిశానక్షత్రములలో చంద్రుడను, ప్రవాహోదకములలో సాగరమను, శిఖరములలో మేరువను, పర్వతశ్రేణులలో హిమాలయమను, నదులలో గంగను, ఆయుధములల్లో ఇంద్రుని వజ్రమను. పోగా చిన్న, పెద్ద చెట్లలో నేను రావిచెట్టును, ఏనుగులందు ఐరావతమను, పక్షులయందు గరుడను, పశుగణమునందు కోరికలను బిండు కామధేనువను, మృగములలో సింహమను. ఇంకను నేను ప్రథమమాసమగు మార్గశిరమను; ఋతువులలో మిగుల రమ్యమగు వసంతమను.

13. <u>విద్యావిషయక విభూతులు</u> : ప్రాణులలో, భగవంతు డర్జునునికి ఇంకను వచించును, నేను చేతనను, దీనిచేతనే అవి తమను, పరిసరములను ఎఱుంగును (10-22). నే నింద్రియములందు మనస్సును, ఈ మనస్సుచేతనే ప్రాణులు విషయవేదనలను గ్రహించి, విషయములపై ప్రతిక్రియ సల్పును. నేను మనస్సు, శీలము, శరీరము, క్రియలకు సంబంధించిన వాని గుణములను. నేను కీర్తిని, వాక్కును, స్మృతిని, మేధను, ధృతిని, క్షమను (10-34). నేను తేజో

వంతుల తేజమను, బలవంతుల బలమను (10-36). నేను నిశ్చయము, దీర్ఘ ప్రయత్నము మఱియు విజయమను, నేను మంచివారి మంచిని, నేను వంచనాశిల్పములో జూదమను (10-36); శాసించువారి శాసకశక్తిని నేను, జయించువారి జైత్రనీతిని నేను; నేను గుహ్యావస్తువుల మౌనమను, జ్ఞానవంతుల జ్ఞానమను (10-38), వాదనిపుణుల తర్కమను (10-32). శబ్దములలో పవిత్రాక్షరమగు ఓం-కారమను, ఛందస్సులలో గాయత్రిని, వేదములలో సామవేదమను. ఎవరు గణింతురో (లెక్కింతురో) మఱియు కొలుతురో, వారికి గణనగురువగు కాలమను నేను (10-30). బహువిధ తత్త్వవిద్యలు, కళలు మఱియు శాస్త్రములందు నేనధ్యాత్మవిద్యను (10-32). మానవజీవుల సర్వసామర్థ్యములు మఱియు విశ్వము మఱియు దాని సర్వశక్తులను నేను.

14. "ఒక్క అంశముచేత ధరింతును": ఎవరియందు నా శక్తులు మానవు లందుకొనగల అతున్నతశిఖరముల నందుకొనునో, వారు సదా స్వయముగా నేను, నా విశిష్టవిభూతులు. మానవులలో నేను రాజను, నాయకుడను, బలవంతుడను, వీరుడను. యోధులలో నేను రాముడను, వృష్ణులలో కృష్ణుడను, పాండవులలో అర్జునుడను. ప్రకాశపూర్ణ ఋషి నా విభూతి; నేను మహర్షులలో భృగువను. భావప్రకాశముచేత సత్యమును జూచి, శబ్దధ్వనిచేత దానిని వెల్లడించు మహర్షి, అంతఃప్రేరిత కవి మర్త్యదేహమున ప్రకాశమయమగు నేనే; నేను ఋషి - కవులలో శుక్రాచార్యుడను. మహర్షి, మనీషి, దార్శనికుడు నగువాడు మానవులయందు నా శక్తియే, నా స్వీయ విశాలప్రజ్ఞయే; ఋషులలో నేను వ్యాసుడను. కాని, అభివ్యక్తియందు ఎంత తారతమ్య మున్నను, తమతమ రీతిలో, తమతమ ప్రకృతియందు అన్నియు భగవంతుని శక్తులే; చరాచరములం దేదియు నేను లేకుండ లేదు (10-39). నేను సర్వభూతముల బీజమను, మఱియు నవి ఆ బీజముయొక్క శాఖలు, పుష్పములు; ఆత్మరూప బీజమున నేది గలదో, దాని వికాసమును మాత్రమే అవి ప్రకృతియందు సాధింపగలవు. నా దివ్యవిభూతులను గణించ వలనుపడదు; వానికి మితిలేదు. నేను చెప్పిన దంతయు నొక సంక్షిప్త కథనము మాత్రమే, అధిక మేమియు గాదు, మఱియు కొన్ని ప్రముఖసంకేతముల వెలుగును మాత్రమే ప్రసాదించితిని, అనంతసత్యతలకు ఒక గట్టి ద్వారమును మాత్రమే తెఱచితిని (10-40). ప్రపంచమున సుందరము, వైభవోపేతము నగు

ఏయే ప్రాణిని నీవు చూతువో, మానవులందును, మానవునిపైనను, దిగువను ఏయే సత్త్వము ప్రబలము, శక్తిశాలియునై మించునో, అది నా సౌంధర్యమే, వైభవమే, శక్తియే యని ఎఱుంగుము, మఱియు నది నా సత్తయొక్క ఒక తేజోంశమునుండియు, ప్రఖరశక్తినుండియు పుట్టిన దని గ్రహించుము (10-41). కాని యింత ఎందుకు ? ఒక్క మాటలో, నే నిచ్చట ఈ ప్రపంచమందును, సర్వత్రను ఉన్నాను; నేను సర్వమునందును ఉన్నాను, సర్వమునై యున్నాను : నాకంటె నితర మేమియు లేదు, నన్ను వినా ఏమియు లేదు. నా అమేయశక్తియొక్క ఒక లవము చేతను, నా అగాధసత్తయొక్క ఒక అణుమాత్ర అంశముచేతను నే నీ సమస్తవిశ్వ మును ధరించియున్నాను. ఈ ప్రపంచము లన్నియు 'నే-నున్నాను, I-AM' అను సనాతనతత్త్వముయొక్క రవ్వలు, గుర్తులు, మెఱపులు మాత్రమే.

# 9. విభూతి సిద్ధాంతము

1. <u>విభూతియోగ మొక సోపానము</u> : విభూతియోగ మను ఈ అధ్యాయము యొక్క మహత్త్వము ప్రథమదృష్టికి తగులుదానికంటె చాల అధికము ; అటులే ప్రపంచమునుండి తప్పించుకొని, ప్రపంచాతీతమగు నిర్గుణతత్త్వములో లీనముకాగోరి, తత్పరమగు శ్లోకములనే పూర్వప్రవణతతో అన్వేషించు కంటికిని దీని మహత్త్వము గన్పించదు. గీతాసందేశము మానవునియందలి భగవంతుని బోధించు సందేశము : ఈ లోని భగవంతుడు పెరుగుచున్న సంయోగబలముచే నిమ్నప్రకృతియొక్క ఆవరణమునుండి వెలికి వచ్చి, మానవాత్మకు తన విశ్వభావమును ప్రకటించును, తన నిరపేక్ష విశ్వాతీతభావమును ప్రకటించును; మానవునిలోను, సర్వభూతముల లోను నున్న తన్ను ప్రకటించుకొనును. ఈ సంయోగరూపమగు దివ్యయోగము నందు మానవుడు భగవద్దిశగా పెరుగును, భగవంతుడు మానవాత్మయందును, అతని అంతర్దృష్టికిని అభివ్యక్తమగును; పరిచ్ఛిన్నాహంకారమునుండి మన విముక్తియు, ఒక దివ్యమానవతయొక్క ఉచ్చతరప్రకృతిలోనికి పున నముద్ధరణము ఈ సంయోగము

యొక్క సంభవనీయఫలితము. ఏలన, త్రిగుణముల జటిలజాలమునందు గాక, మానవు డీ అధికతర ఆధ్యాత్మికప్రకృతియందు నివసించుచు, భక్తిజ్ఞానకర్మలచేతను, సర్వాత్మసమర్పణముచేతను భగవంతునితో ఏకతను సాధించి, నిష్కామముగా నిరపేక్ష విశ్వాతీతభావములోని కెగయగలుగును, అయినను ప్రపంచముపై పనిచేయగలుగును—ఇపు డతడు అజ్ఞానమునందు గాక, పరమునితో వ్యష్టికి గల యథార్థసంబంధము నందు, అహంకారమునిమిత్తము గాక, ప్రపంచమునందలి భగవంతునికొఱకు కర్మనిరతు డగును. ఈ కర్మకు అర్జునుని పిలుచుట మఱియు అతని స్వరూపముగా నున్న సత్తాశక్తులయు, వానిద్వారా పనిచేయు దివ్య సత్తాశక్తులయు నెఱుక నతనికి గల్గించుట — ఇదియే దేహధారి భగవంతునియొక్క ఆశయము. ఇందునిమిత్తమే దివ్యకృష్ణు డతని సారథి యయ్యెను. ఇందునిమిత్తమే మానవుల హీనతర కర్మ హేతువుల పట్ల మహానిరుత్సాహము మఱియు గభీర అసంతృప్తి అర్జునుని పైకొనెను; వాని స్థానమున విశాలతర ఆధ్యాత్మిక హేతువును ప్రవేశపెట్టుటకే, తనకు నియుక్తమైన కర్మయొక్క పరమముహూర్తమున అర్జునునకు సత్య మావిష్కరించబడెను. విశ్వపురుషదర్శనము మఱియు ప్రపంచకర్మకు దివ్యాదేశము—ఏతద్రూపమగు పతాకస్థాయికి అర్జునుడు నడుపబడుచుండెను. ఆ స్థాయి దగ్గర పడినది; కాని విభూతియోగముద్వారా తన కివ్వబడిన జ్ఞానము వినా, ఈ స్థాయి తనతో తన పూర్ణార్థమును గొనిరాకపోవును.

2. <u>ప్రపంచముపట్ల ముక్తపురుషుని దృష్టి</u> : సృష్టిరహస్య మొక అంశమున గీతచే ప్రకటింపబడెను. అంశమునందు మాత్రమే ఏలన, అనంతమగు దాని లోతుల నెవడు పూర్తిగా కనుగొనును ? లేక ఏ శాస్త్రము విశ్వమహిమయొక్క ఆంతర్యము నంతను స్వల్పస్థలమున లేక సంక్షిప్త నిరూపణమున వివరించితి నని చెప్పగలుగును ? కాని ఎంతవఱకు గీతాధ్యేయము నిమిత్త మావశ్యకమో, అంతవఱ కది మనముం దుంచబడినది. భగవంతునుండి జగదుత్పత్తి ప్రకారము (9–8), దానిలోపల భగవంతుడును, భగవంతునిలోపల నదియు నుండుట (6–30), మూలమునందు సమస్తవిశ్వముయొక్క ఏకత్వము (10–39), ప్రకృతియందు తమోవృతమైయుండు జీవాత్మకు భగవంతునితో గల సంబంధము (15–7), ఆత్మజ్ఞానమున కది కనువిప్పుట (10–8), అధికతరచేతనలోనికి దాని పునర్జన్మ (10–10), స్వీయ ఆధ్యాత్మిక ఉన్నతులలోనికి దాని ఆరోహణము (2–72)—దీని నంతను గీత మనముం దుంచినది.

కాని వెనుకటి అజ్ఞానస్థానమున ఈ నూతన ఆత్మదర్శనము, చేతనయు ప్రాప్తించి నప్పుడు, తన చుట్టును గల ప్రపంచము పట్ల విముక్తమానవుని దృష్టి ఎట్లుండును, దేని కేంద్ర రహస్య మిపుడు తన కవగతమయ్యెనో, ఆ విశ్వాభివ్యక్తిపట్ల అతని వైఖరి ఎట్లుండును? ముం దతడు విశ్వైక్యముయొక్క జ్ఞానమును, జ్ఞాననేత్రమును గలిగియుండును. తన చుట్టును గల సర్వము నతడు ఒకే దివ్యపురుషునియొక్క ఆత్మలు, రూపములు మఱియు శక్తులనుగా గాంచును (7-19). ఇకముందు అతని చేతనయొక్క బాహ్యాభ్యంతరవ్యాపారమున కంతటికి ఆ దర్శనమే ఆరంభమగును; అదియే అతని మూలదృష్టియు, తన కర్మల ఆధ్యాత్మికాధారము నగును. అతడు ప్రతిప్రాణియు ఏకునియందే చరించుచు, చేష్టించుచున్న దని చూచును. మఱియు నత డా ఏకుని అన్నింటియందు అంతర్నివాసిగను, వాని ఆత్మగను, వానియందలి రహస్యపురుషునిగను గూడ గాంచును; ప్రాణుల చేతనప్రకృతియం దతని రహస్య సన్నిధి లేనిచో, అవి జీవించనే లేవు; అతని సంకల్పము, శక్తి, ఆదేశము లేక అనుమతి లేనిచో, అవి రవంత కూడ కదలలేవు. అంతే కాదు, స్వయముగా వాని ఆత్మ, మనస్సు, ప్రాణము, శరీరము సైతము ఈ ఏకాత్మ మఱియు పురుషుని యొక్క శక్తి, సంకల్పము మఱియు ప్రభావము యొక్క పరిణామమే యని అతడు చూచును. అంతయు నతనికి ఒక వైశ్వసత్తయొక్క సంభూతిగ గన్పించును. ప్రాణుల చేతన సర్వథా దాని చేతననుండియే ఉత్పన్నమైన దనియు, వాని శక్తి సంకల్పములు దాని శక్తిసంకల్పములనుండియే గ్రహించబడి, వానిపైననే ఆధారపడు ననియు, ఆంశికమగు వాని ప్రకృతివ్యాపారము దాని అధికతర, దివ్యప్రకృతియొక్క ఫలితమే యనియు గాంచును - ఆ వ్యాపారము అప్పటి పరిస్థితిలో భగవంతుని అభివ్యక్తిగా లేక ఆవరణముగా, ఆకారముగా లేక వికారముగా మనస్సునకు గోచరించినను, ఆ చూపు మాఱదు. ఆ చూపు తా నారోహించిన అధికతరచేతనకు మూలాధారము, అది తన నలువైపుల వికసించిన పరమావశ్యక ప్రకాశము, అది పరిపూర్ణ దర్శనప్రకారము, అది తక్కిన వానిని సంభవముచేయు ఏకమాత్ర పరమసత్యము.

3. <u>సాంతముయొక్క ఆధ్యాత్మికమర్మము</u> : కాని ప్రపంచము భగవంతుని యొక్క ఒక ఆంశికాభివ్యక్తియే గాని, తానే స్వయముగా ఆ భగవంతుడు గాదు. ఎట్టి ప్రాకృత అభివ్యక్తినైనను భగవంతు డనంతముగా మించియుండును. "నాస్తి

అంతో వి స్తరస్య మే" (10-19)-ఇట్లు ప్రపంచరూపముచేత భగవంతుని విస్తారమునకు అంతము లేదు, ఈ ప్రపంచము మన దృష్టి కందనంత విశాలము, సంకీర్ణము, బహువిధము; అయినను భగవంతుడు తన అనంతతచేతనే, అనంతతకు గల అఖండ స్వాతంత్ర్యముచేతనే ఇట్టి ప్రపంచమునకు పైతము ఆవల గూడ నుండును. కావున ముక్తపురుషుడు విశ్వమున కావల నిట్టి శుద్ధభగవంతుని జూచును. విశ్వము నతడు ఆకారాతీతుడగు భగవంతునుండి గ్రహించబడిన ఒక ఆకారముగా జూచును, నిరపేక్ష సత్తయందు సంతతమగు ఒక స్వల్పాంశముగా జూచును. ప్రతిసాపేక్షమును (సాపేక్షవస్తువును), ప్రతిసాంతమును దివ్యనిరపేక్షము మఱియు అనంతముయొక్క ఒక ఆకారముగా నతడు గాంచును. మఱియు సాంతము లన్నింటి కావలను, ప్రతి సాంతముద్వారాను అత డా అనంతమునే చేరుకొనును ; ఇంకను ప్రతిదృశ్యమునకు, ప్రాకృతప్రాణికి మఱియు సాపేక్షక్రియకు, అటులే ప్రతిగుణమునకు, ఘటనకు ఆవల దానినే చూచును; ప్రతివస్తువుపైనను, దాని కావలను తన దృష్టిని సారించుచు, ఆవలనున్న భగవంతునియందు దాని ఆధ్యాత్మిక మర్మమును గనుగొనును.

4. బౌద్ధిక భావనము – ఆధ్యాత్మికదర్శనము : ఈ విషయము లతని మనస్సునకు బౌద్ధిక భావనలుగా నుండవు, లేక ప్రపంచము పట్ల అతని వైఖరి ఒక చింతనావిధానముగనో, ఒక వ్యావహారికసిద్ధాంతముగనో యుండదు. ఏలన అతని జ్ఞానము భావనాత్మకమే యగుచో, అది ఒక తత్త్వశాస్త్రము, బౌద్ధికరచన యగునే గాని, ఒక ఆధ్యాత్మికజ్ఞానము మఱియు దర్శనము, చేతనయొక్క ఒక ఆధ్యాత్మికావస్థ గాజాలదు. భగవంతుడు మఱియు ప్రపంచముయొక్క ఆధ్యాత్మిక దర్శనము కేవలముగా గాని, ప్రధానముగా గాని, చివరకు ప్రారంభమునందు గాని ఆలోచనాత్మకము గాదు. అది ప్రత్యక్షానుభవము – మనస్సునకు బాహ్యవస్తువులు మఱియు వ్యక్తుల దర్శనము మఱియు అనుభవము వలెనే, అది వాస్తవము, స్పష్టము, సన్నిహితము, సంతతము, కార్యసమర్థము మఱియు ఘనిష్ఠము. భౌతికమనస్సు మాత్రమే భగవంతు డొక కేవలభావన యని తలంచును; కారణము అది శబ్దములు, నామములు, సంకేతములు, కల్పనలచేతనే భగవంతుని తన దృష్టికి చిత్రించుకొనగలదు. ఆత్మ ఆత్మను చూచును; భౌతికచేతన జడద్రవ్యమును చూచినంత ప్రత్యక్షముగాను, ఇంకను ఎక్కువ ప్రత్యక్షముగాను, అంత ఘనిష్ఠముగాను, ఇంకను ఎక్కువ ఘనిష్ఠముగాను, దివ్యీకృతచేతన భగవంతుని చూచును. అది భగవంతుని చూచును,

భావించును (feels), చింతించును, ఇంద్రియములతో ననుభవించును. ఏలన ఆధ్యాత్మికచేతనకు సమస్త అభివ్యక్తసత్తయు నొక ఆత్మప్రపంచముగనే కన్పట్టును గాని, జడమయ, ప్రాణమయ, మనోమయ ప్రపంచముగా సైతము గాదు. ఈ యితరప్రపంచము లతని దృష్టికి భగవద్ - రూపము, భగవద్ - శక్తి, భగవద్ - చింతన మాత్రమే. వాసుదేవునియందు నివసించుట మఱియు జీవించుట యన గీతార్థ మిదియే - " మయి వర్తతే " (6-31). ఆధ్యాత్మికచేతన తాదాత్మ్యజ్ఞానముచే లభించు సన్నిహితజ్ఞానముచే భగవంతు నెఱుంగును, ఈ జ్ఞానము మానసికబోధము కంటెను, ఇంద్రియానుభవముకంటెను ఎంతో ఎక్కువ వాస్తవికము. ఏ స్వతఃసిద్ధ నిరపేక్షము (Absolute), ప్రపంచము కంతకు వెనుకను, ఆవలను గలదో, దానిని పుట్టించునో మఱియు నతిశయించునో, దాని ఒడుదొడుకులకు సర్వదా వెలుపల విరాజిల్లునో, అట్టి నిరపేక్షమును సైతము ఆధ్యాత్మికచేతన తాదాత్మ్యముచేతనే ఎఱుంగును. ఈ నిరపేక్ష భగవంతుని అక్షరాత్మను-తన అక్షరనిత్యతచేత ప్రపంచ పరివర్తనలను వ్యాపించి, ధరించు అక్షరాత్మను - గూడ అది తాదాత్మ్యముచేతనే, అనగా నీ అక్షరాత్మతో మనయందలి కాలాతీతసత్తయొక్క ఏకత్వానుభవముచేతనే ఎఱుంగును. ఇంకను అది దివ్యపురుషుని గూడ అదే ప్రకారముగా నెఱుంగును - తనను ఎవడు సర్వులయందును తెలిసికొనునో, తన చేతనలో సర్వులు నయి, వారి తలపులను రూపొందించునో, తన అంతర్వర్తి ఇచ్ఛచేత వారి కర్మలను నియమించునో, అట్టి దివ్యపురుషుని. అది అతీతభగవంతుని, ఆత్మరూపభగవంతుని, పురుష, అంతరాత్మ మఱియు ప్రకృతిరూప భగవంతుని ఘనిష్ఠముగా నెఱుంగును. ఈ బాహ్యప్రకృతిని సైతము అది తాదాత్మ్యము మఱియు ఆత్మానుభవము ద్వారా తెలియును; అయితే ఈ తాదాత్మ్యము వైవిధ్యమునకు, సంబంధములకు నిరాఘాటముగా ప్రవేశమిచ్చును; ఏలన ప్రకృతి బహువిధఆత్మసంభూతిని సాధించు భగవంతుని శక్తి - " ఆత్మ-విభూతి " (10-19).

5. <u>భగవంతుని ఆదర్శప్రకృతి</u> : కాని ఈ ఆధ్యాత్మికచేతన ప్రపంచము నందలి ప్రకృతిని, మానవుని సాధారణమనస్సు దాని నజ్ఞానమున జూచినట్లు, చూడదు. ఈ ప్రకృతియందలి అజ్ఞానమయమగున దంతయు - అపూర్ణము, బాధాకరము, నీతిబాహ్యము, జుగుప్సాకరము నగున దంతయు - భగవంతుని ప్రకృతికి కేవలవ్యతిరేకము గాదు; ఏలన దాని మూలము తన వెనుకనున్న ఒకానొక వస్తువులో

నున్నది, దేనియందది తన యథార్థసత్తను, పరమనిష్కృతిని బొందగలదో, ఆత్మ యొక్క ఆట్టి తారకశక్తిలో నున్నది. ఆద్యము, సర్వజనకము నగు నొక పరమ ప్రకృతి గలదు, దీనియందు దివ్యశక్తి మఱియు జీవనసంకల్పము తన స్వీయ పరిపూర్ణగుణమును, విశుద్ధప్రకాశనమును ఉపభోగించును. మనము విశ్వమునందు జూచు సమస్తశక్తుల మూల, శ్రేష్ఠ, పరిపూర్ణశక్తి అక్కడ మనకు బ్రాప్తించును. ఆ పరమప్రకృతియే భగవంతుని ఆదర్శప్రకృతిగా మనకు ప్రత్యక్షమగును – పరిపూర్ణజ్ఞానము, పరిపూర్ణ శక్తిసంకల్పములు, పరిపూర్ణప్రేమహర్షముల ప్రకృతి. మఱియు దాని గుణము మఱియు ఊర్జము (energy) యొక్క ప్రభేదము లన్నియు– "అనంతగుణ, అగణనశక్తి" – తన యీ ప్రజ్ఞా సంకల్పానందముల స్వతంత్ర, స్వసూత్రీకరణములు. అచ్చట సమస్తము అనంతతలయొక్క ఒక బహుముఖ, అప్రతిహత ఏకతగా నుండును. ఆదర్శ, దివ్యప్రకృతియందు ప్రతిగుణము, ప్రతి ఊర్జము శుద్ధము, పూర్ణము, స్వస్థము, తన క్రియయందు సమరసము నగును; అచ్చట నేదియు తన స్వీయ ప్రత్యేక, పరిమిత సార్థక్యమునకు శ్రమించదు, అన్నియు నొక అనిర్వచనీయ ఏకతయందు ప్రవర్తించును. అచ్చట సమస్త ధర్మములు, అనగా సమస్త అస్తిత్వనియమములు ఒకే విముక్త మఱియు నమనీయ (మెత్తని) ధర్మ మగును – ధర్మ మన దివ్యగుణము మఱియు ఊర్జము – "గుణ–కర్మ" (4–13) – యొక్క ఒక విశిష్టక్రియ. అచ్చట సత్తయొక్క ఏకమాత్ర [1] దివ్యశక్తి ఒక అపరిమేయ స్వేచ్ఛతో కర్మచేయును, ఏయొక ప్రత్యేకనియమానికి బద్ధము గాదు, ఏ బంధనవిధానమునకు పరిమితము గాదు, తన స్వీయ అనంతతా ఖేలనమునందు ఉల్లసించును, సదా నిర్దుష్టమగు తన ఆత్మాభివ్యక్తిసత్యమున ఎప్పుడును విచలితముగాదు.

6. <u>అన్ని గుణములు భగవంతుని గుణములే</u> : కాని మనము నివసించు ప్రపంచమున ఎన్నుకొని, వేఱుచేయు నొక పృథక్కరణతత్త్వము గలదు. దీని ప్రభావమున, ప్రతిశక్తియు, ప్రతిగుణమును తన అధికారముకొఱకే ప్రయత్నించుచున్నట్లు కన్పించును; విధ మేది యైనను, సాధ్యమైనంత స్వీయాభివ్యక్తిని సాధింప బ్రయత్నించును; ఆ ప్రయత్నమునకు సహవర్తి లేక ప్రత్యర్థి శక్తుల ప్రయత్నముతో

[1] తపస్సు, చిచ్ఛక్తి. –శ్రీ అ.

వీలైనంత ఉత్తమముగానో, సాధ్యమైనంత అధమముగానో సమాధానము కుదుర్చును. ఈ సంఘర్షశీల ప్రపంచప్రకృతియందు నివసించు దివ్యపురుషుడు, భగవంతుడు దానిపై నొక విధమగు సామరస్యమును విధించును – సమస్తశక్తుల క్రియయు దేనిపై నాధారపడునో, ఆ అభ్యంతర, రహస్య ఏకత్వమునకు సహజమగు ధర్మము ననుసరించి ఆ సామరస్యమును విధించును. కాని ఇది యొక సాపేక్ష సామరస్యము; ఇది యొక మూల ఏకతనుండి కాక, మూల విభజనమండియే వచ్చి, విభజన నేర్పిన పాఠములచేతనే మనుచున్నట్లు కన్పించును. అథవా కనీస మి ట్లనిపించును : ఈ ఏకత్వము పాతాళమున నిద్రించుచున్నది, తన ఎఱుక తనకు లేదు, తన మాయా వేషములను తా నెప్పుడు తొలగించదు. మఱియు వాస్తవ మారయ, అవరప్రకృతి యందలి జీవుడు తనలో దానికి మూలమగు దివ్యప్రకృతిని కనుగొనువఱకు, ఈ ఏకత్వము తనమదాను బొందదు. అయినను ప్రపంచమునందు కార్యరతమై, మానవునియందు, పశువునందు, వృక్షమునందు, జడమునందు వివిధముగా పనిచేయు చున్న గుణములు మఱియు శక్తులు, అవి ఏరూపము ధరించినను, సదా దివ్యగుణ ములు మఱియు శక్తులే. సమస్త ఊర్జములు మఱియు గుణములు భగవంతుని శక్తులే. ప్రతిశక్తియు నచ్చటి దివ్యప్రకృతినుండి వచ్చును, ఇచ్చటి నిమ్నప్రకృతి యందు ఆత్మప్రకటనముకై కర్మచేయును, ఇచ్చటి బాధకనియమములకు లోబడియు విల్రదొక్కుకొని, ప్రకటితమూల్యముల సామర్థ్యమును పెంపొందించుకొనును, మఱియు స్వీయశక్తి ఉన్నతులను ప్రాపించుకొలది, దైవత్వమును ప్రత్యక్షముగా ప్రకటించు స్థితికి వచ్చి, పరమ, ఆదర్శ, దివ్యప్రకృతియందు తన స్వీయ పూర్ణ స్వరూపము దిశగా పైకెగయును. ఏలన ప్రతి ఊర్జము భగవంతుని సత్తయు, శక్తియునే గాన, ఊర్జముయొక్క విస్తారమును, ఆత్మప్రకటనమును సదా భగవంతుని విస్తారమును, ప్రకటనమునే యగును.

7. <u>విభూతిసిద్ధాంతమునకు పునాది</u> : ఇట్లు నైతము చెప్పవచ్చును : ఒకా నొక తీవ్రతాదశను చేరుకొనినపుడు, మనయందలి ప్రతిశక్తి—జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, ప్రేమశక్తి, ఆనందశక్తి–ఒక విస్ఫోటములో (ప్రేలుడులో) పరిణమించగలదు, ఆ విస్ఫోటము నిమ్నతరవ్యవస్థయొక్క పుటమును పగులగొట్టి, అందలి ఊర్జమును తన పృథక్కార క్రియనుండి విడిపించి, దివ్యసత్తయొక్క అనంతస్వేచ్ఛతో దాని సంయోగమును సాధించును. భగవదున్ముఖమగు ఒక పరమోచ్చ తీవ్రత ఒక

పరిపూర్ణ జ్ఞానదృష్టిద్వారా మనస్సును విడిపించును, ఒక పరిపూర్ణ ప్రేమానందము ద్వారా హృదయమును విడిపించును, ఒక పరిపూర్ణ ఇచ్ఛాకేంద్రీకరణముద్వారా సర్వసత్తను విడిపించును. కాని ఈ విమోచకవిస్ఫోటమునకు మూలము మన వర్తమానప్రకృతిపై భగవంతుని సంస్పర్శ యగును; ఈ సంస్పర్శ ప్రకృతిశక్తిని తన సామాన్య, పరిమిత, పృథక్కర క్రియనుండియు, విషయములనుండియు తప్పించి, అనంతము, నిరపేక్షము నగు భగవంతుని దిశగా మఱల్చును. ఇట్లు మఱల్చు దివ్యశక్తియొక్క సక్రియ సర్వవ్యాపిత్వరూపమగు సత్యమే విభూతి సిద్ధాంతమున కాధారము.

8. జీవునికి అహంకారభ్రమ : అనంతమగు దివ్యశక్తి అంతటనుండి, నిమ్నజగత్తును రహస్యముగా ధరించును. – "పరా ప్రకృతిర్మే యయా ధార్యతే జగత్" (7–5). కాని యోగమాయా కల్పితమైన ఆవరణము (7–25) జ్ఞానప్రకాశము చేత (10–11) భేదించబడువఱకు అది ప్రతిప్రాకృతభూతముయొక్క హృదయమున దాగి (18–61), వెనుకకు తగ్గి నిలుచును. మానవుని ఆధ్యాత్మికసత్తయగు జీవుడు దివ్యప్రకృతితో నుండును. అత డా ప్రకృతియందు భగవంతునియొక్క ఒక అభివ్యక్తి – "పరా ప్రకృతిర్ జీవభూతా" (7 5), మఱియు నతడు తనయందు భగవంతుని సర్వశక్తులను, గుణములను గుప్తరూపమున గలిగియుండును. కాని మనము నివసించు నీ అపరప్రకృతియందు జీవుడు సంవరణము (selection) మఱియు సాంత నిర్ధారణము (determination) యొక్క సూత్రము ననుసరించును; అనుసరించి ఏయే శక్తిని, గుణమును లేక ఆధ్యాత్మికతత్త్వమును తనతో జన్మలోనికి తెచ్చునో, లేక తన అభివ్యక్తిబీజముగా దానిని ముందుకు పంపునో, అది తన స్వభావము, అనగా స్వ – సంభూతినియమముయొక్క ఒక క్రియాశీల అంశ మగును, మఱియు తన స్వధర్మము, అనగా కర్మనియమమును నిర్ధారణచేయును. మఱియు నదియే సర్వము నగుచో, నెట్టి కలవరము లేక కష్టము నుండదు; అప్పుడు మానవ జీవనము భగవంతుని ఒక ప్రకాశమయప్రకటనయే యగును. కాని మన ప్రపంచ శక్తి అజ్ఞానముయొక్క, అహంకారముయొక్క, త్రిగుణములయొక్క ఒక ప్రకృతి. ఇది అజ్ఞానప్రకృతి గావున, జీవుడు తనను, వేఱుచేయు అహంకారముగా భావించు కొనును : అతడు తన స్వీయాభివ్యక్తిని పృథక్కర జీవనసంకల్పరూపమున ఆహంకారికముగా సాధించుకొనుచు, ఇతరుల యందలి అట్టి సంకల్పముతో సంఘర్షము

లేక సంయోగమున వర్తించును. అతడు ఏకత మఱియు సామరస్యముచేత గాక, సంఘర్షముచేత జగత్తును పొందు ప్రయత్నించును; అతడు విరోధమునకే ప్రాధాన్య మిచ్చును. ఇది యొక అజ్ఞానప్రకృతి గాన, అతడు తననుదా నెఱుంగడు, తన స్వభావము నెఱుంగడు, కాని దానిని సహజప్రేరణచే ప్రపంచశక్తి నిర్బంధమునకు లోబడి, అనుసరించును, ఈ స్థితియందు అధికాయాసము, అంతఃసంఘర్షము, దారితప్పు పెద్ద ప్రమాదము నుండును. ఇది త్రిగుణప్రకృతి గావున, ఈ అస్తవ్యస్త ప్రయాసమయ ఆత్మాభివ్యక్తి అసమర్థత, అపవర్తనము, లేక పాక్షిక ఆత్మదర్శన రూపమగు అనేక ఆకారములు ధరించును. ఎట్లన తమోగుణమునకు వశమైనపుడు, సత్తాశక్తి ఒక దుర్బలసంకరమునందు, ప్రబల అసమర్థతయందు, అజ్ఞానశక్తుల అంతయాంత్రికతకు ఆకాంక్షారహిత అధీనతయందు పనిచేయును. తర్వాత రజోగుణము ప్రాబల్యము వహించినపుడు; ఒక సంఘర్షముండును, ఒక ప్రయత్న ముండును, శక్తిసామర్థ్యముల ఒక వృద్ధి యుండును; అయితే ఈ వృద్ధియందు బాధాపతనము లుండును, అసాధుభావములు, పద్ధతులు, ఆదర్శములవలన దారితప్పుట సంభవించును, విశేషించి అహంకారము అధికముగా, పర్వతప్రమాణముగా పెరిగిపోవు ప్రమాద ముండును. చివరకు, సత్త్వగుణము ప్రాబల్యము వహించి నపుడు, పూర్వాధికముగా సమరసక్రియ యుండును, ప్రకృతితో యథోచిత వ్యవహార ముండును; అయితే వైయక్తికప్రకాశముయొక్క పరిమితులు మఱియు మానసిక సంకల్పజ్ఞానముల పరిమితసామర్థ్యము - వీని పరిధిలో మాత్రమే 'యథోచితము;' ఈ చిక్కుమండి తప్పించుకొనుటయే, అజ్ఞానము, అహంకారము మఱియు గుణములపై కెగయుటయే దివ్యపరిపూర్ణతకు ప్రథమ, వాస్తవ సోపానము. అట్టి అతిక్రమణముచేత జీవుడు తన స్వీయ దివ్యప్రకృతిని, తన యథార్థసత్తను కనుగొనును.

9. ఆవృతవిభూతులు, వివృతవిభూతులు : ఆధ్యాత్మిక చేతనయందలి విముక్త జ్ఞాననేత్రము ప్రపంచము నవేక్షించునపుడు సంఘర్షశీల నిమ్నప్రకృతిని మాత్రమే చూడదు. ప్రకృతియొక్క బాహ్య ఆభాససత్యమునే మనము చూతుమేని, అది అజ్ఞాననేత్రముయొక్క చూపు గావున, అన్నింటియందు సమముగా నున్న భగవంతుని జాడజాలము - సాత్త్విక, రాజసిక, తామసప్రాణియందు, మఱియు దానవుని యందు, దేవదానవులందు, పుణ్యాత్మపాపాత్ములందు, పండితపామరులందు సమముగా

జూడజాలము. కాగా ముక్తదృష్టి ప్రాకృతజీవుని సమస్త గుప్తసత్యముగా ఏకకాలమున మూడు వస్తువులను జూచును. అది ముస్ముందు అన్నింటియందును గుప్తముగా నుండి, వికాసార్థము వేచియున్న దివ్యప్రకృతిని జూచును; సర్వవస్తువులయందును ఈమెయే వాస్తవశక్తి యని, నానావిధ గుణము మఱియు శక్తుల బాహ్యక్రియకు మూల్యము కట్టున దీమెయే యని చూచును, మఱియు విముక్తదృష్టి బాహ్యఘటనల అర్థమును అహంకారభాషలో గాక, దివ్యప్రకృతిప్రకాశమున ఆకళించుకొనును. అందుచేతనే, రెండవదిగా, దేవదానవులందును, పశుమానవులందును, పండితపామరులందును బాహ్యక్రియయొక్క భేదములను జూచినను, విముక్తదృష్టి వానిని ఈ పరిస్థితులయందును, ఈ తెరల మఱుగున జరుగు దివ్యగుణము మఱియు శక్తియొక్క క్రియగానే చూచును. అది వేషమును జూచి మోసపోదు, పరంతు ప్రతివేషము వెనుకను భగవంతునే పసికట్టును. ఆ దృష్టి భ్రష్టాచారము లేక అపూర్ణతను గుర్తించును గాని, వానిని భేదించుకొని వెనుకనున్న మూలసత్యమును జూచును, అది ఆ సత్యమును భ్రష్టాచారము మఱియు అపూర్ణతయందు సైతము కనుగొనును; నిజానికీ అపూర్ణత ప్రస్తుతము తన స్వరూపముపట్ల గ్రుడ్డిదియై, దానిని కనుగొన ప్రయాసపడుచు, అనంతము, నిరపేక్షము నగు తన స్వరూపము దిశగా పయనించు వస్తువే గదా. విముక్తచక్షువు భ్రష్టాచారము మఱియు అపూర్ణతకు విపరీతప్రాముఖ్య మివ్వదు, అది సర్వమును హృదయమునందు సంపూర్ణ దయాప్రేమలతోను, బుద్ధియందు సంపూర్ణ అవగాహనతోను, ఆత్మయందు సంపూర్ణసమతతోను వీక్షించగలుగును. చివరకీ విముక్తదృష్టి భగవంతుని దిశగా ఉద్యమించుచున్న అస్తిత్వ - సంకల్పముయొక్క శక్తుల ఊర్ధ్వముఖ సంవేగమును గాంచును; అది శక్తి మఱియు గుణముయొక్క సమస్త సమున్నత అభివ్యక్తులను ఆదరించును, ఆహ్వానించును, ప్రోత్సహించును - దేవత్వముయొక్క సముజ్జ్వల తేజములను, నిమ్నప్రకృతినుండి ఉద్ధరింపబడిన అంతరాత్మ, మనస్సు, ప్రాణముల ఆరోహణశీల మహత్త్వములను అది ఆదరించును; అవి అందుకొనుచున్న ప్రకాశమయ ప్రజ్ఞాజ్ఞానములను, మహాశక్తిసామర్థ్యములను, ధైర్యసాహసములను, దయామాధుర్యమును, ప్రేమవైభవమును, ఉత్కృష్టగుణమును, సమ్మోహకసౌంధర్యమును విముక్తచక్షువు అభినందించును. ఈ ఆత్మనేత్రము మహావిభూతియందు ఉదయించుచున్న మానవుని దేవత్వమును చూచి, దాని వైశిష్ట్యమును గుర్తించును.

10. శక్తిరూపమున భగవంతుడు : ఇది శక్తిగా భగవంతుని పరిగణన యగును-తన విశాలతమార్గమున శక్తిగా ; శక్తి యన బలశక్తియే గాక, జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, ప్రేమశక్తి, కర్మశక్తి, పవిత్రతాశక్తి, మాధురీశక్తి సౌందర్యశక్తియు నగును. భగవంతుడు సత్తు, చిత్తు, ఆనందము; మఱియు సమస్తము నీ మూలము నుండి వెలికి దూకి, సత్తాశక్తిచేతను, చేతనాశక్తిచేతను, ఆనందశక్తిచేతను తిరిగి తనను దాను కనుగొనును. ఇది దివ్యశక్తియొక్క కర్మలచే నేర్పడిన ప్రపంచము. ఈ శక్తి ఇచ్చట అసంఖ్యవిధములగు భూతములుగా తనను రూపొందించుకొనును, మఱియు ప్రతిభూతము ఆమె సామర్థ్యవిశేషములగు తన స్వీయ, స్వాభావికశక్తులను గలిగియుండును. హరిణమునందలి శక్తివలె సింహమునందలి శక్తియు, దేవుని యందలి శక్తివలె దానవునియందలి శక్తియు, సచేతనమానవునియందలి శక్తివలె నిశ్చేతన సూర్యునియందలి శక్తియు-ప్రతిశక్తియు ఆరూపమునన్న భగవంతుడే. గుణములు గల్పించిన వికారము వస్తువుయొక్క గౌణరూపమే గాని, నిజానికి ముఖ్య రూపము గాదు; స్వీయాభివ్యక్తిని సాధించుకొనుచున్న దివ్యశక్తియే ముఖ్యరూపము. మహామనీషి, వీరుడు, మహాగురువు, జ్ఞాని, మహాకళాకారుడు, మహావైజ్ఞానికుడు, తపోమయ ఆత్మదమయిత, వస్తువులు, ఘటనలు, శక్తుల బాహ్యదమయిత-అందరి యందును తన నభివ్యక్తము చేసికొనుచున్నదా భగవంతుడే. పోగా ఉత్తమకావ్యము, పరిపూర్ణ సౌందర్యరూపము, గభీరప్రేమ, ఉదాత్తకర్మ, దివ్యలాభము - ఇట్టి కర్మ స్వయముగా ఆ భగవంతుని కర్మయే.

11. విభూతిదృష్టి వీరపూజ కాదు : ఈ సత్యమును ప్రాచీన సంస్కృతు లన్నియు గుర్తించి, గౌరవించినవి. కాని ఆధునికమనస్సుయొక్క ఒక పార్శ్వము నకు ఈ భావముపట్ల విచిత్రవిముఖత గలదు, అది ఈ భావమునందు కేవలబలము యొక్క పూజనే చూచును; అజ్ఞానమయ లేక ఆత్మభ్రంశక వీరపూజనే చూచును, అథవా ఆసురికాతిమానవుని సిద్ధాంతమునే చూచును. ఏ సత్యమునైన స్వీకరించు నొక అజ్ఞప్రకార మున్నట్లే, ఈ సత్యమును స్వీకరించు నొక అజ్ఞప్రకారమును గలదు; దివ్యమగు ప్రకృతివిధానమునందు దీనికి తన సముచితస్థానము, అపరిహార్య కార్యము గలదు. కాగా గీత దీనిని తన సముచితస్థానమునను, దృక్కోణమునను పెట్టును. సర్వమానవులందును, సర్వజీవులందును గల దివ్యాత్మ పరిగణనపై దీని నాధారపర్చవలెను; పెద్ద మఱియు చిన్న, సుప్రసిద్ధ మఱియు అప్రసిద్ధ అభివ్యక్తిపట్ల

సమానహృదయముతో ఈ సత్యము సంగతముగావలెను. అజ్ఞుడు, దీనుడు, దుర్బలుడు, నీచుడు, బహిష్కృతులయందు భగవంతుని చూచి, ప్రేమించవలెను. విభూతియగు వానియందు సైతము గుర్తించి, గౌరవించవలసినది, ఒక సంకేతముగా తప్ప, బాహ్య వ్యక్తిని గాదు, ఆ శక్తిరూపమున తనను ప్రకటించుకొనుచున్న భగవంతుని. కాని అన్నింటియందును భగవంతుడు గల డను సత్యము అభివ్యక్తియందు ఒక ఆరోహణ క్రమము గల దను తథ్యమును నిరాకరించదు; ఈ ఆరోహణక్రమము ననుసరించియే ప్రకృతి తన అంధకారమయసంకేతములనుండి భగవంతుని ప్రత్యక్షముగా ప్రకటించు దశవఱకు పై కెగయును. ప్రతి మహాపురుషుడును, ప్రతి మహాకార్యమును ఆమె యొక్క ఆత్మాతిక్రమణశక్తికి ఒక చిహ్నము, మఱియు చరమ, పరమ అతిక్రమణము నకు ఒక ఆశాజ్యోతి. పశుమానవులయందు ఒకే "సమబ్రహ్మము" (5-19) ఉన్నప్పటికి, మానవుడు ప్రాకృతాభివ్యక్తియొక్క ఒక శ్రేష్ఠతర సోపానము. కాని మానవుడును తన ఆత్మాతిక్రమణముయొక్క అత్యున్నత శిఖరముల నింకను అందుకొనలేదు, మఱియు న ట్లందుకొను దనుక ఆరోహణసంకల్పమునకు గల మహాశక్తియొక్క ప్రతిసూచనను ఒక ఆశాకిరణముగా, ఒక సంకేతవిశేషముగా మనము గుర్తించవలెను. కొందరు మహామార్గదర్శకులు అతిమానవత దిశగా వేసిన అడుగులద్వారా తక్కిన మానవులకు దారిచూపుదురు; వారి అడుగుజాడలను మనము కన్నెత్తి చూచి నపుడు, అందరియందును గల భగవత్త్వముపట్ల మన గౌరవము నది తగ్గించకపోగా, దానిని పెంపొందించి, దాని కొక సంపన్నతరార్థమును సమకూర్చును.

12. <u>సామాన్యమానవుడు – విభూతిమానవుడు</u> : అర్జునుడు స్వయముగా ఒక విభూతి; అతడు ఆధ్యాత్మికపరిణామమున ఒక ఎత్తైన మానవుడు, తన సమకాలికు లలో ఒక విశిష్టరూపము, మానవులందరి హృదయస్థనారాయణునియొక్క ఒక అభీష్ట ఉపకరణము. ఒకచోట దివ్యగురువు అందరియొక్క పరమ, సమ ఆత్మగా భాషించుచు, తనకు ప్రియుడు గాని, ద్వేష్యుడు గాని లేడని ప్రకటించును (9-29); కాని యితరస్థలములందు (4-3. 18-64,65), అర్జునుడు తనకు ప్రియుడు మఱియు భక్తు డనియు, కావున తనచే పరిచాలితుడు మఱియు రక్షితు డనియు, దివ్యదర్శనమున కును, జ్ఞానమునకును ఎన్నికచేయబడినాడనియు భగవంతుడు చెప్పును. ఇచ్చట విరోధాభాసము మాత్రమే కలదు. విశ్వముయొక్క ఆత్మరూపమున పరమశక్తి

(భగవంతుడు) సర్వసముడు, కావున ప్రతివానికి తన ప్రకృతిక్రియల కనురూపము గానే యిచ్చును; కాని మానవజీవునితో పురుషోత్తమునికి ఒక వైయక్తికసంబంధ మును గలదు, దీనినిబట్టి తన దగ్గరకు వచ్చిన మానవునికి తాను విశేషించి దగ్గరగా నుండును (9-29). కురుక్షేత్రమున యుద్ధార్థము గుమిగూడిన ఈ వీరశూరులు, మహాపక్షము లందరు దివ్యసంకల్పమునకు పాత్రములు, మఱియు ప్రతివానిద్వారా భగవంతు డతని ప్రకృతిని బట్టి పనిచేయును, కాని అహంకారముయొక్క తెర వెనుకనుండి. కాని అర్జును డొక ఉచ్చస్థానమును చేరుకొనెను, అచ్చట తెరను భేదించి, దేహధారి భగవంతుడు తన విభూతికి తన కార్యశైలి రహస్యమును ప్రకటించవచ్చును. ఇట్టి ప్రకటన ఆవశ్యకము గూడను. ఏలన అర్జును డొక మహా కార్యమున కుపకరణము, ఆ కార్యము చూచుటకు భయంకరమైనను, జాతియాత్ర యందు ఒక పెద్ద ముందంజ యగును, ధర్మరాజ్యస్థాపనకు ఒక నిశ్చాయక చర్య యగును. మానవుని యుగచక్రముల చరిత్ర మానవజాతి ఆత్మయందును, జీవనము నందును భగవదావిష్కరణ దిశగా సాగు ఒక పురోగతియై యున్నది; ఆ చరిత్ర యొక్క ప్రతి మహాఘటనయు, దశయు భగవంతుని ఒక అభివ్యక్తి. రహస్య సంకల్పముయొక్క ముఖ్యోపకరణము, ప్రముఖ నాయకుడు నగు అర్జునుడు తన పని దివ్యకర్మ యని తెలిసికొని, చేయగల దివ్యమానవుడు గావలెను. అపుడే ఆ కర్మ మానసికముగా సజీవము కాగలదు; తన ఆధ్యాత్మికమహత్త్వమును, తన రహస్యా శయముయొక్క తేజఃశక్తులను బొందగలదు. ఆత్మజ్ఞానము బొంద అర్జునునికి పిలుపు వచ్చినది (4-34); అతడు భగవంతుని విశ్వేశ్వరునిగా చూడవలెను (10-3), సర్వభూతములు మఱియు ఘటనల ఆదిగా చూడవలెను (10-20), అన్నింటిని ప్రకృతియందు భగవంతుని స్వీయప్రకటనముగా జూడవలెను (10-39), అన్నింటి యందు భగవంతుని, తన మానవరూపమునను, తన విభూతిరూపమునను (10-37) భగవంతుని జూడవలెను, సత్తయొక్క నిమ్నస్తరములందును, ఉచ్చస్తరములందును శిఖరాగ్రమునను భగవంతుని జూడవలెను, చివరకు మానవుని చైతము ఉచ్చస్తరము లందు విభూతిగను, పరమవిముక్తి మఱియు సంయోగమునందు చరమశిఖరముల కెగబ్రాకుచున్న వానిగను జూడవలెను. ఉత్పత్తి, వినాశముల గావించు కాలమును, తాను వేయు అడుగులయందు భగవంతుని మూర్తిగా జూడవలెను (11-32) — ఈ అడుగులు విశ్వముయొక్క చక్రగతిని నిర్వర్తించును, ఈ చక్రగతియొక్క ఉచ్చస్థానమందు మానవదేహమునందలి దివ్యాంశము భగవంతుని విభూతిగా

ప్రపంచమున భగవత్కర్మ చేయుచు, పరమ అతీతత్వములను ప్రాపించును. ఈ జ్ఞానము ప్రసాదించబడినది; భగవంతుని కాలరూప మిపుడు ఆవిష్కరింపబడ నున్నది, మఱియు నా రూపముయొక్క శతసహస్రముఖములనుండి తన నియుక్త కర్మను జేయ విముక్తవిభూతికి (అర్జునునకు) ఆదేశము వెలువడును (11-33).

# 10. విశ్వపురుషదర్శనము

## సంహారస్వరూప కాలుడు

1. యోగేశ్వర దర్శన మపేక్షించి : విశ్వపురుషదర్శనము గీతయందలి మిక్కిలి ప్రసిద్ధము, అత్యంతకావ్యమయము నగు ప్రకరణములలో నొకటి, కాని గీతావిచారణయందు దీని స్థానము పూర్ణముగా పైకి గానరాదు. స్పష్టముగానే యిది యొక కావ్యమయసంకేతముగా నుద్దేశించబడినది; కావున అది ఎట్లు ప్రవేశపెట్ట బడెనో, ఏ ప్రయోజనార్థమో – మనము చూడవలెను, అటులే అది తన మార్మికాంశములందు దేనిని సూచించునో – కనుగొనవలెను; అప్పుడే ఈ ప్రకరణార్థము పట్టువడును. అదృష్టభగవంతునియొక్క సజీవరూపమును, ప్రత్యక్ష మహత్తను, జగత్తును పాలించు సత్తాశక్తులయొక్క సాక్షాన్మూర్తిని అర్జునుడు చూడ ప్రార్థించును. సర్వము భగవంతునుండియే (11-2), సర్వము భగవంతుడే, సర్వము నందును భగవంతు డప్రకటముగా నివసించును, అయితే ప్రతిపరిమితరూపము నందును అతడు ప్రకటము కాగలడు : ఇదియే పరమ ఆధ్యాత్మికరహస్యము, దీని నర్జునుడు వినియున్నాడు. భగవంతునుంచి వేఱుగా వస్తువులు తమలోదామే, తమ కొఱకే వర్తించును – అను భ్రమ, అథవా ప్రకృతికి అధీనమగు వస్తువు స్వయం చలితము, స్వయంచాలితము కాగలదు – అను అభిప్రాయము : మానవుని సదా పట్టియుండు ఈ భ్రమాభిప్రాయము లిపుడు అర్జునుని విడిచిపోయినవి – ఇవియే అతని సందేహసమ్మోహములకును, కర్మనిరాకరణమునకును ఆదిలో కారణము. భూతముల రాకపోకలయొక్క (11-2) అంతర్యము నిపు డతడు గ్రహించియున్నాడు.

భగవంతుని సచేనాత్మయొక్క అవ్యయమాహాత్మ్యమే (11-2) సర్వదృశ్యముల రహస్య మని అతని కిపుడు తెలియును. సర్వము వస్తువులయందు నివసించు ఈ మహాసనాతనపురుషుని ఒక యోగమే, మఱియు సర్వఘటనలు ఆయోగము (శక్తి) యొక్క ఫలితము మఱియు ప్రకటనము; సమస్తప్రకృతి నిగూఢ భగవంతునిచే నిండియున్నది, మఱియు నతని ప్రసవింప ప్రయాసపడుచున్నది. సాధ్యమగుచో, ఈ దివ్యపురుషుని రూప, శరీరములను అర్జునుడు చూడనుగూడ చూడగోరును (11-3). అర్జును డతని విభూతులను వినియున్నాడు, అతని స్వీయప్రకటనము యొక్క సోపానములను, ప్రకారములను వినియున్నాడు (10-5, 6); కాని ఇపు డర్జునుడు (విభూతులను గాక) సాక్షాత్తు తన అవ్యయాత్మనే యోగనేత్రమునకు చూపింప యోగేశ్వరుని ప్రార్థించును (10-4). స్పష్టముగానే, ఈ ఆత్మ నిరాకారమగు అక్షరాత్మ గాదు, పరమాత్మ - ఈ పరమాత్మనుండియే సమస్త శక్తియు, క్రియయు వచ్చును, రూపము లితని ముసుగులే, ఇతడే విభూతులయందు తన శక్తి నావిష్కరించును, ఇతడే కర్మప్రభువు, భక్తిజ్ఞానముల ప్రభుపు, ప్రకృతి మఱియు సర్వభూతముల ప్రభువు. ఈ మహత్తమ, సర్వతోముఖదర్శనార్థము తనను ప్రార్థింప అర్జునుడు ప్రేరితుడగును; ఏలన అతుల విశ్వమునందు ఆవిష్కృతుడైన పరమ పురుషునుండియే ప్రపంచకర్మయందు తన పాత్రను నిర్వహింప అర్జును డాదేశమును స్వీకరించవలెను (11-33).

2. <u>కేంద్రమర్మము ఏకత్వము</u> : నీవు చూడవలసిన విశ్వరూపమును, అవతారము సమాధానించును (11-8), మానవనేత్రము చూడజాలదు - ఏలన అది వస్తువుల బాహ్యరూపములను మాత్రమే చూడగలదు, లేక వానినుండి కొన్ని సంకేతములను నిర్మించుకొని, ప్రతిసంకేతముద్వారా సనాతన గుహ్యముయొక్క కొన్ని ముఖములను మాత్రమే ఊహించుకొనగలుగును. కాని ఒక దివ్యచక్షువు, ఆంతరతమదృష్టి గలదు (11-8), దీనిచే తన దివ్యయోగయుతుడైన పరమేశ్వరుని జూడవచ్చును, ఆ చక్షువును నీ కిచ్చుచున్నాను. నానావిధములు, నానారూపములు, నానావర్ణములు నగు నా దివ్యరూపములను వందల, వేల సంఖ్యలలో చూచెదవు (11-5)-అని భగవానుడు చెప్పును; ఆదిత్యులు, రుద్రులు, మరుత్తులు, అశ్వినులను చూచెదవు (11-6); ఎవ్వరును జూడని అనేకాద్భుతములను వీక్షించెదవు; నాదేహమునందు సంఘటితము, ఏకీభూతము నగు సమస్తప్రపంచమును నేడు

దర్శించెదవు, నీవు చూడగోరు నితరము నంతను చూచెదవు (11-7). ఇంతకు, నిదియే ముఖ్యస్వరము, కేంద్రమర్మము. అది అనేకమునందు ఏకముయొక్క, ఏకమునందు అనేకముయొక్క దర్శనము - మఱియు అనేకము ఏకమే. ఈ దర్శనమే యోగనేత్రమునకు వర్తమానమును విడిపించును, గతమును సమర్థించును, భవిష్యమును వివరించును. ఎట్లన, ఒకసారి దీనిని చూచి, ధరించినపుడు, ఇది సర్వసందేహములు మఱియు సమ్మోహముల వేళ్లను భగవంతుని భాసురపరశువుతో నఱికివేయును, అటులే సమస్తనిషేధములు మఱియు విరోధములను ధ్వంసమొనరించును. ఇది సమన్వయమును, ఏకతను సాధించు దర్శనము. అంతరాత్మ ఈ దర్శనమునందు విశ్వపురుషునితో ఏకముకాగలిగినచో, ప్రపంచమున భయంకరవస్తువు సైతము మనను భయపెట్టదు - అర్జును డింకను ఏకత్వము బొందలేదు గాన, విశ్వరూపమును జూచుచు భయపడును. ఏలన అదియు భగవంతుని ఒక రూపముగనే గన్పించును, మఱియు దానిని దానినిగా మాత్రమే చూడక, దానిలో నొకసారి ఈ అర్థమును గాంచినపుడు, మనము సమస్తసృష్టిని సర్వాలింగకసంతోషముతోను, మహాధైర్యముతోను స్వీకరించగలము, నియుక్తకార్యము చేయ దృఢపదములతో ముందుకు పోగలము, సృష్టి కావల పరమసిద్ధిని ఆలోకించగలము. సర్వవస్తువులను అఖండదృష్టిలో చూచు దివ్యజ్ఞానములోనికి ప్రవేశపెట్టబడిన అంతరాత్మ ప్రపంచము యొక్క నూతనదర్శనమును బొందగలదు; సర్వ-సంబంధసాధకము, సర్వ-ఏకతా సాధకము నగు ఈ దృష్టి ననుసరించి, అది పూర్ణతరావిష్కరణమునుండి పూర్ణతమావిష్కరణమునకు పయనించగలదు.

3. "ఆది లేదు, అంతము లేదు" : పిమ్మట పరమరూపము దృగ్గోచరము చేయబడును. అది అనంతపురుషుని రూపము, అతని ముఖములు అన్నివైపుల గలవు, అతనిలో సర్వాశ్చర్యములు గలవు (11-11), అతడు తన సత్తయొక్క అనేకాద్భుత విషయములను అనంతముగా జూపును. ఆ విశ్వవిశాలపురుషుడు అనేకనయనములతో జూచును, అసంఖ్యముఖములతో పలుకును (11-10); ఎత్తిపట్టిన అనేకదివ్యాయుధములతో యుద్ధసన్నద్ధుడు, దివ్యాభరణములతో శోభామయుడు, దివ్యాంబరములతోను, దివ్యసుమములతోను మనోహరుడు, దివ్యగంధములతో సువాసితుడు. వేయి సూర్యులు ఒకేసారి ఉదయించినంత తేజోమయ మతని శరీరము (11-12). సమస్త ప్రపంచము అనేకముగా విభక్త మయ్యును, ఆ దేవదేవుని శరీరమునందు ఏకీ

భూతమై గోచరించును (11-13). అర్జునుని దృష్టి కా భగవంతుడు మహానుభావుడు మఱియు సుందరుడు మఱియు భయంకరుడు, అతడు జీవేశ్వరుడు, అతడు తన మహిమయందును, మహత్త్వమునందును అక్రమము మఱియు సక్రమము, ఘోరము మఱియు అద్భుతము, సౌమ్యము మఱియు ఉగ్రము నగు ఈప్రపంచము నభివ్యక్తము చేసినాడు; అట్టి అతనిని గాంచి, విస్మయ భయ హర్షములకు వశుడై, నమస్కరించి, చేతులు జోడించి, అర్జునుడు సంభ్రమవచనములతో ఆ మహారూపము నిట్లు స్తుతించును (11-14) - " నీ శరీరమున, ఓ దేవాధిదేవా, సర్వదేవులను జూచుచున్నాను; భూతసంఘములను, కమలమునం దాసీనుడైన బ్రహ్మదేవుని, ఋషులను, దివ్య నాగులను వీక్షించుచున్నాను (11-15). అసంఖ్యాబాహువులను, ఉదరములను, నేత్రములను, ముఖములను జూచుచున్నాను, ప్రతివైపున నీ అనంత రూపములను జూచుచున్నాను, కాని నీ అంతమును గాని, మధ్యమును గాని, ఆదిని గాని చూచుట లేదు (11-16). నీవు కిరీటధారివి, గదాచక్రధారివి. నీవు దుర్నిరీక్ష్యుడవు; కారణము, నా నలువైపుల తేజోరాశివిగా భాసించుచున్నావు, అగ్నివలె, సూర్యునివలె జ్వలించు చున్నావు, నీ వప్రమేయుడవు (11-17). నీవు తెలియదగిన పరమ అక్షరమవు, నీవు విశ్వమునకు సమున్నతాధారము మఱియు ధామము, నీవు సనాతనధర్మముల అవ్యయరక్షకుడవు, నీవు విశ్వమునందలి సనాతన పురుషుడవు (11-18) ".

4. <u>భయంకరపార్శ్వము</u> : కాని ఈ మహారూపమునందు సంహారకర్త యొక్క ప్రతిమయు గలదు. ఈ అప్రమేయునికి ఆది, మధ్యము, అంతము లేవు, కాని సర్వవస్తువులకు ఇతనియందు ఆది, మధ్య, అంతములు గలవు. విశ్వమును తన అసంఖ్యాబాహువులతో ఆలింగనముచేసికొను నీ భగవంతుడు తన అసంఖ్య హస్తములతో నాశముచేయును గూడ; ఇతని నేత్రములు చంద్రులు మఱియు సూర్యులు, ఇతని ముఖము జ్వలించుచున్న అగ్ని, ఇతడు తన తేజోజ్వాలలచే విశ్వము నంతను దహించివేయుచున్నాడు (11-19). అతని రూపము ఉగ్రము, అద్భుతము, అది యొక్కటియే సర్వదిశలను, అంతరిక్షమును నింపియున్నది (11-20). సురసంఘములు భయపడుచు, స్తుతించుచు, దానిలో ప్రవేశించుచున్నారు; ఋషులు, సిద్ధులు స్వస్తి చెప్పుచు, దానిని పుష్కలస్తవములతో స్తుతించుచున్నారు (11-21). దేవతలు, దానవులు, యక్షులు దానిని విస్మితచక్షువులతో వీక్షించు చున్నారు (11-22). దాని నేత్రములు అతివిశాలములు, ప్రదీప్తములు (11-24),

దాని ముఖములు తెఱచుకొని, మ్రింగనుంకించుచున్నవి, అవి కోఱలతో భీతిగొల్పుచున్నవి, దాని ముఖములు కాలాగ్నిసదృశములు (11–25). ప్రపంచయుద్ధముయొక్క ఉభయపక్షలలోని రాజులు, నాయకులు, వీరులు కోఱలతో భీషణముగా నున్న ముఖములలోనికి వేగముతో ప్రవేశించుచున్నారు (11–26, 27), మఱియు కొందరు శక్తిరూపదంష్ట్రల మధ్య నలిగి రక్తము స్రవించుచున్న మస్తకములతో కంటి కగపడుచున్నారు. జాతులకు జాతులే వివశవేగముతో, సముద్రములో నదుల రీతిని, అగ్నిలో శలభముల మాడ్కిని, ఆ జ్వాలాముఖములలోనికి దూకుచున్నారు (11–28, 29). ఆ ప్రజ్వలితముఖములతో భయంకర కాలరూపము నలు దిశలను నాకుచున్నది (11–30) ; విశ్వ మంతయు అతని ప్రదీప్తతేజములతో నిండి, అతని మహోగ్రప్రభలతో కాలుచున్నది. ప్రపంచము, దాని జాతులును భయముతో కంపించి, వ్యథాగ్రస్తులగుచున్నారు (11–23), తనను చుట్టియున్న ఈ భయ కంపములకు అర్జునుడును గుఱియయ్యెను. ఇట్లు తనయందలి ఆత్మ వ్యథితము, క్షుబ్ధము కాగా, అతనికి శాంతిసుఖములు దూరమయ్యెను. అపు డా భయంకర భగవంతుని కిట్లు మొరపెట్టుకొనును : "ఈ ఉగ్రరూపము ధరించియున్న నీ వెవరివో తెలుపుము. నీకు నమస్కారము, దేవదేవ ! ప్రసన్నుడవు కమ్ము. ఆది నుండియు నున్న నిన్ను తెలియగోరెదను, ఏలన నీ ప్రవృత్తి నా కంతుబట్టుట లేదు" (11–31).

5. భారతీయమత సమగ్రత : అర్జునుని ఈ చివరి మొఱ ఈ దర్శనము నందలి ద్వివిధ ఉద్దేశ్యమును సూచించును. ఇది పరమ విరాట్పురుషుని రూపము, ఇతడు సనాతన పురాణపురుషుడు (11–18). సదా సృజించువా డితడే ; ఏలన సృష్టికర్తయగు బ్రహ్మ ఇతని తనువులో జూడబడిన ఒక దేవత మాత్రమే. ఈ లోకమును సదా నిలుపువాడును ఇతడే; ఏలన ఇతడు శాశ్వతధర్మముల సంరక్షకుడు (11–18). కాని లోకమును సంహరించువాడును ఇతడే (11–32), అయితే ఈ సంహారము పునఃసృష్టినిమిత్తము ; ఈ రూపమునం దితడు కాలస్వరూపుడు, మృత్యుదేవత, సౌమ్య, రౌద్ర నృత్యముచేయు తాండవరుద్రుడు, పుఱ్ఱెల దండను ధరించి, ఖండించబడిన అసురుల రక్తమును పూసికొని, నగ్ననృత్యముచేయుచు, సంగ్రామరంగమున విజృంభించు కరాళకాళియు నగును. అటులే అతడు ఝంఝా మారుతము, ప్రళయాగ్ని, భూకంపము, బాధాక్షామ విప్లవ వినాశములు, ప్రళయ

సాగరము. ఇప్పు డీ రౌద్రపార్శ్వమునే అతడు ప్రదర్శించుచున్నాడు. ఈ పార్శ్వము నుండియే మానవమనస్సు బుద్ధిపూర్వకముగా వెనుదిరిగి, నిప్పుకోడివలె తన తలను దాచుకొనును, తాను భయంకరుని చూడనపుడు, భయంకరుడు తనను చూడ డని పాపము, దాని అభిప్రాయము ! దుర్బల మానవహృదయము సుందర సుఖప్రద సత్యములనే కోరును, అవి లేనపుడు శ్రవణప్రియ కథల నపేక్షించును. అది సత్య సమగ్రతను గోరదు ; కారణము, స్పష్టము, సుఖదము గాని దియు, దుర్జ్ఞేయము, దుస్సహ మగునదియు అచ్చటెంతో యుండును. అపక్వమతవాది, పైపై ఆశావాది, భావుక ఆదర్శవాది, ఇంద్రియసంవేదనలకు, హృదయావేగములకు దాసుడైన వాడును విశ్వజీవనముయొక్క కఠోరతరనిర్ణయములనుండియు, ఉగ్రతరరూపములనుండియు మఱలిపోవుటయం దేకీభవింతురు. వీ రందరు భారతీయమతమును అజ్ఞముగా నిందింతురు ; కారణము, తలదాచుకొను ఈ ఆటలో భారతీయమతము పాల్గొనదు, పైగా నది భగవంతుని మధుర సుందరరూపములను వలెనే భయంకరరూపములను గూడ దర్శించి, మనముం దుంచినది. ఆ మతము యొక్క సుదీర్ఘ విజ్ఞానము, మఱియు ఆధ్యాత్మికానుభవముయొక్క గభీరతావిశాలతలే ఈ దుర్బలపైముఖ్యములను సమర్థించుటయందు తన కడ్డుతగులును.

6. రౌద్రమువెనుకను భగవంతుని సుందరముఖము : భగవంతుడు ప్రేమ, శాంతి, నిర్మలనిత్యత యని భారతీయ ఆధ్యాత్మికతకు దెలియును - అతని ఈ దారుణరూపములను మనముం దుంచు గీతయే అతడు ప్రేమికు డనియు (18-65), సర్వభూతసుహృదు డనియు (5-29) చెప్పును. అయితే అతని దివ్య ప్రపంచ శాసనమున కొక కఠోరపార్శ్వమును గలదు - వినాశపార్శ్వము; కాగా దీని నుపేక్షించుట యన దివ్యప్రేమాదుల పూర్ణసత్యతను అందుకొనలేకపోవుటయే యగును, మఱియు నా ప్రేమాదులకు పక్షపాతమును, మిథ్యాత్వమును అంటగట్టుటయే యగును - మిథ్యాత్వ మేలన, ఏ సుఖప్రద, ప్రత్యేక రూపము ప్రేమ కివ్వబడినదో, దానిని మనము నివసించు ప్రపంచప్రకృతి ఋజువుచేయదు. మన శ్రమ సంగ్రామముల నపేక్షించు నీ ప్రపంచము దారుణము, విపత్కరము, వినాశకరము, భక్షణశీలము నగు ప్రపంచము, ఇచ్చటి జీవనము సంశయగ్రస్తము, ఆత్మశరీరము లిచ్చట మహాపాయముల మధ్య చరించును; మనము వేయు ప్రతి అడుగున, మన

మిచ్ఛించినను, ఇచ్ఛించకపోయినను, ఏదియో ఒకటి నలిగి నశించును, ఈ ప్రపంచమున ప్రతి జీవనశ్వాస ఒక మరణశ్వాసయు నగును. మన కనర్థముగా లేక భయంకరముగా గన్పించు దాని కంతటికి బాధ్యతను కొందరు అర్ధ – సర్వశక్తి మంతుడగు సైతానుపై నారోపింతురు, లేక దానిని ప్రకృతిలో నొక భాగముగా భగవంతునుంచి వేఱుచేతురు, ఇట్లు ప్రకృతి భగవంతునుండి స్వతంత్రమైనట్లు, ప్రపంచప్రకృతికిని, భగవత్ప్రకృతికిని మధ్య ఒక దాటరాని అఖాతమును కల్పింతురు; అథవా ఆ బాధ్యతను మానవుడు మఱియు నతని పాపములపైకి నెట్టుదురు; అనగా ప్రపంచనిర్మాణమున మానవుని మాటకే ప్రధానస్థాన మున్న దనియో; ఈశ్వరేచ్ఛకు విరుద్ధముగా నతడు దేనినైన సృజించగల డనియో దీని కర్థమగును :–ఇవి యన్నియు మందబుద్ధికి తృప్తి నిచ్చు ఉపాయములు, భారతీయుల మతవిజ్ఞానము వీనియం దెపుడును శరణుబొందలేదు. మనము సత్యముఖములోనికి సూటిగా చూచి, మఱేదియు గాక, భగవంతుడే తన సత్తయం దీ ప్రపంచమును నిర్మించె నని చూడదగును; నిజము కూడ నదియే. తన బిడ్డలను మ్రింగివేయు ప్రకృతి, ప్రాణుల ఆయువులను హరించు కాలము, సార్వత్రికము, అప్రతిహతము నగు మృత్యువు, మఱియు మానవునియందు, ప్రకృతియందు గల రౌద్రశక్తుల సంరంభము – ఇవియు తన విశ్వరూపములలో ఒకానొక రూపమున భగవంతుడే యని మనము చూడదగును. ఉదారముగా సృజించు భగవంతుడే, దయతో పాలించు భగవంతుడే దారుణముగా భక్షించు భగవంతుడు గూడ నని చూడదగును. సుఖము, మాధుర్యము, సమ్మోదము నెంతగా నతని స్పర్శయో, బాధ మఱియు నశుభముల ముండ్లపఱుపుపై ననుభవించు యాతనయు అంతగాను అతని స్పర్శయే. సంపూర్ణ సంయోగరూపమగు నేత్రముతో జూచి, మన సత్తయొక్క లోతులలో నీ సత్యము ననుభవించి నపుడే, తన రౌద్రరూపము వెనుక సైతము సర్వానందమయ భగవంతుని ప్రశాంత సుందరవదనమును మనము పూర్ణముగా దర్శించగలము, అటులే మన అపూర్ణతను పరీక్షకు బెట్టు యాతనాస్పర్శయందును మన అంతరాత్మ సుహృదుడు మఱియు నిర్మాతయొక్క స్పర్శనే చూరగొనగలము. ప్రపంచమునందలి అపస్వర ములు ఈశ్వరుని అపస్వరములే ; కావున వాని నామోదించి, వానిద్వారా పురోగ మించుటచేతనే అతని పరమసామరస్యముయొక్క అధికతర సుస్వరములను, అతని విశ్వాతీత, విశ్వమయ ఆనందముయొక్క సర్వోచ్ఛశిఖరములను, హర్షపులకిత విశాలతలను చేరుకొనగలము.

7. <u>సమస్యాస్వరూపము</u> : గీత లేవదీసిన సమస్యయు, చూపిన పరిష్కారమును విశ్వపురుషుని దర్శనముయొక్క ఈ స్వభావము నపేక్షించును. అది ఒక మహాసంగ్రామ సంహారములకు సంబంధించిన సమస్య; ఇది సర్వ-చాలక భగవదిచ్ఛ చేతనే సిద్ధముచేయబడినది, ఈ సంగ్రామమున ప్రధానవీరుని సారథిగా సనాతనావతారమే దిగివచ్చినది. ఈ ప్రధానవీరుడే స్వయముగా విశ్వరూపద్రష్ట; ఇతడు, తన పరిణామపథమున కడ్డువచ్చు క్రూర, పీడాకరశక్తుల చెండాడవలసిన వీర మానవాత్మయొక్క ప్రతినిధి, చెండాడి, ఉచ్చతర ధర్మముతో గూడిన రాజ్యమును స్థాపించి, భోగించవలెను. దేనియందు బంధువులు బంధువులనే ఖడ్గమున కెరజేతురో, జాతులకు జాతులే నామావశిష్టము గానున్నవో, సమాజమంతయు సంకరము మఱియు అరాజకముల గర్తములో గూలిపోనున్నట్లు కన్పించుచున్నదో, అట్టి మహోపద్రవము యొక్క భయంకరరూపమునకు తల్లడిల్లిన ఆ వీరుడు వెనుకకు తగ్గి, తన దైవ నిర్దిష్టకర్మను నిరాకరించి, "నన్నీ ఘోరకర్మయం దెందుకు నియోగించుచున్నావు ? (3-1) - అని తన దివ్యసఖుని, గురువును నిలబెట్టి అడుగును. కాగా, తాను చేయవలసిన కర్మ ఏది యైనను, దాని బాహ్యస్వభావమునకు వ్యక్తిగతముగా తా నెట్లు అతీతుడు గావలెనో, కార్యనిర్వాహకశక్తియగు ప్రకృతియే కర్మకర్త్రి యనియు, తన ప్రాకృతసత్త ఉపకరణమాత్రమే యనియు, భగవంతుడు ప్రకృతి మఱియు కర్మల అధీశ్వరు డనియు ఎట్లు చూడవలెనో, చూచి, కోరిక గాని, అహంకారముయొక్క ఎన్నిక గాని లేక ఆ కర్మల నొక యజ్ఞముగా నతని కెట్లు అర్పించవలెనో, అప్పు డర్జునినికి చూపబడెను. ఈ యే వస్తువులను అంటక, వీనికిపై నున్న భగవంతుడు, పైనుండియు, మానవుడు, ప్రకృతి మఱియు వాని క్రియలయందు తననుదా నభివ్యక్తము చేసికొనుచున్నా డనియు, సర్వము ఈ దివ్యాభివ్యక్తియొక్క చక్రగతియే యనియు గూడ అతనికి చూపబడెను. కాని ఇపుడు రూపము ధరించిన ఈ మహాసత్యము ముందు నిలబడినపుడు, దాని దివ్య విశాలతయందు బాహ్యయుద్ధముయొక్క భయంకరతను మఱింత ఎక్కువగా అర్జునుడు చూచును, భీతిచెందును, దానిని సహించలేకపోవును. విశ్వపురుషు డిట్లు ప్రకృతి యందు తననుదా నెందుకు అభివ్యక్తము చేసికొనవలెను ?-అను సందేహ మతనిలో నుదయించును. సృష్టించుచు, భక్షించుచు నుండు ఈ మర్త్యజ్వాల, ఈ విశ్వవ్యాపి సంఘర్షము, ఈ విపత్కర పరివర్తనములు, ఈ ప్రయాసక్లేశములు, ఈ ప్రాణి వినాశము - దీని కంతకు అర్థ మేమిటి ? కావున నతడు ప్రకటముగా ప్రాచీనప్రశ్న

వేయును, సనాతనప్రార్థన చేయును, "ఈ మహోగ్రరూపమున మాముందుకు వచ్చిన నీ వెవడివో తెలుపుము. ఆద్యుడవగు నిన్ను దెలియగోరుచున్నాను; ఏలన నీ యీ ప్రవృత్తిసంకల్ప మేమియో తెలియుటలేదు, ప్రసన్నుడవు కమ్ము (11-31)."

8. అంతిమ కర్మాదేశము : వినాశమే, భగవంతుడు బదులు పలుకును, నా ప్రవృత్తి వెనుకనున్న సంకల్పము, ఈ సంకల్పముతోనే కురుక్షేత్రమున నిలబడి యున్నాను. ఈ కురుక్షేత్రము ధర్మసాధనక్షేత్రము. కావున మానవకర్మక్షేత్రమున కిది సంకేత మని చెప్పుకొనవచ్చును-"ధర్మక్షేత్రే కురుక్షేత్రే" (1-1). కాలపురుషుని ప్రక్రియాఫలితముగా ఈ ప్రపంచవ్యాప్త వినాశము ప్రాప్తించినది. నా కొక దూరదర్శి ప్రయోజనము గలదు, అది నెరవేరి తీరును, ఒకడు పాల్గొనినను, పాల్గొనకపోయి నను, అది ఆగదు, మాఱను గూడ మాఱదు. ఏ కార్య మైనను భువిపై మానవునిచేత ఏమాత్రము చేయబడక పూర్వమే సనాతనమగు నా సంకల్పనేత్రము దానిని చేసియే యుండును. కాలరూపమున నేను ప్రాత నిర్మాణములను పడగొట్టి, నవ్య, ప్రబల, భవ్యరాజ్యమును నిర్మించవలసియున్నది. పోగా దివ్య శక్తిజ్ఞానముల ఒక మానవో పకరణముగా నీవు, నీ వాపజాలని యీ సంగ్రామమున ధర్మముకొఱకు నడుముకట్టి, ధర్మవిరోధులను చంపి, జయించవలెను. ప్రకృతిలోని మానవాత్మవగు నీకు భోగము సైత ముండును - నాచే నొసంగబడిన ఈ యుద్ధఫలితమగు ధర్మన్యాయరాజ్యము నీ వుపభోగించవలెను. నీ అంతరాత్మయందు భగవంతునితో నేకమగుట, అతని ఆదేశమును స్వీకరించుట, అతని సంకల్పము నిర్వహించుట, ప్రపంచమున ఒక పరమప్రయోజనము సిద్ధించుటను ప్రశాంతముగా గమనించుట - ఇదియే నీకు కృతార్థత గావలెను. "నేను లోకక్షయకరుడగు విజృంభించిన కాలుడను, జాతులను నాశముచేయుటయే ఈ ప్రవృత్తి (workings) యందలి అట్టి నా సంకల్పము. నీవు లేకపోయినను శత్రుసైన్యమున నిలిచియున్న వా రెవరు బ్రతికి బయటబడరు (11-32). కావున లెమ్ము, యశమును బొందుము, శత్రువులను జయింపుము, సమృద్ధ రాజ్యము ననుభవింపుము. ఇతరులచేత గాక, నాచేతనే వా రిప్పటికే నిహతులైనారు ఓ సవ్యసాచీ, నీవు నిమిత్తమాత్రము గమ్ము (11-33). నాచేత వధింపబడియే యున్న ద్రోణుడు, భీష్ముడు, కర్ణుడు, జయద్రథుడు మఱియు తక్కిన యోధవీరులను నీవు వధింపుము; బాధపడకుము, కలతజెందకుము. విజృంభించుము, ప్రత్యర్థులను

రణమున జయించెదవు (11-34).” ఈ మహా ఘోరకర్మయొక్క ఫలితము ముందే చూడబడి, వాగ్దానముచేయబడినది. అయితే యిది వ్యక్తి వెంటదగిలిన ఫలితముగాదు, ఏలన ఇచ్చట ఫలాసక్తి లేదు; ఇది భగవదిచ్ఛయొక్క ఫలితము, అతడు అప్పగించిన కర్మను సాధించినపుడు కలుగు యశోవిజయరూపము, భగవంతునిచేత తన విభూతిరూపమున తనకే ఇవ్వబడిన యశము. ఇది ప్రపంచయుద్ధముయొక్క ధర్మపక్షము వహించిన ప్రధానవీరునికి చివరిసారిగా నిచ్చిన అలంఘ్య కర్మాదేశము.

9. <u>పురోగతికి వినాశ మావశ్యకము</u>: కాలము మఱియు ప్రపంచపురుషరూపమున అభివ్యక్తమైన కాలాతీతుడే ఈ కర్మాదేశము నిచ్చినవాడు. ఏలన “నేను లోకసంహారకుడనగు కాలుడను”—అని భగవంతుడు చెప్పినపుడు, తాను కాలపురుషుడు మాత్రమే యని గాని, కాలస్వరూప మంతయు వినాశమే యని గాని దాని అర్థము కాదు. పరంతు ఈ వినాశము తన ప్రస్తుత ప్రవృత్తి మాత్రమే. వినాశము సదా సృష్టితో అడుగుకలిపి నడుచును; నాశముచేసి, నవీకరించుటచేతనే ప్రాణాధీశ్వరుడు సుదీర్ఘమగు తన ప్రాణరక్షణ కర్మను సాగించును. ఇంకను వినాశము పురోగతికి ప్రథమనియమము. ఆంతరముగా, తన నిమ్న నిర్మాణములను భంగించని మానవుడు ఒక అధికతర జీవనము నందుకొనజాలడు. బాహ్యముగానైతము, ఏ జాతి లేక సమాజము తన గత జీవనరూపములను నాశమొనర్చి, క్రొత్తవానిని నెలకొల్ప మితిమీఱి జాగుసేయునో, అది స్వయముగా క్రుళ్లి నశించును, మఱియు దాని శిధిలములతో ఇతరజాతులు, సమాజములు నిర్మించబడును. ఉదాహరణకు, పూర్వము భువిపై జీవించిన మహాకాయ జంతులను సమాప్తము గావించి, మానవుడు భూతలముపై తన కొంక స్థానమును సాధించుకొనెను. అటులే దేవతలు అసురులను ఖండించి, విశ్వమున భాగవతధర్మమును అవిచ్ఛిన్నముగా సాగింతురు. తగిన కాలమునకు పూర్వమే ఎవడీ సంగ్రామ, వినాశనియమమును దూరముచేయజూచునో, విశ్వపురుషుని అధికతరసంకల్పమునకు విరుద్ధముగా అతని చేష్ట వ్యర్థమే యగును; ఎవ డేని తన నిమ్నతర అంగముల దుర్బలతావశమున దానినుండి విముఖు డగునో, అతడు యథార్థసుగుణమును గాక, కఠోరతర జీవనసత్యము నెదుర్కొనుటకు వలయు ఆధ్యాత్మికధైర్యముయొక్క అభావమునే జూపుచున్నాడు. అర్జును డాదిలో నిటులే చేసెను, కావున అతని వైముఖ్యము క్షుద్రమగు హృదయదౌర్బల్యము గాను, ఆధ్యాత్మిక నిర్వీర్యతగాను నిందించబడెను — “క్లైబ్యం, హృదయ

దౌర్బల్యం " (2–3). మానవుడు అధికతరమగు తన అమరత్వనియమమును. కనుగొనుటద్వారానే సంగ్రామనియమము నతిక్రమించగలడు. ఈ అమరత్వనియ మెచ్చట సదా వర్తించునో, ఎక్కడ దీని నన్వేషించవలెనో, సత్తయొక్క అట్టి ఉచ్చతరభూమికలయందు దీని నన్వేషించు కొందరు మృత్యువు శాసించు నీ ప్రపంచ మును సన్యసింతురు. ఇది ఒక వైయక్తిక పరిష్కారము, దీనివలన మానవజాతియందు గాని, ప్రపంచమునందు గాని ఎట్టి మార్పు రాదు; పైగా ప్రపంచ మా మేరకు కష్ట తరమగు తన పరిణామప్రయాణములో తోడ్పడ గల ఆధ్యాత్మికశక్తిని కోల్పోయిన దగును.

10. రుద్రుని ఋణము తప్పదు : అయినపుడు, కాలపురుషుడు మహా సంగ్రామరూపమున తారసిల్లి నపుడు శ్రేష్ఠమానవుడు, దివ్యకర్త, వైశ్వసంకల్పము యొక్క వివృతవాహిని ఏమి చేయదగును ? తన స్వభావవేగముచేతనే, తనలోపలి శక్తిచేతనే అతడు యోధుడుగా ఆయుధము చేపట్టవలదా, మానవుల నాయకుడు మఱియు మార్గదర్శి లేక ప్రోత్సాహకుడు గావలదా ? వెనుతగ్గి, చేతులు ముడుచుకొని, దూరమునుండి యుద్ధమునకు తన విరోధమును దెలుపవలెనా ? కాని యిట్టి విరమణము వలన నేమియు కాదు, అది సంహారసంకల్పముయొక్క పరిపూర్తిని ఆపజాలదు, పైగా శూన్యమును గల్పించి, గజిబిజినే అధికముచేయును. " ఋతేఽపి త్వా " (11–32) – నీవు విరమించినను, భగవంతుడు ఎలుగెత్తి పలుకును, నా సంహార సంకల్పము సిద్ధించియే తీరును. ఒకవేళ అర్జునుడు విరమించినను, కురుక్షేత్ర యుద్ధమే జరుగకపోయినను, అది రానున్న సంకరమును, అవ్యవస్థను, వినాశమును, కేవలము పొడిగించి, మఱింత విషమింపజేయును. ఏలన ఈ సంకరాదులు కాకతాళీయ ములు గావు, పరంతు నాటబడిన ఒక విత్తనము, కోసికొనక తప్పని ఒక పంట. ఎవరు చిన్న వాయుబీజమును నాటుదురో, వారికి పెద్ద ఝంఝామారుతసస్యము ప్రాప్తించక తప్పదు. అంతే కాదు, అర్జునుని స్వీయస్వభావమే నిజానికి తాను కోరు వాస్తవవిరమణ కవకాశ మివ్వదు – " ప్రకృతిస్ త్వాం నియోక్ష్యతి " (18–59). భగవానుడు గీతాంతమున అర్జును నిట్లు హెచ్చరించును, " అహంకారావేశమున, నేను యుద్ధము చేయను – అని నీవు తలంచినను, ఆ నీ నిశ్చయము వ్యర్థము : ప్రకృతియే నిన్ను నీ కర్మకు కాడికి ఎద్దునువలె, కట్టగలదు (18–59). స్వీయ స్వభావజన్యమైన స్వీయకర్మచేతనే నీవు బద్ధుడవై, మోహామువలన దేనిని చేయ

గోరవో, దానిని వివశముగా చేసితీరెదవు" (18-60). పోగా యుద్ధమునకు మఱి యొక రూపము నిచ్చినచో ? భౌతిక ఆయుధములను గాక, ఒక విధమగు అంతరాత్మ బలమును, ఆధ్యాత్మికశక్తిని ప్రయోగించినచో ? కాని అదియు యుద్ధక్రియయొక్క రూపాంతరమే యగును; అప్పుడును విధ్వంసము జరిగియే తీరును, మఱియు యుద్ధ మున కివ్వవలసిన రూపము మానవేచ్ఛపైన గాక, భగవదిచ్ఛపైననే ఆధారపడును. అంతియే కాదు, వినాశబలము ఈ నూతన ఆధ్యాత్మికశక్తిని భక్షించి, మఱింత బలపడి, మఱింత భయంకరవేగమును బొందవచ్చు, కాళి విజృంభించి, దశదిశలను తన దారుణతర అట్టహాసములతో నింపవచ్చును. మానవహృదయానికి శాంతి యోగ్యత సిద్ధించుదనుక, నెట్టి వాస్తవశాంతియు సంభవము కాదు; రుద్రునికి ఋణము చెల్లించనంతవఱకు, విష్ణుధర్మము రాజ్యమేలజాలదు. అయినపుడు యుద్ధమునుండి ప్రక్కకు దిరిగి, ఇంకను పరిణతి జెందని మానవజాతికి ప్రేమ మఱియు ఏకతల ధర్మమును బోధింపవలెనా ? ఏకతాప్రేమలను బోధించువా రుండవలసినదే, ఏలన అంతిమమోక్షమున కదే మార్గము. కాని మానవునిలోని కాలపురుషుడు పరిణతిజెందు వఱకు, బాహ్య ప్రస్తుతసత్యముపై ఆంతర చరమసత్యము ప్రాబల్యము వహించ జాలదు. క్రీస్తు, బుద్ధుడు వచ్చిరి, వెళ్ళిరి; కాని ఇంకను రుద్రుడే ప్రపంచమును తన వశమున, తన అరచేతిలో ఆడించుచున్నాడు. ఇట్టి మధ్యసమయములో, ఆహంకారిక బలమునుండి లాభము పొందు (ఆసుర) శక్తులచేతను, వారి దాసులచేతను వ్యథితము, పీడితము నగు మానవజాతి తన పురోగతికి చేయు ప్రచండ ప్రయాసమునందు సంగ్రామవీరుని ఖడ్గము నిమిత్తమును, సంగ్రామప్రవక్త వాణి నిమిత్తమును మొఱ పెట్టుకొనును.

11. <u>నిరహంకార కర్మవిధానము :</u> నిరహంకారముగాను, దైవవిహిత మని తాను చూచిన మహాయుద్ధమునకు ఒక నిమిత్తము మఱియు ఉపకరముగాను (11-33), తనయందును, అందరియందును గల భగవంతుని, ఆధారభూతమగు సంతతస్మృతితోను—"మాం అనుస్మరన్" (8-7) - మఱియు తన ప్రకృతి ప్రభువు తనకు నియమించిన ఇతరవిధములందును భగవదిచ్ఛను నిర్వహించుటయే అతనికి నియుక్తమైన ఉత్తమమార్గము. అతడు వైయక్తికవైరమును, క్రోధమును, ద్వేష మును, ఆహంకారిక కామన మఱియు నావేశమును తనలో వహించడు. అతడు కలహమునకు కాలుదువ్వడు, లేక ప్రచండాసురునికి వలె నతనికి హింసా, వినాశముల

పట్ల లాలన యుండదు; కాని లోకసంగ్రహార్థము (3–20) అతడు కర్మ సేయును. కర్మ కావల, తాను దేనికొఱకు పోరాడుచున్నాడో, అట్టి కర్మగమ్యము నతడు చూచును. ఏలన కాలరూప భగవంతుడు సైతము వినాశముకొఱకే వినాశమునకు బూనుకొనడు, ఒక మహత్తరరాజ్యమును, ఒక ప్రగతిశీల అభివ్యక్తిని చక్రగతిరూప ప్రక్రియయందు సాధింపనెంచి, మార్గము నిష్కంటకము గావించుటకే అత డట్లు చేయును – "రాజ్యం సమృద్ధం" (11–33). సంగ్రామ మహత్త్వమును, విజయ వైభవమును – ఆవశ్యక మగుచో, పరాజయవేషమున వచ్చు విజయవైభవమును – అతడు, బాహ్యమనస్సు చూడజాలని గభీరతరార్థమున గ్రహించును, మఱియు తన సమృద్ధరాజ్యభోగమున మానవుని గూడ ముందుకు నడుపును. సంహారకర్తముఖమును జూచి భీతిల్లక, ఆ ముఖములోపల అవ్యయ సనాతనాత్మను, ఆ ముఖమువెనుక మానవనేత, సర్వభూతసుహృదుడు (5–29) నగు దివ్యసారథిముఖమును జూచును. ఒకసారి ఈ వికరాళ విశ్వరూపమును జూచి, అర్జునుడు దాని సత్యము నంగీకరించి నపుడు, ఈ ధైర్యదాయక సత్యవివరణమునకే తక్కిన అధ్యాయము వినియోగింప బడును; అంతమున ఈ అధ్యాయము సనాతనుని ఒక పరిచితతర ముఖమును, శరీరమును ప్రకటించును (11–50, 51).

# 11. విశ్వరూప దర్శనము

## ద్వివిధ రూపము

1. <u>మృత్యు వొక బాహ్యరూపము :</u> విశ్వరూపముయొక్క భయంకర పార్శ్వమును దర్శించుటచేత గలిగిన కంప మింకను సమయకపూర్వమే, భగవంతుని సమాధానము విని, అర్జునుడు పలికిన ప్రథమవచనములు మృత్యు ముఖము వెనుక నున్న సముద్ధారక, సమాశ్వాసక సత్యతను గొప్పగా ప్రశంసించును. అత డిట్లు చాటును, "ప్రపంచము, ఓ కృష్ణా, నిన్ను కీర్తించుచు హర్షించు చున్నది, అది సముచితమే. రాక్షసులు భయభీతులై చిందరవందరగా పాఱిపోవు

చున్నారు; సిద్ధసంఘములు భక్తితో ప్రణమిల్లుచున్నారు (11-36). వారు, ఓ మహాత్మా, ఎందుకు నమస్కరించరు? కారణము, నీ వాదిస్రష్టవు, ఆది కర్మకర్తవు, సృష్టికర్తయగు బ్రహ్మకంటెను మహత్తరుడవు. ఓ అనంత, దేవేశ, జగన్నివాస, నీ వక్షరమవు, నీవు సత్తును, అసత్తును, వానికి పరమును గూడ (11-37). నీవు పురాణపురుషుడవు, ఆదిదేవుడవు, సమస్తమునకు పరమ విశ్రాంతిస్థానమవు; నీవు వేత్తవు, వేద్యుడవు, పరమపదమవు; ఓ అనంతరూప, ఇదియంతయు నీ విస్తారమే (11-38). యముడు, వాయువు, అగ్ని, సోముడు, వరుణుడు, ప్రజాపతి, తాతలకు తాత - అందరు నీవే. వేయి సారులు నీకు నమస్సులు, తిరిగి నమస్సులు, మఱల నమస్సులు (11-39); ముందు, వెనుక, అన్నివైపుల నీకు నమస్సులు, ఏలన అన్నివైపుల వ్యష్టియు, సమష్టియు నీవే. వీర్యమునం దనంతుడవు, విక్రమమునం దమితుడవు నగు నీవు సర్వమును వ్యాపించి, సర్వమునై యున్నావు (11-40)."

2. <u>తెలిసియు తెలియనితనము</u>: కాని ఈ పరమ, వైశ్వ పురుషుడు ఇచ్చట అర్జునుని కంటిముందు మానవముఖముతోను, మర్త్యశరీరముతోను దివ్య మానవుడుగా, దేహధారిభగవంతుడుగా, అవతారముగా ఇతఃపూర్వము నివసించిన వాడే. అర్జునుడు మానవభావమును మాత్రమే చూచి, భగవంతునితో కేవల మానవప్రాణిగానే వ్యవహరించెను. అతడు భగవంతుడు ధరించిన ముసుగును భేదించి, దేనికి మానవత్వము పాత్రము మఱియు సంకేతమో, అట్టి దేవత్వమును దర్శించలేదు; కావున ఇపుడు భగవంతుని క్షమాభిక్షను వేడుచున్నాడు: "నా మానవసఖుడవే యని తలంచి, ఓ కృష్ణా, ఓ యాదవా, ఓ సఖా యని పిలుచుచు, నీ మహిమ నెఱుంగక, లేక అజాగ్రత్తవలన, నే నే దారుణ అమర్యాదకు బాల్పడితినో, మఱియు ఆహారవిహారములందు పరిహాసమున కే అగౌరమును జూపితినో, ఓ అప్రమేయ, దానినంతను నీవు క్షమింతువు గాక! (11-41, 42). చరాచర లోకమునకు నీవు పితవు; నీవు గురువులకు గురువవు గనుక, సర్వపూజ్యుడవు; నీతో సముడే లేనపుడు, అధికు డెట్లుండును? లోకత్రయమునందు నీది సాటిలేని ప్రభావము! (11-43). కావున నమస్కరించి, సాష్టాంగపడి, పూజ్యప్రభూ, నీ ప్రసాదము నర్థించుచున్నాను. ఓ దేవా, తండ్రి పుత్రునివలెను, సఖుడు సఖునివలెను, ప్రియుడు ప్రేయసినివలెను నన్ను మన్నించుము, నా అపరాధమును క్షమింపుము (11-44). ఇతఃపూర్వమెవ్వరు జూడని దానిని జూచి; హర్షపులకితుడనైతిని, కాని

నా మనస్సు భయవ్యాకులమైనది. ఓ దేవా, నీ యా ఇతరరూపమును జూపుము. పూర్వమువలెనే కిరీటధారివై, గదాచక్రములను ధరించిన నిన్ను దర్శించగోరు చున్నాను. ఓ సహస్రబాహూ, ఓ విశ్వమూర్తీ, నీ చతుర్భుజరూపమును ధరించుము (11-45, 46).

3, భయమునకు కారణము లేదు : ఈ భయావహ రూపముల వెనుక నున్న గుప్తసత్యము ప్రోత్సాహక, ఆనందపూర్ణసత్య మని అర్జునుని ప్రథమ వచనములు సూచించును. భగవంతుని కీర్తనయందును, సాన్నిహిత్యమునందును ప్రపంచహృదయమునకు హర్షమును గల్పించున దేదియో ఒకటి గలదు. ఆ 'ఒకటి' ఏది యన, కాళియొక్క తామసముఖమునందు నేది మనకు మాతృముఖమును జూపించునో, అట్టి జ్ఞానముయొక్క గంభీరానుభవము - ఈ అనుభవముచేత వినాశ మధ్యమునందును సర్వభూతసుహృదునియొక్క రక్షకబాహువులను గనుగొనగలము, అశుభమధ్యమునందును ఒక విశుద్ధ నిర్వికారదయాళుతను, మఱియు మరణమధ్యము నందును అమరత్వాధీశ్వరుని కనుగొనగలము. పోగా, దివ్యకర్మకు అధీశ్వరుడగు వాని భయముచే రాక్షసశక్తులు వినష్టము, పరాజితము, అభిభూతమునై పాఱిపోవును. అమరేశ్వరుని నామములను దెలిసి, కీర్తించుచు, అతని సత్తయొక్క సత్యమునందే నివసించు సంపూర్ణ సిద్ధులు - దేవతావిశేషులు - అతని ప్రతిరూపమునకును నమస్కరించి, ఆ రూపము దేనికి ఆలయమో, దేనికి సంకేతమో, దాని నెఱుంగుదురు. నాశనముచేయబడవలసినది తప్ప, అనగా అశుభము, అజ్ఞానము, రాక్షసశక్తులు తప్ప, ఏదియు నిజముగా భయపడ పనిలేదు. ఉగ్రాకార రుద్రుని సర్వగతియు, క్రియయు, సంసిద్ధి, దివ్యప్రకాశము మఱియు పరిపూర్ణత నపేక్షించియే గదా.

4. కాలగతరూపము, కాలాతీతరూపము : ఏలన ఈ పురుషుడు, ఈ భగవంతుడు తన బాహ్యరూపమునందు మాత్రమే పరిమితరూపములను ధ్వంసము చేయు సంహారకాలుడు : కాని తాను స్వతః అనంతుడు, వైశ్వ దేవతల ఈశుడు, ఇతనియందే ప్రపంచము మఱియు దాని క్రియ భద్రముగా నెలకొనియున్నవి (11-37). అతడు త్రిమూర్తికి పైన, సదా పుట్టించుచుండు ఆదిస్రష్ట, అతడు బ్రహ్మ యనబడు సృష్టిశక్తిరూపమునకంటె నధికుడు (11-37), ఈ బ్రహ్మసృష్టి

మాత్రమే స్థితివినాశములకు లోనగు శబలసృష్టి. వాస్తవ దివ్యసృష్టి శాశ్వతము; అది పరిమితవస్తువులలో శాశ్వతముగా అభివ్యక్తమైన అనంతుడు, అది అంతరాత్మల అనంతతయందును, వాని క్రియల అద్భుతమునందును, వాని రూపముల సౌందర్యము నందును సదా దాగుడుమూతలాడుచుండు దివ్యపురుషుడు. అతడు సనాతన అక్షరము (11-37); అతడు సదసత్తులయొక్కయు, అవ్యక్త అభివ్యక్తముల యొక్కయు ద్వివిధరూపము. కాని వీని యన్నింటి కావల నున్న అతని స్వరూపము 'తత్తు', 'పరము'; ఈ పరుడు సర్వ క్షరవస్తువులను ఒకవిధమగు కాలముయొక్క అఖండ నిత్యతయందు ధరించును, ఈ నిత్యతయందు అంతయు వర్తమానమే. అతడు తన అక్షరాత్మను ఒక కాలరహితనిత్యతయందు గలిగియుండును, కాగా కాలమును, సృష్టియు ఈ నిత్యతయొక్క ఒక సంతత విస్తరణశీల రూపమే.

5. <u>సర్వసమన్వయ సత్యము</u> : అతని ఈ పరభావమే సర్వమును సమన్వయపఱచు అతని పరమసత్యము. ఈ పరమసత్య మొక పరమాత్మ, ప్రపంచ మితని పరప్రకృతియొక్క ఒక ఉత్పత్తి, తదనంతునియొక్క ఒక హీనతర రూపము; అటులే ఈ పరమసత్యము ఏకమాత్ర పురాణపురుషుడు (11-38), ఇతడే సుదీర్ఘ కాలపరిణామములపై నధ్యక్షత వహించును; మఱియు నది ఆదిదేవుడు, అందరు నీ దేవునియొక్క బిడ్డలును, ఆత్మలును; ఇవి తమ సత్తయందు అతని అస్తిత్వము చేతనే ఆధ్యాత్మికముగా ఉచితత్వమును బొందును; ఇంకను ఆ సత్య మొక పరమవేత్త (11-38), ఇతడే మానవునియందు, తనయొక్కయు, ప్రపంచముయొక్కయు, భగవంతునియొక్కయు జ్ఞానమును వికసింపజేయును (10-11); చివర కా సత్యము ఏకమాత్ర వేద్యపురుషుడు, ఇతడు స్వయముగా తనను మానవుని హృదయమునకు, మనస్సునకు, ఆత్మకు ఆవిష్కరించుకొనును, అందువలన జ్ఞానముయొక్క ప్రతి నూతనవికాసమును అతనియొక్క ఒక ఆంశికప్రకటనమే యగును; ఇట్లు తుద కతడు సన్నిహితముగా, గభీరముగా, సమగ్రముగా చూడబడును, కనుగొన బడును. అతడింకను ప్రపంచమును పుట్టించి, ధరించి, తనలోనికే స్వీకరించు పరమధామము (11-38). తన సర్వసమర్థశక్తిచేతను, నిరంతర సృష్టివిషయకమగు తన అద్భుత ఆత్మ-పరికల్పన (self - conception), ఊర్జము (energy) మఱియు ఆనందముచేతను తన సత్తయందే అత డీ ప్రపంచమును విస్తరించును (11-38). అంతయు నతని భౌతిక, ఆధ్యాత్మికరూపముల ఆనంత్యమే యగును. చిన్న, పెద్ద

దేవత లందరు నతడే (11-39); అతడు సర్వప్రాణులకు తండ్రి (11-43), అందరు అతని పుత్రులు మఱియు ప్రజలు. అతడు బ్రహ్మకు బ్రహ్మ, సజీవభూతముల ఈ విభిన్నజాతులయొక్క ప్రజాపతులకు నెవడు పితయో, అతనికి పిత. ఈ సత్యము మఱలమఱల ఒత్తి చెప్పబడును. "సర్వము" (11-40) నతడే యని మఱల నిచ్చట వక్కాణించబడినది. అతడు అనంత విరాట్పురుషుడు, అతడు ప్రతివ్యక్తియు, ప్రతి వస్తువును, మనలో ప్రతివానియందలి ఏకమాత్ర శక్తియు, సత్తయు నతడే, ఈ భూతసమూహములుగా తనను బహిర్గతము గావించుకొను అనంత ఊర్జ మతడే; సర్వకాలప్రవాహములను, ప్రకృతియందలి పురుషునియొక్క సర్వఘటనలను తన నుండియే నిర్మించు గతి మఱియు క్రియయొక్క అమేయసంకల్పమును, మహా శక్తియు నతడే యగును.

6. <u>మానవునియందలి దేవత్వము</u> : ఇట్లు భగవంతుని సర్వాత్వమును ఒత్తి చెప్పి, గీతాచర్చ సహజముగనే మానవునియందు గల ఆ మహాదేవుని ఉనికి వైపునకు మఱలును. ఇచ్చట విశ్వరూపదర్శియొక్క అంతరాత్మ మూడు క్రమగత సూచనలచే ముద్రితమగును. మొదట, ఎవడు క్షణికమానవునివలె భువిపై ఆహార విహారములయందు తనతోబాటు సంచరించెనో, తన పరిహాసమునకు, అమర్యాదకు గూడ గుఱియయ్యెనో, యుద్ధము, మంత్రాంగము మఱియు 'మానవ' పుత్రుని సాధారణవిషయములందు ఎవడు సచివుడుగా నుండెనో, అట్టి 'మానవ' పుత్రుని ఈ మర్త్యశరీరమునందు సదా యుండియేయున్న ఒక మహత్త్వ మిపు డతని చిత్తములో గ్రుచ్చుకొనును — పరమమర్మము గల ఆ గుప్తమహత్త్వము ఒక దేవత్వము, ఒక అవతారము, ఒక వైశ్వశక్తి, ఒక అఖండసత్యము, ఒక పరమ అతీతత. దేనియందు మానవునియొక్కయు, అతని జాతియొక్కయు సర్వమర్మము మూతవడియున్నదో, దేనినుండి సర్వ ప్రపంచ-జీవనము అవర్ణనీయమహత్త్వము గల తన అంతరార్థమును బొందునో, అట్టి రహస్యదేవత్వము పట్ల అత డింతవఱకు అంధుడు. వైయక్తికకాయమునందలి వైశ్వపురుషుని, మానవతారూపము ధరించిన భగవంతుని, ఈ ప్రాకృతసంకేతము (శరీరము) యొక్క అతీత అంతర్నివాసిని ఇపుడు మాత్రమే అతడు దర్శించును. ఈ దృశ్యమాన వస్తువు లన్నిటియొక్క ఈ సువిశాల, అనంత, అప్రమేయ సత్యవస్తువు నత డిపుడు మాత్రమే చూచెను. ప్రతివ్యష్టిరూపమును అతిక్రమించియున్నను, ప్రతివ్యష్టివస్తువు దేనికి ఒక నివాస

గృహమో, ఆ యీ అపార విశ్వరూపము నత డిపుడు మాత్రమే గాంచెను. ఏలన ఈ మహాసత్యము వ్యష్టి సమష్టులయందు సమము, అనంతము, ఏకరూపము. ఇంకను, అతని వెనుకటి గ్రుడ్డితనమును, కేవల బాహ్యమానవుడుగా ఈ భగవంతునిపట్ల అతని వర్తనమును, శారీరిక, మానసిక సంబంధములను మాత్రమే తాను చూచుట - ఇది యంతయు అక్కడున్న మహత్త్వము పట్ల తాను చేసిన అపరాధముగా నిపు డతనికి తోచును. ఏలన తాను కృష్ణా, యాదవా, సఖా యని పిలిచినవాడు ఈ అమేయ మహిమయే, ఈ నిరుపమప్రభావమే, ఎవడు అన్నింటియందును ఏకమో, అందరు ఎవనియొక్క ప్రజలో అట్టి ఈ పురుషుడే. "అవజానన్ మానుషీం తను మాశ్రితం" (9-11) - అను రీతిని బాహ్యమానవతను గాక, దానినే అర్జునుడు ఆదరముతో, విధేయతతో, పూజ్యభావముతో చూచియుండవలెను.

7. <u>మానవసంబంధమును సత్యమే</u> : కాని మానవరూపము మఱియు మానవసంబంధము సైతము సత్య మనునదియే రెండవ సూచన, ఈ సత్యత విశ్వరూపయొక్క భయంకరస్వరూపము ననుగమించి, మన మనస్సునకు దాని తీవ్రతను తగ్గించును. అతీతభావమును, వైశ్వపార్శ్వమును చూడవలసినదే, లేనిచో మానవతా పరిమితులను అతిక్రమించజాలము. ఆ ఏకతాసాధక ఏకత్వమున అంతయు అంతర్గతము గావలెను. కాని తనమట్టుకుదాను ఆ దర్శనము అతీతాత్మకును, అపరప్రకృతి యందు బద్ధము, పరివృతము నగు ఈ అంతరాత్మకును మధ్య పెద్ద అఖాతమును గల్పించును. తన లఘూకృతము గాని పూర్ణప్రభయందు అనంతుని సన్నిధి వైయక్తిక ప్రాకృతమానవుని అల్పత్వము భరించలేనంత ప్రచండముగా నుండును. కావున తన స్వీయ వైయక్తిక ప్రాకృతసత్తయందే, తనకు సన్నిహితముగా ఈవైశ్వ భగవంతుని జూడగల ఒక అనుసంధానము (link) గావలెను, అనగా భగవంతుడు తన అప్రమేయ వైశ్వశక్తిచేత తనను శాసించుటయే గాక, ఒక ఘనిష్ఠ వైయక్తిక సంబంధముచేత తనకు ఆధారముగా నుండి, తనను ఏకతలోనికి ఉద్ధరించునిమిత్తము అతడు మానవరూపము గూడ ధరించవలెను. అనంతునిముందు ఏ భక్తితో సాంత జీవుడు మ్రొక్కుచున్నాడో, ఆ భక్తి భగవంతుని పితృత్వ, సఖ్య, ప్రియత్వభావము నందు నివసించి నపుడు అత్యంత మధురమై, ఘనిష్ఠభక్తిగా గాంభీర్యమును సంతరించుకొని, ఏకతాసత్యములోనికి మాఱజొచ్చును. ఇది సాధ్యమే, ఏలన, భగవంతుడు మానవాత్మయందును, శరీరమునందును నివసించును; మానవమనస్సును,

రూపమును దగ్గరకు తీసికొని, వస్త్రములాగున ధరించును. మర్త్యశరీరమునందు ఆత్మ కుండు మానవసంబంధముల నపుడు అతడును ధరించును, మఱియు నీ సంబంధములు భగవంతునియందు తమ పూర్ణతమార్థమును, మహత్తమరూపమును బొందును. ఇది వైష్ణవభక్తి, దీని బీజము గీతయం దున్నను, ఇది తర్వాతనే అధికతర గంభీరము, ప్రహర్షపూర్ణము, అర్థవంతము నగు విస్తారమును బొందును.

8. మధ్యవర్తిరూపము : మఱియు నీ రెండవ సూచననుండి వెంటనే మూడవది ఉదయించును. విశ్వాతీతము, విశ్వాత్మకము నగు పురుషుని రూపము బలము సంతరించుకొనిన విముక్తాత్మకు ఒక ప్రబల, ప్రోత్సాహక వస్తు వగును, ఒక శక్తిమూల మగును, ఒక సమీకర, సంశోధక, సర్వసమర్థక దర్శన మగును ; కాని సామాన్య మానవున కది దుర్భరము, భయావహము, సంబంధాయోగ్యము నగును. అది ప్రోత్సాహక సత్య మైనను, అది దృష్ట మైనను, సర్వసంహారక కాల పురుషునియొక్క భయంకర మహాప్రబలరూపము వెనుక దానిని గ్రహించుట కష్ట మగును. కాని కాలపురుషుని ఉగ్రరూపమే గాక, దివ్యనారాయణుని అనుగ్రహపూర్ణ మధ్యవర్తిరూపమును గలదు; ఈ నారాయణుడు మానవునికిని, మానవునిలోపలను అతిసన్నిహితముగా నుండును, అతనికి ఉపకారశక్తిరూపమగు నాలుగు చేతు లుండును, అతడు జీవనసంగ్రామమునకు, ప్రయాణమునకు దివ్యసారథి; అతడు భగవంతుని, మానవరూపము ధరించిన సంకేతము, సహస్రబాహువులతో గూడిన విరాట్పురుషుడు గాడు. ఈ మధ్యవర్తిరూపమునే మానవుడు సదా తనముందు తన కాధారముగా గలిగియుండవలెను. ఏలన నారాయణుని ఈ ఆకృతియే ధైర్యము నిచ్చు సత్యమునకు సంకేతము. అది ఆధ్యాత్మిక బృహదానందమును సన్నిహితము, ప్రత్యక్షము, సజీవము, గ్రహణయోగ్యము గావించును ; జగద్వ్యాపారము తన బ్రహ్మాండ పరిభ్రమణము మఱియు తిరోగమనపురోగమనముల వెనుక, మానవుని అంతఃపురుషడు మఱియు జీవనమునిమిత్తము, ఈ బృహదానందమునందే పర్యవ సించును, అదే దాని అద్భుత శుభాంతము. ఆ జగద్వ్యాపారముయొక్క పర్యవసానము దేహము ధరించిన మానవాత్మకు ఒక సంయోగము, ఒక సాన్నిహిత్యము, జీవేశ్వ రుల ఒకే సంతతసఖ్యము నగును; ఈ సఖ్యమునందు మానవుడు ప్రపంచమున భగవంతునికొఱకు జీవించును, భగవంతుడు మానవునియందు నివసించుచు, అంతు బట్టని ప్రపంచప్రక్రియను మానవునియందు తాను సాధించదలంచిన లక్ష్యముల

దిశగా నడుపును. మఱియు నీ లక్ష్యముల కావల ఇతోధికముగా అద్భుతమగు ఏకతయు, సనాతనుని చరమరూపాంతరములందు నివాసము సిద్ధించును.

9. <u>ఆత్మయోగమువలన ఆత్మప్రకటనము</u> : అర్జునుని ప్రార్థనను మన్నించి, భగవానుడు తన సామాన్య నారాయణరూపమును "స్వకం రూపం" (11-50)-తిరిగి ధరించును; దయ, ప్రేమ, మధురిమ. సౌందర్యములతో గూడిన ఈ రూపమునే అర్జునుడు గోరెను. కాని ముందు తా నిపుడు మఱుగుపఱచనున్న పూర్వ మహారూపము యొక్క అగణ్య ఆంతర్యమును ప్రవచించును. "ఇపుడు నీవు చూచుచున్న రూపము," భగవానుడు వచించును, "నా పరమాకారము, తేజోమయము, వైశ్వము, ఆద్యము నగు నారూపము ; నీవు తప్ప మానవులందు మఱి యెవ్వరు దీనిని చూచియుండ లేదు. నేను నా ఆత్మయోగముచేత దానిని జూపినాను (11-47). ఏలన అది సాక్షాత్తు నా ఆత్మ మఱియు పురుషభావముయొక్క రూపము, అది విశ్వసత్తయందు స్వయముగా రూపము ధరించిన పరమపురుషుడు. [1] మఱియు నాతో పూర్ణయోగమునందున్న అంతరాత్మ ఎట్టి నాడీకంపనము గాని, మనోవ్యాకులము గాని లేకయే దానిని చూచును ; ఏలన అతడు దాని ఆకారమునందు భయంకరము, దుర్భరము నగు దానిని మాత్రమే గాక, సమున్నతము, ధైర్యప్రదము నగు దాని ఆంతర్యమును సైతము దర్శించును. నీవును అటులే భయము, సంభ్రమము, అవయవవిషాదము లేక దానిని వీక్షింపదగును (11-49); కాని నీ నిమ్నప్రకృతి యింకను ఉత్కృష్ట బలము మఱియు ప్రశాంతితో దాని నవలోకింప సిద్ధముగాలేదు గాన, నీనిమిత్తము నా నారాయణాకృతిని తిరిగి ధరింతును; దీనియందు మానవమనస్సు తన మానవ భావమునకు పరిపెట్టబడిన, స్నేహమయభగవంతుని వ్యష్టిరూప శాంతిని, సాహాయ్యమును, సమ్మోదమును గాంచును. ఆ మహత్తరరూపము" - ఆ రూప మంతర్ధానమైన పిమ్మట గూడ ఈ మాట తిరిగి చెప్పబడును - "అపరూపమగు అత్యున్నత ఆత్మల నిమిత్తము మాత్రమే. దేవతలు సైతము దీనిని దర్శింప నిత్యము కాంక్షింతురు. వేదము, తపము, దానము, లేక యజ్ఞముచే దానిని బొంద శక్యముగాదు. ఏ భక్తి సర్వభూతములందు నన్ను మాత్రమే చూచునో, పూజించునో, ప్రేమించునో, అట్టి అనన్యభక్తిచేతనే దానిని చూడవచ్చును, ఎఱుంగవచ్చును, దానిలో ప్రవేశించ వచ్చును."

---

[1] కొటేషన్సులోని ఈ వాక్యములు కొన్ని యథాతథముగా మూలమునందులేవు.

10. విశ్వరూపముయొక్క అద్వితీయత : కాని, ఇపుడు, ఈ విశ్వరూపము యొక్క అద్వితీయత దేనియందున్నది? మానవజ్ఞానముయొక్క సర్వప్రయాసము, దాని ఆధ్యాత్మికకృషియొక్క అంతరతమతపస్య సైతము, సాహాయ్యము వినా, ఈ దర్శనము నెందుచేత అందుకొనజాలకున్నది? ఎందుచేత నన, మానవు డితర సాధనములచేత ఏకమాత్ర అస్తిత్వముయొక్క ఈయా ప్రత్యేకరూపములను తెలిసి కొనగలడు గాని, భగవంతుని సర్వపార్శ్వములయొక్క సమన్వయస్థానమగు పరమ ఏకతను తెలియజాలడు – ఈ ఏకతయందు ఏకకాలమున, ఏకదర్శనమున సర్వము అభివ్యక్తమగును, ఆ సర్వము అతిక్రమించబడును మఱియు తన పరిసమాప్తి నందుకొనును. ఏలన ఇచ్చట అతీత, వైశ్వ మఱియు వైయక్తికభగవంతుడు, పురుషప్రకృతులు, సాంతానంతములు, దేశము, కాలము మఱియు కాలాతీతత, సత్తాసంభూతులు, మనము ప్రయాసపూర్వకముగా భగవంతుని గుఱించి తెలిసికొను ప్రతివిషయము – అన్నియు నొక అనిర్వచనీయ ఏకతయందు అద్భుతముగా ప్రకట మగును. ఏది కర్మజ్ఞానముల పూర్ణతకు పరమశిఖరముగా రాజిల్లునో, అట్టి అనన్య భక్తిచేతనే, ప్రేమచేతనే, ఘనిష్ఠ అనన్యతచేతనే ఈ దర్శనము ప్రాప్తించగలదు (11-54). ఆ రూపమును తెలియుట, చూచుట, దానిలో ప్రవేశించుట, పరముని ఆ పరమరూపముతో నేకమగుట అప్పుడు సంభవమగును, మఱియు దీనినే గీత తన యోగపరిసమాప్తి యని ప్రస్తావించును. ఒక పరమచేతన గలదు, దానిద్వారా అతీతపురుషోత్తమునియొక్క మహిమాతిశయములో ప్రవేశించి, అతనియందు అక్షరాత్మను, సర్వ క్షరసంభూతిని ధరించవచ్చును, అనగా సర్వముతో నేకమయ్యు, సర్వమునకు పరమున నుండవచ్చును, ప్రపంచము నతిక్రమించియు విశ్వగత మఱియు విశ్వాతీతభగవంతునియొక్క సమస్తప్రకృతిని ఏకకాలమున ఆలింగనము చేసికొనవచ్చును. తన మనఃశరీరములలో నిబద్ధుడైన పరిచ్ఛిన్న మానవుని కిది నిక్కముగా కష్టమే : కాని "నా కర్మ చేయువాడవు కమ్ము, నన్ను పరమపురుషుడు మఱియు పరమగమ్యముగా సంగీకరించుము, నా భక్తుడవు కమ్ము, సర్వభూతము లందును సంగరహితుడవు, ద్వేషరహితుడవు గమ్ము; ఏలన అట్టివాడు నన్ను బొందును (11-55)" – అని భగవానుడు ముగించును. వేఱు మాటలలో, నిమ్న ప్రకృతికి పైనుండుట, సర్వప్రాణులతోడను సమైక్యము, వైశ్వభగవంతునితోను,

పరమపురుషునితోను ఏకత, కర్మయందు భగవదిచ్ఛతో ఏకత, ఏకునియందును, సర్వగతభగవంతునియందును అనన్యప్రేమ – పరిపూర్ణమగు ఆధ్యాత్మిక స్వ – అతిక్రమణమునకును, ఆ అచింత్య పరివర్తనమునకును మార్గ మిదియే.

# 12. మార్గము మఱియు భక్తుడు

1. జ్ఞానకర్మస్వరూపము : పదునొకండవ అధ్యాయమున గీతాబోధన యొక్క మూలోద్దేశ్యము సాధించబడినది, మఱియు నొక మేరకు పరిపూర్ణము గావించబడినది. ఎవడు లోకములోపల నుండునో, ఎవనియందు లోకవ్యాపార మంతయు ఘటిల్లునో, అట్టి విశ్వపురుషునితో యోగమునం దుండి లోకసంగ్రహార్థము కర్మ సేయుము – అని ఆదేశ మివ్వబడినది, విభూతిచేత (అర్జునునిచేత) ఆమోదింప బడినది గూడ. సాధారణమానవుడుగా తన వెనుకటి స్థితినుండి, అజ్ఞానగతమగు తన ప్రమాణములు, ప్రేరణలు, దృక్కోణము, అహంకారిక చేతనలనుండి, ఒక్క మాటలో ఆధ్యాత్మికసంకట సమయమున తనను భంగపుచ్చిన సర్వమునుండి తప్పించి, శిష్యుడు దూరముగా తీసికొనిపోబడెను. ఏకర్మను తన పూర్వస్థితియందు 'భయంకరపాప' మని చెప్పి తాను నిరాకరించెనో, సరిగా ఆ కర్మనే ఒక నూతన ఆంతరప్రాతిపదికపై ఆమోదించువఱకు శిష్యుడు తీసికొనిపోబడెను. ఒక సమన్వయ సాధక విశాలతరజ్ఞానము, ఒక దివ్యతరచేతన, ఒక సమున్నత నిర్వ్యక్తికప్రేరణ, ప్రపంచముపై పనిచేయు భగవదిచ్ఛతోను, ఆధ్యాత్మికప్రకృతియొక్క చాలకశక్తితోను ఏకతారూపమగు ఒక ఆధ్యాత్మికప్రమాణము – ఇదియే అజ్ఞానకర్మను రూపాంతరీక రించవలసిన నూతనము, ఆంతరము నగు కర్మస్వరూపము. భగవంతునితో ఏకతను తనలో గలిగియుండి, భగవంతునిద్వారా సర్వ చరాచరవస్తువులతో ఏకతాగమ్యమును చేరుకొను ఒక జ్ఞానము, అటులే అహంకారము లేక, కర్మయొక్క రహస్యనియామ కుని ఆదేశము ననుసరించి, అతని ఉపకరణవృత్తిగా పనిచేయు ఒక సంకల్పము, పరమాత్మతో ఘనిష్ఠమైత్రియే ఏకమాత్ర ఆకాంక్షగా గల ఒక దివ్య ప్రేమ,

ఈ మూడు పరిపూర్ణితశక్తుల సమైక్యముచేత విశ్వాతీత మఱియు విశ్వగత పురుష ప్రకృతులతోను, సర్వప్రాణులతోను సిద్ధించిన ఒక ఆంతర, సమగ్ర సమైక్యము - ఈ నాలుగును విముక్తమానవుని కార్యకలాపాలకు జూపబడిన దివ్యాధారము. ఏలన ఆ ఆధారమునుండి అంతరాత్మ ఉపకరణాత్మక ప్రకృతిని పనిచేయనిచ్చినను అపాయ ముండదు; అతడు అహంకారము మఱియు దాని పరిమితులనుండి ముక్తుడయ్యెను, పాపము, అనర్థము మఱియు తత్పరిణామ భయమునుండి తప్పించబడెను, అహంకార గ్రంథిరూపమగు, బాహ్యప్రకృతితోను, దాని పరిమితక్రియతోను బంధనమునుండి ఉద్ధరించబడెను. అత డిక సంధ్యాప్రకాశము లేక అంధకారమునందు గాక, పూర్ణ ప్రకాశశక్తియందు కర్మచేయగలడు. శుద్ధపురుషుని స్వాతంత్ర్యమునకు, ప్రకృతి యందలి అంతరాత్మ బంధనమునకు నడుమ ఏ విరోధము చూపబడెనో, ప్రకృతితో పురుషుని ప్రకాశమయసమన్వయముచేత అది యిపుడు పరిష్కరింపబడెను. అజ్ఞానము నందలి మనస్సునకే ఆ విరోధముండును గాని, స్వీయజ్ఞానమునందలి అంతరాత్మ కది అంతరించును.

2. <u>నిరాకారముక్తి - సమగ్రస్వాతంత్ర్యము</u> : కాని ఈ మహత్తర ఆధ్యాత్మికపరివర్తనముయొక్క సంపూర్ణార్థమును ప్రకటించవలె ననిన మఱికొంత చెప్పవలసియున్నది. పండ్రెండవ అధ్యాయము ఈ అవశిష్టజ్ఞానమువఱకు దారి తీయగా, మిగిలిన ఆఱు అధ్యాయాలు దాని నొక మహామహిత చరమసిద్ధాంతముగా పెంపొందించును. ఇంకను చెప్పవలసిన విషయము ఆధ్యాత్మికవిముక్తిని ప్రతిపాదించు ప్రస్తుత వేదాంతమతమునకును, గీతోపదేశము మానవాత్మకు తెఱచు విశాలతర సమగ్రస్వాతంత్ర్యమునకును గల భేదము నవలంబించి సాగును (12-1), ఇపు డా భేదము మఱల సూటిగా నిర్దేసింపబడును. ప్రస్తుత వేదాంతమార్గము కఠోరము, కేవలము నగు జ్ఞానముద్వారా ముందుకు సాగును. ఆధ్యాత్మికవిముక్తిసాధనముగను, చిత్తమును లయముగావించు దాని సారముగను ఆ జ్ఞానము పరిగణించు యోగము శుద్ధజ్ఞానముయొక్క యోగము; పరిగణించు ఏకత ఒక పరమ అక్షరముతోను, ఒక నిరపేక్ష అనిర్వచనీయముతోను నిశ్చల ఏకత - అనగా అనంతము, శాంతము, అస్పృశ్యము, దూరస్థము మఱియు సంబంధమయమగు ఈ ప్రపంచమున కంతకు ఎంతో పైన నుండు అవ్యక్తబ్రహ్మముతో ఏకత (12-3). పోగా గీత

ప్రతిపాదించిన మార్గమునందును జ్ఞానమే ఆవశ్యక ఆధారము, అయితే అది సమగ్ర జ్ఞానము; నిర్వ్యక్తిక సమగ్రకర్మలు దాని ప్రథమ ఆవశ్యక సాధనము; కాని ముక్తి, ఆధ్యాత్మికసంసిద్ధి మఱియు అమృతానందమును బొందుటకు గభీరము, విశాలము నగు ప్రేమ మఱియు ఆరాధన గీతామార్గమున ప్రబలతమము, సర్వోన్నతము నగు శక్తి యగును - ఈ ప్రేమారాధనలు ఒక సంబంధమును, ఒక వైయక్తిక ఘనిష్ఠ సాన్నిధ్యమును అపేక్షించును గాన, సంబంధశూన్య అవ్యక్తబ్రహ్మము వానికి సమాధాన మివ్వజాలదు. మానవాత్మ ఏ భగవంతునితో ఘనిష్ఠ ఏకతను బొందవలసి యున్నదో, అతడు తన సర్వోచ్చపదమునందు నిశ్చయముగా నెట్టి అభివ్యక్తిలోను పట్టని ఒక అతీత అచింత్యమే, పరబ్రహ్మమే; కాని అదే సమయమున అతడు వస్తువుల సజీవ ఆత్మయు నగును. అతడు పరమేశ్వరుడు, కర్మ, ప్రపంచముల నియామకుడు, అతడు ప్రాణియొక్క అంతరాత్మమనోదేహముల ఆత్మగా నుండియు, అదే సమయమున వాని కావలను ఉండును. అతడు పురుషోత్తముడు, పరమేశ్వరుడు మఱియు పరమాత్మ, మఱియు నీ సమానరూపము లన్నింటియందు అతడు అదే ఏకమాత్ర సనాతన భగవంతుడు. ఈ సమగ్ర, సమన్వయకర జ్ఞానమునకు మేల్కొని నపుడు, అది అంతరాత్మయొక్క అశేషముక్తికిని, ప్రకృతియొక్క అనూహసిద్ధికిని విశాలకవాట మగును. ఈ సంపూర్ణభగవంతుని వైపునకే మన కర్మలను, ప్రేమను, జ్ఞానమును మన మొక సంతత, అంతరయజ్ఞముగా మఱల్పవలెను. ఈ భగవంతుడు, పురుషోత్తముడు విశ్వాతీతు డయ్యును, దానిని ధరించు పురుషుడు, అంతర్నివాసి, దాని స్వామి (possessor)-ఈ సత్యము విశ్వరూపమున ప్రత్యక్షముగా, ప్రబలముగా జూపబడెను-విముక్తాత్మ అతని సత్తయొక్క సర్వతత్త్వములు మఱియు శక్తులందు అతని దర్శనమును, జ్ఞానమును ఒకసారి అందుకొనినపుడు, అతని బహుముఖ ఏకతను ఒకసారి గ్రహించి, అనుభవించగలిగినపుడు, అతనిలోనికే ప్రవేశింపవలెను- "జ్ఞాతుం ద్రష్టుం తత్త్వేన ప్రవేష్టుం చ" (11-54).

3. <u>పంచవిధ సమగ్రముక్తి</u> : గీతామోక్షము ఏకమునందు అంతరాత్మ - వైయక్తికసత్తయొక్క ఆత్మవిస్మృతిలక్షణమగు విలయము గాదు, "సాయుజ్యముక్తి" గాదు; అది ఏకకాలమున సర్వవిధ సంయోగము. దానియందు, పరమపురుషునితో అతని సత్తాసారమందును, చేతనాఘనిష్ఠతయందును, ఆనందతాదాత్మ్యమునందును సంపూర్ణ ఏకీభావము గలదు-ఇది గీతామోక్షములోని ఒక అంశమగు "సాయుజ్యము"-

ఏలన గీతాయోగముయొక్క ఒక ప్రయోజనము బ్రహ్మ మగుట–"బ్రహ్మభూతః" (5–24). మఱియు పరముని పరమసత్తయందు అంతరాత్మకు ఒక నిత్య హర్షపూర్ణ నివాసము నుండును–ఇది "సాలోక్యము" – "నీవు నాయందు నివసింతువు", "నివసిష్యసి మయ్యేవ"(12–8) అనిచెప్పబడినది. తర్వాత ఒకసంయోజకసామీప్యము నందు శాశ్వత ప్రేమారాధన యుండును, దివ్యప్రేమికునిచేతను, ముక్తాత్మయొక్క అనంతతలను చుట్టివచ్చు ఏకాత్మచేతను ఆ ముక్తాత్మయొక్క ఆలింగన ముండును – ఇది "సామీప్యము" (6–30). భగవంతుని ప్రకృతితో అంతరాత్మ యొక్క విముక్త ప్రకృతికి ఒకతాదాత్మ్య ముండును–ఇది "సాదృశ్యముక్తి"ఏలన భగవంతునితో సదృశ మగుటయే విముక్తాత్మయొక్క సంసిద్ధి–"మద్భావ మాగతాః" (4–10), మఱియు తన సత్తాధర్మమునందును, తన కర్మ మఱియు ప్రకృతిధర్మమునందును అతనితో ఏకమగుట ఈ సంసిద్ధిలో నొక భాగము – ఇది "సాధర్మ్యముక్తి" "సాధర్మ్యమాగతాః" (14–2). రూఢమగు జ్ఞానయోగము ఏకమాత్ర అనంతసత్త యందు అగాధలయమును లక్షించును - "సాయుజ్యము"; అదియే సంపూర్ణముక్తి యని దాని అభిప్రాయము. ఇక భక్తియోగము నిత్యనివాసము లేక సామీప్యమును అధికతరముక్తిగా వీక్షించును–"సాలోక్యము, సామీప్యము." పోగా కర్మయోగము సత్త మఱియు స్వభావముయొక్క శక్తియందు భగవంతునితో ఏకతకు దారితీయును– "సాదృశ్యము." కాని గీత తన సముదార సమగ్రతయందు అన్నింటిని తనలో ధరించి, మహత్తమము, సమృద్ధితమము నగు ఒక దివ్య స్వాతంత్ర్యము మఱియు సంసిద్ధిలోనికి వాని నన్నింటిని కరగించిపోయును.

4. <u>ఏది అధికతరయోగము ?</u> : అర్జునుడే ఈ భేదవిషయకప్రశ్న వేయు నట్లు చేయబడును. నిర్వ్యక్తిక అక్షరపురుషునికిని, పరమాత్మకును గల విశేషము (distinction) ఇంకను విస్పష్టముగా, సునిశ్చితముగా వర్ణింపబడలేదని మనము గుర్తుంచుకొనవలెను – ఇచ్చటి పరమాత్మ ఏకకాలమున నిర్వ్యక్తికసత్తయు, దివ్య పురుషుడు నగుచునే, ఉభయము నెంతో మించియుండును; ఈ విశేషము కృష్ణుడు సదా "అహం, మాం" అని చెప్పుచు వచ్చిన దివ్య "నేను" యందు సూచిత మయినది. గీతాసందేశముయొక్క పూర్ణమర్మమును ఆకళించుకొనుటకు ఈ విశేష మును మనము ముందుగనే ప్రస్తావించుకొనుచు వచ్చితిమి; అట్లు గానిచో మనము తిరిగి వెనుకకు బోవలసియుండును, ఈ మహత్తరసత్యముయొక్క ప్రకాశమున

వెనుకటి విషయమును మఱల చూడవలసి వచ్చును. తన పృథగ్వ్యక్తిత్వమును అక్ష రాత్మయొక్క ప్రశాంతనిర్వ్యక్తికతయందు లయముజేయ అర్జునుడు ముం దాదేశింప బడెను (4-41) - ఈ ఉపదేశము తన పూర్వభావముల ననుసరించియే యున్నది గాన, అక్కడ కష్టము గన్పించలేదు. కాని అత డిపుడు ఈ మహత్తమ విశ్వాతీత, ఈ విశాలతమ విశ్వాత్మక పురుషుని దివ్యదర్శనము నెదుర్కొనును: జ్ఞానముచేతను, కర్మచేతను, భక్తిచేతను అతనితో ఏకతను అన్వేషింప నాదేశింపబడును (11-55). కావున ఒక సంభవనీయ సందేహమును వారించుకొనుటకు అత డిట్లు ప్రశ్నించును, "ఏ భక్తులు సతతయుక్తులై నిన్ను ఉపాసింతురో, మఱియు నెవరు అవ్యక్త అక్షరము నుపాసింతురో, ఈ ఉభయులలో ఎవరికి అధికతర యోగజ్ఞానము గలదు?" (12-1). "ఆత్మయందును, పిమ్మట నాయందును" - "ఆత్మని అథో మయి" (4-35) అని పూర్వము చేయబడిన వివేచన నీ ప్రశ్న జ్ఞప్తికి దెచ్చును: "త్వాం" అనియు, "అక్షరం అవ్యక్తం" అనియు (12-1) అర్జునుడు వివేచించును. అతడు తాత్పర్యముగా నిట్లు చెప్పినవా డగును - నీవు సర్వభూతములకు మూలము మఱియు నాదివి, అన్ని వస్తువులయందు అంతర్వర్తి సన్నిధివి, నీ రూపములతో విశ్వమును వ్యాపించు శక్తివి, నీ విభూతులలో నభివ్యక్తమగు పురుషుడవు, నీ మహావిశ్వ-యోగముచేత ప్రపంచమునందును, మా హృదయములందును కర్మప్రభు వుగా ఆసీనుడవు. కావున నా సర్వసత్త, చేతన, ఆలోచనలు, భావములు మఱియు క్రియలయందు - "సతత యుక్త" (12-1) - నేను నిన్ను దెలిసి, ఆరాధించి, నీతో యుక్తుడనై యుండదగును. కాని ఈ అక్షరుని మా టేమిటి? ఇత డెపుడును అభివ్యక్తుడు గాడు, ఎపుడును రూపము ధరించడు, వెనుకకు తగ్గి, క్రియకు దూరముగా నిలుచును, విశ్వముతో నే సంబంధమును పెట్టుకొనడు, సదా శాంతము, ఏకము, నిర్వ్యక్తికము, నిశ్చలము. ప్రస్తుత భావములను బట్టి ఈ సనాతన అక్షరాత్మయే అధికతర తత్త్వము, కాగా అభివ్యక్తియందలి భగవంతుడు ఒక హీనతర రూపము: అభివ్యక్తము గాక, అవ్యక్తమే సనాతన తత్త్వము. అయినపుడు అభివ్యక్తిని, అల్పతరవస్తువును ఆశ్రయించుయోగము ఎట్లు అధికతర యోగ-జ్ఞానము గాగలదు?

5. <u>అదియే పరిపూర్ణయోగము</u>: దీనికి శ్రీకృష్ణుడు తెగవేసి, గట్టి జవా బిచ్చును - "ఎవరు తమ మనస్సును నాయందు నిలిపి, నాతో నిత్యయుక్తులై,

పరమశ్రద్ధతో నన్ను బొందజూతురో, వారు పరిపూర్ణముగా యోగయుక్తులని నా అభిప్రాయము." (12-2). ఏది సర్వమునందును భగవంతుని జూచునో, దేని కంటికి వ్యక్తము, అవ్యక్తము-రెండును ఒకే భగవత్తత్త్వమో, అదియే పరమశ్రద్ధ. పోగా నేది ప్రతిక్షణము, ప్రతిక్రియయందు మఱియు సర్వప్రకృతితో భగవంతుని కలిసికొనునో, అదియే పూర్ణసంయోగము. కాని ఎవరు ఒక దుష్కర ఆరోహణము ద్వారా అనిర్దేశ్యము, అవ్యక్తము నగు అక్షరమును మాత్రమే అన్వేషింతురో, వారును-భగవంతుడు తెలుపును - నన్ను చేరుదురు. ఏలన ఎక్కువ దుష్కరము, తక్కువ సంపూర్ణము నగు మార్గము నవలంబించి నప్పటికి, వారి లక్ష్యము తప్పు కాదు. తమకు మిక్కిలి సులభమార్గముగా, అవ్యక్తపరమును జేరుటకు వారు ఇచ్చటి వ్యక్త అక్షరము (అక్షరాత్మ) ద్వారా ఆరోహించవలసియుండును. అయితే ఈ వ్యక్త అక్షరము సర్వవ్యాపకమగు నా స్వీయ నిర్వ్యక్తికత మఱియు నిశ్చలమౌనమే; అచింత్యము, అచలము, ధ్రువము, సర్వవ్యాపకము నగు నది (12-3) వ్యక్తిత్వ క్రియను ధరించును, కాని దానిలో పాల్గొనదు. అది మనస్సున కెట్టి ఆలంబనము నివ్వదు; ఒక అచల, ఆధ్యాత్మిక నిర్వ్యక్తికత మఱియు నిశ్చలతచేతనే అది పొంద బడగలదు, మఱియు దానిని మాత్రమే అనుసంధించువారు మనస్సు మఱియు నింద్రియముల వ్యాపారము నిగ్రహించవలసి మఱియు ఉపసంహరించవలసి గూడ నుండును (12-4). అయినను తమ బుద్ధిసమతచేతను, సర్వవస్తువులయందును ఏకాత్మదర్శనముచేతను, శాంతసంకల్పముచే సర్వభూతహితమును గామించుటచేతను, వారును నన్ను సర్వవస్తువులు మఱియు ప్రాణులందు కలిసికొందురు (12-4). ఎవరు తమ సర్వ జీవనప్రకారములందును-"సర్వభావేన" (15-19) భగవంతునితో యుక్తులగుదురో, మఱియు సర్వభూతముల అచింత్య, సజీవమూలములోనికి విశాలముగా, సంపూర్ణముగా ప్రవేశింతురో - "దివ్యం పురుషం అచింత్యరూపం" (8-9, 10) - వారితో సమముగా అవ్యక్తోపాసకులును చివరకు ఆ సనాతనునే కనుగొందురు, అయితే కష్టతర ఆరోహణముద్వారా. ఏలన అవ్యక్తమార్గము తక్కువ సరళము, ఎక్కువ కష్టమయము; అది ఆధ్యాత్మికృత మానవస్వభావము యొక్క సహజ, పూర్ణగతి గాదు.

6. <u>ఉభయమార్గముల తారతమ్యము</u> : మఱియు నెక్కువ కష్టమయము గాన, అది శ్రేష్ఠతరము, సఫలతరము నగు ప్రక్రియ యని భావించరాదు. సులభ

తరమగు గీతామార్గము ఎక్కువ శీఘ్రముగా, సహజముగా, సర్వసామాన్యముగా అదే పరిపూర్ణవిముక్తికి నడుపును. ఏలన అది దివ్యపురుషుని ఆమోదించును గాని, తదామోదము దేహగతప్రకృతియొక్క పరిమితులందు మనస్సు మఱియు నింద్రియ ముల సంగమును సూచించదు. పైగా నది జననమరణముల బాహ్యాబంధనమునుండి శీఘ్రము, అమోఘము నగు ముక్తిని గొనివచ్చును. కాగా కేవల జ్ఞానయోగి తన ప్రకృతిఅవసరములతో నలుపు బాధామయ సంఘర్షమును తనపై విధించుకొనును; అత డా అవసరముల శ్రేష్ఠసంతృప్తిని సైతము నిరాకరించును, మఱియు సంబంధ ముల నపేక్షించు లేక నిషేదాత్మక కేవలబ్రహ్మము నందుకొనజాలని తన అంతరాత్మ యొక్క ఊర్ధ్వప్రవృత్తులను గూడ అతడు ఛేదించివేయును. దీనికి ప్రతిగా, సజీవ మగు గీతామార్గము మన సమస్తసత్తయొక్క అత్యంతప్రగాఢమగు ఊర్ధ్వప్రవృత్తిని గనుగొని, దానిని భగవదభిముఖము గావించి, జ్ఞానమును, ఇచ్ఛను, భావమును, సంసిద్ధిని గోరు సహజప్రవణతను పైకెగురుచున్న విముక్తికి శక్తిశాలి పక్షములుగా (ఱెక్కలుగా) నుపయోగించును. దేహధారులు తన అనిర్దేశ్య ఏకతయందు అవ్యక్త బ్రహ్మమును అందుకొనుట, అసలు సాధ్యమగుచో, అత్యంతకష్టము, ఆ ప్రయత్న మున అడచివేయబడిన అంగములు క్లేశమును, వ్యథను అనుభవించును - "దుఃఖం అవాప్యతే, క్లేశోఽధికతరస్తేషాం" (12-5). ఆ అనిర్దేశ్య ఏకత, ఎక్కి తనను చేరుకొనిన వారిని స్వీకరించును గాని, వారికి ఎట్టి సంబంధరూప సాహాయ్యమును అందించదు, ఎట్టి పాదావకాశమును చూపదు. సర్వము కఠోరతపస్యచేతను, కఠిన, కేవల స్వప్రయత్నముచేతను సాధించబడవలెను. కాని గీతోక్తప్రకారమున పురుషోత్తముని బొందజూచు వారి కది ఎంత సులభము! అది సర్వమును వాసు దేవునిగనే చూచును గాన, మఱేదియు జూడని అనన్యయోగముతో (12-6) పురుషోత్తముని వారు ధ్యానించునపుడు, అతడు వారిని ప్రతిచోట, ప్రతిక్షణమున అసంఖ్యాక రూపములతోను, ముఖములతోను కన్పించి, కలిసికొనును, లోపల జ్ఞాన దీపము నెత్తిపట్టును, దాని సుఖమయ దివ్యప్రభతో సత్తనంతను ముంచెత్తును. ఈ దివ్యప్రభతో వారు ప్రతిరూపము మఱియు ముఖమునందు పరమపురుషుని పసికట్టుదురు, ఏకకాలమున సమస్తప్రకృతినుండియు ప్రకృతిపతిని చేరుకొందురు, సర్వభూతములద్వారా వాని అంతఃపురుషుని చేరుకొందురు, స్వీయవ్యక్తిత్వముద్వారా సర్వమునగు సర్వాత్మను చేరుకొందురు; ఒక్క పట్టున వారు తెఱచుకొనుచున్న వేయి ద్వారములద్వారా సర్వమునకు ఆదియగు దానిలోనికి పరుగున ప్రవేశింతురు.

కఠినము, సంబంధరహితము నగు నిశ్చలత నపేక్షించు ఇతరపద్ధతిని సర్వక్రియ నుండియు దూరముగా బోవజూచును, కాని అది దేహధారుల కసాధ్యము (18–11). కాగా నిచ్చట సర్వకర్మలు కర్మల పరమప్రభువునకు సమర్పింపబడును, మఱియు నతడు భక్తుని సమర్పణాసంకల్పమును గ్రహించి, దాని భారమును స్వీకరించి, భక్తునియందలి దివ్యప్రకృతియొక్క కర్మబాధ్యతను తానే వహించును. ఇంకను, ఓవరకు, మానవుడు మఱియు సర్వభూతముల దివ్యప్రేమికుని భక్తుడు ఉదాత్త ప్రేమావేగమున తన చేతనయొక్క సర్వహృదయమును, తన ఆనందముయొక్క సర్వలాలసను అతని వైపునకు మఱల్చినపుడు, ఆ దివ్యప్రేమికుడు శీఘ్రముగా వచ్చి, మర్త్యప్రకృతియొక్క మృత్యుసాగరమునుండి సనాతనుని భద్రమగు ఒడిలోని కతని నుద్ధరించును (12–7).

7. <u>గీతామార్గములోని మెట్లు</u> : ఇట్టిది శీఘ్రతమము, విశాలతమము, మహత్తమము నగు మార్గము. నాయందు – మానవాత్మకు భగవంతుడు చెప్పును – నీ మనస్సు నంతను విశ్రమింపజేయుము, నాలో నీ బుద్ధి నంతను నివసింపజేయుము (12–8) : దివ్య ప్రేమ, ఇచ్ఛ మఱియు జ్ఞానముయొక్క అలౌకికతేజమున ఓలలాడించి, ఈ ప్రేమాదిప్రవాహమునకు మూలమగు నాలోని కా మనోబుద్ధులను లేవనెత్తెదను. అపు డీ మర్త్యజీవనమునకు పైన నాయందే నీవు నివసించెదవు, సందేహము వలదు. సనాతన ప్రేమావేగముచేతను, ఇచ్ఛాబలముచేతను, జ్ఞాన ప్రకాశములచేతను ఉద్ధరింపబడిన అమరజీవుని, పార్థివప్రకృతియొక్క బంధనపాశ మిక పట్టజాలదు. సందేహము లేదు, ఈ మార్గమునందును కఠినతలు గలవు; తన ఉగ్ర లేక తామసమగు అధోభారముతో గూడిన అపరప్రకృతి ఆరోహణగతిని అడ్డగించి పోరాడును, మఱియు ఆరోహణపక్షములను ప్రతిబంధించును, ఊర్ధ్వోల్లాస మును బాధించును. అద్భుతక్షణములందో, ప్రశాంతసమయములందో ముందు కనుగొనబడి నప్పటికి, దివ్యచేతన వెంటనే స్థిరపడదు, లేక పిలిచినపుడు వెంటనే తిరిగిరాదు. వైయక్తికచేతనను భగవంతునియందు స్థిరముగా నిలుపు విషయమున తఱచు అశక్తత అనుభూతమగును. ప్రకాశమునుండి వెలివేయబడిన సుదీర్ఘరాత్రు లుండును; తిరుగుబాటు, సంశయము లేక అపజయముతో నిండిన గంటలు లేక క్షణము లుండును. అయినను యోగము నభ్యసించుచు, అనుభవమును తిరిగి తిరిగి పొందుటచే పరమాత్మ సత్తను అధికాధికముగా ప్రభావితము గావించి, ప్రకృతిని

శాశ్వతముగా స్వాధీనము గావించుకొనును (12-9). మనస్సున కుండు బహిర్ముఖ ప్రవృత్తియొక్క బలము మఱియు పట్టుచేత ధ్యానాభ్యాసము సైతము దుష్కర మగుచో, అపు డొక సుకరమార్గము గలదు - సర్వకర్మలను కర్మప్రభువునిమిత్తము గావించుము (12-10); దీనివలన మనస్సుయొక్క ప్రతి బహిర్ముఖవృత్తియు సత్త యొక్క ఆంతర ఆధ్యాత్మికసత్యముతో సంబద్ధమగును, మఱియు తన ప్రవృత్తి యందే తన మూలముతో సంయుక్తమగును. అపుడు పురుషోత్తముని సన్నిధి ప్రాకృతమానవునియందు ప్రబలము కాగా, అతడు దానితో నిండి, స్వయముగా ఒక భగవద్రూపము, ఒక ఆత్మయు నగును; అట్టియెడ సర్వజీవనము భగవంతునియొక్క ఒక సంతతసంస్మరణ మగును, సంసిద్ధియు పొదలును, పరమసత్తతో మానవాత్మ సంపూర్ణసత్తయొక్క ఏకతయు వృద్ధినందును.

8. <u>కర్మఫలత్యాగము సర్వవిశిష్టము</u> : కాని భగవంతుని ఈ సంతత స్మరణము మఱియు కర్మలను వానిలోనికి లేవనెత్తుట - పరిమితమనస్సున కిదియు సాధ్యముకానట్లు తోచవచ్చును; కారణము, అది తన విస్మృతిస్వభావమునందు కర్మ మఱియు కర్మప్రయోజనము వైపునకే తిరిగియుండుటచే, లోపలికి జూచుచు, మన ప్రతి కదలికను పరమాత్మ దివ్యవేదికపై సమర్పింప మఱచిపోవును. ఇట్టి తఱి కర్మయందు నిమ్నప్రకృతిని నియమించి, ఫలాపేక్ష లేక కర్మచేయుట ఉపాయము (12-11). సమస్తఫలమును సన్యసించి, కర్మను నియమించు దివ్యశక్తికి దానిని సమర్పింపవలెను, కాని ఫలము లేదని చెప్పి, ఆ శక్తి విధించు కర్మను మానరాదు. ఏలన ఈ పద్ధతియందు అవరోధము క్రమముగా క్షీణించి, సులభముగా నంతరించును, అపుడు ఈశ్వరుని స్మరించుటకును, దివ్యచేతనయొక్క స్వేచ్ఛయందు తనను స్థాపించుకొనుటకును మనస్సున కవకాశము ప్రాప్తించును. కాగా నిచ్చట గీత, సామర్థ్యముల ఒక ఆరోహణక్రమమును ప్రతిపాదించును మఱియు నీ నిష్కామ కర్మయోగమునకు సర్వశ్రేష్ఠతను కట్టబెట్టును. ఎట్లన, "అభ్యాసము" (12-12) - ఒక పద్ధతి ననుష్ఠించుచు, తిరిగితిరిగి ప్రయత్నముచేయుట, అనుభవము బొందుట - ఒక గొప్ప శక్తిశాలి సాధనము; కాని దీనికంటెను వస్తువుల వెనుకనున్న సత్యము నకు బుద్ధివిచారణను సఫలముగా మఱల్చుట శ్రేష్ఠము. ఈ బుద్ధి-జ్ఞానముకంటెను పరమసత్యముపై మనస్సుయొక్క ప్రశాంత, సంపూర్ణ ఏకాగ్రత శ్రేష్ఠము, ఏలన అపుడు చేతన దానియందే నివసించు స్థితికి వచ్చి, దానితో సదా నేకముగా నుండును.

కాని కర్మఫలమును సమర్పించుట ఇంతకంటెను శక్తిశాలి ఉపాయము, ఏలన అది కలతకు గల కారణముల నన్నింటిని వెంటనే తొలగించి, ఒక ఆంతర స్థిరతను, శాంతిని సహజముగానే గొనివచ్చి, నిలబెట్టును (12-12), మఱియు నీ శాంతిస్థిరతల ఆధారముపై తక్కిన దంతయు శాంతాత్మయొక్క అధికారమున పదిలముగా నుండును. అపుడు చేతన హాయిగా నుండి, తనను సుఖముగా భగవంతునియందు స్థిరపఱచుకొనగలదు, మఱియు నిరుపద్రవముగా సంసిద్ధి కెగయగలదు. అపుడు జ్ఞానము, సంకల్పము మఱియు భక్తి సైతము స్థిరశాంతిరూపమగు దృఢభూమినుండి తమ శిఖరములను నిత్యతారూప ఆకాశములోనికి లేవనెత్తగలుగును.

9. భక్తుని దివ్యప్రకృతి : మంచిది, అయితే ఈ మార్గము ననుసరించి, పురుషోత్తముని ఉపాసనకు దిగిన భక్తుని దివ్యప్రకృతి ఎట్లుండును, అతని సత్తా చేతనలయొక్క మహత్తరస్థితి యేమి యగును ? గీత, తాను మున్ముందు గట్టిగా విధించిన సమత, నిష్కామత మఱియు అంతరాత్మస్వతంత్రతలనే వివిధ రూపములలో పలు శ్లోకములందు ఘంటానినాదముగా వచించును. ఇదియే ఆధారము గావలెను – కావుననే ఆరంభమున దానియందంత బలము మోపబడెను (2-45, 47, 48). మఱియు నీ ఆధారముపై, భక్తి, అనగా పురుషోత్తమునియందు ప్రేమారాధనలు, అంతరాత్మవృక్షమును ఒకానొక మహత్తమ, ఉన్నతతమ సంసిద్ధి దిశగా పెంచవలెను; ఆ సంసిద్ధికి ఈ ప్రశాంతసమత విశాలప్రతిష్ఠగా నుండును. మొదట, అహంకార, మమకారరాహిత్యము – "నిర్మమో నిరహంకారః" (12-13). ఎవని మనోహృదయము విశ్వవ్యాప్తమో మఱియు అహంకారపు ఇఱుకు గోడలను పగులగొట్టివేసెనో, అతడు పురుషోత్తమభక్తుడు. ఒక విశ్వప్రేమ అతని హృదయమునందు కాపురముచేయును, ఒక విశ్వకరుణ దానినుండి వెలువడి, భూమిని సముద్రమువలె చుట్టివచ్చును (12-13). అతనికి సర్వభూతములయెడ్ల మైత్రి, జాలి యుండును, దేనిపట్ల ద్వేషముండదు; కారణము, అతడు దేనినైన ఇముడ్చుకొనగల క్షమాసాగరము (12-13). ఒక నిష్కామసంతుష్టి, సుఖదుఃఖము లందు ప్రశాంతసమత, దృఢసంయమము, యోగి కుండవలసిన దృఢనిశ్చయము, తన మనోబుద్ధులను సర్వథా తన చేతనాజ్ఞానముల అధీశ్వరునికి సమర్పించివేయు భక్తిప్రేమలు – ఇవి యన్నియు ఆ భక్తుని సొత్తు (12-14). అథవా భక్తుడు కేవల మిటు లుండవచ్చును : క్షుబ్ధము, వ్యాకులము నగు నిమ్నప్రకృతినుండియు, దాని

హర్షము, భయము, ఉద్వేగము మఱియు అసహనరూప తరంగములనుండియు విముక్తిని మాత్రము బొంది, అతడు ఒక శాంతిమూర్తిగా నుండును; అతనిచేత ప్రపంచము వ్యథ చెందదు, అతడు ప్రపంచముచేత వ్యథ చెందడు. అతడు శాంతిమయుడు, అతనితో నందరు శాంతముగా నుందురు (12-15).

10. <u>కర్మపరిత్యాగి గావుననే కర్మదక్షుడు</u> : లేక, భక్తుడు తన సర్వకామమును, క్రియను తన సత్తాస్వామికి సమర్పించినవా డగును (12-16); అతడు శుద్ధశాంతుడు, ఉదాసీనుడు, అనగా ఎట్టి ఫలితముచేతను, ఘటనచేతను బాధను గాని, వ్యథనుగాని పొందడు; అతడు "సర్వారంభపరిత్యాగీ" (12-16), అనగా ఆంతర లేక బాహ్యకర్మయొక్క అహంకారికము, వైయక్తికము, మానసికము నగు సర్వారంభమును (ఆరంభించుటను) దూరముగా పరిత్యజించినవాడు; తన నిశ్చయములచేతను, అభిరుచులచేతను, కామములచేతను దారితప్పించక, భగవంతుని యిచ్ఛను, జ్ఞానమును తనద్వారా నిరాఘాటముగా ప్రవహింపనిచ్చువా డతుడు, మఱియు నందుచేతనే తన ప్రకృతియొక్క సమస్తక్రియయందు శీఘ్రకారి మఱియు సుదక్షుడు; ఏలన పరమసంకల్పముతో ఈ నిర్దుష్ట ఏకత్వము, ఈ స్వచ్ఛ ఉపకరణభావము – ఇదియే కర్మలయందు పరమదక్షతకు ప్రబలనియమము. మఱల, ఎవడు సుఖమును కామించి, దాని స్పర్శకు హర్షించడో, లేక అసుఖమును ద్వేషించి, దాని భారముచేత శోకించడో, అట్టివా డతడు (2-58). అతడు శుభాశుభములకు గల వ్యత్యాసమును పాటింపడు (12-17) (2-50), ఏలన అతని భక్తి వాని రెంటిని తన సనాతన ప్రేమికుడు మఱియు ప్రభువు హస్తములనుండి ప్రాప్తించిన శ్రేయస్కర వస్తువులుగానే భావించి, సమముగా స్వీకరించును (12-17) (2-50). భగవంతుని ప్రియుడగు భక్తుడు విశాలసమతతో నొప్పారు విశిష్టజనుడు, అతడు శత్రుమిత్రులయందు సముడు, మానావమానములయందు, సుఖదుఃఖములయందు నిందాస్తుతులయందు, ఒక్క మాటలో, సామాన్యప్రకృతిని వేధించు సర్వవిరుద్ధ ప్రభావములందు సముడు (12-18). వ్యక్తి లేక వస్తువుతో గాని, స్థలము లేక గృహముతో గాని అతని కెట్టి సంగము నుండదు (12-19); ఎట్టి పరిసరములతో నైన, మానవులు తనతో నవలంబించు నెట్టి సంబంధముతో నైన, ఎట్టి పదవి లేక భాగ్యముతోనైన అతడు తుష్టిని, సంతృప్తిని బొందును (12-19). అతని మనస్సు సర్వవిషయములందు దృఢముగా నుండును, కారణము, అది సంతతము అత్యున్న

తాత్మయందు నెలకొని, తన ప్రేమారాధనల ఏకమాత్రవిషయమగు భగవంతుని యందే కుదురుకొనియుండును. సమత, నిష్కామత, అహంకారికప్రకృతినుండి స్వతంత్రత - ఇవియే మహావిముక్తికి గీతాశాస్త్ర మపేక్షించు పరిపూర్ణాధారము. సర్వవస్తువులందును ఏకాత్మను దర్శించు నిర్మలజ్ఞానము, ఈ జ్ఞానమునుండి ఫలించు ప్రశాంత, నిరహంకారసమత, ఈ సమతయందు కర్మప్రభువునకు నివేదించబడు నిష్కామకర్మ, చివరకు అంతర్నివాసియగు మహత్తరపురుషుని హస్తములలోనికి చేయబడు, మానవుని సమస్త మానసికప్రకృతియొక్క సమర్పణము-ఈ నాలుగును గీతయొక్క ప్రథమ ఆధారభూత బోధనము మఱియు ఇచ్చించవలసిన ప్రధానవస్తువు. మఱియు ఈ సమతయొక్క కిరీటము ప్రేమ; కాగా ఈ ప్రేమ జ్ఞానమునందు ప్రతిష్ఠితము, ఉపకరణముల క్రియయందు కృతకృత్యము, సర్వవస్తువులు మఱియు ప్రాణులకు విస్తారితము; విశ్వస్రష్ట మఱియు నీశ్వరుడగు దివ్యాత్మలోనికి - "సుహృదం సర్వభూతానాం సర్వలోకమహేశ్వరం" (5-29) - ప్రవహించు ఒక విశాలము, మనోహరము, సర్వసమావేశము నగు దివ్యప్రేమ ఈ ప్రేమ.

11. <u>అమృతధర్మము</u> : ఇదియే పరమ ఆధ్యాత్మికసంసిద్ధి ప్రాప్తించుటకు ఆధారము, నిబంధనము, సాధనము, మఱియు నిది ఎవ్విధముగా నెవరియం దున్నను వారు నాకు ప్రియులు - "భక్తిమాన్ మే ప్రియః" (12-19) - అని భగవంతుడు పలుకును. కాని ఏ మహితాత్ములు నాకు అత్యంత సమీపవర్తులో, నాయందలి ఎవరి ప్రేమ నే నిపుడే చూపిన మార్గము మఱియు ప్రక్రియచేత తతోధికముగా మహత్తమ సంసిద్ధియందు సంపూర్ణము చేయబడినదో, వారు నాకు అత్యంతప్రియులు-"అతీవ మే ప్రియాః" (12-20). ఈ భక్తులు పురుషోత్తమునే తమ ఏకమాత్ర ఆధ్యాత్మిక లక్ష్యము గావించుకొని, ఈ బోధనయందు వర్ణించబడిన అమరత్వప్రాపకధర్మమును పూర్ణశ్రద్ధతో, యథోక్తప్రకారముగా అనుష్ఠించు భక్తపుంగవులు. గీతాపరిభాషయందు ధర్మ మన సత్తను, దాని కర్మలను శాసించు నొక నియమము మఱియు అంతః ప్రకృతినుండి ప్రభవించుచు, దానిచేతనే నిర్ణయింపబడు ఒక క్రియ-"స్వభావనియతం కర్మ" (18-47). మనఃప్రాణశరీరముల నిమ్న అజ్ఞానప్రకృతియందు పెక్కు ధర్మములు, పెక్కు విధానములు, పెక్కు ప్రమాణములు మఱియు నియమము లుండును, ఏలన మానసిక, ప్రాణిక మఱియు భౌతికప్రకృతియొక్క మాఱుచుండు అవస్థలు మఱియు ప్రకారములు (types) పెక్కు లుండును. కాగా అమృతధర్మము

ఏకమాత్రము; అది అత్యున్నత, ఆధ్యాత్మిక దివ్యచేతన మఱియు దాని శక్తులయొక్క ధర్మము, అనగా పరప్రకృతి (7-5) యొక్క ధర్మము. ఆ ధర్మము త్రిగుణాతీతము (7-13. 14-19), మఱియు దాని నందుకొనుటకు ఈ నిమ్నధర్మము లన్నింటిని పరిత్యజించవలెను – "సర్వధర్మాన్ పరిత్యజ్య" (18-66). వీని యన్నింటి స్థానమున ఏకమాత్రము, విమోచకము, ఏకీకరము నగు, సనాతనుని చేతన మఱియు శక్తి యొక్కటియే మన కర్మయొక్క అనంతమూలము, దాని ఆకారము, నిర్ణాయకము, ఆదర్శము గావలెను. నిమ్నతర వైయక్తిక అహంకారమునుండి బైటబడుట; అవికార్యము, సనాతనము, సర్వవ్యాపకము నగు అక్షరాత్మయొక్క నిర్వ్యక్తికము, సమము నగు శాంతిలో ప్రవేశించుట; ఆ శాంతినుండి సమస్తప్రకృతి మఱియు సత్తయొక్క పరిపూర్ణ ఆత్మసమర్పణద్వారా అక్షరాత్మకంటె నితరము, పరతరము నగు దాని నాకాంక్షించుట – ఇదిగో యిది ఈ యోగముయొక్క ప్రథమావశ్యకత. ఈ ఆకాంక్షాబలముమీద భక్తుడు "అమృతధర్మమున" (12-20) కెగయగలడు. అచ్చట సత్త, చేతన మఱియు దివ్యానందమునందు మహత్తమ ఉత్తమపురుషునితో (15-17) ఏకీభూతుడై, అతని పరమ, క్రియాశీల ప్రకృతిశక్తితో–"స్వా ప్రకృతిః" (4-6) – ఏకీభూతుడై, విముక్తపురుషుడు ఒక అత్యున్నత అమృతత్వము మఱియు నొక పరిపూర్ణస్వాతంత్ర్యముయొక్క సత్యశక్తియందు అనంతముగా తెలిసికొన గలడు, అమేయముగా ప్రేమించగలడు, అస్ఖలితముగా కర్మచేయగలడు. తక్కిన గీత యంతయు ఈ అమృతధర్మముపై పూర్ణతరప్రకాశమును బఱపుటకే వ్రాయ బడినది.

## ద్వితీయ సంపుటము: రెండవ భాగము

# పరమ రహస్యము

*(The Supreme Secret)*

# 13. క్షేత్రము, క్షేత్రజ్ఞుడు

1. <u>తృతీయషట్కము సంబంధములను వివరించును :</u> గీత చివరి ఆఱు అధ్యాయములందు, గురు విప్పటికే అర్జునున కనుగ్రహించిన ప్రబోధమును మఱి యొక రూపమున ప్రతిపాదించును; అంతరాత్మ నిమ్నప్రకృతినుండి దివ్యప్రకృతిలోని కెగయు మార్గమును స్పష్ట, సంపూర్ణజ్ఞానముపై ప్రతిష్ఠించుట కిది ఆవశ్యకము. వస్తుతః అదియు అదే వెనుకటి జ్ఞానము, కాని దానియందు వివరములను, సంబంధము లను వ్యక్తముచేసి, వానికి పూర్ణార్థ మివ్వబడును; మఱియు పూర్వము యథాలాప ముగా స్మరింపబడిన లేక వేఱొక ప్రయోజనముతో ప్రతిపాదించబడిన తలఁపులు మఱియు సత్యములు ఇక ముందు తమ పూర్ణార్థముతో ఆవిష్కరించబడును. ఉదాహరణకు, ప్రథమషట్కమున అక్షరాత్మకును, ప్రకృతిగత అంతరాత్మకును గల విభేదమును (2-45) జూపుటకు ఆవశ్యకమగు జ్ఞానమునకు (2-12, 17) పూర్ణ ప్రాధాన్య మీయబడెను. కాని అక్కడ పరమాత్మ మఱియు పరమపురుషుడు అస్పష్టముగా మాత్రమే సూచించబడెను. ప్రపంచమున కర్మ సేయుటను సమర్థించు టకు పరమాత్మ గ్రహించబడెను మఱియు సత్తాస్వామిగా వక్కాణించబడెను (5-29); అంతకు మించి దాని స్వరూప మేమియో, ఇతరముతో దాని సంబంధము లెట్టివో సూచించుట గూడ జరుగలేదు. శేషించిన 13-18 అధ్యాయములు అడచిపెట్టిన ఈ జ్ఞానమును ఒక విస్పష్టప్రకాశమున, ఒక ప్రబలప్రాధాన్యమున ప్రకటించుటకు వినియోగించబడును. కాగా 7-12 అధ్యాయములలో ఈశ్వరునకును (10-3), పరాపరప్రకృతుల వివేచనకును (7-5), సర్వోత్పాదకము, సర్వాత్మకము (11-38) నగు ప్రకృతియందలి భగవంతునకును, సర్వభూతములలోని ఏకమునకును (11-7) ప్రాముఖ్యమీయబడెను. కాని పరమపురుషునకును మఱియు అక్షరపురుషునకును, జీవునకు మఱియు తన గుణకర్మరూపమున ప్రకృతికిని గల యథాభూతసంబంధముల నిపుడు ఎక్కువ నిర్దిష్టముగా వెలికిదెచ్చు టావశ్యకము. కావున అస్పష్టముగా నుంచబడిన ఈ విషయములను విస్పష్టము చేయగల సమాధానమును రాబట్టు ప్రశ్న

ర్జునునిచే వేయించబడును. అతడు పురుషప్రకృతులను గుఱించి తెలిసుగోరును (13-1); క్షేత్రక్షేత్రజ్ఞులను గుఱించియు, జ్ఞానజ్ఞేయములను గుఱించియు ప్రశ్నించును. ఈ ప్రశ్నయందే ఆత్మ మఱియు ప్రపంచముయొక్క సర్వజ్ఞానసారము ఇమిడి యున్నది; ఇది అంతరాత్మ తన ప్రకృతికృత అజ్ఞానమును త్రోసిపుచ్చుట కావశ్యకము, మఱియు జ్ఞానముయొక్కయు, జీవనముయొక్కయు, కర్మలయొక్కయు, అటులే ఈ తత్త్వములందలి భగవంతునితో తన సంబంధములయొక్కయు సముచిత ఉపయోగము నాశ్రయించి, అడుగులు వేయుచు, అంతరాత్మ సనాతనపురుషునితో సత్తాసమైక్యములోని కారోహించుటకును ఆవశ్యకము.

2. <u>యజ్ఞకర్మఫలితము</u> : ఈ విషయములందు గీతాభావముల సారాంశము, దాని విచారణయొక్క చరమవికాసమును మనమునం దుంచుకొని, ఇతఃపూర్వమే ఒక మేరకు విశదీకరించబడినది ; కాని, గీతావిధానము ననుసరించి, దాని ప్రస్తుత తత్పరతాదృక్కోణమునుంచి ఆ భావములను పునము ప్రతిపాదించవచ్చును. గీత ముందు కర్మ కవకాశ మిచ్చును ; పిమ్మట ఆత్మజ్ఞానముతో భగవదిచ్ఛకు ఉపకరణ ముగా చేయునట్టి ఆ కర్మను బ్రాహ్మస్థితితో పూర్ణసంగతముగాను, భగవదభిముఖ వృత్తిలో నొక అపరిహార్య అంశముగాను ఆమోదించును ; చివరకు పరమునికి భక్తితో జేయు నొక ఆంతరయజ్ఞముగా దానిని లేవనెత్తును - మంచిది, కాని ఈ మార్గము నిమ్నప్రకృతినుండి పరప్రకృతిలోనికి, మర్త్యసత్తనుండి అమరసత్తలోనికి ఎగయుట యను ఆధ్యాత్మికజీవనముయొక్క మహాలక్ష్యమును సక్రియముగా నెట్లు ప్రభావితముగావించును ? సర్వజీవనము, సర్వకర్మ అంతరాత్మకును, ప్రకృతికిని నడుమ సాగుచుండు నొక ఆదానప్రదానము : దీనియొక్క మూలస్వభావ మేది యగును ? తన ఆధ్యాత్మిక పరాకాష్ఠయం దది యే రూపము ధరించును ? ఇంకను, తన నిమ్న మఱియు బాహ్యప్రేరణలనుండి విముక్తమై పరమాత్మయొక్క అత్యు న్నతస్థితిలోనికిని, దాని గభీరతమ ప్రేరకశక్తిలోనికి వృద్ధిచెందు నంతరాత్మ నా ఆదానప్రదాన మే పరిపూర్ణతకు గొనిపోవును ? ఇవి యిచ్చట ప్రసక్తమైన ప్రశ్నలు - యితరప్రశ్నలును గలవు గాని, ఆనా డవి అత్యవసరములు గాదు గావున, గీత వానిని లేవనెత్తదు - విశాలదృష్టితో చేయబడిన, వేదాంత, సాంఖ్య, యోగమతముల సమన్వయమునుండి గ్రహించబడిన ఒక పరిష్కారపద్ధతిలో గీత

పై ప్రశ్నలకు సమాధాన మిచ్చును – ఈ సమన్వయమే సమస్త గీతావిచారణకు మూలకందము.

3. <u>జీవాత్మయొక్క త్రివిధసత్యము</u> : ఇచ్చట ప్రకృతియందు తన దేహ భావము నెదుర్కొను జీవాత్మ తన స్వీయానుభవమునకు త్రివిధసత్యమగును. మొదట, ప్రకృతి–బాహ్యక్రియలకు అజ్ఞానముచేత అధీనమైనట్లు గన్పించు ఆధ్యాత్మిక సత్త యది, మఱియు తన చలభావమునందు క్షణక్షణము మాఱుచుండు, ప్రకృత్యంశ మగు అహంకారరూపమున అది ప్రకటమగును. తర్వాత అది – జీవాత్మ – ఈ సమస్తక్రియ మఱియు గతినుండి వెనుకకు తగ్గినపుడు, తన ఉచ్చతరసత్య మొక సనాతన, నిర్వ్యక్తిక ఆత్మయనియు, అక్షరసత్త యనియు గనుగొనును ; ఈ ఆత్మ తన సన్నిధిచేత క్రియను ధరించును, మఱియు అక్షుబ్ధసాక్షిగా దానిని వీక్షించునే గాని, అంతకు మించి ఆ క్రియయందు పాల్గొనదు. మఱియు, చివరకు, జీవుడు తన యీ రెండు విరుద్ధ ఆత్మలకు నావల తన దృష్టిని సారించినపుడు, రెండింటిని మించిన, అనిర్వచనీయమగు నొక పరమసత్యమును గనుగొనును – దానినుండియే అవి రెండును ప్రభవించును, అది ఆత్మకు పరమాత్మ, మఱియు సర్వప్రకృతికిని, క్రియకును ప్రభువు నగు సనాతనము ; మఱియు ప్రభువు మాత్రమే గాక, విశ్వము నందలి తన స్వీయశక్తియొక్క ఈ సమస్త క్రియాకలాపములకు ఆదియు, నాధ్యాత్మికాధారమును, రంగస్థలము నగును ; మఱియు ఆదియు, ఆధ్యాత్మికగృహమును మాత్రమే గాక, సర్వశక్తులు, వస్తువులు, సత్తలలోపల ఆధ్యాత్మికనివాసియు నగును; మఱియు నివాసి మాత్రమే గాక, మనచే ప్రకృతి యని పిలువబడు, తన సత్తయొక్క ఈ సనాతన ఊర్జముయొక్క వికాసములచేత తానే సర్వ ఊర్జములు (energies), బలములు, వస్తువులు మఱియు సత్తలు నగును. కాగా ఈ ప్రకృతి సైతము రెండు విధములు – ఒకటి జన్యము మఱియు హీనము, రెండవది ఆద్యము మఱియు పరము. విశ్వయంత్రాంగరూపమగు ఒక నిమ్నప్రకృతి గలదు, దీని సంయోగమున, ప్రకృతిగత అంతరాత్మ మాయనుండి జనించిన–"త్రైగుణ్యమయీ మాయా" (7–14) – ఒక అజ్ఞానమున నివసించును, దేహయుక్త, మనఃప్రాణనిర్మిత అహంకారముగా తనను భావించుకొనును, ప్రకృతిగుణముల శక్తికి లోబడి పని చేయును; బద్ధము, దుఃఖమయము, వ్యక్తిత్వపరిచ్ఛిన్నముగా తనను గుఱించి తలపోయును, జన్మచక్రమునకు కట్టివేయబడిన ఒక నశ్వరవస్తువుగా, స్వీయప్రకృతికే

దాస్యముచేయు దాసునిగా తన్నెఱుంగును, నిమ్నతరమగు నీ జీవనశక్తికి పైన తన సత్తయొక్క ఉచ్చతరమగు నొక దివ్య, ఆధ్యాత్మికశక్తి గలదు, దీనియందు అంతరాత్మ సర్వదా సనాతన భగవంతునియొక్క ఒక సచేతనాంశము, అది ఆనంద మయము, స్వతంత్రము, తన సంభూతియొక్క ఆవరకరూపమున కతీతము, అమరము, అవ్యయము, అది ఒక దైవశక్తి. ఈ ఉచ్చతరప్రకృతి సాహాయ్యమున, ఒక ఆధ్యాత్మికసమగ్రతయందు ప్రతిష్ఠింపబడిన దివ్యజ్ఞానము, భక్తి మఱియు కర్మలద్వారా సనాతనుని కెగయుట — ఇదియే సంపూర్ణ ఆధ్యాత్మికవిముక్తికి కీలకము. ఇంతమట్టుకు ఇప్పటికే స్పష్టపఱుపబడినది ; కాగా ఈ సత్తాపరివర్తనయందు ఏ యితర ఆలోచనలు ఇమిడిఉన్నవో, విశేషించి ఈ యుభయప్రకృతులకు భేద మేమియో మఱియు మన కర్మయు, అంతరాత్మస్థితియు విమోచనచేత నెట్లు ప్రభావి తము లగునో, మన మిపుడు చూడదగును. ఇందునిమిత్తము తా నింతదనుక వెనుక భాగమునం దుంచిన ఉన్నతోన్నతజ్ఞానముయొక్క కొన్ని వివరములలోని కిపుడు గీత విశాలముగా ప్రవేశించును. విశేషించి, సత్తాసంభూతుల, పురుషప్రకృతుల సంబంధమును గుఱించియు, త్రిగుణవ్యాపారము, అత్యున్నతవిముక్తి, పరమాత్మకు అంతరాత్మయొక్క సంపూర్ణ ఆత్మసమర్పణములను గుఱించియు గీత వివరించును. ఈ చివరి ఆఱు అధ్యాయములం దంతటను పరమమహత్త్వముతో నొప్పారున దెంతయో గలదు; కాని ఇచ్చట సైతము, గీతయొక్క చరమవచనము (18–65, 66) సర్వోత్తమముగా మనల నాకట్టుకొనును; ఏలన దానియందు గీతాబోధనయొక్క కేంద్రభావమును, మానవాత్మ కది ప్రసాదించిన మహావాక్యమును, తన సర్వోన్నత సందేశమును మనము కనుగొనగలము.

4. <u>క్షేత్రము, క్షేత్రజ్ఞుడు</u> : ముందుగా, సర్వసృష్టిని, ప్రకృతిమధ్య నిర్మించుచు, కర్మచేయుచు నుండు అంతరాత్మయొక్క క్షేత్రముగా మనము చూడవలెను. గీత ఈ శరీరమునే అంతరాత్మయొక్క క్షేత్ర మని వ్యాఖ్యానించును (13–2), మఱియు నీ శరీరమున దీనిని తెలిసికొనువా డొకడు గలడు, అతడే క్షేత్రజ్ఞుడు, ప్రకృతిజ్ఞాత. అయితే తర్వాత వచ్చు నిర్వచనములను బట్టి ఒకటి స్పష్టము : క్షేత్ర మన భౌతికశరీరము మాత్రమే గాదు, ఆ శరీరము ఆధారముగా నుండి ధరించున దంతయు, అనగా ప్రకృతివ్యాపారము, మనోవృత్తి, విషయి,

విషయక్రియ యంతయుగూడ [1] క్షేత్రమే యగును (13-7). ఈ విశాలతరశరీరము సైతము వైయక్తికక్షేత్రము మాత్రమే; అదే క్షేత్రజ్ఞునియొక్క విపులతరము, సర్వాత్మకము నగు నొక ప్రపంచశరీరము, ప్రపంచక్షేత్రమును గలదు. ఏలన ప్రతి దేహధారిజీవియందును ఈ ఒకే క్షేత్రజ్ఞుడు వర్తించును : ప్రతిభూతమును తన ప్రకృతిశక్తియొక్క బాహ్యఫలితమే, తన నివాసము నిమిత్తము అతడు నిర్మించుకొన్న వస్తువే – "ఈశా వాస్యం సర్వం యత్ కించ" (ఈశ ఉప.); ఈ వస్తువు నిజానికి అతని గతిశీలశక్తియొక్క ఒక పృథగ్భూత, దృఢ, వ్యావహారిక కేంద్రము, అతడు తన వికాసమాన సామరస్యములయొక్క ఒక ప్రథమాధారము మఱియు విషయముగా ఈ కేంద్రము నుపయోగించుకొనును. ప్రకృతియం దతడు, ఏరూపమున ప్రపంచము ఒక పరిమితశరీరమునందలి చేతనను ప్రభావితముగావించి దానియందు ప్రతిఫలించునో, ఆ రూపమున దాని నెఱుంగును; అనగా మన ఏకమాత్ర మనస్సునకు గన్పించు విధముగానే మనకు ప్రపంచమున్నది. అయితే చివరకు, స్వల్పముగా గన్పించు సదేహచైతన్యము సైతము విస్తరించుకొని, విస్తరించుకొని, విశ్వము నంతను తనలో నిముడ్చుకొనగలదు – "ఆత్మని విశ్వదర్శనం" (6-29). కాని భౌతికముగా శరీరము బ్రహ్మాండమునందలి ఒక పిండాండము, మఱియు నీ బ్రహ్మాండము సైతము ఆధ్యాత్మిక క్షేత్రజ్ఞునికి తాను నివసించు ఒక శరీరము మఱియు క్షేత్రము.

5. <u>క్షేత్రశక్తులు, వికారములు</u> : మన సత్తయొక్క గోచరరూపమగు ఈ క్షేత్రముయొక్క స్వభావమును, స్వరూపమును, ప్రభవమును, వికారములను, శక్తులను గీత ప్రతిపాదించు నపు డీ పై సత్యము మనకు స్పష్ట మగును, అనగా క్షేత్ర మన ప్రకృతి క్రియాకలాప మంతయు నని తెలియవచ్చును. ఆ క్రియా సాకల్యము మనయందలి క్షేత్రజ్ఞాతయగు సదేహపురుషుని క్షేత్ర మగును. ఆధ్యాత్మిక దృక్కోణమునుండి ఈ క్షేత్రజ్ఞానము వేదోపనిషదృషుల మంత్రములలో మనకు గానవచ్చును, అటులే దాని తార్కిక, దార్శనిక విశ్లేషణము బ్రహ్మసూత్రములలో

---

[1] తైత్తిరీయోపనిషత్తు పంచవిధశరీరము లేక ప్రకృతికోశమును వివరించును– భౌతిక, ప్రాణిక, మానసిక, ఆదర్శరూప, దివ్యశరీరము; దీనిని సంపూర్ణక్షేత్రముగా తీసికొనవచ్చును. – శ్రీ అ.

మనకు లభించును; అందునిమిత్తము వానిని జూడు డని చెప్పి, గీత మాత్రము సాంఖ్యపరిభాషలో క్షేత్రమును వ్యావహారికదృష్టినుంచి సంక్షిప్తముగా ప్రదిపాదించి తృప్తిపడును. మూలమున అవ్యక్తమనబడు అవ్యాకృత (నిర్విశేష) శక్తి గలదు; దానినుంచి బాహ్యద్రవ్యముయొక్క మూలావస్థలగు పంచమహాభూతముల పరిణామము జరుగును; దానినుండియే ఇంద్రియములు, బుద్ధి, మఱియు నహంకారముయొక్క ఆంతరపరిణామము గూడ సిద్ధించును; ఇంకను ఇంద్రియవిషయము లయిదు గలవు, వీనిని, ఇంద్రియములు ప్రపంచమును గుర్తించు ప్రకారభేదము లని చెప్పుట ఎక్కువ సమంజసము – ఇవి ఇంద్రియసంబంధములు; బుద్ధి మఱియు నింద్రియములతో గూడిన అహంకారము వీనిద్వారా బాహ్యజగత్తుతో సంబంధము గల్పించుకొని వ్యవహరించును : ఇది క్షేత్రముయొక్క నిర్మాణ స్వరూపము (13–6). పిమ్మట, నొక సామాన్యచేతన గలదు, ఇది విశ్వశక్తిని చేతనీకరించి, తన పనులందు దానికి వెలుగు నిచ్చును; ఆ చేతన కొక విశేషసామర్థ్యము – "ధృతి" (13–7) – గలదు, దీనిచేత విశ్వశక్తి విషయముల సంబంధములను పట్టి నిలుపును, మఱియు మన చేతనకు తన విషయములతో గల బాహ్యాభ్యంతరసంబంధములు దీనిచేత నిలిచి, కొనసాగును. ఇవి క్షేత్రముయొక్క ఆవశ్యకశక్తులు; ఇవి యన్నియు ఏకకాలమున మానసిక, ప్రాణిక, భౌతిక ప్రకృతియొక్క సర్వసామాన్య వైశ్వశక్తులు. పోగా సుఖదుఃఖములు, ఇచ్ఛాద్వేషములు క్షేత్రముయొక్క ప్రధానవికారములు. సుఖదుఃఖములు, పురుషునియొక్క సహజానందమునకు నిమ్నప్రకృతి కల్పించిన ప్రాణిక లేక సాంవేదనిక వికారము లని వేదాంతదృక్కోణమునుంచి మనము చెప్పుకొనవచ్చును. అటులే అదే దృక్కోణమునుంచి చూచిన, ఇచ్ఛాద్వేషములు సుఖదుఃఖముల కనురూపమగు మానసిక వికారము లగును, ప్రకృతిసంస్పర్శలకు పురుషుని సమాధానమును నిర్ణయించు అతని సంకల్పమునకు ఆమె గల్పించిన వికారము లగును. ఈ ద్వంద్వములను కూర్చు భావాత్మక, నిషేధాత్మకరూపములందు నిమ్నప్రకృతిలోని అహమాత్మ విశ్వము నుపభోగించును. అసుఖము, ద్వేషము, శోకము, అరుచి, మున్నగు నిషేధాత్మకరూపములు భ్రష్ట, లేక ఉత్తమ పక్షమున, అజ్ఞానకృత విపరీత సమాధానములు (responses). రాగము, సుఖము, హర్షము, అభిరుచి, మున్నగు భావాత్మకరూపములు కుమార్గమున ప్రేరితసమాధానములు లేక ఉత్తమపక్షమున అపర్యాప్తము, మఱియు ఆధ్యాత్మికానుభవము కంటెను హీనము నగు సమాధానములు.

6. <u>జ్ఞేయవస్తువు :</u> ఈ వస్తువు లన్నియు గలిసి, ప్రాకృతప్రపంచముతో మన వ్యవహారముయొక్క మూలస్వభావము నేర్పఱచును, కాని స్పష్టముగానే అది మన సత్తయొక్క సంపూర్ణవర్ణన గాదు; అది మన ఇప్పటి వాస్తవరూపమే గాని, మన సంభావ్యతల పరమావధి గాదు. దీని కావల తెలియదగినది కొంత గలదు - "జ్ఞేయం" (13-13), మఱియు జ్ఞాత - క్షేత్రజ్ఞుడు - క్షేత్రమునుండి మఱలి ఎపుడు దానిలోని తనను, దాని ఆభాసముల వెనుకనున్న దాని నంతను తెలియజూచునో, అపుడు వాస్తవజ్ఞానము ప్రారంభమగును - "జ్ఞానం" (13-12) - ఇది జ్ఞాత యొక్కయు, క్షేత్రముయొక్కయు యథార్థజ్ఞానము. ఈ అంతర్ముఖత యొక్కటియే అజ్ఞానమునుండి తప్పించును. ఏలన ఎంతెంత మనము లోనికి బోదుమో, అంతంత వస్తువుల అధికతర, పూర్ణతర సత్యస్వరూపములను గ్రహింతుము, అటులే భగవంతుడు మఱియు ఆత్మయొక్క, ప్రపంచము మఱియు దాని గతియొక్క - ఉభయముయొక్క సంపూర్ణసత్యము నాకళించుకొందుము. కావుననే అది ఏకకాలమున క్షేత్రము మఱియు క్షేత్రజ్ఞుల జ్ఞాన మని దివ్యగురువు నిర్దేశించును - "క్షేత్రక్షేత్రజ్ఞయోర్ జ్ఞానం" (13-3), అది సంయుక్తము, ఏకీకృతము సైతము నగు ఆత్మజ్ఞానము మఱియు ప్రపంచజ్ఞానము, ఇట్టి జ్ఞానమే వాస్తవప్రకాశము మఱియు ప్రజ్ఞ యగును. ఏలన పురుషప్రకృతులు రెండును బ్రహ్మమే, కాని ప్రాకృతప్రపంచముయొక్క యథార్థసత్యము పురుషుని సత్యమును బొందిన విముక్త జ్ఞానిచేతనే కనుగొనబడగలదు. ఆత్మ మఱియు ప్రకృతియందలి ఒకే సద్వస్తువగు ఏకబ్రహ్మమే సర్వజ్ఞానమునకు విషయము.

7. <u>జ్ఞాననియమములు :</u> పిమ్మట గీత మనకు జ్ఞానస్వరూపమును వర్ణించును, కాదు, జ్ఞాననియమములను, అంతరనుభవము వైపునకు దిరిగిన మానవుని యొక్క లక్షణములు మఱియు సంకేతములను వివరించును. ఈ లక్షణములు సాంప్రదాయికముగా నంగీకరించిన జ్ఞానియొక్క స్వాభావికలక్షణములు-ఉదాహరణకు, బాహ్య, లౌకికవస్తువులయందలి ఆసక్తినుండి అతని ప్రబలవైముఖ్యము, అతని అంతర్ముఖ, మననశీల తత్త్వము, అతని దృఢచిత్తము మఱియు స్థిరసమత, మహత్తమ ఆంతరతమ సత్యములపైన, వాస్తవ సనాతన వస్తువులపైన అతని బుద్ధియొక్క సమాహిత స్థిరత్వము. ముందుగా మన కొక నైతిక నియమము, ప్రాకృతసత్తయొక్క సాత్త్వికనియంత్రణము గన్పించును. అతనియందు ప్రాపంచిక

గర్వము మఱియు దర్పముయొక్క సంపూర్ణరాహిత్య ముండును, దీనితోబాటు సరళ ఆత్మయు, క్షమాశీల, చిరసహిష్ణు, దయామయ హృదయము నుండును (13–8); ఇంకను మనఃశరీరము శుద్ధత, ఆత్మసంయమము, నిమ్నప్రకృతియొక్క అప్రతిహత శాసనము, గురుదేవునియొక్క హృదయపూర్వకోపాసనము నతని స్వభావ మగును– ఈ గురుదేవుడు హృదయస్థ దివ్యగురువు గావచ్చును, దివ్యజ్ఞానము మూర్తీభవించిన మానవగురువు గావచ్చును – ఏలన ఆ దృష్టితోనే మనము మానవగురువును పూజింతుము (13–8). అటుపిమ్మట జ్ఞానియందు పూర్ణ అనాసక్తి మఱియు సమత యొక్క అధికతర ఉదాత్త, విముక్తవైఖరి గన్పించును (13–10), ఇంద్రియవిషయముల పట్ల ప్రాకృత మానవుని కుండు అనురక్తి అతనినుండి దూరమగును, సామాన్య మానవుని క్రూరముగా హింసించు అహంకారశాసనమునుండి అతనికి మౌలిక స్వాతంత్ర్య ముండును (13–9). అత డిక కుటుంబమునందు సక్తుడు గాడు, లీన మసలే గాడు. ఈ ప్రాణిక మఱియు పాశవిక వృత్తులకు బదులు, అతని సంకల్పము, ఇంద్రియము, బుద్ధి అసక్తముగా పనిచేయును; సాధారణజీవితమును వేధించు జన్మమృత్యువులు మఱియు జరావ్యాధులందు అతడు నిశితముగా లోపమును దర్శించును; ప్రియాప్రియ ఘటనలపట్ల అతడు నిత్యము సమచిత్తుడు (13–10), ఏలన అతని ఆత్మ అంతఃస్థితము గాన, బాహ్యఘటనల కభేద్యము. ధ్యానపరమైన అతని మనస్సు ఏకాంతము వైపునకు దిరిగి, జనకోలాహలమునకు దూరముగా నివసించును. చివరకు, జీవనమును సార్థకముచేయు ముఖ్యవిషయముల పట్ల అతనిలోపల నొక ప్రబలప్రవణత యుండును, జీవనముయొక్క వాస్తవార్థము మఱియు విశాల తత్త్వముల పట్ల దార్శనికదృష్టియు, ఆంతర ఆధ్యాత్మికజ్ఞానము మఱియు ప్రకాశము యొక్క ప్రశాంతసాతత్యము (సంతతము సాగుట), వ్యభిచరించని భక్తియోగము, భగవత్ప్రేమ, విశ్వగతము మఱియు సనాతన మగు భగవత్సన్నిధి పట్ల హృదయము యొక్క గభీర, సంతత ఆరాధనాభావము అతనియందు వెలుగొందును (13–11, 12).

8. <u>బ్రహ్మము అంతయునగు ఏకము</u>: ఆధ్యాత్మిక జ్ఞాన మపేక్షించు మానసము లక్షించవలసిన ఏకమాత్ర లక్ష్యము పరమసనాతనుడు; ప్రకృతి పొగ మంచుతో కప్పబడిన అంతరాత్మ ఈ సనాతనునియందు స్థిరపడి నపుడు, అమరత్వము మఱియు సతీతత్త్వముయొక్క తన సహజ మూలచేతనను తిరిగిపొంది, అనుభవించును (13–13). క్షణికముపై నిలచుట, దృశ్యమునందు పరిమితమగుట మర్త్యత్వమును

అంగీకరించుటయే యగును; ఏది నశ్వరవస్తువులందు అంతరము మఱియు నవికార్యమో, అదియే వానియందలి నిత్యసత్యము. ప్రకృతియొక్క ఆభాసరూపములచే పీడింపబడుటకు అంతరాత్మ స్వయముగా నెపు డవకాశ మిచ్చునో, అప్పు డది తననుదానే కోల్పోవును మఱియు తన శరీరముల జననమరణముల చక్రమునందు పరిభ్రమించుచుండును. అచ్చట, వ్యక్తిత్వము మఱియు దాని ప్రయోజనముల పరివర్తనలను ఆవేగముతో ననుసరించుచు, నిర్వ్యక్తికము, అజము నగు తన ఆత్మసత్తను అంతరాత్మ లోనికి వెళ్లి, పొందజాలకుండును. అట్లు చేయగలుగుటకు అంతరాత్మ తన స్వరూపమును గనుగొనవలెను, మఱియు నేది జన్మలను ధరించునో, కాని వాని రూపనాశముతో తాను నశించదో, అట్టి తన యథార్థసత్తలోని కుపసంహరించుకొనవలెను. దేనికి జననమరణములు కేవలము బాహ్యఘటనలో, అట్టి నిత్యత్వము ననుభవించుటయే అంతరాత్మయొక్క యథార్థ అమరత్వము మఱియు అతీతత్వము. ఆ పరమనిత్యత్వము లేక నిత్యమే బ్రహ్మము. ఏది అతీతమో మఱియు నేది విశ్వాత్మకమో అది — "తత్తు" — బ్రహ్మము; అది అగ్రభాగమున ప్రకృతిపురుషుల ఖేలనమున కాధారముగా నుండు నట్టియు, వెనుకభాగమున వారి అవ్యయ ఏకత్వమునకు మూలముగా నుండు నట్టియు విముక్తసత్త యగును ; అది ఏకకాలమున క్షరము మఱియు నక్షరము, సర్వము నగు ఏకము. తన సర్వోన్నత విశ్వాతీత పదమునందు, బ్రహ్మము ఆది గాని, వికారము గాని లేని ఒక అతీత నిత్యత్వము ; అచ్చటది, బాహ్యప్రపంచము ఏ ప్రాకృతద్వంద్వముల మధ్య తిరుగుచుండునో, అట్టి సదసత్తులు, అనగా స్థాయిత్వక్షణికత్వముల కెంతో పైనుండును (13–13). కాని ఒకసారి ఈ బ్రహ్మపదార్థము మఱియు ప్రకాశమునందు జూడబడినపుడు, ఈ ప్రపంచము ద్వైతము, తాను మనఇంద్రియములకు గన్పించుదానికంటె విభిన్న మగును ; అప్పు డిక విశ్వమును మనఃప్రాణద్రవ్యముల ఒక సుడిగుండముగానో, శక్తి మఱియు పదార్థముయొక్క నిర్మాణముల ఒక సంఘాతముగానో కాక, ఈ సనాతనబ్రహ్మముతో అనన్యముగానే చూతుము — "అనాదిమత్" (13–13). ఒక పురుషుడు గలడు, అతడు తనచేతనే విశ్వగతి నంతను పూరించి, దానిని పరివేష్టించియు నుండును — నిజాని కా గతియు నతడే గదా — మఱియు నతడు ప్రతి సాంతవస్తువును అనంతత యను తన దివ్యాంబరముచే నలంకరించును (13–14) ; అతడు అశరీరుడు, శతసహస్రశరీరుడు నగు పురుషుడు, అతని బలరూప హస్తములు, వేగరూప పాదములు మనకు ప్రతివైపున నుండును; మన మెటు తిరిగినను,

అటువైపున అతని తలలు, కండ్లు మఱియు మొగముల ఆ అనంతరూపములను గాంతుము; అతని శ్రవణము సర్వత్ర కాలాతీతముయొక్క మౌనమును, కాలగత ప్రపంచములయొక్క సంగీతమును ఆలకించును – ఇదిగో, అతడే విశ్వపురుషుడు, అతని కౌగిలిలోనే మనము నివసింతుము.

9. హృదయములోని బ్రహ్మమే క్షేత్రజ్ఞుడు : ప్రకృతిపురుషుల సంబంధము లన్నియు బ్రహ్మనిత్యతయందు సంభవించు సంఘటనలు; ఈ సంబంధముల ప్రతి బింబకములు, ఘటకములు (అవయవములు) నగు ఇంద్రియములు మఱియు గుణములు పరమాత్మకు సాధనములుగా నుండి, అతని శక్తిక్రియలను అతనికి చేరవేయును. అతడు – బ్రహ్మము – మాత్రము ఇంద్రియ పరిమితుల కావల నుండును, అనగా అన్నింటిని చూచును గాని, బాహ్యచక్షువుతో గాదు; అన్నింటిని వినును గాని, శారీరకశ్రవణముతో గాదు; అన్నింటిని గమనించును గాని, పరిమితి కారక మనస్సుతో గాదు – మనస్సు ఊహించునదే గాని, ఎఱుంగునది గాదు. అతడు గుణములలో నిముడని నిర్గుణుడై నప్పటికి, వానిని తనలో గలిగియుండి, తనతత్త్వమున వానిని నిర్ణయించి, వాని క్రియ నుపభోగించును (13–15). అతడు దేనియందు సక్తుడు గాకయే, తన విశాల, శాశ్వత స్వతంత్రతయందు తన విశ్వశక్తి యొక్క సర్వక్రియను, గతిని, సందేశమును ధరించును. మనలోపల నున్న దంతయు నతడే, మనకు వెలుపల మన మనుభవించున దంతయు నతడే (13–16). చరాచర ములు, దూరస్థసమీపస్థములు – అంతయు నేకకాలమున నతడే. అతడు మన జ్ఞానమున కందని సూక్ష్మముయొక్క సూక్ష్మత్వము, అటులే మన మనస్సున కందు శక్తి, పదార్థములయొక్క స్థూలరూపము (13–16). అతడు అవిభాజ్యము మఱియు నేకము, కాని రూపములందు తనను విభజించుకొనునట్లు కన్పించును, వేఱువేఱు వస్తువులుగా గోచరించును (13–17). సర్వవస్తువులు అతనిలో నుపసంహరించు కొనగలవు, పరమాత్మలో తమ ఆత్మసత్తయొక్క అవిభాజ్య ఏకతకు తిరిగిరాగలవు. అంతయు నిత్య మతనినుండి జనించును, అతని నిత్యతయందు ధరింపబడును, అతని ఏకతలోనికి నిత్యము గ్రహించబడును (13–17). అతడు జ్యోతులకు జ్యోతి, మన అజ్ఞానాంధకారమున కంతకు నావల నిత్యప్రకాశమానుడు (13–18). జ్ఞానము నతడే, జ్ఞేయము నతడే. తాను ప్రకృతిక్రియలోనికి బంపిన అంతరాత్మ శక్తి-సంభవన్నము కాగా, దాని నిమిత్తము తేజోరూపమున తన నభివ్యక్తము చేసికొనును, ఈ తేజమే

ఆధ్యాత్మిక అతిమానస జ్ఞానరూపము ధరించి, ప్రదీప్తమనస్సును ముంచెత్తి, దాని రూపాంతరమును సాధించును. ఈ సనాతనజ్యోతి ప్రతిప్రాణిహృదయమునందును గలదు, అతడే రహస్య "క్షేత్రజ్ఞుడు," అతడే సర్వభూతముల హృదయస్థుడగు ఈశ్వరరూపమున తన సంభూతియొక్క వ్యష్టి, సమష్టిక్షేత్రములపై సధ్యక్షత వహించును (13–18). మానవుడు తన లోపలి ఈ సనాతన మఱియు విశ్వగత భగవంతుని దర్శించి నపుడు, సర్వవస్తువు లందలి అంతరాత్మ పట్ల అతడు సచేతనుడై నపుడు, మఱియు ప్రకృతిగతుడగు పురుషుని కనుగొని నపుడు, విశ్వమంతయు సనాతనబ్రహ్మమునందు పైకి లేచుచున్న ఒక తరంగ మనియు, ఉన్నదంతయు నొకే సత్త యనియు అతని కనుభూతమై నపుడు, అతడు భగవత్ప్రకాశముతో వెలుగొందుచు, ప్రాకృతప్రపంచముల సంరంభమధ్యమున ముక్తుడై నిలబడును. భగవంతుని జ్ఞానము మఱియు నీ భగవంతునికి భక్తిసహిత పరిపూర్ణాభిముఖత – ఇదియే ఆధ్యాత్మిక మహావిముక్తికి పరమరహస్యము. విముక్తి, ప్రేమ మఱియు నాధ్యాత్మికజ్ఞానము మనలను మర్త్యప్రకృతినుండి అమృతసత్తలోనికి లేవనెత్తును (13–19).

10. జీవుని జీవన్ముక్తి : పురుషుడు మఱియు ప్రకృతి సనాతన బ్రహ్మము యొక్క రెండు పార్శ్వములు మాత్రము, ద్వంద్వముగా గన్పించు నీ ద్వంద్వము అతని వైశ్వసత్తయొక్క క్రియల కాధారము. పురుషుడు, ప్రకృతి – ఇరువురు అనాదిసనాతనులు; కాని ప్రకృతి గుణములును, మన అనుభవమునకు ఆమె ధరించు నిమ్నతరరూపములును ఈ రెండు తత్త్వముల పరస్పరవ్యాపారమునందు, తమ ఆదిని గలిగియుండును (13–20). అవి ఆమెనుండియే వచ్చును. ఆమెచేతనే కారణము మఱియు కార్యము, కర్మ మఱియు దాని ఫలితములు, శక్తి మఱియు దాని క్రియల బాహ్యసంబంధమును ధరించును (13–21). అవి సదా మాఱుచుండగా, పురుషుడు మఱియు ప్రకృతి వానితో మాఱుచున్నట్లు కన్పించును, కాని ఈ రెండు శక్తులు సనాతనము మఱియు సదా ఏకరూపము. ప్రకృతి సృజించును మఱియు కర్మచేయును, పురుషుడు ఆమె సృష్టిని, కర్మను అనుభవించును (13–21); కాని ఆమె తన అవరకర్మయందు దీ అనుభవమును సుఖదుఃఖముల క్షుద్ర, మలిన రూపముల లోనికి మార్చును. బలాత్కారముగా అంతరాత్మ, అనగా వైయక్తికపురుషుడు ఆమె గుణకర్మలచేత నాకర్షింపబడును మఱియు నీ ఆకర్షణ అతనిని నానావిధజన్మలలోనికి

లాగుకొనిపోవును; వానియం దతడు వైవిధ్యమును, భిన్నభిన్నావస్థలను, శుభాశుభములను అనుభవించును (13-22). కాని ఇది యంతయు పురుషునియొక్క బాహ్యానుభవము మాత్రమే, ఏలన అతడు క్షరప్రకృతితో తాదాత్మ్యముచేత భావనయందుమాత్రమే క్షరుడు. ఆమెయొక్కయు, మనయొక్కయు దేవదేవుడు, పరమాత్మ, పరమపురుషుడు, మహేశ్వరుడు ఈ శరీరమునం దాసీనుడై యున్నాడు ;అతడు ఆమె క్రియను నిరీక్షించును - "ఉపద్రష్టా", ఆమె కార్యములను అనుమతించును - "అనుమంతా", ఆమె కర్మనంతను భరించును - "భర్తా", ఆమె బహువిధ సృష్టిని ఆదేశించును - "మహేశ్వరః", తన స్వీయసత్తకు ఆమె కల్పించిన రూపముల ఈ ఖేలనమును తన వైశ్వానందముతో ననుభవించును - "భోక్తా" (11-23). ఇది ఆత్మ-జ్ఞానము, దీనికి మన మనోవృత్తి అలవడి నపుడే, సనాతనునియొక్క సనాతనాంశముగా మనను మనము వాస్తవముగా దెలిసికొనగలము. ఒకసారి సనాతనాంశ మను ఈ జ్ఞానము ప్రతిష్ఠితమై నపుడు, మనలోని అంతరాత్మ ప్రకృతితో తన వ్యాపారమునందు బాహ్యముగా నెట్లు వర్తించినను, అది ఏమి చేయుచున్నట్లు కన్పించినను, లేక వ్యక్తిత్వము మఱియు సక్రియశక్తి మఱియు దేహబద్ధ అహంకారముయొక్క ఈ యా రూపము ధరించుచు అది ఎట్లు కన్పించినను, అది తన స్వరూపమున ముక్తము, ఇక జన్మబద్ధము గాదు; ఏలన అది తన ఆత్మయొక్క నిర్వ్యక్తికతద్వారా సృష్టియొక్క ఆంతర, అజ పురుషునితో నిపు డేకమై యున్నది (13-24). ఆ నిర్వ్యక్తికతయే, విశ్వమునందు గల సర్వముయొక్క అహంకారము లేని పరమ అహం (నేను) తో మన సంయోగ మగును.

11. <u>నశించువానిలో నశించనది</u> : ఈ జ్ఞాన మొక అంతరధ్యానముద్వారా ప్రాప్తించును, దానిద్వారా సనాతనాత్మ మన స్వీయసత్తయందే మనకు ప్రత్యక్షమగును (11-25). లేక ప్రకృతిపురుషుల వివేచనాత్మకమగు సాంఖ్యయోగముద్వారా అది ప్రాప్తించును. లేక అది కర్మయోగముద్వారా ప్రాప్తించును, ఇచ్చట మన మనస్సును, హృదయమును, సమస్తక్రియాశీలశక్తులను ఈశ్వరునికి తెఱచియుంచుట ద్వారా మన వైయక్తిక సంకల్పము కరగిపోవును, ఈశ్వరుడే మన సమస్తకర్మను స్వయముగా స్వీకరించును. మనలోపలి ఆత్మప్రేరణచేత, ఈ యా యోగమునకు, అనగా ఏకత్వమునకు గొనిపోవు ఈ యా మార్గమునకు అది యిచ్చు పిలుపుచేత ఆధ్యాత్మికజ్ఞానము మేల్కొనవచ్చును. అథవా ఇతరులనుంచి సత్యమును గుఱించి

శ్రవణముచేయుటచేతను, మనస్సు దేనిని శ్రద్ధతో, దీక్షతో వినునో, దాని భావము లోనికి మనస్సును పోతపోయుటచేతను ఆ జ్ఞానము రావచ్చును (13–26). కాని ఎట్లు వచ్చినప్పటికి, అది మృత్యువు కావల వెలుగొందు అమృతత్త్వమునకు మనల మోసికొనిపోవును. మర్త్యప్రకృతితో అంతరాత్మకు గల క్షరవ్యవహారమునకు (13–27) పైన భాసించు మన అత్యున్నతాత్మను జ్ఞానము మనకు జూపును–ఈ ఆత్మ ప్రకృతివ్యాపారమునకు మహేశ్వరుడు; సర్వవస్తువులు మఱియు ప్రాణులలో ఏకము, సమము; శరీరము ధరించినపు డది పుట్టదు, శరీరములు నశించినపుడు మరణమునకు లోను గాదు (13–28). అదియే, మనలోని సనాతనము మఱియు అమరము నగు దానిని చూచుటయే, వాస్తవదర్శనము. ఈ సమ ఆత్మను అధికాధికముగా దర్శించు కొలది, దానిసమతలోనికి మనము జరుగుదుము; ఈ విశ్వపురుషునిలో అధికాధికముగా నివసించుకొలది, మనమును విశ్వపురుషుల మగుదుము; ఈ నిత్యుని ఎఱుక అధికాధికముగా వృద్ధినందుకొలది, మనమును నిత్యతను ధరించి, శాశ్వతముగా నుందుము. అపు డిక మన మానసిక మఱియు భౌతిక అజ్ఞానము కల్పించు పరిమితి మఱియు దుఃస్థితితో గాక, ఆత్మయొక్క నిత్యముతోనే తాదాత్మ్యము చెందుదుము (13–29). అపుడు, మన కర్మ లన్నియు ప్రకృతియొక్క ఒక పరిణామము మఱియు వ్యాపార మనియు, మన వాస్తవాత్మ కార్యమును నిర్వహించు కర్త గాక, క్రియ యొక్క విముక్తసాక్షి, ఈశ్వరుడు మఱియు అసక్త భోక్తయు నని చూతుము (13–30). పైకి గన్పించు నీ విశ్వగతి యంతయు ఒకే సనాతనపురుషునియందు జరుగు నానావిధ సంభూతి; అతని సత్తయొక్క లోతులలో గల ఆమె భావము యొక్క బీజములనుండి విశ్వశక్తి సమస్తవిశ్వమును విస్తారితము, అభివ్యక్తము, అనావృతము గావించును (13–31). కాని మన ఈ శరీరమున ప్రకృతికర్మలను ఆత్మ గ్రహించి, అనుభవించుచున్నను, దాని మర్త్యతచేత తాను బాధింపబడదు, ఏలన ఆత్మ జననమరణముల కావల అనాది సనాతనము, ప్రకృతియందు తాను స్వీకరించు బహువిధవ్యక్తిత్వములకు అది పరిమితము గాదు; కారణము, అది ఈ వ్యక్తిత్వము లన్నింటియొక్క పరమాత్మ; గుణముల మార్పులచేత మాఱునట్టిది కాదు, ఏలన ఈ పరమాత్మ తాను గుణములచేత నిర్ణయింపబడదు, కర్మయందును కర్మచేయదు (13–32)–"కర్తారం అపి అకర్తారం" (4–13). కారణము, క్రియా ఫలితము లేమాత్రము స్పృశింపని ఆధ్యాత్మికస్వాతంత్ర్యమునందు అది ప్రాకృత క్రియను ధరించును; నిజానికి సర్వక్రియల ప్రారంభకము తానే అయినప్పటికి,

పరమాత్మ తన ప్రకృతిక్రీడచే ఏమాత్రము మాఱదు, లిప్తము గూడ గాదు (13–32). అంతట వ్యాపించు ఆకాశము తాను ధరించు బహువిధ రూపములచే లిప్తము లేక వికృతము గాక, యథాపూర్వము శుద్ధ, సూక్ష్మ, మూలద్రవ్యముగనే నిలుచునట్లు, ఈ ఆత్మయు సర్వ సంభావ్యవస్తువులను చేసి, వాని రూపము ధరించి నపుడు సైతము, ఆమూలాగ్రము అదే శుద్ధ, నిర్వికార, సూక్ష్మ, అనంతతత్త్వముగా నిలుచును (13–33). అది ఆత్మయొక్క పరమావస్థ–"పరా గతిః" (13–29)–, అది దివ్య సత్త మఱియు ప్రకృతి–"మద్భావః" (14–19)–, మఱియు నెవడెవడు ఆధ్యాత్మికజ్ఞానము నధిగమించునో, అతడు సనాతనునియొక్క పరమ అమరత్వము నధిరోహించును.

12. <u>సంపూర్ణసత్యము</u> : ఈ బ్రహ్మము, అనగా తన స్వీయ ప్రాకృత సంభూతిరూపమగు క్షేత్రముయొక్క సనాతన, ఆధ్యాత్మిక జ్ఞాత; ఈ ప్రకృతి, అనగా ఆ క్షేత్రముగా తనను రూపొందించుకొను అతని శాశ్వతశక్తి; మర్త్య ప్రకృతియందు అంతరాత్మయొక్క ఈ అమరత్వము–ఈ మూడును గలిసి, మన అస్తిత్వముయొక్క సంపూర్ణసత్య మగును (13-35). దాని వైపునకు మఱలినపుడు, మనలోని ఆత్మ, తన కిరణముల పూర్ణప్రభయందు, తన స్వీయసత్యముతో ప్రకృతి యొక్క క్షేత్రము నంతను ప్రకాశితము గావించును (13–34). కాగా నీ జ్ఞాన సూర్యుని ప్రకాశమున మనలో జ్ఞాననేత్రము వికసించును, అప్పు డిక మనము ఈ అజ్ఞానమునందు గాక, ఆ సత్యమునందే నివసింతుము. అప్పుడు మన ప్రస్తుత మానసిక మఱియు భౌతిక ప్రకృతికి మాత్రమే పరిమితులమై యుండుట అంధకారము వలన గలిగిన భ్రాంతి యని గ్రహింతుము, అందువలన మన నిమ్నప్రకృతి నియమమునుండి, అనగా మనోదేహముల నియమమునుండి విముక్తుల మగుదుము (13–35), అపుడు పరమాత్మయొక్క పరప్రకృతిని ప్రాపింతుము. ఈ భవ్య, పరమోచ్చ పరివర్తనము, మర్త్యప్రకృతిని విసర్జించి, ఒక అమృతభావమును గైకొనుట–ఇదియే చరమ సంభూతి, దివ్యానంత సంభూతి.

# 14. గుణాతీతత్వము

1. <u>సాధర్మ్య మొక ప్రధానాంశము</u> : పదుమూడవ అధ్యాయమున పురుష ప్రకృతులకు గల విభేదములు, కొలది నిశ్చాయకవిశేషణములచేతను, వాని శక్తి మఱియు వ్యాపారములను వర్ణించు కొలది సంక్షిప్త, కాని అర్థగర్భిత లక్షణముల చేతను త్వరత్వరగా చూపబడినవి; విశేషించి, తన గుణోపభోగముచే ప్రకృతి క్రియకు అధీనమగు దేహగత అంతరాత్మకును, గుణముల నుపభోగించుచున్నను, గుణాతీతము గాన, గుణాధీనము గాని పరమాత్మకును గల విభేదము రేఖామాత్రముగా చూపబడినది : తన సత్తను పాలించు సచేతన ధర్మమునందు, భగవంతునితో ఏకము చేయబడిన విముక్తపురుషుని గుఱించిన గీతాభావ మంతటికి ఈ పై విభేదములే ఆధారము. ఆ విముక్తి, ఆ ఏకత, ఆ దివ్యప్రకృతిధారణము, అనగా "సాధర్మ్యము" (14-2) : ఈ మూడును ఆధ్యాత్మిక స్వాతంత్ర్యముయొక్క సాక్షాత్సార మనియు, అమరత్వముయొక్క సంపూర్ణమర్మమనియు గీత ప్రకటించును (14-2). సాధర్మ్యము నకు గీత సమర్పించు నీ పరమప్రాముఖ్యము గీతాబోధనయం దొక ప్రధానాంశము.

2. <u>అమృతత్వవివేచనము</u> : అమృతత్వ మన దేహ మరణానంతరము వైయక్తికముగా నుండుటయే యని ప్రాచీన ఆధ్యాత్మిక బోధనయం దెక్కడను లేదు : నశించునవి రూపములే గాన, ఈ అర్థమున జీవులందరు అమరులే. విముక్తి నందు కొనని ఆత్మలు సైతము తిరిగితిరిగి యుగములందు జీవించును; సర్వజీవులు అభివ్యక్త ప్రపంచముల లయమునందు బ్రహ్మములో లీనముగనో, రహస్యముగనో యుండి, నూతనయుగారంభమున తిరిగి జన్మించును. ప్రళయము, అనగా ఒక యుగచక్రము యొక్క అంతము, వైశ్వరూపము మఱియు దానియందలి వైయక్తికరూపముల యొక్క తాత్కాలిక విఘటనము, ఈ విఘటన మొక స్వల్పకాలీన విరామము మాత్రమే, నిశ్చల మధ్యకాలము మాత్రమే; దీనికి పిమ్మట నూతనసృష్టి, పునర్ఘట నము, పునర్నిర్మాణము ఉట్టిపడును, దీనియం దా జీవులు మఱల ఆవిర్భవించి, తమ పురోగమన పూర్వవేగమును పుంజుకొనును, మన భౌతికమరణమును ఒక ప్రళయమే-

ఇంచుక పిమ్మట గీత ఈ శబ్దమును ఈ అర్థమున ప్రయోగించును, "ప్రళయం యాతి దేహభృత్" (14-14), అనగా అజ్ఞానవశమున ఏ రూపము మాత్రమే తానని దేహధారి ఆత్మ భ్రమించెనో, ఆ రూపము తన మూలభూతములలోనికి విడి పోవుటయే ప్రళయము, కాని ఎటుల విశ్వపురుషుడు ఒక విరామకాలమునకు పిమ్మట తన యుగచక్రభ్రమణమును తిరిగి సాగించునో, అటులే అంతరాత్మయు నిలిచియుండి, ఒక అవధి గడచిన పిమ్మట తన జన్మచక్రమును మఱల ప్రారంభించును. కాల చక్రమునందలి యిట్టి అమరత్వము దేహధారి జీవు లన్నింటికి సర్వసామాన్యము.

3. అమృతత్వము జననమరణాతీతత్వము : గంభీరతర అర్థమున అమృతత్వ మన మరణానంతర అవస్థానము, అనవరత పునరావర్తనము గాదు. దేనియందు ఆత్మ జననమరణాతీతముగా తన నెఱుంగునో, తన అభివ్యక్తి స్వభావముచేత పరిమితము గాదో, అనంతము, అవ్యయము, నిర్వికారముగా నిత్యము నగునో, ఆ పరమావస్థయే అమృతత్వము—ఎప్పుడును పుట్టదు గాన, ఎప్పుడును మరణించదు, కావున ఆత్మ అమరము. పరమేశ్వరుడు, పరబ్రహ్మము నగు పురుషోత్తముడు ఈ అమృతనిత్యత్వము సర్వదా కలిగియుండును మఱియు శరీరస్వీకరణముచే గాని, వైశ్వరూపములు మఱియు శక్తుల సంతత ధారణముచే గాని ప్రభావితుడు గాడు, కారణము, అతడు సదా ఈ ఆత్మజ్ఞానమున వర్తించును. తన నిత్యత్వమును మార్పు లేని విధముగా నెఱింగియుండుట అతని స్వభావమే యగును. అత డిచ్చట సర్వ శరీరములందు అంతర్నివాసి, అయితే ప్రతిశరీరమునందు అజుడుగా అంతర్నివాసి, అనగా తదభివ్యక్తిచేత తన చేతనయందు పరిమితుడు గాడు, తాను ధరించు భౌతిక ప్రకృతితో తాదాత్మ్యము చెందడు, ఏలన అది తన వైశ్వలీలలో ఒక చిన్న ఘటన మాత్రము. ఇంతకు విముక్తి, అమరత్వము పురుషోత్తముని సర్వదా సచేతసమగు [1] నిత్యసత్తయందు నివసించుటయే యగును. కాని ఈ మహత్తర ఆధ్యాత్మిక

---

[1] అవ్యక్తము, అనిర్దేశ్యము (12-3) నగు బ్రహ్మమునందు వైయక్తిక ఆధ్యాత్మికపురుషుని విలయమే అమరత్వముయొక్క వాస్తవార్థము లేక నియమ మని గీత ఎచ్చటను సూచించదు : దీనిని మనము గమనించదగును. అది యథార్థ యోగ లక్ష్యమును గాదు. పైగా గీత ఈశ్వరునిలోపల అతని పరమపదమునందు నివసించు టయే అమృతత్వ మని తర్వాత వచించును—"మయి నివసిష్యసి" (12-8), "పరమం ధామ" (15-6), మఱియు నిచ్చట దానినే "పరాం సిద్ధిం", "సాధర్మ్యం" అనియు వర్ణించును. అది ఒక పరమసిద్ధి, భగవంతుని సత్త మఱియు ప్రకృతితో సమాన ధర్మతను బొందుట; సృష్టియందు అవస్థితము, దాని విశ్వగతిపట్ల సచేతనము నగుచునే, మునులందరి వలె (14-1), దానికి పై నుండుట. —శ్రీ అ.

అమరత్వమును జేరుకొనుటకు దేహధారి అంతరాత్మ నిమ్నప్రకృతిధర్మము ననుసరించి జీవించుట చాలించవలెను; భగవంతుని పరమ అస్తిత్వప్రకారము నది స్వీకరించవలెను, నిజానికీ ప్రకారము తన స్వీయ సనాతన సారసత్తయొక్క ధర్మమే. కాగా తన రహస్య మూలసత్తయందు వలెనే, తన సంభూతియొక్క ఆధ్యాత్మికపరిణామమునందును భగవంతునితో సాదృశ్యములోనికి పెరుగవలెను.

4. <u>బుద్ధి జ్ఞానము కాదు చేతనావికాసము</u> : ఈ మహాకార్యమును, అనగా మానవప్రకృతినుండి దివ్యప్రకృతిలోని కారోహించుటను, భగవదున్ముఖమగు జ్ఞానము, సంకల్పము మఱియు భక్తితో గూడిన సాధనచేతనే సాధించగలము. కారణము, భగవంతునిచేత తన సనాతనాంశముగా (15-7), తన అమర ప్రతినిధిగా వైశ్వప్రకృతి క్రియాకలాపములోనికి బంపబడిన అంతరాత్మ ఆ క్రియాకలాప స్వభావముచేతనే తన బాహ్యచేతనయందు ఆ ప్రకృతియొక్క నిబంధనలతోను, ఒక మనఃప్రాణశరీరసంఘాతముతోను తాదాత్మ్యము చెంద అవశముగా బాధింపబడును– "అవశం ప్రకృతేర్ వశాత్" (9-8), మఱియు నీ మనఃప్రాణశరీరములు తమ అంతర ఆధ్యాత్మికస్వరూపమును, తమలోని భగవంతుని మఱచియుండును. ఆత్మ జ్ఞానమును, ప్రకృతితో అంతరాత్మకు గల బాహ్యసంబంధములకంటె భిన్నమగు వాస్తవసంబంధజ్ఞానమును తిరిగి ప్రాపించుట; భగవంతుని, మనలను, ప్రపంచమును ఇక భౌతికానుభవముతో గాక, ఆధ్యాత్మికానుభవముతో నెఱుంగుట : ఇది ఈ సంసిద్ధికి ఒక అపరిహార్య సాధన మగును. ఆత్మజ్ఞానము, ఈశ్వరజ్ఞానము, మఱియు మన ప్రాకృతాస్తిత్వము పట్ల ఆధ్యాత్మికవైఖరి వినా సంసిద్ధి రాజాలదు; కావుననే ప్రాచీనవిద్య 'జ్ఞానముచేతనే మోక్ష' మని నొక్కి చెప్పినది – అయితే ఈ జ్ఞానము వస్తువుల బౌద్ధికగ్రహణము గాదు, పరంతు ఒక అధికతర చేతనలోనికి మనః ప్రధానుడగు మానవుని అభివృద్ధి. అటులే అంతరాత్మవిముక్తి, అంతరాత్మసిద్ధి వినా, అనగా అంతరాత్మ దివ్యప్రకృతిలోనికి పెరుగుట వినా రాజాలదు; ఏలన నిష్పక్షపాతి యగు భగవంతుడు కొందరికా సిద్ధిని తన మనశ్చాపల్యముచేత గాని, స్వచ్ఛంద మగు తన ప్రత్యేక కృపచేత గాని సాధించిపెట్టడు. దివ్యకర్మలకు ముక్తిని సాధించు సామర్థ్యము గలదు; ఏలన మన జీవనముయొక్క అంతరప్రభువుతో అధికాధిక ఏకతను సాధించుచు, అవి ఈ సంసిద్ధికిని, ఆత్మ, ప్రకృతి, మఱియు భగవంతుని యొక్క జ్ఞానమునకును దారితీయగలవు. అటులే దివ్యప్రేమయు కార్యకారి

యగును; ఏలన దానిచేత మన ఆరాధనయొక్క ఏకమాత్ర, పరమభాజనమగు పరమునితో సాదృశ్యములోనికి పెరుగుదుము మఱియు నతని ప్రతిప్రేమను ఆహ్వానింతుము, అప్పు డీ ప్రతిప్రేమ అతని జ్ఞానముతోను, ఉద్ధారకమగు అతని శక్తి మఱియు శుద్ధతతోను మనను ముంచెత్తును. కావున- గీత వచించును - ఇది జ్ఞానములలో నుత్తమజ్ఞానము, ఏలన ఇది పరసిద్ధికిని, ఆధ్యాత్మికస్థానమునకును లేవనెత్తును-"పరాం సిద్ధిం" (14-1), మఱియు అంతరాత్మను భగవంతునితో సాదృశ్యములోనికి దెచ్చును-"సాధర్మ్యం" (14-2). ఇది సనాతనవిజ్ఞానము, ఇది పరమ ఆధ్యాత్మికానుభవము, దీనిచేత మును లందరు ఆ పరసిద్ధిని ప్రాపించిరి, సత్తాధర్మము (law) నందు పరమునితో సామ్యములోనికి పెరిగిరి, మఱియు అతని నిత్యతలో నివసించుచున్నారు, వీరు సృష్టిసమయమున పుట్టరు, ప్రళయసమయమున ఆ వ్యథ నందరు (14-2). ఇట్లు ఈ సిద్ధి, ఈ సాధర్మ్యము అమృతత్వమునకు మార్గము మఱియు అనివార్యనియమము, ఈ సాధర్మ్యము లేనపుడు, అంతరాత్మ సచేతనముగా సనాతనునియందు నివసింపజాలదు.

5. <u>తండ్రియు, తల్లియు భగవంతుడే</u> : మానవుని అంతరాత్మ తన సారతత్త్వమునందు భగవంతునితో ఏకము, అతని దివ్యతలో సారభాగము గానిచో, అది భగవంతునితో సాదృశ్యములోని కెప్పటికి పెరుగజాలదు : అది కేవలము మానసిక, ప్రాణిక మఱియు భౌతిక ప్రకృతితో నేర్పడిన ప్రాణియే యగుచో, అది ఎప్పుడును అమరము కాదు, కాజాలదు. సర్వసత్తయు భగవంతుని సత్తయొక్క ఒక అభివ్యక్తి మఱియు మనలోపల నేది గలదో, అది సనాతనాత్మయొక్క ఒక ఆత్మ. నిజమే, మనము నిమ్నతర ప్రకృతిలోనికి వచ్చి, దాని ప్రభావమునకు లోబడియున్నాము, కాని మన మిచ్చటికి పరమ ఆధ్యాత్మిక ప్రకృతినుండి వచ్చియున్నాము : ఈ నిమ్నతర అపూర్ణస్థితి మన ప్రతీయమాన (కన్పించు) సత్త కాగా, అది మన పారమార్థిక సత్త యగును. సనాతను డీ సమస్త విశ్వమును తన ఆత్మసృష్టిరూపమున వెలువరించును. అతడు ఏకకాలమున విశ్వమునకు తండ్రియు, తల్లియు నగును. అనంత విజ్ఞానముయొక్క సారమగు "మహత్తు" (14-3) అను బ్రహ్మము అతనికి గర్భము, దానియం దతడు ఆత్మ-భావనారూపమగు బీజము వేయును. అతడు అధి-ఆత్మగా, పితగా బీజము వేయును; ప్రకృతి-ఆత్మగా, మాతగా అతడే దానిని స్వీకరించును. ఈ మాత, సత్తయొక్క అనంతద్రవ్యము,

అతని సచేతనశక్తిచే నింపిన అనంత ఊర్జము, స్వయముగా పరిమితము గావించు కొను అతని అమేయ భావముతో (విజ్ఞానముతో) గర్భిణి యగును. అతడు తన ఈ మహత్తు (విశాలము) లోనికి స్వీయాత్మయొక్క భావనారూపమగు దివ్యాంకుర మును స్వీకరించి, దానిని మానసిక మఱియు భౌతికరూపములోనికి పెంపొందించును. ఇట్టి సృష్టిక్రియనుండియే మనము చూచున దంతయు నుద్భవించును; కాని యిక్కడ జన్మించున దంతయు అజము మఱియు అనంత మగు ఆదిభావముయొక్క సాంత భావము మఱియు రూపము మాత్రమే (14–4). పరమాత్మ సనాతనము మఱియు తన అభివ్యక్తి కంటెను పరము; పోగా ప్రకృతియు పరమాత్మయందు సనాతనమే, అయితే అది యుగముల క్రమగతియందు అంతము లేని సృష్టిక్రియచేతను, సమాప్తి నెఱుగని లయక్రియచేతను ముందుకు సాగును; అటులే ప్రకృతియందు ఈ యా రూపములను ధరించు పురుషుడును ఆమెవలె సనాతనుడే – "అనాది ఉభావపి" (13–20). ప్రకృతియందు యుగచక్రమును అనవరతముగా అనుసరించుచున్నపుడు సైతము, పురుషుడు జననమరణ ఘటనలకు అతీతముగా, తా నెక్కడినుండి ఉద్భవించెనో, ఆ సనాతనునియందే నిలిచియుండును, మఱియు నతడు తన బాహ్యచేతన యందు సైతము అంతర్గతము, శాశ్వతము నగు ఆ అతీతత్వము నెఱింగియుండగలడు.

6. <u>జన్మమరణకారణము తాదాత్మ్యము</u> : అయితే అంతరాత్మకు జనన మరణములు మఱియు బంధనముయొక్క ఆభాసమును కల్పించున దేది ? – అది ఆభాసమాత్రమే యగుట స్పష్టమే గదా. తదాభాసకారణ మొక గౌణక్రియ లేక చేతనావస్థ, తమ పరిమితక్రియలందు ప్రకృతిగుణములతోను, మనఃప్రాణశరీరముల అహం–బద్ధ కర్మగ్రంథితోను అంతరాత్మయొక్క ఆత్మవిస్మృతి పూర్వకమగు తాదాత్మ్యము. ప్రకృతిగుణముల పై కెగయుట, అనగా "త్రైగుణ్యాతీతత" (2–45) ఆవశ్యకము; అది లేనిచో, నిమ్నక్రియయొక్క సంమోహకశక్తినుండి వెలువడి, మన పూర్ణసచేతన సత్తయం దడుగిడజాలము, అటులే ఆత్మయొక్క విముక్తప్రకృతిని, దాని సనాతన అమరత్వమును ధరించజాలము. ఇట్టి సాధర్మ్యస్థితినే గీత యిపుడు వివరించనున్నది. ఒక పూర్వాధ్యాయమునందు (2–45), ఇతః పూర్వమే, గీత దీనిని సూచించి, సంక్షిప్తముగా నైనను నొక్కి చెప్పెను. కాని, గుణములన నేమియో, అవి ఎట్లు అంతరాత్మను బంధించి, ఆధ్యాత్మికస్వతంత్రతకు దూరముచేయునో, మఱియు గుణాతీతత్వ మన నేమియో, గీత ఇపుడు ఎక్కువ కచ్చితముగా చూపవలసియున్నది.

7. గుణాత్మకము–పరిమాణాత్మకము : ప్రకృతియొక్క క్రియాప్రకారము లన్నియు తమ మూలమునందు గుణాత్మకము, కావుననే వానికి గుణము అని పేరు. విశ్వమును గుఱించిన ఎట్టి ఆధ్యాత్మికభావనయం దైనను ఇట్లే కావలయును; ఏలన చైతన్యమును, జడమును కలుపునట్టి మాధ్యయము (medium) అంతరాత్మ–శక్తి గావలెను, మఱియు ప్రారంభకక్రియ మానసికము మఱియు గుణాత్మకము గావలెను, భౌతికము మఱియు పరిమాణాత్మకము గాదు; ఏలన విశ్వశక్తియొక్క సమస్తక్రియ యందును, గుణము అభౌతికము మఱియు నధికతర ఆధ్యాత్మికము నగు తత్త్వము, ఆమె గతియొక్క పూర్వరూపము. కాని యిప్పటి భౌతికవిజ్ఞానముయొక్క ప్రాబల్యముచే ప్రకృతిని గుఱించిన మఱియొక దృష్టికి మన మలవడియున్నాము; ఏలన దానియందు మనకు కొట్టవచ్చినట్టు కన్పించు ప్రథమవిషయము ఆమె వ్యాపార మున పరిమాణాత్మక పార్శ్వమునకు గల ప్రాముఖ్యము మఱియు రూపముల నిర్మాణమున పరిణామాత్మక సంయోగములు మఱియు విన్యాసములకు (కూర్పులకు) ఆమె అధీనత. అయినను, శక్తి స్వతఃసిద్ధ జడతత్త్వముయొక్క ఒక చాలక సామర్థ్యము, లేక జడములోపల పనిచేయు ఒక అంతర్వర్తిసామర్థ్యము–అనుకొనుట సరికాదు, జడద్రవ్యమే శక్తియొక్క ఒక తత్త్వము లేక క్రియ–అను నేటి భౌతిక విజ్ఞాన పరిశోధన విశ్వప్రకృతికి సంబంధించిన ప్రాచీనదృష్టికి కొంతవఱకు మఱల ప్రాణము పోసినది. ప్రాచీన భారతీయమనీషుల విశ్లేషణము ప్రకృతియొక్క పరిణామాత్మకక్రియకు స్థాన మిచ్చినది–"మాత్రా"; కాని, పరిమాణము ప్రకృతి యొక్క బాహ్య, నిర్వాహక క్రియయొక్క ధర్మము కాగా, లోపలి భావాత్మక (ideative) నిర్వాహకశక్తియే ప్రథమ నిర్ధారక (determinant) మనియు, అది వస్తువుల "గుణము" మఱియు " స్వభావమును " బట్టి వానిని గూర్చు ననియు, అదియే వస్తువుల బాహ్య పరిణామాత్మక రచనల కాధార మనియు ప్రాచీనుల విశ్లేషణము తెలుపును. కాని భౌతికప్రపంచముయొక్క అడుగున ఈ సత్యము గోచరము కాదు; కారణము, అక్కడ ఆధారభూతమగు భావాత్మకతత్త్వము, "మహద్ బ్రహ్మము" (14-3), జడద్రవ్యము మఱియు జడశక్తిచేత కప్పబడియుండుట మాత్రమే. కాని భౌతిక ప్రపంచమునందు సైతము, ఒకదానితోనొకటి సర్వథా సమమగు పరమాణువుల విభిన్న సంయోగములు మఱియు పరిమాణములు అద్భుతము, నానావిధము నగు ఫలితముల నిచ్చుచున్నవి ; దేని అభివ్యక్తికి భౌతిక

విన్యాసములు కేవలము అనుకూల సాధనములో, అట్టి వైవిధ్యకారక గుణముయొక్క పటుతరశక్తి లేనిచో, ఫలితవైవిధ్యము నెట్లును వివరించజాలము. లేక, మన మిట్లు సరాసరి చెప్పుదము—విశ్వశక్తిలోపల ఒక రహస్య భావాత్మక సామర్థ్య ముండవలెను— "విజ్ఞానము", ఇదియే మనకు గర్పించు బాహ్యవిన్యాసముల లెక్కలను స్థిరీకరించి, వాని ఫలితములను నిర్ణయించును, జడబుద్ధి ఈ భావాత్మకవిజ్ఞానముయొక్క సాధనము మాత్రమే. విజ్ఞానము ఆత్మయందలి మూలభావము, ఇదియే బాహ్యవిన్యాసములను రూపొందించి, సాధనలుగా నుపయోగించుకొనును. పోగా ప్రాణిక, మానసిక సత్త యందు గుణము ప్రధానశక్తిగాను, శక్తిపరిమాణము ఒక గౌణాంశముగాను వెంటనే, స్పష్టముగా గోచరించును. నిజానికి మానసిక ప్రాణిక భౌతిక సత్తలు మూడును గుణపరిమితులకు అధీనము, అవి దాని నిర్ధారణలచేతనే పాలింపబడును; కాని సత్తా స్తరములందు క్రిందికి దిగుకొలది ఈ సత్యము ఎక్కువెక్కువగా మఱుగుపడును. ఒక్క పరమాత్మ మాత్రమే గుణముయొక్క గాని, రాశియొక్క గాని ఎట్టి పరిమితులకు లోబడదు, కారణము, దాని అపరిమేయము, అనిర్ధార్యము నగు అనంతత తన సృష్టినిమిత్తము తాను వృద్ధిపఱచి, ఉపయోగించుకొను గుణ, పరిమాణములకు అతీతముగా నుండును, మఱియు నది తన భావసత్త – 'మహత్తు', భావబలము – 'విజ్ఞానము' యొక్క శక్తిచేత సర్వనియమములను స్థిరీకరించును.

8. <u>ద్వివిధ గుణనిర్వచనము :</u> కాని ప్రకృతియొక్క గుణాత్మక క్రియ వివరమునందును, వైవిధ్యమునందును అతిగహనము, అనంతము; కావున అది యంతయు గుణముయొక్క మూడు సాధారణప్రకారముల ఆకృతిలో చిత్రించబడును–"సత్త్వము, రజస్సు, తమస్సు" (14–5); ఈ మూడును అన్యోన్యప్రోతము, దాదాపు అవిచ్ఛేద్యము నయి, సర్వత్ర నుండును. గీతయం దీ గుణములు, మానవుని యందు వాని మానసికక్రియను బట్టి, లేక ఆహారాదులయందు, అవి మానవమానసము లేక ప్రాణముపై బఱపు ప్రభావమును బట్టి మాత్రమే వర్ణింపబడును. ఇంతకంటెను వ్యాపకమైన గుణముల నిర్వచనము నపేక్షింతు మేని, భారతీయ మతముయొక్క ప్రతీకాత్మక (symbolic) భావమునందు దాని మెఱపు బహుశః మనకు ప్రాప్తించగలదు : ఈ భావము రక్షకుడగు విష్ణువునకు సత్త్వగుణమును, సృష్టికర్తయగు బ్రహ్మకు రజస్సును, సంహారకుడగు రుద్రునికి తమస్సును ఆపాదించును. ఈ భావము వెనుక నున్న ఉపపత్తిపై దృష్టి సారింతు మేని, ప్రకృతియొక్క ఈ

ప్రకారములు లేక గుణములు సమత, ప్రవృత్తి మఱియు జడత యను ఆమెయొక్క మూడు సహవర్తి, అవిచ్ఛేద్య శక్తులని మనము నిర్వచించవచ్చును. కాని ఈ మూడు శక్తులును విశ్వశక్తియొక్క బాహ్యక్రియకు సంబంధించిన, గుణముల బాహ్యరూపములు మాత్రమే. చేతన మఱియు శక్తి ఏకమాత్రసత్తయొక్క జంట రూపములుగా మనము చూచినపుడు గుణములు వేఱు విధముగా గన్పించును - ఈ చేతనాశక్తులు సత్తామూలమునందు సదా సహవర్తిగా నుండును; అయితే ప్రపంచము యొక్క ప్రారంభావస్థయందు, చేతనాప్రకాశము నిశ్చేతనశక్తియొక్క ఒక వ్యాపక క్రియయందు అంతరించినట్లు గన్పట్టవచ్చును, అటులే ఆధ్యాత్మిక శమముయొక్క వ్యతిరేకధ్రువమునందు, శక్తిక్రియ సాక్షిచేతనయొక్క ఒక నిశ్చలతయందు అంతరించినట్లు దోపవచ్చును. ఈ రెండు అవస్థలును వేఱుపడినట్లు గన్పించు ప్రకృతిపురుషుల అంతిమస్థానములు, కాని ఇందు ప్రతియొకటి తన అంతిమస్థానము నందు తన సనాతనసహచరియగు రెండవ దానిని రద్దుచేయదు, అంత అయితే దానిని తన ప్రత్యేకరూపముయొక్క లోతులలో దాచియుంచును. కావున, నిశ్చేతనముగా గన్పించు శక్తియందు సైతము చేతన సర్వదా యుండును గాన, ఏది త్రిగుణముల బాహ్యతర కార్యనిర్వాహక క్రియకు ప్రాణముపోయునో, అట్టి వాని అనురూప మానసికశక్తిని గనుగొనవలసియున్నది. తమ మానసిక పార్శ్వమునందు గుణముల నిట్లు నిర్వచింపవచ్చును : తమస్సు ప్రకృతియొక్క నిశ్చేతనరూపమగు శక్తి, రజస్సు కామనావేగములచేత ప్రబుద్ధమైన క్రియాత్మకము, అన్వేషణపరము నగు అజ్ఞానరూపమగు ఆమె శక్తి, సత్త్వము జ్ఞానధారకము, సమన్వయసాధకము నగు ఆమె శక్తి.

9. గుణముల పరస్పరప్రభావము : ప్రకృతియొక్క గుణాత్మక ప్రకారములు మూడును సమస్త వైశ్వవ్యాపారమునందు విడదీయరాని విధముగా సల్లుకొని యున్నవి. జడతాతత్త్వమగు తమస్సు ఒక నిష్క్రియ జడ నిశ్చేతనము, ఇది సమస్త ఆఘాతములను, సంస్పర్శలను కేవలము సహించును, వానిని జయించు ప్రయత్నము సలుపదు, మఱియు తనకుదా నయితే, శక్తి విఘటనమునకును, పదార్థ విచ్ఛేదమునకును దారితీయును. కాని అది రజస్సుయొక్క చాలకశక్తిచే పరిచాలిత మగును, మఱియు జడముయొక్క నిశ్చేతనమునందు సైతము రక్షకతత్త్వమగు

సత్త్వముయొక్క సంపర్కమును, ఆలింగనమును బొందును; ఏలన సత్త్వ మచ్చట ఉపలబ్ధము గానప్పటికి, లోపల స్వతఃసిద్ధముగా నుండును. భౌతికశక్తి తన ప్రాథమిక క్రియయందు తామసికముగా–జడముగా–గన్పించును; అది నిశ్చేతనము, యాంత్రికము, తన గతియందు విఘటనశీలము ననిపించును. కాని మూక రాజసిక ప్రవృత్తియొక్క ఒక విరాట్ శక్తి దానిని వశముగావించుకొని, దాని విఘటనక్రియ ద్వారానే దానిచే నిర్మాణమును, సృష్టిని పట్టి చేయించును; అటులే నిశ్చేతనముగా గన్పించు దాని బలమునందే గల ఒక సాత్త్విక భావనాత్మకతత్త్వము దానిని వశము గావించుకొని, దానియందలి తమోరజోరూప విరుద్ధప్రవృత్తులపై ఒక సామరస్యమును, రక్షకవ్యవస్థను విధించును. ప్రకృతియందలి రజస్సు జడపదార్థమునందు సృజనాత్మకమగు గతిరూప తత్త్వముగా – ప్రవృత్తిగాగన్పించును; అదే రజస్సు ప్రాణముయొక్క ప్రబలస్వభావమునందు అన్వేషణ, కామన, మఱియు క్రియయొక్క ఒక సచేతన లేక అర్ధచేతన ఆవేశరూపమున ఎక్కువ స్పష్టముగా గోచరించును; ఏలన తదావేగము సమస్త ప్రాణికసత్తయొక్క స్వభావమే యగును. మఱియు నీ రజోగుణము తనకుదానుగా ఎట్టి నిశ్చితఫలితము లేని ఒక చిరస్థాయి, కాని క్షరము, చంచలము నగు జీవనము, క్రియ మఱియు సృష్టికి దారితీయును. ఈ రజోగుణముయొక్క అజ్ఞక్రియ ఒక వైపున తమోగుణముయొక్క విఘటనశక్తికృతమగు మృత్యువు, క్షయము మఱియు జడత నెదుర్కొనుచుండగా, రెండవ వైపున సత్త్వశక్తిచే నిది స్థిరీకృతము, సామరస్యపూర్ణము గావించబడును; ఈ సత్త్వశక్తి ప్రాణముయొక్క నిమ్నరూపములందు అవచేతనముగాను, మనస్సు వికసించిన కొలది ఎక్కువెక్కువ సచేతనముగాను, పూర్తిగా వికసించిన మనోమయ పురుషుని పరిణతబుద్ధియొక్క ప్రయత్నమునందు మిక్కిలి సచేతనముగాను వర్తించును. సత్త్వము, అనగా బోధాత్మక జ్ఞానము మఱియు అనురూప సారూప్యీకరణము, మానము మఱియు సంతులనముల రూపమగు తత్త్వము, తనకుదానుగా మాఱని ప్రకాశమయ సామరస్యముల ఒకానొక సమ్మేళనమునకు మాత్రమే దారితీయును; అట్టి సత్త్వము ఈ ప్రపంచగతులయందు శాశ్వతమగు రాజసిక ప్రవృత్తిచేత చంచలమగు సంఘర్షము మఱియు క్రియలోనికి నెట్టబడును, అటులే జడతా, నిశ్చేతనరూపమగు తామసశక్తులచే పరాభూతము లేక పరివేష్టితము నగును. ప్రకృతియొక్క మూడు గుణాత్మక ప్రకారముల, సంమిశ్రము, పరస్పరవ్యాహతము నగు ఖేలనముచేత శాసితమగు ప్రపంచముయొక్క బాహ్యరూప మిదియే యగును.

10. సత్త్వస్వరూపము, ఫలితము : విశ్వప్రకృతియొక్క ఈ సామాన్య విశ్లేషణమును, ప్రకృతియందు మానవుని బంధనమునకు మఱియు ఆధ్యాత్మిక స్వాతంత్ర్యప్రాప్తికి సంబంధించినంతవఱకు గీత అతని మానసిక ప్రకృతికి అన్వయించును. సత్త్వము - గీత చెప్పును - తన నిర్మలత్వముచేత ప్రకాశ, ప్రకాశనముల కారణమగును మఱియు నా నిర్మలత్వబలముచేత నది ప్రకృతిలోపల నెట్టి వ్యాధిని, ఆధిని లేక దుఃఖమును పుట్టనివ్వదు (14-6). గృహద్వారములు సూర్య రశ్మికి తెఱచి నప్పుడు వలె, ఎపుడు సమస్త శరీరద్వారములలోనికి బోధ, జ్ఞానముల ప్రకాశప్రవాహము వచ్చిపడునో, ఎపుడు బుద్ధి సావధానము మఱియు భాసితము, ఇంద్రియములు నిశితము, సమస్త మనోవృత్తి సంతుష్టము మఱియు ప్రకాశపూర్ణము, నాడీసత్త శాంతము, సుఖితము మఱియు ప్రసన్నము - "ప్రసాద" (2-64) - అగునో, అపుడు ప్రకృతియందు సత్త్వగుణము గొప్ప వృద్ధిని, ఉత్కర్షను బొందె నని తెలియదగును (14-11). ఏలన జ్ఞానము, సామరస్యపూర్ణ ఆరామము (ease), సుఖము మఱియు సంతోషము సత్త్వముయొక్క సహజఫలితములు. సాత్త్వికమగు సుఖము, తృప్తిజెందిన బుద్ధిసంకల్పముల ఆంతరప్రసాదము గొనివచ్చు తుష్టి మాత్రమే గాదు ; పరంతు జ్ఞానప్రకాశమునందు అంతరాత్మయొక్క స్వ-ప్రాప్తిచే గాని, సాక్షి-ఆత్మకును, పరిసరప్రకృతికిని నడుమ సమ్మతి లేక పర్యాప్త, యథార్థ సమాధానముచే గాని జనించు సమస్త హర్షము మఱియు పరితోషము సాత్త్విక సుఖములోనికే వచ్చును.

11. రజఃస్వరూపము రాగము : రజస్సు - మఱల గీత చెప్పును - రాగాత్మము, అనగా దాని సారము అనురాగము మఱియు లాలసవలన బుట్టు ఆకర్షణ. అది కామ్యవిషయములందు ఆత్మసంగముయొక్క సంతానము ; అప్రాప్త తృప్తి నపేక్షించు ప్రకృతితృష్ణనుండి అది జనించును (14-7). కావున అది అశాంతి, తాపము, కామము, లోభము మఱియు సంరంభముతో నిండియుండును, అది అన్వేషణశీల ప్రేరణల మూర్తీభావము. రజోగుణము వృద్ధిజెంది నపు డిది యంతయు పెచ్చుపెరుగును (14-12). అది కామబలము, అదియే సమస్త సాధారణ వ్యక్తిగత కర్మారంభమునకు ప్రేరణ, అదియే మన ప్రకృతియందలి సంభ్రమము, లాలస మఱియు ప్రచోదనయొక్క సమస్తవృత్తికి మూలము, మఱియు నీ వృత్తియే ప్రవృత్తివెనుక నున్న శక్తి. ఇట్లు రజస్సు స్పష్టముగానే ప్రకృతిగుణములలో

నొకటియగు చాలకశక్తి యగును. దాని ఫలము కర్మవ్యగ్రత, మఱియు దుఃఖము, బాధ, సర్వవిధశోకము ; ఏలన యోగ్యరూపమున విషయప్రాప్తి దీనికి లేదు — దాని కామమే అప్రాప్తిని సూచించును — మఱియు ప్రాప్తవస్తువుయొక్క దాని సుఖము సైతము వ్యథితము, అస్థిరము ; కారణము, దీనికి స్పష్టజ్ఞానము లేదు, వస్తువు నెట్లు పొందవలెనో తెలియదు, సామరస్య, సముచితభోగముల రహస్యమును సైతము మది కనుగొనజాలదు. జీవితముయొక్క అజ్ఞ, ఆవేగమయ అన్వేషణమంతయు ప్రకృతియొక్క రజోగుణమునకు జెందును.

12. <u>తమఃస్వరూపము అప్రకాశము, అప్రవృత్తి</u> : చివరకు, తమస్సు జడతాజ్ఞానములనుండి జనించును (14–8), మఱియు దాని ఫలము సైతము జడతాఽజ్ఞానములే. తమస్సుయొక్క అంధకారమే జ్ఞానము నావరించి, సమస్తసంకల్పమును, వ్యామోహమును బుట్టించును. కావున అది సత్త్వమునకు వ్యతిరేకము ; ఏలన సత్త్వసారము ప్రకాశము (14–11) కాగా, తమస్సారము అప్రకాశము (14–13). కాని తమోగుణమెట్లు జ్ఞానాసమర్థతను, అజాగ్రత్తను గొనివచ్చునో, అట్లు కర్మాసమర్థతను, అజాగ్రత్తను గొనివచ్చును ; అలసత, శిథిలత, నిద్ర ఈ గుణమునకు జెందును. కాన ఇది రజోగుణమునకును వ్యతిరేకము ; ఏలన రజోగుణసారము గతి, ప్రేరణ మఱియు చలత్వము (kinesis), అనగా "ప్రవృత్తి" (14–12) కాగా, తమోగుణసారము జడత్వము, అనగా "అప్రవృత్తి" (14–13). ఇట్లు తమస్సు అజ్ఞానముయొక్క జడత, అకర్మయొక్క జడత — అది ఒక ద్వివిధ అభావము.

13. <u>గుణముల బంధనరూపము</u> : ఈ మూడు ప్రకృతిగుణములు సర్వమానవులందును గలవు, సక్రియముగా గలవు (18-40), మఱియు నెవ్వడు–సర్వథా గుణరహితు డని కాని, ఏదియోయొక గుణముక్తు డని కాని చెప్పజాలము. ఇతర గుణములను వర్జించి, ఒకే గుణరూపమున పోయబడినవా డుండడు. సర్వమానవులు తమయందు ఎంతోకొంత కామము మఱియు కర్మప్రవృత్తియొక్క రాజసికప్రేరణ గలిగియుందురు ; అటులే ప్రకాశసంతోషములయొక్కయు, కొంత సంతులనము యొక్కయు, తనతోను, తన పరిసరములు మఱియు విషయములతోను మనస్సు యొక్క కొంత సమాధానముయొక్కయు సాత్త్వికవరమును గలిగియుందురు ;

...లే తామసిక అసమర్థత మఱియు అజ్ఞానము లేక నిశ్చేతన అందరిలోను కొంత యుండును. కాని ఈ గుణము లెవ్వరియందును తమ పరిణామాత్మక క్రియయందు గాని, తమ అంశముల సంయోగమునందు గాని ఒకే రీతి నుండవు. ఏలన అవి ... ప్రతిక్రియలు మఱియు సదా ఒకదాని స్థాన మొకటి ఆక్రమించుచు, ఘర్షణపడు చుండును. ఇప్పు డొకటి ముం దుండును, ఇపు డొకటి వృద్ధిజెంది, ప్రాబల్యము వహించును. మఱియు ప్రతిగుణము మనలను తన స్వాభావిక క్రియ మఱియు క్రియాఫలితములకు లోనుగావించును. ఒకానొక గుణముయొక్క సామాన్య మఱియు సాధారణ ఆధిక్యముచేతనే ఇతడు తన ప్రకృతియందు సాత్త్వికుడు, రాజసికుడు లేక తామసికుడు – అని మనము చెప్పగలము; కాని యిది యొక సామాన్య వర్ణనయే గాని, కేవల, నిరపేక్ష వర్ణన కాజాలదు. మూడు గుణములును గలిసి ఒకే త్రివిధ శక్తి యగును, అవి తమ క్రియాప్రతిక్రియలచేత ప్రాకృతమానవుని స్వభావమును, దానిద్వారా అతని బాహ్యవ్యవహారమును నిర్ణయించును. కాని ఈ త్రివిధశక్తి అదే సమయమున త్రివిధ బంధనసూత్రము నగును. "ప్రకృతినుండి జనించిన మూడు గుణములు దేహమునందు అందలి అవ్యయనివాసిని బంధించును." (14–5) – అని గీత వచించును. ఒకానొ కార్థమున, గుణముల క్రియ ననుసరించి నపుడు బంధనము తప్పదని, మనము వెంటనే చూడవచ్చును; ఏలన అవి తమ గుణము మఱియు క్రియయొక్క సాంతతచేత పరిమితములు గాన, పరిమితత్వహేతువు లగును. తమస్సు తన రెండు వైపులను ఒక అశక్తతయే గాన, స్పష్టముగనే పరిమితత్వము నందు బంధించును (14–8). రాజసిక కామన తన కర్మారంభకరూపమున ఒక విస్తృత భావాత్మక (positive) శక్తి యగును, కాని అట్లయినను ఆ కామము, మానవుని పట్టి, పరిమితము, స్వాయత్తము చేసికొనుటచే, సదా బంధనమే కాక తప్పదని బాగుగనే చూడగలము. మంచిది, కాని జ్ఞాన, సుఖముల శక్తియగు సత్త్వ మెట్లు బంధన మగును? ఏల బంధన మగు ననిన, అది మానసిక ప్రకృతియొక్క ఒక తత్త్వము, కావున అది పరిమిత మఱియు పరిమితికరమగు జ్ఞానతత్త్వము; అటులే ఏ సుఖము సుఖవిషయమును సరిగా ననుసరించుట లేక పొందుటపై నాధారపడునో, అథవా మనోవ్యాపారముయొక్క ప్రత్యేకావస్థలపై నాధారపడునో, సంధ్యా ప్రకాశము మాత్రమే యగు మనఃప్రకాశముపై నాధారపడునో, సత్త్వ మదిగో, అట్టి సుఖతత్త్వము. సాత్త్వికసుఖ మొక అస్థిర తీవ్రత లేక పరిమిత ఆరామము (ease) మాత్రమే యగును. దీనికంటె మిక్కిలి భిన్నమైనది మన అనంత

ఆధ్యాత్మిక జ్ఞానము మఱియు మన ఆధ్యాత్మికసత్తయొక్క స్వతంత్ర, స్వతఃసిద్ధ ఆనందము.

14. సంగము బంధనహేతువు : కాని అపుడీ ప్రశ్న ఉదయించును - మన అంతరాత్మ, ప్రకృతిగతమైనప్పటికి, అనంతము, అవ్యయము గదా? అయినప్పుడు తనసెందుకు ప్రకృతినిమ్న క్రియకు పరిమితము గావించుకొని, బంధనమునకు లోనగును? మఱియు తనకు మూలమగు పరమాత్మవలె, తన సక్రియపరిణామము యొక్క స్వపరిమితులను అనుభవించుచున్నపుడు సైతము తన (లోపలి) అనంతత యం దెందుకు ముక్తము గాదు? గుణములందు, గుణక్రియాఫలితములందును మన సంగమే దానికి కారణ మని గీత వచించును. సత్త్వము సుఖమునందు, రజస్సు కర్మయందు, తమస్సు, జ్ఞానము నావరించి, ప్రమత్తత మఱియు అకర్మయందు సక్తముగావించును (14-9). లేక మఱల, "సత్త్వము జ్ఞానసంగముచేతను, సుఖసంగముచేతను బంధించును; రజస్సు కర్మసంగముచేత అంతరాత్మను బంధించును; తమస్సు ప్రమత్తత, అలసత మఱియు నిద్రలచేత బంధించును" (14-6, 7, 8). వేఱు మాటలలో, గుణములు మఱియు వాని ఫలితముల భోగమునందు సక్తతచేత, అంతరాత్మ ప్రకృతియందలి ప్రాణమనోదేహముల నిమ్న బాహ్యక్రియయందు తన చేతనను కేంద్రీకరించి, వీని రూపములలో తననుదాను బంధించుకొనును మఱియు వెనుక, పరమాత్మయందలి తన స్వీయ అధికతరచేతనను మఱచినదగును, విమోచకపురుషుని విముక్త శక్తి మఱియు వ్యాప్తిపట్ల అనభిజ్ఞమగును. స్పష్టము గానే, విముక్తులము మఱియు పూర్ణులము నగుటకు, గుణములనుండి దూరముగాను, పైకిని బోయి, ప్రకృతికి పైన భాసించు విముక్త ఆధ్యాత్మికచేతనయొక్క శక్తిని తిరిగి పొందవలెను.

15. కర్మయందే కర్మాతీతత్వమునకు ఉపాయము. కాని దీని అర్థము సర్వకర్మవిరామమైనట్లు గన్పించును; కారణము, సమస్త ప్రాకృతక్రియయు గుణములచేతనే చేయబడును. అంతరాత్మ తనకుదానుగా కర్మచేయజాలదు, ప్రకృతి మఱియు నామె గుణములద్వారానే చేయగలుగును. అయినను గీత గుణవిముక్తిని విధించుచునే, కర్మావశ్యకతను గట్టిగా చెప్పును. ఇచ్చటే గీత ఫలత్యాగముపై ఎందుకు పట్టుబట్టునో, దాని మహత్త్వము విదితమగును; ఏలన ఫలకామనయే ఆత్మ

బంధనయొక్క అత్యంత ప్రబలకారణము, కావున దానిని త్యజించుటచే ఆత్మ కర్మయందు విముక్తము కాగలదు. తామసికకర్మయొక్క పరిణామము అజ్ఞానము, రాజసికకర్మయొక్క పరిణామము దుఃఖము (14-16)-ప్రతిక్రియ, ఆశాభంగము, అసంతృప్తి లేక అనిత్యతయొక్క దుఃఖము; కావున ఇట్టి పరిణామములందు పర్యవసించు తామస, రాజసకర్మల ఫలములయం దాసక్తిలో నెట్టి హితమునుండదు. కాని సముచితముగా చేయబడిన కర్మఫలము సాత్త్వికము మఱియు నిర్మలము (14-6), మఱియు నిట్టి కర్మయొక్క ఆంతర పరిణామము జ్ఞానము మఱియు సుఖము. అయినను ఈ సుఖమయ వస్తువులయందు సంగమును సైతము పూర్తిగా త్యజించవలెను; ప్రథమకారణము, మానసమునం దవి పరిమిత మఱియు పరిమితికర రూపములు, రెండవ కారణము, సత్త్వము సంతతము రజస్తమస్సులచే అనుగతము, ఆక్రాంతమునై యుండుటచే ఏ క్షణమునం దైనను అది వానిచే పరాభూతము కావచ్చును గాన, సత్త్వస్థితి సదా అభద్రము. కాని ఒకడు ఫలాసక్తినుండి సర్వథా విముక్తు డైనను, అసలు కర్మయందే అతనికి సంగ ముండవచ్చును-అది కర్మకొఱకే కర్మయందలి రాజసికబంధము గావచ్చును; ప్రకృతిచోదనకు లొంగిపోవుటచే తామసిక బంధము గావచ్చును; అథవా బాగుగా చేయబడిన (14-16) కర్మయొక్క బాగువలన గలుగు ఆకర్షణచే సాత్త్వికబంధము గావచ్చును. ఈ సాత్త్వికబంధము జ్ఞాని లేక పుణ్య కర్మునియందు బలముగా నుండును. కాగా, దీనిని తరించు ఉపాయము గీతయొక్క మఱియొక ఉపదేశమునందు గలదు - అసలు కర్మలనే కర్మప్రభువునకు ఇచ్చివేసి (3-30), అతని సంకల్పముయొక్క నిష్కామ, సమచిత్త నిమిత్తమాత్రము గమ్ము (11-33) - అని గీత మార్గము చూపును. మన కర్మలయొక్క సమస్త కర్తృశక్తియు, కారణమును ప్రకృతిగుణములే యని కనుట, పిమ్మట గుణములకు పరమున వర్తించు పరమును దెలిసికొని, తదభిముఖ మగుట - ఇదియే నిమ్న ప్రకృతిపై కెగయుమార్గము. ఇట్లుమాత్రమే మనము భగవంతునిగతిని మఱియుస్థితిని బ్రాపింపగలము-"మద్-భావ" (14-19). ఈ ప్రాప్తిచేత జననమరణములకును, వాని ఆనుషంగికములగు క్షయము, జర, మఱియు దుఃఖములనుండియు విముక్తమైన అంతరాత్మ అమృతత్త్వమును, సనాతనమగు దాని నంత నుపభోగించును.

16. <u>గుణాతీతుని వర్ణన</u> : కాని అట్టి మానవుని లక్షణము లేవియగును? అతని కర్మ ఏది యగును? కర్మయందు సైతము అతడు గుణాతీతు డని ఎట్లు

చెప్పబడును ? (14–21)-అని అర్జును డడుగును. దేనిని గుఱించి నేను - శ్రీ కృష్ణుడు చెప్పను - మఱల మఱల చెప్పియున్నానో, ఆ సమతయే అతని లక్షణము. ఆ లక్షణ మేది యన, ఆంతరముగా నతడు సుఖదుఃఖములను సమముగా చూచును; అతనికి బంగారము, మట్టి, రాయి సమమూల్యములు; అతనికి ప్రియాప్రియములు, నిందాస్తుతులు, మానావమానములు, శత్రు మిత్ర పక్షములు సమవస్తువులు (14–24). అత డొక జ్ఞానమయ, అవిచాల్య, నిర్వికార, ఆంతర శాంతియందు సుప్రతిష్ఠితుడు– "ధీరః" (14–24). అతడే కర్మను స్వయముగా ప్రారంభించడు, సర్వకర్మలను ప్రకృతిగుణములకే వదిలివేయును (14–25). సత్త్వము, రజస్సు లేక తమస్సు అతనియందు లేవవచ్చును లేక విరమించవచ్చును; లేచి (తమ ఫలితమగు) ప్రకాశమును, కర్మప్రవృత్తిని, లేక అకర్మను మఱియు మనః ప్రాణములను ఆవరించు అంధకారమును గొనిరావచ్చును; కాని అతడు ఇది వచ్చినపుడో, అది పోయినపుడో హర్షించడు, అటులే వాని రాకపోకల పట్ల విముఖుడును గాడు (14–22). ఏలన అత డిపుడు ప్రకృతిగుణములకంటె నితరమగు మఱియొక తత్త్వముయొక్క సచేతనప్రకాశమునం దాసీనుడై యున్నాడు, మఱియు నా మహత్తరచేతన గుణములకు పరమున, వాని చలనములకు చలించక, అతనియందు స్థిరముగా నుండును (14–23)- ఉచ్చతర వాతావరణమున కెగసిన వానికి మేఘములకు పై నుండు సూర్యుడు స్థిరముగా గన్పించు నట్లు. అత డా ఎత్తు నుంచి, కర్మప్రక్రియలో నున్నవి గుణములే యనియు, వాని కల్లోలము లేక ఉపశమము ప్రకృతివృత్తియే గాని, తాను గాదనియు గాంచును; అతని ఆత్మ అవిచలము మఱియు నతని ఆత్మసత్త అస్థిర వస్తువుల చంచల వికారశీలతయందు పాల్గొనదు (14–23). ఇది బ్రాహ్మస్థితియొక్క నిర్వ్యక్తికత్వము; ఏలన పైన పేర్కొనబడిన ఉచ్చతర తత్త్వము, విశాలము మఱియు నుచ్చపదస్థితమగు నా మహత్తరచేతన – "కూటస్థ" (15-16) – అక్షర బ్రహ్మమే.

17. <u>బ్రహ్మకు పైతము ప్రతిష్ఠ</u> : కాని యిచ్చట నైతము ఒక ద్వంద్వ స్థితి మిగిలియున్నది, రెండు ప్రతిరూపములోనికి సత్తయొక్క విభజన మిగిలి యున్నది; అక్షరాత్మ లేక బ్రహ్మము నందలి ఒక విముక్తపురుషుడు ఒక అవిముక్త క్షరప్రకృతి యొక్క క్రియను కేవలము గమనించును - ఈ ద్వంద్వ మక్షరము మఱియు క్షరము. ఇంతకు మించిన అధికతర స్థితి, ఇంతకు మించిన నిరపేక్ష సంసిద్ధి

కాస్పదమగు తత్త్వము లేదా ? ఈ విభజనయే శరీరమునందు సంభవమగు అత్యున్నత చేతనయా ? క్షరప్రకృతిని, దేహధారణనుండి పుట్టిన గుణములను విడిచిపెట్టి, బ్రహ్మముయొక్క నిర్వ్యక్తికత మఱియు శాశ్వత శాంతిలో నంతర్ధానమగుటయే యోగముయొక్క పరమావధియా ? వైయక్తిక పురుషునియొక్క లయమే పరమ ముక్తియా ? కాదు, తదన్య మేదియో గల దనిపించును; ఏలన గీత అధ్యాయాంత మున, ఈ ఏకమాత్ర అంతిమస్వరమును మఱల నాలపించుచు నిట్లు చెప్పును, "ఎవడు అవ్యభిచారి ప్రేమ భక్తులతో నన్ను సేవించుచు, బొందగోరునో, వాడును గుణములను దాటివెళ్లి, బ్రహ్మ మగుటకు సమర్థుడగును." 14-26). ఇచ్చట "నన్ను" పురుషోత్తముని దెలుపును (15-18), ఈ పురుషోత్తముడు శాంతబ్రహ్మము యొక్కయు, అమృతత్త్వముయొక్కయు, అవ్యయ ఆధ్యాత్మికసత్తయొక్కయు, శాశ్వతధర్మముయొక్కయు, కేవలానందముయొక్కయు ప్రతిష్ఠ యగును (14-27). ఇట్లు, గుణకలహమును అవిచలముగా దర్శించు రూపము గల అక్షరబ్రహ్మము యొక్క శాంతికంటెను అధికమగు ఒక పదము (status) గలదు. బ్రహ్మయొక్క అవికార్యత్వానుభవమునకు బైన ఒక పరమ ఆధ్యాత్మికానుభవము మఱియు ప్రతిష్ఠ గలదు, రాజస కర్మప్రేరణరూప ప్రవృత్తి (14-12) కంటెను అధికమగు నొక శాశ్వత ధర్మము గలదు, రాజసిక దుఃఖముచేత నస్పృష్టము, సాత్త్వికసుఖమునకు పరము నగు నొక నిరపేక్ష ఆనందము గలదు, మఱియు నీ వస్తువు లన్నియు పురుషోత్తముని సత్తాశక్తులయందు నివసించుటచేత విదితము, ప్రాప్తము నగును (14-26). కాని ఈ అధికతరపదము భక్తిచేత ప్రాప్తమగును గాన, దాని తత్త్వ మొక దివ్యానందము గావలెను—ఈ ఆనందమునందు [1] నిరతిశయప్రేమయొక్కయు, ప్రాప్తిరూప (possessing) ఏకత్వముయొక్కయు సంయోగ మనుభూత మగును మఱియు నీ సంయోగమే భక్తియొక్క పరమశిఖరము. చివరకు, ఆ పరమానందము లోనికి, ఆ అవర్ణనీయ ఏకతలోనికి ఆరోహించుటయే ఆధ్యాత్మిక సంసిద్ధియొక్క పరిసమాప్తియు, అమరత్వసాధకమగు శాశ్వత ధర్మముయొక్క పరిపూర్తియు నగును.

---

[1] "నిరతిశయ ప్రేమాస్పదత్వం ఆనందతత్త్వం" —శ్రీ అ.

# 15. [1] ముగ్గురు పురుషులు

1. కేంద్రాలోచన : గీతాసిద్ధాంతము ఎన్ని మార్గముల వెంట నడచినను, ఎన్నెన్ని మలుపులు దిరిగినను, ఆదినుంచి అంతమువఱకు ఒకే కేంద్రాలోచన దిశగా తన గమనమును సాగించును; ఈ గమనమునందది బహువిధ తత్త్వశాస్త్రములను సరిపుచ్చి, వానికి సమాధానమును సాధించును, ఆధ్యాత్మికానుభవముయొక్క సత్యములను జాగ్రత్తగా సమన్వయపఱచును; విడివిడిగానో, అన్యోన్యవ్యావర్తక రూపముననో తీసికొని, అన్వేషించి నపుడు ఏ యీ సత్యములు లేక వెలుగులు విరుద్ధము, లేక కనీసము విభిన్నముగా దోచునో, వాని నన్నింటిని ఒకే కేంద్రమునకు గొనివచ్చును. కాగా ఈ కేంద్రాలోచన యేమన, అది ఒక త్రివిధచేతన యొక్క భావము – ఈ చేతన మూ డయ్యును ఏకము, మఱియు సత్తయొక్క సమస్త స్తరములందు నుండును.

2. క్షరము, క్షరమునందలి పురుషుడు : ఈ ప్రపంచమున పనిచేయుచుండు ఒక సచేతనసత్త (spirit) గలదు, అది అసంఖ్యరూపములం దేకమాత్రము. అది జన్మకర్మల వికాసకర్త, ప్రాణముయొక్క చాలకశక్తి, ప్రకృతియొక్క శతసహస్ర క్షరభావము లందలి అంతర్నివాసియు, సంయోజకము నగు చేతన; దేశకాలములందు గన్పించు ఈ సమస్త సంరంభమునకు సత్యత నిచ్చున దదియే. దేశము, కాలము, మఱియు సంబంధరూపములను స్వయముగా ధరించిన దదియే. ప్రపంచము లందలి ఈ అంతరాత్మసమూహ మంతయు నదియే; అదియే దేవతలు, మానవులు మఱియు సర్వజీవులు, వస్తువులు మఱియు శక్తులు, గుణములు మఱియు పరిమాణములు, విభూతులు మఱియు సాన్నిధ్యములు (presences). అది సత్తాశక్తియగు ప్రకృతి, మఱియు నామ భావ రూపాత్మకమగు ఆ ప్రకృతిజన్యవిషయములు, మఱియు ఆ అద్వితీయ స్వయంభూ ఆధ్యాత్మిక సత్తయొక్క అంశములు, జన్మలు, సంభూతులే

---

[1] గీత : అధ్యాయము–15

సర్వభూతములు; అది ఏకము, సనాతనము. కాని మనముందు పనిచేయుచు, ప్రత్యక్షముగా గన్పించున దీ సనాతనమును గాదు, అతని చేతనశక్తియు గాదు, పరంతు అది ఒక ప్రకృతి - ఈ ప్రకృతి తన క్రియలయొక్క అంధావేగమునందు తన లోపలి పురుషు నెఱుంగక యుండును. ఆమె కర్మ కొన్ని ప్రాథమిక గుణములు లేక శక్తితత్త్వములయొక్క ఒక అజ్ఞసంకుల పరిమితివిధాయక ఖేలనము; వాని ఈ ఖేలనము యాంత్రికము, వాని పరిణామములు స్థిరములు లేక అస్థిరములు. మఱియు నేయే విధమగు అంతరాత్మ ఆమె క్రియయందు పైకి గన్పించునో, అదియు స్వయముగా తన ఆభాసమునందు అజ్ఞము, దుఃఖమయము మఱియు నీ నిమ్నప్రకృతి యొక్క అసంపూర్ణ, అసంతృప్తికర ఖేలనమునకు బద్ధము. ఆమె లోలోపల నుండు మహాశక్తి ఈ విధముగా పైకి గన్పించు అంతరాత్మకంటెను గూడ భిన్నము; అది ఆమె సత్యమునందు గుప్తము, ఆమె ఆభాసములందు ఇంచుక వ్యక్తము నగు క్షరపురుషుడు (15-16), విశ్వాత్మ, వైశ్వవ్యాపారము మఱియు సంభూతియొక్క క్షరతయందలి ఆధ్యాత్మికతత్త్వము. తన వ్యక్తరూపముల వెనుకనున్న ఈ గుప్త సత్యమును మనము చేరుకొనవలెను; ఈ ముసుగుల వెనుకనున్న దివ్యపురుషుని గనుగొని, అంతయు నొకడే - "వాసుదేవ ఇతి సర్వం" (7-19) - వైయక్తికము, విశ్వస్థితము, విశ్వాతీతము నగు నొకడే యని చూడదగును. కాని మనము నిమ్న ప్రకృతిలో కేంద్రీకరించుకొని, జీవించునంత కాలము ఆంతరసత్యముయొక్క తగినంత పూర్ణతతో దీనిని సాధించు టసాధ్యము. ఏలన ఈ నిమ్నవృత్తియందు ప్రకృతి ఒక అజ్ఞానము, ఒక మాయ; ఆమె తన అజ్ఞానముయొక్క పొరలయందు భగవంతుని కాశ్రయ మిచ్చి, అతనిని తన నుండియు, తన బిడ్డలనుండియు దాచి వేయును. సర్వమును సృజించు తన యోగముయొక్క మాయచేతనే భగవంతుడు మఱుగువడియుండును (7-25), అత డిచ్చట అనిత్యమునందు రూపము ధరించిన నిత్యుడు, తన అభివ్యంజక దృశ్యముచేతనే ఆచ్ఛాదితమైన పరమసత్త. ఒక స్వతంత్ర వస్తువుగా గ్రహించబడిన కేవల క్షరమునందు, అనగా అవిభక్త అక్షరము మఱియు అతీతమునుండి వేఱుచేయబడిన క్షరప్రపంచమునందు జ్ఞానసంపూర్ణత యుండదు, మన సత్తాసంపూర్ణత యుండదు, కావున విముక్తి యుండదు.

3. <u>అక్షరాత్మ, దాని సాధన :</u> కాని మఱియొక సచేతనసత్త గలదు, దానిని మన మెఱుంగవచ్చును, అది ఈ వస్తువులలో నేదియు గాదు, అది ఆత్మ,

ఆత్మమాత్రము. ఈ సత్త సనాతనము, ఎల్లప్పుడు ఏకరూపము, అభివ్యక్తిచేత మాఱదు, ప్రభావితము గూడ గాదు; ఇది ఏకము, అచలము; ఇది అవిభక్తమగు స్వయంభూసత్త, మఱియు ప్రకృతియందలి వస్తువులు మఱియు శక్తుల విభజనచేత విభక్తమైనట్లు కన్పించను గూడ కన్పించదు, ఇది ఆమె క్రియయందు అక్రియము, ఆమె చలనమునందు అచలము. అది అన్నింటియొక్క ఏకాత్మ, అయినను తన మీద నాధారపడు నీ వస్తువు లన్నియు అనాత్మమైనట్లు, తన ఫలితములు, శక్తులు మఱియు పరిణామములు గానట్లు, తన కంటిముందు ప్రదర్శింపబడు ఒక నాటకమైనట్లు, అది అవిచలితము, ఉదాసీనము, అస్పృశ్యముగా నుండును. ఏలన నాటకమును ప్రదర్శించుచు, దానియందు పాత్రవహించు మనస్సునకంటె, ఆ క్రియను తటస్థముగా తనలో ధరించు ఆత్మ భిన్నము, ఇతరము. ఈ ఆత్మతత్త్వము, దానిని మనము కాలమునందు చూచుచున్నప్పటికి, కాలరహితము; దేశమున వ్యాపించి యున్నట్లు దానిని మనము చూచుచున్నప్పటికి, అది దేశమునందు ఆతతము గాదు. ఎంతెంత వెలినుండి లోనికి ఉపసంహరించుకొందుమో, లేక క్రియ మఱియు గతి వెనుక సనాతనము మఱియు ధ్రువమగు దానికొఱ కెంతెంత వెదకుదుమో, లేక కాలము మఱియు దాని సృష్టినుండి అస్పష్టమగు దాని దిశగా, దృశ్యమునుండి సత్తాదిశగా, వైయక్తికమునుండి నిర్వ్యక్తికత దిశగా, సంభూతినుండి మాఱని స్వయంభూసత్త దిశగా ఎంతెంత దూరము పోదుమో, అంతంత ఆత్మతత్త్వము నెఱుంగుదుము. ఇది అక్షరపురుషుడు (15-16) – సవికారము నందలి అవికారము, ప్రచలము నందలి అచలము, సవ్యయము నందలి అవ్యయము. అథవా దాని వ్యాపన మొక ఆభాసము మాత్రమే గాన, అక్షరము, అచలము, అవ్యయము నగు దానియందే క్షర సవ్యయ వస్తువుల ప్రచలత్వము ప్రవర్తించు నని చెప్పవలెను.

4, క్షరాక్షరసంబంధము : సర్వప్రాకృతసత్తగను, సర్వభూతముల సాకల్యముగను దృగ్గోచరమగు క్షరతత్త్వము అచల సనాతన అక్షరతత్త్వమునందు వ్యాపకరూపమున చరించును మఱియు కర్మచేయును. వాయుగుణము సంయోజన వియోజనాత్మకమగు స్పర్శశక్తి; ఈ శక్తితో నిది అగ్ని – తేజోరూప, బాష్పరూప, విద్యుద్రూప అగ్ని – మఱియు దాని క్రిందిభూతముల నిర్మాణశక్తి కాధార మగుచు, నెటుల సూక్ష్మద్రవ్యాత్మకమగు ఆకాశమునం దంతటను చరించునో (9-6), అటులే ఆత్మయొక్క చలశక్తి ఆత్మయొక్క ఆధారభూత స్థిరతయందు పనిసేయును. ఈ

అక్షరము బుద్ధికంటెను పైనుండు ఆత్మ - బుద్ధి మన సత్తయందు ప్రకృతియొక్క అత్యున్నత ఆంతరతత్త్వమగు విమోచకశక్తి, దీనిద్వారానే మానవుడు సంక్షుబ్ధ మానసికాత్మనుండి ప్రశాంత ఆధ్యాత్మికాత్మకు తిరిగివచ్చి, ఎట్టకేలకు జన్మకర్మ చక్రమునుండి విముక్తు డగును (2-51), ఇట్టి బుద్ధిని సైతము ఆత్మ అతిశయించును. ఈ ఆత్మ తన పరమధామమునందు (8-21), వైశ్వప్రకృతియొక్క మూలమగు 'అవ్యక్తము' కంటెను పైనుండు ఒక 'అవ్యక్తము' (8 20); కావున అంతరాత్మ ఈ అక్షరమున కభిముఖమై నపుడు, ప్రకృతి ప్రపంచములకు దానిపై గల పట్టు సడలిపోవును మఱియు నది జన్మ కావల భాసించు, మార్పులేని సనాతన సత్తయందు ప్రవేశించును. కావున ఇవి రెండును మనము ప్రపంచమునందు జూచు రెండు తత్త్వములు-పురుషులు. ఒకటి తన క్రియయందు ముందునకు నిర్గమించును, రెండవది దాని వెనుక, తన శాశ్వతశాంతియందు దృఢముగా నిలిచియుండును - ఈ శాంతి నుండియే కర్మ ప్రభవించును మఱియు సర్వక్రియలు దానిలో తిరిగి విరమించి, దాని కాలరహితసత్తలో కలిసిపోవును, అనగా 'నిర్వాణము' నందును (2-72). - "ద్వా విమౌ పురుషౌ లోకే క్షరశ్చ అక్షర ఏవచ" (15-16).

5. <u>క్షరాక్షరములు ఒకే వస్తువు :</u> ఇచ్చట మన బుద్ధిని తికమకపెట్టు సమస్య యేమన, ఈ రెండును పరస్పరవిరుద్ధములుగా దోచును, వాని మధ్య ఎట్టి సంధి గాని, సంక్రమణమార్గము గాని కన్పించదు, ఒక దానిని త్రోసివేసిననే తప్ప రెండవ దానిని బొందలే మనిపించును. క్షరము అక్షరమునందు వేఱువడి కర్మ సేయును లేక కనీసము కర్మను ప్రేరించును; కాగా అక్షరము స్వ-కేంద్రితమై, తన నిష్క్రియతయందు క్షరమునుండి విడివడియుండును. కాగా, సాంఖ్యులతో బాటు పురుష ప్రకృతుల మౌళిక సనాతన ద్విత్వమును, కాదు అసలు ఒకవిధమగు పురుషుల సనాతన బహుత్వమునే అంగీకరింతు మేని, అది ప్రథమదృష్టికి ఎక్కువ శ్రేష్ఠముగా, ఎక్కువ యుక్తియుక్తముగా, ఎక్కువ సుబోధముగా గన్పించును. అపుడు తనలోనికే ప్రతిపురుషునియొక్క ఉపసంహరణము, అనగా ప్రకృతినుండియు, కావుననే జీవనసంబంధములందు ఇతరపురుషులనుండియు సర్వథా పరాఙ్ముఖమగుట- ఇదియే అక్షరముయొక్క మన అనుభవమగును; ఏలన ప్రతిపురుషుడును తన సారతత్త్వమునందు స్వయంపర్యాప్తము, అనంతము మఱియు సంపూర్ణము నగును. కాని నిజానికి చరమానుభవ మేమన, ఒకవిధమగు సర్వభూతముల ఏకతానుభవము;

ఇది ప్రకృతియొక్క ఒకే శక్తికి సర్వుల అధీనతారూపమగు ఒకే విధమగు అనుభవము గాదు, ఇది ఆత్మయందు సర్వుల ఏకతానుభవము, సర్వుల ఏకత, ఇది ఈ అనంత వైవిధ్యమున కంతటికి పరమున, సాపేక్షసత్తయొక్క ఈ ప్రతీయమాన పృథగ్భావ మంతటికి వెనుక నుండు సచేతనసత్తయొక్క ఒక విశాల తాదాత్మ్యము. గీత ఈ సర్వోన్నత ఆధ్యాత్మికానుభవమునే తన కాధారము గావించుకొనును. గీత నిజానికి అంతరాత్మల సనాతన బహుత్వము నంగీకరించుచున్నట్లు గన్పించును, అయితే ఈ బహుత్వము వాని సనాతన ఏకత్వమునకు అధీనము మఱియు దానిచే ధారితము; విశ్వము సదా యుండును గాన, అభివ్యక్తి అనంత యుగచక్రములలో కొనసాగును గాన, గీత అంతరాత్మ బహుత్వము నంగీకరించును. మఱియు అనంతుని లోపల వైయక్తిక ఆత్మయొక్క నిరపేక్షలయమును, సంపూర్ణవినాశమును గీత ఎక్కడను వక్కాణించదు, కనీసము సూచించదు గూడ. కాని అదేసమయమున అక్షరాత్మ ఈ అంతరాత్మ లన్నింటికి ఏకాత్మయని గట్టి పట్టుతో గీత వక్కాణించును. కావున ఈ క్షరాక్షరములు రెండును ఒకే సనాతన మఱియు వైశ్వ సత్తయొక్క ఒక ద్వివిధస్థితి యని మనకు స్పష్టపడును. ఇది యొక అతి ప్రాచీన సిద్ధాంతము; ఇది ఉపనిషత్తులయొక్క విశాలతమ దర్శనమున కాధారము. ఉదాహరణకు, ఈశ ఉపనిషత్తు ఇట్లు చెప్పును : బ్రహ్మము చరము మఱియు అచరము - రెండును, అటులే ఏకము మఱియు అనేకము, ఆత్మ మఱియు సర్వభూతములు, జ్ఞానము మఱియు అజ్ఞానము, సనాతన అజాత స్థితి మఱియు భూతముల జన్మావస్థ; మఱియు ఈ రెండింటిలో ఒకదానియందే రమించుట పాక్షికజ్ఞానముయొక్క అంధకారము లేక అజ్ఞానముయొక్క అంధకార మగు నని చెప్పును. "సమగ్రం మాం" (7-1)-అని గీత విధించు నట్లే, రెండింటిని ఆలింగనము గావించుకొని, పరాత్పరుని సంపూర్ణ రూపమున దెలిసికొనుటయే అమృతత్వము ననుభవించుటకును, సనాతనునియందు నివసించుటకును మార్గ మని ఉపనిషత్తును వక్కాణించును. గీతా బోధనయు, ఉపనిషద్బోధనయొక్క ఈ పార్శ్వమును ఇంతవఱకు ఒకటియే; ఏలన అవి క్షరాక్షర ముల రెండింటిని గుర్తించి, అంగీకరించి నప్పటికి, సత్తయొక్క పర్యవసానముగను, పరమసత్యముగను వాని ఏకత్వమునకు వచ్చిచేరును.

6; <u>ఏకతానుభవము నందలి కష్టము</u> : ఈ అధికతర జ్ఞానము మఱియు ననుభవము, మన అత్యున్నత దృష్టి నెంత సత్యముగాను, బలముగాను ఆకర్షించి

నప్పటికి, మిక్కిలి వాస్తవము, అత్యావసరము నగు ఒక కఠినతను ఇంకను దొలగించవలసియున్నది, ఆ కఠినత తార్కికము, సాధనాత్మకము నగు ఒక విరోధము, అది ప్రథమదృష్టికి ఆధ్యాత్మికానుభవముయొక్క పరమశిఖరమువఱకు వెంటాడునట్లు గన్పించును. ప్రచలమగు నీ బాహ్యాభ్యంతరానుభవముకంటె సనాతన బ్రహ్మ మన్యము, ప్రచలనమును మించిన అధికతర చేతన గలదు – "న ఇదం యద్ ఉపాసతే" (కేన ఉ.) : కాని అదే సమయమున ఇది యంతయు బ్రహ్మమే, ఇది యంతయు ఆత్మయొక్క సంతత స్వదర్శనమే (self seeing) – "సర్వం ఖలు ఇదం బ్రహ్మ" (నిక్కముగా ఉన్నదంతయు బ్రహ్మమే) (చాం. ఉ.), "అయం ఆత్మా బ్రహ్మ" (ఆత్మ బ్రహ్మము) (మాం. ఉ.). ఇంకను "ఆత్మా అభూత్ సర్వభూతాని" (ఆత్మయే సర్వభూతము లయ్యెను) (ఈ. ఉ.), మఱియు శ్వేతాశ్వతరోపనిషత్తు ఇట్లు వర్ణించును, "నీ వీ బాలుడవు, ఆ బాలికవు మఱియు కఱ్ఱసాయముతో నడుచు నా వృద్ధుడవు." ఇటులే గీతయందు సైతము భగవంతుడిట్లు చెప్పుకొనిపోవును, "నేను కృష్ణుడను, అర్జునుడను, వ్యాసుడను, ఉశనుడను (10–37), మఱియు నేను సింహమను, అశ్వత్థవృక్షమను (10–26), మఱియు నేను చేతనను (10–22), నేను బుద్ధిని (7–10), సర్వగుణములు నేనే (7–12), ప్రాణుల ఆత్మను నేనే (10–20)." కాని స్వభావమునం దంత విరుద్ధము మాత్రమే గాక, అనుభవమున ఏకముచేయుటయం దంత కష్టమగు నీ రెండును ఎట్లు ఒకటియే యగును? ఏలన సంభూతియొక్క ప్రచలత్వమునందు నివసించునపుడు కాలాతీత ఆత్మసత్తను గమనించగలమేమో గాని, దాని అమరత్వమున నివసించుట దుస్సాధ్యము. అటులే కాలాతీతసత్తయందు ప్రతిష్ఠితులమై నపుడు, దేశకాల సంబంధములు మననుంచి దూరమగుచు, నొక పీడ కలగా భాసింపసాగును. ఇట్టి యెడ, ప్రథమదృష్టికి, ప్రకృతియందలి పురుషుని చలత్వ మొక భ్రాంతి యనునదే బాగుగా నచ్చునట్టి సిద్ధాంతముగా దోచును – ఈ చలత్వము, మనము దానియందు నివసించు నపుడే వాస్తవము గాని, స్వతః వాస్తవము గాదు; మన మాత్మలో తిరిగి ప్రవేశించి నపుడు, అది మన అదూష్యస్వరూపమునుండి దూరమగును. అదియే ఈ కఠినసమస్యను భేదించు పరిచితవిధానము – "బ్రహ్మ సత్యం జగన్ మిథ్యా"

7. <u>మిథ్యాత్వమే మిథ్య</u> : అయితే గీత ఈ వివరణమునందు తల దాచుకొనదు; ఏలన దీని కుండవలసిన ప్రబలకఠినతలు దీని కున్నవి, పైగా నిది

మిథ్యాత్వమునకు కారణము చెప్పదు, చెప్పజాలదు; ఇది యంతయు ఒక నిగూఢ మహామాయ యని మాత్రమే ఈ వివరణము వచించును. అయినపుడు మనము గూడ ఇది యంతయు నొక నిగూఢ ద్వివిధసత్యము, క్షరాక్షరములు ఒకదానినొకటి మఱుగు పఱచుకొను నిగూఢసత్యము – మాయ గాదు – అని చెప్పవచ్చును. గీత మాయను ప్రస్తావించును గాని, అది యొక వ్యామోహక ఆంశికచేతన యని మాత్రమే ప్రతిపాదించును (7–13). ఆంశికము గావుననే అది పూర్ణసత్యముయొక్క పట్టును గోల్పోవును, చలప్రకృతియొక్క దృశ్యరూపమున నివసించును, మఱియు తాను దేనియొక్క సక్రియశక్తియో, అట్టి ఆత్మనే దర్శించజాలదు – "మే ప్రకృతిః" (7–5). మన మీ మాయ నతిక్రమించి నపుడు, ప్రపంచ మదృశ్యము కాదు, పరంతు అది తన అర్థరూప హృదయమును మాత్రమే మార్చివేసికొనును. ఆధ్యాత్మిక దర్శనమున ఇది యంతయు భగవంతునియొక్క ఆత్మ, అంతరాత్మ మఱియు ప్రకృతి యని – సర్వము వాసుదేవు డని – కనుగొందుము. గీత కీ ప్రపంచము సత్యము, ఈశ్వరుని ఒక సృష్టి (11–37), సనాతనునియొక్క ఒక శక్తి (7–6), పరబ్రహ్మమునుండి వచ్చిన ఒక అభివ్యక్తి (13–31), మఱియు త్రివిధమాయా రూపమగు నిమ్నప్రకృతి సైతము భగవంతుని పరప్రకృతినుండి ఉత్పన్నమైనదే (7–12). మఱియు నొక ద్వివిధ సత్యము గలదు : ఒకటి నిమ్నతరము, సక్రియము, కాలగతము; రెండవది ఉచ్చతరము, శాంతము, నిష్క్రియము, సనాతనము; కాగా ఈ అల్పత్వమునుండి ఆ మహత్త్వమునకు, క్రియనుండి మౌనమునకు బయనించుటే మన ముక్తి యని చెప్పి, ఇట్టి విభేదమునందును తలదాచుకొనజాలము. ఏలన జీవించియుండగనే, ఆత్మయందును, దాని మౌనమునందును మనము సచేతనముగా నుండగలము, మఱియు నుండవలెను, అయినను ప్రాకృతప్రపంచమున శక్తితో వ్యవహరించగలము మఱియు వ్యవహరించవలెను–అని గీత పట్టుబట్టును. ఇచ్చట గీత సాక్షాత్తు భగవంతుని దృష్టాంతమే యిచ్చును – అతడు జన్మవలన గలుగు కర్మావశ్యకతకు బద్ధుడు గాని విముక్తుడు, విశ్వానికి పరుడు, అయినను నిరంతరము కర్మరతుడు–"వర్త ఏవచ కర్మణి" (3–22). కావున భాగవత ప్రకృతియొక్క సాదృశ్యమును సంపూర్ణముగా ధరించుటచేతనే (14–2), ఈ ద్వివిధానుభవముయొక్క ఏకీకరణము సర్వథా సంభవమగును. కాని ఆ ఏకతయొక్క సూత్ర మేది యగును ?

8. పురుషోత్తమునియందు క్షరాక్షరసమన్వయము : ఈ సూత్రమును గీత పురుషోత్తమునియొక్క తన పరమదర్శనమునందు గనుగొనును, ఏలన ఆ దర్శనము సంపూర్ణ పరమానుభవముయొక్క ఆదర్శము, కృత్స్నవిదుల (3-29) సమగ్రజ్ఞానము. కాగా, అక్షరము విశ్వప్రకృతియొక్క తత్త్వములు మఱియు క్రియ కంటెను పరము (8-20). అది సర్వభూతముల అవికారి ఆత్మ మఱియు నీ అవికారి ఆత్మ పురుషోత్తముడే. తన స్వసత్తయొక్క స్వతంత్రతారూపమున పురుషోత్తము డక్షరుడు, ఈ స్వసత్త ప్రకృతియందలి స్వశక్తి క్రియచేత అప్రభావితము, తన స్వసంభూతియొక్క ప్రేరణచేత అక్షతము, మఱియు తన స్వీయగుణముల ఖేలనము చేత అక్షుబ్ధము. కాని యిది పూర్ణజ్ఞానముయొక్క గొప్ప పార్శ్వ మైనను, ఒక పార్శ్వము మాత్రమే. పురుషోత్తముడు అక్షరు డగుచునే, అక్షరునికంటె నధికుడు; కారణము అక్షరుని నిర్వ్యక్తికతను మించియుండును, అతడు తన సత్తయొక్క పరమ సనాతన స్థితిచేత—"పరమం ధామ" (15-6) – సైతము పరిమితుడు గాడు. అయినను, మనయం దేది అక్షరము, సనాతనమో దానిద్వారానే, దేనినుండి పునర్జన్మ యుండదో అట్టి పరంధామమును ప్రాపింతుము, మఱియు నిదియే ప్రాచీన మును లపేక్షించిన ముక్తి. కాని అక్షరముద్వారా మాత్రమే ముక్తి నన్వేషించినపుడు (12-3), ఈ ప్రయత్నము అనిర్దేశ్యబ్రహ్మయొక్క అన్వేషణ మగును, అయితే యిది శరీరగతులమగు మన ప్రకృతికి కడు కష్టము (12-5). అక్షరము, అనగా మనయందలి శుద్ధ అగోచరాత్మ తన నేతినేతి-ప్రచోదనచే ఏ అనిర్దేశ్యమున కెగయునో, అది ఒక పరమావ్యక్తము – "పరో అవ్యక్తః" (8-19), అయితే ఆ పరమ అవ్యక్త అక్షరము గూడ పురుషోత్తముడే (15-17). కావుననే, అనిర్దేశ్యము నుపాసించువారు సైతము "నన్నే", సనాతన భగవంతునే చేరుదు రని గీత వక్కాణించును (12-4). కాని అత డీ పరమ అవ్యక్త అక్షరము కంటెను గూడ అధికుడు, ఎట్టి నేతినేతి-నిషేధాత్మక బ్రహ్మముకంటెను అధికుడు, ఏలని తన స్వీయ సత్తయందు ఈ సమస్తవిశ్వమును విస్తరించు పరమ పురుషునిగా సైతము అతని నెఱుంగవలసియున్నది. అత డొక పరమ నిగూఢ సర్వము, ఇచ్చటి సమస్త వస్తువులకు మూలమగు నొక అవర్ణనీయ భావాత్మక బ్రహ్మము. అచ్చట మాత్రమే అతడు పురుషోత్తముడు గాడు, ఇచ్చట క్షరమునందు సైతము ప్రభువు, ప్రతివారి హృదయమునందును ఈశ్వరుడు. పోగా, అచ్చట తన పరంధామమునందు –"పరో

అవ్యక్త"మునందు—సైతము అతడు పరమేశ్వరుడు (15–17), అతడు ఏకాకి, సంబంధరహిత అనిర్దేశ్యము గాడు, పరంతు అతడు ఆత్మకును, విశ్వమునకును బీజము, తండ్రి, తల్లి, ప్రథమాధారము, సనాతనస్థానము (9–17, 18) మఱియు సర్వభూతమహేశ్వరుడు, యజ్ఞతపస్సుల మహాభోక్త (5–29). అతనిని ఏకకాలమున క్షరమునందును, అక్షరమునందును ఎఱుంగవలెను, అన్నింటి జననమునందు తనను అంశికముగా ప్రకటించుకొను నట్టియు, సంతతావతారముగా (18–61) స్వయముగా సైతము అవరించు నట్టియు జన్మరహితునిగా (4–6) నెఱుంగవలెను, తన సంపూర్ణత యందు – " సమగ్రం మాం " (7–1) – ఎఱుంగవలెను; అట్టి సమగ్ర జ్ఞానముచేత అంతరాత్మ నిమ్నప్రకృతియొక్క ఆభాసములనుండి సులభముగా ముక్తమగును (5–3), మఱియు ఒక వ్యాపక ఆకస్మిక అభివృద్ధిచేతను, ఒక విశాల అపరిమేయ ఆరోహణముచేతను దివ్యసత్త మఱియు దివ్యప్రకృతిలో తిరిగి ప్రవేశించును (18–55). ఏలన క్షరసత్యము సైతము ఒక పురుషోత్తమ సత్యమే. పురుషోత్తముడు ప్రతి జీవిహృదయమునందు అవస్థితుడు, మఱియు తన అగణ్య విభూతులయందు అభివ్యక్తుడు. పురుషోత్తముడే కాలగతుడగు విశ్వపురుషుని రూపమున విముక్త మానవాత్మకు దివ్యకర్మ ఆదేశము నిచ్చును (11–33). క్షరాక్షరు లిరువురును అతడే, అయినను అత డీ వ్యతిరేకపురుషులలో ప్రతివానికంటెను అధికుడు గాన, వానికంటె నితరుడు. "ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మా ఇత్యుదాహృతః, యో లోకత్రయం ఆవిశ్య బిభర్తి అవ్యయ ఈశ్వరః" (15–17), "వీ రిరువురి కంటె అన్యుడు ఉత్తమ పురుషుడు, అతనిని పరమాత్మ యందురు, అతడు లోకత్రయమును ఆవేశించి, ధరించియుండు అవ్యయ ఈశ్వరుడు." ఈ శ్లోకము, పైకి వ్యతిరేకముగా గన్పించు, మన సత్తయొక్క ఈ రెండు రూపముల గీతాసమన్వయమునందు కీలకవాక్యము.

9. అతని పురుషభావము మన ప్రేమరహస్యము : పురుషోత్తమభావము ఆదినుండియు సిద్ధముచేయబడినది, సూచింపబడినది, ఛాయామాత్రముగా చూపబడినది, సత్యమైనట్లు స్వీకరించబడినది, కాని యిపుడు పదునైదవ అధ్యాయమునందు మాత్రమే అది స్పష్టముగా ప్రతిపాదింపబడి, ఒక పేరుద్వారా వేఱుచేయబడినది (15–17). మఱియు క్రిందటి అధ్యాయమున గీత దీని నెట్లు సమీపించి, పెంపొందించునో చూచుట బోధదాయక మగును. దివ్యప్రకృతిలోని కారోహించుటకు వ్యక్తి తన నొక పరిపూర్ణ ఆధ్యాత్మిక సమతయందు ప్రతిష్ఠించుకొని (14–24, 25),

గుణముల నిమ్నప్రకృతినుండి పై కెగయవలెను. ఇట్లు నిమ్నప్రకృతి నతిక్రమించి నిర్వ్యక్తికతయందు, సర్వక్రియకు నతీతమగు అవిచాల్యపరత్వమునందు, గుణపరిమితి సోకని పవిత్రతయందు మనలను మనము ప్రతిష్ఠించుకొందుము (14-23); కాగా ఈ నిర్వ్యక్తికత పురుషోత్తముని అభివ్యక్త ప్రకృతియొక్క ఒక పార్శ్వము, అక్షరాత్మయొక్క నిత్యత మఱియు నేకతారూపమున అతని అభివ్యక్తి. కాని పురుషోత్తమునియొక్క ఒక అవర్ణనీయ నిత్య బహుత్వమును గలదు, అది జీవాభివ్యక్తియొక్క ఆద్యగుహ్యము వెనుకనున్న అత్యున్నత సత్యతమ సత్యము. అనంతుని కొక సనాతన శక్తి, తన ప్రకృతియొక్క ఆద్యంతములు లేని ఒక క్రియ గలదు, మఱియు నా క్రియయందు నిర్వ్యక్తికముగా దోచుశక్తుల ఖేలనమునుండి జీవవ్యక్తిత్వరూపమగు అద్భుత మావిర్భవించును - "ప్రకృతిర్ జీవభూతా" (7-5). వ్యక్తిత్వము సైతము భగవంతుని ఒక లక్షణము, మఱియు నది అనంతునియందు తన అత్యున్నత ఆధ్యాత్మిక సత్యమును, అర్థమును బొందును గావున, జీవవ్యక్తిత్వము సంభవమగుచున్నది. అయితే అనంతమునందలి పురుషుడు నిమ్నప్రకృతియొక్క ఆహంకారిక, భేదజనక, విస్మృతిపూర్ణ వ్యక్తిత్వము గాడు. అతడొక ఉత్కృష్ట, విశ్వమయ, విశ్వాతీత, అమర, దివ్యపురుషుడు. ఆ పరమ పురుషరూప గుహ్యమే భక్తిప్రేమల రహస్యము. మనయందలి సనాతన పురుషుడు, అనగా పరమపురుషాంశమగు అంతరాత్మ ఆ పరమపురుషునకే తన సర్వస్వమును, తనను గూడ అర్పించివేసికొనును. ఈ ఆత్మసమర్పణమునందు, మన వ్యక్తిత్వము మఱియు కర్మల అధీశ్వరునిలోనికి భక్తిప్రేమలచే మన వైయక్తికప్రకృతియొక్క సముద్ధరణమునందు జ్ఞానసంపూర్తి సిద్ధించును; అటులే కర్మయజ్ఞమును ప్రేమ సామర్థ్యముచేత తన పరిసమాప్తిని, భగవంతుని అనుమోదనమును బొందును. కావున ఈ ప్రేమ, జ్ఞాన, కర్మలద్వారా మానవుని అంతరాత్మ దివ్యప్రకృతియొక్క ఈ యితర క్రియాశీల రహస్యమునందు, ఈ యితర సమధిక ఘనిష్ఠ పార్శ్వమునందు మిక్కిలి సంపూర్ణముగా తన పరిపూర్తి నందును మఱియు నీ పరిపూర్తిచేత అమృతత్వముయొక్కయు, పరమసుఖముయొక్కయు, శాశ్వతధర్మముయొక్క ప్రతిష్ఠను తనది గావించుకొనును (14 - 26, 27). మఱియు, ఏకాత్మయందు సమత్వము, ఏకేశ్వరునియొక్క ఆరాధన రూపమగు ఈ రెండు సాధనలను బ్రహ్మపదప్రాప్తికి - "బ్రహ్మభూయాయ" (14-26) రెండు వేఱు మార్గములుగా గీత ముందు ప్రతిపాదించును - ఇందు ఒకటి శమపరమగు సన్యాసము, రెండవది

దివ్యప్రేమ మఱియు దివ్యకర్మ రూపము; ఇక నిప్పుడు గీత ఈ సవ్యక్తిక నిర్వ్యక్తికములను పురుషోత్తమునియందు ఏకము గావించి వాని సంబంధముల నిర్వచింప దొడంగును. ఏలన పాక్షికవాదములను, భేదజనక అతివాదములను దూరము గావించి, జ్ఞానము మఱియు నాధ్యాత్మికానుభవముయొక్క ఈ రెండు పార్శ్వములను మేళవించి, పరమసంసిద్ధికి ఒక అద్వితీయ పూర్ణ మార్గమును రూపొందించుటయే గీతాలక్ష్యము.

10. ప్రపంచవృక్షము బంధనాత్మకము : గీత ముందు, వేదాంతము ననుసరించి, జగత్తును అశ్వత్థ (రావి) వృక్షరూపమున వర్ణించును. ఈ వృక్షమునకు దేశమునందు గాని, కాలమునందు గాని ఆదియు లేదు, అంతమును లేదు (15–3); ఏలన అది నిత్యము, "అవ్యయము" (15–1). దాని నిజరూపము నీ మానవ లోకమున గాంచజాలము, మఱియు దానికీ స్థూలలోకమున ఎట్టి స్థిరప్రతిష్ఠయు లేదు (15–3). అది – ప్రపంచము – ఒక అనంతప్రవాహము మఱియు దాని మూలము అనంతునియొక్క పరంధామమునందు గలదు (15–1). దాని హేతువు సహజ సనాతనమగు కర్మప్రవృత్తి, ఇది సర్వసృష్టికి ఆదియగు ఆద్యపురుషునుండి ప్రభవించును – "ఆద్యం పురుషం యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ" (15–4). కాన దాని మూలకందము కాలమున కావల, పైన, సనాతనునియందు గలదు; కాని దాని శాఖలు ఇచ్చట క్రింద ప్రసరించును మఱియు దాని కొన్ని వేళ్లు ఇచ్చట అధోముఖముగా మానవలోకమున నాటుకొనియున్నవి – ఈ వేళ్ళ రూపము సుదృఢము, సంలగ్నము నగు సంగము మఱియు కామము, కాగా వీని పరిణామము మఱింత కామము, అనంతముగా పొదలుచుండు మఱింత ప్రవృత్తి (15–2). పోగా దాని ఆకులు వేదమంత్రములు మఱియు నా విశ్వవృక్షము నెఱింగినవాడు వేదవిదు డగును (15–1). వేదముయొక్క, లేక కనీసము వేదవాదముయొక్క ఏ నిందాత్మక చర్చ మనకు పూర్వము (చూ. ప్రథమసంపుటము, వ్యాసము–9) తగిలెనో, దాని ఛాయయే ఇక్కడను గోచరించుచున్నది. ఏలన వేదములు మన కిచ్చు జ్ఞానము దేవతలయొక్కయు, ప్రాపంచికతత్త్వములయొక్కయు జ్ఞానము, మఱియు దాని ఫలములు కోరికతో జేసిన యజ్ఞఫలములు, ఇవి భూలోకము, స్వర్గలోకము, అంతరిక్షలోకములకు మాత్రమే చెందిన భోగము మఱియు నైశ్వర్యరూపమగు ఫలములు (2–43). ఈ విశ్వవృక్షముయొక్క కొమ్మలు క్రింద భౌతికలోకమునందు,

పైని ఆధిభౌతికలోకములందును విస్తరించును (15–2); అవి ప్రకృతిగుణములచేత పెరుగును, ఏలన ఈ కొమ్మలు త్రైగుణ్యమును మాత్రమే వర్ణించు వేదవిషయములు– "త్రైగుణ్యవిషయా వేదాః" (2-45). వేదమంత్రములు ఈ వృక్షముయొక్క ఆకులు కాగా, భోగ్యవిషయములు సంతతము సంకురించుచుండు పల్లవము లగును (2–42). కావున మానవుడు, గుణక్రీడ ను భోగించుచు, కామాసక్తుడై యున్నంత కాలము, జన్మకర్మల ప్రవృత్తివలయములలో చిక్కుకొనియుండి, స్వర్గమర్త్య లోకముల నడుమ పరిభ్రమించుచు, తన పరమ ఆధ్యాత్మిక అనంతతలను తిరిగి పొందజాలకుండును. ఋషులు దీనిని గుర్తించిరి. ముక్తిని సాధించుటకు వారు కర్మప్రేరణారూపమగు ప్రవృత్తినుండి విరమించుకొని, నివృత్తిపథము నవలంబించిరి మఱియు నీ మార్గాంతమున జన్మరాహిత్యమును, సనాతనుని విశ్వాతీతభూమికయందు అతీతపదమును పొందిరి (15–5). కాని ఇందునిమిత్తము లోతుగా తన్నుకొనిన కామమూలమును దృఢమగు అసంగశస్త్రముచే ఛేదించి, దేనిని ప్రాపించిన తిరిగి జన్మించవలసిన అగత్య ముండదో, అట్టి సర్వోన్నత గమ్యము నన్వేషింపవలెను (15–3, 4). నిమ్నమాయయొక్క సమ్మోహమునుండి విముక్తమగుట, అహంకారమును వర్జించి, సంగ – దోషమును జయించి, కామములను కట్టిపెట్టి, సుఖదుఃఖద్వంద్వమును దూరము చేసి, ఒక విశుద్ధ ఆధ్యాత్మికచేతనయందు సదా నిలిచియుండుట – ఆ పరమ అనంతుని మార్గసోపానములు (15–5). అచ్చట మనము కాలాతీతసత్తను కనుగొందుము, అది సూర్యుడు, చంద్రుడు లేక అగ్నిచేత భాసితము గాదు (15–6), అది స్వయముగా సనాతనపురుషుని సన్నిధియొక్క భాసము. ఆద్యపురుషుని మాత్రమే అన్వేషించుచు, మహాపథమున అతనిని పొందుటకు తదభిముఖ మగుచున్నాను – అని ఒక వైదికశ్లోకము పలుకును (15–4). అది పురుషోత్తమునియొక్క పరమపదము, అతని విశ్వాతీతభావము.

11. జీవుడును సనాతనుడే : కాని సన్న్యాసపూర్వకమగు నివృత్తిద్వారా దీనిని బాగుగా, శ్రేష్ఠముగా, ప్రత్యక్షముగా పొందగల మనిపించును. దాని విహిత మార్గము అక్షరపథ మనిపించును – జీవన కర్మల సంపూర్ణసన్న్యాసము, తపోమయ ఏకాంతవాసము, ధ్యానమయ అకర్మ. ఇచ్చట కర్మాదేశమునకు అవకాశ మెక్కడ, కనీసము ఆహ్వాన (పిలుపు) మెక్కడ, ఆవశ్యకత ఎక్కడ ? ఈ అక్షరమార్గానికి లోకసంగ్రహముతోను (3–20), కురుక్షేత్ర హత్యాకాండతోను (1–36) సంబంధ

మేమిటి ? అటులే కాలపురుని సంహారసంరంభముతోను, "లెమ్ము, శత్రువులను జయించుము, సమృద్ధరాజ్యము ననుభవింపుము" (11-33) - అని భీషణాదేశము నిచ్చు విరాట్పురుషుని దర్శనముతోను దీని కేమి సంబంధము ? అయితే, మంచిది, ప్రకృతియందలి అంతరాత్మస్వరూపము నీ వెఱుంగుదువా ? ఈ పురుషుడు, ఈ క్షరుడు, మన క్షరభావముయొక్క ఈ భోక్త సైతము పురుషోత్తముడే; ఇతడును అతని సనాతన బహుత్వమునందు పురుషోత్తముడే - అని గీత సమాధానించును, "నా ఒక సనాత నాంశమే జీవలోకమునందు జీవు డగును" (15-7). "సనాతన" మను నీ విశేషణమునకు ఎంతయో అర్థగౌరవము, పరిణామ మహత్త్వము గలవు. ఏలన ప్రతి అంతరాత్మయు, ప్రతిజీవుడును ప్రకృతియందు భగవంతుని మిక్కిలి ఆంశికముగానే అభివ్యక్త మొనరించుచున్నను, తన ఆధ్యాత్మిక సత్యతయందు సాక్షాత్తు భగవంతుడే యని ఈ విశేషణమున కర్థము. మఱియు, శబ్దముల కొక అర్థ మన లున్నచో, ప్రతి అంతరాత్మయు, అనేకమునందలి ప్రతివ్యక్తియు అభివ్యక్తియందు ఒకే మూలసత్తయొక్క ఒక సనాతన వ్యష్టిరూపము, ఒక సనాతన అజ అమర శక్తి యనియు దాని కర్థ మగును. ఈ అంతరాత్మను మనము జీవు డనుటకు గారణము, సజీవ ప్రాణుల ఈ లోకమున అది సజీవ ప్రాణియై నట్లు గన్పించును, మఱియు మానవునియందలి ఈ అంతరాత్మను మానవ అంతరాత్మగా భాషించుచు, మానవతాపరిభాషలోనే దానిని గుఱించి చింతింతుము. కాని నిజాని కది తన ప్రస్తుతరూపముకంటెను అధికతరము, అది మానవభావమునకు మాత్రమే బద్ధము గాదు : గతమునం దది మానవాభివ్యక్తికంటె స్వల్పతర అభివ్యక్తిగా నుండెను, కాని భవిష్యత్తునందు అది మనోమయ మానవునికంటె నెంతో అధికతర అభివ్యక్తి కాగలదు. మఱియు అజ్ఞానకృత పరిమితి నంతటిని వీడి అది పైకెగసి నపుడు, అంతరాత్మ తన దివ్యప్రకృతిని ధరించును - దాని మానవభావ మీ దివ్యప్రకృతియొక్క ఒక తాత్కాలిక ఆవరణము మాత్రమే; ఆంశికము, అపూర్ణము నగు అర్థముతో గూడిన ఒక అవాంతర వస్తువు మాత్రమే. ఈ వైయక్తికాత్మ ఈ లోకమునకు పైన సనాతనునియందు ఇపు డున్నది, ఎప్పుడును ఉండెను; ఏలన అది స్వయముగా సనాతనము (15-7). (ఇపుడు 'సనాతన' శబ్దప్రయోగముయొక్క పరిణామమును జూతము). జీవుని సనాతనతాభావమును పురస్కరించుకొనియే గీత సంపూర్ణ 'లయమును' సూచించు నెట్టి పదమును ప్రయోగించదు, పైగా జీవుని అత్యున్నతావస్థ పురుషోత్తమునియందు నివసించుటయే యని పలుకును-"నివసిష్యసి

మయ్యేవ" (12-8). సర్వభూతముల ఏకాత్మను గురించి ప్రసంగించు నపుడు (5-7, 24), గీత అద్వైత పరిభాషను వాడుచున్నట్లు గన్పించినను, సనాతన వ్యష్టి (individual) యొక్క ఈ స్థాయిసత్యము - "మమైవాంశః సనాతనః" (15-7), అద్వైతమునకు ఒక విశిష్టతను గల్పించును మఱియు గీత విశిష్టాద్వైతమును దాదాపు ఆమోదించినట్లు తోచును - అయినను గీతాదర్శన మదియే యని గాని, గీతామతము తర్వాత వచ్చిన రామానుజమతముతో అభిన్న మని గాని ఒక్కపెట్టున మనము నిర్ణయించరాదు. కాని ఈ మాత్రము స్పష్టము : ఏకమాత్ర భగవద స్తిత్వముయొక్క ఆధ్యాత్మికసత్తయందు మిథ్యామాత్రము గాక, పూర్ణవాస్తవ మగు నొక బహుత్వ-తత్త్వము గలదు.

12. మనలోని వెలుగే సూర్యునిలోని వెలుగు . సనాతన వ్యష్టిపురుషుడు దివ్యపురుషునికంటె నితరుడు గాని, వస్తుతః అతనినుండి ఎవ్విధముగాను వేఱు గాని గాడు. అతడు స్వయముగా నీశ్వరుడే; ఈశ్వరుడే తన ఏకత్వముయొక్క బహుత్వ సామర్థ్యముచేత వ్యష్టిరూపము ధరించి, మనలోని అమృతాత్మగా సర్వదా వర్తించును- నిజానికి సమస్త సృష్టియు ఈ బహుత్వసత్యముయొక్క రూపాంతరము గాదా? శరీరము ధరించినవాడును అతడే, అది మరణించినపుడు వెడలిపోవువాడును అతడే. అతడు శరీరప్రవేశము చేయునపుడు, విషయభోగము నిమిత్తము ప్రకృతియొక్క ఆంతరశక్తులగు మనస్సు మఱియు పంచేంద్రియములను, వాయువు పుష్పమునుండి గంధమునువలె, గొనివచ్చి, వానిని వికసింపజేయును (15-8). కాని ప్రకృతియందలి జీవేశ్వరుల తాదాత్మ్యము మన బాహ్యరూపముచేత మననుండి మఱుగువడి, ఆ ప్రకృతియొక్క ఎడమీయని చంచలవంచనలచేత నష్టమగును. మానవతారూపము లేక ప్రకృతియొక్క తదితర రూపములచే శాసింపబడుటకు స్వయముగా నవకాశ మిచ్చువారు దాని నెన్నటికి జూడరు, పరంతు మానవదేహమున నివసించుచున్న భగవంతుని ఉపేక్షింతురు మఱియు తృణీకరింతురు (9-11). అతడు శరీరమున ప్రవేశించునపుడు గాని, దానిని వీడిపోవునపుడు గాని, దానియందు నిలిచి, గుణాన్వితుడై అనుభవించునపుడు గాని, వారి అజ్ఞాన మతనిని జూడజాలదు; ఇంద్రియగోచరమగు దానినే చూచును గాని, జ్ఞానచక్షువు మాత్రమే చూడగల మహత్తరసత్యమును జూడజాలదు (15-10). బాహ్యచేతన విధించు పరిమితులను నేర్పుతో తొలగించి, తమయందు తమ ఆధ్యాత్మికసత్తను నిర్మించుకొనునంతవఱకు,

అనగా తమ ప్రకృతియందు దానికొక రూపమువంటి రూపమును సృజించుకొననంతవఱకు, ఎంత ప్రయాసపడినను వారు జీవుని దర్శనమును బొందజాలరు. మానవుడు తనను దెలిసికొనుటకు "కృతాత్ముడు" (15-11) గావలెను, అనగా ఆధ్యాత్మికరూపమున పూర్ణముగా నిర్మింపబడి, అధ్యాత్మికదర్శనమున ప్రబుద్ధుడు గావలెను. ఈ జ్ఞానచక్షువుతో నొప్పారు యోగులు తమ అనంతసత్యతయందు, తమ ఆత్మనిత్యతయందు మనమే అయిన దివ్యపురుషుని జూతురు (15-11). జ్ఞానప్రదీప్తులైన వీరు ఈశ్వరుని తమయందే కాంతురు, మఱియు స్థూల శారీరిక పరిమితినుండియు, మానసిక వ్యక్తిత్వరూపమునుండియు, క్షణిక ప్రాణికనిర్మాణము నుండియు విముక్తు లగుదురు ; ఆత్మ మఱియు పురుషరూప సత్యమునందు వీరు అమరులై జీవింతురు. కాని వారు ఈశ్వరుని తమయందే గాక, విశ్వ మంతటను వీక్షింతురు. జగత్తు నంతను వెలిగించు సూర్యుని వెలుగునందు వారు మనయందు (ను) గల భగవంతుని వెలుగును దర్శింతురు; అటులే చంద్రునియందును, అగ్నియందును గల ప్రకాశము భగవంతుని ప్రకాశమే (15-12). భూమియొక్క ఈ రూపమున ప్రవేశించిన వాడును, దాని భౌతికశక్తియొక్క ఆత్మగా నున్నవాడును, తన ఓజస్సుతో ఈ భూతజాతము నంతటిని ధరించుచున్నవాడును భగవంతుడే (15-13). సోమదేవత అయిన భగవంతుడే భూమాతయందలి రసముచే తన నాచ్ఛాదించియున్న మొక్కలను, చెట్లను బోషించును (15-13). సజీవప్రాణుల యొక్క భౌతికశరీరమును ధరించి, తదాహారమును వాని ప్రాణికశక్తిని బోషించు రసముగా మార్చు ప్రాణాగ్ని భగవంతుడే గాని, మఱెవ్వరును గారు (15-14). అతడు ప్రతిప్రాణిహృదయమునందును ప్రతిష్ఠితుడై యున్నాడు; అతనినుండియే స్మృతి, జ్ఞానము, తర్కము వెలువడును. సకలవేదములచేత నెఱుంగబడువా డతడె, వాని నెఱుంగువాడును అతడే, వేదాంతకర్తయు నతడే (15-15). ఇట్లు భగవంతుడేకకాలమున జడముయొక్క ఆత్మ, ప్రాణముయొక్క ఆత్మ, మనస్సుయొక్క ఆత్మ; మనస్సునకును, దాని పరిమితి హేతుబుద్ధికిని పైన భాసించు అతిమానస తేజముయొక్క అతీతాత్మ.

13. <u>పురుషోత్తముడు క్షరాక్షరములు, రెండును ;</u> ఇట్లు భగవంతుడు తన గుహ్యముయొక్క రూపమగు యుగళ ఆత్మగా, ద్వివిధశక్తిగా అభివ్యక్త మగును- "ద్వా విమౌ పురుషౌ" (15-16); ఈ సర్వభూతములు నగు, క్షరవస్తువులయందలి

క్షరపురుషుని – "క్షరః సర్వాణి భూతాని" (15–16), మఱియు వీనికి పైన, తన
అక్షోభ్యనిశ్చలతయందు, సనాతన శాంతిస్థిరతలయందు నిలిచియుండు అక్షరపురుషుని
ఏకకాలమున భగవంతుడు ధరించియుండును. మఱియు తమయందలి భగవంతుని
శక్తి ప్రభావముచేతనే, ఈ యుభయపురుషులు మానవుని మనోహృదయసంకల్పము
లను తనతన వైపునకు బలముగా నాకర్షించుకొందురు, ఈ విరుద్ధ ఆకర్షణలు పరస్పర
వినాశమునకు పట్టుబట్టినట్లు గన్పించును. కాని భగవంతుడు కేవలము క్షరుడును
గాడు, కేవలము అక్షరుడును గాడు. అతడు అక్షరాత్మకంటె నధికుడు, మఱియు
క్షరవస్తువుల క్షరాత్మకంటె మఱింత అధికుడు. అతడు ఏకకాలమున రెండును
గాగలుగుచున్నా డనిన, దానికి కారణము, అతడు వానికంటెను "అన్యుడు"
(15–17), విశ్వాతీతుడైన పురుషోత్తముడు (15–18); అయినను వేదమునందు
ఆత్మజ్ఞానరూపమునను, ప్రపంచమునందు ప్రపంచానుభవరూపమునను వ్యాపించి
యున్నవాడు (15–18). మఱియు నెవడేని ఇట్లతనిని పురుషోత్తమునిగా నెఱుంగునో
మఱియు దర్శించునో, అత డీ ప్రపంచాభాసముచే గాని, క్షరాక్షరముల విపరీతా
కర్షణలచేత గాని ఇక మోహితుడు గాడు (15–19). ఈ క్షరాక్షరములు ముందు
అతనియందు ప్రవృత్తి, నివృత్తిరూపముల పరస్పరము తలపడును–ఒకటి విశ్వక్రియ
యొక్క సద్భావము, రెండవది ఆత్మయందు దాని అభావము; ఏలన ప్రకృతియొక్క
అజ్ఞానమునకే చెందు, లేక అట్లు గన్పించు, క్రియయందు ఆత్మ ఎంతమాత్రము
పాల్గొనదు. లేక మఱల దీనికి విపరీతముగా సైతము అవి అతని చేతనను సవాలు
చేయును: ఈ సారి ఆత్మయే శుద్ధము, అనిర్ధార్యము, స్థిరము, నిత్యము నగు
స్వయంభూసత్తారూపమున సద్భావముగా గన్పించగా, విశ్వమే అభావముగా
గన్పించును; ఏలన ఈ విశ్వము పట్టుచిక్కని నిర్ధారణలు మఱియు సంబంధముల
తోను, భావములు మఱియు రూపములతోను, సంతత అస్థిర సంఘాతితోను, ఇంకను
క్రియావికాసములు, జననమరణములు, ఆవిర్భావతిరోభావల యొక్క సృష్టి,
వినాశాత్మక జాలముతోను గూడియుండును. పురుషోత్తమవిదుడు ఈ రెండింటిని
ఆలింగనము గావించుకొనుచునే, వానిలో చిక్కక, వాని విరోధము నతిక్రమించును
గాన, "సర్వవిదు" డగును (15–19). అతడు ఆత్మ మఱియు వస్తు సమూహము –
రెండింటియొక్క సంపూర్ణార్థమును దర్శించును; అతడు భగవంతునియొక్క
"సమగ్ర సత్యతను" (7–1) తిరిగి సమకూర్చును; ఎట్లన అతడు క్షరాక్షరములను
పురుషోత్తమునియందు ఏకముచేయును. తన మఱియు సర్వ సత్తయొక్క పరమాత్మ

గను, తప మఱియు సర్వ శక్తులయొక్క ఈశ్వరుడుగను, ప్రపంచమునందును, దానికి పైనను సన్నిహిత మఱియు సుదూర సనాతనుడుగను, అతడు భగవంతుని ప్రేమించును, పూజించును, ఆశ్రయించును మఱియు నారాధించును (15-19). మఱియు నిది యంతయు నతడు తనయొక్క ఒకానొక పార్శ్వము లేక అంశముచేత గాక, తన సత్తాసంభూతులు, తన ఆత్మప్రకృతుల సర్వ ప్రదీప్త ప్రకారములందును ఆచరించును – "సర్వభావేన" (15-19). తన అక్షోభ్య ఆత్మసత్తయొక్క దివ్య సమతయందు దివ్యుడును, ఇంకను దానియందు సర్వ వస్తువులు మఱియు ప్రాణులతో అనన్యుడు నగు నతడు ఆ నిస్సీమసమతను, ఆ గంభీర అనన్యతను క్రిందికి తన మనస్సు, హృదయము, ప్రాణము మఱియు శరీరములోనికి గొనివచ్చి, దానిపై నొక అవిభాజ్య సమగ్రతయందు దివ్యప్రేమ, దివ్యకర్మ మఱియు దివ్యజ్ఞానముల త్రితయమును ప్రతిష్ఠించును. ఇదియే గీతయొక్క మోక్షమార్గము.

14, <u>గీతా ఉద్వైతము :</u> మఱియు చివర కిదియే – ఏకమాత్ర సనాతన సత్తయం దెట్టి విభజనము చేయని యిదియే – వాస్తవాద్వైతము కాదా ? ఈ పరమ అవిభాజక అద్వైతము ఏకాత్మయొక్క సత్యతయందు వలెనే ప్రకృతియొక్క బహుత్వములందు, సర్వపార్శ్వములందు సైతము ఏకమాత్రునే చూచును; అటులే ఆత్మమూలమును, విశ్వసత్యము నగు విశ్వాతీతముయొక్క మహత్తమ సత్యత యందువలెనే విశ్వమందును ఏకమాత్రునే గాంచును–ఈ విశ్వాతీతము వైశ్వసంభూతి యొక్క ఎట్టి విధానము (affirmation) చేత గాని, ఎట్టి వైశ్వ లేక సంపూర్ణ నిషేధము (negation) చేత గాని బద్ధము గాదు. కనీస మిది గీతాఉద్వైతము. ఇది గుహ్యతమ శాస్త్ర మని పరమగురు వర్జునునికి దెలుపును; ఇది పరమ జ్ఞానము మఱియు విజ్ఞానము, ఇది మనకు సత్తయొక్క అత్యున్నతరహస్యములోని హృదయమును తెఱచును. దీనిని సంపూర్ణముగా నెఱుంగుట, అనగా జ్ఞానము నందును, భావమునందును, శక్తియందును, అనుభవమునందును దీనిని ఆకళించుకొనుట యన రూపాంతరముచెందిన బుద్ధియందు పూర్ణమగుట యగును, హృదయమునందు దివ్యతృప్తి నందుట యగును, అటులే సంకల్పము, క్రియ మఱియు కర్మలయొక్క పరమ ఆశయము మఱియు లక్ష్యమునందు కృతార్థుల మగుట యగును (15-20). అమరుల మగుటకు, అత్యున్నత దివ్యప్రకృతి దిశగా ఉద్గమించుటకు, శాశ్వతధర్మమును ధరించుటకును ఇదియే మార్గము.

# 16. ఆధ్యాత్మిక కర్మయొక్క సంపూర్ణత

1. మూలసమస్య, గీతాపరిష్కారము : గీతావిచారణ యిపుడే దశ నందుకొన్నదో, దానియం దిక సమాధానించవలసిన ప్రశ్న యొకటి మాత్రమే మిగిలియున్నది – మన ప్రకృతి బద్ధము, అపూర్ణము గదా: అది నిమ్నసత్త నుండి ఉన్నత సత్తలోనికి, తన ప్రస్తుత కర్మనియమమునుండి అమరధర్మములోనికి తన పరిణామమును తత్త్వమునందే గాక, సర్వవ్యాపారమునందును ఎట్లు సాధించవలెను? ఈ కఠినత గీత ప్రతిపాదించిన కొన్ని సిద్ధాంతములందు గర్భితముగా నున్నది, దీని నిపుడు ఎక్కువగా వెలువరించి, స్పష్టతరరూపమున మన బుద్ధిముం దుంచదగును. ఆ నాటి మనస్సునకు పరిచితమైన మానసికజ్ఞానముపై గీత ముందుకు సాగుచు, కొన్ని విషయములను సత్యమైనట్లు స్వీకరించి, కొన్నింటి నసలు విడిచివేసి, అడుగునకు, అడుగునకు మధ్యగల విచారణను సంక్షిప్తము గావించి, తన పరిష్కారమును చూపగలిగెను; దాని నంతను స్పష్టమగు ప్రకాశమున సునిశ్చితముగా నిరూపించుట ఇపుడు మన కవసరము. గీతోపదేశము ప్రారంభమున మన ప్రాపంచిక కర్మ కొక నూతన మూలమును, నూతన స్తరమును నిర్దేశింప సమకట్టును; ఇదియే దాని ఉపక్రమము మఱియు నిదియే దాని ఉపసంహారమునకు మూలహేతువు. దాని ప్రారంభకోద్దేశ్యము కచ్చితముగా మోక్షమార్గమును ప్రతిపాదించుట గాదు, పరంతు ముఖ్యముగా, మోక్షము దిశగా సాగు అంతరాత్మప్రయత్నముతో కర్మల సుసంగతత్త్వమును నిరూపించుటయే; మఱియు నా మోక్షము సిద్ధించి నపుడు, అవిచ్ఛిన్న ప్రాపంచిక కర్మలతో ఆ ఆధ్యాత్మిక స్వాతంత్ర్యము యొక్క సుసంగతత్త్వమును ప్రదర్శించుటయే – "ముక్తస్య కర్మ" (4–23). ప్రసంగవశమున మాత్రమే, ఒక సమన్వయాత్మక యోగము, లేక ఆధ్యాత్మికముక్తి మఱియు సంసిద్ధికి ఒక మానసిక విధానము రూపింపబడినది, మఱియు నీ యోగ ప్రామాణ్యమునకు ఆధారభూతమగు కొన్ని దార్శనిక ప్రతిపాదనలు, మన సత్తా ప్రకృతులకు సంబంధించిన కొన్ని సత్యములు ప్రస్తావించబడినవి. కాని మొదటి

తత్పరత చివరివఱకు నిలిచియుండును – హత్యాకాండను ఏవగించుకొని, సామాన్య మానసికప్రమాణములపై కర్మ చేయ నొల్లని అర్జునుడు ఒక నూతన సంతృప్తికర ఆధ్యాత్మిక కర్మప్రమాణమును ఎట్లు కనుగొనవలెను, లేక ఆత్మసత్యమునందు నివసించుచునే, కురుక్షేత్ర సంగ్రామమున తన నియతకర్మ నెట్లు నిర్వర్తించవలెను ?– ఇదే ప్రధాన గీతాతత్పరత. నిర్వ్యక్తిక సర్వాత్మయొక్క నీరవతయందు లోలోపల నిర్మలముగా, నిస్సంగముగా, ప్రశాంతముగా నివసించుచునే, క్రియాశీల ప్రకృతి యందు దాని కర్మలను క్రియాశీలముగా నిర్వహించవలెను, మఱియు నింకను విశాలముగా, మన లోపలి సనాతనునితో ఏకమై, ఆతని ప్రకృతితో నేకముచేయబడిన వైయక్తికప్రకృతిద్వారా వ్యక్తమగు అతని సంకల్పమును నిర్వర్తించవలెను – ఇదియే అర్జును డెదుర్కొనిన కఠినసమస్యకు గీతా పరిష్కారము.

2. <u>అర్జునుని సమస్యాస్వరూపము</u> : ఈ పరిష్కార తాత్పర్య మేమియో, అర్జునుని కఠినతకును, అస్త్రసన్యాసమునకును మూలమునందు గల సమస్యాదృక్కోణమునుంచియు, విస్పష్ట, సునిశ్చిత శబ్దములలోను ఇపుడు మన మించుక చూతము. మానవుడుగను, సామాజికజీవిగను అర్జునుని కర్తవ్యము క్షత్రియుని సమున్నతధర్మమును నిర్వహించుట యగును; లేనిచో, అత్యాచారము, అధర్మము, అన్యాయములయొక్క అరాజకదౌర్జన్యమునందు సామాజికరూపము దెబ్బతినును, జాతిఆదర్శములు నిర్వీర్య మగును, ధర్మన్యాయముల సామరస్యపూర్ణ వ్యవస్థ అడుగంటును. అయినను కేవల కర్తవ్య – ప్రమాణము ఆ సంగ్రామవీరు నిక తృప్తిపఱుపజాలదు, ఏలన కురుక్షేత్రముయొక్క దారుణవాస్తవికతయం దా కర్తవ్యము కఠోర సంకుల సందిగ్ధ రూపములం దతనికి ప్రత్యక్షమగును. ఎట్లన తన సామాజికవిధిపాలనమున కర్గము, పాపము, శోకము, క్లేశముల రూపమగు అనంతఫలితమున కనుమతించుటయే యని అతనికి సహసా తట్టెను; సామాజిక భద్రతాన్యాయముల సాంప్రదాయిక సాధనము (యుద్ధము) వానికి బదులు మహాకల్లోలమునే తెచ్చిపెట్ట నున్నట్లు అతనికి గన్పించెను. మనము హక్కులని పిలుచునట్టి న్యాయమగు అధికార, ప్రయోజనముల ప్రమాణ మర్జునునికి సాయపడదు; తనకొఱకును, తన సోదరులకొఱకును, యుద్ధమునందలి తన పక్షముకొఱకును తాను జయించవలసిన రాజ్యము నిజానికి న్యాయరీత్యా తమదే, మఱియు దాని సంస్థాపన ఆసురికరాజ్య పరాభవము, న్యాయప్రతిష్ఠాపనమే యగును; కాని ఆ న్యాయ

రక్తసిక్తన్యాయము మఱియు ఆ రాజ్యము ఒక మహాపాపముతోను, సమాజమునకు జరిగిన ఒక భీకరహానితోను, జాతికి జరిగిన ఒక వాస్తవాపరాధముతోను కళంకిత రాజ్యము. మఱియు ధర్మప్రమాణము, నైతికధర్మప్రమాణమును అతని కక్కఱకు రాదు; ఏలన ఇచ్చట ధర్మముల వ్యాఘాతము కన్పించును. కావున సమస్యా పరిష్కారమునకు ఒక నూతన, అధికతర, అయినను ఊహించని ప్రమాణ మావశ్యకము, కాని ఆ ప్రమాణమేది ? ఆ నియమ మేది ?

3. <u>యుక్తుడవై కర్మచేయుము</u> ; ఏలన కర్మనుంచి ఉపసంహరించుకొని, ధ్యానపరుల నిష్క్రియతయందు శరణుబొంది, తన అసంతృప్తికర పద్ధతులు మఱియు ప్రేరణలతో తన దారి తాను చూచుకొనుటకు ప్రపంచమును వదిలివేయుట ఒక సంభవపరిష్కార మగును; దీనిని ఊహించుట సులభము, ఆచరించుట సులభము, కాని వరమగురువు సరిగా నీ పరిష్కారమునే పట్టుబట్టి వారించుచు వచ్చెను. భగవంతుడు ప్రపంచప్రభువు, ఆ ప్రపంచము క్రియాక్షేత్రము, ఆ క్షేత్రమున మానవుడు అహంకారముద్వారా అజ్ఞానమునందు గాని, పరిమిత మానవ బుద్ధియొక్క పాక్షికప్రకాశమునందు గాని ఏ కర్మలను జేయునో, లేక అతనియందు ఏ కర్మలు అంతర్దృష్టి మఱియు ప్రేరణతో గూడిన ఒక ఉచ్చతర భూమికనుండి ప్రారంభించబడునో, అట్టి మానవకర్మ లన్నింటికి భగవంతుడే ప్రభువు, ఆ ప్రభువు మానవునుండి కర్మ నపేక్షించును. మఱల, యుద్ధకర్మ అనర్థ మని చెప్పి, దానిని మాత్రమే వర్జించుట మఱియొక పరిష్కారము, ఇది దూరదృష్టి లేని నీతిబోధకులకు అందుబాటులోని ఉపాయము, కాని ఈ పలాయనమునకు సైతము గురువు తన అంగీకారమును నిరాకరించును. అర్జునుడు యుద్ధముచేయకపోవుటే ఎక్కువ పాపము (2–33) మఱియు అనర్థమునకు గారణ మగును: దాని అర్థము అధర్మ, అన్యాయముల విజయ మగును, భగవంతుని కర్మయందు ఒక ఉపకరణముగా తన పాత్రను నిరాకరించుట యగును. జాతి భవితవ్యమును నిర్ణయించు ఈ ప్రచండ సంకటమునకు గారణము జడశక్తుల అంధగతియు గాదు, మానవ భావములు, ప్రయోజనములు, ఆవేగములు, అహంకారముల కేవలక్రమహీనసంఘర్షమును గాదు, పరంతు ఈ బాహ్యరూపముల వెనుకనున్న భగవదిచ్ఛ. అర్జును డీ సత్యము గుర్తించునట్లు చేయవలెను; తన చిన్న వైయక్తిక కామనలు మఱియు దుర్బల మానవ వైముఖ్యములయొక్క కాక, ఒక విశాలతర ప్రకాశతర శక్తియొక్క, ఒక

మహత్తర సర్వజ్ఞ సంకల్పముయొక్క ఉపకరణరూపమున అతడు నిర్వ్యక్తికముగా నిశ్చలముగా పనిజేయ నేర్చుకొనవలెను. లోపలి మఱియు వెలుపలి భగవంతునితో తన అంతరాత్మయొక్క సమున్నతసంయోగమున – "యుక్త" (3–26) – అనగా తన స్వీయ మూలాత్మతోను, విశ్వముయొక్క అంతర్యామి ఆత్మతోను ప్రశాంత యోగమున యుక్తుడై అతడు నిర్వ్యక్తికముగాను, సార్వత్రికముగాను కర్మ చేయవలెను.

4. <u>ఆత్మజ్ఞానమునందే విముక్తకర్మ</u> : కాని మానవుడు అహంకారముచేత, అర్ధ - పరిబుద్ధము, అప్రకాశితము నగు సాత్త్వికాహంకారముచేత సైతము శాసించ బడునంత కాలము, అత డీ సత్యమును సరిగా చూడజాలడు, ఈ కర్మను సరిగా చేపట్టజాలడు, ఏలన ఈ సత్యము ఆత్మసత్యము మఱియు నీ కర్మ ఆధ్యాత్మిక మూలమునుండి నిర్గమించు కర్మ. బౌద్ధికము గాక, ఆధ్యాత్మికజ్ఞానమే ఈ మార్గము నకు పరమావశ్యకము, దాని కేవల సంభావ్య ప్రకాశము, మాధ్యమము, ప్రోత్సాహ మును నగును. కావుననే, హర్షశోకములు, కామపాపములు, కర్మయొక్క బాహ్య ఫలితములను బట్టి కర్మను నడుపగోరు మనఃప్రవృత్తి, ప్రపంచముతో విశ్వపురుషుని వ్యవహారములందు ఘోరముగా గన్పించు దానినుండి మానవపరావర్తనము – అర్జునుని వ్యథితము, వ్యాకులము, విమూఢము గావించు ఈ భావములు మఱియు వేదన లన్నియు ప్రాకృతాజ్ఞానమునకు మన చేతనయొక్క అధీనతనుండి జనించినవే యని మున్ముందు గురువు ఎత్తి చూపును (2–14) – నిమ్న ప్రకృతియొక్క ఈ అజ్ఞాన మయ కర్మవిధానమునందు చిక్కుకొని, అంతరాత్మ తన నొక పృథగహంకారముగా చూచుకొనును (3–27), తనపై వస్తువుల క్రియకు సుఖదుఃఖములు, పుణ్యాపాపములు, ధర్మాధర్మములు, శుభాశుభరూప ద్వంద్వప్రతిక్రియతో సమాధాన మిచ్చును. ఈ ప్రతిక్రియ లొక విషమ వ్యాకులజాలమును సృజించగా, దానియం దంతరాత్మ తన అజ్ఞానముచేతనే భ్రష్టము, సంమూఢము నగును (7–27); అప్పటిది ఆంశిక, అపూర్ణ పరిష్కారములతో తనను నడుపుకొనవలసియుండును, ఈ పరిష్కారము లెటులో సామాన్యజీవితమునకు సరిపోవును గాని, ఒక విశాలతరదర్శనము, ఒక గభీరతర అనుభవముయొక్క పరీక్షకు బెట్టినపుడు తప్పిపోవును. కర్మ మఱియు జీవనముయొక్క వాస్తవార్థమును గ్రహించుటకు ఈ సమస్తాభాసములనుండి వెనుదగ్గి, ఆత్మసత్యములో ప్రవేశింపవలెను; ముందు ఆత్మజ్ఞానమును స్థిరపఱచుకొన్నప్పుడే, యథార్థ ప్రపంచజ్ఞానముయొక్క ఆధారము ప్రాప్తముకాగలదు.

5. <u>వ్యక్తిత్వము వెనుకనుండు ఆత్మలోనికి</u> : దీనికి ఆవశ్యకమగు ప్రథమ సాధన యేమన, అంతరాత్మ తన తెక్కలనుండి కామమును, ఆవేశమును, వ్యథారక భావావేగమును దులిపివేసి, మానవమనస్సుయొక్క విక్షుబ్ద వికృతికారి వాతావరణమునుండి బైటబడి, నిర్వికారసమతయొక్క ఆకాశములోనికి, నిర్వ్యక్తిక ప్రశాంతియొక్క స్వర్గములోనికి, వస్తువులను నిరహంకారముగా దర్శించి, అనుభవించు స్థితిలోనికి ఎగయవలెను; ఏలన విశుద్ధమగు నా ఉచ్చతర వాయువునందే, మబ్బులు మఱియు తుఫాను లన్నింటినుండి విముక్తమగు భూమికలయందే ఆత్మజ్ఞానము లభించగలదు, మఱియు ప్రపంచనియమము, ప్రకృతిసత్యము ఒక వ్యాపకదృష్టితో, అక్షుబ్ధము, సర్వాలింగకము, సర్వవేధకము నగు ఒక ప్రకాశమునందు చూడబడగలవు. ఈ క్షుద్ర వ్యక్తిత్వ మొక నిస్సహాయ కరణము మాత్రమే, తటస్థము లేక వృథాగా ప్రతిరోధించు ఒక బొమ్మ మాత్రమే, ఒక ప్రకృతినిర్మిత రూపము మాత్రమే, దాని వెనుక నొక నిర్వ్యక్తిక ఆత్మ గలదు, అది అన్నింటియందును ఏకము, వస్తువులను తెలిసికొనున దదియే; అనగా ఒక సాక్షిచేతన గలదు, అది సమము, నిష్పాక్షికము, ఒక విశ్వవ్యాపి సన్నిధి, అది సృష్టిక్రియ కాధారము, అది వస్తుస్వభావమును బట్టి వాని సంభూతిని నిర్వర్తింప ప్రకృతి ననుమతించును గాని, ప్రకృతి ప్రారంభించు క్రియయందు మునిగి, తన స్వరూపమును గోల్పోదు. అహంకారమునుండియు, వ్యథిత వ్యక్తిత్వమునుండియు ఈ ప్రశాంత, సమ, సనాతన, విశ్వవ్యాపి; నిర్వ్యక్తిక ఆత్మలోని కుపసంహరించుకొనుట యోగమునందు చేయబడు దర్శనయుక్తమగు (seeing) కర్మకు ప్రథమసోపాన మగును, అనగా మన కిపు డెంత అస్పష్టముగా నున్నను, విశ్వమునందు తన నభివ్యక్తము గావించుకొనుచున్న దివ్యపురుషుడు మఱియు నతని అమోఘసంకల్పముతో సచేతన సంయోగమునం దుండి చేయబడు కర్మ కది ప్రథమసోపానము.

6. <u>ఆత్మవిశాలతలో అహంకారలయము</u> : నిర్వ్యక్తిక విశాలతతో గూడిన ఈ ఆత్మయందు ప్రశాంతముగా సమస్థితులమై నపుడు, అది వ్యాపకము, నిర్మలము, నిశ్చలము, నిర్వ్యక్తికము గాపున, మన యితర క్షుద్ర మిథ్యాభూత ఆత్మయగు కర్మచేయు నహంకారము దాని విశాలతయందు అంతరించగా, మనము గాక, ప్రకృతియే కర్మచేయుచున్న దనియు, సర్వకర్మయు ప్రకృతికర్మయే గాని, తదితరము గాదనియు మనము గాంతుము. పోగా మనము ప్రకృతి యని పిలుచు

ఈ వస్తుప్రక్రియాగతమగు సనాతన పురుషునియొక్క కార్యనిర్వాహక శక్తి; ఈ పురుష డీ శక్తిద్వారా ప్రతిజాతియందును, జాతియందలి ప్రతివ్యక్తియందును దాని స్వభావ, స్వధర్మముల ననుసరించి విభిన్న ఆకారములను, రూపములను ధరించును (4-13). ప్రతిప్రాణియు తన స్వభావమును బట్టి కర్మచేయునే గాని, తదితర విధముగా చేయజాలదు (5-14). అహంకారము, వైయక్తిక కామసంకల్పములు ఒక విశ్వశక్తియొక్క స్పష్ట – సచేతన రూపములు మఱియు పరిమిత ప్రాకృత క్రియలే గాని, తదధికముగా నేమియు గావు, అయితే ఆ శక్తి స్వయముగా రూపరహితము, అనంతము, రూపములకంటె మిక్కిలి అతీతము; బుద్ధి, ప్రజ్ఞ, మనస్సు, ఇంద్రియము, ప్రాణము మఱియు శరీరము – వీని నన్నింటిని మనము ప్రదర్శించుకొందుము లేక మనవే యని తలపోతము, కాని యివి యన్నియు ప్రకృతియొక్క ఉపకరణములు మఱియు నిర్మాణములు. కాని నిర్వ్యక్తికాత్మ కర్మ చేయదు, కావున అది ప్రకృతిలో భాగము గాదు, అది కర్మను వెనుకనుండియు, పైనుండియు నిరీక్షించును మాత్రము; కావున స్వరాట్టుగను, విముక్త శాంత జ్ఞాత మఱియు సాక్షిగను నిలిచియుండును. ఈ నిర్వ్యక్తికతయందు నివసించు అంతరాత్మ సైతము కర్మలిప్తము గాదు, మన వైయక్తిక ప్రకృతి కర్మలకు ఉపకరణము మాత్రమే; అపు డంతరాత్మ ఆ కర్మలకు గాని, వాని ఫలితములకు గాని మనలను వేధించు సుఖదుఃఖ, రాగద్వేషాది సహస్ర ద్వంద్వములతో సమాధాన మీయదు. అది సర్వ మానవులను, వస్తువులను, ఘటనలను సమచక్షువుతో చూచును, గుణములు మాత్రమే గుణములపై కర్మచేయుచున్న వని గమనించును (3-28), ప్రకృతి యంత్రాంగ రహస్యము నంతను గాంచును, కాని గుణముల కావల నిరాకులము, విముక్తము స్వస్థము నగు ఒక విశుద్ధ నిరపేక్ష మూలసత్తగా నుండును. ప్రకృతి తన కర్మను నిర్వహించుచుండగా, నిర్వ్యక్తికము, విశ్వగమము నగు ఆత్మ దానిని ధరించునే గాని, స్వయముగా సంవృతము గాదు, సక్తము గాదు, లగ్నము గాదు, క్షుబ్ధము గాదు, సంమూఢము గాదు. ఈ సమ ఆత్మయందు నివసించగలిగినచో, మనమును శాంతిమయుల మగుదుము. మన ఉపకరణములందు ప్రకృతి తన ప్రేరణమును పొడిగించువఱకు, మన కర్మలు కొనసాగును; కాని ఆధ్యాత్మిక స్వతంత్రత యుండును, ప్రశమ ముండును (13-30).

7. <u>ఇరువురి పురుషుల ఆవశ్యకత</u> : నిష్క్రియపురుషుడు, సక్రియ - ప్రకృతి - ఈ ద్వంద్వము సైతము మన సత్తయొక్క సర్వభావము గాదు; వాస్తవాని కివి రెండును సత్తావిషయమున చివరి మాట గావు. ఒకవేళ అగుచో, సర్వకర్మలు ఉదాసీనాత్మకు ఒకటే యగును, మఱియు ఈ కర్మ గాని, ఆ కర్మ గాని, కర్మవిరతి గాని గుణముల చంచల వ్యాపారముయొక్క అనియంత్రిత ప్రవృత్తి చేతనే సంభవించును, అథవా ప్రకృతియొక్క ఒకానొక యాంత్రిక నియామకత్వముచే (determinism) నిర్ణయించబడును - ఉదాహరణకు, దీని ననుసరించి, తన ఉపకరణములందలి రాజసిక ప్రేరణచేత అర్జునుడు యుద్ధములోనికి నెట్టబడును, లేక తామసిక మాంద్యముచేతనో, సాత్త్విక ఉదాసీనతచేతనో దానినుండి పరాఙ్ముఖు డగును. ఇంకను, (పురుష ప్రకృతులే చరమద్వంద్వ మగుచో), అంతరాత్మ తన నివృత్తియందు నిర్వ్యక్తిక నిశ్చల ఆత్మయందు నివసింప నారంభించి, ఇక నేమాత్రము సక్రియప్రకృతియందు నివసింపడు గావున, దీని చరమఫలితము నిశ్చలత, అకర్మ, ఉపశమము, జడతయే యగును గాని, గీత విధించు కర్మ గాదు. మఱియు, మూడవ కారణము, ప్రకృతియందును, ఆమె కర్మలయందును తనను సంబద్ధముగావిందుకొన నెందు కంతరాత్మ పిలువబడినట్లు ? - దీని కీ ద్వంద్వ మెట్టి వాస్తవవివరణము నివ్వదు. ఇచ్చట 'అంతరాత్మ' అనుటకు కారణము, ఇట్లు సంబద్ధము గావించుకొనినది నిత్యనిర్లిప్తము, స్వసంవిదము నగు ఏకాత్మ గాజాలదు, ఈ ఏకాత్మ సదా ఏకరూపము, ఇది ప్రకృతికర్మకు పృథగ్భూతసాక్షి లేక నిష్సాక్షిక ఆధారము నగును. పురుష ప్రకృతుల మధ్య గల ఈ అఖాతమే, పూరింపరాని ఈ శూన్యతయే ఇద్దరు పురుషులను, లేక ఒకే పురుషునియొక్క రెండు అవస్థలను ఊహింప మనలను నిర్బంధించును - ఒకటి, ఏకాత్మయందలి గుప్తావస్థ, ఇది తన స్వయంభూసత్తనుండి సర్వమును నిరీక్షించును, లేక దేనిని నిరీక్షింపదు; రెండవది, ప్రకృతిలోనికి స్వయంప్రక్షిప్తము, ఇది ప్రకృతికర్మకు ఉపయోగపడుచు, ఆమె నిర్మాణములతో తన నేకాకారము గావించుకొనును. కాని పురుషద్వయముయొక్క ద్వైతముచే సంశోధితమైన, ఆత్మ మఱియు ప్రకృతి లేక ఆత్మ మఱియు మాయతో గూడిన ద్వైతము సైతము గీతయొక్క సంపూర్ణ దార్శనికసిద్ధాంతము గాదు. గీత వీని నతిక్రమించి, ఒక ఉచ్చతరపురుషుని, పురుషోత్తముని సర్వాలింగక పరమ ఏకత్వమును చేరుకొనును (15-18).

8. <u>పురమపురుషుడు, పరమాత్మ, పరమేశ్వరుడు</u> : ఒక పరమగుహ్యము, ఒక పరమోన్నత సత్యము గలదు, అది ఈ రెండు విభిన్న అభివ్యక్తులను – ఆత్మ ప్రకృతులను – ధరించి, సమన్వయపఱచును – అని గీత వక్కాణించును. ఒక ఉత్తమోత్తమ పరమాత్మ గలదు (15–17), అది సవ్యక్తిక ఈశ్వరుడు, నిర్వ్యక్తిక బ్రహ్మము – రెండును, కాని అది రెండింటిలో ప్రతిదానికంటెను ఇతరము, అధికము, మఱియు నీ రెండింటి సముచ్చయముకంటెను ఇతరము, అధికము. ఆ పరమాత్మ పురుషుడు, అనగా మన సత్తయొక్క ఆత్మ మఱియు అంతరాత్మ, కాని అతడు ప్రకృతి గూడను; ఏలన ప్రకృతి సర్వ – పురుషునియొక్క, అనగా కర్మ మఱియు సృష్టి దిశగా స్వయంచలితుడైన సనాతనానంతునియొక్క శక్తియే. పరమ అనిర్వచనీయుడుగా, సర్వ – పురుషుడుగా నతడు తన ప్రకృతిచేత సర్వప్రాణులు నగును (14–3). పరమాత్మగాను, పరబ్రహ్మముగాను అతడు తన విద్యామాయచేత ఆత్మను, తన అవిద్యా మాయచేత అంతరాత్మను (నిమ్నప్రకృతిని) – విశ్వప్రవాహిక యొక్క ఈ ద్వివిధ సత్యమును అభివ్యక్తము చేయును. పరమేశ్వరుడుగా, తన శక్తియొక్క నియామకుడుగా, అతడు ఈ అగణ్యభూతముల వ్యక్తిత్వమును, సామర్థ్యమును, కర్మలను సృజించును, ప్రేరించును మఱియు పాలించును. పోగా ప్రతి జీవుడును (15–7) ఈ స్వయంభూ ఏకమాత్రి పురుషునియొక్క ఒక ఆంశిక సత్త యగును, ఈ సర్వ – అంతరాత్మయొక్క ఒక సనాతన అంతరాత్మ యగును, ఈ పరమేశ్వరుడు మఱియు నతని వైశ్వప్రకృతియొక్క ఒక ఆంశిక అభివ్యక్తి యగును. ఇచ్చట సర్వమును ఈ భగవంతుడే, ఈ దేవదేవుడగు వాసుదేవుడే (7–19); ఏలన ప్రకృతిచేతను, ప్రకృతియందలి అంతరాత్మచేతను అతడే యిది యంతయు నగును, ప్రతివస్తువు అతనినుండియే ప్రభవించి, అతనియందు లేక అతనిచేత జీవించును; అయినను అతడు స్వయముగా ఎట్టి విశాలతమ అభివ్యక్తి కంటెను, ఎట్టి గభీరతమ ఆత్మకంటెను, ఎట్టి విరాడ్రూపముకంటెను ఎంతో అధికుడు (10–42). ఇదియే సృష్టియొక్క సంపూర్ణసత్యము మఱియు నిదియే విశ్వక్రియ యొక్క సమస్తరహస్యము; ఇదియే గీతయొక్క తర్వాతి అధ్యాయములందు స్వయముగా వ్యక్తమగుటను మనము చూచియున్నాము.

9. <u>జ్ఞానకర్మల సమన్వయము</u> : కాని ఈ అధికతర సత్యము ఆధ్యాత్మిక కర్మయొక్క తత్త్వము నెట్లు మార్చును లేక ప్రభావితముచేయును ? అది దానిని

ముఖ్యముగా నొక పాశికవిషయమున మార్చివేయును, అనగా దానివలన ఆత్మ, ఉత్తరాత్మ, ప్రకృతి – వీని సంబంధముయొక్క అర్థ మంతయు మాఱిపోవును, అది యొక నూతన దృష్టికి కనువిప్పును, మిగిలియున్న ఖాళీలను పూరించును, ఒక మహత్తర విస్తారమును సంతరించుకొనును, ఆధ్యాత్మికముగా వాస్తవము, నిర్దోషముగా సమగ్రము నగు నొక సత్యార్థమును స్వీకరించును. అప్పుడు ప్రపంచ మిట్లు గన్పించును: దాని ఒక పార్శ్వము కేవలము యాంత్రిక గుణాత్మక క్రియ మఱియు ప్రకృతి నిర్ధారణము, రెండవ పార్శ్వము నిర్వ్యక్తిక ఆత్మయొక్క నిశ్చలత – ఈ ఆత్మకు గుణ ముండదు, స్వ – నిర్ధారణ శక్తి యుండదు, సృజించుటకు సామర్థ్యము గాని, సంకల్పము గాని యుండదు. ఈ అసంతృప్తికర ద్వైతముచే విభజింపబడిన అఖాతమునకు వంతెన కట్టబడును, జ్ఞానకర్మలకు, ఆత్మప్రకృతులకు ఒక సముద్ధారక ఏకత్వము ప్రకాశితమగును. ఎట్లన, నిశ్చల నిర్వ్యక్తిక ఆత్మ పరమ పురుషునియొక్క ఒక సత్యము–అది భగవంతునియొక్క స్థిరత, సనాతనునియొక్క మౌనము, సర్వేశ్వరునియొక్క స్వతంత్రత, అది ఆ ఈశ్వరుని స్వయంభూ సత్తయొక్క స్థిర అనంత స్వతంత్రత, అది అతని సృష్టిచేత బద్ధము, వ్యథితము లేక ప్రభావితము గాదు, అతని ప్రకృతియొక్క క్రియాప్రతిక్రియలచేత స్పృష్టము గాదు, (13-32). కాగా ఈ సమగ్రసత్యమునందు ప్రకృతియు నొక అనిర్వచనీయ మాయగా, ఒక పృథగ్భూత విపరీత దృశ్యముగా గాక, సనాతనునియొక్క ఒక శక్తిగానే గన్పించును; ఆమె సమస్తసంరంభము, క్రియాకలాపము, బహుత్వము అక్షరాత్మయొక్క అసక్త ప్రశాంతియందు ప్రతిష్ఠితమై చెలంగును. ప్రకృతిప్రభువు అక్షరాత్మగా నుండుచునే, అదే సమయమున విశ్వముయొక్క ఏకము, ననేకము నగు క్షరాత్మయునై యుండి, ఒక ఆంశిక అభివ్యక్తియందు ఈ సర్వశక్తులు మఱియు చేతనలు, దేవతలు, మానవులు, పశువులు మఱియు వస్తువులు నగును. గుణాత్మిక ప్రకృతి ఈ పరప్రకృతియొక్క ఒక నిమ్న స్వయంపరిమితి క్రియ మాత్రము. మానవుని అంతరసత్త అతని బాహ్యచేతననుండి గుప్తమై యుండునట్లే, తన బాహ్యక్రియయందు నిమగ్నమై యుండు నిమ్నప్రకృతియొక్క బాహ్యశక్తినుండియు భగవంతుని సత్యమువలెనే ఆత్మసత్యమును మఱుగువడియుండును – ఈ గుప్తవస్తువును కనుగొనుటకు తన నానాప్రయత్నములందు అంతరాత్మ లోనికి దిగి, తన స్వీయ వాస్తవసత్యములను, తన ఎత్తులను, తన లోతులను బొందువఱకు ఈ మఱుగు తొలగిపోదు. కావుననే ఆత్మజ్ఞాన సామర్థ్యము నందుటకు జీవుడు తన

క్షుద్ర వైయక్తిక అహంకారిక ఆత్మనుండి వెనుదగ్గి, తన మహా నిర్వ్యక్తిక అక్షరాత్మలో ప్రవేశించవలెను. కాని పరమేశ్వరుడు ఆత్మయందే గాదు, ప్రకృతి యందును గలడు. అతడు ప్రతిప్రాణిహృదయమునందు నుండి, తన సన్నిధిచేత ఈ మహాప్రాకృతిక యంత్రవ్యాపారమును తిరుగవలసిన మలుపులు త్రిప్పును (18-61). అతడు సర్వమునందు గలడు (10-39), సర్వము నతనియందు నివసించును, సర్వము నతడే, ఏలన సర్వము నతని సత్తయొక్క సంఘాతియే, అతని విశ్వభావముయొక్క ఒక అంశము లేక రూపము. కాని ఇక్కడంతయు నొక నిమ్న [ప్రకృతి] క్రియావిధానమునందు ప్రవర్తించును, ఈ విధాన మొక నిగూఢ ఉచ్చతర అధికతర పూర్ణతర భగవత్ప్రకృతినుండి వెలువడును, ఇది భగవంతునియొక్క సనాతన అనంత ప్రకృతి లేక నిరపేక్ష ఆత్మశక్తి - "దేవాత్మశక్తి" (శ్వే. ఉ.). భగవంతునియొక్క ఒక సనాతనాంశము (15-7), సనాతన దివ్యసత్తయొక్క ఒక ఆధ్యాత్మికసత్త యగు, మానవునియందు దాగియున్న సమగ్ర - సచేతన పరిపూర్ణ అంతరాత్మ మనలోపల నతనికి వికసించగలదు, మనల నతనికి వికసింపజేయగలదు; అయితే ఇందునిమిత్తము మన మతని క్రియయొక్కయు, మన అస్తిత్వముయొక్కయు ఈ సత్యమునందు స్థిరముగా నివసించు టవసరము. భగవదన్వేషకుడు ముందు తన అక్షర సనాతన నిర్వ్యక్తిక ఆత్మలోని కుపసంహరించు కొని, అచ్చటినుంచి తాను నెవరి అంశమో అట్టి భగవంతుని సర్వత్ర చూడవలెను (6-30), అతని సర్వముగా జూడవలెను (7-19), క్షరప్రకృతియొక్క సమస్తము నందును, ఆమెయొక్క ప్రతిభాగము మఱియు ఫలితమునందును మఱియు నామె సమస్తక్రియలందును అతనినిజూచి, నచ్చటను భగవంతునితో తన నేకము చేసికొన వలెను, అచ్చటను ఆయనయందు నివసించవలెను (6-31), అచ్చటను దివ్యైకతలో ప్రవేశించవలెను (18-55). ఆ సమగ్రతయందు అతడు తన గభీర అక్షరాత్మయొక్క శాంతి స్వతంత్రతలను, తన దివ్యీకృత ప్రకృతిగత క్షరాత్మయందలి ఉపకరణక్రియ యొక్క ఒక పరమశక్తితో సంయుక్తము గావించును.

10. <u>నిష్కామకర్మ ప్రథమసోపానము :</u> కాని దీని నెట్లు చేయవలెను? ముందు మన కర్మసంకల్పము నందలి భావము సరిగా నుండవలెను. సాధకుడు తన సర్వక్రియను కర్మప్రభువునకు చేయు నొక యజ్ఞముగా భావించవలెను - ఈ ప్రభువు సనాతన వైశ్వపురుషుడు, తన స్వీయ సర్వోన్నతాత్మ మఱియు నందరి ఆత్మ,

అటులే సర్వనివాసి, సర్వభృతుడు, సర్వనియామకుడు నగు విశ్వమునందలి పరమ భగవంతుడు. ప్రకృతిక్రియ యంతయు నట్టి యజ్ఞమే - నిజానికి మందీ యజ్ఞము ఆమెయందు చరించుచు, ఆమెను చరింపజేయు దివ్యశక్తుల కర్పించబడును; కాని ఈ శక్తులు అపరిమేయ ఏకేశ్వరునియొక్క పరిమిత నామరూపములు మాత్రమే. సాధారణముగా మానవుడు తన యజ్ఞమును బాహాటముగానో, ఒక నెపము క్రిందనో తన అహంకారమునకే అర్పించుకొనును; అతని ఆహుతి తన స్వేచ్ఛ మఱియు అజ్ఞానముయొక్క ఒక మిథ్యాక్రియ మాత్రమే. లేక అతడు తన జ్ఞానమును, క్రియను, ఆకాంక్షను, బలపౌరుషములతో జేయు ప్రత్యేకకర్మలను ఆంశిక, నశ్వర, వైయక్తిక ఫలితము లపేక్షించుచు, దేవతల కర్పించును (7-20). దీనికి ప్రతిగా విముక్త జ్ఞాని తన క్రియాకలాపము లన్నింటిని, ఫలమునందు గాని, తన నిమ్న కామనల తృప్తిపట్ల గాని ఎట్టి సంగమును లేక, ఏకమాత్ర సనాతన భగవంతునికే అర్పించును (9-15). అతడు తనకొఱకు గాక, భగవంతునికొఱకే కర్మచేయును (4-23); తన దైహిక, ప్రాణిక, మానసిక ప్రయోజనార్థము గాక, లోకసంగ్రహార్థమే, అనగా ప్రపంచాత్మకొఱకే కర్మచేయును (3-25); మఱియు ప్రపంచవ్యాపారమున ఒక ప్రధాన ప్రత్యేక లాభార్జనపరునివలె గాక, భగవంతునియొక్క ఒక ప్రతినిధిగా కర్మచేయును (12-10). మఱియు, సమతను, సార్వత్రికతను, విశాలనిర్వ్యక్తికతను, అహంకారముయొక్క ప్రతిమాయావేషమునుండియు ఒక విస్పష్టవిముక్తిని ఏ మేరకు మనస్సు పొందునో, ఆ మేరకు తప్ప పైవిధముగా కర్మచేయజాల మని గమనించ దగును; ఏలన ఈ సమతాదులు లేకయే, ఇట్లు చేయుచున్నా మని చెప్పుకొనుట దంభము లేక భ్రాంతి యగును (16-17). ప్రపంచముయొక్క సమస్తక్రియయు విశ్వేశ్వరుని వ్యాపారము, స్వయంభూపురుషుని ప్రమేయము - అది ఈ పురుషుని నిర్విరామ సృష్టిక్రియ, ప్రగతిశీల సంభూతి, అర్థయుక్త అభివ్యక్తి, ప్రకృతియందు (అతని) సజీవసంకేతము. ఈ ప్రపంచక్రియయొక్క ఫలములును అతనివే, ఫలితములును అతనిచే పూర్వనిర్ణీతములే, మఱియు మన వైయక్తికకర్మ ఒక స్వల్పాంశము మాత్రమే; దాని నా పురుషుడు శాసించును, లేక అది ఆహంకారికమైనపుడు కొట్టివేయును. ఏలన మనయందును, అందరియందును నున్న ఈ పురుషుడు అహంకారము నిమిత్తము గాక, ప్రపంచ లక్ష్యము మఱియు హితము నిమిత్తమే వస్తువులను పాలించును. భగవంతుడు మఱియు ప్రపంచము మఱియు సర్వాత్మ నిమిత్తము, విశ్వసంకల్పముయొక్క పరిపూర్తినిమిత్తమును నిర్వ్యక్తికముగా,

నిష్కామముగా, కర్మఫలములయం దాసక్తి లేకుండ కర్మచేయుట – ఇది విముక్తి మఱియు సంసిద్ధి దిశగా వేయు మొదటి అడుగు.

11. <u>విముక్తకర్మ రహస్యము :</u> కాని ఈ అడుగున కావల మఱియొక మహత్తర గతి గలదు, అది మనలోని భగవంతునకు మన సర్వకర్మల ఆంతర సమర్పణము. ఏలన మన కర్మలను అనంత పరప్రకృతి ప్రేరించుచుండగా, ఆమె లోపలను, పైనను గల ఒక దివ్యేచ్ఛ మనలనుండి కర్మ నపేక్షించును; మన అహంకారము ఆ కర్మ కిచ్చు రూపము మన తామస, రాజస, సాత్త్విక గుణము వలన నిమ్నప్రకృతియందు దానికి సంభవించు నొకవికారము. తనను స్వయముగా కర్తయని తలపోయు అహంకారముచేత ఈ వికారము సంభవించును. ఈ కర్మ లక్షణము పరిమిత వైయక్తిక ప్రకృతియొక్క రూపము ధరించగా, అంతరాత్మ దానితోను, దాని పరిమిత ఆకారములతోను బద్ధమై, ఆ కర్మను తనయందలి అనంత శక్తినుండి స్వేచ్ఛగా, శుద్ధముగా ముందుకు సాగనీయదు. మఱియు, నహంకారము కర్మ మఱియు పర్యవసానమునకు కట్టువడును; నేను కర్మను స్వయముగాసంకల్పించి, ఆరంభించుచున్నా నని చెప్పుకొను అహంకారము స్వయముగా దాని పర్యవసాన ప్రతిక్రియల ననుభవింపక తప్పదు. కర్మను, దాని ప్రారంభమును మన జీవనము యొక్క దివ్యప్రభువునకు ముందు నివేదించుటచేతను, చివరకు సంపూర్ణముగా సమర్పించుటచేతను విముక్త పరిపూర్ణ కర్మాచరణము సాధ్యమగును; ఏలన మన యందలి ఒక పరమ సన్నిధి కర్మను తానే అధికాధికముగా స్వీకరించుచున్న దనియు, ఒక ఆంతర శక్తి మఱియు దైవముతో, ప్రగాఢసౌహార్దము మఱియు ఘనిష్ఠ ఏకత్వములోనికి అంతరాత్మ లాగబడుచున్న దనియు, క్షుద్ర వైయక్తిక అహంకారము యొక్క అజ్ఞానమునుండి కాక, అధికతర ఆత్మనుండి, ఒక సనాతన సత్తయొక్క సర్వజ్ఞ అనంత వైశ్వశక్తినుండి కర్మ ఆరబ్ధమగుచున్న దనియు మన కనుభవము గలుగును. స్వభావము ననుసరించి, కాని సర్వథా ఆ స్వభావమునందలి భగవదిచ్ఛచేత, కర్మ ఎన్నికచేయబడి, రూపొందించబడును; కావుననే దాని బాహ్యరూప మెట్లున్నను, అది లోపల విముక్తము, పూర్ణము నగును. అది "కర్తవ్యకర్మగా" (3–19) అనంతునియొక్క ఆంతర ఆధ్యాత్మిక ముద్రతో ముద్రితమై వచ్చును, దాని గతియు, ఆ గతియొక్క ప్రతిపదమును సర్వజ్ఞ కర్తనియామకునియొక్క విధానమునందు నిర్ణీతమై యుండును. ముక్త మానవుడు

ఉపకరణాత్మకమగు తన వ్యక్తిగత స్వయంనిర్ణాణమును, తన ప్రకృతియందలి ప్రత్యేక సంకల్పశక్తులను సాధనము మఱియు నిమిత్తరూపమున కర్తకు సమకూర్చు చున్నప్పుడు నైతము, అతని అంతరాత్మ తన నిర్వ్యక్తికతయందు ముక్తమై యుండును. పోగా ఆ సంకల్పశక్తులు గూడ నిపుడు వేఱుగా, అహంకారికముగా ఉతనివి గావు, పరంతు అతివ్యక్తిక (suprapersonal) భగవంతునియొక్క ఒక శక్తియే; ఏలన ముక్తపురుషుడు భగవంతుని అసంఖ్య వ్యక్తిత్వములలో నొకటి, అతని ఆత్మసత్తయొక్క ఒక సంభూతి, మఱియు దానియందు దాని స్వభావమును బట్టి పనిచేయువాడును భగవంతుడే. ఇదియే ముక్తపురుషుని కర్మయొక్క "ఉత్తమ రహస్యము" (4-3) మఱియు పరమగుహ్యము. మానవాత్మ ఒక దివ్యజ్యోతిలోనికి పెరుగగా, మఱియు దాని ప్రకృతి ఒక అత్యున్నత వైశ్వప్రకృతితో సంయోగము నందగా, తత్ఫలితముగా ఈ ఉత్తమస్థితి సిద్ధించును.

12. <u>సమ్యగ్ జ్ఞాన స్వరూపము ;</u> ఈ పరివర్తనము జ్ఞానముచేత తప్ప సిద్ధించజాలదు, ఆత్మ, భగవంతుడు మఱియు ప్రపంచములను గుఱించి ఒక సమ్యగ్జ్ఞానము ఆవశ్యకము, అటులే ఆ జ్ఞానము దేని ద్వారము తెఱచునో, ఆ మహత్తరచేతనలోనికి పెరిగి, అందు నివసించుటయు ఆవశ్యకము. ఈ జ్ఞాన స్వరూపము మన కిపుడు తెలియును. ఇది మానవదృష్టికంటెను ఇతరము, విశాలతరము నగు నొక దృష్టిపై, ఒక పరివర్తిత దృష్టి మఱియు అనుభవముపై విశ్రమించియుండును. దీనిచేత వ్యక్తి మున్ముందు అహంభావము మఱియు దాని సంస్పర్శల పరిమితులనుండి ముక్తుడగును; అపుడు సర్వమునందును ఆత్మను, సర్వమును భగవంతునియందును, సర్వభూతములను వాసుదేవుడుగా, అతని తత్త్వముయొక్క పాత్రములుగా స్పృశించును మఱియు ననుభవించును, చివరకు వ్యక్తి తన ఆత్మను గూడ అదే తత్త్వముయొక్క అర్థయుక్త సత్తగను, ఆత్మ శక్తిగను జూచును. ఈ జ్ఞానము ఇతరుల జీవనఘటన లన్నింటిని ఒకని జీవనఘటనలే యైనట్లు ఒక ఏకీకర ఆధ్యాత్మిక చేతనలో చూచును (6-32); అది భేదమను గోడను లేవనివ్వదు, సర్వభూతములతోను ఒక సార్వత్రిక సానుభూతి యందు నివసించును; ఇట్టి జ్ఞాని ప్రపంచగతియం దున్నంతవఱకు, సర్వభూతహితము నిమిత్తము (3-25. 5-25), భగవంతుని విధానము ననుసరించి - "ధాతా" (9-17), కాలాధీశుడగు పురుషుడుఆదేశించిన మేరకు (11-33) కర్తవ్యకర్మను చేయుచుండును.

ఇట్లే జ్ఞానమున నివసించుచు, కర్మచేయుచు, మానవాత్మ సనాతనునియొక్క సవ్యక్తికతతోను, నిర్వ్యక్తికతతోను యుక్తమగును, తత్ఫలితముగా కాలభూమిక యందు, సరిగా సనాతనునివలె, కర్మచేయుచునే, సనాతనునియందు నివసించును, మఱియు ప్రకృతియందు చేయబడు కర్మయొక్క రూపాకారము లెట్టివైనను, ఆ మానవాత్మ స్వతంత్రము, పరిపూర్ణము, ఆనందమయమునై యుండును.

13. ఆనందమునందు జ్ఞానపరిపూర్తి : విముక్తపురుషునికి సంపూర్ణ, సమగ్ర జ్ఞాన ముండును – "కృత్స్నవిత్" (3-29), మఱియు నతడు మనఃకృతమగు హద్దులను అతిక్రమించి, సర్వకర్మలను జేయును – "కృత్స్నకృత్" (4-18) – తనయందలి దివ్యేచ్ఛయొక్క అనంత శక్తిసామర్థ్యములు మఱియు స్వతంత్రత ననుసరించి సర్వకర్మలను జేయును. మఱియు నతడు సనాతనునితో యోగయుక్తుడు గనుక, తన సనాతన సత్తయొక్క విశుద్ధ ఆధ్యాత్మిక అపరిమేయ ఆనందమును గలిగియుండును. తా నే పరమాత్మయొక్క అంశమో, అతని వైపునకు, తన కర్మనియామకుని వైపునకు, తన ఆత్మప్రకృతుల దివ్యప్రేమికుని వైపునకు అతడు భక్తితో ఉన్ముఖు డగును. అతడు నిర్వికార శాంత సాక్షిమాత్రుడు గాడు; తన జ్ఞాన సంకల్పములనే గాక, భక్తిప్రేమసంవేగములతో గూడిన తన హృదయమునుగూడ నతడు సనాతనపురుషునిలోని కుద్ధరించును. ఏలన అది లేనిచే, అతని అశేషప్రకృతి పరిపూర్ణము, భగవద్యుక్తము గాదు ; అక్షరాత్మయొక్క శాంత్యావేశము అంతరాత్మ యొక్క ఆనందావేశముతో రూపాంతరము గావలసియున్నది. సవ్యక్తిక జీవునికిని, నిర్వ్యక్తిక బ్రహ్మ లేక ఆత్మకు నావల నతడు విశ్వాతీత పురుషోత్తముని బ్రాపించును : ఈ పురుషోత్తముడు నిర్వ్యక్తికతయందు అక్షరుడు మఱియు సవ్యక్తికతయందు తన నిర్వ్యక్తికతను పూర్ణము గావించుకొనును, మఱియు నీ రెండు విభిన్న ఆకర్షణలద్వారా అతడుమనలను తనదగ్గరకాకర్షించుకొనును. విముక్తసాధకుడు భగవంతునియందు తన అంతరాత్మకు గల ప్రేమహర్షములద్వారాను, కర్మల నియామకునిపట్ల తన సంకల్పము నకు గల ఆరాధనద్వారాను వ్యక్తిత్వసహితముగా ఆ పరమవస్తువున కెగయును ; అతని నిర్వ్యక్తిక విశ్వమయ జ్ఞానముయొక్క శాంతి మఱియు విశాలత విశ్వమయ, విశ్వాతీత భగవంతునియొక్క స్వయంసిద్ధ ఘనిష్ఠసత్యతయందు అతనికి గల హర్షముచేత పరిపూర్తిత మగును. ఈ హర్షము అతని జ్ఞానమునకు మహిమోత్క ర్షను గల్పించి, దానిని, పరమసత్తకు తన ఆత్మయందును, అభివ్యక్తియందును

గల సనాతనానందముతో సంయుక్తము గావించును. ఈ హర్షము అతని వ్యక్తిత్వ మును సైతము దివ్యపురుషుని అతివ్యక్తిత్వమునందు పరిపూర్ణము గావించును, అటులే అతని ప్రాకృతసత్త మఱియు క్రియను సనాతన సౌందర్యముతో, సనాతన సామరస్యముతో, సనాతన ప్రేమానందములతో నేకముచేయును.

14. జీవన్ముక్తియందలి బంధమోక్షములు : ఈ పరివర్తన కంతటికి అర్థము నిమ్నతర మానవప్రకృతినుండి ఉచ్చతర దివ్యప్రకృతిలోనికి పూర్తిగా పయనించుటయే యగును. అది మన సంపూర్ణసత్తను, లేక కనీసము ఇచ్ఛా జ్ఞాన వేదనలను పుట్టించు మానసికసత్తను ఒక అత్యున్నత ఆధ్యాత్మిక చేతనలోనికి, ఒక సంతృప్తికర పూర్ణతమ జీవనశక్తిలోనికి, ఒక గభీరతమ విశాలతమ సత్తానందము లోనికి లేవనెత్తుట యగును. అది మన ప్రస్తుత శారీరికజీవనమును విడిచిపోయిన పిమ్మట బాగుగా సాధ్యముకావచ్చును, ఈ పార్థివజీవనమున కావల నొక స్వర్గ లోకమునందు, లేక ఇంకను ఆవల విశ్వాతీత అతిచేతనయందు అది బాగుగా సాధ్యము కావచ్చును; పరమసత్తయొక్క నిస్సంబంధము, అనంతము నగు ఒక శక్తి మఱియు స్థానములోనికి సంక్రమణమువలన అది ఘటించవచ్చును. కాని యిచ్చట శరీరము నందు, ఇచ్చట జీవనమునందు, ఇచ్చట క్రియయందు నున్న కాలమున, ఈ పరివర్తన ఫలితముగా నిమ్నప్రకృతి ఎట్లు మాఱును ? ఏలన ప్రస్తుతము మన కార్యకలాపము లన్నియు తమ దిశలయందును, రూపమునందును, ఈ ప్రకృతిచేతనే నిర్ధారితమగును, మఱియు నిచ్చటి ప్రకృతి త్రిగుణాత్మక ప్రకృతి, మఱియు సమస్త ప్రాకృతసత్త యందును, సమస్త ప్రాకృతక్రియయందును ఈ త్రిగుణ ముండును - తమస్సు తన అజ్ఞానజడత్వములతో నుండును, రజస్సు తన గతిక్రియలతోను, ఆవేగ దుఃఖ వ్యతిక్రమములతోను ఉండును, సత్త్వము తన సుఖప్రకాశములతో నుండును - మఱియు ఈ త్రిగుణ బంధన ముండును. మఱియు అంతరాత్మ అక్షరాత్మలో జేరి గుణాతీత మగు ననుకొందము, అయినను అది తన ఉపకరణాత్మక ప్రకృతియందు వాని క్రియ, ఫలితము మఱియు గుణమునుండి ఎట్లు తప్పించుకొనును ? ఏలన జ్ఞానవంతుడు సైతము తన ప్రకృతి ననుసరించియే కర్మచేయవలెను (3-33) - అని గీత చెప్పును. బాహ్యాభివ్యక్తియందు గుణముల ప్రతిక్రియ ననుభవించుచు, సహించుట, కాని వెనుకనున్న సాక్షిరూప చేతనాత్మయందు వానినుండి ముక్తము, అతీతము నగుట - ఇది సరిపోదు. ఏలన ఈ స్థితియందును స్వాధీనత మఱియు

పరాధీనతల ద్వైతము మిగిలియే యుండును – ఇది మన లోపలి రూపమునకును, బైటి రూపమునకును; మన ఆత్మకును, మన శక్తికిని; మనకు దెలిసిన మన స్వరూపమునకును, మనము సంకల్పించి చేయు దానికిని పరస్పర విరోధము. ఇచ్చట ముక్తి ఎచ్చటున్నది? ఇచ్చట, ఉచ్చతర ఆధ్యాత్మిక ప్రకృతిలోనికి పూర్ణ ఆరోహణము మఱియు పరివర్తనము, శాశ్వతధర్మము (14–27), అనగా దివ్యసత్త యొక్క అనలత విశుద్ధతకును మఱియు శక్తికిని సహజమగు నియమము : ఇది యంతయు నెచ్చటున్నది? శరీరములో నుండగా ఈ పరివర్తనము సాధ్యము గానిచో, సర్వప్రకృతిని మార్పుజాలము, ఆత్మనుండి ఈ మర్త్య శరీరజీవనము పామునుండి కుబుసమువలె పడిపోవువఱకు, ఒక అసమన్విత ద్వైతము నిలిచి యుండక తప్పదు – అని స్పష్టముగా చెప్పు టవసరము. కాని అప్పుడు కర్మసిద్ధాంతము ఉచితసిద్ధాంతము లేక కనీసము చరమసిద్ధాంతము గాజాలదు : ఒక పరిపూర్ణ శమము లేక కనీసము సాధ్యమైనంత పరిపూర్ణశమము, ఒక అధికాధిక కర్మసన్న్యాసము – ఇంకను ఇదియే సంసిద్ధి అపేక్షించు యథార్థోపదేశముగా గన్పించును; నిజానికి మాయావాదియొక్క వాదమే యిది, సందేహము లేదు, మనము కర్మ భూమికలో నున్నంతవఱకు గీతామార్గము మంచిదే, కాని సర్వకర్మలు ఒక భ్రాంతి, శమమే సర్వోన్నతపథము – అని ఈ మాయావాది చెప్పును. నిష్కామకర్మ మంచిదే, కాని అది సర్వకర్మసన్న్యాసమునకు, నివృత్తికి, పరిపూర్ణ శమమునకు పూర్వాంగము మాత్రమే.

15. <u>గమ్యము కర్మరాహిత్యము గాదు, దివ్యకర్మ</u> : ఇదియే మిగిలిన కఠినత, దీనికి సమాధానము చెప్పి, గీత సాధకునకు కర్మసామర్థ్యమును జూపవలెను. లేనిచో, గీత అర్జునున కిట్లు చెప్పవలెను, "తాత్కాలికముగా నిట్లు కర్మచేయుము, కాని పిమ్మట శ్రేష్ఠతరమగు కర్మసన్న్యాసమార్గము నవలంబింపుము." కాని, దీనికి ప్రతిగా, కర్మసన్న్యాసము కంటె కామసన్న్యాసము శ్రేష్ఠ మని గీత చెప్పియున్నది (6–2); పైగా గీత సర్వకర్మాచరణమును పట్టుతో బోధించును – "సర్వాణి కర్మాణి" (3–26), "కృత్స్నకర్మకృత్" (4–18); మఱియు ఆరూఢయోగి ఎట్లు జీవించినను, ఆచరించినను, భగవంతునియందే జీవించును, మఱియు నాచరించు – నని గీత చెప్పినది (6–31). ప్రకృతి సైతము తన గతినియమములందును, కర్మకలాపములందును దివ్యమైనపుడే, అనగా నిమ్నప్రకృతియొక్క ప్రతిక్రియలచే

అక్షోభ్యము, అస్పృశ్యము, అక్షతము, అవ్యథితము, శుద్ధము నగు నొక శక్తి యైనపుడు మాత్రమే గీతావచనము సాధ్యమగును. ఎట్లు మఱియు నే సోపానక్రమమున ఈ అత్యంత దుష్కర పరివర్తనమును సాధింపవలెను ? అంతరాత్మసంసిద్ధియొక్క ఈ చరమరహస్య మేది యగును ? మన మానవ మఱియు పార్థివ ప్రకృతియొక్క రూపాంతరమునకు సూత్ర మేది యగును, ప్రక్రియ యేది యగును ?

# 17. దేవతలు, అసురులు

1. <u>కర్మయందు జ్ఞాని కూడ బద్ధుడేనా ?</u> : అజ్ఞము, పాశబద్ధమునగు సాధారణ మానవప్రకృతినుండి ఒక దివ్య ఆధ్యాత్మిక సత్తయొక్క క్రియాశీల స్వాతంత్ర్యము లోనికి పరివర్తనము ఆచరణరీత్యా ఎంతో కష్టము ! త్రిగుణముల ప్రతిబద్ధ, సంభ్రాంత క్రియనుండి గుణముల కిక నధీనుడు గాని విముక్తమానవుని క్రియలోనికి సంక్రమణమును వైయక్తికముగా నెట్లు సాధించవలెనో, చూచినపుడు పై కష్టము స్పష్టమగును. ఈ సంక్రమణము మాత్రము తప్పక ఆవశ్యకము; ఏలన అతడు గుణాతీతుడు లేక గుణరహితుడు గావలెనని స్పష్టముగా విధించబడినది–"గుణాతీత" (14–20), "నిస్త్రైగుణ్య" (2–45). రెండవవైపున ఇంత స్పష్టముగాను, బలముగాను, ఇచ్చట భువిపై ప్రతిప్రాకృతసత్తయందును త్రిగుణములు విడదీయరాని విధముగా కలిసి పనిచేయుచుండు నని గీత వక్కాణించును; మఱియు మానవుడు లేక ప్రాణి లేక శక్తియొక్క క్రియ యంతయు పరస్పరమునందు పనిచేయు ఈ త్రిగుణముల క్రియ మాత్రమే యని, ఈ క్రియయందు ఒకానొక గుణము ప్రాబల్యము (14–10) వహించును, తక్కినవి దానికి హద్దులు కల్పించునని సైతము గీత చెప్పును–"గుణా గుణేషు వర్తంతే" (3–28). అయినపుడు మఱియొక క్రియాశీల గతిశీల ప్రకృతి గాని, ఏ యితర కర్మ గాని ఎట్లుండగలదు ? ఉండదేని, కర్మచేయుట యన ప్రకృతిగుణముల కధీనతయే యగును; అమె క్రియయొక్క ఈ అవస్థల నతిక్రమించుట యన ఆత్మయందు మౌనస్థితియే యగును. నిజమే, ఈశ్వరుడు

ఆమె సర్వకర్మలకు నియామకుడు, వానిని తన దివ్యేచ్ఛచేత నడుపుచు, నిర్ణయించును; కావున అతడు గుణముల ఈ యంత్రవ్యాపారమున కతీతుడు, ఆమె ప్రకారములచే ప్రభావితుడును, పరిమితుడును గాడు; అయినను అతడు సదా ప్రకృతిగుణములద్వారా పనిచేయును, స్వభావసామర్థ్యముచేతను మఱియు గుణముల మానసిక యంత్రాగము ద్వారాను రూపము కల్పించును - అని మన కనిపించును. ఇవి ప్రకృతియొక్క మౌలిక ధర్మములు, ఇచ్చట మనయందు రూపముధరించు కార్యనిర్వాహక ప్రకృతి శక్తియొక్క ఆవశ్యక క్రియలు, మఱియు జీవుడు సైతము ఈ ప్రకృతియందే భగవంతుని ఒక అంశము. కావున ముక్తపురుషు డింకను కర్మచేయు నేని, ఇంకను గతిప్రపంచమున చరించు నేని, ప్రకృతియందును, ఆమె గుణములచేతను, వాని ప్రతిక్రియలకు అధీను డయ్యును చేయునే గాని, శరీర ముండునంతవఱకు, భగవంతునివలె స్వతంత్రుడై చేయడు-(ఇది మాయావాదము). కాని గీతావచనము సరిగా దీనికి వ్యతిరేకము : ముక్తయోగి గుణముల ప్రతిక్రియలకు చలించని అతీతు డగును (14-23), మఱియు నత డేమి చేసినను, ఎట్లు జీవించినను, భగవంతుని యందే చరించును మఱియు చేయును, అనగా అతని స్వేచ్ఛ మఱియు అమరత్వము యొక్క శక్తియందును, పరమసనాతన అనంతుని యొక్క ధర్మమునందును చేయును - "సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే" (6-31). ఇచ్చ టొక పరస్పర విరోధము, తెగని సమస్య ఉన్నట్లు గన్పించును.

2. <u>వాస్తవ చాలకశక్తి దివ్య ఆధ్యాత్మిక సంకల్పము</u> : కాని విశ్లేషణాత్మక మనస్సుయొక్క కఠోర తార్కిక వ్యతిరేకములలో చిక్కుకొని నప్పుడే మన కీ పరస్పర విరోధము గన్పించును గాని, ఆత్మస్వరూపమును, ప్రకృతియందలి ఆత్మను స్వేచ్ఛగా, నిశితముగా పరికించి నపుడు గన్పించదు. ప్రపంచమును కదిలించునది నిజానికి ప్రకృతిగుణములు కాదు - ఇవి నిమ్న పార్శ్వము, మన సాధారణప్రకృతి యొక్క యాంత్రికవ్యాపారము మాత్రమే. వాస్తవ చాలకశక్తి ఒక దివ్య ఆధ్యాత్మిక సంకల్పము, ఇది ప్రస్తుతము ఈ హీనతర అవస్థల నుపయోగించుకొనునే గాని, మానవ సంకల్పమువలె, గుణములచేత పరిమితము, శాసితము, యాంత్రీకృతము గాదు. సందేహము లేదు, ఈ గుణములు తమ క్రియయందు అంతగా సార్వత్రికములు గాన, అవి పరమాత్మశక్తిలోపలినుండియే వచ్చుచుండవలెను; ఆ పరమాత్మ సంకల్ప - బలములోని కొన్ని శక్తులే ఈ ప్రకృతిరూపములకు మూలము

గానలేను. ఏలన సాధారణ నిమ్నప్రకృతియందలి ప్రతివస్తువు పురుషోత్తముని సత్తయొక్క ఉచ్చతర ఆధ్యాత్మిక శక్తినుండియే ఉత్పన్నమగును - "మత్తః ప్రవర్తతే" (10-8); అది క్రొత్తగను, ఆధ్యాత్మిక కారణము లేకుండగను రూపము ధరించదు. ఆధ్యాత్మికసత్తయొక్క మూలశక్తియందు ఏదియో యుండితీరును, దానినుండి ఉత్పన్నములే మన ప్రకృతియొక్క సాత్త్విక ప్రకాశసంతోషములు, రాజసిక ప్రవృత్తి, తామసిక మాంద్యము మఱియు నివి దానియొక్క అపూర్ణ లేక అపకృష్టరూపములే. కాని ఏయీ అపూర్ణత మఱియు అపకర్షణములందు మనము నివసించుచున్నామో, వానికి పైన విశుద్ధ గుణమూలముల నొకసారి మనము చేరుకొని, మూలసత్తయందు నివసింపసాగిన వెంటనే, ఈ గుణవ్యాపార మొక మిక్కిలి విభిన్నరూపము ధరించు నని మనము కనుగొనగలము. సత్త మఱియు క్రియ, అటులే సత్తాక్రియల ప్రకారములు వాని యిప్పటి పరిమిత బాహ్యరూపముల కెంతో పైన సర్వథా విభిన్న వస్తువు లగును.

3. రజస్సు మూలరూపము చిచ్ఛక్తి : కారణము, విశ్వముయొక్క సంఘట్ట సంఘర్షములతో గూడిన ఈ సంక్షుబ్ధగతి వెనుక నేమున్నది ? మనోభూమికలో మనస్సును స్పృశించి, మానసిక మూల్యములను ధరించుచు, కామము, ప్రయత్నము, ప్రయాసము, భ్రాంతసంకల్పము, శోకము, పాపము, బాధల రూపమగు ప్రతిక్రియలను పుట్టించున దేది ? అది గతిలోనికదిగిన సత్తయొక్క ఒక సంకల్పము, అది క్రియాపరమైన విశాల భాగవత సంకల్పము, ఈ సంకల్పమును ప్రతిక్రియలు స్పృశింపవు. అది స్వతంత్ర, అనంత, చిన్మయ భగవంతునియొక్క ఒక శక్తి - "తపస్", "చిత్ - శక్తి". సర్వసంపత్తి తనదే గాన, ఈ శక్తికి కామ ముండదు, మఱియు తన గతియొక్క సహజానంద ముండును. ఎట్టి ఆయాసప్రయాసలకు లోను గాదు గావున, అది తన సాధనములు మఱియు విషయములయొక్క స్వతంత్ర ప్రభుత ననుభవించును; ఎట్టి భ్రాంతసంకల్పముచేతను దారి తప్పదు గాన, అది ఆత్మ మఱియు వస్తువుల జ్ఞానమును సదా ధరించియుండును, ఈ జ్ఞానమే తన ప్రభుత మఱియు ఆనందములకు మూలము; ఎట్టి శోకము, పాపము లేక వ్యథకు వశముగాదు గాన, దానికి తన సత్తయొక్క హర్షపవిత్రతలు, తన శక్తియొక్క హర్ష పవిత్రతలు పెంపెసగుచుండును. భగవంతునియందు నివసించు అంతరాత్మ అవిముక్త మానసము యొక్క సాధారణ సంకల్పముచేత గాక, ఈ ఆధ్యాత్మిక సంకల్పముచే కర్మచేయును :

ఆ అంతరాత్మయొక్క గతిప్రవృత్తి ప్రకృతి రజోగుణముచేత గాక, ఈ ఆధ్యాత్మిక బలముచేత ఘటిల్లును; సరిగా దీనికి కారణము, ఇపు డది రజోవికారము ఒక అంశమగు నిమ్నప్రకృతి గతియందు నివసింపక, దివ్యప్రకృతియందలి విశుద్ధ పరిపూర్ణ గతిమర్మమును తిరిగి పొందినది.

4. తమస్సు మూలరూపము శాంతి : మఱియు తిరిగి, ప్రకృతిజడత వెనుక, అనగా తమస్సువెనుక నే మున్నది ? ఈ తమస్సు, పూర్ణమైనపుడు, ప్రకృతి క్రియను అంధప్రాయమగు యంత్రచాలనముగా మార్చివేయును ; ఈ యాంత్రిక వేగము తాను పరిభ్రమించవలసిన గాడిని తప్ప మఱి దేనిని గమనించదు, చివరకు తన గతినియమములు గూడ తనకు తెలియవు – ఈ తమస్సు అభ్యస్తక్రియయొక్క విరామమును మరణము మఱియు విఘటనములోనికి మార్చివేయును, ఇంకను మనస్సునం దది అకర్మను, అజ్ఞానమును గలిగించు ఒక శక్తి యగును. ఈ తమస్సాక అప్రకాశము (14–13); ఈ తమస్సు ఆత్మయొక్క శాశ్వతతత్త్వమగు శాంతి మఱియు విశ్రాంతిని వికృతము గావించి, శక్తియొక్క అకర్మలోనికిని, జ్ఞానము యొక్క అకర్మలోనికిని తప్పుగా ననువదించును – అని చెప్పవచ్చును. ఏలన భగవంతు డీ విశ్రాంతిని తాను కర్మచేయుచున్నపుడు సైతము, గోల్పోడు. ఇది శాశ్వత విశ్రాంతి, ఇది అచ్చట తన స్వీయ అనంతతలయందును, ఇచ్చట తన క్రియ మఱియు స్వబోధముయొక్క బాహ్యాపరిమితత్వమునందును, భగవంతుని సమగ్ర జ్ఞానక్రియను, సృజనాత్మక సంకల్పశక్తిని – రెంటిని ధరించియుండును. ఇట్లు భగవంతుని శాంతి శక్తివిఘటనమును (disintegration) గాదు, శూన్య జడతయు గాదు. భగవంతుడు కొంతకాలము తెలియుట మఱియు చేయుటను విరమించినపుడు గూడ, తన ఈ శాంతి తాను తెలిసినదానిని, చేసినదానిని ఒక సర్వశక్తి మౌనమునందు ప్రోగుచేసి, సచేతనముగా భద్రపఱచును. సనాతన పురుషునికి నిద్ర లేక విశ్రాంతి అవసర ముండదు ; అతడు అలసిపోడు, శిథిలము గాడు ; తన క్షీణశక్తులను తిరిగి సమీకరించి, పూరించుట కతనికి విరామావ్యకత యుండదు, ఏలన అతని శక్తి అక్షయముగా నేకరసము, అశ్రాంతము, అనంతము. భగవంతుడు తన కర్మయందును శాంతుడు మఱియు విశ్రాంతుడు ; మఱియు తాను కర్మను విరమించినపుడు, ఆ విరామమునందు తన గతిక్రియయొక్క పూర్ణసామర్థ్య మును సర్వశక్తతలును నిలిచియుండును. విముక్తపురుషుడు ఈ శాంతిలో ప్రవేశించి,

ఆత్మయొక్క సనాతన విశ్రాంతిలో భాగస్వామి యగును. విముక్తి - సంతోషము నేమాత్ర మనుభవించిన వాని కైనను, దానిలోపల సనాతన శాంతిశక్తి యుండు నను సత్యము సువిదితమే. మఱియు నా గభీర శాంతి కర్మలోలోపల సైతము మనగలదు, అత్యంతప్రచండ శక్తి విజృంభణమునందును కొనసాగగలదు. ఆలోచనా సంకల్ప గతి క్రియల సవేగప్రవాహము గావచ్చును, ఉద్దామ ప్రేమవేగము గావచ్చును, స్వయంభూ ఆధ్యాత్మిక హర్షావేశము గావచ్చును, మఱియు నీ లోపలి హర్షావేశము వెలుపలి ప్రపంచమునందలి వస్తువులు మఱియు ప్రాణుల ఆధ్యాత్మి కోపభోగములోనికి సంక్రమించవచ్చును, ఈ ఉపభోగము సుతీవ్రము, బలీయము గావచ్చును; అయినను ఈ సమస్త ఆవేగమునకు వెనుకను, లోపలను ఈ శాంతి మఱియు విశ్రాంతి భాసించుచుండును, తన లోతులపట్ల సచేతనము, సదా ఏకరసము నై వెలంగును. విముక్త మానవుని నిర్మలత ఒక అలసత గాదు, అసమర్థత గాదు, నష్టచేతనత గాదు, జడత గాదు; అది అమరశక్తి ప్రపూర్ణము, సర్వకర్మసమర్థము, గాఢతమ హర్షయోగ్యము, గభీరతమ దయాప్రేమలకును, సర్వవిధ తీవ్రతమ ఆనందమునకు ఉన్మీలితము నగును.

5. సత్త్వముయొక్క మూలరూపము జ్యోతి : మఱియు నటులే గుణముల మూడింటిలోను మిక్కిలి శుద్ధమగు సత్త్వమునకు సైతము పైన, దాని సమున్నత సుదూర మూలమునందు, స్వతంత్రాత్మయందు స్వతంత్రమగు నొక మహత్తర జ్యోతి మఱియు ఆనందము గలదు. సత్త్వగుణ సామర్థ్యమువలన సరూపీకరణము మఱియు సమీకరణము, సమీచీన జ్ఞానము మఱియు సమీచీన (right) వ్యవహారము, దృఢసంతులనము (balance), సమీచీన క్రియానియమము, సమీచీన స్వామ్యము ప్రాప్తించును మఱియు నది మనస్సున కెంతో తృప్తిని గలిగించును. ఈ సత్త్వము సాధారణ ప్రకృతియందు సర్వోత్తమ వస్తువు, ఇది స్వతః తన పరిధిలోను, తాను మనగలిగినంతవఱకును ప్రశంసనీయ గుణమే, కాని దీని మనుగడ అనిశ్చితము, దీని రక్షణకు పరిమితి అవసరము, ఇది నియమనిబంధనలపై నాధారపడి మనును. కాని దీని మూలమగు జ్యోతి పరిమితమును గాదు, పరిమితిపై, నియమనిబంధనలపై నాధారపడను పడదు. ఈ జ్యోతి స్వయంసిద్ధము, అవికార్యము, ఇది మన ప్రకృతి అపశ్రుతుల మధ్య ఎటులో మనుచుండు ఈ యా సామరస్యఫలితము గాదు, పరంతు సామరస్యమునకు మూలస్రోతము మఱియు నిది

కోరిన సామరస్యమును సృజించగలదు. అది ఒక తేజోమయ, ఆధ్యాత్మిక జ్ఞానశక్తి, తన స్వభావసిద్ధ క్రియయందు ఒక సాక్షా దతిమానస జ్ఞానశక్తి—"జ్యోతి", వికృతము, ఉత్పన్నము నగు మన మానసిక భాసము—"ప్రకాశము" (14-11) - గాదు. అది, విశాలతమ స్వయంభూసత్త, సహజసంపన్న ఆత్మజ్ఞానము, ఘనిష్ఠ విశ్వసమ్మిత తాదాత్మ్యము, గభీరతమ ఆత్మవినిమయము—లయొక్క జ్యోతి మఱియు ఆనందము, అంతే గాని, సంపాదనము, సరూపీకరణము (assimilation), పరస్పరసమాధానము మఱియు కష్టసాధ్య సమీకరణము—లయొక్క ప్రకాశము గాదు. ఆ జ్యోతి ఒక ప్రదీప్త ఆధ్యాత్మిక సంకల్పముతో నిండియుండును గాని, దాని జ్ఞానమునకును, కర్మకును మధ్య ఎట్టి అఖాతము లేక వైషమ్యము నుండదు. అటులే ఆ ఆనందము మన హీనతర మానసిక "సుఖము" (14-6) గాదు, పరంతు అది ఒక ప్రగాఢ, సారభూత, సాంద్ర, స్వయంసిద్ధ ఆనందము; ఈ ఆనందము మనము దేనిని చేతుమో, ఊహింతుమో, సృజింతుమో, దాని కంతకును విస్తరించును, అది ఒక సుస్థిర హర్షపారవశ్యము, ఒక దివ్యానందము. విముక్తపురుషుడు ఎంతెంత సమగ్రముగా భగవంతునితో తనను యుక్తముగావించుకొనునో, అంతంత ప్రగాఢముగా ఈ జ్యోతిరానందములో పాల్గొనును మఱియు నంతంత పరిపూర్ణముగా దానిలోనికి పెరుగును. మఱియు నిమ్నప్రకృతియొక్క గుణముల నడుమ ఒక అనివార్య అతుల్యత, మానముల ఒక చంచల అస్థిరత, ఆధిపత్యముకొఱకు సంతత సంఘర్షము రేగుచుండగా, ఆధ్యాత్మిక సత్తయొక్క జోతిరానందము. అక్షతశాంతి, ప్రవృత్తిసంకల్పము ఒకదానినొకటిబహిష్కరించవు, ఒకదానితోనొకటి పోరుసల్పవు; అవి కేవలము సమతూకమునం దుండుటయే గాక, అందు ప్రతిదియు తక్కిన రెండింటియొక్క ఒక పార్శ్వ మగును, మఱియు తమ పూర్ణరూపమున మూడును అవిచ్ఛేద్యము, ఏకము నగును. మన మనస్సు భగవంతుని సమీపించు నపుడు, ఒక దానిని విడిచి, మఱియొక దానిలో ప్రవేశించుచున్నట్లు, ఉదాహరణకు, కర్మప్రవృత్తిని విడిచి, శాంతిస్థితి సాధించుచున్నట్లు తోచవచ్చును, కాని దీనికి కారణము మనము ముందు వరణాత్మక (selecting) మనస్తత్వముద్వారా భగవంతుని సమీపించుటయే. పిమ్మట ఆధ్యాత్మిక మనస్సును సైతము దాటి, మనము పై కెగయగలిగి నపుడు,

ఈ మూడు దివ్యశక్తులలో ప్రతిదాని లోపలను తక్కినవి గలవని చూచి, ఈ ప్రాథమిక దోషమును [1] సవరించుకొనగలము.

6. సత్త్వము సంక్రమణమునకు చరమసోపానము : కావున ప్రకృతి గుణముల సాధారణ నిమ్నతర క్రియకు అధీనము గాకయే, కర్మ సంభవమని మనకు తేలినది. ఏ మానసిక ప్రాణిక దైహిక పరిమితియందు మనము పోత పోయబడి యున్నామో, దానిపై ఈ గుణక్రియ ఆధారపడును; ఇది శరీరగతమగు మనఃప్రాణములచే మనపై విధించబడిన ఒక వికృతి, ఒక అసమర్థత, ఒక అనుచిత లేక అపకృష్ట మూల్యము. మనము ఆత్మలోనికి పెరిగి నపుడు, ఈ అపరధర్మము యొక్క స్థానమున ఆత్మయొక్క అమరధర్మము వచ్చును; అచ్చట ఒక ముక్త అమర కర్మయొక్క, ఒక దివ్య అపరిమిత జ్ఞానముయొక్క, ఒక అతీత శక్తియొక్క, ఒక అగాధ విశ్రాంతియొక్క అనుభవ ముండును. కాని యింకను, ఈ సంక్రమణ మెట్లు ? - అను ప్రశ్న మిగిలియే యున్నది; ఏలన ఒక సంక్రమణము లేక ప్రగతి సోపానము లుండితీరవలెను, కారణము, ఈ ప్రపంచమునందలి భగవంతుని కార్య కలాపమునం దేదియు క్రమము లేక ఆధారము వినా ఆకస్మికముగా చేయబడదు. మన మన్వేషించు వస్తువు మనలోనే యున్నది, కాని ఆచరణయందు మన ప్రకృతి యొక్క నిమ్నరూపములనుండి దాని వికాసమును [2] సాధించవలసియున్నది. కావున

[1] ఈ పై మూడు పేరాలందును గుణములకు మూలమగు, పరప్రకృతియొక్క పరమ ఆధ్యాత్మిక మఱియు అతిమానసిక రూపముల వర్ణన చేయబడినది, దీనిని గీతనుండి స్వీకరించలేదు, ఇది [శ్రీ అరవిందుని] ఆధ్యాత్మికానుభవమునుండియే ప్రవేశపెట్టబడినది. గీత పరప్రకృతికర్మను - "రహస్యం ఉత్తమం" - గుఱించి ఎట్టి వివరముల నివ్వదు. గీత దానిని తన ఆధ్యాత్మికానుభవమునందు కనుగొను, సాధకునికే వదిలివేయును. ఈ రహస్యమునకు ద్వారమగు సాత్త్విక స్వభావమును, కర్మను - దైవసంపత్తిని - మాత్రమే నిర్దేశించును, కాని అదే సమయమున సత్త్వ గుణమును సైతము అతిక్రమించవలె నని (14-19) గట్టిగా పట్టుబట్టును. -శ్రీ అ.

[2] ఆత్మవిజయము, స్వప్రయత్నము మఱియు క్రమపాలనముచే పైకి ఆరో హించు మన ప్రకృతి దృక్కోణమునుంచి చెప్పిన మాట యిది. దివ్యజ్యోతి, సన్నిధి మఱియు శక్తి మనసత్తలోనికి, దానిరూపాంతరము నిమిత్తము, దిగి అధికాధికముగా చేయూత నిచ్చుటయు ఆవశ్యకము. లేనిచో, సరిహద్దునందును, దాని కావలను రూపాంతరము ఘటిల్లజాలదు. కావుననే చరమవృత్తిరూపమున అశేష ఆత్మసమర్పణ యొక్క ఆవశ్యకత గన్పించును. -శ్రీ అ.

గుణక్రియలోపలనే, మన మీ రూపాంతరము సాధించుటకు, ఒక సాధనము, ఒక ఉన్నమనోపాయము, ఒక ఆధారబిందువు నుండకతప్పదు. గీత దీనిని సత్త్వగుణము యొక్క పూర్ణవికాసమునందు కనుగొనును, ఈ గుణము తన సశక్తి వికాసమునందు ఒక మేరను చేరుకొని, అచ్చట తననే తా నతిక్రమించి, తన మూలమున అంతర్ధానము కాగలదు. దీని కారణము సువిదితమే: సత్త్వము సుఖప్రకాశముల శక్తి గావున, తన పరాకాష్ఠయందు తనకు మూలమగు ఆధ్యాత్మిక జ్యోతిరానందముతో ప్రాయశః మానసిక తాదాత్మ్యమును అందుకొనగలదు. ప్రకృతియందలి సాత్త్వికశక్తియొక్క చేయూత లేనిదే, తక్కిన రెండు గుణములు ఈ పరివర్తనమును స్వయముగా సాధింపజాలవు - రజస్సు దివ్య క్రియోన్ముఖ సంకల్పములోనికి, తమస్సు దివ్య శాంతి విశ్రాంతులలోనికి. జడతాత్త్వముయొక్క అజ్ఞానము ప్రకాశమునందును, దాని నిశ్చేష్ట అసమర్థత సర్వశక్త దివ్య విశ్రాంతిసంకల్పముయొక్క ప్రకాశమయబలము నందును అంతరించువఱకు, ఆ జడతాత్త్వము సదా శక్తియొక్క అకర్మగా గాని, జ్ఞానముయొక్క అసమర్థతగా గాని నిలిచియుండును. అట్లు అంతరించి నపుడే, మనకు పరమశాంతి ప్రాప్తించును. కావున తమస్సు సత్త్వాధిపత్యములోనికి రావలెను. అటులే తనకు యథార్థజ్ఞానము లేనంతవఱకు, రజోరూప తత్త్వమును సదా ఒక వ్యగ్ర, వ్యథిత, సంతప్త లేక సుఖహీన క్రియగానే మిగిలియుండును; దాని స్వభావిక గతి ఒక అక్రమ మఱియు విపరీత క్రియ యగును - అజ్ఞానముద్వారా విపరీతము. మన సంకల్పము జ్ఞానముచేత తనను శుద్ధముగావించుకొనవలెను; అది యుక్తము, జ్ఞానదీప్తము నగు నొక క్రియను అధికాధికముగా అభ్యసింపవలెను, అపుడే అది గతిశీల దివ్యసంకల్పములోనికి మాఱగలదు. ఇదియు మఱల సత్త్వప్రవేశముయొక్క ఆవశ్యకతను దెల్పును. సత్త్వగుణము పరాపర ప్రకృతుల మధ్య నొక ప్రథమ మధ్యవర్తి యగును. నిక్కముగా నది ఒకానొక స్థానము చేరుకొని స్వయముగా రూపాంతరితము గావలెను, తననుండి తాను తప్పించుకొని, విచ్ఛిన్నమై, తన మూలములో విలీనము గావలెను; దాని నియమాధీన, అన్యాలబ్ధ, అన్వేషణాత్మక ప్రకాశము మఱియు జాగ్రత్తగా రచించబడిన క్రియ ఆత్మయొక్క విముక్త స్వయంసిద్ధ క్రియాకలాపములోనికిని, సహజస్ఫూర్త జ్యోతిలోనికిని మాఱవలెను. కాని ఈ లోపున సత్త్వశక్తియొక్క సమున్నత వృద్ధి తామసిక, రాజసిక అనర్థతనుండి చాలవఱకు మనలను తప్పించును; మఱియు మనచే స్వయముగా సాత్త్విక అనర్థతయు, ఒకసారి రజస్తమోభారమునుండి విపరీతముగా లాగబడని

స్థితి ప్రాప్తించి నపుడు, ఎక్కువ తేలికగా అధిగమించబడగలదు. ఆధ్యాత్మిక జ్యోతి మఱియు నిర్మలత్వముచే నిండువఱకు సత్త్వవికాసమును సాధించుట ప్రకృతియొక్క సస్నాహక సాధనయొక్క ప్రథమావస్థ యగును.

7. దేవతలు, అసురులు : అదియే తక్కిన గీతాధ్యాయముల యొక్క ఉద్దేశ్యమని మనము చూడగలము. కాని ఈ ప్రకాశసాధక ప్రక్రియను వివరించక పూర్వము, దాని పీఠికగా దేవాసుర లను ద్వివిధ పురుషుల వివేచనచేయును ; ఏలన దేవమానవుడే స్వ-పరివర్తనసాధకమగు సాత్త్వికక్రియకు సమర్థుడు గాని, అసుర మానవుడు గాడు. ఈ పీఠికయొక్క ప్రయోజనమేమియో, ఈ వివేచనయొక్క ఆశయమేమియో మన మిపుడు చూతము. సర్వ మానవుల సాధారణప్రకృతి ఒకటియే, అది త్రిగుణముల ఒక సమ్మిశ్రము ; అయినపుడు, సత్త్వమును పెంపొందించి, దానిని దివ్యపరివర్తనశిఖరముల దిశగా నడుపగల సామర్థ్యమందరియందు నుండు నని అనిపించును. అయితే వస్తుతః మన సాధారణప్రవృత్తి మన బుద్ధిని, సంకల్ప మును మన రాజసిక లేక తామసిక అహంకారమునకు దాసులను జేయుటకే తోడ్ప డును, అనంత కామమునకు సేవకులను జేయుటకే పనికివచ్చును; కాగా ఈ ప్రవృత్తి మన అపరిణత ఆధ్యాత్మిక సత్తయొక్క ఒక తాత్కాలిక లక్షణము మాత్రమే కాగలదు, మన చేతన ఆధ్యాత్మిక సోపానముల నారోహించి నపుడు అది అంతరించి పోవును అని మన మనుకొందుము. కాని వాస్తవముగా మనము చూచునదేమనిన, మానవులు, కనీసము ఒక స్తరముపైకి వెళ్లిన మానవులు, స్థూలముగా రెండు వర్గములలోనికి వచ్చివేతురు— ఒక వర్గమువారిలో సాత్త్విక ప్రకృతియొక్క ప్రబల శక్తి యుండును, కాగా ఈ శక్తి జ్ఞానము, ఆత్మసంయమము, ఉపకారపరత మఱియు సంసిద్ధివైపునకు దిరిగియుండును ; పోగా రెండవ వర్గమువారిలో రాజసిక ప్రకృతి యొక్క ప్రబలశక్తి యుండును, కాగా ఈ శక్తి అహంకారిక మహత్త్వము, కామ తృప్తి. తమ దృఢ సంకల్పము మఱియు వ్యక్తిత్వముల తర్పణమువైపునకు దిరిగి యుండును, ఇక వీరు ఈ తమ వ్యక్తిత్వసంకల్పములను మానవసేవకు లేక భగవంతునిసేవకు గాక, తమ అభిమానము, యశము మఱియు సుఖముకొఱకు ప్రపంచముపై విధింపజూతురు. ఈ రెండు వర్గములు దేవతలు మఱియు దానవుల యొక్క ప్రతినిధులు. భారతీయ మతముల సంకేతశాస్త్రమునందు ఈ దేవాసుర వివేచన మిక్కిలి ప్రాచీనము. ఋగ్వేదముయొక్క ప్రధానభావము దేవతలకును,

తమ తమోమయ ప్రత్యర్థులకును మధ్య జరుగు ఒక సంఘర్షము – ఒకరు జ్యోతికి అధిపతులు, అనంతతయొక్క పుత్రులు, ఒకరు అంధకారము మఱియు విభజన యొక్క పుత్రులు : వీరి సంగ్రామములో మానవుడు పాల్గొనును, అది అతని లోపలి జీవనము మఱియు క్రియయందు ప్రతిబింబించును. ఇది జరదుస్తుని [పార్సీ మత మూలపురుషుడు] మతముయొక్క ప్రధానతత్త్వము గూడను. తర్వాతి సాహిత్యమునందు సైతము ఈ భావమునకు ప్రముఖస్థానము గలదు. రామాయణము సైతము తన నైతికాంశమునందు ఒక రూపకమే, మానవరూపమునందలి దేవునికిని, దేహధారియగు రాక్షసునికిని మధ్య జరిగిన ఒక భయంకరసంగ్రామమును దెలుపు రూపకమే – ఒకరు సమున్నత సంస్కృతి మఱియు ధర్మమునకు ప్రతినిధి, ఒకరు ఉబ్బిపోయిన అహంకారముయొక్క అతిమాత్ర, అనియంత్రిత శక్తి మఱియు విస్తృతనాగరికతకు ప్రతినిధి. ఇక మహాభారతము – గీత దీని ఒక విభాగమే – మానవదేవతలకును, అసురులకును నడుమ సాగిన ఒక యావజ్జీవ సంగ్రామమును తన విషయముగా గొనును – ఒకరు దేవతాపుత్రులగు అధికారమానవులు, వీరు ఒక సమున్నత నైతిక ధర్మప్రకాశము ననుసరించి నడుతురు, ఒకరు శరీర అసురులగు అధికారమానవులు, వీరు తమ మానసిక ప్రాణిక దైహిక అహంకారమును సేవించుటకే బద్ధకంకణులు. మన మానసముకంటె ప్రాచీనుల మానసము భౌతిక రూపమువెనుక దాగియున్న వస్తుసత్యమునకు ఎక్కువ తెఱచుకొనియుండెను; అది మానవజీవనము వెనుక విశ్వశక్తియొక్క కొన్ని ప్రవృత్తులు లేక అంతస్తులకు ప్రాతినిధ్యము వహించు విశ్వ మహాశక్తులు లేక పురుషులను చూచుచుండెను, దైవ ఆసుర రాక్షస పైశాచభేదమున ఈ శక్తులు చతుర్విధములు; మఱియు నీ ప్రకృతి రూపములను తమయందు గట్టిగా ప్రతిబింబించిన మానవులు స్వయముగా దేవతలు, అసురులు, రాక్షసులు, పిశాచులు నని గణించబడిరి కాగా తన ప్రయోజనము నిమిత్తము ఈ వివేచనను గీత స్వీకరించి, ఈ ద్వివిధప్రాణులకును మధ్యగల భేదమును విపులముగా వర్ణించును – "ద్వౌ భూతసర్గౌ" (16–6). ఆసురము మఱియు రాక్షసము నై, ఈశ్వరజ్ఞానము, విముక్తి మఱియు సంసిద్ధిని అడ్డగించు ప్రకృతిని గీత ఇతఃపూర్వమే ప్రస్తావించినది (7–15. 9–12). ఇపుడు గీత ఈ జ్ఞానాదులకు అభిముఖమగు దైవప్రకృతిని దానినుండి వేఱుపఱచి చూపును.

8. <u>దైవసంపత్తివలన మోక్షము</u> : నీవు దైవప్రకృతితో బుట్టినవాడవని భగవంతు డర్జునునికి దెలుపును (16-5). కావున యుద్ధము మఱియు సంహారమునకు బూనుకొనుటచేత తాను అసురప్రవృత్తికి లొంగిపోగల డను తలంపుతో అర్జునుడు దుఃఖించ బనిలేదు. ఏ కర్మపై సర్వము నాధారపడునో, కాలపురుషుని రూపమున విశ్వేశ్వరుని ఆదేశమును పురస్కరించుకొని, సశరీర భగవంతుడు తనకు సారధి కాగా అర్జును డే యుద్ధము చేయవలసి యున్నదో, అది ధర్మరాజ్యమును, సత్యయుత న్యాయసామ్రాజ్యమును స్థాపింప సమకట్టిన ఒక సంగ్రామము. అర్జునుడు స్వయముగా దేవ - జాతిలో బుట్టినవాడు; అతడు తనలోపలి సాత్త్వికసత్తను పెంపొందించుకొనుచు, వచ్చి చేరుకొనిన ఇప్పటి స్థానమున ఒక సమున్నత పరివర్తనకును, త్రైగుణ్యమునుండి, కావుననే సాత్త్వికప్రకృతినుండి సైతము విముక్తికిని సమర్థుడైయున్నాడు. దేవాసురవిభేదము సర్వమానవజాతికి వ్యాప్తము గాదు, అది కచ్చితముగా వ్యక్తులందరికి వర్తించదు, అటులే జాతియొక్క నైతిక లేక ఆధ్యాత్మిక చరిత్రయొక్క సర్వదశలయందు గాని, వైయక్తిక పరిణామముయొక్క సర్వావస్థలయందు గాని అది సునిశితము మఱియు సునిశ్చితముగా నుండదు. మొత్తములో నెంతో పెద్ద భాగమగు తామసిక మానవుడు ఇచ్చటి వర్ణనను బట్టి ఏ వర్గములోనికిని రాడు; అయితే అతనిలో ఇంచించుక ఉభయాంశములు నుండవచ్చును, మఱియు నతడు నిమ్న గుణముల క్రియకే మందమందముగా తోడ్పడును. సామాన్య మానవుడు సాధారణముగా నొక మిశ్రమము; కాని అతనియందు ఏదియోయొక ప్రవృత్తి ఎక్కువ స్ఫుటముగా నుండును, అది అతనిని ప్రధానముగా రాజస - తామసికుని గాని, సాత్త్విక - రాజసికుని గాని చేయదొడంగును, మఱియు నతని నేదియోయొక పర్యవసానమునకు, అనగా దివ్యనిర్మలతకు గాని, ఆసురవిక్షోభమునకు గాని తయారుచేయుచున్న దని చెప్పవచ్చును. ఏలన గీతయం దిచ్చట ప్రస్తుతవిషయము గుణాత్మక ప్రకృతియొక్క పరిణామమునం దొకానొక పర్యవసానము : ఈ సత్యము గీతావర్ణనను బట్టి మనకు స్పష్టపడును. ఒక వైపున సత్త్వగుణముయొక్క ఆరోహణము, అనగా నిమగ్నదేవునియొక్క ఆరోహణము లేక అభివ్యక్తి యుండవచ్చును; రెండవ వైపున ప్రకృతిగత అంతరాత్మయొక్క రాజసిక ప్రవృత్తియొక్క ఆరోహణము, అనగా అసురుని సంపూర్ణ జన్మము సంభవించవచ్చును. ఒకటి గీత యిపుడు ఒత్తిచెప్పు చున్న విమోచనవృత్తికి దారితీయును; అది సత్త్వ

గుణముయొక్క ఒక సమున్నత ఆత్మాతిక్రమణమును, దివ్యసత్త్వముయొక్క సాధర్మ్యము లోనికి ఒక రూపాంతరీకరణమును సాధ్యము చేయును – "విమోక్షాయ" (16-5). రెండవది అందరియందును గల ఈ సామర్థ్యమునుండి మనలను దూరము గావించి. మన అహంకారబంధనమును పర్వతప్రాయము చేయు దిశగా మనలను త్రోసిపెట్టును. దీని నెఱింగించుటయే ఈ వివేచనలోని మర్మము.

9. సాత్త్విక అభ్యాసములు, గుణములు : పరాకాష్ఠ నందిన సాత్త్విక అభ్యాసములు మఱియు గుణములు దైవప్రకృతిని వేఱుచేసి చూపును : ఆత్మ సంయమము, యజ్ఞము, ధార్మికాధ్యయనము, శుద్ధతా మఱియు పవిత్రత, నిష్కాపట్యము మఱియు సరళత, సత్యము, శాంతి మఱియు త్యాగము, దయ, లజ్జ, మృదుత, క్షమ, సహిష్ణుత, ధీరత; సమస్త చపలత మఱియు లఘుత మఱియు అస్థిరతలనుండి ఒక గంభీర, మధుర, యథార్థ విముక్తి – ఇవి దైవప్రకృతికి స్వాభావిక గుణములు (16-1, 2. 3). క్రోధము, లోభము, మోహము, ద్రోహము, ఇతరులకు బుద్ధిపూర్వకముగా చేయు హింస, గర్వము, దురహంకారము, విపరీత స్వాభిమానము : వీనికి దైవప్రకృతి నిర్మాణములో స్థానము లేదు. కాని దాని మృదుత, త్యాగము మఱియు ఆత్మసంయమములలో ఎట్టి బలహీనతయు నుండదు : దానియందు, ధర్మమునందును అహింసాసత్యముల ననుసరించియు జీవించు అంతరాత్మయొక్క తేజము మఱియు నాత్మబలము, దృఢనిశ్చయము (ధృతి), అభయము – ఇవి చెలంగుచుండును – "తేజః, అభయం, ధృతిః, అహింసా, సత్యం" (16-1, 2, 3). సమస్త సత్తయు, సమస్త స్వభావము నిచ్చట సమగ్ర – శుద్ధమై యొప్పారును – "సత్త్వసంశుద్ధిః;" ఇచ్చట జ్ఞానపిపాసయు, జ్ఞానమునందు ప్రశాంత సుస్థిర ప్రతిష్ఠయు నుండును. ఇదిగో, ఇది దైవప్రకృతిలో ఉన్మీలించిన వాని సమృద్ధ సంపద యగును.

10. ఆసుర సంపత్తి, దాని ఫలితము : ఆసుర ప్రకృతికి సైతము తన సంపద, తన శక్తిసమృద్ధి గలదు, కాని దీని స్వభావము మిక్కిలి భిన్నము, ప్రబలము మఱియు దుష్టము. ఆసుర మానవులకు ప్రవృత్తి లేక నివృత్తియొక్క యథార్థ జ్ఞాన ముండదు, అనగా నేది చేయవలెనో, ఏది చేయరాదో వారికి తెలియదు (16-7); వారియందు సత్య ముండదు, శుద్ధక్రియ యుండదు, నిష్ఠామయ ఆచా

ముండదు. స్వాభావికముగనే వారు జగత్తునందు స్వతృప్తికి జరుగు విశాలక్రీడనేగాని, మఱి దేనిని చూడరు. వారి జగత్తునకు కామమే కారణము, బీజము, శాసకశక్తి మఱియు నియమము; అది ఆకస్మికముగా పుట్టిన జగత్తు, దానికి సత్సంబంధముగాని, పూర్వకర్మ గాని లేదు, దానికి ఈశ్వరుడు లేడు, అది అసత్యము, సత్యప్రతిష్ఠా శూన్యము (16-8). వారికి దీనిని మించిన ఎట్టి బౌద్ధిక లేక ధార్మిక సిద్ధాంతమున్నను, ఇదియే ఆచరణయందు వారి బుద్ధి సంకల్పముల యథార్థ మతము, వారు సదా కామము మఱియు నహంకారదేవతలనే ఉపాసింతురు. కార్యక్షేత్రమున జీవితముపట్ల నీ దృష్టినే అవలంబించి, దాని అసత్యభావముచేతనే తమ ఆత్మను, బుద్ధిని సర్వనాశము గావించుకొందురు (16-9). ఆసుర మానవుడు ఒక ఉగ్ర ప్రచండ క్రియయొక్క కేంద్రము లేక సాధనమగును, ఒక విధ్వంసక శక్తియగును, హింసా-అశుభముల ఒక స్రోతోమూల మగును. దంభము, అభిమానము, గర్వమదముతో గూడిన ఈ పథభ్రష్ట జీవులు తమనే వంచించుకొందుచు, తమమిథ్యామూర్ఖ లక్ష్యములందు పట్టుతో నుందురు, తమ లాలస విషయమగు అశుచిసంకల్పములను వెంటాడుదురు (16-10). కామోపభోగమే జీవిత సర్వలక్ష్య మని వారు తలపోతురు, పూరించరాని ఈ లక్ష్యము వెంటబడి, మరణపర్యంతము వారు తమను కాల్చివేయు నొక అపరిమిత చింత, ఆలోచన, ప్రయత్నము మఱియు ఆందోళనకు గుఱియగుదురు (16-11). వంద బంధములచే బద్ధులు, కామక్రోధములచే భక్షితులు, తమ కామభోగార్థము అన్యాయార్జనయందు సదా వ్యగ్రులు నైయుండు వా రిట్లు ఊహించుకొందురు (16-12), "నేడు నే నీ కామ్యమును బొందితిని, రేపు దానిని బొందెదను, నేడు నా కింత విత్త మున్నది, రేపు మఱింత వచ్చును (16-13). ఈ నా శత్రువును హతమార్చితిని, తక్కిన వారి పని గూడ పట్టించెదను. నేను ప్రభువను, రాజను ; నేను సిద్ధుడను, భోగిని, బలవంతుడను, సుఖిని; నేను భాగ్యశాలిని, ప్రపంచ భోగమునందు నా కనన్యాధికారము గలదు (16-14). నేను సంపన్నుడను, నేను ఉత్తమ వంశజుడను; నా వంటివా డెవ డున్నాడు? నేను యజ్ఞము చేతును దాన మిత్తును, విషయములను భోగింతును (16-15)." ఇట్లు బహువిధ అహంకారిక భావములచే నాక్రాంతులై, మోహజాలములో బడి, వారు కర్మ చేతురు గాని, తప్పుగా చేతురు; ప్రబలముగా ప్రయత్నింతురు గాని, తమయందలి మఱియు నందరియందలి భగవంతునికొఱకు గాక, తమకొఱకే, కామముకొఱకే, భోగము కొఱకే ప్రయత్నింతురు ; అట్టివారు తమ దురితమే కారణమగు అశుచినరకమున

పోయిపడుదురు (16-16). వారు నిజమే, యజ్ఞదానముల నాచరింతురు, కాని దాంభికప్రదర్శనార్థము, మిథ్యాభిమానమునుండి, మఱియు స్తబ్ధ బుద్ధిహీన గర్వముతో నాచరింతురు (16-17). తమ బలసామర్థ్యముల అహంకారమునందు, తమ దర్ప క్రోధముల తీవ్రతయందు వారు తమయందును, సర్వులయందును గుప్తముగా నున్న భగవంతుని ద్వేషింతురు, నిరసింతురు, తృణీకరింతురు (16-18). మంచిపట్లను, భగవంతునిపట్లను వారి కిట్టి సాభిమాన ద్వేషము మఱియు తిరస్కారము గలవు గాన, వారు క్రూరులు, దుష్టులు గాన, వారిని భగవంతుడు నిరంతరము అధికాధిక ఆసురిక జన్మలలోనికి విసిరివేయును. అన్వేషించరు గాన, వారు భగవంతుని గనుగొనరు, మఱియు చివరకు, భగవన్మార్గమునుండి సర్వథా భ్రష్టులై, అంతరాత్మ ప్రకృతియొక్క అధమస్థితిలోనికి మునిగిపోదురు—"అధమాం గతిం" (16-20).

11. పాపాత్మునికి సైతము పరమగతి : ఈ విస్పష్ట వర్ణన సూచించు వివేచనకు మనము పూర్తివిలువ నిచ్చినప్పటికి, దీనిలో నున్న అర్థముకంటె ఎక్కువ అర్థమును లాగుటకు ప్రయత్నించరాదు. ఈ భౌతిక ప్రపంచమున దేవాసురు లను [1] ద్వివిధ సృష్టులు గలవు (16-6) అని చెప్పినపుడు, మానవాత్మలు భగవంతునిచే ఆదినుంచియు ప్రకృతియందు తమతమ ప్రత్యేక అనివార్య జీవనవిధానముతో సృజింపబడిన వని దీని అర్థము గాదు; అటులే ఒక కఠోర ఆధ్యాత్మిక పూర్వనిర్ణీత గమ్యము గల దనియు, ఎవరిని భగవంతుడు ఆదినుంచియు నిరాకరించెనో, వారి నతడు అంధులను గావించి, ఆ నెపముతో శాశ్వత అశుచి నరకములోనికి త్రోసివేయు ననియు దీని అర్థము గాదు. నిజానికి సమస్తాత్మలు - దేవమానవులవలెనే అసుర మానవులును - భగవంతునియొక్క సనాతన అంశములే (15-7), అందరును

[1] ద్వివిధ సృష్టుల విభేదముయొక్క పూర్ణసత్యము అధిభౌతిక స్తరములలో మనకు గన్పించును, ఏలన అచ్చటి జీవనము ఆధ్యాత్మిక పరిణామనియమముచే పాలింపబడదు. దేవతల లోకములు గలవు, అసురుల లోకములు గలవు; మన వెనుక నున్న ఈ లోకములందలి వ్యక్తులు మాఱని నిత్యరూపులు. వీరు విశ్వప్రగతికి ఆవశ్యకమగు భగవల్లీలకు ఆధారముగా నుందురు మఱియు వీరు పృథివీతలముపైనను, ఈ పృథివీ స్తరమున మానవుని జీవనస్వభావముల పైనను తమ ప్రభావమును బఱపుదురు. —శ్రీ అ.

మోక్షమును ప్రాపించవచ్చును : పరమ పాపి సైతము భగవదభిముఖము కాగలడు (9-30). కాని ప్రకృతియందు అంతరాత్మపరిణామ మొక సాహసకృత్యము మఱియు స్వభావమును, స్వభావనియత కర్మయు (18-47) దాని ప్రధానశక్తులు. కావున స్వభావాభివ్యక్తియందు, అంతరాత్మయొక్క స్వయంసంభూతియందు ఒక అతిక్రమము, దాని ఖేలనమునందు ఒక వ్యతిక్రమము బయలుదేరి, సత్త్వనియమమును చెడ్డవైపునకు త్రిప్పినచో, రాజసగుణములకు బట్టముగట్టి, సత్త్వమును తగ్గించివేయు వాని పెంపును సాధించినచో, అప్పుడు కర్మ మఱియు దాని ఫలితముల ప్రవృత్తి మోక్షసాధన సమర్థ మగు సత్త్వాధిక్యమునందు గాక, నిమ్నప్రకృతి - దురాగ్రహముల పరాకాష్ఠయందే పర్యవసించును. మానవుడు, తా నిట్టి తఱి వెనుతగ్గి, తన భ్రాంతమార్గమును విడిచి వేయనిచో, అతనియందు అసురుడు పూర్తిగా జన్మించును, కాగా మానవుడు సత్య తేజములకు దూరముచేయు ఒక పెద్ద మలుపు దిరుగును, అత డిక తన అధోగతి వేగమును మఱల్చజాలడు, తాను దురుపయుక్తముగావించిన తనయందలి అతిమాత్ర దివ్యశక్తియే దానికి గారణము; కాగా ఆ వేగముచేత నతడు అట్టడుగు నంటును, అప్పుడు ఈ అధోగతి తన నెక్కడకు దెచ్చెనో, కనువిప్పి కనుగొనును; తన కార్యమును సాధించి, ఆ దురుపయుక్త శక్తి క్షీణించగా, అత డిప్పుడు అంతరాత్మ ప్రకృతియొక్క నిమ్నతమావస్థలో - నరకములో - నున్నాడు. దీని పాఠమును గ్రహించి, అతడు తిరిగి వెలుగునకు మఱలినప్పుడే, గీతయొక్క తదితర సత్యము రంగములో ప్రవేశించును : పరను పాపిష్ఠుడు, అత్యంత మలిన ఘోర దురాచారుడు సైతము భగవంతుని భజించుచు, ననుసరింప బూనుకొనిన వెంటనే, రక్షితు డగును. కారణము, కేవల మా పూనిక చేతనే అతడు సంసిద్ధికిని, విముక్తికిని గొనిపోవు సాత్త్వికమార్గమున శీఘ్రముగా బ్రవేశించును (9-30, 31).

12. <u>పరమసిద్ధికి శాస్త్రము మార్గము</u> : ఆసురిక ప్రకృతి రాజసిక ప్రకృతి యొక్క పరాకాష్ఠ మాత్రమే. అది ప్రకృతిగత అంతరాత్మను దాస్యమునకు, కామ క్రోధలోభముల వశమునకు నడుపును ; రాజసిక అహంకారముయొక్క ఈ మూడు శక్తులును నరకద్వారములు (16-21) — ప్రాకృత జీవుడు తన నిమ్న లేక అంధ ప్రేరణలయొక్క అఱచి, దురితము మఱియు భ్రాంతియందు రమించునప్పుడు ఏ నరకములో పడునో, ఆ నరకద్వారములు. ఈ మూడును మఱల నొక మహాంధ కారముయొక్క ద్వారములగును (16-22), అవి మూలాజ్ఞానముయొక్క విలక్షణ

శక్తియగు తమస్సులోనికి తెఱచుకొనును ; ఏలన రాజసిక ప్రకృతియొక్క అనియంత్రిత వేగము, క్షీణించినప్పుడు, మానవుడు అతినికృష్ట తామసిక ఆత్మావస్థ యొక్క దుర్బలత, సంకోచము, అంధకారము, అసామర్థ్యములలోనికి తిరిగి కుప్ప గూలిపోవును. ఈ పతనమునుండి తప్పించుకొనుటకు, మానవుడు ఈ మూడు దుష్టశక్తులనుండి విడుదల బొంది, సత్త్వగుణముయొక్క ప్రకాశమునకు దిరుగవలెను, ప్రమాణమును బట్టి, యథార్థ సంబంధములందు, సత్యధర్మముల పథములో నడువ వలెను ; అప్పుడు అతడు తన ఉచ్చతర హితము ననుసరించుచు, అత్యున్నత ఆత్మ స్థితిని ప్రాపించును (16-22). కామధర్మము ననుసరించుట మన ప్రకృతియొక్క యథార్థ నియమము గాదు ; దాని కర్మలకు ఒక ఉచ్చతర, న్యాయతర ప్రమాణ మున్నది. కాని దాని రూప మెక్కడ గన్పించును ? మానవజాతి దీనినే సదా అన్వే షించుచు వచ్చినది మఱియు తాను కనుగొనిన దంతయు శాస్త్రమునందు రూపము ధరించియున్నది. అయితే శాస్త్ర మన, జ్ఞానవిజ్ఞానముల నియమము, నైతిక నియ మము, ధార్మిక నియమము, శ్రేష్ఠ సామాజిక జీవననియమము, మానవునితోను, భగవంతునితోను, ప్రకృతితోను యథార్థ సంబంధములను దెలుపు నియమము. శాస్త్ర మన, ఆచారముల ఒక రాశి గాదు, ఏలన వీనిలో కొన్ని మంచివి, కొన్ని చెడ్డవి ; తామసిక మానవునియొక్క యాంత్రికమనస్సు అలవాటుచొప్పున వీని నర్థము దెలియకయే పాటించును. నిజానికి శాస్త్ర మన, అంతర్జ్ఞానము, అనుభవము, వివేకములచే విహితమైన జ్ఞానము మఱియు నుపదేశము, జీవనముయొక్క విజ్ఞానము, కళ మఱియు నీతి, అనగా జాతికి లభించిన శ్రేష్ఠప్రమాణములు. ఇట్టి శాస్త్రవిధిని పాటించక, ఏ అర్ధ-ప్రబుద్ధ మానవుడు తన ప్రేరణలు మఱియు కామముల వెంట బడునో, అతడు ప్రీతిని బొందగలడు గాని, సుఖమును బొందజాలడు, ఏలన ఆంతర సుఖము ప్రామాణికజీవనముచేతనే ప్రాప్తించగలదు (16-23). అతడు సంసిద్ధికి పయనించజాలడు, పరమ ఆధ్యాత్మిక పదము నందుకొనజాలడు. ప్రేరణ మఱియు కామముల నియమము జంతుప్రపంచములో ప్రముఖముగా గన్పించును, కాని మానవుని మానవత్వవిశేషము సత్యమును, మతమును, జ్ఞానమును, ఒక యుక్త జీవనవిధాన మును అనుసరించుటచేతనే వృద్ధినందును. తన బుద్ధిచేతను, ప్రాజ్ఞసంకల్పముచేతను తన నిమ్నసత్తను శాసించుకొను నిమిత్తము తాను గుర్తించి, స్థాపించిన ప్రమాణ రూపమగు శాస్త్రమును కావుననే ముందు పాటించవలెను, తన నడవడికిని, పనుల కును, కార్యాకార్యనిర్ణయమునకును అదియే ప్రామాణ్యము గావలెను (16-24).

సహజప్రవృత్త కామనాత్మక ప్రకృతి ఆత్మసంయమ అభ్యాసముచేత శిక్షితము, క్షీణము, నిర్దళితము నగువఱకు శాస్త్రవిధానమును శిరసావహించవలెను ; అప్పుడు మానవుడు ముందుగా నెక్కువస్వేచ్ఛతో, ఎక్కువ వివేకముతో తననుదానే నడుపు కొనుటకును, పిమ్మట అత్యున్నత పరమధర్మమును, పరమస్వేచ్ఛను ప్రాపించుట కును సంసిద్ధత నందును.

13. శాస్త్రము - స్వేచ్ఛ : కారణము, తన సాధారణరూపమున శాస్త్రము పైన ప్రస్తావించిన ఆధ్యాత్మికధర్మము గాదు; అయితే అది తన శిఖరాగ్రమున ఆధ్యాత్మిక జీవనముయొక్క ఒక విజ్ఞానము మఱియు శిల్పము, అనగా నొక ఆధ్యాత్మిక శాస్త్ర మగును - గీతయే తన బోధనకు అత్యున్నత గుహ్యతమ శాస్త్రముగా వర్ణించుకొనును (15-20); అట్టి ఆధ్యాత్మిక శాస్త్రము సాత్త్వికప్రకృతి యొక్క స్వాఉతిక్రమణమునకు ఒక నియమమును సూత్రీకరించును, మఱియు ఆధ్యాత్మిక పరివర్తనకు నడిపించు ఒక సాధనను వివరించును. అయినను సర్వ శాస్త్రము ప్రారంభమున కొన్ని సన్నాహక నియమముల - ధర్మముల - ఆధారముపై నిర్మింపబడును; కాని అది ఒక సాధనమే గాని, సాధ్యము గాదు. పరమసాధనము భగవద్భావముయొక్క పరమస్వాతంత్ర్యము; అంతరాత్మ సర్వధర్మములను పరిత్యజించి (18-66), తన ఏకమాత్ర కర్మనియమమునకు భగవంతుని వైపునకు దిరిగి, భగవదిచ్ఛనుండియే సరాసరి కర్మచేయుచు, భాగవత ప్రకృతియొక్క స్వాతంత్ర్యమునందు - ధర్మమునందు గాక, భగద్భావమునందు - నివసించునపుడు, ఆ పరమస్వాతంత్ర్యము సిద్ధించును. అర్జునునియొక్క తర్వాతి ప్రశ్న గీతాబోధన యొక్క ఈ పరిణామమునకే దారితీయును.

# 18. [1] గుణములు, శ్రద్ధ, కర్మ

1. శ్రద్ధాస్వరూపము మఱియు ప్రభావము : కామము ననుసరించి చేయు కర్మకు, శాస్త్రము ననుసరించి చేయు కర్మకు మధ్య గీత విభేదమును జూపినది (16–23). శాస్త్ర మన సర్వసమ్మతమైన జీవనవిద్య మఱియు కళ యని మనము గ్రహించవలెను; అది మానవజాతి సామూహిక జీవనముయొక్క పరిణామము, అనగా దాని సంస్కృతి, మతము, విజ్ఞానము, అది అధికాధికముగా అన్వేషించి కనుగొను శ్రేష్ఠ జీవనప్రమాణము – కాని ఈ మానవజాతి యింకను అజ్ఞానము నందుండి జ్ఞానము దిశగా అర్ధప్రకాశమున అడుగులు వేయు జాతి. కాగా, వైయక్తిక కామము ప్రేరించు కర్మ మన ప్రకృతియొక్క అసంస్కృతావస్థకు జెందిన కర్మ మఱియు నది అజ్ఞానముచేత గాని, మిథ్యాజ్ఞానముచేత గాని, మఱియు అనియంత్రిత లేక కునియంత్రిత రాజసిక అహంకారముచేత ప్రేరితమగును. పోగా, శాస్త్రనియత మగు కర్మ బౌద్ధిక, నైతిక, సౌందర్యవిషయక, సాంఘిక మఱియు ధార్మిక సంస్కృతి యొక్క పరిణామము; ఒకానొక యుక్తజీవనము, సామరస్యము, యుక్తక్రమమును సాధించు ప్రయత్నముయొక్క మూర్తీభావమే శాస్త్రము; ఇది స్పష్టముగనే పరిస్థి తుల ననుసరించి న్యూనాధికముగా నగ్రగామియగు, మానవునియందలి సాత్త్వికాంశముయొక్క ఒక కృషిఫలితము, ఈ కృషి అతని రాజసిక మఱియు తామసిక అహంకారమునకు పైకిబోయి, దానిని నియమించును లేక దాని అవసరము మున్నప్పుడు, దానిని మార్గమున నడుపును. శాస్త్ర మిట్లు ముందడుగునకు సాధనము గాన, మానవజాతి దానినే తన కర్మప్రమాణము చేసికొనవలెను. గాని, తన వైయక్తిక కామముల ప్రేరణకు తలవంచగూడదు. ఇది యొక సార్వత్రిక నియమము మఱియు మానవజాతి ఎక్కడ ఎట్టి స్థిర, వికసిత సమాజవ్యవస్థను సాధించినను, అచ్చట దీనిని సదా అంగీకరించినది. శాస్త్రమునందు వ్యవస్థకు, నియమమునకు సంబంధిం

---

[1] గీత, అధ్యాయము – 17

పిన ఒక భావ ముండును, సంసిద్ధికి సంబంధించిన ఒక ఆదర్శ ముండును, ఇది కామములయొక్క మార్గదర్శనమును గాదు, అపక్వప్రేరణలయొక్క ప్రాకృత ప్రవాదనము గాదు. శాస్త్రరూపమగు నీ అధికతర నియమమును వ్యక్తి సాధారణ ముగా తనకు వెలుపల, మానవజాతియొక్క ప్రాయః రూఢమగు అనుభవము మఱియు జ్ఞానముల పరిణామమునందు కనుగొనును; అతని మనస్సును, అతని సత్త్వయొక్క ప్రముఖభాగములును దీనికి తమ సమ్మతిని లేక అనుమతి నొసంగును, అప్పు డతడు తన మనః సంకల్ప కర్మలందు దీనిని నివసించుచు, తనదిగావించుకొన ప్రయత్నించును. కాగా సత్త్వయొక్క ఈ సమ్మతి, దాని సచేతన అంగీకారము, నమ్మి సాధించగోరు దాని సంకల్పము — ఈ మూడింటికి గలిపి, మనము గీత పెట్టు పేరునే పెట్టుకొన వచ్చును — "శ్రద్ధ" (17-2). ఏ మతము, తత్త్వశాస్త్రము, నైతికనియమము, సామాజికభావము, లేక సాంస్కృతికభావమునందు నాకు శ్రద్ధ యుండునో, ఉంచునో, అది నా ప్రకృతికిని, దాని కర్మలకును ఒక విధానమును జూపును, సాపేక్షన్యాయముయొక్క ఒక భావమును గాని, సాపేక్ష లేక నిరపేక్ష సంసిద్ధియొక్క ఒక భావమును గాని గలిగించును; మఱియు ఏ మేరకు నా శ్రద్ధ శుద్ధము, పూర్ణము నగునో, ఇంకను ఏ మేరకు దాని ననుసరించి జీవింప నా సంకల్పము బలముగా నుండునో, ఆ మేరకు అది చూపు లక్ష్యము కాగలను, ఆ ధర్మము యొక్క ప్రతిరూపములోనికి గాని, ఆ సంసిద్ధియొక్క ఆదర్శములోనికి గాని నన్ను నేను మలచుకొనగలను.

2. ప్రాత శాస్త్రస్థానమున క్రొత్త శాస్త్రము : కాని మానవునియందు ఒక స్వేచ్ఛతర ప్రవృత్తియు గలదు; అది అతని కామప్రేరణయు గాదు; రూఢము, సురక్షితము నగు శాస్త్రవిధానము నవలంబించ దలంచు సంకల్పమును గాదు. తఱచుగా వ్యక్తియు, తన జీవనముయొక్క ఏ క్షణమునం దైనను సమాజమును శాస్త్రమునుండి విముఖమై, దానిపట్ల తన సహనమును విడనాడి, దానియందలి తన శ్రద్ధా సంకల్పములను గోల్పోవును, మఱియు మఱియొక ప్రమాణమును వెదకసాగును; కారణము, ఈ నూతన ప్రమాణమును యుక్తతర జీవనవిధానముగా నామోదించుటకును, సజీవతర సత్త్వాసత్యముగా వీక్షించుటకును అది (సమాజము) యిప్పుడు ఎక్కువ మొగ్గుచూపును: సమాజచరిత్రలో దీనిని మనము గాంచగలము. సాంప్రదాయిక శాస్త్రము జీవశక్తిని గోల్పోయి, చిక్కైము గట్టి, రీతులు మఱియు

ఆచారముల ఒక రాశిలోనికి దిగినపు, డిట్టి అన్వేషణ సంభవించవచ్చును. లేక, శాస్త్రము అపూర్ణము లేక ఆవశ్యక ప్రగతి కిక నుపయుక్తము గా దని తేలి నప్పు డిట్లు గావచ్చును; ఒక నూతనసత్యము, ఒక పూర్ణతర జీవనవిధానము ఇప్పు డనివార్య మయినది. అట్టి విధాన మిపుడు లేనిచో, జాతిప్రయాసము గాని. జాతి యొక్క ఆశను, ఆకాంక్షను మూర్తీభావమగు ఒక ప్రబుద్ధ మహిత వైయక్తిక మానసము గాని దాని నావిష్కరించవలసియున్నది. ఉదాహరణకు, వైదిక ధర్మము ఒక ఆచారమాత్ర మయినపుడు, ఒక బుద్ధుడు తన అష్టాంగమార్గము మఱియు నిర్వాణగమ్యముయొక్క నూతనవిధానముతో రంగములోనికి వచ్చును; మఱియు నత డా విధానమును తన వైయక్తిక కల్పనగా గాక, ఒక జ్ఞానదీప్త మానసము, ఒక జాగరిత అంతరాత్మ తిరిగి కనుగొనిన, ఆర్యజీవనముయొక్క సత్యవిధానముగా ప్రతిపాదించు ననుట గమనార్హము. కాని క్రియాత్మకముగా దీని అర్థ మేమన, ఒక ఆదర్శభూత, ఒక సనాతన ధర్మ మున్నది; మతము, తత్త్వశాస్త్రము, నీతిశాస్త్రము, ఇంకను సత్యము మఱియు సంసిద్ధి నిమిత్తము ఉద్యమించు మానవునియందలి యితరశక్తు లన్నియు బాహ్యాంభ్యంతర జీవనముయొక్క విజ్ఞానము మఱియు శిల్ప మును వివరించు నూతన వాక్యములలో, అనగా ఒక నూతన శాస్త్రములో ఆ ఆదర్శ ధర్మమునకు రూపమిచ్చుటకు సదా ప్రయత్నించుచున్నవి. క్రీస్తుకు పూర్వము మోజెస్ ఏర్పఱచిన ధార్మిక, నైతిక, సామాజిక సదాచారనియమము సంకుచితము మఱియు అపూర్ణ మనియు, అది యిప్పుడు ఒక లోకాచారము మాత్రమే యనియు నిశ్చయింపబడును; దాని స్థానమున క్రీస్తు ధర్మము వచ్చును, మఱియు వారిని, ఏకకాలమున నేను నిరాకరించుచున్నాను, పూర్ణముచేయుచున్నా - నని చెప్పగా నగును. అనగా దాని అపూర్ణరూపమును నిరాకరించి, అది లక్షించిన సారతత్త్వమగు దివ్య జీవనవిధానమును ఒక గభీరతర, విశాలతర ప్రకాశము మఱియు శక్తియందు పూర్ణముచేయును. మఱియు మానవుని అన్వేషణ అక్కడితో నాగదు, అది చాల సూత్రీకరణములను సైతము విడిచివేసి, తాను నిరాకరించిన ఒక గతసత్యమును తిరిగి చేపట్టును, లేదా ముందుకు బోయి, ఒక నూతన సత్యము మఱియు శక్తి నవలంబించును, కాని సదా తదన్వేషణయొక్క ధ్యేయ మొక్కటియే - సంసిద్ధ ధర్మము, యుక్త జీవనవిధానము, మానవుని సంపూర్ణ, సర్వోత్తమ, మూలభూత ఆత్మ మఱియు ప్రకృతియొక్క సాక్షాత్కారము.

3. రాజసిక, సాత్త్విక అతిక్రమణములు : ప్రస్తుత ధర్మముతో నిక తృప్తిపడని వ్యక్తిలో ఈ అన్వేషణ ప్రారంభమగును; తనను మఱియు ప్రపంచమును గుఱించిన తన భావమునకును, విశాలతమ లేక ప్రగాఢతమ అనుభవమునకును ప్రస్తుతధర్మము అనురూపముగా లేదని అతడు కనుగొనును; అందుచేతనే దానిని విశ్వసించి, అనుష్ఠించు సంకల్పము అతనిలో ముందుకు రాదు. అది తన అంతర సత్తావిధానమునకు అనురూపముగా నుండదు, అది తన విషయమున "సత్" (17-26) గాదు. అనగా సత్యవస్తువు, యుక్తధర్మము, ఉత్తమ లేక శ్రేష్ఠ లేక వాస్తవ హితము గాదు, అది తన లేక సర్వసత్తయొక్క సత్యమును గాదు, నియమమును గాదు, శాస్త్రము వ్యక్తికి నిర్వ్యక్తికమగు నొక వస్తువు, కావునే అది అతని కరణములయొక్క సంకుచిత వైయక్తిక నియమమును మించిన ప్రమాణ మగును; కాని అది అదే సమయమున సమాజమునకు సవ్యక్తిక మగును, ఏలన అది దాని అనుభవము, సంస్కృతి లేక ప్రకృతియొక్క పరిణామము. ఈ శాస్త్రము తన సమస్త రూపము మఱియు తత్త్వమునందు ఆత్మసంపూర్తికి ఆదర్శనిధానము గాని, మన ప్రకృతిప్రభువుయొక్క సనాతనధర్మము గాని కాదు; అయితే దానియందు ఆ మహత్తర వస్తువుయొక్క సూచనలు, సన్నాహములు, ప్రకాశము నిచ్చు క్షణిక దర్శనములు నుండవచ్చును. మఱియు వ్యక్తి సమాజదశను దాటియుండవచ్చును, అప్పు డతడు ఒక మహత్తర సత్యమునకు, ఒక విశాలతరగమనమునకు, ప్రాణేశ్వరుని ఒక గభీరతర ఉద్దేశ్యమునకు యోగ్యుడగును. శాస్త్రమార్గమును విడిచివేయు అతనియందలి ప్రేరణ, నిజమే, సదా ఒక ఉచ్చతర గతి కాకపోవచ్చును; అది అహంకారిక లేక రాజసిక ప్రకృతియొక్క తిరుగుబాటు - రూపము ధరించవచ్చును; ఈ ప్రకృతి తన స్వపరిపూర్తి మఱియు స్వదర్శనము అపేక్షించు స్వేచ్ఛకు ప్రతిబంధకముగా దోచు శాస్త్రనియంత్రణనుండి స్వతంత్రము కాజూచును. ఇట్టి తిరుగుబాటు సైతము శాస్త్రముయొక్క ఒకానొక సంకుచితత్వము లేక అపూర్ణతచేత గాని, ప్రచలిత జీవననియమము కేవలము ఒక ప్రతిబంధక లేక నిర్జీవ లోకాచారము లోనికి దిగజాఱుటచే గాని తఱచు సమర్థనీయమే యగును. మఱియు నది సమర్థనీయమగు మేరకు, దానికి సత్యము ప్రమాణముగా నుండును, దాని మనుగడకు ఒక సాధు సముచిత కారణ ముండును. ఏలన రాజసికాహంకారము మార్గము తప్పినను, దాని విముక్త క్రియ, తనయందు స్వేచ్ఛయు, ప్రాణము నెక్కువగా నుండును గాన, లోకాచారముయొక్క నిర్జీవము, సంకుచితము నగు తామసికానుసరణముకంటెను

శ్రేష్ఠము. రాజసిక ప్రకృతి సదా ప్రబలతరము, సదా అధికశక్తి ప్రేరితము మఱియు దానియందు తామసికప్రకృతియందు కంటె ఎక్కువ సంభవనీయత యుండును. మఱియు ఈ తిరుగుబాటు - ప్రేరణ తన మూలమున సాత్త్వికము గావచ్చును; అది ఒక విశాలతర, మహత్తర ఆదర్శమునకు ఒక మలుపు గావచ్చును, అప్పుడది ఇప్పటికి చూడబడిన దానికంటె, మన ఆత్మ మఱియు ప్రపంచముయొక్క ఒక సమగ్రతర, సమృద్ధతర సత్యమునకు మనలను ఎక్కువ సన్నిహితముగా గొని పోవును, కావుననే దివ్యస్వాతంత్ర్యముతో నేకమగు పరమధర్మమునకు ఎక్కువ సన్నిహితుల మగుదుము. మఱియు ఫలతః ఈ సాత్త్వికాతిక్రమణము మన సత్త యొక్క ఒక విస్మృతసత్యమును ఆలింగనము గావించు కొనుటో, ఇంకను చూడ బడని లేక ఆచరింపబడని ఒక సత్యమునకు చేరుకొనుటో యగును. అది అనియంత్రిత ప్రకృతియొక్క ఒక విశృంఖల అతిక్రమణము గాదు; దానికి తన ఆధ్యాత్మిక సమర్థన గలదు మఱియు నది మన ఆధ్యాత్మిక ప్రగతి కొక ఆవశ్యకత యగును. మఱియు నొకవేళ శాస్త్రము సామాన్య మానవునికి ఇంకను ఒక సజీవవస్తువు మఱియు నుత్తమనియమమే యైనను, ఆంతరముగా వికసించిన ఆధ్యాత్మిక అసాధారణ మానవుడు ఆ ప్రమాణబద్ధుడు గాడు. రూఢమగు శాస్త్రరేఖ నతిక్రమించ నతని కాహ్వానము వచ్చును. శాస్త్రము సామాన్య మానవుని సాపేక్ష సిద్ధికి పనికివచ్చు ఒక నియమము కాగా, అసాధారణ పురుషుడు ఎక్కువ నిరపేక్ష సిద్ధికి సాగిపోవలసి యుండును; శాస్త్రము నియత ధర్మముల ఒక విధానము కాగా, అతడు పరమాత్మ స్వాతంత్ర్యమున నివసింప నేర్చుకొనవలసియున్నది.

4. <u>సాత్త్వికశ్రద్ధా ప్రభావము</u>: కాని కామనిర్దేశము, సామాన్యశాస్త్రము - రెండింటిని విడిచివేసి సాగు కర్మ కిపుడేది సురక్షితాధార మగును? ఏలన కామ విధానమునకు స్వయముగా నొక ప్రామాణ్య మున్నది; అది పశుపునకు లేక బహుశః ఆదిమమానవునికివలె మనకు సురక్షితము లేక సంతృప్తికరము గాకపోయినను, తన పరిధిలో మన ప్రకృతియొక్క ఒక మిక్కిలి సజీవభాగముపై ప్రతిష్ఠితము మఱియు దాని సూచనలచే పరిరక్షితము నై యుండును; అటులే శాస్త్రోపదేశము వెనుకను చిరప్రతిష్ఠిత విధానముయొక్క సర్వాధికారము, ప్రాచీన సఫల ప్రమాణములు మఱియు నొక భద్ర గతానుభవము నుండును. కాని ఈ నూతన ప్రస్థానస్వరూపము అజ్ఞాతము లేక అర్ధజ్ఞాతములోనికి ఒక ప్రబలప్రవేశము, ఒక నిర్భయవికాసము,

ఒక నూతనవిజయము నగును; కాని యిచ్చట అనుసరించవలసిన సూత్ర మేది ? దీని కాధారము కాగల నిర్దేశక ప్రకాశము లేక మన సత్తయందు దీని ప్రబలాధారము నేది యగును ? ఆ సూత్రము, ఆ ఆధారము మానవుని "శ్రద్ధయందు" (17–2), అనగా తాను తన మఱియు ప్రపంచముయొక్క సత్యముగా చూచు లేక చింతించు దానిని విశ్వసించి, అనుష్ఠించగోరు సంకల్పమునందు లభించును. వేఱు మాటలలో ఈ ప్రవృత్తియందు మానవుడు తనకుదానే ప్రమాణ మగును, లేక తన సత్యమును, తన జీవనవిధానమును, తన సంసిద్ధిమార్గమును గనుగొనుటకు తనయందలి లేక ప్రపంచమునందలి ఒకానొక ప్రబల అనివార్య వస్తువును ప్రమాణముగా గొనును. ఇచ్చట సర్వమును అతని శ్రద్ధాస్వరూపముపై నాధారపడును, ఆ శ్రద్ధ నతడు దేనివైపునకు మఱల్చునో, ఆ శ్రద్ధచేత నతడు తన వాస్తవాత్మను, సర్వాత్మను ఏ మేరకు చేరుకొనునో దానిపై నాధారపడును. అతడు తామసికుడు, అప్రకాశుడు, ఆవృతుడు నగుచో, అతని విశ్వాసము అజ్ఞానమయము, అతని సంకల్పము అకుశలము నగుచో, అత డెట్టి సత్యవస్తువును చేరుకొనక, తిరిగి నిమ్న ప్రకృతిలోనికే పడిపోవును. అటులే అతడు మిథ్యా రాజసిక ప్రకాశములచేత విమోహితు డగుచో, అతని స్వైర సంకల్పముచేతనే మహాపంకము లేక పర్వత ప్రపాతమునకు దారితీయు ఉపమార్గములలోనికి లాగివేయబడును. ఈ రెండు సందర్భములందును అతని ఏకమాత్ర రక్షణావకాశము సత్త్వముయొక్క పునఃప్రాప్తి యందే లభించును; ఏలన ఆ సత్త్వము తన కారణములపై నొక ప్రకాశమయ వ్యవస్థను, విధానమును విధించి, తన స్వైరసంకల్పముయొక్క ప్రచండ భ్రాంతి నుండియు, తన ఆవృతాజ్ఞానముయొక్క మంద భ్రాంతినుండియు నతనిని విడిపించును. అట్లు గాక, అతనికి సాత్త్విక ప్రకృతియు, పురోగతి నిమిత్తము సాత్త్విక శ్రద్ధ మఱియు నిర్దేశము నున్నచో, ఇంకను సిద్ధించని, ఒక ఉచ్చతర ఆదర్శవిధానము అతనికి దృగ్గోచర మగును; ఈ విధానము కొన్ని విరళసందర్భములందు, సత్త్వమున కావల, అస్తిత్వము మఱియు జీవనములయొక్క ఒక ఉచ్చతమ దివ్య ప్రకాశము మఱియు దివ్యమార్గము దిశగా కనీసము కొంతదూరము గొనిపోవును. ఏలన అతనియందలి సత్త్వప్రకాశము అతనిని తన స్వీయ పరాకాష్ఠకు గొనిపోవు నంత బలముగా నున్నచో, అతడా స్థానమునుండి పురోగమించుచు, దివ్యము, అతీతము, నిరపేక్షము నగు దానియొక్క ఒక ప్రథమకిరణములోనికి తన ప్రవేశ ద్వారమును కనుగొన సమర్థుడగును. ఆత్మాన్వేషణయొక్క సర్వప్రయత్నము

నందును ఈ సంభావ్యతలు పొడసూపును ; ఇవి ఈ ఆధ్యాత్మిక సాహసముయొక్క నిబంధనలు.

5. పురుషుడు శ్రద్ధామయుడు : ఆధ్యాత్మికోపదేశము మఱియు ఆత్మాను శాసనమునకు సంబంధించిన తన స్వీయమార్గమున గీత ఈ ప్రశ్న నెట్లు పరిష్కరించునో, మన మిపుడు చూడవలసియున్నది. ఏలన అర్జునుడు వెనువెంటనే వేసిన ఒక సూచక ప్రశ్నమునుండి పై సమస్య లేక దాని ఒక పార్శ్వము ముందుకు వచ్చును. మానవులు – అర్జును డడుగును – శ్రద్ధతో భగవంతునికి లేక దేవతలకు యజ్ఞము చేయుచు, శాస్త్రవిధిని మాత్రము పరిత్యజింతురేని, అపుడు వారి కీ శ్రద్ధ నిచ్చుచు, వారి నిట్టి కార్యమునకు పురికొల్పు వారి "నిష్ఠ", అనగా ఏకాగ్ర యజన సంకల్ప మేమి యగును ? అది సత్త్వమా, రజస్సా, తమస్సా ? అనగా నది మన ప్రకృతిగుణములలో దేనికి చెందును ? (17–1). గీతాసమాధానము ముందీ సూత్రము ను ప్రతిపాదించును : ప్రకృతియందలి అన్ని వస్తువులవలెనే, మనయందలి శ్రద్ధయు త్రివిధము, అది ప్రకృతియొక్క ప్రధానగుణమును బట్టి మాఱుచుండును (17–2). ప్రతిమానవుని శ్రద్ధయు అతని సత్తాపదార్థము, అతని సంఘటక (constituting) స్వభావము, అతని నైసర్గిక సత్త్వశక్తి దాని కిచ్చిన రూపమును, వర్ణమును, గుణమును గ్రహించును – "సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా" (17–3). మఱియు దీని తర్వాత వచ్చు ఒక ఒక అద్భుతపంక్తియందు – ఈ పురుషుడు, మానవునియందలి ఈ అంతరాత్మ, ఇంచుమించు శ్రద్ధా నిర్మితుడు—అని గీత మనకు చెప్పును – ఇచ్చట శ్రద్ధ యన ఒక విశ్వాసము, ఒక అస్తిత్వసంకల్పము, అంతరాత్మకు తనయందును, ప్రపంచమునందును ఒక నమ్మకము; మఱియు అతని శ్రద్ధ ఏది యగునో, అత డదియే యగును, అది అతడే యగును–"శ్రద్ధామయోఽయం పురుషో, యో య చ్ఛ్రద్ధః సఏవ సః" (17–3). ఈ అర్థగర్భిత సూక్తిని ఇంచుక నిశితముగా పరిశీలింతు మేని, ఆధునిక ప్రయోగవాదముయొక్క (pragmatism) సిద్ధాంత మంతయు ఈ ఏకమాత్ర పంక్తియొక్క కొలది బలీయపదములలో నిమిడియున్న దని కనుగొనగలము. ఏలన పురుషుడు శ్రద్ధానిర్మితుడే యగుచో, అపు డతడు దర్శించి, జీవింపగోరు సత్యము అతనికి తన సత్తయొక్క సత్యమే యగును, తాను సృజించుకొనిన, సృజించుకొనుచున్న తనయొక్క సత్యమే యగును, మఱియు నతనికి ఎట్టి ఇతర వాస్తవ సత్యము నుండజాలదు – అని తెలును. ఈ సత్యము

అతని ఆంతర మఱియు బాహ్య క్రియకు సంబంధించిన వస్తువు, అతని సంభూతికి, అంతరాత్మ గతిశాస్త్రమునకు సంబంధించిన వస్తువు, అంతే కాని, అతనియందు ఎప్పటికి మాఱని తత్త్వమునకు సంబంధించినది కాదు. అతని ప్రస్తుత రూపమునకు కారణము అతని ప్రకృతియొక్క ఒక గత సంకల్పము కాగా, ఈ రూపమును తెలిసికొని, నమ్మి, బుద్ధియందును, ప్రాణశక్తియందును తదాకారముగా నుండగోరు ప్రస్తుత సంకల్పముపై ఇప్పటి రూపము నిలబడి, కొనసాగును, మఱియు తన స్వభావమూలమునందు సక్రియముగా నున్న ప్రస్తుత సంకల్పమును, విశ్వాసమును ఏ మలుపు దిరుగునో, అతడు భవిష్యత్తునందు తద్రూపములోనికి పరిణమించును. మనః ప్రాణముల మన స్వీయ కర్మయందు మనము మన స్వీయ జీవనసత్యమును సృజించుకొందుము, అనగా మనమే మన స్వీయ స్వరూపములను నిర్మించుకొందుము; మనమే మన స్వీయ నిర్మాతలము.

6. <u>సంభూతిసత్యము–సత్తాసత్యము</u> : కాని యిది మిక్కిలి స్పష్టముగా సత్యముయొక్క ఒక పక్షము మాత్రమే మఱియు పాక్షిక ప్రతిపాదన లన్నియు మేధావికి సందేహాస్పదములు. మన స్వీయ వ్యక్తిత్వమేదిగా నున్నదో లేక దేనిని సృజించునో, అది మాత్రమే సత్యము గాదు; అది మన సంభూతిసత్యము మాత్రమే, ఒక విశాలతమ గతియందు ఒక విస్పష్ట బిందువు లేక రేఖ మాత్రమే. మన వ్యక్తిత్వమున కావల, ముందు, ఒక వైశ్వ సత్తయు, ఒక వైశ్వ సంభూతియు గలదు; మన సంభూతి ఈ సంభూతియొక్క ఒక స్వల్పవృత్తి. మఱియు దానికావల సైతము నిత్యసత్త గలదు, దీనినుండియే సమస్త సంభూతియు ప్రవర్తించును (10–8) మఱియు ఈ సంభూతియొక్క శక్యతలు, తత్త్వములు, మూల మఱియు చరమ హేతువులు దీనికే చెందును. అయినను మన మిట్లు చెప్పవచ్చును : సంభూతి యంతయు వైశ్వచేతనయొక్క ఒక చేష్ట మాత్రమే, అది మాయ, సంభూతిసంకల్పముయొక్క ఒక సృష్టి ; మఱియు ఏ యితర సద్వస్తువైన యున్నచో, అది చేతన కావలనుండు, నిరాకారము, అవర్తితము, అవర్ణనీయము నగు ఒక శుద్ధ సనాతన సత్త యగును. ఇదియే వస్తుతః మాయావాది అవలంబించు దృక్కోణము, మఱియు నిదియే ఒక వైపున మాయామయ లేక తాత్కాలికమగు వ్యావహారిక సత్యమునకును, రెండవ వైపున మాయాతీత అద్వితీయ నిర్విశేష బ్రహ్మమునకును మధ్య అతడు చేయు విభేదముయొక్క ఆశయము. కాగా ఆధునిక

వ్యావహారిక వాదము సంభూతినే యథార్థ సత్యముగా, కనీసము గుర్తింపదగిన ఏకమాత్ర సద్వస్తువుగా తీసికొనును, ఏలన అదియే తెలిసికొని, వ్యవహరించదగిన ఏకమాత్ర సద్వస్తువు. కాని గీతాదృష్టిలో పరబ్రహ్మము పరమపురుషుడు గూడను (10–12), మఱియు పురుషుడు సదా ఒక సచేతన ఆత్మ యగును; అయితే ఇతని సర్వోన్నత చేతన – దీనినే అతిచేతన యని చెప్పవచ్చును – అటులే మనము అవచేతన యని పిలుచు ఇతని నిమ్నతమ చేతన – ఈ రెండును మనము దేనిని మాత్రమే చేతన యని పిలుచుట కలవడి యున్నామో, అట్టి మనశ్చేతనకంటె మిక్కిలి భిన్నము. ఆ పరమ అతిచేతనయందు అమృతత్వముయొక్క ఒక పరమ సత్యము మఱియు ధర్మము గలదు, ఒక మహత్తమ దివ్య సత్తాప్రకారము, అనగా సనాతన అనంతముయొక్క వస్తుప్రకారము గలదు. ఆ సనాతన జీవనవిధము మఱియు దివ్యసత్తాప్రకారము పురుషోత్తముని నిత్యతయందు ఉండనేయున్నవి, కాని, దాని నిక్కడ మన మిప్పుడు మన సంభూతియందు సైతము యోగముద్వారా సృజింప యత్నించుచున్నాము. మన ప్రయత్న మంతయు భగవంతు డగుటకే, అతనివలె నుండుటకే – "మద్భావ" (17–19). ఆ ప్రయత్నమును శ్రద్ధపై సాధింపడును. మన సచేతన సత్త్వముయొక్క కర్మచేతను, భగవద్భావసత్యమునందలి నమ్మకముచేతను, దానిని జీవించుటకు లేక అదిగా నుండుటకు ఒక అంతరతపు సంకల్పముచేతను భగవద్భావము ప్రాప్తమగును. దాని నిక పొంద నున్నాము గాన, అది యిప్పటికే పరమున లేదని అర్థము గాదు. దానిని దర్శించి, దానిలోనికి క్రొత్తగా మనలను సృజించుకొనువఱకు అది మన బాహ్యమనస్సునకు లేనిదే యైనను, అది సనాతనునియందు ఉండనేయున్నది మఱియు నిప్పటికే అది మన రహస్యాత్మయందు ఉన్న దని సైతము చెప్పుకొనవచ్చును; ఏలన మనయందు గూడ – మన లోతులయందు – పురుషోత్తముడు సదా ఉండనేయున్నాడు. కాగా భగవద్భావములోనికి మన సంవర్ధనము, దానిని మనము సృజించుట యన అతనియొక్కయు, దానియొక్కయు మనయం దభివ్యక్తియే యగును. సమస్త సృష్టియు, అది నిజానికి సనాతనపురుషుని సచేతనసత్త్వమునుండి ప్రవర్తించును గాన, అతనియొక్క ఒక అభివ్యక్తియే యగును, మఱియు ప్రవర్తకచేతనయగు చిచ్ఛక్తియందలి ఒక విశ్వాసము, అంగీకారము, అస్తిత్వసంకల్పముచేత ప్రవర్తించును.

7. సర్వసాధనలోను తపో దాన యజ్ఞములు : కాని మన ప్రస్తుత విషయము దార్శనిక విచారణ గాదు, మన సత్తయందలి ఈ సంకల్పము లేక శ్రద్ధకు, దివ్యప్రకృతియొక్క సంసిద్ధిలోనికి పెరుగుటకు గల మన సంభావ్యతతో నుండు సంబంధము మన ప్రస్తుత విషయము. ఎట్టి సంసిద్ధి కైనను ఈ శ్రద్ధారూప శక్తియే ఆధారము. మన కోరికల ననుసరించి జీవించుచు, కర్మచేయుచు, తద్రూపమున నుండు నప్పుడు, అది మన ప్రాణిక మఱియు భౌతిక, తామసిక మఱియు రాజసిక ప్రకృతికి జెందిన శ్రద్ధయొక్క ఒక పట్టుపీడని చర్య యగును. తర్వాత, మనము శాస్త్రము ననుసరించి వర్తింప, జీవింప మఱియు కర్మచేయ ప్రయత్నించు నపుడు, అదియు పట్టు పీడని ఒక శ్రద్ధాచర్యయే యగును, అయితే ఈ శ్రద్ధ - అది గతాను గతిక శ్రద్ధ గాదేని - సాత్త్వికప్రవృత్తికి జెందిన దగును, ఏలన ఈ ప్రవృత్తి మన రాజసిక, తామసిక భాగాలపై తన శాసనమును విధింప సదా పరిశ్రమించుచుండును. పోగా ఈ రెండింటిని విడిచి, మనము స్వయముగా గనుగొనిన లేక వైయక్తికముగా నామోదించిన ఒక ఆదర్శమును లేక సత్యముయొక్క ఒక నూతన భావన ననుసరించి జీవింప, కర్మచేయ మఱియు తద్రూపముగా నుండ ప్రయత్నించు నపుడు, అదియు పట్టుపీడని ఒక శ్రద్ధాచర్యయే యగును, అయితే ఈ శ్రద్ధ, మన ప్రతి ఆలోచనను. సంకల్పమును, భావమును, కృత్యమును సదా నియమించుచుండు త్రిగుణములలో దేని ప్రభావమునకైనను లోనుగావచ్చును. చివరకు దివ్యప్రకృతి ననుసరించి వర్తింప (to be), జీవింప మఱియు కర్మచేయ ప్రయత్నించు నపుడు, అపుడు సైతము మనము పట్టుపీడని ఒక శ్రద్ధాచర్యను బట్టియే సాగవలెను; కాగా ఈ శ్రద్ధ గీతామతమున, తన పరాకాష్ఠవఱకు బ్రాపించి, తన స్వీయ సునిర్దిష్ట పరిమితులను దాటిపోవ నాయత్తమగు సాత్త్విక ప్రకృతికి జెందిన శ్రద్ధ యగును (18-20). కాని ఈ శ్రద్ధ లన్నియు, ప్రతి శ్రద్ధయు ప్రకృతియొక్క ఒక గతిని లేక అవస్థాంతర మును సూచించును, అన్నియు ఒక ఆంతర లేక బాహ్య లేక ఉభయవిధ క్రియ నపేక్షించును. అయితే ఈ క్రియాలక్షణ మేమి యగును ? గీత మన "కర్తవ్య కర్మ" యొక్క మూడు ప్రధాన భాగములను జెప్పును, ఇవి యజ్ఞము, దానము మఱియు తపము (17-27). ఏలన బాహ్యసన్న్యాసమునకు మఱియు ఆంతరసన్న్యాసము నకు-"సన్న్యాసమునకు మఱియు త్యాగమునకు" (18-1) గల భేదమును అర్జునుడు తెలిసికొనగోరి నపుడు, యజ్ఞ దాన తపములను ఎంతమాత్రము పరిత్యజించరాదు,

వానిని సర్వథా చేయుచుండదగును, కారణము, అవి మన "కర్తవ్యం కర్మ", అని ప్రాజ్ఞులను పావనము చేయును—అని కృష్ణుడు పట్టుబట్టును (18–5). వేఱు మాటలలో, ఈ కర్మలు మన సంసిద్ధిసాధనములు. కాని వీనిని అజ్ఞులు అజ్ఞానముతోనో, అపూర్ణ జ్ఞానముతోనో చేసి నపు డా ఫల ముండదు. సర్వ ప్రగతిశీల క్రియను తన మూలమునందు ఈ మూడు అంశములలోనికి విభజించవచ్చును. ఏలన ప్రకృతి యొక్క సమస్త గతిశీల క్రియయందును ఒక ఐచ్ఛిక లేక అనైచ్ఛిక తపస్య యిమిడియుండును—తపస్య యనగా మన శక్తుల లేక సామర్థ్యముల లేక ఒకానొక సామర్థ్యముయొక్క ఉద్దీపనము మఱియు ఏకాగ్రత—"తపస్", ఇట్టి తపస్సు ఒక దానిని సాధించుటకు, ఆర్జించుటకు లేక అగుటకు సాయపడును. అటులే సమస్త క్రియయందు మన స్వరూపమును లేక సంపత్తిని దానముచేయుట ఇమిడియుండును — "దానం", ఇది ఆ సాధనకు, ఆర్జనకు లేక అగుటకు మనము చెల్లించవలసిన మూల్యము. అటులే చివరకు, సర్వ క్రియయందును ఆధిభౌతిక లేక వైశ్వశక్తులకు గాని, మన కర్మయొక్క పరమప్రభువునకు గాని చేయబడు ఒక యజన ఇమిడి యుండును — "యజ్ఞము" (18–3). కాగా, ప్రశ్న యేమన, మన ఈ కర్మలను అచేతనముగా, ఉదాసీనముగా లేక ఉత్తమపక్షమున, ఒక అప్రబుద్ధ అజ్ఞానమయ అర్ధచేతన సంకల్పముతో చేయుచున్నామా ? లేక అవివేకముగానో, విపరీతముగానో సచేతనమగు సంకల్పముతో చేయుచున్నామా ? లేక సవివేకముగా సచేతనమగు జ్ఞానమూల సంకల్పముతో చేయుచున్నామా ? వేఱు మాటలలో మన యజ్ఞ దాన తపములు తమ స్వభావమునందు తామసికములా, రాజసికములా, సాత్త్వికములా ?

8. త్రివిధాహారము : ఏలన ఇచ్చట భౌతికవస్తువులతో గూడ సమస్తము ఈ త్రివిధ స్వభావమును పంచుకొనును. ఉదాహరణకు, గీత ననుసరించి, మన ఆహారము, దాని స్వభావము మఱియు శరీరముపై దాని ప్రభావమును బట్టి, సాత్త్వికము, రాజసికము, లేక తామసిక మగును. ఏ వస్తువులు ఆయువును, బాహ్యాభ్యంతర బలమును వృద్ధి చేయునో, మానసిక ప్రాణిక భౌతిక శక్తికి పుష్టి నిచ్చునో, మనఃప్రాణశరీరముల ప్రీతిని, తృప్తిని, సౌఖ్యమును పెంపొందించునో, అనగా నేవి రసపూర్ణములు, తైలాన్వితములు, స్థిరపోషకములు, మనోహరములో — మానసిక, భౌతిక శరీరమునందలి సాత్త్విక స్వభావము సహజముగనే వానివైపునకు దిరుగును (17–8). అటులే ఏ ఆహారము మిక్కిలి పులుపు, కారము, వేడి, తీక్ష్ణము,

కష్టక్లేశము మఱియు దాహము బుట్టించునదిగా నుండునో, అనగా మనఃశరీరముల అనారోగ్యమును, దుఃఖశోకమును వృద్ధి బొందించునో, అట్టి ఆహారమును రాజసిక స్వభావము సహజముగనే అభిలషించును (17-9). చివరకు ఏది శీతము, అశుచి, రసహీనము, పాచినది లేక రుచిహీనముగ నుండునో, అట్టి ఆహారమునందు తామసిక స్వభావ మొక వికృత ప్రీతిని బొందును. మఱియు ఇతరులు తినగా మిగిలిన ఆహారమును సైతము అది పశువుల వలె నామోదించును (17-10). ఈ త్రిగుణ సూత్రము సర్వానుగతము. గుణములు, రెండవ కొసను, అదే విధముగా, మనస్సు మఱియు ఆత్మకు సంబంధించిన వస్తువులకును, విశేషించి యజ్ఞదానతపములకును వర్తించును. కాగా గీత ఈ మూడింటిలో ప్రతిదానికిని గుణభేదముచేత మూడు రూపములను వివేచించును, ఈ వివేచనయందు గీత ప్రాచీన భారతీయ ప్రతీక వాదము (symbolism) ననుసరించును. కాని, గీత యజ్ఞ భావమున కిచ్చు విశాలార్థమును గమనించి, ఈ ప్రతీకవాదముయొక్క సంకేతముల బాహ్యార్థమును విస్తృతపఱచి, ఒక విముక్తతర మర్మములోనికి వాని ద్వారము నెంతయు తెఱవ వచ్చును. మఱియు వానిని తమస్సునుండి సత్త్వమువఱకు, వ్యతిరేకక్రమమున విచారించుట అనుకూలముగా నుండును; ఏలన మన నిమ్న ప్రకృతిలోపలనుండి వెలువడి, ఒక విశిష్ట సాత్త్విక పరిసమాప్తి మఱియు స్వ-అతిక్రమణముద్వారా దివ్య ప్రకృతి మఱియు గుణాతీతక్రియలోనికి ఎట్లు ఆరోహహించగలమో మన మిపుడు విచారించుచున్నాము.

9. <u>విధిహీన తామసికయజ్ఞము</u> : దేనిని మనము విశ్వాసము వినా, అనగా నెట్టి పూర్ణ సచేతన భావము, అంగీకారము మఱియు సంకల్పము వినా ప్రకృతిబలాత్కారముచేత చేయుదుమో, అది తామసిక యజ్ఞము (17-13). చేయక పోవుటచేత సంభవించగల ఒకానొక అధికతర బాధను తప్పించుకొనుటకో, తదితర తామసిక హేతువుచేతనో, తామసికయజ్ఞము యాంత్రికముగా చేయఃబడును; జీవన వ్యాపారమే దానిని విధించును గాన, అది స్వయముగా మనచేతికి వచ్చును గాన మఱియు దాని నితరులును చేయుదురు గాన, అది చేయబడును. మనలో నీ తామసిక స్వభావము నిండుగా నున్నచో, అసావధానముగా, నిరుత్సాహముగా, అయుక్తమార్గమున దానిని చేయుట సంభవించగలదు. అది సరియగు శాస్త్రవిధి ననుసరించి నిర్వర్తించబడదు; (దీని విస్తృతార్థము) జీవనముయొక్క కళ మఱియు

విజ్ఞానము, అటులే కర్తవ్యకర్మయొక్క యథార్థవిజ్ఞానము నిర్ణయించు సత్యపద్ధతి ననుసరించి అది నిర్వర్తింపబడదు (17-13). ఇట్టి యజ్ఞమున అన్నదాన ముండదు (17-13)—ఆ దానము భారతీయ కర్మకాండమునందు, వాస్తవ యజ్ఞరూపమగు ప్రతి క్రియయందును అంతర్నిహితముగా నుండు సహాయక దానముయొక్క వివిధ రూపములకు ప్రతీక యగును, ఇది యితరులకు చేయబడు అపరిహార్య దానము, ఇతరులకు, ప్రపంచమునకు నివ్వబడు ఫలప్రద సాహాయ్యము; ఇది లేనిచో, మన క్రియ సర్మథా స్వవిషయక మగును, మఱియు సంఘీభావ, పరస్పరవినిమయము లను నిర్ణయించు యథార్థ వైశ్వధర్మముయొక్క ఒక ఉల్లంఘన మగును. మఱియు ఆ కర్మ దక్షిణ యివ్వకయే చేయబడును—దక్షిణ యన యజ్ఞక్రియను నడుపు పురోహితుల కిచ్చు దానము లేక ఆత్మదానము; ఈ పురోహితుడు మన కర్మయొక్క బాహ్య నిర్దేశకుడు మఱియు సహాయుడు గాని, మనలోపలి ఆవృత లేక అభివ్యక్త భగవంతుడు గాని కావచ్చును. అటులే తామసయజ్ఞము మంత్రహీనముగా చేయ బడును—మంత్ర మన, యజ్ఞముచే మన ముపాసించు దేవతాభిముఖముగా నుద్ధరించ బడిన మన సంకల్పజ్ఞానముల పవిత్రశరీరమగు సమర్పణాత్మక ఆలోచన. తామసిక మానవుడు తన యజ్ఞమును దేవతలకు గాక, స్థూలతర ప్రేతముల కర్పించును (17-4)—ఈ ప్రేతములు తెరవెనుకనుండి అతని కర్మలను భక్షించుచు, అంధకార మును కల్పించి, అతని జీవితమును శాసించును.

10. <u>రాజసిక సాత్త్విక యజ్ఞములు</u> : రాజసిక మానవుడు తన యజ్ఞమును అవర దేవతలకు గాని, దుష్టశక్తులు, విత్తపాలకులు నగు యక్షులకు గాని, ఆసురిక మఱియు రాక్షసిక బలములకు గాని అర్పించును (17-4). అతని యజ్ఞము బాహ్యముగా శాస్త్రము ననుసరించి చేయబడినను, దాని ఆంతరహేతువు దంభము, గర్వము లేక కర్మఫలముపట్ల ప్రబలకామము, తన కర్మయొక్క ప్రతిఫలము నిమిత్తము గట్టి పట్టు (17-12). కావున ప్రచండము లేక ఆహంకారికమగు వైయక్తిక కామము నుండి గాని, స్వీయప్రయోజనార్థము ప్రపంచముపై తనను విధించుకొన జూచు దాంభిక సంకల్పమునుండి గాని ప్రవర్తించు కర్మ యంతయు రాజసికమే యగును - పవిత్రకాశలాంఛనముల వేషము వేసికొన్నను, బాహ్యానికి యజ్ఞరూపమున నది చేయ బడినను, దాని స్వభావము రాజసికమే. పైకి అది భగవంతునికి లేక దేవతలకు అర్పింపబడినను, అది వస్తుతః ఆసురిక క్రియయే యగును. మన కర్మల మూల్యము

మన ఆంతరిక అవస్థ, ప్రేరణ మఱియు నిర్దేశమును బట్టియే యుండును గాని, పైకి కన్పించు దిశను బట్టి మాత్రమే యుండదు; ఆ కర్మల ప్రమాణీకరణమునకు మనము పిలుచు భగవన్నామములను బట్టియు నుండదు, చివరకు కర్మాచరణమునందు మనలను సమర్థించుచున్నట్లు గన్పించు విశుద్ధ బౌద్ధిక విశ్వాసమును బట్టి సైతము నుండదు. ఎక్కడెక్కడ మన కర్మలయందు అహంకారప్రాబల్య ముండునో, అచ్చటవి రాజసిక యజ్ఞమగును. దీనికి ప్రతిగా, యథార్థ సాత్త్వికయజ్ఞము మూడు లక్షణముల చేత గుర్తించబడును, అవియే దాని స్వరూపమును మౌనముగా చెప్పు ముద్రయగును. ఒకటి, అది ఒక కార్యసాధక సత్యముచేత ప్రేరితమగును, శాస్త్రవిధి ననుసరించి ఆచరింపబడును, అనగా సముచిత సూత్రము ననుసరించి, యథాయథ పద్ధతి మఱియు విధి ననుసరించి, మన కర్మయొక్క యథార్థ లయ క్రమము మఱియు నియమము ననుసరించి, వాని సత్యవృత్తి, వాని ధర్మము ననుసరించి ఆచరింపబడును (17-11). దీని అర్థమేమన, బుద్ధియు, ప్రబుద్ధ సంకల్పమును-కర్మసోపానములు మఱియు వాని ప్రయోజనముయొక్క నిర్దేశకములు, నిర్ణాయకములు నగును. రెండవది, సత్యయజ్ఞముగా చేయవలసిన కర్మభావముపై మనస్సును కేంద్రీకరించి, స్థిరపఱచి, సాత్త్వికయజ్ఞము చేయబడును; దీనిని మన జీవనమును శాసించు ఒక దివ్యధర్మము మనపై విధించును, కావుననే అది ఒక సమున్నత ఆంతర బాధ్యత లేక అపరిహార్య సత్యముచేత మఱియు వైయక్తిక ఫలముపట్ల కామము వినా ఆచరింపబడును – కర్మప్రేరణయు, దానియందు ప్రయోగించబడిన శక్తిస్వభావమును ఎంతెంత నిర్వ్యక్తికమో, ఆ కర్మప్రకృతి అంతంత సాత్త్వికము. మఱియు చివరిది, ఈ సాత్త్వికయజ్ఞము అశేషముగా దేవతల కర్పించబడును (17-4); అది వారికి స్వీకారయోగ్య మగును, వారి ద్వారానే ఈశ్వరుడు జగత్తును శాసించును, కారణము, వారు జగదీశ్వరుని అవరకరూపములు మఱియు వ్యక్తిత్వములు.

11. <u>యజ్ఞాదర్శము, యజ్ఞాతిక్రమణము</u> : ఇట్లే సాత్త్వికయజ్ఞము యజ్ఞాదర్శమును మిక్కిలి సమీపించును, మఱియు గీత అపేక్షించు చరమ కర్మకు మనలను సరాసరి కొనిపోవును ; కాని తదాదర్శము చరమ, సర్వోన్నత ఆదర్శమును గాదు, ఆ కర్మ యింకను దివ్యప్రకృతియందు నివసించు పరిపూర్ణ మానవుని కర్మ యును గాదు. ఏలన అది యొక నియతధర్మముగా నిర్వహింపబడుచున్నది మఱియు

నది ఒక యజ్ఞముగానో, సేవగానో దేవతలకు, అనగా మనయందు లేక ప్రపంచము నందు అభివ్యక్తమైన భగవంతునియొక్క ఒక ఆంశిక శక్తికి లేక పార్శ్వమునకు అర్పించబడుచున్నది. నిస్స్వార్థ మతవిశ్వాసముచేతనో, స్వార్థరహితముగా మానవ జాతినిమిత్తమో, ధర్మము లేక సత్యముపట్ల గల నిష్ఠవలన నిర్వ్యక్తికముగానో అనుష్ఠింపబడు కర్మ సాత్త్వికస్వభావము గలది యగును ; మఱియు నవ్విధమగు కర్మ మన సంసిద్ధి కావశ్యకము. కారణము, అది మన బుద్ధిని, సంకల్పమును, మన ప్రాకృతద్రవ్యమును పావనముచేయును (18–5). కాని మనము అందుకొనవలసిన సాత్త్వికక్రియయొక్క పరాకాష్ఠ ఈ కర్మకంటెను గూడ విస్తృతతరము, విముక్త తరము నగు కోవకు జెందును ; అది తన సమగ్ర సత్తయందలి పరభగవంతుని కర్పింపబడు సమున్నత చరమ యజ్ఞము ; పురుషోత్తముని బొందగోరియో, సర్వమునందును వాసుదేవుని దర్శించియో చేయబడు యజ్ఞము; అది లోకహితార్థము, విశ్వమునందలి భగవత్సంకల్ప పరిపూరణార్థము నిర్వ్యక్తికముగా, విశ్వవ్యాపకముగా చేయబడు విశిష్టక్రియ. సత్త్వముయొక్క ఆ పరాకాష్ఠాప్రాప్తి స్వాతిక్రమణమునకు, అమరధర్మమునకు (14–27) దారితీయును. ఏలన అప్పుడు లభించు విముక్తియందు వైయక్తిక క్రియ యేమాత్రము నుండదు, సాత్త్విక ధర్మవిధి యుండదు, శాస్త్ర పరిమితత్వ ముండదు; హీనతర బుద్ధి మఱియు సంకల్పము స్వయముగా అతిక్రాంతము లగును మఱియు నప్పుడవి గాక, ఒక ఉచ్చతర జ్ఞానము కర్మ నాదేశించి నడుపుచు, దాని నప్రతిహతముగా లక్ష్యమునకు గొనిపోవును. ఇచ్చట వైయక్తిక ఫలముయొక్క ప్రశ్నయే యుండదు; ఏలన ఇచ్చట పనిచేయునది మన సంకల్పము గాదు. ఒక పరమ సంకల్పము, దానికి అంతరాత్మ ఒక ఉపకరణమాత్రము. ఇచ్చట స్వార్థపరతయు నుండదు, స్వార్థరాహిత్యము నుండదు; ఏలన భగవంతుని సనాతనాంశమగు జీవుడు తన జీవభావముయొక్క అత్యున్నతాత్మతో యుక్తుడగును మఱియు నతడును, అందరును తదాత్మ మఱియు పురుషునియందు ఏకముగా నుందురు. ఆ స్థితియందు వైయక్తిక క్రియ యుండదు, ఏలన సర్వకర్మలు మన కర్మప్రభువునందు అర్పించబడినవి (3–30) మఱియు దివ్యీకృత ప్రకృతిద్వారా యిపుడు కర్మ చేయున దతడే. ఇపుడు యజ్ఞముసైతము నుండదు – అయినను, యజ్ఞప్రభువు జీవునియందలి తన శక్తియొక్క కర్మలను తన స్వీయ విశ్వరూపము నందలి తననే అర్పించుకొనుచున్నాడని చెప్పిన చెప్పవచ్చును. ఇది యజ్ఞరూప కర్మ

చేత ప్రాప్తించు పరిమ స్వాతిక్రమణస్థితి, ఇది దివ్యప్రకృతిలో తన పూర్ణచేతనను ప్రాపించిన అంతరాత్మయొక్క పరిపూర్ణ స్థితి.

12. <u>తామసిక, రాజసిక తపస్య</u> : ఏ తపస్య ఒక అజ్ఞానావృత మూఢ భావముతో, తన మోహామునందు కఠినము, మూర్ఖము నగు భావముతో ఆచరింపబడునో, ఒక ప్రియ అసత్యమునందు గల అజ్ఞ శ్రద్ధచే సాగించబడునో, అది తామసిక తపస్య (17-19); ఒకానొక సంకుచిత నీచ అహంకారిక ప్రయోజనమపేక్షించి, తనపై ప్రయాసదుఃఖములను విధించుకొనుచు నిర్వర్తింపబడును, ఎట్టి సత్య లేక ఉదార లక్ష్యముతోను దీనికి సంబంధ ముండదు; అథవా ఇతరుల కపకారమొనరించు సంకల్పమునందు శక్తిని కేంద్రీకరించి చేయబడును. ఇట్టి శక్తి ప్రయోగమును తామసికము గావించున దెట్టి జడతా (inertia) తత్త్వమును గాదు, ఏలన జడత తపస్యకు విజాతీయము; పరంతు అది మనస్సు మఱియు ప్రకృతియం దుండు ఒక అంధకారము, ఆచరణయం దుండు ఒక నీచ సంకుచితత్వము, లేక లక్ష్యమునందు గాని, ప్రేరకభావమునందు గాని యుండు ఒక పాశవిక ప్రవృత్తి లేక కామము. పోగా, పూజా సత్కారముల నిమిత్తము, వ్యక్తిగత గౌరవము, బాహ్యయశము మఱియు మహత్త్వము నిమిత్తము లేక అహంకారిక సంకల్పము మఱియు నభిమానములయొక్క అనేకానేక హేతువులలో నొకదానివలన ప్రారంభించబడునవి రాజసిక తపోవిధానములు (17-18). ఈ తపోవిధానము ప్రత్యేక నశ్వర ప్రయోజనములకు వినియోగింపబడును, దీనివలన భగవన్ముఖ సంవృద్ధికిని, సంసిద్ధికిని ఎట్టి లాభము చేకూరదు, ఈ తపమునం దెట్టి స్థిర, సహాయక సూత్రము నుండదు, దీని శక్తి చలము, అధ్రువము నగు సందర్భముతో ముడివడియుండును, స్వయముగా గూడ నది చలము, అధ్రువము (17-18). ఒకవేళ దీనియందు చూచుట కొక ఎక్కువ ఆభ్యంతరము మఱియు నున్నతము నగు ఉద్దేశ్యము గన్పించినను, దీని విశ్వాస సంకల్పములు ఉచ్చతరకోటికి జెందిన వైనను, ఎట్టి దంభము లేక దర్పము లేక ప్రచండ స్వేచ్ఛ లేక ప్రబలకామమైనను దీనియందు ప్రవేశించినచో, అప్పుడు సైతము అది ఒక వివేకహీన, ఒక ఆసురిక, ఒక రాజసిక లేక రాజసిక - తామసిక తపస్యయే యగును (17-5); అటులే అది శాస్త్రవిరుద్ధమగు ఒక ప్రచండ, నియమశూన్య లేక భయంకరక్రియను నడుపునేని, అది జీవన కర్మల యదార్థ నియమమును ప్రతిఘటించుచు, తనకును, ఇతరులకును బాధాకరమగు నేని, ఆత్మ

పీడన మార్గమును బట్టి, మానసిక ప్రాణిక దైహిక తత్త్వములను హింసించు నేని, లేక మనలోపల అంతర సూక్ష్మశరీరమున ఆసీనుడై యున్న భగవంతుని పీడించు నేని, అపుడు సైతము దానిని రాజసిక తపస్య యనియే ఎఱుంగుము (17-6).

13. సాత్త్విక తపస్య, ఆత్మిక తపస్య : ఏ తపస్య ఉచ్చతమ ప్రబుద్ధ విశ్వాసముతో, హృదయాంతరాళమున అంగీకరించిన ఒక కర్తవ్యముగా చేయబడునో అది సాత్త్విక తపస్య; ఇది ఒకానొక నైతిక, ఆధ్యాత్మిక లేక తదితర ప్రయోజనార్థము చేయబడును గాని, బాహ్య సంకుచిత-వైయక్తిక కర్మఫలాకాంక్షతో చేయబడదు (17-17). దాని స్వభావము ఆత్మానుశాసనము గాన, అది ఆత్మసంయమమును, ప్రకృతిసామరస్యమును అపేక్షించును. గీత త్రివిధమగు సాత్త్వికతపస్యను వర్ణించును. ప్రథమము, భౌతిక, బాహ్యక్రియకు సంబంధించిన తపస్య; పూజ, యోగ్యుల సత్కారము, శరీర క్రియా జీవనముల శౌచము, నిష్కపట వ్యవహారము, బ్రహ్మచర్యము, అహింస ఈ శారీరిక తపస్యలోనికివచ్చును (17-14). ద్వితీయము, వాఙ్మయ తపస్య; శాస్త్రాధ్యయనము, సత్య ప్రియ హితకర వచనము, ఇతరులకు భయ శోక క్షోభములను గలిగించు మాటలను సావధానముగా వదిలివేయుట : ఇవి యీ తపస్య యగును (17-15). తృతీయము, మానసిక నైతిక సంసిద్ధిని సాధించు తపస్య, దీని అర్థము సమస్త స్వభావముయొక్క పావనీకరణము. సౌమ్యత్వము, మనస్సుయొక్క స్వచ్ఛ శాంత ప్రసన్నత, ఆత్మసంయమము మఱియు మౌనము (17-16). ఏది రాజసిక మఱియు నాహంకారిక ప్రకృతిని స్తిమితపఱచునో లేక అనుశాసనబద్ధముగావించునో, మఱియు దాని స్థానమున నేది శుభము మఱియు సుశీలముల ప్రసన్నశాంత తత్త్వమును ప్రవేశపెట్టునో, అది యంతయు నీ త్రివిధ సాత్త్విక తపమున వచ్చివేయును. ఇదియే ప్రాచీన భారతీయ సంస్కృతివిధానము అంతగా విలువనిచ్చి, ఆదరించిన సాత్త్వికధర్మ తపస్య. దీనికిని మించిన దీని పరాకాష్ఠ యొకటి గలదు, అది బుద్ధి సంకల్పముల ఒక సమున్నత శుద్ధి యగును, అంతరాత్మసమత, గంభీర శాంతి మఱియు స్థిరత, విశాల సానుభూతి యగును. మఱియు ఏకతాప్రాప్తికి సన్నాహము, మనఃప్రాణశరీరములందు అంతరాత్మ ప్రసన్నతయొక్క ప్రతిబింబము నగును. అచ్చటా ఉచ్చస్థానమున, నైతిక మిప్పటి కప్పుడే ఆధ్యాత్మిక ఆదర్శము మఱియు స్వభావములోనికి అడుగిడుచున్నది. మఱియు నీ సాత్త్విక పరాకాష్ఠను సైతము తననుదా నతిక్రమింప జేయవచ్చును, ఒక ఉచ్చతర

విముక్తతర ప్రకాశములోనికి లేవనెత్తవచ్చును, అట్లది పరప్రకృతియొక్క సుప్రతిష్ఠిత భాగవత శక్తిలోనికి అడుగిడి, రూపాంతరము జెందగలదు. అప్పుడిక మిగిలియుండునది అకళంక ఆత్మిక తపస్సు మాత్రమే, అనగా సర్వాంగములందు ఒక అత్యున్నత సంకల్పము మఱియు తేజోమయ శక్తి మాత్రమే; అది ఒక విశాల పరిష్ఠ శాంతియందును, ఒక గంభీర విశుద్ధ ఆనందమునందును పనిచేయును. అప్పుడిక తపస్య ఆవశ్యకత యుండదు, కారణము, అచ్చటంతయు (మన తపము గాక) సహజ సులభ దివ్య తపమే యగును. అచ్చట నిమ్నతర శక్తివిధానము యొక్క ఎట్టి పృథగాయాసము నుండదు, ఏలన ప్రకృతిశక్తి అచ్చట పురుషోత్తముని యొక్క అతీత సంకల్పమునందు తన మూలమును, ఆధారమును కనుగొనిన దగును. అప్పుడు, కర్మప్రారంభము ఆ సంకల్పమునకే జెందును గాన, నిమ్నస్తరములందు సైతము ఈ శక్తిక్రియలు ఒక అంతర్జాత పరిపూర్ణ సంకల్పమునుండి ప్రవర్తించును, ఒక అంతర్వర్తి పరిపూర్ణ మార్గనిర్దేశమును బట్టి కొనసాగును. ఇప్పటి ధర్మముల ఎట్టి పరిమితియు నచ్చటుండదు; ఏలన అచ్చటి విముక్త క్రియ రాజసిక, తామసిక ప్రకృతి కెంతో పైన చెలంగుటయే గాక, సాత్త్విక క్రియానియమముయొక్క అతి జాగరూక మఱియు సంకుచిత పరిమితుల కెంతో ఆవల విలసిల్లును.

14. దానము, సృష్టిరహస్యము : తపస్య వలెనే సమస్త దానమును అజ్ఞ తామసికము, దాంభిక రాజసికము లేక నిస్స్వార్థ జ్ఞానదీప్త సాత్త్వికమునై యుండును. తామసిక దానము దేశకాలపాత్రముల సముచిత చింతన లేకయే, అజ్ఞానముతో చేయబడును; అది ఒక బుద్ధిహీన, అనాలోచిత, నిజానికి ఒక స్వార్థపూర్ణ క్రియ యగును, అది ఒక అనుదార నికృష్ట త్యాగము, అది సానుభూతి లేక యథార్థ దానగుణము లేకయే యివ్వబడును, అది గ్రహీత చిత్తమును ఆదరించక చేయబడును గాన, అతడు స్వీకరించినను దాని నేవగించుకొనును (17-22). పోగా, విచారము, వైముఖ్యము లేక బాధతో, లేక ఒక వైయక్తిక మఱియు అహంకారిక ఉద్దేశ్యముతో, లేక ఎచ్చటినుండియైన ఎట్టి ప్రత్యుపకారమునైన ఆశించి, లేక గ్రహీతనుండి తుల్య లేక అధికలాభమును బొందగోరి చేయబడు దానము రాజసికము (17-21). చివరకు, యుక్తబుద్ధితోను, యుక్తసంకల్పముతోను, సహానుభూతితోను సముచిత దేశకాలములందు, సముచిత వ్యక్తికి గాని, ఆ దానము నిజముగా నుపయోగపడగల వ్యక్తికిగాని అర్పించబడు దానము సాత్త్విక దాన మగును (17-20).

ఇచ్చుట, ధర్మము గనుకను, హితకామనచేతను ఈ దాన మాచరింపబడును, దాన గ్రహీత పూర్వము తనకు చేసిన లేక యిక చేయనున్న లాభదృష్ట్యా ఈ దానము చేయబడదు, ఈ దానహేతువు ఎట్టి వైయక్తిక ప్రయోజనము గాదు. ఈ సాత్త్విక దానప్రకారము తన పరాకాష్ఠయందు ఇతరులకును, ప్రపంచమునకును, భగవంతుని కిని ఒక అధికాధిక ఆత్మప్రదానప్రక్రియయందు పరిణమించును – "ఆత్మదానం, ఆత్మసమర్పణం". ఇదియే గీత విధించిన కర్మయజ్ఞముయొక్క సమున్నత నివేదనము. మఱియు సత్త్వమును సైతము దాటి దివ్యప్రకృతియందు నెలకొనుట ఆత్మదానముయొక్క ఒక మహత్తమ పరిపూర్ణతయే యగును – ఈ ఆత్మదానము సృష్టియొక్క విశాలతమ అర్థముపై నాధారపడి చెలంగును. భగవంతుడు తనను, తన శక్తులను అర్పించుకొనుటచేతనే, ఆతని ఆత్మయు, సత్తయు సర్వభూతములలోనికి విరివిగా ప్రవహించుచుండుటచేతనే ఈ బహువిధ ప్రపంచము జనించి, నిరంతరము నిలచియున్నది. విశ్వ–అస్తిత్వము పరమపురుషుని యజ్ఞమని వేదము చెప్పును. సంసిద్ధి బొందిన అంతరాత్మయొక్క సర్వక్రియ సైతము అటులే తన మఱియు తన శక్తులయొక్క ఒక సంతత దివ్య ఆత్మదానమే యగును; భగవంతునియందును, ఆతని ప్రభావ బహిఃప్రవాహములచేత అంతరాత్మ తాను పొందిన జ్ఞానప్రకాశములను, ప్రేమానందములను, సహాయక శక్తిబలములను నలుదిశల ప్రవహింపజేయును, లేక భూతములకు తమ సామర్థ్యమును బట్టి వానిని పంచును. అది మని జీవనప్రభువునకు అంతరాత్మ చేయు సంపూర్ణ ఆత్మదానముయొక్క సంపూర్ణ ఫలితమగును.

15. ఓం తత్ సత్ : ప్రథమ దృష్టికి ఏదో రహస్యవిద్యగా గన్పించు ప్రసంగముతో గీత ఈ అధ్యాయమును ముగించును. ఓం తత్ సత్ – అను సూత్రము బ్రహ్మయొక్క త్రివిధ నిర్వచన మనియు, వీనిచేతనే పూర్వము బ్రాహ్మణులు, వేదములు మఱియు యజ్ఞములు నిర్మింపబడిన వనియు, వీని మర్మమంతయు ఆ బ్రహ్మయందే గల దనియు గీత వచించును (17–23), తత్ (అది) నిరపేక్షవస్తువును సూచించును. సత్ (ఉనికి) పరమ మఱియు విశ్వమయ సత్తయొక్క సారతత్త్వమును సూచించును. బహిర్ముఖ, అంతర్ముఖ లేక సూక్ష్మ, మఱియు అతిచేతన కారణపురుష భేదముచే త్రివిధమగు బ్రహ్మముయొక్క సంకేతము ఓం. ఓం (అ+ఉ+మ) యొక్క ప్రతి వర్ణమును ఉత్తరోత్తర

క్రమమున బ్రహ్మయొక్క ఒకొక అవస్థను సూచించును, మఱియు నీ అక్షరము తన సంపూర్ణరూపమున నిరపేక్షవస్తువున కెగయు చతుర్థావస్థను, తురీయమును, ఆవిష్కరించును. ఓం ప్రారంభకాక్షరము; ఆరంభమున ఆశీస్సుగను, అనుమతిగను దీని నుచ్చరించి, సమస్త యజ్ఞక్రియయు, దానక్రియయు, తపఃక్రియయు నారంభించ బడును; మన కర్మ అంతఃసత్తయందు త్రివిధ భగవంతుని ఒక ప్రకటనము గావలెను, భావము మఱియు ప్రేరణయందు భగవదభిముఖము గావలెను - అను సత్యమును ఓంకారము మనకు గుర్తుచేయును (17-24). అటులే ముముక్షువు లీ క్రియలను ఫలాపేక్ష లేక. తమ ప్రకృతివెనుక నుండు నిరపేక్ష భగవంతునియొక్క భావము, అనుభవము మఱియు ఆనందములచేతను మాత్రమే ఆచరింతురు (17-25). తమ కర్మలయందలి ఈ విశుద్ధి మఱియు నిర్వ్యక్తికతచేత, ఈ సమున్నత నిష్కామతచేతను, ఈ సువిశాల అహంకారశూన్యతచేతను, ఈ ఆధ్యాత్మిక సమృద్ధి చేతను వీరు ఆ తత్-రూప భగవంతునే అన్వేషింతురు. పోగా, తత్-న కర్థము శుభము మఱియు అస్తిత్వము. ఈ రెండును - శుభతత్త్వమును, అస్తిత్వ తత్త్వమును - సమస్త త్రివిధ క్రియల వెనుకను ఉండితీరవలెను. సమస్త శుభకర్మలు, అవి మన సత్తయొక్క ఉచ్చతర సత్యతకు అంతరాత్మను సిద్ధము చేయును గాన, సత్ - అని పిలువబడును (17-26); అటులే యజ్ఞదానతపములందు దృఢ నిష్ఠయు, యజ్ఞదానతపోనిమిత్తము చేయబడు సర్వ కర్మలును సత్-అనబడును, ఏలన అవి మన స్వరూపముయొక్క పరమసత్యమునకు ఆధారము నేర్పఱచును (17-27). మఱియు శ్రద్ధ మన జీవనముయొక్క కేంద్రతత్త్వము గాన, వీనిలో నేది శ్రద్ధావిరహితముగా చేయబడినను, అది అసత్ (అనృతము) - అనబడును; ఏలన దాని కిహమున గాని, పరమున గాని ఎట్టి అర్థము నుండదు, ఎట్టి సారము నుండదు; ఇహజీవనమున గాని, ఇచ్చటి మర్త్యజీవనానంతరము మన సచేతన స్వరూపముయొక్క మహత్తరలోకములందు గాని నిలిచియుండుటకు లేక సృజించుటకు దానియం దెట్టి సత్త గాని, శక్తి గాని యుండదు (17-28). అంతరాత్మ శ్రద్ధ కేవల భౌద్ధిక విశ్వాసము గాదు, పరంతు ఆ విశ్వాసమునకు అనురూపమగు సంకల్ప మగును, ఈ సంకల్పమే ఎఱుంగుటకు, చూచుటకు, నమ్ముటకు మఱియు తన ఎఱుకను, చూపును బట్టి ఆచరించుటకు మఱియు వర్తించుటకు యత్నించు శక్తి యగును; ఈ సంకల్పరూపమగు అంతరాత్మ శ్రద్ధయే తన శక్తిచేత మన సంభూతి

సంభవతలయొక్క మానమును నిర్ణయించును, మఱియు నిట్టి సంకల్పాన్విత శ్రద్ధయే మన సమస్త ఆంతర మఱియు బాహ్య ఆత్మయందును, ప్రకృతియందును, క్రియ యందును ఏది అత్యున్నతము, అతిదివ్యము, అతిసత్యము మఱియు నిత్యమో దాని కభిముఖమై, పరమ సంసిద్ధి నందుకొనుటకు మనలను సమర్థులను గావించును.

# 19. [1]గుణములు, మనస్సు, కర్మ

1. <u>మానసిక శక్తుల ఆవశ్యకత</u> : గుణములకును, తన పరాకాష్ఠ నందు కొనిన సాత్త్విక సాధనాసామర్థ్యముచే గుణాతిక్రమణమునకును సంబంధించిన మూలభావముయొక్క ప్రకాశమున, గీత యింకను తన కర్మవిశ్లేషణమును పూర్తి గావించలేదు. శ్రద్ధ అనగా సత్యమును నమ్ముటకు, తద్రూపముగా నుండుటకు, దానిని తెలిసికొనుటకు, అనుజీవించుటకు, అనుష్ఠించుటకు ప్రవర్తించు సంకల్పము; ఆ శ్రద్ధ స్వవికాససాధకమగు కర్మవెనుకను, ముఖ్యముగా కర్మచేత తన పూర్ణ ఆధ్యాత్మిక పరిమాణములోనికి అంతరాత్మయొక్క సంవర్ధనము వెనుకను గల ప్రధానాంశము, ఆవశ్యకశక్తి యగును. కాని కర్మకలాపముయొక్క వేగమును. దిశను, స్వభావమును నిర్ణయించు మానసిక శక్తులు, ఉపకరణములు మఱియు నిబంధనలును గలవు, కావున ఈ మానసిక సాధనయొక్క పూర్ణావగాహనకు ఇవియు ముఖ్యమే. గీత ముందు వీనిని సంక్షేపముగా వేఱుచేసి చూపి, పిమ్మట తన పరమ సిద్ధాంతమును ప్రతిపాదింపబోవును – అదియే గీతోపదేశమున కంతకు శిఖరాగ్రము, ఆధ్యాత్మికముగా సర్వధర్మములను దాటిపోవు, ఒక దివ్యాతిక్రమణరూపమగు పరమ రహస్యము (18–66). ఇపుడు మన మీ గీతా సంక్షిప్త వర్ణన ననుసరించుచు, ప్రధానభావమును పూర్ణముగా గ్రహించుట కవసరమగు మేరకే, దానిని విపులీకరించెదము. ఏలన, ఇవి గౌణవస్తువులే యైనను, ప్రతిదానికి తన స్థానమున, తన ప్రయోజనార్థము పెద్ద ప్రాముఖ్యమే యుండును. గుణముల మూసలో పోయబడిన వాని

---

[1] గీత : అధ్యాయము 18, శ్లోకాలు 1–39.

క్రియను సంక్షిప్త మూలవర్ణనమునుండి వెలికిదీసి, ప్రకటించవలసియున్నది. గుణముల కావల పీనిలో దేని పర్యవసానముయొక్క స్వరూపమైనను సర్వసామాన్య గుణాతీత స్థితియొక్క స్వరూపమునుండి స్వయముగానే స్పష్టపడును.

2. సన్న్యాసతత్త్వము, త్యాగతత్త్వము : సన్న్యాసతత్త్వము, త్యాగతత్త్వము మఱియు వాని విభేదమును గుఱించి అర్జును డడిగిన చివరి ప్రశ్నకు సమాధానముగా పై అంశము ప్రవేశపెట్టబడును (18-1). గీత ఈ విభేదమును మఱలమఱల ప్రస్తావించి, దానిని ఒత్తి చెప్పును; అది సముచితమే నని భారతీయమనస్సుయొక్క తర్వాతి చరిత్రను జూచిన మనకు విదితమగును; ఏలన గీత బోధించిన ఎట్టి కర్మ యైనను ఉత్తమపక్షమున సన్న్యాసముయొక్క పరమ అకర్మకు ఒక పూర్వాంగము మాత్రమే యని దానిని కించపఱచినది, ఆ మనస్సు. సన్న్యాసము లేక త్యాగము యొక్క ప్రసక్తి వచ్చినపుడు, ప్రపంచముయొక్క బాహ్యసన్న్యాసమే దాని కర్థ మని ప్రజలు గ్రహింతురు లేక దానికే ప్రాధాన్య మిత్తురు. కాగా గీత దీనికి శుద్ధ వ్యతిరేకముగా, వాస్తవత్యాగమున కాధారము ప్రపంచమునందలి జీవనకర్మలు గాని, ఆశ్రమానికి పలాయనము గాదని వక్కాణించును. వాస్తవత్యాగము కామ సన్న్యాసముతో గూడిన కర్మ మఱియు నదియే వాస్తవ సన్న్యాసము గూడను.

3. వాస్తవసన్న్యాసము : సాత్త్విక ఆత్మానుసంధానముయొక్క విమోచక కార్యకలాపము, నిస్సంశయముగా, సన్న్యాసభావముచేత వ్యాప్తము గావలసినదే, ఏలన సన్న్యాస మొక అవశ్యక తత్త్వము : కాని ఆ సన్న్యాస మెట్టిది, ఆ భావప్రకార మెట్టిది ? సన్న్యాసము ప్రాపంచిక కర్మసన్న్యాసము గాదు, ఎట్టి బాహ్య తపశ్చర్య గాదు, పైకి గన్పించు భోగత్యాగముయొక్క ఆడంబరము గాదు, పరంతు అది ప్రాణికకామము మఱియు అహంకారముయొక్క సన్న్యాసము, త్యాగము (=విడిచి వేయుట), కామాత్మయొక్క పృథగ్భూత వైయక్తికజీవనము, అహమదిష్ఠిత మానసము, మఱియు రాజసిక ప్రాణికప్రకృతియొక్క సన్న్యాసము (= దూరముగా నుంచుట) నగును. యోగశిఖరముల నారోహించుటకు (6-3) ఇదియే యథార్థ నిబంధనము, ఇది యున్నపుడే, నిర్వ్యక్తిక ఆత్మద్వారా గాని, విశ్వమయ వాసుదేవుని ద్వారా గాని, ఆంతరముగా గాని పరమపురుషోత్తమునిలోనికి ఆరోహించగలము. అప్పటి పరిభాషకు ప్రాధాన్య మిచ్చి చూతు మేని, సన్న్యాస మన కామ్యకర్మల

భౌతిక పరివర్జనము (విడిచిపేయుట); పోగా త్యాగ మన, ప్రాజ్ఞులు మానసిక, ఆధ్యాత్మిక సన్న్యాసమునకు పెట్టిన పేరు (18-2), అనగా నది మన కర్మఫలమునందు గాని, అసలు కర్మయందు గాని, వైయక్తిక కర్మప్రారంభమునందు గాని, వైయక్తిక రాజసికప్రేరణయందు గాని యుండు ఆసక్తి నంతను త్యజించిపేయుట యగును : సన్న్యాసత్యాగముల ఈ గీతావివేచన గమనార్హము (18-2). అట్టి అర్థమున సన్న్యాసము గాక, త్యాగమే శ్రేష్ఠతర మార్గము. మనము వర్జించవలసినది కామ్యకర్మలను గాదు, వానికి ఆ స్వభావమును గల్పించు కామమును. కర్మప్రభువుయొక్క విధానము ననుసరించి కర్మఫలము రావచ్చును, కాని దానినిమిత్తము కర్మచేయుట కొక నిబంధనగా నెట్టి కోరిక యుండరాదు. అథవా కర్మఫలము రానేరాకపోవచ్చును, అయినను కర్తవ్యకర్మగా, అంతఃస్థప్రభువు మననుంచి అపేక్షించు కర్మగా దానిని చేయవలసినదే. సాఫల్యవైఫల్యము లతని చేతులలో నుండును, తన సర్వజ్ఞ సంకల్పము మఱియు అగమ్యప్రయోజనము ననుసరించి వానిని నిర్ణయించును. కర్మ, సర్వకర్మ చివరకు సన్న్యస్తము గావలసినదే, అయితే విరమణముచేత, నిశ్చేష్టతచేత, జడత్వముచేత భౌతికముగా గాక, ఆధ్యాత్మికముగా మన సత్తయొక్క అధీశ్వరునియందు సన్న్యస్తము గావలెను - నిజానికి ఎట్టి కర్మ యైనను, అతని శక్తి చేతనే చేయబడగలదు. మనమే కర్తల మను మిథ్యాభావమును సన్న్యసించవలెను; ఏలన వాస్తవానికి మన వ్యక్తిత్వము మఱియు అహంకారముద్వారా పనిచేయునది విశ్వశక్తియే (3-27). కర్మప్రభువునకును, వాని శక్తికిని సర్వకర్మల ఆధ్యాత్మిక సమర్పణమే గీతాబోధనయందలి వాస్తవ సన్న్యాసము (3-30).

4. శాస్త్రనియతము, స్వభావనియతము, ఈశ్వరనియతము : ఏ కర్మలను చేయవలెను ? - అను ప్రశ్న ఇంకను ఉదయించును. చరమ బాహ్యసన్న్యాసమును సమర్థించువారికి సైతము ఈ కఠిన విషయమున ఏకాభిప్రాయము లేదు. అది అసలు సాధ్యమైనట్లు, మన జీవనమునుండి సర్వకర్మలను ఛేదించివేయవలె నని కొందరందురు (18-3). కాని మనము శరీరములోను, సజీవముగాను ఉన్నంతకాల మది సాధ్యము గాదు; మఱియు మన సక్రియసత్తను, సమాధి నవలంబించి, గడ్డ మఱియు రాతియొక్క నిర్జీవ నిశ్చేష్టతకు కుంచించుటయు ముక్తి గాదు. సమాధినీరవతయు ఈ సమస్యను పరిష్కరించదు, ఏలన మఱల శరీరములోనికి ఊపిరి వచ్చిన వెంటనే, సమాధి లబ్ధమగు ముక్తిశిఖరమునుండి టప్పున పడిపోదుము. కాని యథార్థ

ముక్తి, అహంకారముయొక్క ఆంతరసన్యాసము మఱియు పురుషోత్తమునితో సంయోగముచేత లభించిన విముక్తి ఎట్టి అవస్థయందైనను స్థిరముగా నిలిచి యుండును – ఈ లోకములోపల లేక దీనికి వెలుపల, అథవా సర్వలోకముల లోపల లేక వానికి వెలుపల నది నిలిచియుండును, అది స్వయంస్థితము – "సర్వథా వర్తమానోఽపి" (6-31), అది కర్మ లేక అకర్మపై నాధారపడదు (3-18). అయి నప్పుడు ఏ కర్మలను చేయవలెను ? ఐచ్ఛిక కర్మలలో భిక్షాటనము, ఆహారగ్రహణము, ధ్యానము మఱియు శరీరస్థితికి కేవల మావశ్యకమగు కర్మలను మాత్రమే చేయవచ్చు నని సంపూర్ణ సన్యాసవాది సమాధానించును – గీత దీనిని ప్రస్తావించలేదు, బహుశః ఇది ఆకాలమున అంత ప్రచలితము గాదు. కాని యింతకంటె నుదారము, సమగ్రము నగు సమాధానము, స్పష్టముగా యజ్ఞదానతపము లను మిక్కిలి సాత్త్వికకర్మలను మూడింటిని కొనసాగించుటయే యగును (18-3). మఱియు నివి నిశ్చయముగా చేయబడవలెను, కారణము, ఇవి మనీషులను పావనముచేయును (18-5) – అని గీత వక్కాణించును. కాని యింకను విశాలముగా, ఈ మూడు కర్మలను తమ విశాలతమార్థమున గ్రహించుచు, చేయవలసిన కర్మ "నియత కర్మ" (18-7), అనగా బాగుగా నియమితమైన కర్మ యని చెప్పవచ్చును – 1. యుక్తజ్ఞానము, యుక్తకర్మ, యుక్తజీవనములయొక్క విజ్ఞానము మఱియు కళారూపమగు శాస్త్రముచే నియమితకర్మ గావచ్చును, లేక అది "స్వభావనియతం కర్మ" (18-47) గావచ్చును, లేక చివరకు అది మనలోపలను, పైనను గల భగవదిచ్ఛచేత నియమితమైన కర్మ గావచ్చును (18-61), ఇదియే సర్వోత్తమము, ఇదియే ముక్తపురుషునియొక్క సత్యము, ఏకమాత్రము నగు కర్మ – "ముక్తస్యకర్మ" (4-23). ఈ కర్మలను సన్యసించుట తగిన చర్య గాదు – అని చివరకు గీత స్పష్టముగా, నిశితముగా విధించును – "నియతస్య తు సన్యాసః కర్మణో నోపపద్యతే" (18-7). ఈ ఉప సంహారణము సత్యవిముక్తిని సాధించగల దని, తెలియక నమ్మి, ఈ కర్మలను సన్యసించుట తామససన్యాస మగును (18-17). కర్మలలోవలెనే కర్మ సన్యాసము నందును గుణములు మనల ననుగమించు నని చూడదగును. "సంగో అకర్మణి" (2-47) – అకర్మయందు గల సంగమువలన చేయు సన్యాసము సైతము తామస మగును. మఱియు, అవి దుఃఖప్రదములు, అనగా శరీరమునకు కష్టము, మనస్సునకు ఖేదము గలిగించును – అని గాని, అంతయు ఒక ఆడంబరము మఱియు నాత్మకు ఒక సంతాపము – అని గాని నియతకర్మలను సన్యసించుట ఒక రాజసిక సన్యాస

మగును (18–8), అది సమున్నత ఆధ్యాత్మిక ఫలము నివ్వదు; అదియు యథార్థ "త్యాగము" గాదు. అది బౌద్ధిక నిరాశావాదము లేక ప్రాణిక విషాదముయొక్క ఫలితము, దానికి వేళ్లు అహంకారమునందుండును. ఈ స్వార్థపర అహంకారముచేత చోదితమైన సన్యాసమునుండి ఎట్టి ముక్తి రాజాలదు.

5. సాత్త్వికసన్యాసము అహంసన్యాసము : సన్యాసముయొక్క సాత్త్విక తత్త్వము కర్మనుండి నివృత్తి గాదు, ఆ కర్మవెనుక నుండు వైయక్తిక కామము, మఱియు అహంకారమునుండి నివృత్తి యగును. కామనియతమైన కర్మను గాక, యుక్తజీవనమును దెలుపు శాస్త్రనియతమైన కర్మను లేక స్వభావనియతమైన కర్మను, అనగా శ్రద్ధానురూపమైన కర్మను చేయుటే సన్యాస మగును (18–9). అథవా, ఇంకను ఉచ్చతర ఆధ్యాత్మిక భూమికయందు కర్మలు ప్రభుసంకల్పముచేత నియతము లగును, మఱియు యోగయుక్తమైన మనస్సుచేత కర్మతో గాని, కర్మఫలముతో గాని ఎట్టి సంగము లేక చేయబడును (18–9). సమస్త కామముయొక్కయు, సమస్త అహంకారిక సంవరణప్రేరణలయొక్కయు సంపూర్ణసన్యాస ముండవలెను. చివరకు, "కర్మ నాది, నేను చేయుచున్నాను" అని గాని, "కర్మ భగవంతునిది, కాని చేయు వాడను నేను" అని సైతము గాని వచించు సంకల్పముయొక్క బహుసూక్ష్మతర అహంకారమును సైతము సంపూర్ణముగా సన్యసించవలెను. ప్రియము, హితము, లాభదాయకము లేక విజయోపేతమగు కర్మతో నెట్టి సంగము నుండరాదు, మఱియు నది ప్రియము గావున, దానిని చేయుటయు తగదు. కాని, అది మన పైనుండియు, లోపలినుండియు ఆదిష్టమైన కర్తవ్యకర్మ యైనప్పుడు, అట్టి ప్రియమగు కర్మను సైతము చేయవలెను – సమగ్రముగా, స్వార్థరహితముగా, ఆత్మానుమతితో చేయ వలెను. అటులే అకుశల కర్మ పట్ల, అనగా అప్రియము, అహితము, లేక అసంతుష్టి కరమగు కర్మపట్ల గాని, దుఃఖము, దుఃస్థితి, దుష్పరిణామమును గొనిరాగల కర్మ పట్ల గాని ఎట్టి ద్వేషము నుండరాదు (18–10); ఏలన అది కర్తవ్యకర్మ యగు నేని, లోతునకు దిగి దాని ఆవశ్యకతను, అర్థమును గ్రహించి, దానిని సైతము సమగ్రముగా, స్వార్థరహితముగా చేపట్టు టవసరము. ప్రాజ్ఞుడు కామాత్మయొక్క వైముఖ్యములను, సంకోచములను పరిత్యజించును, సాధారణ మానవబుద్ధియొక్క సందేహములను పాటించడు; ఏలన కామాత్మయు, సాధారణబుద్ధియు వైయక్తిక, సాంప్రదాయిక లేక పరిమిత ప్రమాణములచేత విషయమును కొల్చును (18–10).

అటులే ఆతడు సంపూర్ణ సాత్త్విక మానసముయొక్క ప్రకాశమున మఱియు ఆంతర సన్న్యాసముయొక్క ప్రభావముతో తన ప్రకృతియొక్క సర్వోచ్చ ఆదర్శధర్మము ననుసరించును, అథవా తన రహస్యాత్మయందలి కర్మప్రభువుయొక్క దివ్యసంకల్పము ననుసరించును. ఎట్టి వైయక్తిక ఫలమునిమిత్తము గాని, ఇహజీవనమున ఎట్టి పురస్కారమునిమిత్తము గాని, విజయము, లాభము లేక పరిణామమునందు ఎట్టి సంగముతో గాని అతడు కర్మచేయడు: అటులే అతడు అదృశ్య పరలోకములందు ఫల మపేక్షించి కర్మ చేపట్టడు, జన్మాంతరములందు పురస్కారమును కర్మనిబంధనము గావించడు - అర్ధపక్వ మతనిష్ఠులు దీనికే తపింతురు. ఈ లోకము లేక లోకాంతరములందు, అటులే ఈ జన్మము లేక జన్మాంతరములందు ఇష్టము, అనిష్టము, మిశ్రమము నను త్రివిధ కర్మఫలము కర్మ మఱియు నహంకారమునకు దాసులగు వారికి మాత్రమే గాని, అది ముక్తాత్మను అంటిపెట్టుకొనదు (18-12), ఆంతర సన్న్యాసముచేత ఒక అధికతరశక్తికి తన కర్మల నర్పించివేసిన విముక్త కర్మకర్త కర్మవిముక్తు డగును. కర్మ చేయుట మాత్ర మతడు చేయును, ఏలన తక్కువ లేక ఎక్కువ కర్మ, చిన్న లేక పెద్ద కర్మ దేహధారి పురుషునకు అనివార్యము, సహజము మఱియు సముచితము - నిజానికి దివ్య జీవనధర్మమునందు కర్మ ఒక భాగము, అది ఆత్మయొక్క సమున్నత శక్త్యంశము. సన్న్యాససారము, అనగా యథార్థ త్యాగము, యథార్థ సన్న్యాసము సాంప్రదాయిక అకర్మనియమము గాదు; అది నిస్స్వార్థ ఆత్మతోను, నిరహంకార మనస్సుతోను గూడి, అహంకారమునుండి స్వతంత్ర నిర్వ్యక్తిక ఆధ్యాత్మిక ప్రకృతిలోనికి చేయు సంక్రమణము (transition). ఆంతరసన్న్యాస భావము సాత్త్విక సాధనయొక్క అత్యున్నత పరిసమాప్తియొక్క ప్రథమ మానసిక నిబంధన యగును.

6. <u>కర్మకారణము లైదు</u> : పిమ్మట గీత సాంఖ్యము ననుసరించి, సర్వకర్మల సిద్ధినిమిత్తము అయిదు కారణములను లేక ఆవశ్యకములను ఉల్లేఖించును. ఇవి యేవి యన, 1. "అధిష్ఠానము" (18-13), అనగా ప్రకృతియందలి ఆత్మకు శరీరప్రాణమనోరూపమగు ఆధారము లేక నిలచుటకు స్థానము, 2. "కర్త", 3. "కరణము", అనగా ప్రకృతియొక్క వివిధ ఉపకరణచర్య, 4. "చేష్టలు", అనగా కర్మశక్తిని సమకూర్చు బహువిధ ప్రయత్నములు, 5. "దైవము" (18-14), అనగా విధి, అనగా మానవప్రయత్నము కంటెను, పైకి కన్పించు

ప్రకృతియొక్క యంత్రవ్యాపారముకంటెను భిన్నమగు శక్తి లేక శక్తులయొక్క ప్రభావము; ఈ దైవము తక్కిన నాల్గింటివెనుక నిలిచి, కర్మను దిద్దుచు, కర్మను బట్టియు, దాని పరిణామమును బట్టియు దాని ఫలములను విధించును. ఈ అయిదును తమలోదాము సర్వనిమిత్తకారణములను – "కారణాని" (18–13) – సమకూర్చును; మనోవాక్కాయములచేత మానవు డేయే కర్మ చేపట్టునో, దాని రూపమును, ఫలితమును, ఈ కారణములే నిర్ణయించును (18–15).

7. <u>చంపినను చంపనివాడే</u> : కర్త మన బాహ్య వ్యక్తిగత అహంకార మని సాధారణముగా అనుకొందుము (18–16), కాని అది జ్ఞానమును ప్రాపించని బుద్ధియొక్క మిథ్యాభావము. పైకి మాత్రమే అహంకారము కర్త, నిజానికి అహంకారము మఱియు దాని సంకల్పము ప్రకృతినిర్మాణములు మఱియు నుపకరణములే ; అజ్ఞమగు బుద్ధి తప్పుగా వీనితో మన ఆత్మను తాదాత్మ్యము జెందించును; అయితే ఇవి మాత్రమే మానవకర్మకు సైతము నిర్ణాయకములు గావు, అయినప్పుడు దాని దిశకు, పరిణామమునకు నిర్ణాయకములు గావని చెప్పబనిలేదు. మన మహంకారమునుండి విముక్తుల మైనపుడు, నిర్వ్యక్తికము, సార్వత్రికము నగు మన వాస్తవాత్మ వెనుకనుండి ముందుకు వచ్చి, విశ్వపురుషునితో తనకు గల ఏకతాదర్శనమున, విశ్వప్రకృతియే కర్మకర్త్రి యనియు, వెనుకనుండు దివ్యసంకల్పము ఆ విశ్వప్రకృతిస్వామి యనియు గాంచును. ఈ జ్ఞానము మనకు లేనంతవఱకే, అహంకారముచేతను, దాని సంకల్పమే కర్తయను భావముచేతను బద్ధులమై, శుభాశుభకర్మలను జేతుము మఱియు మన తామసిక, రాజసిక లేక సాత్త్విక ప్రకృతియొక్క సంతృప్తిని బొందుదుము. కాని ఒకసారి మన మీ మహత్తర జ్ఞానమున నివసింపసాగినపుడు, కర్మస్వభావము మఱియు పరిణామము ఆత్మస్వాతంత్ర్యమున కెట్టి మార్పును గలిగించవు. ఈ కురుక్షేత్ర మహాసంగ్రామమువలె కర్మ పైకి భయంకరము గావచ్చును; కాని ముక్తపురుషుడు దానిలో పాల్గొనినను మఱియు నతడీ ప్రజ లందరను చంపివేసినను, నిజాని కత డెవరిని, చంపనివాడే మఱియు నా కర్మచేత నతడు బద్ధుడు గాడు (18-17), ఏలన ఆ కర్మ లోకేశ్వరుని కర్మ మఱియు నతడు తన గుప్త సర్వశక్తి సంకల్పమునందు ఈ సేనానీకముల నన్నింటిని చంపియే యున్నాడు (11–33). ఇట్టి సంహారకర్మ ఆవశ్యక మయ్యెను, ఏలన దానిచేతనే మానవజాతి మఱియొక సృష్టి మఱియు ధ్యేయము దిశగా నగ్రసరము

కాగలదు, అగ్నిలోవలె అధర్మమును, అత్యాచారమును అన్యాయరూపమగు తన గతకర్మను దహించివేయగలదు మఱియు ధర్మరాజ్యమునకు పథమునించగలదు. విశ్వపురుషునితో తన ఆత్మయందు ఏకమగు నొక సజీవ ఉపకరణముగా, ముక్త పురుషుడు తన విహితకర్మ నొనరించును. మఱియు నిది యంతయు జరుగక తప్ప దని గ్రహించి, కర్మయొక్క బాహ్యరూపమున కావల తన దృష్టిని సారించుచు, అతడు తనకొఱకు గాక, భగవంతునికొఱకు, మానవజాతికొఱకు మఱియు మానవ మఱియు [1] విశ్వవ్యవస్థకొఱకు కర్మచేయును ; మఱియు వాస్తవాని కతడు స్వయ ముగా చేయడు, తన కర్మలయందును, వాని పరిణామమునందును పనిచేయుచున్న దివ్యశక్తియొక్క సన్నిధి మఱియు సామర్థ్యము పట్ల అతడు సచేతనుడై యుండును. అధిష్ఠానమగు తన మనఃప్రాణశరీరములందు పరశక్తియే ఏకమాత్ర శక్తిగా 'విధి'విహిత కర్మను చేయుచున్న దని అతనికి దెలియును - అయితే యీ విధి నిజానికి విధి గాదు, అనగా ఒక యాంత్రిక విధానము గాదు, పరంతు అది మానవ కర్మను వెనుకనుండి నడుపు, విచక్షణశీల సర్వదర్శియగు ఈశ్వరసంకల్పము. ఏది గీతోపదేశమునకు మూలమో, అట్టి ఈ "ఘోర కర్మ" (3-1) పైకి "అకుశలముగా" (18-10), అశుభముగా గన్పించు కర్మ కొక చరమదృష్టాంతము, అయితే దీని ఆభాసరూపమున కావల నొక మహాశుభ మున్నది. దైవనియుక్త మానవునిచేత లోకసంగ్రహార్థము (3-20) ఈ కర్మ నిర్వ్యక్తికముగా చేయబడవలెను ; ఇచ్చట వైయక్తిక లక్ష్యము లేక కామ ముండరాదు, ఇది విహితసేవ గదా.

8. <u>త్రివిధజ్ఞానము</u> : ఇట్లు ముఖ్యాంశము కర్మ యొక్కటి మాత్రమే గాదని మనకు తెల్లమైనది; ఏ జ్ఞానమునందు మనము కర్మ చేతుమో, దానివలన అపారమగు ఆధ్యాత్మిక భేద మేర్పడును. కర్మకు మానసిక ప్రేరణను సమకూర్చు మూడు వస్తువులు గలవు, అవి మన సంకల్పమునందలి జ్ఞానము, జ్ఞేయము మఱియు జ్ఞాత యని గీత వచించును (18-18); మఱియు నా జ్ఞానములోనికి సదా త్రిగుణ క్రియ ప్రవేశించును. జ్ఞానమునందలి ఈ గుణభేదముచేతనే మన దృష్టికి జ్ఞేయ

[1] ఇచ్చట విశ్వవ్యవస్థయొక్క ప్రసక్తి వచ్చుటకు గారణము, మానవ జాతియందు అసురుడు జయించినచో, ఆ మేరకు విశ్వశక్తుల సంతులనమునందు అది అతని జయమే యగును. -శ్రీ అ.

మెంతో భిన్నముగాను, అటులే జ్ఞాత కర్మచేయు భావ మెంతో భిన్నముగాను గన్పించును (18–19). అజ్ఞానమయమగు తామసిక జ్ఞానము ఒక క్షుద్ర మఱియు సంకుచిత, ఒక అలస లేక మూర్ఖమగు దృగ్విధానము; ప్రపంచము లేక చేయబడిన వస్తువు లేక తన కర్మక్షేత్రము లేక కర్మ లేక కర్మనిబంధనలయొక్క వాస్తవిక స్వరూపమును జూచు నేత్రము దాని కుండదు. తామసిక జ్ఞానము వాస్తవ కార్యకారణములను జూడదు, పరంతు ఒక మూర్ఖసంగముతో ఒకే గతి లేక పరిపాటియందు సక్తమగును; అది తన కంటిముం దున్న, వైయక్తికకర్మయొక్క ఒక స్వల్పాంశమును దప్ప మఱి దేనిని జూడదు; నిజానికి తాను చేయు కర్మయే దానికి దెలియదు. అది అంధప్రాయముగా ప్రకృతిప్రేరణను తన కృత్యముద్వారా కొన్ని ఫలములను సాధింపనిచ్చును, ఆ ఫలములను గుఱించిన ఎట్టి భావన, పూర్వదృష్టి లేక సమగ్రావగాహన దానికుండదు (18–22). పోగా ఏ జ్ఞానము వేఱువేఱు వ్యాపారములు గల వేఱువేఱు వస్తువులందు బహుత్వమును మాత్రమే చూచునో, మఱియు యథార్థమగు ఏకతాసూత్రమును గనుగొనజాల కున్నదో లేక తన సంకల్పమును, క్రియను సరిగా నన్వయించజాలక, తన అహంకారము మఱియు కామముల ప్రవృత్తినే అనుసరించునో, అనగా నానాశాఖలుగా విస్తరించునో (2–41), తన అహంకారిక సంకల్పము ప్రారంభించు క్రియాకలాపమునే సాగనిచ్చునో, అదిగో, అది రాజసజ్ఞానము (18–21). ఈ జ్ఞానము అనేక జ్ఞానాంశముల ఒక అస్తవ్యస్త మిశ్రమము, తఱచు ఇది ఒక అసంగత జ్ఞానము, కాని మనస్సు వీనిని బలాత్కారముగా కలిపియుంచి, మన జ్ఞానాజ్ఞానముల సంకరములోనుంచి ఒక తాత్కాలిక మార్గము నేర్పఱచును. అథవా ఈ జ్ఞాన మొక చంచల రాజసిక బహువిధ క్రియాకలాపము, దీని కెట్టి దృఢ నియామక సమున్నత ఆదర్శము నుండదు, తన లోపలి సత్య శక్తిప్రకాశములయొక్క ఎట్టి ప్రశాంతధర్మము దీని కుండదు. దీనికి ప్రతిగా, సాత్త్వికజ్ఞానము అస్తిత్వమును సర్వవిభక్తవస్తువులయందును ఏకమాత్ర అవిభాజ్య తత్త్వముగా జూచును, సర్వ సంభూతలయందును ఏకమాత్ర అవ్యయ సత్తను గాంచును (18–20); అది తన కర్మసూత్రమును, ప్రత్యేకకర్మకు సమష్టిప్రయోజనముతో గల సంబంధమును వశీకరించుకొనును; అది సంపూర్ణ ప్రక్రియయొక్క ప్రతిఅడుగును యథాస్థానమున వేయించును. ఈ జ్ఞానము పరాకాష్ఠను బ్రాపించినపుడు, అది సర్వభూతములలోను గల ఏకమాత్ర ఆత్మయొక్క దర్శన మగును, సర్వకర్మల ఏకమాత్ర అధీశ్వరుని యొక్క దర్శన మగును మఱియు నది విశ్వశక్తులను భగవంతుని ప్రకటనములుగా

గాంచును, అటులే స్వయముగా కర్మను మానవునియందును, అతని ప్రాణమునందును, స్వభావమునందును భగవంతుని పరమ సంకల్పజ్ఞానముల క్రియగా దర్శించును. ఇపుడు సంపూర్ణముగా సచేతనము మఱియు ప్రబుద్ధము, ఆధ్యాత్మికముగా ప్రబుద్ధము నైయున్న వైయక్తిక సంకల్పము ఏకునియందు నివసించును మఱియు కర్మచేయును (6-31), అధికాధిక పరిపూర్ణముగా అతని పరమాదేశమునకు విధేయమగును మఱియు మానవదేహమునందలి అతని శక్తిప్రకాశములయొక్క ఒక నిర్దుష్ట ఉపకరణముగా ఎక్కువెక్కువ పెంపు నందును (11-33). పరమ విముక్త క్రియ సాత్త్వికజ్ఞానము యొక్క ఈ పరాకాష్ఠద్వారానే సిద్ధించును.

9. <u>త్రివిధ ఉపకరణము</u> : కర్త, కరణము మఱియు కార్యము-అను ఇంకను మూడు వస్తువులు గలవు, ఇవియే కర్మను సమకూర్చి, సంభవమొనరించును (18-18). మఱల నిచ్చట నైతము గుణభేదమే వీనిలో ప్రతిదాని స్వభావమును నిర్ణయించును (18-19). సర్వదా ఒక సమంచిత సామరస్యమును, సమంచిత జ్ఞానమును అన్వేషించు సాత్త్విక మనస్సు సాత్త్విక మానవునియొక్క ప్రధానోపకరణము, ఇదియే తక్కిన యంత్రము నంతను నడుపును. మఱియు కామాత్మచేత (2-43) ధరింపబడిన కామమయ సంకల్పము రాజసిక కర్తయొక్క ప్రధానోపకరణమగును. భౌతిక మనస్సు మఱియు అసంస్కృత ప్రాణప్రకృతికి జెందిన ఒక అజ్ఞానమయ ప్రవృత్తి లేక ప్రకాశరహిత ప్రేరణ తామసిక కర్తయొక్క ముఖ్యమగు ఉపకరణశక్తి యగును. చివరకు, ముక్త పురుషుని ఉపకరణము అధికతరమగు ఒక ఆధ్యాత్మిక ప్రకాశము మఱియు శక్తి యగును, అది అత్యున్నత సాత్త్విక బుద్ధికంటెను ఎంతో ఉన్నతతరము మఱియు నీ ఉపకరణ మతనిలో ఒక అతిభౌతిక కేంద్రమునుండి వచ్చిన ఒక వ్యాపకశక్తితో పనిచేయును మఱియు తన శక్తి కొరక స్వచ్ఛవాహినిగా పరిపూతము, గ్రహణశీలము నగు మనఃప్రాణశరీరముల నుపయోగించును.

10. <u>త్రివిధకర్మ - అతీతకర్మ</u> : సంభ్రాంతము, విమూఢము, అజ్ఞము నగు మనస్సుచే చేయబడు కర్మ తామసకర్మ. సహజప్రవృత్తులకు, అంధప్రేరణలకు, అజ్ఞభావములకు యాంత్రికవిధేయతతో మానవుడు దీనిని చేయును ; తన శక్తి సామర్థ్యములను గాని, అప్రయుక్తమగు ప్రయత్నమువలన గలుగు క్షయనష్టము

లను గాని, ప్రేరణ, ప్రయత్నము లేక పరిశ్రమయొక్క పూర్వాపరములను, సముచిత నియమములను గాని అతడు పరికించడు (18-25). కామవశుడై, ఆశించిన కర్మఫలమును దెచ్చు కర్మపైన మాత్రమే తన దృష్టిని బంధించి, మానవుడు చేయు కర్మ రాజసకర్మ ; అథవా ఈ కర్మయందు అతనికి తన స్వీయవ్యక్తిత్వముయొక్క ఆహంకారిక భావ ముండును మఱియు నీ రాజసకర్మ కామ్యవిషయము నిమిత్తము వైయక్తిక సంకల్పముయొక్క బహుళాయాసముతో, చెమటోడ్చి చేయబడును (18-24). పోగా, బుద్ధిజ్ఞానముల స్వచ్ఛప్రకాశమున, న్యాయము లేక ధర్మమునకు సంబంధించిన నిర్వ్యక్తిక భావముతో, లేక ఒక ఆదర్శమును పురస్కరించుకొని, మానవుడు ప్రశాంతముగా చేయు కర్మ సాత్త్వికకర్మ ; చేయదగిన కర్మ యనియే అతడు దానిని చేయును గాని, ఇహపరములయందు దానివలన తన కే ఫలము ప్రాప్తించునో యను చింత అతని కుండదు. ఈ కర్మయందు సంగ ముండదు, ప్రోత్సాహ నిరుత్సాహములను బుట్టించు రాగద్వేషము లుండవు ; హేతుబుద్ధి మఱియు న్యాయమతియొక్కయు, విశదజ్ఞానము, ప్రబుద్ధసంకల్పము, శుద్ధ నిస్స్వార్థ మానసము మఱియు సమున్నత సంతుష్ట అంతఃపురుషునియొక్కయు సంతృప్తి నిమిత్త మీ కర్మ మాచరింపబడును. సత్త్వము పరాకాష్ఠను బ్రాపించి నప్పు డీ సాత్త్వికకర్మ రూపాంతరముజెంది, ఒక పరమోన్నత నిర్వ్యక్తిక కర్మ యగును; అప్పు డిక దానిని మన బుద్ధి గాక, అంతఃస్థపురుషుడే నిర్దేశించి ఆదేశించును, అది స్వభావముయొక్క అత్యున్నతనియమముచే నడుపబడును, అహంకారమునుండియు, దాని స్వల్ప లేక బహుభారమునుండియు నది ముక్తమగును; అంతే కాదు, సర్వోత్తమాభిప్రాయము, ఉదాత్తతమ కామము, పరిశుద్ధ వైయక్తికసంకల్పము లేక అత్యున్నత మానసికాదర్శము సైతము కల్పించు పరిమితినుండి విముక్తమగును. అక్క డీ ప్రతిబంధము లేవియు నుండవు ; వీని స్థానమున ఒక స్వచ్ఛ ఆధ్యాత్మిక ఆత్మజ్ఞానము మఱియు ప్రదీప్తి భాసించును, కర్మ చేయునట్టి ఒక అమోఘశక్తి యొక్క అనివార్య ఘనిష్ఠానుభవము చెలంగును మఱియు ప్రపంచము మఱియు ప్రపంచాధీశ్వరునికొఱకు చేయవలసిన కర్మయొక్క విస్పష్టజ్ఞాన ముదయించును.

11. <u>త్రివిధకర్త - అతీతకర్త</u> : ఎవడు కర్మయందు తన హృదయము నుంచక, యాంత్రికముగా పనిచేయునో, లేక ఎవడు సామాన్యజనతయొక్క స్థూల ఆలోచనకు తలవంచునో, అనగా సామాన్య పరిపాటి ననుసరించునో లేక ఎవడు

ఒక అంధభ్రాంతికి మఱియు పూర్వాగ్రహము (prejudice) నకు అమ్ముడుపోవునో, అతడు తామసిక కర్త. అతడు తన మూఢతయందు పాదుకొనియుండును మఱియు తన అజ్ఞానమయ కర్మాచరణమునందు బుద్ధిహీనముగా గర్వించును; యథార్థ ప్రజ్ఞా స్థానమున అతనియం దొక సంకుచిత వంచనాశిల్పము పనిచేయును; తా నెవరితో వ్యవహరించునో వారిపట్ల, విశేషించి ప్రాజ్ఞులు మఱియు శ్రేష్ఠులపట్ల అతనియం దొక మూర్ఖ తిరస్కారభావము వర్తించును. ఒక తామసిక అలసత్వము, మాంద్యము, కాలయాపనము, శిథిలత, నిరుత్సాహము లేక అసత్యత అతని కర్మకు లక్షణములు (18-28). తామసిక మనుష్యుడు సాధారణముగా ఆరంభించుటయందు వెనుకబడును, తన నడకయందు ఆలసించును, కొంచెమునకే క్రుంగిపోవును; తన బలమును, పరిశ్రమను లేక సహనమును తన కర్మ ఇంచుక పరీక్షించు నేని, అతడు దానిని వెంటనే విడిచివేయ సిద్ధపడును. దీనికి ప్రతిగా, రాజసిక కర్త కర్మయందు ఆత్రముతో నాసక్తు డగును, దాని సత్వరసమాప్తికి నడుముకట్టును, ఫలము, పురస్కారము మఱియు పరిణామములకొఱకు పరితపించును; అతడు హృదయమునందు లుబ్ధుడు, మనస్సునందు అశుచి, తాను అవలంబించు ఉపాయములందు తఱచుగా హింసాత్మకుడు, క్రూరుడు, పశుప్రాయుడు; తా నెవనిని హింసించునో, ఎంత హింసించునో, అతనికి పట్టదు, అతనికి గావలసినది తన కామనాపూర్తి, తన సంకల్పసంతృప్తి, తన అహంకారాధిక్యము. సాఫల్యమునం దతడు ఉబ్బితబ్బిబ్బగును, వైఫల్యమునందు తీక్ష్ణముగా క్రుంగి కృశించును (18-27). పోగా సాత్త్విక కర్త ఈ సమస్త సంగము, అహంకారము, ప్రచండబలము లేక దుర్బలతావేశమునుండి సదా ముక్తుడు; అతని బుద్ధిసంకల్పములు సిద్ధియందు పొంగవు, అసిద్ధియందు క్రుంగవు; ఒక దృఢ నిర్వ్యక్తిక నిశ్చయముతో, ఒక ప్రశాంత సమంజస ఉత్సుకతతో, ఒక సమున్నత, విశుద్ధ, నిస్స్వార్థ ఉత్సాహముతో నవి నిండియుండును (11-26). చివరకు, సత్త్వముయొక్క చరమస్థానమునందును, దాని కావలను ఈ నిశ్చయము, ఉత్సుకత మఱియు నుత్సాహము ఆధ్యాత్మిక తపస్సుయొక్క స్వాభావిక క్రియావిలాస మగును మఱియు తుట్టతుదకు ఒక సర్వోన్నత ఆత్మబలము, ప్రత్యక్ష భగవచ్ఛక్తి యగును, మానవోపకరణమునందు ఒక భగవదూర్జము (energy) యొక్క ప్రబల సుస్థిర ప్రవృత్తి యగును, దర్శనాత్మకసంకల్పము, విజ్ఞానమయమనీషయొక్క స్వయం దృఢీకృత పదము లగును మఱియు దానితోబాటు విముక్తప్రకృతియొక్క కర్మయందు స్వతంత్రపురుషునియొక్క విశాలానంద మగును.

12. <u>తామస బుద్ధి మఱియు ధృతి :</u> ప్రాజ్ఞసంకల్పముతో సన్నద్ధమైన బుద్ధి మానవుని మానసిక సంపద; ఇది ఏ రీతిగా నే పరిమాణమున వర్తించునో, దానిని బట్టియే అతని కర్మ సమంజసము లేక కుటిలము, ఆవృతము లేక భాసురము, సంకుచితము మఱియు క్షుద్రము లేక విశాలము మఱియు విపులము నగును. ఏలన అతని ప్రకృతియొక్క అవగాహనశక్తియగు బుద్ధియే అతనికి కర్మను ఎన్నిక చేయును, అథవా అతని సంకీర్ణ ప్రవృత్తులు, ప్రేరణలు, భావములు మఱియు కామముల అనేకానేక సూచనలలో నొక దానిపై తన ఆమోదముద్రను వేయును. అదియే అతనికొఱకు యుక్తాయుక్తములను, కార్యాకార్యములను, ధర్మాధర్మములను నిర్ణయించును. పోగా ధృతి, అనగా సంకల్పదృఢత, మానసిక ప్రకృతియొక్క ఒక సంతత శక్తి, ఇదియే కర్మను ధరించి, దానికి సాంద్రతను, దృఢతను గల్పించును. ఈ బుద్ధి మఱియు ధృతియందు సైతము గుణక్రియ గన్పించును, తామసిక బుద్ధి ఒక మిథ్యాభూత, అజ్ఞానమయ, తిమిరావృత సాధనము, ఇది మనలను బంధించి, ఒక మలిన భ్రాంత ప్రకాశమున వస్తువులను చూచునట్లు చేయును; వస్తువులు మఱియు మానవుల యథార్థమూల్యములను మూర్ఖముగా నుపేక్షించి, మిథ్యామూల్యములను గ్రహించును. ఈ బుద్ధి వెలుగును చీకటి యనును, చీకటిని వెలు గనును, అధర్మ మును ధర్మముగా చేపట్టును, అకార్యమునందు పాదుకొని, దానినే సత్కార్యముగా మనకు ప్రతిపాదించును. దాని అజ్ఞానము అజేయము మఱియు దాని ధృతి తన అజ్ఞానముయొక్క సంతృప్తి మఱియు గర్వమునందలి ధృతి యగును (18-32). ఇది ఈ బుద్ధియొక్క అంధక్రియకు సంబంధించిన పార్శ్వము; కాని దీనికి జడతా నిర్వీర్యతల బహుభారముతో గూడిన పార్శ్వమును గలదు – నిద్రామాంద్యముల యందు పట్టు, మానసిక పరివర్తన మఱియు ప్రగతిపట్ల వైముఖ్యము, మానసిక భయములు, బాధలు మఱియు విషాదములయందు అభినివేశము : ఇవి ఈ పార్శ్వము నెప్పుడును వెంటాడుచుండును (18-35). పిఱికితనము, మూలుగుట, వంచన, అలసత్వము, ఇంకను మనస్సుద్వారా తన భయములు, సందేహములు, అతిజాగ్రత్తయు మఱియు కర్తవ్యనిరాకరణల సమర్థనము మఱియు మన ఉచ్చతర ప్రకృతియొక్క పిలుపునుండి భ్రంశమును, వైముఖ్యమును – ఇవి తామసిక బుద్ధి మఱియు ధృతి యొక్క లక్షణములు. ఇవి తక్కువలో తక్కువ ప్రతిఘటన యందు మార్గము బట్టును, అల్పతమ కష్టము, ప్రయత్నము, ప్రమాదములతో ఇవి తమ శ్రమఫలమును బొంద జూచును–కాదు, బ్రదికియుండిన బలుసుకూర ఏఱుకొనవచ్చు ననీ సైతము తలంచును.

13. <u>రాజస బుద్ధి మఱియు ధృతి</u> : రాజస బుద్ధి, కావలెనని అది తప్పును, చెడును తెలిసియే ఎన్నికచేయ నపుడు, ధర్మాధర్మములను, కార్యాకార్యములను వివేచించగలదు గాని, సరిగా వివేచించదు, వస్తుతః వాని వాస్తవ మానములను విఱిచి, వాని మూల్యములను వికృతపఱచును. కారణము, దాని హేతువు అహంకార హేతువు, దాని సంకల్పము కామసంకల్పము, మఱియు నీ శక్తులు తమ స్వీయ అహంకారిక ప్రయోజనమును సాధించుటకు సత్యధర్మములను తప్పుగా చిత్రించి, వికృతపఱచును (18–31). అహంకార కామములనుండి విముక్తులమై, సత్యము మఱియు దాని అనుబంధములతోనే పనిపెట్టుకొను ప్రశాంత, శుద్ధ, నిస్స్వార్థ మానసముతో నిబ్బరముగా వీక్షించి నపుడే, వస్తువులను తమ వాస్తవ మూల్యము లందు జూడ మన కవకాశ ముండును. కాని దీనికి రాజస ధృతి అడ్డువచ్చును; అది లాభసుఖములను, తాను ధర్మ మనుకొను లేక అనుకొనగోరు ధర్మము నార్జించుచు, తన స్వీయ లాలసలు మఱియు కామముల పూరణమునందే తన దృష్టిని లగ్నము గావించును (18–34). అది సదా తన కామములను అధికాధికముగా రంజింపజేయుచు, సమర్థించునట్టి విధముగానే ధర్మమును వ్యాఖ్యానించుట కున్ముఖమగును; ఈ వ్యాఖ్యానము తాను బొందదలంచిన ఫలములను సాధించుటకు మిక్కిలి అనుకూలించు సాధనములను సమంజసము లేక న్యాయసమ్మత మని ప్రకటించును. మానవబుద్ధి మఱియు ధృతియొక్క అనృతము మఱియు అపవర్తనములందు నాల్గింట మూడు వంతుల కారణ మీ అనుకూలవ్యాఖ్యానమే. ప్రాణికాహంకారముపై గట్టి పట్టు గల రజోగుణమే మహాపాపియు, నిశ్చిత కునేతయు నైయున్నది (3–37).

14. <u>సాత్త్విక బుద్ధి, ధృతి మఱియు సత్త్వాతీతత</u> : ప్రపంచగతి, కర్మ ప్రవృత్తి-ధర్మము మఱియు కర్మనివృత్తి-ధర్మము, కార్యాకార్యములు, ఆత్మకు క్షేమకరము మఱియు విపత్కరము, భయముతో దేనిని వర్జించవలెనో మఱియు సంకల్పముచే దేనిని కౌగిలించుకొనవలెనో, మానవాత్మను ఏది బంధించునో మఱియు నేది విడిపించునో – సాత్త్విక బుద్ధి వీని నన్నింటిని యథాస్థానమున, యథారూప మున, యథామానమున దర్శించును (18–30). తన ప్రకాశముయొక్క ఆధిక్యమును బట్టియు, అత్యున్నత ఆత్మ మఱియు పురుషుని దిశగా తన ఆరోహణయందు తాను చేరుకొనిన పరిణామదశను బట్టియు తన సచేతనసంకల్పముయొక్క ధృతి బలముతో సాత్త్విక బుద్ధి వీని నాచరించును లేక పరిహరించును (18–33). సాధారణ బుద్ధి

మఱియు మానసికసంకల్పమునకు పరమున ఆకాంక్షామయ బుద్ధి కుదురుకొనినప్పుడు, పిమ్మట శిఖరోన్ముఖమైనపుడు, ఇంద్రియప్రాణముల స్థిరసంయమమునకు దిగినప్పుడు మఱియు యోగముద్వారా అత్యున్నత ఆత్మ, విశ్వగత భగవంతుడు, మఱియు విశ్వాతీత పురుషునితో యుక్తమైనపుడు, దాని సమున్నత ధృతిదృఢతచే సాత్త్విక బుద్ధియొక్క పరాకాష్ఠ ప్రాప్తించును. సత్త్వముద్వారా ఈ సత్త్వపరాకాష్ఠను చేరుకొనిన మానవుడు అచ్చట గుణముల నతిక్రమించగలడు, మనోబుద్ధులవలన గలుగు పరిమితులకు బైకి పోగలడు మఱియు సత్త్వము స్వయముగా సత్త్వాతీతములో నంతరించిపోగలదు. అచ్చట అంతరాత్మ తేజోమందిరమున ప్రతిష్ఠితమగును, ఆత్మ, పురుషుడు మఱియు భగవంతునితో సాయుజ్యమున పట్టాభిషిక్తమగును. ఈ సాయుజ్యశిఖరమున, దివ్యక్రియయొక్క విముక్త స్వయంప్రవృత్తియందు మన అంగములందలి ప్రకృతియొక్క పరిచాలనమును పరమునికి వదలిపేయవచ్చును ; ఏలన అచ్చట పరముని ప్రకాశమయ సంసిద్ధి మఱియు శక్తిని మలిన లేక వికృత పఱచు నెట్టి అనుచిత లేక సంకీర్ణక్రియ నుండదు, ఎట్టి భ్రాంత లేక నిర్వీర్య తత్త్వము నుండదు. అపుడీ నిమ్న నిబంధనలు, నియమములు మఱియు ధర్మములకు మనపై గల పట్టు అంతమొందును ; అప్పుడు విముక్త పురుషునియందు అనంతుడే కర్మచేయును, అపుడిక విముక్త సత్తయొక్క సత్యము మఱియు సౌలభ్యము తప్ప, ఎట్టి ధర్మము నుండదు, ఎట్టి కర్మయు నుండదు, ఎట్టి కర్మబంధనము నుండదు.

15. <u>సుఖప్రస్తావన, తామససుఖము</u> : సామరస్యము మఱియు క్రమము, ప్రశాంత సుఖము, ఒక స్థిర ప్రసన్న సంతుష్టి మఱియు నొక ఆంతర ఆరామము మఱియు శాంతి : ఇవి సాత్త్విక మానసము మఱియు స్వభావముయొక్క విలక్షణ గుణములు. నిజానికి, ప్రత్యక్షముగానో, పరోక్షముగానో మానవ ప్రకృతి సాధింపగోరు ఏకైకవస్తువు సుఖము – సుఖము గాని, సుఖాభాసము గాని, మనఃసంకల్పములు లేక ప్రాణశరీరముల ఒక ప్రీతి, ఒక భోగము, ఒక తృప్తి గాని అది కావచ్చును. పోగా బాధ ఒక అనుభవము; విశ్వప్రకృతియొక్క ఒక అపరిహార్య ఘటనగా, తప్పని సందర్భమున మన ప్రకృతి దానిని అనిచ్ఛాపూర్వకముగా స్వీకరించవలసి వచ్చును; లేక మన లక్ష్యమునకు ఒక సాధనగా ఇచ్ఛాపూర్వకముగనే స్వీకరించును. అంతే గాని, బాధకొఱకే బాధ నెవ్వడు గోరుకొనడు – అః, వికృతచిత్తుడు గోరుకొన

వచ్చును లేక అది గొనివచ్చు ఒక ప్రచండ ప్రీతికొరకో, అది పుట్టించు ఒక తీవ్ర బలమునిమిత్తమో ఉత్సాహావేశముతో దానిని వరించవచ్చును. కాని మన ప్రకృతి యందు ప్రాబల్యము వహించు గుణమును బట్టి, సుఖము లేక భోగము వివిధముగా నుండును. ఎట్లన, తామసిక మనస్సు తన అలసత మఱియు జడతయందు, తన నిశ్చేతనత మఱియు నిద్రయందు, తన అంధత మఱియు భ్రాంతియందు మంచి సుఖము నందగలదు. తన మూర్ఖత మఱియు నజ్ఞానమునందు, గుహలోని తన మందప్రకాశములందు, తన జడ సంతుష్టియందు, తన క్షుద్ర సుఖములందు మఱియు తన అసభ్యభోగములందు రమించగల ప్రత్యేకాధికారము ప్రకృతి దానికి కట్టబెట్టినది. ఈ రతికి మూలమును, పరిణామమును మోహమేయగును (18-39); అయినను గుహానివాసికి (తామసిక మానవునికి) తన మోహములందు, అది ఏమాత్రమును ప్రశస్తము గాకున్నను, తగినంత జడసుఖమును ప్రకృతి యొసంగును. తమస్సు మఱియు నజ్ఞానమునందును ఒక తామసిక సుఖ ముండును గదా.

16. <u>రాజస, సాత్త్విక సుఖములు</u> : రాజసిక మానవుని మనస్సు మఱింత తీక్ష్ణము, మాదకము (intoxicating) నగు సుఖపానము జేయును; ఇంద్రియములు మఱియు శరీరము, ఇంద్రియాసక్తము లేక ప్రచండ-గతిమయమగు సంకల్పము మఱియు బుద్ధియొక్క ఏ తీవ్ర చంచల సక్రియ సుఖము గలదో, అదియే అతనికి జీవిత సమస్తసుఖము మఱియు జన్మధారణకు పరమార్థము. ఈ సుఖము ప్రథమ స్పర్శయందు పెదవికి అమృతముగా నుండును గాని, గిన్నె అడుగున ఒక గుప్తవిష ముండును, మఱియు నీ సుఖము వెనుక నిరాశ, అతితృప్తి, ఆయాసము, విద్రోహము, విరాగము, పాపము, దుఃఖము, నష్టము మఱియు నశ్వరతలయొక్క చేదు అనుభవము నకు వచ్చును (18-38). మఱియు నట్లు రాక తప్పదు, ఏలన జీవితమునుండి మన అంతరాత్మ యథార్థముగా కోరునది సుఖముల ఈ బాహ్య రూపమును గాదు; రూపము యొక్క నశ్వరత కేవలను, ఆవలను చిరస్థాయి, తృప్తిప్రదము, స్వయంపర్యాప్తము నగు ఒక వస్తువు గలదు. కావున సాత్త్విక ప్రకృతి ఉన్నతమనస్సు మఱియు నంతరాత్మకు తృప్తి నిచ్చు దీనినే అన్వేషించును; ఒకసారి అన్వేషణావిషయమగు నీ బృహద్వస్తువు ప్రాప్తించు నేని, అంతరాత్మయొక్క ఒక స్వచ్ఛ శుద్ధ సుఖము, ఒక పూర్ణతాస్థితి, ఒక సుస్థిర ఆరామము మఱియు శాంతి ప్రస్ఫుటమగును. ఈ సుఖము బాహ్యవస్తువుల పైన గాక, కేవలము మనపైననే మఱియు మనలోపల

గల సర్వశ్రేష్ఠము, అంతరతమము నగు దాని ప్రఫుల్లనముపైననే ఆధారపడును (18-37). కాని ఆదియం దిది మన సామాన్య సంపత్తిగా నుండదు; అది ఆత్మ సంయమముచే, అంతరాత్మపరిశ్రమచే, సమున్నత కఠోర ప్రయత్నముచే జయించ బడవలెను. ఆదిలో ఇట్టి ప్రయత్నమున కర్థ మేమన, అభ్యస్తసుఖముయొక్క అధికాంశ హాని, ఎంతో దుఃఖము మఱియు సంఘర్షము, మన ప్రకృతిమథనమునుండి ఉద్భవించిన ఒక హాలాహలము, శక్తుల బాధాకర సంఘట్టనము, పరివర్తన కిష్టపడని ప్రాణవృత్తులయొక్క ప్రతిరోధము మఱియు విద్రోహము; కాని తుదకు ఈ చేదు అంతరించి, దాని స్థానమున అమరత్వముయొక్క అమృత ముదయించును. మఱియు మనము ఉచ్చతర ఆధ్యాత్మిక ప్రకృతికి ఆరోహించు కొలది దుఃఖాంతమునకు వత్తుము, బాధాసంతాపముల అనాయాస మరణము సిద్ధించును. ఇది నిరతిశయ సుఖము; సాత్త్విక సాధనయొక్క చరమ బిందువు లేక రేఖయందు ఇది మనపై వర్షింపసాగును.

17. <u>సాత్త్వికసుఖము — ఆధ్యాత్మికానందము :</u> ఘన మైనను, ఇంకను అవరమే యగు సాత్త్విక సుఖమును, మానసిక జ్ఞానము, సదాచారము మఱియు శాంతివలన గలుగు సుఖములను దాటి, ఎపుడు మనము ఆత్మయొక్క నిత్యనిశ్చల తను, దివ్యసాయుజ్యముయొక్క ఆధ్యాత్మిక హర్షోత్కర్షమును బొందుదుమో, అప్పుడు సాత్త్విక ప్రకృతి తననుదాను అతిక్రమించుట సిద్ధించును. ఆ ఆధ్యాత్మిక హర్ష మిక సాత్త్విక సుఖముగా నుండక, పరిపూర్ణ ఆనంద మగును. ఏ రహస్య హర్షమునుండి అన్ని వస్తువులు జనించుచున్నవో, దేనిచేత అన్నియు జీవించు చున్నవో, తమ ఆధ్యాత్మిక శిఖరాగ్రమున దేనిలోని కన్నియు నారోహించగలవో, ఆ రహస్య హర్షమే ఆనందము (తై. ఉ.). అహంకారము మఱియు దాని కామనల నుండి విముక్తుడైన ముక్తపురుషుడు చివరి కెప్పుడు తన అత్యున్న తాత్మతో ఏకము గను, సర్వభూతములతో ఏకముగను, అధ్యాత్మ సత్తయొక్క ఒక నిరపేక్ష ఆనందమునందు భగవంతునితో ఏకముగను నివసించునో, అపు డా పరిపూర్ణానందము మనది కాగలదు (క. ఉ.).

# 20. [1]స్వభావము, స్వధర్మము

1. దివ్యప్రకృతియందలి పరివర్తితరూపములు : ఇట్లు త్రిగుణాత్మకయగు ఈ నిమ్నప్రకృతినుండి త్రిగుణాతీతయగు దివ్య పరప్రకృతిలోనికి అంతరాత్మ యొక్క విమోచక వికాసముచేతనే మనము ఉత్తమరీతిని ఆధ్యాత్మిక సంసిద్ధిని, స్వాతంత్ర్యమును బొందగలము. మఱల నీ వికాసము సర్వశ్రేష్ఠ సత్త్వగుణము యొక్క పూర్వ వికాసముచేత సాధ్యమగును; సత్త్వప్రాబల్యము తన పరాకాష్ఠను జేపకొని, అచ్చట తనకుదానే అతిక్రమించును - తన పరిమితత్వములను దాటి, సచేతన సత్తయొక్క ఒక పరమ స్వతంత్రతలోనికి, ఒక నిర్ద్వంద్వ ప్రకాశము లోనికి, ఒక ప్రశాంత శక్తిలోనికి ప్రవేశించును; ఇచ్చట పరస్పరవిరుద్ధ గుణ ములచే దేని నిర్ణయము జరుగదు, అత్యున్నత మానసిక భావన ననుసరించి మన లను నూతనముగా రూపొందించు ఏ అత్యున్నత శ్రద్ధ మఱియు లక్ష్యము గలదో, అది ఈ పరప్రకృతి - సంక్రమణముచేత మన స్వీయ వాస్తవ సత్తయొక్క ఒక అంతర్దర్శనములోనికి, ఒక ఆధ్యాత్మిక స్వరూపజ్ఞానములోనికి రూపాంతరము జెందును. అటులే ధర్మముయొక్క ఉచ్చతమ ఆదర్శము లేక ప్రమాణము, మన ప్రాకృత జీవనముయొక్క సముచిత నియమానుసరణమును ఒక విముక్త సునిశ్చిత స్వయంభూ సంసిద్ధిలోనికి రూపాంతరము జెందును; ఇట్టి సంసిద్ధియందు ప్రమా ణములపై నాధారపడుట అతిక్రమించబడును, అమర ఆత్మ మఱియు పురుషునియొక్క స్వయంప్రవృత్త ధర్మము ఉపకరణములు మఱియు అంగములయొక్క నిమ్నతర నియమమును కొట్టివేయును. ఇంకను సాత్త్విక మానసము మఱియు సంకల్పము అభేదసత్తయొక్క ఆధ్యాత్మిక జ్ఞానము మఱియు క్రియాశీల శక్తిలోనికి మాఱును, ఈ అభేదసత్తయందు సమస్త ప్రకృతియు తన మాఱువేషమును విసర్జించి, తన లోపలి భగవంతునియొక్క ఒక విముక్త స్వరూపప్రకటన మగును. సాత్త్విక

---

[1] గీత : అధ్యాయము 18, శ్లోకములు 40–48.

కర్త తన మూలముతో సంపర్కము గలిగి, పురుషోత్తమునితో సంయుక్తుడగు జీవుడగును; అతడిక వైయక్తిక కర్మకర్త గాడు, పరంతు విశ్వాతీత, విశ్వగత పురుషుని కర్మలకు ఒక ఆధ్యాత్మిక వాహిని. అతని ప్రకృతిగత సత్త రూపాంతరితము, ప్రదీప్తము నయి, ఒక వైశ్వ నిర్వ్యక్తిక క్రియయొక్క ఉపకరణముగా, దివ్య ధనుర్ధరునియొక్క ధనువుగా నిలిచియుండును (18-78). ఏది సాత్త్విక క్రియగా నుండెనో, ఇపు డది పరిపూర్ణత ప్రకృతియొక్క స్వతంత్ర కార్యకలాపమగును; దీనియం దెట్టి వైయక్తిక పరిమితత్త్వము నుండదు, ఈయా గుణమునం దెట్టి సక్తియు నుండదు, పుణ్యపాపముల, స్వపరభావముల ఎట్టి బంధనము నుండదు, లేక ఒక పరమ ఆధ్యాత్మిక స్వయంనిర్ధారణ తప్ప, ఇతర నిర్ధారణ మేమియు నుండదు. భగవదనుసంధానము మఱియు ఆధ్యాత్మిక జ్ఞానముచే ఏకమాత్ర దివ్య కర్త హస్తములలోని కుద్ధరించబడిన కర్మలయొక్క పర్యవసాన మిదియే.

2. <u>సామాన్యధర్మము – వైయక్తికనియమము</u> : కాని ప్రాచీన భారతీయ సంస్కృతియందు మిక్కిలి ప్రాధాన్యము వహించిన ఒక ప్రాసంగిక ప్రశ్న మింకను మిగిలి యున్నది; ఆ ప్రాచీన దృష్టిని విడనాడినను, దానికి సర్వసాధారణముగా సైతము అనల్ప మహత్త్వము గలదు. గీత ఇప్పటికే దీనిని గుఱించి ఒకటి రెండు మాటలు చెప్పినది (3-35. 4-13), కాని దాని యథాస్థాన మిప్పుడు వచ్చినది. సాధారణ భూమికయందు కర్మయంతయు గుణములచేత నిర్ణయింపబడును (3-27); మఱియు కర్తవ్య కర్మ యజ్ఞ దాన తపముల త్రివిధరూపము ధరించును, కాగా వీనిలో ప్రతికర్మయు మఱల ఏదియోయొక గుణస్వభావము ధరించును. కావున ఈ యజ్ఞదాన తపములను, అవి ఎగయగలిగినంత, అత్యున్నత సాత్త్విక శిఖరమునకు ఉద్ధరించుచు మనము పురోగమించవలెను మఱియు ఆ శిఖరమును సైతము దాటి, ఎచ్చట సర్వకర్మలు ఒక విముక్త ఆత్మదానము, దివ్య తపస్సుయొక్క ఒక శక్తి, ఆధ్యాత్మిక జీవనముయొక్క ఒక నిత్యసంస్కారము నగునో, అట్టి విశాలతలో ప్రవేశింపవలెను. కాని ఇది యొక సాధారణ ధర్మము మఱియు నీ విచారణ లన్నియు సాధారణ సూత్రముల ప్రతిపాదనమే గాన, అవి సర్వక్రియలకు, సర్వమానవులకు ఒకే రీతిగా మాత్రమే వర్తించును. అందరును పుట్టుపడకు ఆధ్యాత్మిక వికాసముద్వారా ఈ ప్రబల సాధనను, ఈ మహాసంసిద్ధిని, ఈ అత్యున్నత ఆధ్యాత్మిక స్థితిని అందుకొనగలరు. కాని మనఃకర్మల సాధారణ

నియమము సర్వమానవులకు ఏకమే యైనను, ఒక శాశ్వత వైవిధ్యధర్మము సైతము గల దని మనము చూడగలము, అనగా ప్రతివ్యక్తి మానవ తత్త్వము, మనస్సు, సంకల్పము, జీవనము ననుసరించియే గాక, తన స్వీయ ప్రకృతి ననుసరించియు కర్మ చేయును; ప్రతిమానవుడు తన స్వీయ పరిస్థితులు, సామర్థ్యములు, ప్రవణత, స్వభావము, శక్తులకు గల నియమమును బట్టి విభిన్న కార్యములను నిర్వహించును లేక ఒక విభిన్న మార్గము ననుసరించును. కాగా ఆధ్యాత్మిక సాధనయందు ఈ వైవిధ్యమునకు, ఈ వైయక్తిక ప్రకృతినియమమునకు ఎట్టి స్థానమీయవలెను ?

3. <u>స్వభావనియత స్వధర్మము</u> : గీత దీనిని కొంత ఒత్తి చెప్పినది, దాని కొక పెద్ద ప్రాథమిక ప్రాముఖ్యమును సైతము నిచ్చినది. గీత ఆదియందే ఏది క్షత్రియుని ప్రకృతి, నియమము మఱియు వృత్తియో, అదియే అర్జునుని "స్వధర్మ" (2-31) మని చెప్పినది; ముందుకు సాగి, ఒకడు తన స్వీయ ప్రకృతి, నియమము మఱియు వృత్తినే పాటించి, అనుష్ఠించవలె నని ప్రబలశబ్దములతో గీత విధించినది (3-35)-అది దోషయుక్త మైనను, బాగుగా అనుష్ఠింపబడిన పరధర్మము కంటె శ్రేష్ఠము. తన స్వీయ ప్రకృతిధర్మమునందు మరణము పరధర్మమువలన గలుగు విజయముకంటెను శ్రేయస్కరము. మఱియొకరి ప్రకృతిధర్మము ననుసరించుట అంతరాత్మకు అపాయకరము (3-35); వేఱు మాటలలో దాని పరిణామము యొక్క సహజగతికి విరుద్ధము, అది యాంత్రికముగా విధించిన దగును, కావుననే అన్యము, కృతకము మఱియు ఆత్మదిశగా నభివృద్ధిపట్ల నిష్ఫలము నగును. ఏది సత్తలోపలినుండి వెడలివచ్చునో, అదియే యుక్త, ఆరోగ్యకర వస్తువు, సత్యక్రియ యగును గాని, జీవితనిర్బంధములచేత లేక మానసిక భ్రాంతిచేత విధింపబడినది గాదు. ఈ స్వధర్మమునందు నాలుగు సామాన్య విభాగములు గలవు, వీనిని ప్రాచీన భారతీయ సామాజిక సంస్కృతి చతుర్వర్ణముల ధర్మములుగా బాహ్యరూపమున సూత్రీకరించిపెట్టినది – "చాతుర్వర్ణ్యం" (4-13). ఈ సూత్రీకరణము ఒక దివ్య నియమమున కనురూప మని గీత వచించును, "గుణములు మఱియు కర్మల కనురూపముగా నాచేతనే చాతుర్వర్ణ్యము సృజింపబడెను". (4-13) – సృష్టిప్రభువు ఆదియందే దీనిని సృజించిపెట్టెను. వేఱు మాటలలో సక్రియప్రకృతియందు నాలుగు విశిష్ట శ్రేణులు లేక ప్రకృతిగత జీవునికి నాలుగు ప్రాథమిక రూపములు అనగా

స్వభావములు (8–3) గలవు మఱియు ప్రతి మానవజీవుని కర్మయు, వృత్తియు అతని స్వభావమున కనుపగా నుండును. ఈ కర్మవిభజన మిపుడు చివరి సారిగా, కచ్చితముగా చేయబడును. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు మఱియు శూద్రుల కర్మలు తమతమ అంతరప్రకృతినుండి, ఆధ్యాత్మిక స్వభావమునుండి జనించిన గుణములను బట్టి విభజింపబడినవి (18–41) – అని గీత చెప్పును. శమము, ఆత్మ సంయమము, తపస్య, శౌచము, సహిష్ణుత, నిష్కాపట్యము, ఆధ్యాత్మిక సత్యము నంగీకరించుట–ఇవి తన స్వభావమునుండి జనించిన బ్రాహ్మణుని కర్మలు (18–42). శౌర్యము, ప్రతాపము, దృఢనిశ్చయము, దక్షత, యుద్ధమున వెన్నుచూపకుండుట, దానము, శాసకుడు మఱియు నాయకునియొక్క స్వభావము – ఇవి క్షత్రియుని సహజ కర్మలు (18–43). వ్యవసాయము, గోపాలనము, వర్తకము, హస్తకళలు – ఇవి వైశ్యుని స్వాభావిక కర్మలు. సేవారూపమగు కర్మ యంతయు శూద్రుని సహజ వృత్తిలోనికి వచ్చును (18–44). తన స్వీయ కర్మయందు నిరతుడై యుండు మానవుడు, గీత యింకను చెప్పును, సంసిద్ధిని సంపాదించును (18–45); అయితే కేవల కర్మచేతనే గాదు, అతడు తన కర్మను యథార్థ జ్ఞానముతోను, యోగ్య లక్ష్యముతోను చేయుచో, సృష్టిపురుషునికి ఒక పూజగా దానిని చేయగలుగుచో, కర్మకు ప్రేరణ యంతయు ఎవనినుండివచ్చునో, అట్టి జగదీశ్వరునికి హృదయ పూర్వకముగా దానిని నివేదించగలుగుచో, అదిగో, అట్టి కర్మచేత సంసిద్ధిని బొందును (18–46). సమస్త శ్రమయు, సమస్త క్రియ మఱియు కార్యమును, అది ఎట్టి దైనను, ఇట్టి నివేదనచేత పవిత్రముచేయబడగలదు, అప్పడా కర్మనివేదన మన లోపలను, వెలుపలను గల భగవంతుని కొరక ఆత్మనివేదనలోనికి మాఱగలదు, ఇట్లు అది స్వయముగా ఆధ్యాత్మిక సంసిద్ధికి ఒక సాధనమగును. కాని సహజముగా తనది గాని ఒక కర్మ బాగుగా చేయబడవచ్చును, ఒక బాహ్య మఱియు నిర్జీవ ప్రమాణమును బట్టి చూచినపుడు, అది శ్రేష్ఠతరముగా గన్పించవచ్చును లేక అధికతర విజయమునకు వడుపవచ్చును; అయినను అంతర్వికాసముయొక్క ఒక సాధనిగా అది హీనతర కర్మయే యగును; దాని ఉద్దేశ్యము బాహ్యము, దాని ప్రేరణము నిర్జీవము నగుటయే ఇందుకు సరిగా కారణము. మఱియొక దృక్కోణమునుంచి సదోషముగా గన్పించినను, స్వభావసిద్ధ కర్మయే శ్రేష్ఠతరము. కర్మను యథార్థ భావమునందును, తన స్వభావనియమము ననుసరించియు చేయువాడు పాపము లేక కళంకమును బొందడు (18–47). గుణధర్మికర్మయందు సర్వక్రియయు దోషయుక్తమే,

సమస్త మానవ కర్మ దోషము, లోపము లేక పరిమితత్వమున కధీనమై యుండును; కాని అది మన సముచిత కర్మను, స్వాభావిక కార్యమును విడనాడుటకు గారణము కాఁజాదు (18–48). కర్మ యథారీతిని నియమించబడిన కర్మ గావలెను – "నియతం కర్మ" (18–23), కాని అది స్వాభావికముగా తనది గావలెను, లోపలినుంచి వికసితము గావలెను, తన సత్తాసత్యముతో సుసంగతము గావలెను, తన స్వభావము చేత నియమము గావలెను – "స్వభావనియతం కర్మ" (18–47).

4. ఆనువంశికవృత్తిని గీత విధించదు : ఇచ్చట గీతాభిప్రాయము సరిగా నేమిటి? ముందు దాని బాహ్యార్థమును చేపట్టి, గీత ప్రతిపాదించు సిద్ధాంతమునకు ఆనాటి మఱియు నా జాతిభావముల వలన కలిగిన వర్ణమును పరికింతము– సాంస్కృతిక పరిసరము గల్గించిన వర్ణమును, దాని ప్రాచీన అభిప్రాయమును పరికింతము. ఈ శ్లోకములను మఱియు నీ విషయముపై గీతయొక్క పూర్వవచనములను (2–31, 3–35) చూపి, కొందరు వర్ణవ్యవస్థపై ఇప్పుడు చెలరేగుచున్న వాదవివాదములందు ఇప్పటి వర్ణపద్ధతిని సమర్థించుచుండగా, మఱికొందరు వానినే చూపి, వర్ణవ్యవస్థయొక్క ఆనువంశిక ఆధారమును కొట్టివేయుచున్నారు. కాని ఈ గీతా శ్లోకములకు ఇప్పటి వర్ణవ్యవస్థతో నెట్టి సంబంధము లేదు, ఏలన చాతుర్వర్ణ్యము, అనగా ఆర్యసమాజమునందలి సునిర్దిష్టమగు నాలుగు వర్ణములయొక్క ప్రాచీన సాంఘిక ఆదర్శమునుండి ఇప్పటి వర్ణవ్యవస్థ ఒక మిక్కిలి విభిన్న వస్తువు, ఇది గీతావర్ణనకు ఎవ్విధముగాను సరిపోదు. ఎట్లన, వ్యవసాయము, గోపాలనము సర్వవిధ వర్తకము గీతను బట్టి వైశ్యుని కర్మ కాగా, ఇప్పటి వ్యవస్థలో వర్తకము మఱియు గోపాలనముతో ప్రమేయము గల కర్మకారులు, చిన్న వృత్తులవారిలో అధికసంఖ్యాకులు శూద్రులుగా వర్గీకరించబడియున్నారు – ఒకొకప్పుడు వారిని వర్ణబాహ్యాలగు పంచము లనుటయు గలదు. మఱియు కొన్ని అపవాదములతో, ఇపుడు వర్తకమును మాత్రమే చేయు ఒక వర్గ మున్నది, కాని వారిని అన్ని చోటుల వైశ్యులని పిలుచుట లేదు. నేడు బ్రాహ్మణులనుండి శూద్రులవఱకు సర్వవర్గములకు వ్యవసాయము, ప్రజాశాసనము, సేవాకర్మ వృత్తులుగా నుండుట గన్పించును. వృత్తియొక్క ఆర్థికవిభజనలే యిప్పటి వ్యవస్థయందు సరిచేయుటకు వీలులేని రీతిగా సంకరమై పోగా, గుణమును బట్టి కర్మ–అను సూత్రమునకు ఆ మాత్రము స్థానము గూడ మిగుల లేదు. ఇపుడు సర్వము నొక కఠోర ఆచారము, దీనికి వైయక్తిక స్వభావము

యొక్క ఆవశ్యకతతో నెట్టి సంబంధము నుండదు. పోగా వర్ణవ్యవస్థను సమర్థించువారి వాదముయొక్క మతపార్శ్వమునకు తిరిగి నప్పటికి, వారి విపరీత భావమును గీతావచనములకు మన మెంతమాత్రము అంటగట్టజాలము — తన వ్యక్తిగత ప్రవణతను, సామర్థ్యములను పాటించక, మానవుడు తన తల్లిదండ్రుల లేక పూర్వుల వృత్తి ననుసరించుటయే అతని స్వభావధర్మ మని గీత ఎచ్చటను చెప్పదు, అనగా పాలవాని కొడుకు పాలవాడే, డాక్టరు పుత్రుడు డాక్టరే, చర్మకారుని సంతతి యుగాంతమువఱకు చర్మకారులే గావలె నని గీత చెప్పదు; ఇంకను, అట్లు చేయుటచేత, అనగా తన స్వీయ ప్రేరణను, గుణములను లక్షించక, మఱి యొకని స్వభావధర్మమును ఇట్లు వివేకరహితముగా, యాంత్రికముగా కొనసాగించు టచే మానవుడు తన స్వీయ పూర్ణతను అప్రయత్నముగనే పెంపొందించుకొనుచు, ఆధ్యాత్మిక స్వతంత్రతకు చేరుకొను నని గీత అసలే వచించదు. తన ఆదర్శశుద్ధత యందు వర్తించుచుండిన లేక వర్తించుచుండినట్లు తలంచబడిన చతుర్వర్ణముల ప్రాచీన వ్యవస్థనే గీతావచనములు నిర్దేశించును మఱియు గీత ఉద్దేశించిన వ్యవస్థనే మనము విచారించదగును—ఆచరణయందు అంతంతమాత్రముగా అనుష్ఠింపబడిన ఒక (అప్రాప్త) ఆదర్శమే గాని, ఇది మఱేదియు గాదని వాదించువారును గలరు. కనుక వర్ణవిషయమునను, దాని యథార్థ బాహ్యరూపమును గుఱించియు పెద్ద కఠినత ఎదురగును.

5. <u>వర్ణవ్యవస్థయొక్క త్రివిధరూపము</u> : చతుర్వర్ణముల ప్రాచీనవ్యవస్థకు మూడు రూపము లుండెను; అది ఒక సాంఘిక మఱియు ఆర్థిక, ఒక సాంస్కృతిక మఱియు నొక ఆధ్యాత్మిక రూపమును ధరించెను. ఆర్థిక పార్శ్వమునందు అది సమాజములోని మానవులకు నాలుగు వృత్తులను గుర్తించెను — ధార్మిక మఱియు బౌద్ధిక, రాజకీయ, ఆర్థిక మఱియు సేవాత్మక వృత్తులు. వీనిని బట్టి కర్మలు నాల్గు విధములు — 1. పౌరోహిత్యము, సాహిత్యము, విద్య మఱియు జ్ఞానకర్మ, 2. ప్రభుత, రాజనీతి, పాలనము మఱియు యుద్ధకర్మ, 3. ఉత్పత్తి, ధనార్జనము మఱియు వినిమయకర్మ, 4. కూలి మఱియు సేవాకర్మ. ఈ నాలుగు వృత్తులను నాలుగు సునిర్దిష్ట వర్గముల మధ్య విభజించి, ఆ విభజనపై సమాజవ్యవస్థ నంతను గట్టిగా స్థాపింప ప్రయత్నము చేయబడెను. ఈ వ్యవస్థ భారతదేశముయొక్క విలక్షణ వస్తువు గాదు, పరంతు తదితర ప్రాచీన లేక మధ్యయుగీన సమాజములందు

గూడ, అది కొన్ని మార్పులతో ఒక సాంఘిక వికాసదశయొక్క ప్రధాన రూపముగా నుండెను. ఈ నాలుగు వృత్తులు సర్వ సామాన్య సమాజముల జీవనమునందు ఇంకను అవిస్పష్టముగా నున్నవి, కాని ఆ విస్పష్ట విభజన మాత్రము ఇప్పు డెచ్చటను లేదు. ప్రాత పద్ధతి సర్వత్ర భగ్నమై, ఒక ఎక్కువ ద్రవరూప విధానమునకు, లేక, భారతమునందు వలె, ఒక అస్తవ్యస్త జటిల సాంఘిక కఠోరత మఱియు ఆర్థిక స్తబ్ధతకు స్థాన మిచ్చినది మఱియు నీ అస్తవ్యస్తత వర్ణసంకరములోనికి దిగజాఱు చున్నది. ఈ ఆర్థిక కర్మవిభజన ప్రక్కన ఒక సాంస్కృతిక భావ ముండెను; ఇది ప్రతివర్ణమునకును దాని మతాచారమును, మర్యాదాధర్మమును, నైతికనియమమును, అనురూప విద్య మఱియు శిక్షణను, శీలవిశేషమును, కుటుంబాదర్శమును, క్రమ శిక్షణను నిర్ణయించుచుండెను. అయితే జీవనతథ్యములు సర్వదా ఈ భావము ననుగమించ లేదు, ఏలన మానసిక ఆదర్శమునకును, ప్రాణిక మఱియు శారీరిక అనుష్ఠానమునకును మధ్య ఎల్లప్పుడు కొంత వ్యవధాన ముండును; కాని ఈ భావము ననుగమించుటకు ఒక సంతత శ్రమశీల ప్రయత్నము చేయబడుచుండెను. ఈ ప్రయత్నము మఱియు నది సాంఘిక మానవుని గతశిక్షణయందు సృజించిన సాంస్కృతి కాదర్శము మఱియు వాతావరణముయొక్క ప్రాముఖ్యము నెంత చెప్పి నను తక్కువే యగును; కాని వర్తమానమున దానికి ఒక చారిత్రక, ఒక భూతకాలిక మఱియు పరిణామాత్మక ప్రాముఖ్యము తప్ప మఱేమియు మిగుల లేదు. చివరకు, ఈ వ్యవస్థ ఎచ్చటెచ్చట నుండినను, దానికొక న్యూనాధిక మతసమర్థన లభించెను (ప్రాచ్యదేశములం దెక్కువ, యూరోపునందు కడు స్వల్పము) మఱియు నిండియాలో దానికొక గంభీరతర ఆధ్యాత్మిక ఉపయోగము మఱియు పరమార్థము కనుగొన బడెను. ఈ ఆధ్యాత్మిక పరమార్థమే గీతాబోధనయొక్క వాస్తవ సారము.

6. <u>వర్ణవ్యవస్థ సనాతన, సార్వత్రికము గాదు</u> : గీతాకాలము నాటికే ఈ వ్యవస్థ యుండెను మఱియు దాని ఆదర్శము భారతీయ మనస్సు నాకట్టుకొని యుండెను. కాగా గీత ఆ ఆదర్శము మఱియు వ్యవస్థ, దానికి గల ధార్మిక పరిగణన - రెండింటిని ఆమోదించెను. "గుణవిభాగము మఱియు కర్మవిభాగమును బట్టి నేనే చాతుర్వర్ణ్యమును సృజించితిని" (4-13) - అని శ్రీకృష్ణుడు చెప్పును. కేవలము ఈ వాక్యబలమును బట్టి, ఈ వ్యవస్థ ఒక సనాతన మఱియు సార్వత్రిక సాంఘిక వర్గీకరణ మని గీత భావించి నట్లు నిర్ణయించజాలము. ఇతర ప్రాచీన

శాస్త్రము లట్లు భావించలేదు; పైగా ఆదియందు అది ఉండను లేదు, తర్వాతి కాలమున అది రూపుమాసియు బోవును. అయినను ప్రతిసమాజముయొక్క మానసిక మఱియు ఆర్థిక అవసరములందు సాంఘిక మానవుని ఈ చతుర్విధ కర్మ ప్రాయః అంతర్వర్తిగా నుండును; అందుచేత సమష్టి మఱియు వ్యష్టి మానవజీవనమునందు తననుదాను ప్రకటించుకొను భగవంతుని సృష్టియే చాతుర్వర్ణ్యము - అని పై గీతావాక్యమును మనము వ్యాఖ్యానించుకొనవచ్చును. ఈ గీతా పంక్తి (4-13) నిజానికి వైదిక పురుష సూక్తమునందలి (ఋ.వే. 10-90) సుప్రసిద్ధ సంకేతము యొక్క (బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్ ....) ఒక బౌద్ధిక ప్రతిపాదనము. కాని అప్పుడు ఈ చతుర్విధ కర్మల అనుష్ఠానమునకు ఏది ఆధారము మఱియు రూపము గావలెను? ప్రాచీన కాలమున ఆనువంశికతయే కర్మవిభజనకు క్రమముగా వ్యావహారి కాధార మయ్యెను. సందేహము లేదు, ఆదియందు మానవుని సాంఘిక వృత్తి మఱియు గౌరవము పరిసరము, సందర్భము, జన్మ మఱియు సామర్థ్యముచేత నిర్ణయింపబడుచుండెను; నిజానికి ఎక్కువ స్వతంత్రము, తక్కువ వ్యవస్థితము నగు సమాజములందు ఇప్పటికిని అటులే జరుగుచున్నది. కాని కఠోర వర్గీకరణము గట్టిపడిన కొలది, వ్యవహారమునం దతని స్థానము ప్రధానముగానో, కేవలముగానో జన్మచేతనే నియతము గాజొచ్చెను మఱియు తర్వాతి కులవ్యవస్థయందు జన్మయే ప్రతిష్ఠను నిర్ణయించు ఏకమాత్ర నియమముగా రూపొందెను. ఉదాహరణకు, ఒక బ్రాహ్మణపుత్రునికి బ్రాహ్మణగుణములు లేక శీలము ఏమాత్రము లేకపోవచ్చును; ఎట్టి బౌద్ధిక శిక్షణ గాని, ఆధ్యాత్మి కానుభవము గాని, ధార్మిక యోగ్యత లేక జ్ఞానము గాని లేకపోవచ్చును; అటులే తన వర్ణముయొక్క సముచితకర్మతో అతని కెట్టి సంబంధము, అతని కర్మయం దెట్టి బ్రాహ్మణత్వము, అతని ప్రకృతియం దెట్టి బ్రాహ్మణత్వము లేకపోవచ్చును, అయినను ప్రతిష్ఠయం దతడు బ్రాహ్మణుడే.

7. కర్మ స్వభావజము, స్వభావనియతము : ఇది యొక అనివార్య పరిణామము, ఏలన బాహ్య చిహ్నములు మాత్రమే నిర్ణయించుటకు సులభము మఱియు అనుకూలము; కావున అధికాధికముగా యంత్రీకృతము, జటిలము, సాంప్రదాయికము నగు ఒక సాంఘిక వ్యవస్థయందు జన్మయే వర్ణనిర్ణయమునకు మిక్కిలి అనుకూలముగా నుండెను. ఒక వ్యక్తియందు వంశమును బట్టి ఉండవలసిన గుణముల కును, వాస్తవ సహజాత స్వభావసామర్థ్యములకును మధ్య మండగల అసమతను

కొంతకాలము విద్యాశిక్షణలచేత సరిపుచ్చిరి లేక తగ్గించిరి : కాని చివరి కీ ప్రయత్నము అసాధ్యముకాగా, అనువంశిక సంప్రదాయమే అప్రతిహత నియమమయ్యెను. ప్రాచీన స్మృతికర్తలు (law-givers) అనువంశిక ఆచారమునకు స్థానమిచ్చుచునే, గుణము, స్వభావము మఱియు సామర్థ్యములను వర్ణనిర్ణయమునకు పటిష్ఠ వాస్తవాధారముగా నొక్కిచెప్పిరి; ఏలన అది లేనపుడు అనువంశిక సాంఘిక ప్రతిపత్తి తన యథార్థ ఆశయమును గోల్పోయి, ఆధ్యాత్మికతాగంధము లేని అనృత మగును. గీత సైతము, ఇతరత్ర వలెనే ఇచ్చటను, అంత రాశయమునే తన విచారణ కాధారము గావించుకొనును. నిజమే, గీత ఒక చోట జన్మతో వచ్చిన కర్మను చెప్పును- "సహజం కర్మ" (18-48); కాని ఇది స్వయముగా అనువంశికాధారమును సూచించదు. కారణము, గీత ఆమోదించిన భారతీయ పునర్జన్మ సిద్ధాంతము ననుసరించి, మానవుని జన్మతో వచ్చిన సహజ ప్రకృతి మఱియు జీవన గతి వస్తుతః తన గత జన్మలచేత నిర్ణయించబడును; అవి తన గత కర్మలచేతను, మానసిక మఱియు ఆధ్యాత్మిక వికాసముచేతను ఇప్పటికే సాధించబడిన ఆత్మవికాస మగును మఱియు నవి అతని వంశము, మాతాపితలు, శారీరిక జన్మలయొక్క స్థూల కారణముపైన మాత్రమే ఆధారపడవు; ఈ స్థూల కారణ మొక గౌణ ప్రభావము, బహుశః ఒక కార్యసాధక చిహ్నము కాగలదు గాని, ప్రధాన తత్త్వము మాత్రము గాజాలదు. సహజ - శబ్దమున కర్థము మనతో జనించినది, ఏది నైసర్గికమో, అంతర్జాతమో, స్వభావసిద్ధమో అది. ఈ సహజ శబ్దమునకు ఇతర శ్లోకాలలో సమానార్థకము "స్వభావజము" (18-42, 43, 44, 60). ఒకని కర్మ లేక వృత్తి అతని గుణములచేత నిర్ణీత మగును (4-13. 18-60), అనగా గుణము కర్మను నిర్ణయించును; అది స్వభావమునుండి జనించిన కర్మ-"స్వభావజం కర్మ" మఱియు స్వభావముచేత నియమించబడు కర్మ - "స్వభావనియతం కర్మ" (18-47). కర్మయందును, వృత్తియందును, క్రియయందును తనను ప్రకటించుకొను అంతర గుణము మఱియు స్వభావముపై ఏ అవధారణ (emphasis) గలదో, అదియే కర్మకు సంబంధించిన గీతాభావముయొక్క సంపూర్ణాశయము.

8. <u>ఆర్యుల చాతుర్వర్ణ్యము-గీతాచాతుర్వర్ణ్యము</u> : గీత వెలుపలిరూపమును గాక, లోపలి సత్యమునే ఒత్తి చెప్పును; ఈ అవధారణనుండియే స్వధర్మానుష్ఠానమునకు గీత నిర్దేశించు ఆధ్యాత్మి కార్థము మఱియు ప్రభావము ఉత్పన్నమగును. ఈ

ప్రకరణమునకు నిజముగా ముఖ్యమగు ఆశయ మిదియే. బాహ్య సామాజిక వ్యవస్థతో ఈ ప్రకరణమునకు గల గోరంత సంబంధమును కొండంత చేతురు, ఈ వ్యవస్థను వ్యవస్థకొఱకే గీత పోషించుచున్నట్లు లేక ఒక ధార్మిక - దార్శనిక సిద్ధాంతముతో దానిని సమర్థించుచున్నట్లు చెప్పుదురు. నిజానికి గీత బాహ్యనియమమును మిక్కిలి తక్కువ, ఆంతరధర్మమును మిక్కిలి ఎక్కువ ఒత్తి చెప్పును-ఈ ఆంతరధర్మమును నియతముగా ననుష్ఠించుటకే వర్ణవ్యవస్థ ప్రయత్నించెను. మఱియు ఈ ధర్మము యొక్క సామాజిక మఱియు ఆర్థిక లేక తదితర సాంఘిక మఱియు సాంస్కృతిక ప్రాముఖ్యమునందు గాక, దాని వైయక్తిక మఱియు నాధ్యాత్మిక మూల్యమునందే గీత ఈ ప్రకరణమున తన దృష్టిని నిలిపియుంచును. గీత వైదిక యజ్ఞసిద్ధాంతము నంగీకరించెను, కాని దాని విలువల నన్నింటిని మార్చివేయు నట్లు, దాని కొక గంభీర పరివర్తనమును (మలుపును), ఒక ఆంతర, మానసిక మఱియు సార్వత్రి కార్థమును, ఒక అధ్యాత్మి కాశయము మఱియు దిశావిశేషమును గల్పించెను. ఇచ్చటను, అదే విధమున చతుర్వర్ణ సిద్ధాంతమును గీత అంగీకరించును, కాని దాని కొక గంభీర పరివర్తనమును, ఒక ఆంతర, మానసిక మఱియు సార్వత్రిక అర్థమును, ఒక ఆధ్యాత్మి కాశయము మఱియు దిశావిశేషమును గల్పించును. అపుడు వెంటనే ఈ సిద్ధాంతము వెనుక నున్న భావము తన విలువలను మార్చుకొని, ఒక శాశ్వత సజీవ సత్య మగును - ఈ సత్యము ఒక ప్రత్యేక సామాజిక రూపము మఱియు వ్యవస్థ యొక్క నశ్వరత్వముతో ముడివడియుండదు. ఇపుడు నిరాకరించబడిన లేక కరగి పోవుచున్న ఆర్యుల సాంఘిక వ్యవస్థయొక్క ప్రామాణికతను నిరూపించుట గీతా ఉద్దేశ్యము గాదు-అదియే అంతయు నగుచో, స్వభావ స్వధర్మముల గీతాసిద్ధాంతము నకు ఎట్టి శాశ్వత సత్యము లేక మూల్యము నుండదు - పరంతు మానవుని ఆంతర సత్తతో అతని బాహ్య జీవనమునకు గల సంబంధమును, అతని అంతరాత్మ మఱియు ఆంతర ప్రకృతిధర్మమునుండి అతని కర్మవికాసమును చూపుటయే గీతోద్దేశ్యము.

9. శమము కర్మ యగునా ? : మఱియు గీత నిజానికి తన ఉద్దేశ్యమును స్వయముగనే ఎట్లు స్పష్టపఱచునో మనము చూడవచ్చును : గీత బ్రాహ్మణ క్షత్రియుల కర్మను బాహ్యవృత్తియొక్క పరిభాషయందు వర్ణించదు, అనగా విద్య, పౌరోహిత్యము మఱియు సాహిత్యము లేక శాసనము, యుద్ధము మఱియు రాజనీతి యని చెప్పదు, పరంతు పూర్తిగా ఆంతర స్వభావముయొక్క పరిభాషలోనే నిర్వచిం

చును. ఈ పరిభాష మన చెవికి ఇంచుక విచిత్రముగా తట్టును. శమము, దమము, తపస్య, శౌచము, సహిష్ణుత, ఆర్జవము, జ్ఞానము, ఆధ్యాత్మిక సత్యముయొక్క ఆమోదము మఱియు అనుష్ఠానము (18-42) - ఇవి సాధారణముగా మానవునియొక్క కర్మ లేక వృత్తి యని వర్ణించబడవు. అయినను గీత సరిగా దీనినే ఉద్దేశించును మఱియు వచించును - ఈ వస్తువులు, వాని వివర్ధనము, వ్యవహారమునందు వాని ప్రకటనము, సాత్త్విక ప్రకృతియొక్క ధర్మమునకు బాహ్యరూపము గల్పించుట : ఇవియే బ్రాహ్మణుని వాస్తవ కర్మ. కాగా విద్య, పౌరోహిత్యము, తదితర బాహ్య కర్మలు ఈ వాస్తవ కర్మయొక్క మిక్కిలి ఉపయుక్త క్షేత్రము మాత్రమే యగును, ఈ ఆంతర వికాసముయొక్క ఒక అనుకూల సాధనము మాత్రమే యగును, దాని యొక్క సముచిత స్వీయ ప్రకటన మగును, సుస్థిరాదర్శమునందును, బాహ్యాకృత దృఢస్వభావమునందును తనను ప్రతిష్ఠించుకొను మార్గ మగును. యుద్ధము, పాలనము, రాజనీతి, నేతృత్వము మఱియు శాసనము అటులే క్షత్రియునికొఱకు ఒక క్షేత్రము మఱియు సాధన మగును; కాని అతని వాస్తవ కర్మ రాజోచిత లేక వీరోచితమగు సక్రియ యోద్ధృధర్మముయొక్క వికాస మగును, ఆచరణయందు దాని ప్రకటన మగును, రూపములోనికిని, క్రియాశీల గతిక్రమములోనికిని దానిని పోత పోయు శక్తి యగును. అయితే వైశ్యుని మఱియు శూద్రుని కర్మ బాహ్య వృత్తికి సంబంధించిన పరిభాషలోనే చెప్పబడినది, మఱియు ఈ మార్పునకు కొంత అర్థ ముండవచ్చును. ఏలన ఉత్పాదనము మఱియు ధనార్జనమునకు ప్రేరితమైన లేక శ్రమ మఱియు సేవాపరిధిలో బంధింపబడిన స్వభావము, అనగా వ్యాపార మఱియు దాస్య మనోవృత్తులు సామాన్యముగా ఇహిక ప్రవృత్తములు, అవి తమ కర్మయొక్క శీల నిర్మాణశక్తియందు కంటె దాని బాహ్యమూల్యములయందే ఎక్కువ చిక్కుకొని యుండును, మఱియు నీ ప్రవృత్తి స్వభావముయొక్క సాత్త్విక లేక ఆధ్యాత్మిక క్రియకు అంత అనుకూలము గాదు. ఈ కారణముచేతనే ఒక వ్యాపారిక మఱియు పారిశ్రామికయుగము, లేక కర్మ మఱియు శ్రమభావముతో వ్యగ్రమైన ఒక సమాజము ఆధ్యాత్మిక జీవనమున కంటె భౌతికమునకే ఎక్కువ అనుకూలమగు వాతావరణమును తన చుట్టును సృజించుకొనును, ఇది ఊర్ధ్వగామి మనస్సు మఱియు అంతరాత్మ యొక్క సంసిద్ధికి గాక, ప్రాణిక నైపుణ్యమునకే ఎక్కువ తగియుండును. అయినను ఇవ్విధమగు స్వభావము మఱియు దాని వృత్తులు సైతము తమ ఆంతర తాత్పర్య మును, ఆధ్యాత్మిక మూల్యమును గలిగి యున్నవి, అందుచేత సంసిద్ధి కొరక సాధనము

మఱియు శక్తిగా వానిని రూపొందించవచ్చును. ఇతరత్ర చెప్పబడినట్లు (9-33, 32) ఆధ్యాత్మికత, నైతిక పవిత్రత మఱియు జ్ఞాన-ఆదర్శము గల బ్రాహ్మణుడు మఱియు ఉదాత్తత, వీరత మఱియు ఉన్నత శీలము గల క్షత్రియుడు మాత్రమే గాక, ధనపరాయణుడగు వైశ్యుడు, శ్రమనిబద్ధుడగు శూద్రుడు, సంకుచిత పరిచ్ఛిన్న పరాధీన జీవనము గల స్త్రీ, చివరకు పాపగర్భమునందు జనించిన వర్ణబాహ్యులు- "పాపయోనయః" (9-32): వీ రందరు నైతము అత్యున్నత ఆంతర మహత్త్వము మఱియు ఆధ్యాత్మిక స్వాతంత్ర్యము దిశగా, సంసిద్ధి దిశగా, మానవ సత్తయందు గల దివ్యాంశముయొక్క విముక్తి మఱియు పరిపూర్తి దిశగా ఈ మార్గమున వెంటనే ఎగయగలరు.

10 <u>స్వభావము-మూడు ప్రతిజ్ఞలు</u>: ప్రథమ దృష్టికే మనకు మూడు ప్రతిజ్ఞలు (propositions) తోచును మఱియు నివి గీత ఈప్రకరణమున చెప్పు సమస్తము నందును అంతర్గతములని తలంచవచ్చును. 1, సమస్త క్రియయు లోపలినుండి నిర్ణయించబడవలెను, ఏలన ప్రతిమానవునియందు తన స్వీయ వస్తు వొకటి గలదు, తన ప్రకృతియొక్క ఒక విలక్షణ తత్త్వము మఱియు అంతర్జాత శక్తి గలదు (15-7). అది అతని పురుష తత్త్వముయొక్క కార్యసాధక శక్తి, అది ప్రకృతిగతమగు తన అంతరాత్మయొక్క సక్రియరూపమును సృజించును మఱియు దానిని క్రియద్వారా ప్రకటించుట మఱియు పూర్ణముగావించుట, సామర్థ్యమునందును, ప్రవర్తనయందును, జీవనమునందును ప్రబలము గావించుటయే అతని కర్మయగును. ఆ లోపలి తత్త్వమే అతని ఆంతర మఱియు బాహ్య జీవనముయొక్క యథార్థ మార్గమును సూచించును మఱియు నతని అధికతర వికాసమునకు ప్రారంభ బిందువగును. 2, స్థూలముగా ప్రకృతికి నాలుగు మూలరూపములు గలవు, ఈ ప్రతిరూపమునకు దాని స్వాభావిక వృత్తి యుండును, కర్మశీలములకు సంబంధించిన దాని ఆదర్శ నియమ ముండును మఱియు నా మూలరూపము మానవుని యథోచిత కార్యక్షేత్రమును సూచించును మఱియు దాని సముచిత పరిధిని నిర్ణయించగలుగును (18-41), 3, చివరకు, మానవు డే కర్మ చేసినను, దానిని తన సత్తాధర్మమును, తన ప్రకృతిసత్యమును అనుసరించి చేయు నేని, దానిని భగవంతుని వైపునకు త్రిప్పి, ఆధ్యాత్మిక విముక్తి మఱియు సంసిద్ధికి ఒక పటిష్ఠ సాధనము గావించుకొన గలడు (18-45). వీనిలో మొదటి మఱియు మూడవ ప్రతిజ్ఞలు స్పష్టమగు నొక సత్యము

మఱియు న్యాయముయొక్క సూచనలు. మానవుని వైయక్తిక మఱియు సామాజిక జీవనముయొక్క సామాన్య ప్రకారము నిక్కముగా ఈ సూత్రములకు ఒక వ్యాఘాతముగా గన్పించును; ఏలన నిశ్చయముగా బాహ్య ఆవశ్యకత, నియమము మఱియు ధర్మముయొక్క ఒక భీషణ భారము మనము వహింతుము, మఱియు స్వీయాభివ్యక్తినిమిత్తము, మనలోని సత్యపురుషునియొక్క వాస్తవ అంతరాత్మయొక్క మఱియు జీవితమునందు మన ఆంతరతమ విలక్షణ ప్రకృతిధర్మముయొక్క వికాసమునిమిత్తము మన కే అవసరము గలదో, దానితో పదపదమునందు పరిసర ప్రభావములు జోక్యము కల్పించుకొనును, దానిని అడ్డగించును, దారి తప్పించును, దానికి గల అవకాశమును, క్షేత్రమును మృగ్యమొనరించును. జీవితము, ప్రభుత్వము, సమాజము, కుటుంబము - సర్వవిధ పరిసర శక్తులు మన స్వభావముపై తమ కాడిని మోపుటకును, తమ గాడిలోనికి మనలను లాగుటకును, తమ స్థూలప్రయోజనమును, స్థూల తాత్కాలిక అనుకూల్యమును మనపై విధించుటకును కుట్ర పన్నినట్లు గన్పించును. ఇట్లు మనము యంత్రభాగముల మగుదుము; వాస్తవార్థమున "పురుషులు" మఱియు "మనుష్యులు"గా జీవించ మన కవకాశ మివ్వబడదు, అనగా మన సత్తయొక్క అత్యున్నత స్వీయ సంసిద్ధిని సాధించుటకును, దానిని జాతిసేవకొక సాధనము చేసికొనుటకును సామర్థ్యము గల అంతరాత్మలు, మనస్సులు మఱియు ఆత్మయొక్క విముక్త పుత్రులముగా జీవించజాలము. కావున మనము పరిస్థితుల పుత్రులమే గాని, స్వీయ నిర్మాతలము గాము - అనిపించును. అయినను ఎంతెంత మనము జ్ఞానమునందు పురోగమింతుమో, గీతానియమముయొక్క సత్యము అంతంతగా గోచరించితీరును. బాలుని విద్య, అతనిలో నేది శ్రేష్ఠాంశమో, మిక్కిలి శక్తివంతమో, మిక్కిలి ఆంతరము మఱియు సజీవమో, దాని ఆవిష్కరణము గావలెను. మానవుని కర్మ మఱియు వృద్ధి అతని స్వభావగత గుణము మఱియు శక్తిరూపము ధరించవలెను. అతడు నూతన వస్తువుల నార్జించవలసినదే, కాని తన స్వీయ వికసిత మూలరూపము మఱియు అంతర్జాత శక్తియొక్క ఆధారముపైననే వానిని శ్రేష్ఠముగా, పటిష్ఠముగా నార్జించగలడు. అటులే మానవుని వృత్తియు నతని సహజ ప్రవృత్తి, సంపత్తి మఱియు సామర్థ్యములచేత నిర్ణయింపబడదగును. ఈ రీతిని స్వతంత్రముగా వికాసము నందుచుండు వ్యక్తి ఒక సజీవ ఆత్మ మఱియు మానసముగా భాసించును మఱియు జాతిని సేవించుట కతనికి ఎంతో ఎక్కువ శక్తి యుండును. ఈ గీతానియమము వ్యష్టిమానవుని పట్లనే గాక, సమాజము మఱియు

జాతి, సముదాయాత్మ, సమష్టిమానవుని పట్ల సైతము సత్యమని ఇప్పుడు మనము స్పష్టముగా జూడగలము. అయితే చతుర్వర్ణములు, వాని వృత్తులకు సంబంధించిన రెండవ ప్రతిజ్ఞ ఎక్కువ వివాదాస్పదము. అది జీవన జటిలతను, మానవ ప్రకృతి యొక్క నమనశీలతను (plasticity) తగినంతగా పరిగణించదు, అది అతిసరళము మఱియు నతినిశ్చితము; మఱియు చాతుర్వర్ణ్యసిద్ధాంతము, దాని అంతర్గత యోగ్యత లెట్టివైనను, దాని బాహ్య ప్రయోగము యాంత్రిక నియమముయొక్క ప్రాప కాఠిన్యమునకే దారితీయును మఱియు నట్టి కాఠిన్యము సరిగా స్వభావగతమగు స్వధర్మమునకే సర్వవిధ వ్యాఘాత మగును. కాని ఈ సిద్ధాంతముయొక్క లోతులలో దీనికి తక్కువ వివాదాస్పదమగు మూల్యము నిచ్చు ఒక గభీరత రార్థము గలదు. ఒకవేళ దీనిని మనము నిరాకరించినను, మూడవ సూత్రము తన విశాలార్థమును నిలిచియే యుండును : జీవితమునందు ఒకని కర్మ మఱియు వృత్తి ఎట్టిదైనను, అది లోపలినుంచి నిర్ణయింపబడు నేని లేక తన ప్రకృతియొక్క స్వీయప్రకటనముగా దానిని చేసికొన నతని కవకాశ మీయబడు నేని, అతడు దానిని తన అభివృద్ధికి, అధికతర ఆంతరసంసిద్ధికి ఒక సాధనముగా మలచుకొనగలడు. మఱియు తన స్వభావ సిద్ధ వృత్తి ఎట్టిదైనను, అతడు దానిని సరియగు భావమున ఆచరించు నేని, ఆధ్యాత్మ మాననముతో దానిని ప్రదీప్తము గావించు నేని, లోపలి భగవంతుని ఉపయోగార్థము తన వృత్తికర్మను మరల్చు నేని, అటులే విశ్వమునందు అభివ్యక్తమగు విశ్వపురుషుని దానితో సేవించు నేని లేక మానవజాతియందలి భగవంతుని ప్రయోజనార్థము దాని నొక సచేతన ఉపకరణక్రియ గావించునేని, పరమ ఆధ్యాత్మిక సంసిద్ధి మఱియు స్వాతంత్ర్యమునకు అతడు దాని నొక సాధనముగా రూపాంతరము జెందించు కొనగలడు.

11. <u>సంసిద్ధిశక్తి లోపలనే గలదు</u> : కాని యివ్విషయమున గీతాబోధనకు ఇంతకంటెను గంభీరత రార్థము గలదు – సాధారణముగా చేయబడు నట్లు, అర్థమును స్వయంపూర్ణమగు ఒక వియుక్త ఉదాహరణగా దానిని తీసికొనక, గీత ఆద్యంతము, విశేషించి చివరి పండ్రెండు అధ్యాయములలోను ఏమి చెప్పుచు వచ్చినదో, దాని అంతటితో బాటు తీసికొనినచో – మనము చేయదగిన దిదియే – అప్పు డా గంభీరతర రార్థము స్పష్టపడును. జీవితము మఱియు కర్మవిషయమున గీతాసిద్ధాంత ప్రథమేమన, సర్వము దివ్యసత్తనుండి, విశ్వాతీత విశ్వగత పరమ పురుషునుండి ప్రభ

వించును (10-8). అంతయు వాసుదేవునియొక్క (7-19) ప్రచ్ఛన్న అభివ్యక్తియే- "యతః ప్రవృత్తిర్ భూతానాం యేన సర్వ మిదం తతం" (18-46). కాగా, హృదయములోను, జగత్తులోపలను గల అమృతపురుషుని ఆవిష్కరించుట, జగదాత్మతో ఏకతయందు నివసించుట, చేతన, జ్ఞానము, సంకల్పము, ప్రేమ మఱియు ఆధ్యాత్మి కానందమునందు పరమపురుషునితో ఏకతలోని కెగయుట, మన వ్యక్తిగత మఱియు ప్రకృతిగత సత్త అపూర్ణత మఱియు అజ్ఞానమునుండి విముక్తమై, దివ్య శక్తికి ఒక సచేతన ఉపకరణము చేయబడిన స్థితిలో అత్యున్నత ఆధ్యాత్మిక ప్రకృతియందు జీవించుట-ఇదిగో, యిది మానవజాతికి సాధ్యమగు సంసిద్ధి మఱియు అమరత్వ స్వాతంత్ర్యములకు పరమ నిబంధనము. కాని యిది ఎట్లు సంభవమగును? ఏలన మన మిప్పుడు ప్రాకృతాజ్ఞానములో మునిగియున్నాము, అంతరాత్మ అహంకార కారాగారమున బంధింపబడియున్నది, పరిస్థితులు మనలను ఓడించి, ఆక్రమించి, మర్దించి, మనకు ప్రాకృతరూప మిచ్చినవి, ప్రకృతి యాంత్రికవిధానమున కిపుడు అధీనులము మఱియు మన స్వీయ రహస్య ఆధ్యాత్మిక శక్తియొక్క వాస్తవి కాలంబనము నఱికివేయబడినది. ఈ ప్రశ్నకు సమాధాన మేమన, ఈ ప్రాకృత క్రియయంతయు, ఇపు డది ఒక విరుద్ధ వ్యాపారమునం దెంతగా ఆవృతమై యున్నను, తన స్వీయ వికసనశీల విముక్తి మఱియు సంసిద్ధిసూత్రమును తనలోనే గలిగియున్నది. ఒక దేవాధిదేవుడు ప్రతివాని హృదయమున ఆసీనుడై యున్నాడు మఱియు ప్రకృతియొక్క ఈ నిగూఢ చర్యను నడుపుచున్నాడు (18-61). ఈ విశ్వపురుషుడు, సర్వము తానే యైన ఈ ఏకుడు, యంత్రము నెక్కిన వారినివలె మనలను జగచ్చక్రమున మాయాప్రభావముచే త్రిప్పుచు, కుండను కుమ్మరివలె, బట్టను నేతగానివలె, ఒకానొక సునిపుణ యాంత్రిక సూత్రముచే మనకు తెలియకయే మనలను మలచుచున్నట్లు పొడకట్టినను, అతడు నిజానికి మన స్వీయ మహత్తమ ఆత్మయే మఱియు నిజానికతడు తన సర్వజ్ఞ సర్వశక్తతయందు మనకు సంబంధించిన మూలభావమును, మనఅంతరాత్మ సత్యమును బట్టియే మన కధికాధికముగా రూపమును దిద్దుచున్నాడు; ఇట్లే అంతరాత్మ సత్యము మనలో వృద్ధి నందుచు, జన్మజన్మలయందు నూతన,పర్యాప్తతర రూపములను బొందుచున్నది, అనగా నది పశురూపమును వీడి మానవరూపమును, దీనిని వీడి దివ్యరూపమును బొందును; మనకుకనువిప్పు కలిగినకొలది ఈ సత్యమును కనుగొందుము. అహంకారముయొక్క ఈ యాంత్రికవిధానము, త్రిగుణముల ఈ జటిలత, మనఃప్రాణ శరీరములు, ఆలోచనా భావ కామనలు, ఆకాంక్షా ప్రయాస ప్రయత్నముల

యొక్క ఈ సంకులత్వము; సుఖదుఃఖములు, పుణ్యపాపములు, జయాపజయములు, ఆత్మ మఱియు పరిసరము, నేను మఱియు నితరుల ఈ పరస్పర సంబద్ధ సంఘర్షము- ఇవి యన్నియు నాలోని ఉచ్చతర ఆధ్యాత్మిక శక్తి ధరించిన బాహ్య అపూర్ణ రూపము మాత్రమే; ఈ శక్తి తన వివిధావస్థలద్వారా దివ్యసత్యతయొక్క ఉత్తరోత్తర స్వీయాభివ్యక్తి దిశగానే సాగుచున్నది మఱియు నీ దివ్యసత్యతయు, దాని మహత్త్వమును నే నిప్పటికే గుప్తముగా నా ఆత్మయందు అయియున్నాను మఱియు ముందు ప్రకటముగా నా ప్రకృతియందును కాగలను, ఇట్లు ఈ శక్తిక్రియ తన విజయ సూత్రమును, అనగా తన స్వభావ, స్వధర్మసూత్రమును తనలోపలనే కలిగియున్నది.

12. స్వభావనిర్వచనము, వివరణము : జీవుడు విశ్వాత్మను ప్రకటించుటయందు పురుషోత్తముని ఒక అంశము (15-7). ప్రకృతియం దతడు ఆ పురుషోత్తముని శక్తియొక్క ఒక ప్రతినిధి కాగా, తన వ్యక్తిత్వమునం దత డా శక్తియే యగును; తన వైయక్తిక సత్తయం దతడు విశ్వాత్మయొక్క శక్యతలను (Potentialities) వెలికి దెచ్చును. ఈ జీవుడు స్వతః ఆత్మయే గాని, జడ అహంకారము గాడు; అహంకారముయొక్క రూపము గాక, దాని ఆత్మయే మన సత్యత యగును, మన అంతరాత్మ తత్త్వ మగును. మన మేదిగా నున్నామో, ఏది కాగలమో, దాని వాస్తవ బలము (force) అచ్చట, ఉచ్చతర ఆధ్యాత్మిక శక్తియం దున్నది. కాగా గుణముల యాంత్రిక మాయ (7-14) దాని క్రియలయొక్క ఆంతరతమ మూలభూత సత్యము గాదు; అది యిప్పటి ఒక కార్యనిర్వాహక ఊర్జము (energy) మాత్రమే, నిమ్న సౌకర్యముయొక్క ఒక పరికరము మాత్రమే, బహిర్ముఖ వ్యాయామము మఱియు అభ్యాసముయొక్క ఒక పథకము మాత్రమే. విశ్వమునం దీ బహువిధ వ్యక్తిత్వరూపము ధరించిన ఆధ్యాత్మిక ప్రకృతి – "పరా ప్రకృతిర్ జీవభూతా" (7-5) – మన స్వభావముయొక్క మూలద్రవ్యము : తక్కిన దంతయు ఒక అత్యున్నత గుప్త ఆత్మక్రియనుండి ఉత్పన్నమైన ఒక నిమ్న వికారము, ఒక బాహ్య నిర్మాణము. మఱియు ప్రకృతియందలి మనలో ప్రతియొకడు తన స్వీయ సంభూతియొక్క ఒక తత్త్వము మఱియు సంకల్పమును గలిగియున్నాడు; ప్రతి అంతరాత్మయు ఆత్మచేతనయొక్క ఒక శక్తి, ఈ శక్తి తనలో భగవంతుడు నిక్షేపించిన ఒక భావమునకు రూపకల్పన గావించును మఱియు దాని ననుసరించి తన క్రియ మఱియు వికాసము, తన అధికాధిక స్వరూప దర్శనమును, తన సంతత

పరివర్తనశీల స్వీయప్రకటనమును, పైకి అనిశ్చితముగా గన్పించినను, లోపల సునిశ్చితమగు పూర్ణతాదిశగా తన అభివృద్ధిని తీర్చిదిద్దుకొనును. ఇదిగో, ఈ భావమే మన స్వభావము (18-47), అనగా మన స్వీయ వాస్తవ ప్రకృతి; అదియే మన సత్తాసత్యము, ఈ సత్యమిపుడు (పశుజన్మను దాటిన మానవజన్మయందు) మాత్రమే మన నానావిధ సంభూతియందు ఒక సంతత ఆంశిక అభివ్యక్తిని పొందుచున్నది. ఈ స్వభావముచే నిర్ణీతమైన కర్మధర్మమే స్వరూపనిర్మాణమునకును, వృత్తికిని, క్రియకును సముచిత ధర్మ మగును, మన స్వధర్మ మగును.

13. శాశ్వతధర్మము, తాత్కాలికధర్మములు : ఈ సూత్రము సృష్టియందంతటను గన్పించును; సర్వత్ర ఒకే శక్తి, ఒకే సర్వసామాన్య వైశ్వప్రకృతి కర్మ చేయుచున్నది, కాని ప్రతి స్తరము, రూపము, ఊర్ణము, జాతి, ఉపజాతి, వైయక్తిక ప్రాణియందును ఆమె ఒక ప్రధాన భావమును మఱియు సంతత సంకీర్ణ పరివర్తనశీలమగు కొన్ని గౌణ భావములు మఱియు సూత్రములను అనుసరించును, ఈ ప్రధాన మఱియు గౌణ భావములే ప్రతిదానియొక్క శాశ్వతధర్మము మఱియు గౌణధర్మములకు ఆధారమగును. ఇవి సంభూతియందు దాని సత్తయొక్క ధర్మమును నిర్ణయించును, దాని జన్మ, స్థితి మఱియు పరివర్తనయొక్క రేఖను నిర్ణయించును, దాని స్వరక్షణము మఱియు స్వవర్ధనముయొక్క శక్తిని నిర్ణయించును, దాని స్థిర మఱియువికసనశీల ఆత్మప్రకటనము మఱియు ఆత్మదర్శనముయొక్క మార్గములను నిర్ణయించును, విశ్వమునందు ఆత్మయొక్క తక్కిన అభివ్యక్తియంతటితోను దాని సంబంధములయొక్క నియమములను నిర్ణయించును. తన సత్తాధర్మమును, అనగా స్వధర్మము ననుసరించుట, తన సత్తయందలి భావమును, అనగా స్వభావమును పెంపొందించుట తన భద్రతాస్థానమును, తన సముచిత మార్గము మఱియు పద్ధతియు నగును (3-35). అది అంతరాత్మను ఎట్టి యిప్పటి బాహ్యనిర్మాణమునకు బంధించి యుంచదు, పైగా తన స్వీయ ధర్మము మఱియు తత్త్వముతో నూత నానుభవము లను సారూప్యమొందించుకొనుచు, నిశ్చయముగా తన సమృద్ధిని సాధించుకొనును మరియు నట్లు మిక్కిలి ఏపుగా పెరిగి, యథాసమయమున ఇప్పటి రూపమును భేదించి, దాని కావల నొక ఉచ్చతర ఆత్మాభివ్యక్తి ప్రక్రియ నందుకొనును. తన స్వీయ ధర్మము మఱియు తత్త్వమును రక్షించుకొనలేకపోవుట, పరిస్థితి తన కనుకూలము మఱియు తన ప్రకృతికి ఉపయుక్తము కాగల రీతిగా, తనను పరిస్థితి

కనుకూలము గావించుకొనుటయందు అసఫల మగుట యన తనను దాను గోల్పోవుట యగును, తన ఆత్మయొక్క అధికారమును నష్టపోవుట యగును, తన ఆత్మ మార్గమునుండి భ్రష్టమగుట యగును. అది 'వినష్టి' యగును, అనృతము, మరణము. క్షయము మఱియు విలయముయొక్క వేదన యగును మఱియు తఱచుగా గ్రహణము మఱియు అంతర్ధానమునకు పిమ్మట తిరిగి ఆత్మను బొందవలసిన ఆవశ్యకతవలన గలుగు వ్యధ యగును - ఇది యంతయు మన వాస్తవ ప్రగతిని కుంఠితముగావించు అసన్మార్గము గల్పించు వ్యర్థ చక్రము మాత్రమే। ఈ స్వధర్మము ఈయా రూప మున సర్వప్రకృతియందును గన్పించును; ఇది భౌతికవిజ్ఞానము మన కావిష్కరించిన సర్వసామాన్యతా-నియమము మఱియు వైవిధ్య-నియమముయొక్క సర్వ క్రియకు నాధారము. ఇదే ధర్మము మానవ జీవుని జీవనమునందు - అనేక మానవదేహము లలో అతని అనేక జీవనములందు - వర్తించును. అయితే అది యక్కడ ఒక బాహ్య క్రీడను, ఆంతర సత్యమును గలిగియుండును మఱియు మనము ఆంతర ఆధ్యాత్మిక సత్యమును గనుగొని, ఆత్మమూల్యములతో మన కర్మ నంతను ఉద్భాసి తము గావించి నపుడే, బాహ్య క్రీడ తన పూర్ణ వాస్తవార్థమును ప్రకటించుకొన గలదు. ఈ వాంఛనీయ మహా రూపాంతరమును, మనము ఆత్మజ్ఞానమునందు ఎంతెంత పురోగమింతుమో, అంతంత వడిగా, బలముగా సాధించుకొనగలము.

14. స్వభావముయొక్క ఆధ్యాత్మికార్థము : మఱియు, అత్యున్నత ఆధ్యాత్మిక ప్రకృతియందు స్వభావమున కొక అర్థము గల దనియు, గుణాత్మక నిమ్న ప్రకృతియందు దాని కొక మిక్కిలి విభిన్న రూపము మఱియు తాత్పర్యము గల దనియు మనము ముందుగా చూడదగును. ఇచ్చటను అది పనిచేయును గాని, తనపై దనకు పూర్తివశ ముండదు; ఒక అర్ధప్రకాశము లేక అప్రకాశమువందు తన స్వీయ యథార్థ ధర్మమును వెదకుచున్నట్లు గన్పించును; అనేక నిమ్న రూపములు, అనేక మిథ్యారూపములు, అనంతమగు లోపములు, అపచారములు, ఆత్మహాని మఱియు ఆత్మలాభములు, ప్రమాణము మఱియు నియమముల అన్వేషణలద్వారా అది ముందుకు సాగును; అట్లు చివర కది తననుదానే కనుగొని, సంసిద్ధిని బొందును. ఇచ్చట మన ప్రకృతి జ్ఞానాజ్ఞానముల, సత్యానృతముల, జయాపజయముల, యుక్తా యుక్తముల, హానిలాభముల, పాపపుణ్యముల ఒక సంమిశ్ర వస్త్రముగా నుండును. వీని యన్నింటిద్వారా ఆత్మప్రకటనము, మఱియు నాత్మప్రాప్తికొఱకు జూచుచున్న

తత్త్వము సదా ఈ స్వభావమే - "స్వభావస్తు ప్రవర్తతే" - ఈ సత్యము మనకు సార్వత్రిక ఉదారతను, సమతను నేర్పవలెను, ఏలన మన పందరము ఇట్టి ఒకే విధమగు భ్రాంతి మఱియు సంఘర్షమునకు అధీనులమై యున్నాము. అయితే ఈ క్రియలు అంతరాత్మకు గాక, ప్రకృతికే చెందును. పురుషోత్తము డీ అజ్ఞానములోపల బద్ధుడు గాడు; అతడు దానిని పైనుంచి నియమించుచు, దాని వికారములద్వారా అంతరాత్మను ముందుకు నడుపును. పోగా, శుద్ధ అక్షర ఆత్మ ఈ క్రియలచే స్పృశింపబడదు; అది తన అస్పృశ్య సనాతనచే ఈ క్షరప్రకృతిని ఆమె మార్పుల యందు సాక్షిగా దర్శించుచు, ధరించియుండును. పిమ్మట, వ్యక్తియొక్క వాస్తవ అంతరాత్మ, అనగా మనయందలి కేంద్రసత్త వీనికంటెను మహత్తరము, కాని ప్రకృతియందు తన బాహ్య వికాసము నిమిత్తము వాని నామోదించును. మఱియు మన మెప్పుడు ఈ వాస్తవ అంతరాత్మను (15-7, 10), మనలను ధరించియుండు నీ అక్షర సర్వగత ఆత్మను (12-3) ప్రకృతిక్రియ కంతకును అధ్యక్షత వహించి, దానికి మార్గము నిర్దేశించుచు, మనలోపల హృదయస్థుడై యుండు ఈశ్వరుని (18-61) - పురుషోత్తముని - అధిగమింతుమో, అపుడు మన జీవనధర్మముయొక్క సమస్త ఆధ్యాత్మి కార్థమును కనుగొనినవార మగుదుము. ఏలన మన కపుడు సర్వ భూతములందును 'అనంతగుణ' రూపమున తనను సర్వదా అభివ్యక్తము గావించు కొనుచుండు జగదీశ్వరుని ఎఱుక మన కుండును. అపుడు మనము భగవంతునియొక్క చతుర్విధ సన్నిధిపట్ల అభిజ్ఞుల మగుదుము - 1. ఆత్మజ్ఞానము మఱియు ప్రపంచ జ్ఞానముయొక్క [కేంద్రమగు] ఒక సమష్టి-ఆత్మ, 2. తన శక్తులను అన్వేషించి, ఉపయోగించునట్టి బలము మఱియు శక్తి యొక్క ఒక సమష్టి-ఆత్మ, 3. అన్యోన్యత మఱియు సృష్టి మఱియు ప్రాణిప్రాణికిని మధ్య గల సంబంధ వినిమయములయొక్క ఒక సమష్టి-ఆత్మ, 4. విశ్వమునందు శ్రమించుచు, ప్రతిదానియందును అందరిని సేవించుచు, ప్రతిదాని శ్రమను తక్కిన అన్నింటి సేవలోనికి మార్చునట్టి ఒక [1]సమష్టిఆత్మ. మనయందలి భగవంతుని వైయక్తిక శక్తియు మనకు దెలియవచ్చును : ఈ శక్తి పై నాలుగు శక్తులను సరాసరి ఉపయోగించును, స్వీయాభివ్యక్తియొక్క మన ప్రకారమును నిర్దేశించును, మన దివ్య కర్మ మఱియు కార్యమును నిర్ణయించును

[1] ఈ నాలుగు మహేశ్వరి, మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతులను సూచించును,

మఱియు దాని యంతటిద్వారాను మనలను వైవిధ్యమునందలి తన సర్వసామాన్యతా భావమునకు లేవనెత్తును; చివరి కిట్లు దీనిచే మన మతనితోను, విశ్వమునందలి తన సర్వభావముతోను ఆధ్యాత్మిక ఏకత నధిగమింతుము.

15. బాహ్య చాతుర్వర్ణ్యము గుణగతము : మానవుల చతుర్వర్ణముల యొక్క బాహ్య భావము దివ్య క్రియకు సంబంధించిన ఈ సత్యముయొక్క బాహ్యతర కర్మవిధానమునకు మాత్రమే వర్తించును; త్రిగుణముల యందలి దివ్యక్రియకు మాత్రమే అది పరిమితము. ఇచ్చటి జన్మమున మానవులు స్థూలముగా నాలుగు శ్రేణులలోనికి వచ్చివేతు రనుమాట నిజమే – 1. జ్ఞానప్రధాన మానవుడు, 2. శక్తిప్రధాన మానవుడు, 3. ఉత్పాదనశీల ప్రాణిక మానవుడు, 4. స్థూల శ్రమ మఱియు సేవాత్మక మానవుడు. అయితే యివి మూలభూత విభాగములు గావు, పరంతు మానవభావమునందు స్వీయ వికాసముయొక్క దశలు మాత్రమే. మానవ జీవి అజ్ఞానజడతల పెద్ద బరువుతో తన యాత్ర ప్రారంభించును. అతని ప్రథమావస్థ ఒక స్థూల శ్రమావస్థ; అది అతని పాశవిక (animal) అలసత్వముపై శరీరావసరములచేతను, ప్రాణప్రేరణచేతను, ప్రకృతినియతిచేతను విధించబడును మఱియు, కొంతవఱకు వ్యక్తి – అవసరములు తీరిన పిమ్మట, ఒక విధమగు ప్రత్యక్ష లేక పరోక్ష సాంఘిక బలాత్కారముచేతను విధించబడును; మఱియు నిట్టి తమస్సుచే నింకను శాసించబడు మానవులు శూద్రులు (18–44), సమాజముయొక్క శ్రామికులు; వారు దానికి తన శ్రమను మాత్ర మిత్తురు గాని, ఎక్కువ పరిణతి జెందిన వారివలె దాని బహువిధ జీవనవిలాసమునకు మఱేమియు నర్పింపజాలరు. తర్వాత, తీవ్రక్రియచే మానవుడు తనయందు రజోగుణమును పెంపొందించును, అపుడు ద్వితీయ శ్రేణి మానవుడు పరిణమించును; ఇతడు ఉపయుక్త సృష్టి, ఉత్పత్తి, సంగ్రహము, ఉపార్జనము, ధారణము మఱియు భోగము నిమిత్తము ఒక సంతత సహజ ప్రేరణచే చోదితుడగును, ఇతడే మధ్యగతుడగు ఆర్థిక మఱియు ప్రాణిక మానవుడు, వైశ్యుడు (18-44). పిమ్మట, మన ఒకే సామాన్య ప్రకృతియొక్క రాజసిక లేక గతిమయ గుణముయొక్క ఒక ఉచ్చతర పదమునందు మనకు క్రియాపర మానవుడు గన్పించును (14–12); ఇతనికి ప్రబలతర సంకల్ప ముండును, సాహసతర లాలస లుండును, కర్మ ప్రవృత్తియు, యుద్ధప్రవృత్తియు, తన సంకల్పమును విధించు ప్రవృత్తియు నుండును; తన ప్రబలతమ రూపమునం దతనికి నేతృత్వము, శాసనము

పాలనము నెరపజూచు ప్రవృత్తియు, జనతాసముదాయములను తన కక్ష్యలో నీడ్చు కొనుపోవు ప్రవృత్తియు నుండును: ఇతడే క్షత్రియుడు (18-43) - యోధుడు, నాయకుడు, శాసకుడు, యువరాజు, రాజు. చివరకు, ఎచ్చట సాత్త్విక మానసము ఆధిపత్యము వహించునో, అచ్చట మనకు బ్రాహ్మణుడు దర్శన మిచ్చును, ఇతడు జ్ఞానపరాయణుడు (18-42), ఇతడు విచారణను, మననమును, సత్యాన్వేషణమును, ఒక బౌద్ధిక లేక అత్యున్నత స్థానమునందు ఒక ఆధ్యాత్మిక నియమమును జీవితము లోనికి గొనివచ్చును మఱియు దానిచేత జీవితమునకు సంబంధించిన తన భావనను, విధానమును విభాసితము గావించును.

16. <u>క్రమారోహణము - సహసారోహణము</u>: మానవ ప్రకృతియందు ఈ నాలుగు వ్యక్తిత్వములును సదా ఎంతోకొంత యుండును - వికసితము లేక అవికసితముగనో, విశాలము లేక సంకుచితముగనో, అడగద్రొక్కబడి లేక పైకి లేచుచునో యుండును, కాని పెక్కుమందియందు వీనిలో నొకటి ప్రాబల్యము వహింపసాగి, ప్రకృతియందలి క్రియ నంతను తానే ఆక్రమించుచున్న ట్లుండును. మఱియు నెట్టి సమాజమునం దైనను, ఈ చతుర్వర్గము లుండక తప్పదు - ఉదాహరణకు, ఆధునిక యుగము సాధింప యత్నించి నట్లు, మనము కేవలము ఉత్పాదకము మఱియు వ్యాపారికము నగు సమాజమును సృష్టించగలిగి నప్పటికి లేక ఒక అడుగు ముందుకు వేసి, ఆధునిక మానసము నాకర్షించు నట్టియు, ఇపుడు యూరోపులో ఒక ప్రాంతమున ప్రయోగమునం దున్నట్టియు ఒక శూద్ర సమాజమును, శ్రామికవర్గమును నిర్మించగలిగి నప్పటికి, చతుర్వర్గము లుండక తప్పదు. ఏలన అప్పుడును ధర్మమును, సత్యమును, సర్వకర్మయొక్క మార్గదర్శక సూత్రమును అన్వేషింప ప్రేరితులగు మేధావు లుందురు; అటులే సాహసము, యుద్ధము, నేతృత్వము మఱియు ఆధిపత్యము నపేక్షించు తమ స్వభావ సంతృప్తికి ఈ ఉత్పాదక క్రియాకలాపము నంతను ఒక నెపము గావించుకొను పరిశ్రమల అధ్యక్షులు మఱియు నాయకులు నుందురు; ఇంకను కేవలము ఉత్పాదకులు మఱియు ధనోపార్జనపరులు నగు విస్పష్ట అధికసంఖ్యాక మానవులు నుందురు, చివరకు ఇంచుక పరిశ్రమతోను, దాని ప్రతిఫలముతోను తృప్తి వహించు సాధారణ కార్మికులు నుందురు. కాని యివి యన్నియు బాహ్య విషయములు, మఱియు నివియే సర్వస్వ మగుచో, చాతుర్వర్ణ్యముపై నాధారపడిన అర్థవ్యవస్థకు ఎట్టి ఆధ్యాత్మిక

మర్మము నుండదు. లేక, అప్పడప్పుడు భారతదేశము[illegible]బడి నట్లు, మన జన్మలయందు ఈ వికాసదశలద్వారా మనము పురోగమి[illegible]యుండును – అని దీని అధికాధిక అర్థము గావచ్చును; ఏలన మన మవశ్య[illegible]తామసికము, రాజసిక తామసికము, రాజసికము లేక రాజసిక – సాత్త్వికము[illegible] సాత్త్వికప్రకృతికి ఉత్తరోత్తరము ఉద్గమించుచు, ఒక ఆంతర బ్రాహ్మణత్వములోని కారోహించి, అచ్చట నిలద్రొక్కుకొని, పిమ్మట తదాధారమునుండి గుణవిముక్తికి యత్నించవలెను. కాని అట్టి సందర్భమున, శూద్రుడు లేక చండాలుడు సైతము (9–32) తన జీవనమును భగవదభిముఖము గావించి (9–30), సూటిగా ఆధ్యాత్మిక స్వేచ్ఛ మఱియు సంసిద్ధిపదము నారోహించగలడు (9–31) – అను ప్రతిజ్ఞకు (9–31) ఎట్టి సహేతుక స్థానము నుండకపోవును.

17. ఆంతర స్వధర్మము స్వతంత్రము : మూలసత్య మీ బాహ్య వస్తువు గాదు, పరంతు అది గతిలోనికి దిగిన అంతఃసత్తయొక్క బలము, ఆధ్యాత్మిక ప్రకృతియొక్క చతుర్విధ సక్రియ శక్తికి సంబంధించిన సత్యము. ప్రతి జీవునికి తన ఆధ్యాత్మిక ప్రకృతియం దీ నాలుగు పార్శ్వములు నుండును – 1. అతడు ఒక వైపున జ్ఞానాత్మకుడు, 2. ఒక వైపున శక్తి మఱియు బలాత్మకుడు, 3. ఒక వైపున అన్యోన్యత మఱియు ఆదాన ప్రదానాత్మకుడు. 4, ఒక వైపున కర్మ మఱియు సేవాత్మకుడు. అయితే, కర్మ మఱియు అభివ్యంజక భావమునందు ఏదియోయొక్క పార్శ్వము ప్రాధాన్యము వహించి, అంతరాత్మకు దాని సదేహ ప్రకృతితో గల వ్యాపారమునకు తన రంగును బూయును; అది ఇతర శక్తులకు నాయకత్వము వహించి, వానిని తన ప్రధాన కర్మవిధానము, ప్రవృత్తి మఱియు అనుభవమున కుపయోగించుకొనును. ఇట్టియెడ స్వభావము, సాంఘిక వృత్తివిభజనయందువలె అసంస్కృతముగను, కఠోరముగను గాక, ఈ విధానధర్మము ననుసరించును మఱియు నట్లు దానిని వికసింపజేయుచు, తోడ్తోడ తక్కిన మూడు శక్తులను వికసింపజేయును. ఉదాహరణకు, కర్మ మఱియు సేవాప్రేరణను సరిగా అనుష్ఠించినప్పుడు, అది జ్ఞానమును వికసింపజేయును, శక్తిని వృద్ధిజేయును, అన్యోన్యతయొక్క ఘనిష్ఠత లేక తుల్యతకు మఱియు సంబంధముయొక్క కౌశలము మఱియు క్రమమునకు శిక్షణ యిచ్చి పెంపొందించును. ఈ చతుర్విధ దివ్యప్రకృతియొక్క ప్రతిముఖమును తన స్వీయ ప్రధాన తత్త్వముయొక్క విస్తరణముద్వారాను, తక్కిన మూడింటియొక్క

సంవర్ధనముచేతను ఒక సమగ్ర సంసిద్ధిదిశగా సాగిపోవును. ఈ వికాసము త్రిగుణ ధర్మమున కధీనమై వర్తించును. ఎట్లన జ్ఞానాత్మధర్మమును సైతము ఒక తామసిక మఱియు రాజసిక మార్గమున అనుసరించుట సంభవ మగును, అటులే శక్తి ధర్మమును ఒక మూఢ తామసిక మఱియు ఉచ్చ సాత్త్వికమార్గమున అనుసరించుట సంభవమగును, ఇంకను కర్మ మఱియు సేవాధర్మమును ఒక ప్రబల రాజసిక లేక సుందర ఉదాత్త సాత్త్వక మార్గమున అనుసరించుట సంభవమగును. కాగా, ఆంతరిక వైయక్తిక స్వధర్మమునకు మఱియు నది జీవనపథములందు మనచే జేయించు కర్మలకు సంబంధించిన సాత్త్వికవిధానమును జేరుకొనుట మన సంసిద్ధికి ప్రారంభక నిబంధన మగును. మఱియు నీ ఆంతర స్వధర్మము ఎట్టి బాహ్య సాంఘిక లేక తదితర కర్మ, జీవిక లేక వృత్తిరూపమునకు బద్ధమై యుండదు. ఉదాహరణకు, కర్మాత్మకమగు స్వధర్మము జ్ఞానానుసంధాన జీవనమును గాని, పోరాటము మఱియు అధికార జీవనమును గాని, అన్యోన్యత, ఉత్పాదనము మఱియు వినిమయ జీవనమును గాని శ్రమించుచు, సేవింపగోరు తన దివ్యప్రేరణను తృప్తిపఱచుట కొక సాధనము గావించుకొనగలదు.

18. <u>చతుర్విధ ధర్మాతిక్రమణము</u> : మఱియు చివరకు, ఈ చతుర్విధ కర్మకలాపముయొక్క దివ్యతమ రూపమును, మిక్కిలి క్రియాశీల అంతరాత్మశక్తిని చేరుకొనినపు, డది అత్యున్నత ఆధ్యాత్మిక సంసిద్ధికి ఒక విశాల కవాట మగును. స్వధర్మక్రియ నంతను ఆంతర భగవంతునియొక్క, విశ్వమయ పురుషునియొక్క, అతీత పురుషోత్తమునియొక్క ఒక పూజలోనికి మార్తుమేని, మఱియు, తుట్టతుదకు, అతని హస్తములోనికి సమస్త క్రియను సమర్పింతుమేని - " మయి సన్న్యస్య కర్మాణి " (3-30) - మన మట్లు చేరుకొనగలము. పిమ్మట మన మెటుల త్రిగుణపరిమితులను దాటి పోదుమో, అటులే చతుర్విధ ధర్మముయొక్క విభాగములను దాటిపోదుము, మఱియు సర్వ విభేదక ధర్మముల పరిమితులను అతిక్రమింతుము- "సర్వ ధర్మాన్ పరిత్యజ్య" (18-66). ఎటు లన విశ్వపురుషుడు వ్యక్తిని విశ్వ స్వభావము లోనికి తీసికొని, మన యందలి చతుర్విధమగు ప్రకృత్యాత్మను పూర్ణము, ఏకీకృతము గావించును మఱియు జీవునియందు భగవత్సంకల్పము మఱియు భగవత్ప్రకృతియొక్క నిష్పన్న శక్తి ననుసరించి స్వయంనిర్ణీతమగు దాని కర్మలను జేయును.

19. స్వకర్మచేత అర్చించి నపుడు : స్వకర్మచేత భగవంతు నర్చింపుమని గీత ఆదేశించును - "స్వ-కర్మణా" (18-46); మన నివేదన సత్త మఱియు ప్రకృతి యొక్క మన స్వధర్మముచేత నిర్ణయింపబడిన కర్మ గావలెను. ఏలన భగవంతుని నుండియే సమస్త సృష్టిగతియు, సమస్త కర్మప్రేరణయు ఉత్పన్నమగుచున్నది మఱియు నతనినుండియే ఈ సమస్త విశ్వము విస్తారితమై యున్నది (18-46) మఱియు లోకసంగ్రహార్థము (3-20) అతడు సర్వక్రియకు అధ్యక్షత వహించి, దానిని స్వభావముద్వారా రూపొందించును (18-61). మన బాహ్య మఱియు ఆంతర క్రియలచేత నతనిని పూజించుట, మన జీవనము నంతను పరమపురుషుని కొరకు కర్మ యజ్ఞము గావించుట యన మన సమస్త సంకల్పము మఱియు సత్త మఱియు ప్రకృతి యందు అతనితో ఏకమగుటకు మనల నాయత్తము గావించుకొనుటయే యగును. మన కర్మ మనలోపలి సత్యము ననుసరించి సాగవలెను, అది బాహ్య మఱియు కృతక ప్రమాణములతో రాజీపడరాదు (18-47) : అది అంతరాత్మ మఱియు దాని సహజ శక్తులయొక్క ఒక సజీవ సత్య ప్రకటనము గావలెను. ఏలన ఇప్పటి ప్రకృతియందు ఈ అంతరాత్మయొక్క సజీవ ఆంతరతమ సత్యము ననుష్ఠించుటే మేని, అది ఇపుడు మన చేతన కందని పరమ ప్రకృతియందు అదే అంతరాత్మ యొక్క అమర సత్యము నందుకొనుటకు సాయపడును. అచ్చట మనము భగవంతుని తోను, మన ముఖ్యాత్మతోను, సర్వభూతములతోను ఏకతయందు నివసించగలము మఱియు, అచ్చట పరిపూర్ణతనంది, అమర ధర్మముయొక్క (14-27) స్వాతంత్ర్యము నందు భగవంతుని క్రియకు ఒక నిర్దుష్ట ఉపకరణము కాగలము.

# 21. [1]పరమరహస్యము దిశగా

1. <u>గీతామహావాక్యముయొక్క అపూర్వత</u> : దివ్యగురువు తాను చెప్పవలసిన తక్కిన దంతయు పూర్తిచేసియున్నాడు, వానికి ఆధారభూత సూచనలు మఱియు అంతరభిప్రాయములను నిరూపించియున్నాడు, ఆ సందేశముపై లేవగల ప్రధాన సంశయములు మఱియు ప్రశ్నములను విశదీకరించియున్నాడు; కాగా, తన ఏకమాత్ర చరమవాక్యమును, తన సందేశముయొక్క మూల హృదయమును, తన బోధనయొక్క సాక్షాత్సారమును నిర్ణాయక శబ్దములతో గూడిన ఒక హృదయస్పర్శి సూత్రమున ప్రకటించుట యొకటియే ఆయన కిపుడు మిగిలియున్నది. మఱియు ఈ నిర్ణాయక చరమ మఱియు పరమ వచనము ఈ విషయముపై నితఃపూర్వమే చెప్పబడిన దానియొక్క సారము మాత్రమే గాదని మనము కనుగొందుము. అటులే అది ఆవశ్యక సాధనయొక్కయు, ఆ సాధనా యత్నము మఱియు తపమువలన గలుగనున్న అధికతర ఆధ్యాత్మిక చేతనయొక్కయు ఒక సంక్షిప్తవర్ణన మాత్రమే గాదు; అది జోరుగా ఇంకను ముందునకు ప్రసరించును, ప్రతి ఎల్లను, నియమమును, ప్రతి విధిని, సూత్రమును భంగించి, అనంతమగు గర్భితార్థముతో గూడిన ఒక సువిశాల అపరిమేయ ఆధ్యాత్మిక సత్యములోనికి విచ్చుకొనును. మఱియు నిది గీతాబోధనా స్వభావముయొక్క గభీరతకు, విశాల వ్యాప్తికి, మహత్తకు ఒక చిహ్నము. ఒక సాధారణ ధార్మిక బోధన లేక దార్శనిక సిద్ధాంతము సత్యముయొక్క కొన్ని విశాల మఱియు సవీర్య పార్శ్వములను చిక్కబట్టి, వానిని ఉపయోగార్హమగు ఆదేశము మఱియు నుపదేశము, విధానము మఱియు అభ్యాసములలోనికి మార్చి, మానవుని ఆంతర జీవనమునందును, అతని క్రియయొక్క నియమము మఱియు రూపములందును అతనికి మార్గదర్శి యగుచు, దానితో బాగుగా తృప్తిజెందును; అది అంతకు మించి

---

[1] గీత : అధ్యాయము – 18, శ్లోకములు 49–56.

ముందుకు పోదు, తన స్వీయ పద్ధతియొక్క వలయముబైటికి ద్వారములు తెఱవదు, ఒకానొక విశాలతమ స్వతంత్రతలోని, అనిరుద్ధ విస్తారములోనికి మనలను నడుపదు, ఇట్టి పరిమితత్వము ఉపయుక్తము మఱియు కొంతదనుక నిక్కముగా ఆవశ్యకము. ఏలన తన మనస్సు మఱియు సంకల్పముచేత సీమాబద్ధుడైన మానవుని చింతన మఱియు క్రియకు అనుకూలమగు ఒక ధర్మము మఱియు నియమము, ఒక సునిశ్చిత పద్ధతి, ఒక విస్పష్ట అభ్యాసముయొక్క ఆవశ్యకత గలదు; అతడు పరిమిత దిక్చక్రములను, సురక్షిత విశ్రాంతిస్థానములను జేరుకొనుటకు బాగుగా నలిగిన ఒకేయొక సునిశ్చిత మార్గము నపేక్షించును (3–2). బలవంతులగు కొద్ది మంది మాత్రమే స్వతంత్రతద్వారా అధికతర స్వతంత్రకు సాగిపోగలరు. వీరి విషయములో సైతము చివరకు, ఏ రూపములు మఱియు విధానములందు మనస్సు తన స్వస్థతను బొంది, పరిమిత సుఖము నాస్వాదించునో వానినుండి సైతము వెలువడుటకు అంతరాత్మకు ఒక నిర్గమనద్వార ముండవలెను. ఆరోహణయొక్క మెట్ల వరుసయందలి పై మెట్టు దగ్గర సైతము ఆగక, ఆత్మయొక్క విశాలతయందు అడ్డమాకలు లేక స్వేచ్ఛగా విహరించుట యను విముక్తి మన సంసిద్ధికి చాల ముఖ్యము. ఆత్మయొక్క పరమస్వేచ్ఛ మన పూర్ణ స్థితి యగును. మఱియు గీత మనలను దాని కిట్లు గొనిపోవును : అది ఒక దృఢ మఱియు నిశ్చిత కాని ఒక సువిశాల ఆరోహణ పథమును, ఒక మహాధర్మమును (18–47) ప్రతిపాదించును, మఱియు పిమ్మట ప్రతిపాదింపబడిన సర్వమునకు వెలికి గొనిపోయి, సర్వధర్మములకు నావల (18–66), అనంతముగా వ్యాపించియున్న విశాలతలోనికి మనలను ప్రవేశపెట్టి, అచ్చట ఆశాజ్యోతిని ఆవిష్కరించును, అపుడు ఒక పూర్ణ ఆధ్యాత్మిక స్వతంత్రతయందు ప్రతిష్ఠితమైన ఒక పూర్ణ సంసిద్ధియొక్క రహస్యము లోనికి బోనిచ్చును, ఆ రహస్యమే "గుహ్యతమం" (18–64), గీత పేరుపెట్టి పిలిచిన "పరమ వచనముయొక్క" (18–64) సారసంగ్రహము, అదియే గూఢతత్త్వము, అదియే ఆంతరతమ జ్ఞానము.

2. జీవన సమస్యకు రెండు పరిష్కారములు : పరమ వచనమునకు ముందు గీత తన సందేశ స్వరూపమును పునఃప్రతిపాదించును. అది కేవలము పదునైదు శ్లోకముల స్థలములో రేఖారూపము మఱియు సారము నంతను క్రోడీకరించును, ఈ పంక్తులయందు చిక్కని భావప్రకటనమును, గర్భితార్థమును గలవు,

ఇవి విషయసారము నే మాత్రము విడువవు, ఇవి మిక్కిలి యథార్థము (precise), విస్పష్టము నగు పదములలో పొందుపఱుపబడినవి. కావున ఈ శ్లోకములను జాగ్రత్తగా పరిశీలించవలెను, ఇంతదనుక చెప్పబడిన దాని యంతటి ప్రకాశమున వానిని లోతుగా చదువవలెను; ఏలన తన బోధనయొక్క కేంద్ర భావముగా దేనిని గీత స్వయముగా దలంచుచున్నదో, దానిని వేఱుచేయుటే స్పష్టముగా నిచ్చుటే ఉద్దేశ్యము. పుస్తకము నందలి విచారణయొక్క మూలస్థానమునుండి, అనగా మానవకర్మ ప్రహేళిక (చిక్కుప్రశ్న) నుండి, ప్రపంచమున లౌకిక కర్మలను చేయుచుండియు నదే కాలమున ఆత్మ పరమాత్మలయందు నివసించుట యను దుస్తరముగా గన్పించు కఠినత నుండి ఇచ్చుటి ప్రతిపాదనయు ప్రారంభ మగును. జీవనము మఱియు కర్మ యొక భ్రమ లేక అవి సత్తయొక్క ఒక నిమ్నతర వ్యాపారము, కనుక ప్రపంచజాలము నుండి వెలువడి ఆధ్యాత్మిక సత్తయొక్క సత్యములో ప్రవేశించిన తోడనే వానిని త్యజించవలెను; ఇంతకు మించిన పరిష్కారము సాధ్యము గాదని సమస్యను విడిచి వేయుటే మిక్కిలి సులభ మార్గము. అస లది ఒక పరిష్కారమే అయితే, అది సన్యాసపరిష్కారము; ఎటులైనను, ప్రహేళననుండి వెలువడుటకు మాత్రము అది ఒక నిశ్చాయకము, శక్తివంతము నగు మార్గము - అత్యున్నతము, మిక్కిలి ధ్యానపరము నగు విధమునకు జెందిన ప్రాచీన భారత విచారధార విశాలము, విముక్తము నగు తన ప్రథమ సమన్వయమునుండి దిగిపోవ నారంభించిన వెంటనే, అధికాధికముగా ఈ మార్గమునందే ముందుకు సాగినది. తంత్రశాస్త్రము మఱియు కొన్ని భాగములందు తర్వాతి మతములవలె గీత ప్రాచీన సంతులనమును (balance) పరిరక్షింప ప్రయత్నించును: అది మూల సమన్వయముయొక్క సారతత్త్వమును, ఆధారమును భద్రముగా నుంచును, కాని ఒక వర్ధమాన ఆధ్యాత్మి కానుభవముయొక్క ప్రకాశమునందు దాని రూపమును మార్చి, నూతనము గావించును. అత్యున్నత ఆత్మ మఱియు పరమాత్మలయందు ఆంతరజీవనముతో మానవుని సంపూర్ణ సక్రియ జీవనమును సమన్వయము చేయు కఠిన సమస్యను గీత దాటవేయదు; దేనిని వాస్తవ పరిష్కార మని తాను భావించునో, గీత దానిని ప్రతిపాదించును. తాను ఉద్దేశించిన ప్రయోజనమునకు తపోమయ జీవనసన్యాసము పటుతర సాధనమే, గీత దీనిని కా దనదు; కాని సన్యాసము సమస్యాగ్రంధిని విడదీయుటకు బదులు ఛేదించి వేయును, కావున గీత ఆ మార్గమును హీనముగాను, తన మార్గమును శ్రేష్ఠముగాను భావించును (5-2). ఈ రెండు మార్గములును నిమ్నతర అజ్ఞానమయ సామాన్య

మానవ ప్రకృతినుండి ఉద్ధరించి మనలను విశుద్ధ ఆధ్యాత్మిక చేతన దిశగా నడుపును, మఱియు నింతవఱకు రెండును అవలంబనీయములే మఱియు సారతః ఒకటే సైతము నని తలంచవలెను : కాని ఎక్కడ ఒకటి ఆగిపోయి, (ముందుకు పోజాలక) వెను కకు దిరుగునో, అచ్చట రెండవది సుదృఢ సూక్ష్మతతోను, సమున్నత సాహసము తోను పురోగమించి, అవిజ్ఞాత దృశ్యములపై ఒక ద్వారమును తెఱచును, మానవుని భగవంతునియందు పూర్ణము చేయును, మఱియు మూల సత్తయందు అంతరాత్మకును, ప్రకృతికిని ఏకతను, సమన్వయమును సాధించును.

3. ఆంతర నైష్కర్మ్యము ముక్తిమూలము : కావున ఇచ్చటి మొదటి అయిదు శ్లోకములందు ఆంతరసన్యాస, బాహ్యసన్యాస మార్గములు రెండింటికి అనువర్తించగల భాషను గీత ప్రయోగించును; అయినను ఈ ప్రయోగరీతి ఎట్టి దనిన, అందలి కొన్ని సామాన్య పదములకు ఇంచుక గభీరతర, ఆంతరతర అర్థము నిత్తుమేని, గీత అభిమానించు పద్ధతియొక్క భావము మఱియు చింతన మనకు స్పష్టపడును. మానవ కర్మను బాధించు కఠినత ఏది యన, మానవుని అంతరాత్మ మఱియు ప్రకృతి బహుప్రకార బంధనమునకు దైవనియతిచేతనే అధీనమై యున్నట్లు గన్పించును - అజ్ఞాన కారాగారము, అహంకార పాశము, ఆవేశముల జాలము, ప్రతిక్షణము జీవనముయొక్క ఆఘాతపూర్వక ఆగ్రహము; ఇది యంతయు నిష్ప్రకాశము, పరిమితము నగు ఒక చక్రమునందు వ్యర్థముగా పరిభ్రమించుటయే. ఇట్టి క్రియాపలయమునకు గట్టుబడిన అంతరాత్మకు విశ్రాంతి గాని, ఆత్మజ్ఞాన ప్రకాశము గాని యుండదు, కావున అది ఆత్మను, జీవిత మూల్యమును, సృష్టి రహస్యమును గనుగొనజాలదు. నిజమే, తన సక్రియ వ్యక్తిత్వమునుండియు, సశక్త ప్రకృతినుండియు తన సత్తయొక్క సంకేతములు కొన్ని అంతరాత్మకు లభించును, కాని అది నిర్మించుకొను సంసిద్ధి ప్రమాణములు మిక్కిలి తాత్కాలికము, ప్రతిబద్ధము, సాపేక్షము గాన, అవి తన గూఢసమస్యకు సంతృప్తికర కీలకము గాజాలవు. తన సక్రియ ప్రకృతియొక్క ఊపిరిసలుప నివ్వని పిలుపునందు లీనమై, దానిచేత నిరంతరము బలాత్కారముగా బహిర్ముఖము చేయబడి నపుడు, అంత రాత్మ తన వాస్తవాత్మను ఆధ్యాత్మిక జీవనమును తిరిగి ఎట్లు పొందగలదు ? ఇట్టి యెడ, అంతరాత్మ మున్ముందు ఈ తల్లీనతను సన్యసించవలెను, బాహ్య వస్తువుల బహిర్ముఖ నిర్బంధమునకు చెవియొగ్గక, సక్రియ ప్రకృతినుండి శాంతాత్మను

వేఱుచేయవలెను - అని సన్న్యాస, గీతా మార్గములు రెండును అంగీకరించును; అప్పు డంతరాత్మ అచలాత్మతోను, దాని మౌనమునందలి జీవనముతోను తాదాత్మ్యము జెందవలెను. అది ఒక ఆంతర నిష్క్రియతను జేసుకొనవలెను - "నైష్కర్మ్యం" (18-49). కావుననే ఈ విమోచక ఆంతర నిష్క్రియతను యోగముయొక్క ప్రథమ లక్ష్యముగా, దానియందలి ప్రథమ ఆవశ్యక సిద్ధిగా ఇక్కడ గీత మనముం దుంచును : "సర్వ విషయములందును సంగవిహీనమగు బుద్ధిని, స్వయంజితము, కామనాశూన్యము నగు అంతరాత్మను గలిగియుండు మానవుడు సన్న్యాసముచేత నైష్కర్మ్యరూపమగు పరమసిద్ధిని బొందును" (18-49).

4. <u>క్షరాక్షరవివేచనము</u> : సన్న్యాసము, స్వయంవిజిత శాంతి, ఆధ్యాత్మిక నిష్క్రియత మఱియు కామనావిముక్తియొక్క ఆదర్శము ప్రాచీన విజ్ఞాన మంతటికి సర్వసామాన్యమే. గీత దీని మానసి కాధారమును నిరతిశయ సంపూర్ణత మఱియు విస్పష్టతతో మన కిచ్చును. మనలోపల రెండు ప్రకృతులు మఱియు రెండుగ దోచు ఆత్మలు నుండును : ఇది ఆత్మజ్ఞానము నన్వేషించు సాధకు లందరికి సామాన్యాను భవము మఱియు నీ అనుభవము ప్రాచీన విజ్ఞానమున కాధారము. తమోవృతమగు మానసిక, ప్రాణిక మఱియు శారీరిక ప్రకృతియొక్క నిమ్నతర ఆత్మ గలదు, ఇది తన చేతనామధ్యమునందు సైతము, విశేషించి భౌతిక ద్రవ్యరూపమగు తన ఆధారమునందు అజ్ఞానము మఱియు జడతకు అధీనమై యుండును; ఇది ప్రాణశక్తిచేత నిక్కముగా చలము మఱియు సజీవమే కాని, తన క్రియయందు దానికి ఆత్మస్వామ్యము (self-possession) మఱియు నాత్మజ్ఞానము నుండవు; అది మనోభూమికయందు కొంత జ్ఞానము మఱియు సామరస్యముల నందుకొనును గాని, కఠినప్రయాసముతోను, తన అశక్తతలతో నిరంతర సంఘర్షముచేతను మాత్రమే అట్లు చేయును. ఇది గాక, మన ఆధ్యాత్మిక సత్తయొక్క ఉచ్చతర ఆత్మ మఱియు ప్రకృతి గలవు, ఇవి స్వయంప్రాప్తము మఱియు స్వయంప్రకాశమే గాని, మన సామాన్య మనోవృత్తియందు మన అనుభవమున కందవు. అపుడపుడు మనలోని ఈ అధికతర వస్తువుయొక్క మెఱుపులు మనకు గన్పించును గాని, మనము సచేతనముగా దానియం దుండము, దాని ప్రకాశము, శాంతి మఱియు నిస్సీమ వైభవమునందు నివసింపము. మిక్కిలి విభిన్నమగు ఈ రెండు వస్తువులలో మొదటిది గీత చెప్పు త్రిగుణాత్మిక ప్రకృతి (7-14). అది

అహంభావమునందు కేంద్రితమై తననుదాను జూచుకొనును, అహంకారమునుండి పుట్టిన కామమే దాని క్రియాతత్త్వము, మఱియు మనస్సు, ఇంద్రియములు. అటులే ప్రాణకామనయొక్క విషయములతోటి సంగమే అహంకార గ్రంథి యనబడును. వీని యన్నింటియొక్క అనివార్య సంతత ఫలితమే బంధనము, ఒక నిమ్నతర నియంత్రణకు నిగూఢ అధీనత, ఆత్మవశిత్వరాహిత్యము, ఆత్మజ్ఞాన రాహిత్యము (14-9. 7-13). పోగా రెండవ మహత్తర శక్తి మఱియు సన్నిధిని గుఱించి మనకు తెలియవచ్చున దేమన, అది అహంకార నిబద్ధము గాని శుద్ధ మూలతత్త్వము యొక్క ప్రకృతి మఱియు సత్త యగును, దీనినే భారతీయ తత్త్వశాస్త్రమున ఆత్మ మఱియు నిర్గుణ బ్రహ్మ మని పిలుతురు. దాని మూలతత్త్వము లన్నింటియందును ఏకము మఱియు అనన్య మగు ఒక అనంత నిర్వ్యక్తిక అస్తిత్వము : మఱియు నీ నిర్వ్యక్తిక బ్రహ్మము అహంకార రహితము, పరిచ్ఛేదకగుణ రహితము, కామన, ఆవశ్యకత లేక ప్రేరణా రహితము గాన, అది అచలము మఱియు అవికార్యము (2-25); సర్వదా ఏకరూపమగు నది విశ్వక్రియను నిరీక్షించుచు ధరించునే గాని, దానిలో పాల్గొనదు, దానిని ఉపక్రమించను గూడ ఉపక్రమించదు. అంతరాత్మ తనను దాను సక్రియ ప్రకృతిలోనికి త్రోసివేసికొని నప్పుడు, గీతయొక్క క్షర పురుషు డగును, ఇతడు చల లేక సవికార పురుషుడు; అదే అంతరాత్మ శుద్ధ శాంత ఆత్మ లోనికిని, మూల సత్తలోనికిని ఉపసంహరించు కొని నప్పుడు గీతయొక్క అక్షర పురుషు డగును, ఇతడు అచల లేక నిర్వికార పురుషుడు.

5. <u>ఆవశ్యకము ఆంతర సన్న్యాసము</u> : కావున సక్రియ ప్రకృతియొక్క ఘనిష్ఠ బంధనమునుండి తప్పించుకొని, ఆధ్యాత్మిక స్వతంత్రతను తిరిగి అందుకొను టకు స్పష్టముగా సూటి, సరళతమ మార్గము : అజ్ఞానమునకు జెందిన క్రియా కలాపముతో సంబంధముగల దాని నంతను అశేషముగా త్రోసివేయవలెను మఱియు అంతరాత్మను ఒక విశుద్ధ ఆధ్యాత్మిక సత్తలోనికి మార్చవలెను. ఇదియే బ్రహ్మ మగుట – "బ్రహ్మ భూయః" (18-53). దీని అర్థము నిమ్నతర మానసిక, ప్రాణిక, భౌతిక భావమును పరిత్యజించి, విశుద్ధ ఆధ్యాత్మిక సత్తను గ్రహించుటయే యగును. దీనికి సర్వోత్తమ సాధనము మన ప్రస్తుత సర్వాగ్ర తత్త్వమగు బుద్ధి, అనగా ప్రజ్ఞ మఱియు సంకల్పము. అది నిమ్న జీవనముయొక్క వస్తువులనుండి, ముందుగా, ముఖ్యముగా శక్తిశాలియగు కామనాగ్రంథినుండి, మన - ఇంద్రియములు వెంటాడు

విషయములతో మన సంగమునుండి విముఖము గావలెను. సాధకుడు సర్వవస్తువు లందు అసక్తమగు బుద్ధిగావలెను - "అసక్తబుద్ధిః సర్వత్ర" (18-49). అపుడు తన నిశ్శబ్దమునందు నెలకొనియుండు అంతరాత్మనుండి కామ మంతయు కరగిపోవును; ఇపు డది సర్వస్పృహలనుండియు విముక్తము - "విగత స్పృహః" (18-49). ఈ స్థితి నిమ్నతర ఆత్మయొక్క వశ్యతను, ఉచ్చతర ఆత్మయొక్క స్వామ్యమును తనతో గొనివచ్చును లేదా సంభవము గావించును - ఈ స్వామ్యము సంపూర్ణ స్వవశిత్వము (self-mastery) పై నాధారపడి యుండగా, ఈ స్వవశిత్వము సక్రియప్రకృతిపై మౌలిక విజయము మఱియు ఆధిపత్యము ద్వారా స్థిరపడును - "జితాత్మా" (18-49). మఱియు దీని యంతటికిని అర్థము వస్తుకామనయొక్క అశేష ఆంతర "సన్యాసమే" (18-49) యగును. సన్యాసమే సంసిద్ధికి మార్గము మఱియు నిట్లు సర్వమును ఆంతరముగా సన్యసించిన వానిని గీత యథార్థ సన్యాసిగా ఉగ్గడించును (6-1). కాని ఈ పదము సాధారణముగా బాహ్య సన్యాసమును సైతము లేక కేవలము దానినే సూచించును, కావున బాహ్యమునుండి ఆంతర సన్యాసమును వివేచించుటకు దివ్యగురువు 'త్యాగ' శబ్దమును ప్రయోగించి (18-2), ఈ త్యాగము సన్యాసముకంటె శ్రేష్ఠ మనును (5-2). సన్యాసమార్గము సక్రియ ప్రకృతినుండి తాను చేయు పరావర్తనమునందు చాల ఎక్కువ దూరము బోవును. అది సన్యాసముకొఱకే సన్యాసమునందు అనురక్త మగును మఱియు జీవన, కర్మల బాహ్యత్యాగముపై, అంతరాత్మ మఱియు ప్రకృతుల సంపూర్ణ శమముపై పట్టుబట్టును. మనము శరీరమున నివసించుచున్నంత కాలము అది సంభవము గా దని గీత ఎదురు చెప్పును (18-11). సంభవ మైనంతవఱకు అట్లు చేయవచ్చును గాని, కఠోరముగా నట్లు కర్మలను తగ్గించుట అవశ్యకము గాదు : అది వాస్తవముగా, కనీసము సాధారణముగా వాంఛనీయమును గాదు. కావలసిన ఏకమాత్ర వస్తువు ఒక సంపూర్ణ ఆంతర నిష్క్రియత మాత్రమే, ఇదియే గీతానైష్కర్మ్యముయొక్క ఆశయము (sense).

6. <u>బ్రహ్మభావమునుండి భగవద్భావమునకు</u> : మన లక్ష్యము విశుద్ధాత్మ అయినపుడు మఱియు నది "అకర్తగా" (13-30) వర్ణింపబడి నపుడు, బాహ్య కర్మను మాత్ర మెందుకు మిగల్చవలెను, సక్రియ తత్త్వముపట్ల మెత్తదన మెందుకు ? అని అడుగుదు మేని, సమాధాన మేమన, ఆ నైష్కర్మ్యమును,

ప్రకృతినుండి ఆత్మవియోగమును మన ఆధ్యాత్మిక ముక్తియొక్క సంపూర్ణ సత్యము గావు. ఆత్మ మఱియు ప్రకృతి తుద కొకే వస్తువు; సమగ్ర మఱియు పరిపూర్ణ ఆధ్యాత్మికత ఆత్మ మఱియు ప్రకృతియందు నుండు సర్వ భగవంతునితో మనల నేకము జేయును. నిజానికి ఈ బ్రహ్మ మగుట, శాశ్వత శాంతిరూపమగు ఆత్మలోనికి గ్రహించబడుట — "బ్రహ్మభూయము" (18–53) : ఇది మన సంపూర్ణ లక్ష్యము గాదు, ఇది తనకంటెను మహత్తరము మఱియు నద్భుతతరము నగు ఒక దివ్యపరిణామమునకు—"మద్భావమునకు" (13–19. 4–19) ఆవశ్యక అపార ఆధారము మాత్రమే. మఱియు నట్టి సర్వోత్తమ ఆధ్యాత్మిక సంసిద్ధి నధిగమించుటకు మనము నిక్కముగా ఆత్మయందు అచలముగను, మన సర్వావయవములందు శాంతముగను నుండవలసినదే, కాని అదే సమయమున శక్తియందు, ప్రకృతియందు, అనగా ఆధ్యాత్మిక సత్తయొక్క సత్య సమున్నత బలమునందు కర్మ చేయవలెను గూడ. (3–25). మఱియు రెండు వ్యతిరేకములు ఏకకాలమున ఎట్లు వర్తించగలవు ? — అని మనము ప్రశ్నింతు మేని, సంపూర్ణ ఆధ్యాత్మిక సత్తయొక్క స్వభావమే అది - యని దానికి జవాబు; అది సర్వదా అనంతునియొక్క ఈ ద్వివిధ సంతులితస్థితిని గలిగియుండును. నిర్వ్యక్తికాత్మ నీరవము (silent) ; మనమును ఆంతరముగా నీరవము, నిర్వ్యక్తికము, ఆత్మతత్త్వములోనికి ఉపసంహృతము గావలెను. నిర్వ్యక్తికాత్మ సర్వ కర్మను తాను గాక, ప్రకృతియే చేయుచున్నట్లు జూచును (3–28); అది గుణములు మఱియు శక్తులచేత చేయబడు సర్వ క్రియను ఒక నిర్లిప్త సమత్వముతో తిలకించును : ఇట్టి ఆత్మయందు నిర్వ్యక్తికము చేయబడిన అంతరాత్మ సర్వకర్మలను అటులే తాను గాక, ప్రకృతిగుణములే చేయుచున్నవని చూడవలెను; అది సర్వ వస్తువులందును — "సర్వత్ర" (6–29) - సమముగా నుండవలెను. కాని అదే సమయమున మన మిచ్చట నాగిపోరాదు, తుద కింకను ముందుకు వెళ్లి, ఆంతర అచలత్వ మఱియు మౌన ధర్మమునే గాక, మన కర్మలయందొక ఆధ్యాత్మిక నియమమును, దిశను కనుగొనవలెను; అందునిమిత్తము మన బుద్ధి, సంకల్పములపై యజ్ఞభావమును విధింపు డని గీత మన కుపదేశించును, మన కర్మ యంతయు ఆంతరముగా మాఱి, ప్రకృతి ఎవనియొక్క స్వీయశక్తియో — "స్వా-ప్రకృతిః" (4–6)—అట్టి ప్రకృతి ప్రభువునకు, పరమపురుషునికి జేయబడు ఒక నివేదనారూపము ధరించవలెను. ఇంకను ముందుకు బోయి, సర్వమును చివరికతని చేతులలోనికే సన్యసించవలెను (3–30), కర్మయొక్క సమస్త వైయక్తిక

ప్రేరణను – "సర్వారంభములను" (12–16) – పరిత్యజించవలెను, అతని కర్మలు మఱియు ప్రయోజనము నిమిత్తమే మన ప్రకృతిగత ఆత్మలను మనము ధరించవలెను; ఈ విషయములు ఇతఃపూర్వమే వివరముగా వ్యాఖ్యానింపబడినవి గాన, ఇచ్చట గీత సన్న్యాస, నైష్కర్మ్య పదములయొక్క విశేషార్థమును మఱల వ్యాఖ్యానించక, వానిని యథాతథముగా వాడుదును.

7. <u>ఏకతకొఱకు నిర్వ్యక్తిక బ్రహ్మము</u> : శుద్ధ నిర్వ్యక్తిక ఆత్మయందు నివసించుటకు ఒకవిధమగు సంపూర్ణ ఆంతర శమము సాధన మని ఒకసారి అంగీకరించి నపుడు, అది ఆ నివాసము నెట్లు సాధించు నను ప్రశ్న వెంటనే ఉదయించును. "ఈ (నైష్కర్మ్య) సిద్ధిని బొందిన వాడు బ్రహ్మము నెట్లు బొందునో, చెప్పెదను, వినుము – ఇదియే జ్ఞానముయొక్క పరమ నిష్ఠ." (18–50). ఇచ్చట ఉద్దేశించిన జ్ఞానము సాంఖ్యయోగము – గీత ఆమోదించిన శుద్ధ జ్ఞానయోగము, "జ్ఞానయోగేన సాంఖ్యానాం" (3–3); అయితే కర్మయోగమును – "కర్మయోగేన యోగినాం" – గూడ తనలో నిముడ్చుకొను తన స్వీయయోగముతో చేతులు కలిపిన మేరకే గీత ఆ జ్ఞానయోగము నామోదించును. కాని ప్రస్తుతానికి కర్మప్రసక్తి యంతయు వెనుకకు నెట్టబడెను. కారణము, ముున్ముందు, ఇచ్చట బ్రహ్మ మన నీరవ, నిర్వ్యక్తిక, నిర్వికార బ్రహ్మ మనియే అర్థము. నిజానికి ఉపనిషత్తులు, గీత–రెండింటికిని ఏది ఉన్నదో మఱియు జీవించుచున్నదో, కదలుచున్నదో, అది అంతయు బ్రహ్మమే. అది కేవలము నిర్వ్యక్తిక అనంతము గాని, "అచింత్య, అవ్యవహార్య" (మాం.ఉ.) పరతత్త్వము గాని కాదు. ఇది యంతయు బ్రహ్మమే – (ఛాం. ఉ.) అని ఉపనిషత్తు చెప్పును, అటులే ఇది యంతయు వాసుదేవుడే – అని గీత చెప్పును (7–19). చరము లేక అచరము – అంతయు పరబ్రహ్మమే, అతని హస్తములు, పాదములు, నేత్రములు, తలలు మఱియు ముఖములు మన కన్నివైపులను గలవు (13–14). అయినను ఈ 'సర్వ'మునకు రెండు పార్శ్వములు గలవు – 1. జగత్తును ధరించియుండు అతని అక్షర, అనాది ఆత్మ, 2. వెలుపల విశ్వగతియందు చరించుచుండు సక్రియశక్తిమయమగు నతని ఆత్మ. అక్షరాత్మయొక్క నిర్వ్యక్తికతయందు మనము మన పరిచ్ఛిన్న అహంకారరూప వ్యక్తిత్వమును గోల్పోయి నపుడే, శాంత, విముక్త ఏకతను మనము చేరుకొనగలము మఱియు నీ ఏకతచేత తన విశ్వగతియందు భగవంతుని విశ్వశక్తితో మనము వాస్తవ ఐక్యమును బొందగలము. నిర్వ్యక్తికత

పరిచ్ఛేదము మఱియు విభజనయొక్క ఒక నిరాకరణము గావున, నిర్వ్యక్తికతా-ఉపాసన వాస్తవ సత్తా స్థితికి ఒక నిబంధనము, వాస్తవ జ్ఞానప్రాప్తికి ఒక ఆవశ్యక పూర్వాంగము, కావున వాస్తవ కర్మకు ఒక ప్రథమావసరము. మన పరిమిత అహంకార-వ్యక్తిత్వమునందు మన పట్టును విడువ మేని, స్పష్టముగానే మనము సర్వముతో ఏకాత్మకులము గాజాలము, అటులే విశ్వపురుషుడు మఱియు నతని అపార స్వయంజ్ఞానముతో, అతని బహుముఖ సంకల్పము మఱియు బహువిస్తృత ప్రపంచప్రయోజనముతో నేకము గాజాలము; ఏలన అది ఇతరులనుండి మనలను వేఱుచేయును మఱియు మన దృష్టియందును, మన కర్మసంకల్పమునందును మనలను బద్ధులను మఱియు స్వకేంద్రితులను గావించును. వ్యక్తిత్వ కారాగారమున బద్ధుల మైనపుడు, సానుభూతిచేత గాని, ఇతరుల దృక్కోణ భావ సంకల్పములతో కొంత సరిపెట్టుకొనుటచేత గాని ఒక పరిమిత సమైక్యమును మాత్రము బొందగలము. సర్వముతోను, భగవంతునితోను, విశ్వమునందు గల అతని సంకల్పముతోను ఏక మగుటకు, మనము ముందుగా నిర్వ్యక్తికులము గావలెను, అహంకారమునుండియు, దాని ఆదేశమునుండియు, అది మనలను, ప్రపంచమును, ఇతరులను జూచు విధానము నుండియు ముక్తులము గావలెను. మఱియు మన సత్తయందు వ్యక్తిత్వముకంటెను, అహంకారము కంటెను మఱియొకటి, సర్వభూతములందును ఏకమగు ఒక నిర్వ్యక్తి కాత్మ (6-29) లేనిచో, మనము నిర్వ్యక్తికులము గాజాలము. కావున అహంకార మును జాఱవిడిచి, నిర్వ్యక్తి కాత్మగా నుండుట, ఈ నిర్వ్యక్తిక బ్రహ్మ మగుట ఈ యోగముయొక్క ప్రథమ గతి యగును.

8. <u>అక్షర బ్రహ్మకు మార్గము</u> : అయితే దీనికి విధాన మేమిటి? మున్ముందు శుద్ధముచేయబడిన బుద్ధి మనలోని శుద్ధ ఆధ్యాత్మిక తత్త్వముతో యుక్తము గావలెను - "బుద్ధ్యా విశుద్ధయా యుక్తః" (18-51). బహిర్ముఖ మఱియు అధోముఖ దృష్టినుండి ఇట్లు బుద్ధి అంతర్ముఖ మఱియు ఊర్ధ్వముఖ దృష్టికి మఱ లుటయే జ్ఞానయోగ సారము. ఈ విశుద్ధ బుద్ధి సత్తనంతను నియమించవలెను - "ఆత్మానం నియమ్య" (18-51); అది నిమ్న ప్రకృతియొక్క బహిర్గామి కామ ములతో సంగమునుండి దృఢ సంకల్పముచేత - "ధృత్యా" - మనలను వెనుకకు లాగివేయవలెను - తన ఏకాగ్రతయం దీ సంకల్పము సర్వథా శుద్ధ సత్తకు అభిముఖముగా నడుచును. పోగా ఇంద్రియములు తమ విషయములను త్యజించ

వలెను మఱియు నీ విషయములు తనలో ప్రేరేపించు రాగద్వేషములను మనస్సు విదలించివేయవలెను, ఏలన నిర్వ్యక్తి కాత్మకు ఎట్టి రాగద్వేషములు నుండవు, ఇవి వస్తుస్పర్శలకు మన వ్యక్తిత్వముయొక్క ప్రాణిక ప్రతిక్రియలు; మఱియు ఈ స్పర్శలకు మనఇంద్రియములనుండి వచ్చు అనురూప ప్రత్యుత్తరము ఆ రాగ ద్వేషములకు ఆలంబనము మఱియు నాధారము నగును. మనస్సు, వాక్కు మఱియు శరీరములపై సైతము సంపూర్ణ సంయమమును సాధించవలెను (18-52), అటులే ఆకలి, శీతోష్ణములు, స్థూల సుఖదుఃఖములను సైతము వశముగావించుకొనవలెను; మన సమస్త సత్తయు ఉదాసీనమై, ఈ విషయములకు చలించక, బాహ్య స్పర్శలు మఱియు నవి పుట్టించు ఆంతర ప్రతిక్రియలు మఱియు ప్రత్యుత్తరముల పట్ల సమముగా నుండవలెను. ఇది మిక్కిలి సూటి మఱియు శక్తిశాలి విధానము, యోగముయొక్క ప్రత్యక్ష మఱియు నిశిత ప్రకారము. కామ, సంగముల విరతి- "వైరాగ్యం"- పరమావశ్యకము; నిర్వ్యక్తిక ఏకాంతమును దృఢముగా సేవించ వలెను, సాధకుడు ధ్యానముద్వారా ఆంతరతమ ఆత్మతో సంతతయోగమునం దుండవలెను. అయినను ఈ కఠోర సాధనయొక్క ఉద్దేశ్యము ఒకానొక పరమ అహంమయ ఏకాంతమున స్వార్థకేంద్రితులమై యుండుట గాదు - కొందరు మునులు, మనీషులు ప్రపంచకర్మయందు గల కష్టమునకు జడిసి, అట్లు చేతురు, అహంకారము నంతను తుడిచివేయుటే ఇచ్చటి ఉద్దేశ్యము. మున్ముందు సాధకుడు రాజసిక అహంకారమును; ఆహంకారిక బల, సంరంభములను, దర్పమును, కామమును, క్రోధమును, యాజమాన్య భావము మఱియు ప్రేరణను, అంతర్వేగముల చోదనను, ప్రబలమగు ప్రాణతృష్ణలను సమూలముగా వర్జించ వలెను. కాని తర్వాత సర్వవిధ అహంకారమును, అత్యంత సాత్త్వికాహంకారమును సైతము, పరిత్యజించవలెను. ఏలన చివరకు అంతరాత్మను, మనస్సును, ప్రాణ మును, బంధనకరమగు సర్వ అహంమమతలనుండి విడిపించుటయే లక్ష్యము - "నిర్మమః" (18-53). అహంకారము మఱియు దాని సర్వవిధ అభ్యర్థనల వినాశమే ఇచ్చట మనముం దుంచబడిన సాధనావిధానము. ఏలన తాను చలించకుండ విశ్వ మును ధరించి యుండు శుద్ధ నిర్వ్యక్తి కాత్మకు ఎట్టి అహంకారము లేదు, మఱియు నది వస్తువు లేక వ్యక్తిపై నెట్టి అభ్యర్థన చేయదు; అది శాంతము మఱియు తేజోమయరూపమున ఉదాసీనము మఱియు నది ఆత్మజ్ఞాన, ప్రపంచ జ్ఞానములకు సహజమగు ఒక సమ, నిష్పక్షపాతనేత్రముతో వస్తువులు మఱియు వ్యక్తులను

నీరవముగా నిరీక్షించును. కావున స్పష్టముగానే లోని అంతరాత్మ దానితో సదృశము లేక సమానమగు నిర్వ్యక్తికతయందు ఆంతరముగా నివసించినపుడు, అది వస్తువుల ముట్టడినుండి విముక్తమై, అక్షర బ్రహ్మతో ఏకతాప్రాప్తికి ఉత్తమప్రకారమున యోగ్యమగును.

9. సన్యాసము × త్యాగము : గీత విధించిన విధమున నిర్వ్యక్తికతయొక్క ఈ ప్రథమ సాధన, నిజమే, తనతో ఒకానొక పూర్ణతమ ఆంతర నిష్క్రియతను గొనివచ్చును మఱియు తన ఆంతరతమ భాగములందును, అభ్యాస సూత్రములందును సన్యాసవిధానముతో సమముగా నుండును. అయినను ఒక దశకు చేరుకొనిన పిమ్మట, సక్రియ ప్రకృతి మఱియు బాహ్య ప్రపంచ మపేక్షించు కర్మనుండి దానియొక్క ఉపసంహరణ ప్రవృత్తి నిరోధించబడును మఱియు దాని ఆంతర నిష్క్రియత కర్మనిరాకరణము మఱియు భౌతిక ఉపసంహరణములోనికి దిగిపోకుండ ఒక పరిమితి విధించబడును. అనగా, ఇంద్రియములచేత తమ విషయ సన్యాసము – "విషయాం స్త్యక్త్వా" (18–51) – త్యాగరూపముగా నుండవలెను (18–2); అది విషయములందు సమస్త ఇంద్రియాసక్తి – "రసము" (2–59) యొక్క పరిత్యాగముగా నుండవలెనే గాని, ఇంద్రియముల స్వభావసిద్ధ ఆవశ్యక కర్మకలాపముయొక్క నిరాకరణముగా నుండరాదు, మనుష్యుడు పరిసర వస్తువుల మధ్య "చరించవలెను" (2–71) మఱియు ఇంద్రియక్షేత్రము నందలి విషయముల పైన ఇంద్రియములయొక్క ఒక శుద్ధ, సత్య మఱియు ప్రగాఢ, ఒక సరళ మఱియు కేవల వ్యాపారముతో కర్మ చేయవలెను – "కేవలై రింద్రియైః చరన్" (5–11); దీనివలన దివ్య కర్మ చేయు పురుషుని కది తోడ్పడును; అంతే గాని మానవుడు కామసంపూర్తికి కర్మ చేయ గూడదు. వైరాగ్య ముండవలెను, కాని దాని అర్థము జీవితము పట్ల జుగుప్స గాని, ప్రపంచకర్మ పట్ల అరుచి గాని కారాదు, అది "రాగము" మఱియు దాని వ్యతిరేక మగు "ద్వేషము" – యొక్క సన్యాసము మాత్రమే గావలెను. సర్వవిధ, సమస్త మానసిక మఱియు ప్రాణిక అరుచినుండి, అటులే సమస్త మానసిక మఱియు ప్రాణిక రుచినుండి ఉపసంహరించుకొనవలెను. ఇచ్చట గీతా ఉద్దేశ్యము కర్మనిర్వాణము (వినాశము) గాదు, అది పరిపూర్ణ సామర్థ్యప్రద సమతయే; ఈ సమతయందు అంతరాత్మ వస్తువుల పూర్ణ, సమగ్ర దివ్యదర్శనమునకును, ప్రకృతియందు సమగ్ర దివ్యకర్మకును ఒక అబాధ, అపరిమిత ఆమోదము నీయగలుగును. సంతతమగు

ధ్యానావలంబనము - "ధ్యానయోగపరో నిత్యం" (18-51) - అంతరాత్మకు తన శక్త్యాత్మను, తన మౌనాత్మను దర్శించుటకు ఒక గట్టి సాధన మగును. అయినను కేవల ధ్యానమయ జీవితము నిమిత్తము క్రియాత్మక జీవితమునకు స్వస్తి చెప్ప గూడదు; పరమ పురుషుని కొరక యజ్ఞముగా సదా కర్మ చేయబడవలెను. సన్యాస మార్గము నందలి నివృత్తిక్రియ సనాతన బ్రహ్మమందు వ్యక్తియొక్క విలీనమునకు, అంతర్ధానమునకు దారిచేయును మఱియు ప్రపంచగతమగు కర్మ మఱియు జీవన సన్యాసము ఆ ప్రక్రియయందు ఒక ఆవశ్యక సోపానము. కాని గీతయొక్క త్యాగ మార్గమునందు అదే నివృత్తి క్రియ మన సమస్త జీవనమును, సత్తను, మఱియు సర్వ కర్మను భగవంతుని ప్రశాంత, అపరిమేయ సత్త, చేతన మఱియు సంకల్ప ముతో ఒక సమగ్ర ఏకతలోనికి త్రిప్పుటకు మాత్రమే ఒక సన్నాహ మగును, మఱియు నది నిమ్నతర అహంకారమునుండి పరమ ఆధ్యాత్మిక ప్రకృతి - "పరా ప్రకృతిః" (7-5) - యొక్క అవర్ణనీయ సంసిద్ధి దిశగా అంతరాత్మయొక్క సమగ్ర ఊర్ధ్వగతికి శ్రీకారమును, సంభవ సాధనయు నగును.

10. <u>సృష్టిరహస్యము మఱియు గుహ్యము</u> : గీతా విచారణయొక్క అసందిగ్ధ నూతన మార్గము తర్వాతి రెండు శ్లోకములలో సూచితమగును, వీనిలో మొదటి దానియందలి అనుక్రమము అర్థవంతము, "ఎప్పుడు ఒకడు బ్రహ్మ మగునో, ఎప్పు డతడు శోకింపడో లేక కామించడో, ఎప్పు డతడు సర్వభూతముల పట్ల సమముగా నుండునో, అప్పు డతడు నాయందు పరమ ప్రేమను, భక్తిని బొందును." (18-54). కాని సంకుచిత జ్ఞానమార్గమునందు భక్తి, సగుణ భగవంతునియందు భక్తి, ఒక అవర ప్రారంభక సాధన మాత్రమే కాగలదు; పర్యవసానము, పరాకాష్ఠ నిర్గుణ బ్రహ్మముతో లభించు ఒక నిర్విశేష ఏకతయందు వ్యక్తిత్వముయొక్క అంత ర్ధానమే యగును, ఏలన నిర్గుణ బ్రహ్మమునందు భక్తికి తావే లేదు : కారణ మచ్చట భక్తుడు గాని, భజనీయుడు గాని యుండడు; అచ్చట తక్కిన - దంతయు ఆత్మతో జీవునియొక్క నీరవ నిశ్చల తాదాత్మ్యమునందు నశించిపోవును. ఇచ్చట గీత మనకు నిర్వ్యక్తిక బ్రహ్మముకంటెను గూడ ఉచ్చతరమగు ఒక వస్తువు నిచ్చును - ఇచ్చట పరమేశ్వరుడగు పరమాత్మ గలదు, ఇచ్చట పరమ పురుషుడును, అతని పరమ ప్రకృతియు గలదు, ఇచ్చట సవ్యక్తిక, నిర్వ్యక్తి కములకు పరమునం దుండి, తన సనాతన శిఖరములందు వానిని సమన్వయపఱచు

పురుషోత్తముడు గలడు. ఇచ్చట సైతము అహంకారిక వ్యక్తిత్వము నిర్వ్యక్తిక బ్రహ్మముయొక్క నీరవత (మౌనము) నందు అంతరించిపోవును గాని, వెనుక నుండు ఈ నీరవతతో బాటుగ నిర్వ్యక్తికము కంటెను మహత్తరమగు ఒక పరమాత్మవస్తువుయొక్క క్రియ నిలిచియుండును. ఇప్పుడిక అహంకారము మఱియు గుణములయొక్క గ్రుడ్డి మఱియు కుంటి క్రియ యుండదు, పరంతు దాని స్థానమున ఒక అనంత, ఆధ్యాత్మిక బలము, ఒక విముక్త, అపరిమేయ శక్తియొక్క వ్యాపక, స్వయం నిర్ధారక గతి రాజిల్లును. సమస్త ప్రకృతియు ఏకమాత్ర భగవంతునియొక్క శక్తి యగును మఱియు సమస్త క్రియ ఒక వాహిని మఱియు నుపకరణరూపమగు వ్యక్తిద్వారా జరుగు అతని క్రియయే యగును. అహంకార స్థానమున యథార్థ ఆధ్యాత్మిక వ్యక్తి సచేతన మఱియు అభివ్యక్త రూపమున ముందుకు వచ్చును; ఈ వ్యక్తి తన వాస్తవ ప్రకృతియొక్క స్వతంత్రతయందు, తన సమున్నత పదవియొక్క శక్తియందు, భగవంతునితో తనకు గల సనాతన సంబంధముయొక్క మహత్వ, వైభవములందు ప్రకటమగును; ఈ వ్యక్తి పరమేశ్వరునియొక్క ఒక అక్షయ అంశము, పరప్రకృతియొక్క ఒక అవినాశి శక్తి – "మమైవ అంశః సనాతనః" (15–7). "పరా ప్రకృతి ర్జీవభూతా" (7–5). అప్పుడు మానవుని అంతరాత్మ ఒక పరమ ఆధ్యాత్మిక నిర్వ్యక్తికతయందు పురుషోత్తమునితో తన ఏకత ననుభవించును మఱియు తన విశ్వీకృత వ్యక్తిత్వమునందు తాను భగవంతుని యొక్క ఒక అభివ్యక్త శక్తి యని కనుగొనును. దాని జ్ఞానము అతని జ్ఞానము యొక్క ఒక వెలుగగును; దాని సంకల్పము అతని సంకల్పముయొక్క ఒక శక్తి యగును; విశ్వము నందలి సర్వముతో దాని సమైక్యము అతని సనాతన ఏకత యొక్క ఒక లీల యగును. ఇది యొక ద్వివిధ సాక్షాత్కారము, ఇది అభివ్యక్తి సత్తకు గల ఒక అనిర్వచనీయ సత్యముయొక్క ఉభయ పార్శ్వముల సమ్మిలనము, వీనిలో నే పార్శ్వమునుండి యైనను మానవుడు భగవంతుని అనంత సత్తను సమీపించి, దానిలో ప్రవేశించగలడు : ఇట్టి సాక్షాత్కారమునందు మానవుడు నివసించవలెను, కర్మ చేయవలెను, అనుభవములను బొందవలెను మఱియు సర్వముతో తన సంబంధములను, అటులే తన అంతరాత్మయొక్క బాహ్యాంతర వ్యాపారములను నిర్ణయించుకొనవలెను, అథవా తన ఉచ్చతమ ఆత్మయొక్క మహత్తమ శక్తిచేత అవి అతనికొఱకు నిర్ణయింపబడునట్లు వర్తించవలెను. మఱియు నట్టి ఏకీకర సాక్షాత్కారమునందు ఆరాధన, ప్రేమ మఱియు భక్తి

ఇంకను సంభవమగుటయే గాక, అవి సర్వోన్న తానుభవముయొక్క ఒక విస్తృత, ఒక అనివార్య మఱియు నొక మకుటాయమాన భాగ మగును. ఏకము నిత్యము అనేక మగును, అనేకము తమ బాహ్య విభజనయందు సైతము నిత్యము ఏకము గనే యుండును, మనయందు సృష్టియొక్క ఈ రహస్యమును, గుహ్యమును ప్రదర్శించు పురుషోత్తముడు తన అనేకతచేత విచ్ఛిన్నుడును గాడు, తన ఏకతా పరిధియందు బద్ధుడును గాడు - ఇదిగో, ఇదియే సమగ్రజ్ఞానము, ఇదియే సమన్వయ సాధ కానుభవము, ఇదియే జ్ఞానికి విముక్త కర్మ సామర్థ్యము నిచ్చును - "ముక్తస్య కర్మ" (4-23).

11. <u>భక్తిచేత సమగ్రజ్ఞానము</u> : ఒక పరమ భక్తిచేత ఈ జ్ఞానము లభించు నని గీత వచించును. ఒక అతిమానస మఱియు సమున్నతఆధ్యాత్మిక వస్తుదర్శనము చేత మనస్సు తననుదాను అతిక్రమించి నపుడు మఱియు హృదయము సైతము జ్ఞానముతో శ్రుతి గలిపి, భక్తిప్రేమల మన అజ్ఞానమయ మానసిక రూపము లను దాటి, ఒక ప్రశాంత, గంభీర, ప్రకాశమయ ప్రేమకును, భగవంతునియందు ఒక పరమ ఆహ్లాదమునకును, మఱియు నొక అపరిమేయ ఆరాధన, అవిచల హర్షాతి రేకము, ఆధ్యాత్మి కానందమునకును ఎగసి నపుడు-అపుడు సమగ్ర జ్ఞానము ప్రాప్తిం చును. అంతరాత్మ తన పృథక్కర వ్యక్తిత్వమునకు నీళ్లు వదిలి, నిర్వ్యక్తిక బ్రహ్మ మైనపుడు, అపుడే అది యథార్థ పురుషునియందు నివసించగలదు మఱియు పురుషో త్తమునియందు పరమ జ్ఞానోద్భాసక భక్తిని బొంది, తన గంభీర భక్తి, అనగా హృదయజ్ఞానముచేత అతనిని సర్వథా తెలియగలుగును - "భక్త్యా మాం అభిజానాతి" (18-55), హృదయముయొక్క అగాధ దర్శనము మనస్సుయొక్క అత్యున్న తాను భవమున, పూర్ణమొనరించి నపుడు సిద్ధించునదే ఈ సమగ్ర జ్ఞానము - "సమగ్రం మాం జ్ఞాత్వా" (7-1). "నే నెవడినో, ఎంతటి వాడనో మఱియు నా సత్తయొక్క సమస్త సత్యతయందును, సర్వ తత్త్వములందును అతడు నన్ను క్రమముగా నెఱుంగును." - "యావాన్ యశ్చాస్మి తత్త్వతః" (18-55). ఈ సమగ్ర జ్ఞానము వ్యక్తియందు ఉపస్థితుడై యుండు భగవంతుని జ్ఞానము; ఇది మానవుని హృదయ గుహలో గుప్తముగా నుండు ఈశ్వరుని సంపూర్ణానుభవము : ఈ యీశ్వరుడే యిపుడు అతని సత్తయొక్క పరమ ఆత్మగను, అతని సమస్త ప్రదీప్త చేతనయొక్క దివ్య సూర్యుడుగను, అతని సమస్త కర్మలయొక్క స్వామి మఱియు శక్తిగను,

అతని అంతరాత్మయొక్క సమస్త ప్రేమానందముల మూలస్రోతముగను, తన పూజారాధనల పాత్రమగు ప్రియుడు మఱియు ప్రేమికుడుగను ప్రకటమగును. ఈ సమగ్ర జ్ఞానము విశ్వమునందు వ్యాపించి యుండు భగవంతుని యొక్కయు జ్ఞానమగును, అటులే ఎవనినుండి సర్వము ప్రభవించునో, ఎవనియందు సర్వము నివసించునో మఱియు తన అస్తిత్వమును గలిగియుండునో, అట్టి సనాతనునియొక్కయు, విశ్వముయొక్క ఆత్మ మఱియు చేతన సత్తయొక్కయు, ఈ సర్వము నైన వాసుదేవునియొక్కయు (7–19), ప్రకృతి కర్మలను అధిశాసించు జగదీశ్వరునియొక్కయు జ్ఞాన మగును. అది తన అతీత నిత్యతయందు జ్యోతిర్మయముగా దీపించు దివ్య పురుషునియొక్క జ్ఞానము, ఈ పురుషుని సత్తయొక్క రూపము మనోవిచారణకు చిక్కదు గాని, దాని మౌనమునకు అగోచరము గాదు. అది కేవల ఆత్మరూపమునను, పరబ్రహ్మరూపమునను, పరమపురుషుని రూపమునను, పరమేశ్వరుని రూపమునను అతని సంపూర్ణ సజీవ అనుభవము : ఏలన ఆ కేవలము (Absolute) పైకి సంబంధరహితముగా, అవ్యవహార్యముగా గన్పించినను, అదే సమయమున మఱియు తన సర్వోత్కృత పదమునందు సైతము, అదియే విశ్వక్రియను ప్రారంభించు మూలపురుషుడు (10–8), మఱియు నీ సర్వభూతముల మహేశ్వరుడు (5–29). విముక్త మానవుని అంతరాత్మ ఈ సమన్వయ జ్ఞానముచేత, నిట్లు పురుషోత్తమునిలో ప్రవేశించి, విశ్వాతీత భగవంతునియొక్క, వ్యక్తినిష్ఠ భగవంతునియొక్క, విశ్వగత భగవంతునియొక్క ఒక పరిపూర్ణ సమకాలీన హర్షవిశేషమువలన ఆ పురుషోత్తముని లోతులలోనికి చొచ్చుకొనిపోవును – "మాం విశతే తదనంతరం" (18–55). అతడు తన ఆత్మజ్ఞానమునందును, ఆత్మానుభవమునందును పురుషోత్తమునితో ఏక మగును, తన సత్తయందును, చేతనయందును, సంకల్పమునందును మఱియు ప్రపంచ జ్ఞానమునందును, ప్రపంచప్రేరణయందును అతనితో ఏకమగును, అటులే విశ్వమునందును, విశ్వమునందలి సకల భూతములతో అతని ఏకతయందును అతనితో ఏకమగును, చివరకు వ్యక్తికి, విశ్వమునకు నావల సనాత నానంతునియొక్క అతీతావస్థయందు అతనితో ఏకమగును – "శాశ్వతం పద మవ్యయం" (18–56). ఇది పరమ జ్ఞానము యొక్క హృదయ మగు పరమభక్తియొక్క పరాకాష్ఠ.

12. <u>కర్మచేత అమరత్వము</u> : మఱియు నిపుడొక సత్యము స్పష్టపడును : సంతతము, నిర్విరామము నగు కర్మ, జీవనముయొక్క క్రియాకలాపము

లందలి ఏ భాగమును తగ్గించక లేక పరిత్యజించక చేయబడు సర్వవిధ కర్మలు సర్వోన్నత ఆధ్యాత్మి కానుభవముతో సుసంగత మగుటయే గాక, భక్తి లేక జ్ఞానము నకు ఏమాత్రము తీసిపోని ఒక శక్తిశాలి సాధన యగును. ఇవ్విషయమున గీతా వాక్యమును మించిన నిశ్చిత వాక్యమేదియు నుండజాలదు. "మఱియు నాయందు స్థితుడై సదా సర్వకర్మలను చేయుటచేతను గూడ అతడు నా ప్రసాదమువలన శాశ్వత అవ్యయ పదము నందును." (18-56). ఈ విమోచనశీల క్రియ మన యందును, విశ్వమునందును గల భగవంతునితో మన సంకల్పము మఱియు మన ప్రకృతియొక్క సమస్త సక్రియ భాగముల ప్రగాఢ సంయోగమునందు చేయబడు కర్మల స్వభావముతో నొప్పారును. అది మున్ముందు ఇంకను మన ఆత్మయే కర్త యను భావముతో ఒక యజ్ఞముగా జేయబడును. పిమ్మట నది ఆ భావము వినా, మఱియు ప్రకృతియే కేవల కర్త్రి యను జ్ఞానముతో చేయబడును (3-27). చివర కది ప్రకృతి భగవంతునియొక్క ఒక పరమ శక్తి యను జ్ఞానమున చేయబడును, అనగా మన సర్వకర్మలు అతనియందే సన్యసించబడును (3-30) మఱియు నతనికే సమర్పించబడును; అపుడు వ్యక్తి ఒక వాహిని మఱియు ఉపకరణముగనే యుండును (11-33). అప్పుడు మన కర్మలు సరాసరి మనలోని ఆత్మనుండియు, భగవంతు నుండియు ప్రవర్తించును, అవిభాజ్య విశ్వక్రియయొక్క ఒక అంగ మగును, మన చేత గాక, ఒక వ్యాపక అతీత శక్తిచేత నారంభించబడి, నిర్వర్తింపబడును. అపుడు మనము చేయున దంతయు అందరి హృదయములందును ఆసీనుడై యున్న ఈశ్వరుని కొఱకు, అనగా వ్యక్తియందలి భగవంతుని కొఱకు మఱియు మనయందలి అతని సంకల్ప పరిపూర్తి నిమిత్తము చేయబడును; అటులే ప్రపంచమునందలి భగవంతుని కొఱకు, సర్వభూతముల హితముకొఱకు, ప్రపంచక్రియ మఱియు ప్రపంచలక్ష్యమును సాధించుటకు చేయబడును, లేక ఒక్క మాటలో, పురుషోత్తమునికొఱకు చేయబడును మఱియు నది నిజముగా తన విశ్వశక్తిద్వారా అతనిచేతనే చేయబడును. ఈ దివ్య కర్మలు, వాని రూపము మఱియు బాహ్య స్వభావ మెటు లున్నను, మనలను బంధించ జాలవు, పైగా గుణమయమగు నిమ్నప్రకృతినుండి పరమ, దివ్య, ఆధ్యాత్మిక ప్రకృతియొక్క సంసిద్ధిలోని కెగయుటకు ఒక శక్తిశాలి ఉపాయ మగును. ఇట్లు ఈ మిశ్రిత మఱియు పరిమిత ధర్మములనుండి తప్పించుకొని, మన మమృత ధర్మములో నడుగిడుదుము; మన సమస్త చేతన మఱియు కర్మయందు పురుషోత్తమునితో మనను మన మేకము గావించుకొని నపుడు, ఈ అమృత ధర్మము స్వయముగా మనకు

ప్రకటమగును. ఇచ్చట మనము సాధించు నీ ఏకత అచ్చట కాలమున కావల వెలుగొందు అమృతత్వములోని కెగయు శక్తిని తనతో గొనివచ్చును. అచ్చట మనము అతని నిత్య పరాత్పర పదవియందు నివసించెదము.

13. <u>భావము, మార్గము, గమ్యము</u> : ఇట్టి ఎనిమిది శ్లోకములు (18-49, ....56), ఇప్పటికే దివ్య గురు వొసంగిన జ్ఞానప్రకాశమున చదువబడి నపుడు, సంపూర్ణ గీతాయోగముయొక్క సమస్త మూలభావమును, సమగ్ర కేంద్రవిధానమును, సకల సారతత్త్వమును సంక్షిప్తముగా నైనను, సమగ్రముగా సూచించును.

# 22. పరమ రహస్యము

1. <u>గీతాయోగ హృదయము</u> : ఇట్లు దివ్యగురువు శిష్యునకు అతని కర్మ మఱియు యుద్ధ రంగమునందు జ్ఞానము మఱియు యోగముయొక్క సారమును ప్రకటించి, దాని నిపుడు అతని కర్మకు అనువర్తింపజేయ ముందుకు సాగును, అయితే ఆ ప్రకారము అందరి కర్మకును అనువర్తించును. ఏలన ఇచ్చట మాటలు ఒక అసాధారణ దృష్టాంతమునకు సంబంధించి, కురుక్షేత్ర మహాసంగ్రామ నాయకునికి చెప్పబడి నప్పటికి, వాని లోపల మిక్కిలి వ్యాపకార్థము గలదు, సాధారణ మనోభూమికను దాటి, పైకివెళ్ళి, పరమ ఆధ్యాత్మిక చేతనయందు నివసింపను, కర్మచేయను ఎవరు సిద్ధముగా నుందురో, వారి కందరకు అవి యొక సార్వత్రిక నియమము నిచ్చును. అహంకారము మఱియు పైయక్తిక మనస్సుయొక్క ఆవరణమును భేదించి, వెలువడి, సర్వమును ఆత్మ మఱియు ఆధ్యాత్మిక సత్తయొక్క విశాలతయందు దర్శించుట; భగవంతుని అతని సమగ్ర సత్యమునందును, అతని సర్వ

రూపములందును ఎఱింగి, భజించుట (6-31); ప్రకృతి మఱియు జగత్సత్తయొక్క పరాత్పరాత్మకు తనను పూర్తిగ సమర్పించుకొనుట (6-47); భగవచ్చేతనను ఆవేశించి, దానిచేత ఆవేశింపబడుట; ప్రేమ, ఆనందము, సంకల్పము మఱియు జ్ఞానముల విశ్వవ్యాపక రూపమునందు ఏకమాత్రునితో ఏకముగా నుండుట (6-31); అతనియందు సర్వభూతములతో ఏకముగా నుండుట (11-7); దేని యందు సర్వము భగవంతు డనియే అనుభూత మగునో, అట్టి ప్రపంచము యొక్క దివ్యాధారమునందును, విముక్త పురుషునియొక్క దివ్య స్థితియందును కర్మల నొక యజ్ఞముగను, ఆరాధనగను జేయుట (4-23) - ఇదియే గీతాయోగము యొక్క అభిప్రాయము. అది మన బాహ్య సత్తనుండి పరమ ఆధ్యాత్మిక మఱియు వాస్తవ సత్యములోనికి చేయు ఒక సంక్రమణము. మఱియు పృథక్కర చేతస యొక్క అనేకానేక పరిమితులను విడిచివేసి, ఆవేశ, అశాంతి, అజ్ఞానములతో మనోసంగమును, అటులే అల్పతర ప్రకాశ జ్ఞానములను, పుణ్యాపాపములను, నిమ్న ప్రకృతియొక్క ద్వంద్వమయ ధర్మము మఱియు ప్రమాణమును పరిత్యజించుటచేత ఆ సంక్రమణము సాధ్యమగును. కావుననే దివ్య గురు విట్లు బోధించును - "సర్వాత్మనా నాకు నిన్ను సమర్పించుకొనుచు, నీ సచేతన మానసమునందు నీ సర్వ కర్మలను నాయందు సన్యసించుచు, బుద్ధియోగము నాశ్రయించి, హృదయము నందును, చేతనయందును సదా నాతో ఏకముగా నుండుము (18-57). సర్వదా ఇట్లు నీ వుందు వేని, అపుడు నా అనుగ్రహమువలన సర్వ కఠిన, సంకటగ్రస్త మార్గ ములద్వారా సురక్షితముగా ముందుకు బోదువు; కాని అహంకారమువలన నా మాట విన వేని, నశించిపోదువు (18-58). 'నేను యుద్ధము చేయను' అని అహంకారము నాశ్రయించి నీవు తలంతు వేని, ఈ నీ నిశ్చయము వ్యర్థము; నీ ప్రకృతియే నీచేత కర్మ చేయించును (18-59). మోహమువలన దేనిని నీవు చేయగోరవో, నీ స్వభావజన్యమైన స్వీయకర్మచేత బద్ధుడవై దానిని నీవు వివశముగా చేసితీరెదవు (18-60). ఈశ్వరుడు సర్వభూత హృదయములందు అవస్థితుడై యుండి, ఓ అర్జునా, యంత్రము నెక్కియున్న వాని నన్నింటిని (సర్వభూతములను) తన మాయచేత నిరంతరము త్రిప్పు చుండును (18-61). సర్వభావముచేతను అర్జునా, ఆయనయందే శరణు బొందుము, అపు డాయన ప్రసాదముచేత పరమ శాంతిని, శాశ్వత పదమును బొందెదవు (18-62)."

2. <u>భగవంతుడు వ్యక్తిత్వసహితుడు</u> : ఈ పంక్తులలో యోగముయొక్క ఆంతరతమ హృదయము నిక్షిప్తమై యున్నది మఱియు నివి దాని అనుభవ శిఖరమునకు గొనిపోవును; కావున తమ ఆంతరతమ తత్త్వమునందును, తదనుభవ శిఖరముయొక్క పరమ విశాలతయందును వాని అర్థమును మనము గ్రహించవలెను. ఈ వచనములు భగవంతునికి, మానవునకు మధ్య సంభవముకాగల అత్యంతసంపూర్ణ, ఘనిష్ఠ మఱియు సజీవ సంబంధమును ప్రకటించును. ఏ విశ్వాతీత మఱియు విశ్వగత భగవంతునుండి మానవుడు జనించునో మఱియు నెవనియందు నివసించునో, అతనిపట్ల వాని అనన్య ఆరాధన నుండియు, తన సమస్త సత్తయొక్క ఊర్ధ్వముఖ సమర్పణనుండియు, నిఃశేష పరిపూర్ణ ఆత్మనివేదన నుండియు నుత్పన్నమగు భక్తిమయ భావనయొక్క ప్రగాఢ శక్తిచేత ఈ వచనములు స్పందించుచున్నవి. భక్తికిని, భగవత్ప్రేమకును, పరమపురుషుని ఆరాధనకును గీత సమున్నత సుస్థిర స్థానము నిచ్చును; ఇవియే సర్వోచ్చ కర్మయొక్క ఆంతరతమ ప్రాణము మఱియు ప్రేరణ, సర్వోచ్చ జ్ఞానముయొక్క శిఖరము మఱియు హృదయము. కావున ఇచ్చటి ఈ ప్రబల భావన ఆ భక్త్యాదులకు అనురూపముగనే యున్నది. ఈ శ్లోకములందు ప్రయుక్తములైన పదములును, వానియందు స్పందించుచున్న ఆధ్యాత్మిక భావము (emotion) భగవత్స్వరూపముయొక్క వైయక్తిక సత్యము మఱియు సన్నిధికి ప్రగాఢ ప్రాముఖ్యము, పరమ మహత్త్వము నిచ్చుచున్నట్లు తోచును. ఈ భగవంతుడు దార్శనికుని నిరాకార కేవలము కానేకాదు, ఏ సంబంధములను సహించని ఉదాసీన నిర్వ్యక్తిక సన్నిధి గాని, అనిర్వచనీయ మౌనము గాని కానేకాదు, ఏలన మన సంసిద్ధియొక్క నిబంధన మఱియు నియమరూపమున ఇతనికి మన సర్వ కర్మలను సమర్పించగలుగుచున్నాము; మన చేతన సత్తయొక్క సర్వ భాగములందును ఇతనితో ఘనిష్ఠ ఏకతను విధించగలుగుచున్నాము మఱియు నితడు తన సాహాయ్యమును, రక్షణను, ముక్తిప్రదానమును మనకు వాగ్దానము చేయుచున్నాడు. ఈ భగవంతుడు మన కర్మల నియామకుడు, మన అంతరాత్మయొక్క సుహృదుడు మఱియు ప్రేమికుడు, మన ప్రాణమునకు అంతరంగ ప్రాణము, మన సమస్త సవ్యక్తిక మఱియు నిర్వ్యక్తిక ఆత్మ మఱియు ప్రకృతియొక్క అంతర్వాసి మఱియు అధివాసి ప్రభువు; ఇతడు మాత్రమే మనకీ అంతరంగ ప్రోత్సాహక సందేశము నీయగలడు. అయినను ఇది

సాత్త్విక లేక తదితర ఆహంకారిక మానసమునందు నివసించుచుండు మానవునకును, దేవునియొక్క ఒకానొక వైయక్తిక రూపము మఱియు పార్శ్వమగు "ఇష్టదేవత కును" మధ్య మతములు నెలకొల్పు సామాన్య సంబంధము గాదు; ఏలన ఈ ఇష్టదేవత ఆ మానసముచే రచింపబడును, అథవా దాని పరిమిత ఆదర్శమును, ఆకాంక్షను లేక కామమును తృప్తిపఱచుటకు దానిముం దుంచబడును. అది సామాన్య మానసిక మానవుని ధార్మిక భక్తియొక్క సాధారణాభిప్రాయము మఱియు వాస్తవ లక్షణము; కాని ఇచ్చటి భక్తి ఒకానొక విశాలతర వస్తువు, అది మనస్సును, దాని పరిమితులను, దాని ధర్మములను దాటి పరగును. ఇచ్చట తనను సమర్పించుకొనునది మనస్సుకంటె గంభీరతరమగు నొక వస్తువు, ఆ సమర్పణను స్వీకరించునది ఇష్టదేవతకంటె మహత్తరమగు నొక వస్తువు.

3. నిషేధరూపుడు గాడు, పరిపూర్తిరూపుడు : ఇచ్చట తనను సమర్పించు కొనునది జీవుడు; ఈ జీవుడు మూల అంతరాత్మ, మానవునియొక్క ఆద్య, కేంద్ర, ఆధ్యాత్మిక సత్త, వైయక్తిక పురుషుడు. ఇతడు పరిమితికారక, అజ్ఞానమయ అహంభావమునుండి విముక్తుడు, ఇతడు తనను ఒక పృథక్కర వ్యక్తిత్వముగా గాక, భగవంతునియొక్క ఒక "సనాతన అంశముగను" (15-7), శక్తిగను, అంతరాత్మ - భావముగను దెలిసికొనును, ఇతడు అజ్ఞానము వెడలిపోవుటచేత విముక్తుడు మఱియు ఉద్ధృతుడు మఱియు సనాతనుని ప్రకృతియే యగు తన స్వీయ సత్య మఱియు పరమ ప్రకృతియొక్క విముక్తి స్వాతంత్ర్యములందు సుప్రతిష్ఠితుడు. మన జీవనమునకు మూలము, ఆధారము మఱియు నియామక ఆత్మ మఱియు శక్తితో ఆనంద సాయుజ్యముల పూర్ణ, వాస్తవ సంబంధములో ప్రవేశించునది మనయందలి ఈ కేంద్ర ఆధ్యాత్మిక సత్తయే. పోగా, మన సమర్పణను స్వీకరించు వాడు ఎట్టి పరిమిత దేవతయు గాక, స్వయముగా పురుషోత్తముడు, ఏకమాత్ర సనాతన భగవంతుడు, సమస్త జగత్తు మఱియు సమస్త ప్రకృతియొక్క ఏకమాత్ర పరమ ఆత్మ, సృష్టియొక్క ఆద్య సర్వాతీత, దివ్యపురుషుడు. మన విముక్త జ్ఞానముయొక్క అనుభవమునకు అతడు ముందుగా ఒక అక్షర నిర్వ్యక్తిక ఆత్మసత్తగా గోచరించును, అదియే అతని సన్నిధియొక్క ప్రథమ చిహ్నము, అతని ద్రవ్యముయొక్క ప్రథమ స్పర్శ మఱియు ముద్రణము. కాగా ఒక విశ్వగత, విశ్వాతీత అనంత పురుషుడు కేవల మతని సత్తయొక్క

గుహ్యా గుప్త రహస్య మగును; ఇతనిని మానసిక రూపమున చింతించజాలము – "అచింత్య రూప" (8–9), కాని ఎప్పుడు మన చేతనాశక్తులగు భావము, సంకల్పము మఱియు జ్ఞానము తమనుండియు, తమ అంధ, క్షుద్ర రూపములనుండియు వెలువడి, ఒక జ్యోతిర్మయ ఆధ్యాత్మిక, ఒక అపరిమేయ అతిమానస ఆనందము, శక్తి మఱియు విజ్ఞానము (gnosis) లోనికి ఉద్ధరింపబడునో, అప్పుడా పురుషుడు వానికి మిక్కిలి సన్నిహితముగా నుండును, ప్రత్యక్షముగా నుండును. అటు అనిర్వచనీయ బ్రహ్మ మయ్యును, ఇటు సుహృదుడు, ఈశ్వరుడు (5–29), ఉద్భాసకుడు, ప్రేమికుడు నగు ఆ పురుషుడే ఈ పూర్ణతమ భక్తి మఱియు శరణాగతికి, ఘనిష్ఠతమ ఆంతర సంభూతి మఱియు సమర్పణకు అనన్య పాత్రము. ఈ సాయుజ్యము (union), ఈ సంబంధము పరిమితికర మనస్సుయొక్క రూపములనుండియు, నియమములనుండియు పైకి ఉద్ధరించబడిన ఒక అపూర్వ వస్తువు, దానిని ఈ నిమ్న ధర్మము లేవియు స్పృశింపజాలవు (18–66); అది మన ఆత్మయొక్కయు, మూల సత్తయొక్కయు సత్యము. అయినను, అథవా అందుచేతనే – ఆ సాయుజ్యము మన ఆత్మ మఱియు సత్తయొక్క సత్య మగుటచేతనే, దేనినుండి సర్వము వెలువడి, దేని జన్యములు మఱియు సూచనల రూపమున సర్వము వర్తించుచు, దేనిని జేర ప్రయాసపడుచున్నదో, ఆ పరమాత్మతో ఆత్మయొక్క ఏకతాసత్య మగుటచేతనే – ఆ సాయుజ్యము ఒక నిషేధము గాక, ఒక పరిపూర్తి యగును, అనగా మనః ప్రాణములు తమ లోపల, తమ ఇంకను అసంసిద్ధ అర్థముగానున్న దేనిని సూచించుచున్నవో మఱియు ధరించుచున్నవో, దాని అంతటి పరిపూర్తి యగును. కావున మన నిర్వాణము (ఆఱిపోవుట) ఇచ్చటి మన సమస్త సత్తయొక్క బహిష్కరణము మఱియు నిషేధరూప వినాశము గారాదు, అది అజ్ఞానము మఱియు అహంకారము యొక్క బహిష్కరణము మఱియు వినాశము గావలెను; తత్ఫలితమగు మన జ్ఞానము, సంకల్పము మఱియు హృదయాకాంక్షయొక్క అనిర్వచనీయ పరిపూర్తి గావలెను; భగవంతునియందు, సనాతనునియందు ఒక ఉన్నీత (uplifted), అపరిమిత నివాసము గావలెను – "నివసిష్యసి మయ్యేవ" (12–8); మన సమస్త చేతనయొక్క రూపాంతరము మఱియు నొక మహత్తర ఆంతర ధామమునకు ఆగమనము గావలెను; అట్టి నిర్వాణముచేతనే ఈ పరమ సంసిద్ధియు, ఆధ్యాత్మిక విముక్తియు ప్రాప్తించును.

4. అహంకారిక జీవితము - ఆధ్యాత్మిక జీవితము : ఆధ్యాత్మిక సమస్య యొక్క కఠినత యంతయు, సాధారణ మనస్సునకు దేని యథార్థ గ్రహణము మిక్కిలి కఠినమో, అట్టి సంక్రమణ స్వభావ మంతయు ఒక ప్రధాన భేదముతో ముడివడియుండును - అది నిమ్న ప్రకృతియందు అహంకారముయొక్క అజ్ఞాన మయ జీవితమునకును, తన స్వీయ సత్య ఆధ్యాత్మిక ప్రకృతియందు ముక్త జీవుని యొక్క విశాల ప్రకాశమయ జీవితమునకును గల భేదము. ఇందలి మొదటి దాని సన్న్యాసము సంపూర్ణము, రెండవ దానిలోనికి సంక్రమణము (transition) అశేషము గావలెను. గీత యిచ్చ టీ విభేదమును సర్వ సంభవ బలముతోను వివరించును. ఒక వైపున చేతనయొక్క ఈ క్షుద్ర సంక్షుబ్ధ దంభపూర్ణ అహంకారి కావస్థ గలదు - "అహంకృత భావ" (18-17), ఇది యీ తుచ్ఛ నిస్సహాయ పృథక్కర వ్యక్తిత్వముయొక్క దుర్బలతాపాదక సంకుచితత్వము; దీని దృక్కోణమునుండియే మనము సాధారణముగా ఆలోచింతుము మఱియు కర్మచేతుము, వస్తు సంస్పర్శలను బొందుచు, వానికి సమాధాన మిత్తుము. రెండవ వైపున అమరమగు పూర్ణత, ఆనందము మఱియు జ్ఞానముయొక్క ఆధ్యాత్మిక మహావిస్తారములు గలవు; దివ్య పురుషునితో సంయోగముద్వారా మన కీ విస్తారములలోనికి ప్రవేశము లభించును; అపుడు మనము సనాతన జ్యోతిలో అతనియొక్క ఒక అభివ్యక్తి మఱియు ప్రకటనముగనే యుందుము గాని, అహం - ప్రకృతియొక్క అంధకారములో అతనియొక్క ఒక మాఱు వేషముగా నుండము. ఈ సంయోగముయొక్క సంపూర్ణతయే "సతతం మచ్చిత్తః" (18-57) - అను గీతావచనముచేత సూచింపబడినది. అహంకారిక జీవనమున కాధారము పైకి కన్పించు మానసిక, ప్రాణిక, శారీరిక జగత్సత్యము యొక్క ఒక నిర్మాణము, అటులే వైయక్తిక జీవునికి, ప్రకృతికి మధ్య గల వ్యావహారిక సంబంధముల ఒక సంధిస్థానము (nexus), ఒక బౌద్ధిక, భావిక మఱియు సాంవేదనిక (sensational) వస్తువ్యాఖ్యానము - ఈ అనుకూల వ్యాఖ్యానముద్వారా మనలోని క్షుద్రము, పరిమితము నగు 'నేను' విశ్వముయొక్క విస్తృత క్రియామధ్యమున తన పరిచ్ఛిన్న, పృథగ్భూత వ్యక్తిత్వముయొక్క భావములను, కామములను రక్షించుకొనును మఱియు తృప్తిపఱచుకొనును. వేనిచేత వస్తువుల పట్ల మన దృక్కోణమును, జ్ఞానమును, క్రియను నిర్ణయించుకొందుమో, అట్టి మన సర్వ ధర్మములును, మన సాధారణ సర్వ ప్రమాణములును ఈ సంకుచిత, పరిమిత ఆధారము పైననే ప్రవర్తించును, మఱియు అహం - కేంద్రము చుట్టును చేయు

విశాలతమ పరిభ్రమణములందు సైతము ఈ ధర్మానుష్ఠానము మనలను ఈ స్వల్ప వలయము యొక్క వెలుపలికి గొనిపోజాలదు. ఇది యొక విషవలయము, దీని యందు జీవుడు ఒక సంతుష్ట లేక సంఘర్షశీల బందిగా నుండును, ప్రకృతియొక్క మిశ్రిత బలాత్కారములకు శాశ్వతముగా అధీనుడై యుండును.

5. గుణధర్మములు, వాని అపూర్ణత : ఏలన పురుషు డీ వలయమునందు తననుదాను కప్పివేసికొనును; అజ్ఞానమున తన దివ్య మఱియు అమర సత్తను ఆవరించివేయును మఱియు నొక ఆగ్రహపూర్ణ పరిచ్ఛేదక ప్రకృతిధర్మమునకు అధీను డగును. ఈ ధర్మము త్రిగుణముల బలాత్కార నియమము. ఇది యొక త్రివిధ సోపానము, ఇది దివ్య తేజము దిశగా పైకి పడుచు-లేచుచు సాగును గాని, దానిని చేరజాలదు. దీని అట్టడుగు మెట్టు జడతా-ధర్మము : తామసిక మానవుడు ఒక గతానుగతిక యాంత్రిక క్రియయందు తన భౌతిక మఱియు అర్ధ ప్రబుద్ధ ప్రాణిక మఱియు ఇంద్రియాత్మక ప్రకృతియొక్క నిర్దేశములను, ప్రేరణలను, సంకల్పచక్రమును మొద్దుగా అనుసరించును. పోగా, మధ్యసోపానమున ఒక ప్రవృత్తిమయ ధర్మము తలయెత్తును; ప్రాణప్రధాన, శక్తిశాలి, క్రియాశీల రాజసిక మానవుడు తన ప్రపంచము మఱియు పరిసరముపైన తన యిచ్ఛను విధింప యత్నించును, కాని ఈ ప్రయత్నమున తన విక్షుబ్ధ ఆవేశములు, కామములు మఱియు అహంకారచర్యల వ్రణకారక భారమును, క్రూర శాసనమును మాత్రమే పెంపొందించును, అటులే తన అశాంత స్వేచ్ఛాప్రవృత్తియొక్క బరువునకు, తన రాజసిక ప్రకతియొక్క ఆధిపత్యమునకు మాత్రమే బలము చేకూర్చును. అగ్రసోపానమున ఒక సామరస్యపూర్ణ, నియామక ధర్మము జీవనముపై తన ఒత్తిడిని బిఱచును; సాత్త్వికమానవుడు తర్కప్రధాన జ్ఞానము, ప్రబుద్ధ ఉపయోగము లేక యాంత్రిక సదాచారమునకు సంబంధించిన తన పరిమిత, వైయక్తిక ప్రమాణములను నిర్మించుకొని, అనుష్ఠింప బ్రయత్నించును; అటులే అతడు తన మతములు, దర్శనశాస్త్రములు మఱియు నైతిక సూత్రములను, మానసిక ప్రణాళికలు మఱియు నిర్మాణములను ఇంకను భావము మఱియు వర్తనకు సంబంధించిన నిరూఢ మార్గములను ఏర్పఱచు కొనును గాని, అవి సమగ్ర జీవితార్థముతో సంగతము గావు గావున, విశాలత విశ్వప్రయోజనముయొక్క గతిప్రవాహమున అది నిరంతరము గతించిపోవును. సాత్త్వికమానవుని ధర్మము గుణవలయమునందు సర్వోన్నతమే కాని, అదియు

నొక పరిమిత దృష్టియే మఱియు నొక హ్రస్వ ప్రమాణమే. దాని అపూర్ణ సూచనలు ఒక క్షుద్ర, సాపేక్ష సిద్ధికి మాత్రమే నడుపును; వివేకయుత వైయక్తిక అహంకారమున కది తాత్కాలికముగా తృప్తి నిచ్చినను, ఆత్మయొక్క సమగ్ర సత్యముపైన గాని, ప్రకృతియొక్క సమగ్ర సత్యముపైన గాని ప్రతిష్ఠితము గాదు.

6. ధార్మిక దంభమునకు గారణము : నిజానికి వాస్తవ మానవజీవితము ఏ సమయమునందును వీనిలో నే యొకటి మాత్రమే గాదు—అది ప్రకృతి యొక్క ప్రథమ స్థూల ధర్మముయొక్క యాంత్రిక, పరిపాటి నిర్వహణమును గాదు, గతి ప్రధాన క్రియాత్మయొక్క సంఘర్షమును గాదు, సచేతన ప్రకాశము, బుద్ధి, అటులే శుభము మఱియు జ్ఞానముయొక్క విజయోపేత ఆవిర్భావమును గాదు. ఈ ధర్మము లన్నింటియొక్క సంమిశ్రమే మనకు గన్పించును, ఈ సంమిశ్రమునుండి బుద్ధి ఎక్కువ తక్కువ అయిచ్ఛికముగా నొక ధర్మము నేర్పఱచి, దానిని యావచ్ఛక్తి సాధింప బూనుకొనును, కాని వాస్తవమున విశ్వప్రకృతియొక్క ఇతర బలాత్కారక వస్తువులతో రాజీపడి మాత్రమే కొంత సాధించగలుగును. మన ప్రబుద్ధ సంకల్పము మఱియు బుద్ధియొక్క సాత్త్వి కాదర్శములు స్వతః రాజీలు (compromises) మాత్రమే, ఉత్తమ పక్షమున ప్రగతిశీలమగు రాజీలు, ఇవి ఒక సంతత అపూర్ణత మఱియు పరివర్తన ప్రవాహమునకు లోనై యుండును; లేక అవి రాజీలు కాక, పూర్ణాదర్శములే యగు నేని, ఆచరణయందు చాలవఱకు నుపేక్షింపబడుచు, పూర్ణత యొక్క ఆదర్శములుగానే లక్షించబడును, లేక ఒక ఆంశిక ప్రభావముగనే అవి ఆచరణయందు ఫలించును. మఱియు ఒకొకప్పుడు ఆ సాత్త్వికాదర్శములను పూర్తిగా సాధించితి మని మన మూహింతు మేని, దానికి కారణము, మనలోని ఇతర శక్తులు మఱియు ప్రేరణల అవచేతన లేక అర్ధచేతన మిశ్రమును గణించకపోవుటయే; నిజ మారయ ఈ మిశ్రమే ప్రాయః మన కర్మయందు మన ఆదర్శములతో సమము లేక అధిక మగు వాస్తవ శక్తియగును. ఆ స్వ-అజ్ఞానమే మానవులు తాము ధీమంతుల మని, ధర్మవంతుల మని గొప్పచెప్పుకొనుటకు మూల కారణము; మానవుని సాధుస్వభావముయొక్క తెల్లని, నిష్కలంక బాహ్యరూపము వెనుక అది ఒక నల్లని ప్రచ్ఛన్నరేఖగా నుండును మఱియు నదియే జ్ఞానము మఱియు సదాచారముయొక్క మిథ్యాభిమానమును సంభవ మొనరించును. ఉత్తమ మానవ జ్ఞానము సైతము ఒక అర్ధజ్ఞానము మాత్రమే మఱియు ఉచ్చతమ మానవ గుణము సైతము

ఒక మిశ్ర వస్తువు మాత్రమే మఱియు నాదర్శమునందు మిక్కిలి నిరపేక్ష మైనను, ఆచరణయందు ఎంతో సాపేక్షము. సర్వసామాన్య జీవనధర్మముగా సాత్త్వి కాదర్శములు ఆచరణయందు నిలువజాలవు; వైయక్తిక ఆకాంక్షను, వర్తనను మెఱుగుపఱచి, ఉద్ధరించుటకు ఒక శక్తిగా అవి ఆవశ్యక మైనను, వానిపట్ల గల నిష్ఠ జీవితమును సంస్కరించునే గాని, మార్చజాలదు, మఱియు వాని పరిపూర్ణ సిద్ధి భవిష్యత్తునకు సంబంధించిన స్వప్నమునందో, మన పార్థివ జీవనముయొక్క మిశ్ర స్వభావము లేని ఒక స్వర్గమునందో మాత్రమే ఛాయగా గోచరించును. అది అట్లు గాక తప్పదు, ఏలన ఈ ప్రకృతి గాని, మానవ ప్రకృతి గాని కేవల సత్త్వ పదార్థ ముతో చేయబడిన ఏకమాత్ర సమరస వస్తువు కాదు, కాజాలదు.

7. <u>సన్యాసముకంటె బలవత్తరానుభవము</u> : మన సంభవతలయొక్క ఈ పరిమితినుండి, ధర్మములయొక్క ఈ అస్తవ్యస్త మిశ్రమునుండి తప్పించు కొనుటకు ప్రథమ ద్వారము నిర్వ్యక్తికతాదిశగా సాగు ఒక సమున్నత ప్రవణత యందు మనకు గన్పించుచు, ఒకానొక విశాల, విశ్వవ్యాపక, ప్రశాంత, విముక్త, సరళ మఱియు శుద్ధ వస్తువులోనికి సాగు నివృత్తియందు గన్పించును - ఈ వస్తు విపుడు పరిమితకారక అహంకారమనస్సుచేత మఱుగుచేయబడి యున్నది. ఇచ్చటి కష్ట మేమన, మన సత్తయొక్క ప్రశాంత నీరవ క్షణములందు ఈ నిర్వ్యక్తికతలోని కొక ప్రత్యక్ష ముక్తిని మన మనుభవింపగలము గాని, నిర్వ్యక్తిక క్రియాకలాప మును సాధించుట ఎట్లును అంత సులభము గాదు. మనము మన సాధారణ మానసమునందు ఇంచుక యైనను ఎంత కాలము నివసింతుమో, అంతవఱకు ఆ మానసమునకు సహజము, అనివార్యము నగు మన వ్యక్తిత్వముయొక్క ధర్మము చేతను, మన ప్రాణిక ప్రకృతియొక్క ప్రేరణచేతను, అహంకారముయొక్క వర్ణముచేతను నిర్వ్యక్తిక సత్యము లేక నిర్వ్యక్తిక సంకల్పముయొక్క అను సంధానము కలుషిత మగుచుండును. నిర్వ్యక్తిక సత్యముయొక్క అనుసంధానము ఈ ప్రభావములచేత మనము పసికట్టని ఒక ముసుగులోనికి మార్చివేయబడగా, బౌద్ధికాభిరుచులు దానిలోపల తలదాచుకొనును మఱియు దానికి పరిమితికారి మానసి కాభినివేశము ఆసరా యగును. పోగా నిస్వార్థ నిర్వ్యక్తిక కర్మానుసంధానము మన సవ్యక్తిక సంకల్పముయొక్క స్వార్థపూర్ణ సంవరణములకును, అంధ స్వచ్ఛంద ఆగ్రహము (persistence) లకును ఒక అధికతర ప్రమాణముగను, బాహ్యసమున్నత

అనుమతిగను మార్చివేయబడును. రెండవవైపున పూర్ణనిర్వ్యక్తికత అంతగాను పూర్ణ నిష్క్రియతను విధించుచున్నట్లు గన్పించును, మఱియు అహంకారము మఱియు త్రిగుణముల యంత్రాంగమునకు సర్వక్రియయు కట్టబడి యున్నదనియు, కావున ఈ వలయమునుండి వెలువడుటకు జీవన, కర్మలనుండి వెనుదగ్గుటయే ఏకమాత్ర మార్గమగు ననియు దీని అర్థ మగును. కాని ఈ నిర్వ్యక్తిక నీరవతయే ఇవ్విషయమున జ్ఞానముయొక్క చరమ వచనము గాదు, ఏలన మన ప్రయత్నసాధ్యమగు ఆత్మసాక్షాత్కారమునకు ఇది యొక్కటియే మార్గము మఱియు గమ్యము గాదు, సమస్త మార్గమును, చరమ గమ్యమును అసలే గాదు. ఇంతకంటెను ప్రబలతరము, పూర్ణతరము, దృఢతరము వగు ఒక ఆధ్యాత్మి కానుభవము గలదు; దీనియందు మన అహంకారిక వ్యక్తిత్వముయొక్క పరిధియు, మన మనఃపరిమితులయొక్క చక్రమును ఒక మహత్తమ ఆత్మ మఱియు సత్తయొక్క నిరావరణ అనంతతయందు అదృశ్యమగును; అయినను జీవన, కర్మ లింకను ఆమోదయోగ్యములుగను, సుసంభవములుగను నిలిచియుండుటయే గాక, పైకిని, వెలికిని విస్తరించుచు, తమ విశాలతమ ఆధ్యాత్మిక సంపూర్ణతను చేరుకొనును మఱియు నొక గొప్ప ఊర్ధ్వముఖ మార్మికార్థమును సంతరించుకొనును.

8. <u>నిర్వ్యక్తికతకును, కర్మకును సమన్వయము</u> : శుద్ధ నిర్వ్యక్తికతకును, మన ప్రకృతియొక్క శక్తిమయ సంభవతలకును మధ్య గల అఖాతముపై వారధి నిర్మించు ఉద్యమములందు వివిధ స్తరములు గలవు. మహాయన బౌద్ధమతము యొక్క సిద్ధాంతము మఱియు అనుష్ఠానము ఈ కఠిన సమన్వయమును రెండు మార్గములద్వారా చేరుకొనును - 1. ఒక గభీర నిష్కామత, మఱియు మానసిక మఱియు ప్రాణిక సంగము మఱియు సంస్కారమునుండి ఒక విశాల విలీనకారి విముక్తి యొక్క అనుభవముద్వారా, 2. ఇక విధాయక (Positive) పార్శ్వమునందు ఒక విశ్వవిశాల పరహితనిష్ఠ, ప్రపంచము మఱియు సర్వజీవుల పట్ల ఒక అగాధ కరుణారసముద్వారా; ఈ కరుణయే సమున్నత నిర్వాణస్థితియందు జీవనము మఱియు కర్మపై ఒక వెల్లువవలె ప్రవహించెను. ఆ సమన్వయమే అంతగాను మఱియొక ఆధ్యాత్మి కానుభవముయొక్క ఆశయముగానుండెను, తదనుభవము ప్రపంచలక్ష్యముపట్ల ఎక్కువ సచేతనము, ఎక్కువ గంభీరము, ఉపకారపరము, కర్మపక్షమున సమృద్ధముగా సమగ్రము, అది గీతాతత్త్వమునకు సమీపతర

సోపానము : ఈ అనుభవము మనకు (చైనాయందు వెలసిన) తావోమతస్థుల వచనములందు గన్పించును, అథవా ఆ వచనముల వెనుక స్ఫురించును. వారి మూలవస్తువు ఒక నిర్వ్యక్తిక అనిర్వచనీయ సనాతనుడుగా మనకు దోచును, అతడు ఏకకాలమున విశ్వముయొక్క మూలసత్త మఱియు ఏకమాత్ర ప్రాణము : అది సర్వవస్తువులను ధరించుచు, వానియందు సమముగా ప్రవహించును – "సమం బ్రహ్మ" (5–19). అది మనము చూచు సర్వముకంటెను భిన్నము గనుక, 'అసత్తు'; అయినను అది ఈసర్వఘాతముల సమష్టిగనుక, 'ఏకము'. ఈఅనంతునిపై నురుగువలె అంధమగు వ్యక్తిత్వ మేర్పడును, ఇదియే రాగద్వేషము, ప్రియాప్రియములు, నిరూఢ మానసిక విభేదములతోగూడిన చంచ లాహంకారము, ఇది శక్తిశాలి ప్రతిరూపమై సదసత్తులు రెండును అగు ఏకమాత్ర సద్వస్తువు,'తావోను' మనకు మఱుగుపఱచును, వికృతపఱచును. కావున వ్యక్తిత్వము, మఱియు దాని క్షుద్ర నిర్మాణగత రూపములను అగ్రాహ్యమగు విశ్వవ్యాప్త మఱియు సనాతన సన్నిధియందు గోల్పోవుటచేతనే మనము తావోను స్పృశించగలము మఱియు నొకసారి యిది ప్రాప్తించి నపుడు, మనము దానియందు ఒక వాస్తవ జీవితమును జీవించుచు, మఱియొక మహత్తర చేతనను గలిగియుందుము, మఱియు దీనిచేత మన మన్ని వస్తువులలోను ప్రవేశింతుము మఱియు సర్వ సనాతన ప్రభావములు మనలో ప్రవేశింప యోగ్యుల మగుదుము. గీతయందు వలెనే యిచ్చటను సనాతనునికి సంపూర్ణ ఉన్మీలనము మఱియు ఆత్మసమర్పణమే సర్వోన్నత మార్గముగా గన్పించును. తావో మతావలంబి ఇట్లు వచించును, "నీ శరీరము నీది గాదు, అది భగవంతుని ప్రతినిధియగు ప్రతిరూపము : నీ ప్రాణము నీది గాదు, అది భగవంతుని ప్రతినిధియగు సామరస్యము : నీ వ్యక్తిత్వము నీది గాదు, అది భగవంతుని ప్రతినిధియగు నమ్యతాగుణము." మఱియు నిచ్చట సైతము ఒక విశాల సంసిద్ధియు, విముక్త క్రియయు అంతరాత్మ సమర్పణయొక్క శక్తిశాలి ఫలిత మగును. అహంమయ వ్యక్తిత్వముయొక్క కర్మలు విశ్వప్రకృతియొక్క సమష్టిప్రవృత్తికి విరుద్ధమగు భేదమూలక భావన మగును. ఈ మిథ్యాభావనము (పరుగు) నకు బదులు విశ్వగత మఱియు సనాతన శక్తియొక్క హస్తములందు సమర్పించుకొనిన ఒక జ్ఞానమయ, ప్రశాంత నిష్క్రియతను స్థాపించవలెను, ఈ నిష్క్రియత అనంత క్రియకు మనలను అనువిధేయము గావించును; అపుడు మనము దాని సత్యముతో సమస్వరము, అనంతుని రూపవిధాయక శ్వాసకు నమనీయము నై యుందుము. ఈ సమస్వరత

గల మానవుడు లోపల నిశ్చలము, మౌనవిలీనము నై యుండవచ్చును, కాని అతని మహాత్మ్యము తన మానవ వేషములనుండి విడివడి కన్పించగా, దివ్య ప్రభావము ఆతనియందు పనిచేయుచుండును మఱియు నతడు ప్రశాంతియందును, అంతర ఆత్మయందును – "నైష్కర్మ్యము" (18–42) – నెలకొని యుండియు, ఒక అప్రతిహత శక్తితో కార్య మాచరించును, అసంఖ్యాక వస్తువులు మఱియు జీవులు కదలిక నొంది, ఆతని ప్రభావముక్రింద సమకూడుదురు. ఆత్మయొక్క 'నిర్వ్యక్తిక శక్తి' వ్యష్టిక అహంకారముచేత వికృతము గాని అతని కర్మలను చేపట్టును మఱియు ప్రపంచమును, దాని జనులను ఒక త్రాటిపై నడుపుటకు – "లోకసంగ్రహార్థాయ" (3–20) – ఈశ్వరాధికారముతో అతనిద్వారా కార్య మాచరించును.

9. <u>బౌద్ధముపై గీతాధిక్యము</u> : ఈ అనుభవములకును, గీతచేత దృఢముగా బోధింపబడిన ప్రథమ నిర్వ్యక్తిక కర్మకును గల భేదము నామమాత్రము. కామము, సంగము మఱియు అహంకారముయొక్క సన్యాసమును, నిమ్నప్రకృతియొక్క అతిక్రమణమును, మన వ్యక్తిత్వము మఱియు దాని క్షుద్ర నిర్మాణములయొక్క భంజనమును గీతసైతము మనకు విధించును. ఇంకను, ఆత్మ మఱియు బ్రహ్మము నందు నివసించుటను, ఆత్మ మఱియు బ్రహ్మమునందు సర్వమును, సర్వమునందును ఆత్మ మఱియు బ్రహ్మమును (6–29), మఱియు సర్వమును ఆత్మ మఱియు బ్రహ్మముగను (2–17) జూచుటను గీతయు మనకు విధించును. మీ ప్రాకృత వ్యక్తిత్వమును దాని కర్మలను ఆత్మలోనికి, అనగా సనాతన బ్రహ్మములోనికి సన్యసింపు డని 'తావో' మనీషివలె గీతయు మనకు చెప్పును – "ఆత్మని సన్యస్య, బ్రహ్మణి" (5–10). మఱియు నిట్టి సమానతకు గారణమేమన, ఇది సర్వమతము లందు మానవునికి సంభవముకాగల ఒక సర్వోన్నత, సర్వవిముక్త అనుభవవిశేషము, దీనియందు శాంతిమయ ఆంతర విశాలత మఱియు నీరవత ఒక శక్తిమయ బాహ్య సక్రియ జీవనముతో సమన్వయము బొందియుండును; ఇవి రెండును ఏకమాత్ర అమర శక్తి మఱియు నేకమాత్ర సనాతన సత్తయొక్క నిర్వ్యక్తికమగు అనంత సత్తాత మఱియు అపార క్రియయందు సరసను వర్తించును, అథవా రెండును కలిసిపోవును. కాని గీత (అదనముగా) ఈ స్థితి నంతను మార్చివేయు, అపార అర్థగర్భితమగు ఒక పదమును జోడించును–"ఆత్మని అథో మయి" (4–35). ఇచ్చట గీత, సర్వవస్తువులను ఆత్మయందును, పిమ్మట "నాయందును" అనగా ఈశ్వరుని

యందును జూడవలె నని మనలను గోరును, అటులే సర్వ కర్మలను ఆత్మ లేక బ్రహ్మములోనికి, పిమ్మట పరమ పురుషుడు; అనగా పురుషోత్తమునిలోనికి సన్యసించవలె నని ఆదేశించును. ఇచ్చట ఆధ్యాత్మికానుభవముయొక్క ఇంకను మహత్తరము, గంభీరతరము నగు సంమిశ్రము గలదు, మానవ జీవనమునకు గల అర్థముయొక్క ఒక విపులతర పరివర్తనము గలదు, సాగరమునకు నది తిరిగివచ్చునప్పటి ఒక గుహ్యతర, ప్రగాఢతర హృదయావేగము గలదు, సనాతన కర్మకర్తయొక్క హస్తములలోనికి వైయక్తిక కర్మ మఱియు వైశ్వ క్రియయొక్క పునః సమర్పణము గలదు. శుద్ధ నిర్వ్యక్తికతయందు పట్టు బట్టుదుమేని, అది మన కొంకతినతను, అపూర్ణతను దెచ్చిపెట్టును-అది మన ఆంతర పురుషుని, ఆధ్యాత్మిక వ్యక్తిని, మన ఆంతరతమ సత్తయొక్క స్థాయి మహత్తును అనంతములో నేర్పడిన ఒక అస్థాయి, భ్రాంతిజనక, సవికార నిర్మాణములోనికి మార్చివేయును. ఇచ్చట అనంత మొక్కటియే యుండును మఱియు నది ఒక క్షణిక ఖేలనార్థము తప్ప, సజీవ ప్రాణియొక్క అంతరాత్మపై నెట్టి వాస్తవ దృష్టిని బఱుపదు. ప్రతిక్షణము భిన్నరూపము ధరించునట్టి శరీరమువలె తదంతరాత్మయు అనంతమునం దేర్పడిన ఒక క్షణిక దృశ్యముకంటె నధికమగు మఱేదియు గానిచో, మానవునియందలి అంతరాత్మకును, సనాతనునికి మధ్య ఎట్టి వాస్తవ శాశ్వత సంబంధము నుండజాలదు.

10. <u>అహంకారిక జీవుడు-ఆధ్యాత్మిక జీవుడు</u> : నిజమే, అహంకారమును, దాని పరిమిత వ్యక్తిత్వమును ప్రకృతియొక్క అట్టి ఒక తాత్కాలిక సవికార రచనయే, కావున దానిని భగ్నముగావించి, సర్వముతోను, అనంతముతోను మనము మన ఏకత ననుభవించవలసినదే. కాని అహంకారము వాస్తవ పురుషుడు గాదు; అది లీనముగావించబడి నపుడు, ఇంకను ఆధ్యాత్మిక వ్యక్తి మిగిలియుండును, సనాతన జీవుడు నిలిచియుండును. అహంకల్పిత పరిమితి అదృశ్యము కాగా, అంతరాత్మ ఏకునితో గభీర ఏకతయందు నివసించును మఱియు సర్వ వస్తువులతోను తన వైశ్వ ఐక్యము ననుభవించును. అయినను ఈ విశాలతను, ఏకతను అనుభవించునదింకను మన అంతరాత్మయే. విశ్వ క్రియ అన్నింటియందును గల ఏక మఱియు అభిన్న శక్తియొక్క ఒక క్రియగా స్ఫురించి నపుడు సైతము, అది ఈశ్వరుడు చేయు ఒక ఆరంభము మఱియు వ్యాపారముగా అనుభూత మైనపుడు సైతము, అది మానవుల భిన్నభిన్న అంతరాత్మలందు – "అంశః సనాతనః" (15–7)– భిన్నభిన్న

రూపములను ధరించును, మఱియు వాని ప్రకృతియందు ఒక భిన్న దిశగా సాగును. ఆధ్యాత్మిక జ్ఞానముయొక్క ప్రకాశము, బహువిధమగు విశ్వశక్తి, సత్తయొక్క సనాత నానందము మన లోపలను, చుట్టును దూకుచు ప్రవహించును, మనలోపల కేంద్రీకరించుకొని, ప్రతి అంతరాత్మనుండియు, సజీవ ఆధ్యాత్మిక చేతనయొక్క ఒక కేంద్రమునుండివలె, వెలువడి, పరిసర ప్రపంచముపై ప్రవహించును – అట్టి ప్రతి కేంద్రముయొక్క పరిధి అనంతమున గలిసిపోవును. అంతియే గాదు, ప్రతి ఆధ్యాత్మిక వ్యక్తియు దివ్యసృష్టియొక్క ఒక చిన్న విశ్వముగా నిలిచి యుండును, ఇది భగవంతుని స్వీయాభివ్యక్తియొక్క సమగ్ర అనంతవిశ్వమునుండి ఏకకాలమున స్వతంత్ర మయ్యును, అవిచ్ఛేద్యము. పరాత్పరుని ఒక అంశమును, సృజనశీలుడు నగు నీ జీవుడు తన చుట్టును తన స్వీయ ప్రపంచమును సృజించు కొనుచునే, దేనియందు సర్వులు నుందురో, అట్టి తన విశ్వచేతనను గూడ ధరించి యుండును. కాగా, ఇది యొక భ్రమ, జీవుడు విశ్వాతీత బ్రహ్మములోనికి ఉప సంహరించుకొని నపుడు ఇది నశించక తప్పదు అని ఆక్షేపము దెల్పుచో, చివరి కీ విషయమున ఎట్టి సునిశ్చిత నిశ్చయము లేదని సమాధానము. ఏలన ఏ అంతరాత్మ బ్రహ్మములోనికి ఉపసంహరించుకొనక పూర్వము భగవంతుని కర్మ మఱియు అభివ్యక్తికి ఒక సజీవ ఆధ్యాత్మిక కేంద్రముగా నుండెనో, అదియే ఇపు డింకను ఉపసంహరణప్రాప్తమగు విముక్తికి భోక్తగా నున్నది; అనగా వ్యక్తిత్వముయొక్క భ్రాంతిమయ ఆవరణను అనంతములో విచ్ఛిన్నముగావించు కొను అహంకారముకంటెను అధిక మగునది యొకటి గలదు. మన అస్తిత్వమునకు సంబంధించిన ఈ రహస్యము మనము ఏకమాత్రునియొక్క ఒక తాత్కాలిక నామ రూపము మాత్రమే గాదని తెలుపును మఱియు మనము ఏకమాత్రునియొక్క ఒక అంశమగు అంతరాత్మ మఱియు చేతన యని బోధించును. అహంకారము అజ్ఞా నమునందు దేనియొక్క కేవలము ఒక భ్రాంతికర చ్ఛాయ మఱియు ప్రక్షేపమో (projection), ఆ మన ఆధ్యాత్మిక వ్యక్తిత్వము అజ్ఞానమున కావల నిలిచియుండు ఒక సత్యమును గలిగియున్నది లేక అదియే ఆ సత్యము. పురుషోత్తముని పరమ ప్రకృతియందు శాశ్వతముగా నివసించు నొకానొక వస్తువు మనలో గలదు – "నివసిష్యసి మయి" (12-8). ఇదిగో, ఇదియే గీతాబోధనయొక్క గంభీర సమగ్రత : అహంకారనిర్వాణముచేత దేనియందు మనము ప్రవేశింతుమో, అట్టి విశ్వీకృత నిర్వ్యక్తికతయొక్క సత్యమును–"బ్రహ్మనిర్వాణమును" (2-72)–గీత

అంగీకరించును, కారణము, అదిలేనిదే నిక్కముగా నెట్టి మోక్షము, కనీసమెట్టి పరిపూర్ణ విముక్తి నుండజాలదు. దాని నంగీకరించుచునే, గీత పరమోన్నతానుభవముయొక్క ఒక అంశముగా మన వ్యక్తిత్వముయొక్క స్థాయి ఆధ్యాత్మిక సత్యమును గూడ నంగీకరించును. ఈ ప్రాకృత పురుషుడు గాక, మనలోని ఆ దివ్య కేంద్ర పురుషుడే సనాతన జీవుడు (15–7). ఈశ్వరుడే, సర్వ వస్తువులు నగు వాసుదేవుడే (7–19) నిమ్న ప్రకృతియొక్క ఉపభోగార్థము మన మనః ప్రాణ శరీరములను స్వీకరించును; కాగా పర ప్రకృతి, అనగా పరమ పురుషునియొక్క ఆద్య ఆధ్యాత్మిక ప్రకృతి, విశ్వమును సంఘటితముగా ధరించుచు, దానిలో జీవరూపమున ఆవిర్భవించును. ఇట్లు జీవుడన పురుషోత్తముని ఆద్య దివ్య ఆధ్యాత్మిక సత్తయొక్క ఒక అంశము, సజీవ సనాతనునియొక్క ఒక సజీవ శక్తి. అతడు నిమ్నప్రకృతియొక్క ఒక అస్థాయి రూపము మాత్రమే గాడు, పరంతు సర్వోన్నతుని పరప్రకృతియం దేర్పడిన అతని ఒక సనాతనాంశము, దివ్యసత్తయొక్క ఒక సనాతన చిన్మయ కిరణము; కావున పరప్రకృతి ఎంత శాశ్వతమో, అంత శాశ్వతుడు. కావున మన విముక్త చేతనయొక్క సర్వోన్నత సంసిద్ధి మఱియు పదముయొక్క ఒక పార్శ్వము పరమ ఆధ్యాత్మిక ప్రకృతియందు జీవుడు తన యథార్థ స్థానమును చేరుకొనుటయు, అక్కడ పరమ పురుషుని మహిమయందు వివసించుటయు, సనాతన ఆధ్యాత్మిక ఏకతయొక్క ఆనందము ననుభవించుటయు నగును.

11. <u>ఉత్తమ రహస్యము</u> : మన సత్తయొక్క ఈ రహస్యము పురుషోత్తముని సత్తయొక్క ఒక సదృశ పరమ రహస్యమును అవశ్యముగా సూచించును– "రహస్యం ఉత్తమం" (4–3). నిరపేక్ష బ్రహ్మముయొక్క కేవల నిర్వ్యక్తికతయే పరమ రహస్యము గాదు. పోగా ఒక పరమ పురుషుడు గలడు మఱియు పైకి అట్లు గన్పించు ఒక వ్యాపక నిర్వ్యక్తిక సత్త గలదు : వీని ఏకతయే మహాశ్చర్యమగు ఉత్తమ రహస్యము – సర్వవస్తువులయొక్క ఒక అతీత అక్షరాత్మ గలదు (15–16) మఱియు సర్వత్ర పనిచేయుచు, ఒక అనంత మఱియు బహురూప వ్యక్తిత్వముగా నిచ్చట సృష్టియొక్క అసలు మూలమునందే తనను దాను అభివ్యక్తము చేసికొనుచున్న ఒక దివ్య పురుషుడు గలడు; కాగా ఈ ఆత్మయు, పురుషుడును మన చరమ, ఆంతరతమ, గభీరతమ అనుభవమునకు ఒకే అపరిమేయ సత్స్వరూప పురుషుడుగా ప్రకటమగును, ఇతడు మనలను అంగీకరించి

తన దగ్గరకు తీసికొనును – నిరాకార సత్తయొక్క ఒకానొక శూన్యములోనికి గాదు– అత్యంత ప్రత్యక్షముగా, గంభీరముగా, అద్భుతముగా తన పూర్ణ స్వరూపము లోనికి తీసికొనును మఱియు తన మఱియు మన సచేత నాస్తిత్వముయొక్క సర్వ ప్రకారములందును తీసికొనును. ఈ ఉచ్చతమ మానుభవమును, ఈ విశాలతమ దర్శనప్రకారమును మన ప్రకృతిభాగములగు జ్ఞానము, సంకల్పము మఱియు హృదయగత ప్రేమారాధనలకు ఒక గంభీర, మర్మస్పర్శి, అనంత అర్థమహత్త్వ మును తెలుపును; కాని ఈ అర్థమహత్త్వము, మనము నిర్వ్యక్తికమును మాత్రమే ఒత్తి చెప్పుదు మేని, నశించును, కనీసము సన్నగిలును. ఏలన ఆ ఒత్తిడి మన గభీరతమ ప్రకృతియొక్క ఒక భాగమగు వృత్తులు మఱియు శక్తులయొక్కయు, మన ఆత్మానుభవముయొక్క అంతరతమ ప్రధాన తంతువులతో సంబద్ధమగు ప్రగాఢ తలు మఱియు ప్రకాశవత్త్వములయొక్కయు ప్రగాఢతమ పరిపూర్తిని అడచివేయును లేక అల్పిష్ఠముగావించును లేక వానికి అవకాశ మివ్వదు. మనకు సహాయపడగలిగి నది జ్ఞాన తీవ్రత యొక్కటియే గాదు, జ్ఞానముచేత ఉద్భాసితము, ఉన్నీతము నైన హృదయ ప్రేమకును, ఆకాంక్షకును అవకాశము, అపారావకాశము గలదు; ఈ భక్తిసంపన్న జ్ఞానము ఎక్కువ గుహ్యముగా స్పష్టము, ఎక్కువ విశాలము మఱియు ప్రశాంతముగా ఆవేగమయము నగు జ్ఞాన మగును. మన హృదయ చేతన, మన చేతన, సర్వ–చేతలయొక్క – "సతతం మచ్చిత్తః" (18–57) – సంతత ఏకీభూత సాన్నిహిత్యముచేతనే సనాతనునితో మన ఏకతయొక్క విశాలతమ, గభీరతమ, పూర్ణతమ అనుభవమును బొందుదుము. ఏది విశ్వమయతయొక్క మధ్యను సైతము, విశ్వాతీతతయొక్క శిఖరమున సైతము గభీరముగా వైయక్తికమో, సర్వసత్తయం దును ఆ సమీపతమ ఏకత ఇచ్చట మానవాత్మపై విధించబడినది, ఇదియే పరముని జేరుటకు పథము మఱియు నొక ఆధ్యాత్మ సత్తగా తనకు గల తన ప్రకృతిచేత నిర్దిష్టమైన సంసిద్ధిని, దివ్యచేతనను బొందుటకు తనకు మార్గము. బుద్ధి మఱియు సంకల్పము సమస్త సత్తను, తన సర్వ భాగములందును ఈశ్వరుడు, అనగా ఆ సమస్త సత్తయొక్క దివ్యాత్మ మఱియు ప్రభువు దిశగా త్రిప్పవలెను–"బుద్ధియోగం ఉపాశ్రిత్య" (18–57). ఇంకను హృదయము అతనితో ఏకత మఱియు సర్వ ప్రాణులయందును గల అతనిపట్ల ప్రేమవలన గలుగు ఆనందమునందు తన యితర భావావేగము నంతను లీనము గావించవలెను. పోగా ఇంద్రియములు – అధ్యాత్మము చేయబడిన ఇంద్రియములు – సర్వత్ర అతనినే చూడవలెను, వినవలెను, స్పృశింప

వలెను. ప్రాణము సర్వథా జీవునియం దున్న అతని ప్రాణము గావలెను. చివరకు సర్వ క్రియలు అతని ఏకైక శక్తినుండియే, మన సంకల్పము, జ్ఞానము, కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియము, పంచప్రాణములు మఱియు శరీరమునందు పనిచేయు నతని ఏకైక ప్రేరణనుండియే ప్రవర్తించవలెను. ఈ మార్గము లోతుగా నైర్వ్యక్తికము, కారణము, ఇచ్చట విశ్వీకృతమై, విశ్వాతీతత నాశ్రయించిన అంతరాత్మకొఱకు భేదమును కల్పించు అహంకారము రద్దుచేయబడినది. అయినను అది ఘనిష్ఠముగా వైయక్తికము, ఏలన అది ఒక అతీత భావావేగమున కెగసి, అచ్చట అంతర్నివాసము మఱియు ఏకతయందు రాజిల్లును (12-8). ఒక నిర్విశేష నిర్వాణము అహంకార నాశమునకు సంబంధించిన మానసిక తర్కముయొక్క ఒక కఠోరావశ్యత గావచ్చును గాని, అది పరమ రహస్యముయొక్క చరమ వచనము గాదు-"రహస్యం ఉత్తమం" (4-3).

12. <u>దారుణ ఆధ్యాత్మిక ఫలితములు</u> ; తన దైవనియుక్తమైన కర్మయందు అర్జునుడు కొనసాగ నిరాకరించుటకు మూలము అతనిలోపలి అహంభావమే (18-58). సాత్త్విక, రాజసిక, తామసి కాహంకారముయొక్క భావములు మఱియు ప్రేరణలు, పాపము మఱియు దాని వ్యక్తిగత పరిణామములనుండి ప్రాణిక ప్రకృతియొక్క భయము, వైయక్తిక దుఃఖము మఱియు కష్టమునుండి హృదయముయొక్క పరావర్తనము, ధర్మము మఱియు పుణ్యమునకు సంబంధించి ఆత్మవంచక సత్యాభాస కారణములచే తమోవృత బుద్ధి అహంకార ప్రేరణలను కప్పిపుచ్చుట, భగవంతుని కర్మప్రకారములు మానవుని కర్మప్రకారములకంటె భిన్నముగా గన్పించుచు, అతని స్నాయవిక (nervous), భావిక అంగములు మఱియు బుద్ధిపైన దారుణ, అప్రియ వస్తువులను విధించుటచే అతని ప్రకారములనుండి మన ప్రకృతియొక్క అజ్ఞానమయ సంకోచము - వీని అన్నింటియొక్క ఒక సంమిశ్రము, కలవరము మఱియు విషమ భ్రాంతి అర్జునుని నిరాకరణము వెనుక పనిచేసిన వస్తువులు. ఈ నిరాకరణ పరిణామములు పూర్వముకంటెను కోటిరెట్లు దారుణముగా నుండును, ఏలన అతని కిపుడు ఒక అధికతర కర్మప్రకారము మఱియు తత్త్వము ప్రకటింపబడినవి, కనుక తన అహంకారమునందలి పట్టు విడువక, తన నిష్ఫల, అసంభవ నిరాకరణమును పోషింపజూచుచో నే మగును? అది ఒక నిష్ఫల నిశ్చయము మాత్రమే, వ్యర్థ పరావర్తనము మాత్రమే, ఏలన అది ఒక తాత్కాలిక

ప్రబలవైఫల్యమునుండి పుట్టినది, అది అతని అంతరతమ స్వభావముయొక్క శక్తితత్త్వమునుండి ఒక తీవ్ర కాని క్షణిక విచలనమే గాని, అతని ప్రకృతియొక్క యథార్థ సంకల్పము మఱియు ప్రకారము గాదు. ఇపు డొకవేళ అతడు తన ఆయుధములను విసర్జించివేసినను, తాను లేకయే యుద్ధము మఱియు సంహారము సాగుచున్నదని కాంచి నపుడు, తన ప్రకృతిబలాత్కారముచేతనే అతడు తిరిగి వానిని చేపట్టును (18-59), తన యుద్ధవిరమణము తన ఆశయముయొక్క ఒక పరాజయమే ననియు, దేనిని సాధింప నతడు జన్మించెనో అట్టి ధ్యేయము దాని నాయకుని అనుపస్థితి లేక నిష్క్రియతచేత దుర్బలము, అస్తవ్యస్తము నై, స్వార్థపరాయణ అధర్మము మఱియు అన్యాయముయొక్క సమర్థకుల వక్రము, అనీతిపరము నగు బలముచే పరాజితము, పీడితము నగు ననియు చూచి నపుడు, తిరిగి ఆయుధములను చేపట్టితీరును. కాని ఇట్లు తిరిగి చేపట్టుటయందు ఎట్టి ఆధ్యాత్మిక మూల్యము నుండదు. ఏలన అహంకారిక మనస్సుయొక్క భావములు మఱియు భావనల సంక్షోభము అతని నిరాకరణమును ప్రేరించి నటులే, అదే మనస్సుయొక్క స్వాభావిక భావములు మఱియు భావనల పునరుద్ధరణద్వారా పనిచేయుచు, అతని ప్రకృతియే అతని నిరాకరణమును మఱల రద్దుచేయ నతని వివశుని గావించును. కాని ఈ రెండింటిలో నేది యైనను, ఇచ్చటి సంతత అహంకారాధీనత కర్థము ఒక నికృష్టతర, విపత్కర ఆధ్యాత్మికనిరాకరణమే, వినాశమే యగును (18-58); ఏలన నిమ్న ప్రకృతియొక్క అజ్ఞానమునందు అత డె సత్తాసత్యము ననుసరించెనో, దానికంటెను ఒక మహత్తర సత్యమునుండి ఇది యొక నిశ్చిత పతన మగును. ఒక ఉచ్చతర చేతనను, ఒక నూతన ఆత్మసాక్షాత్కారమునకు అతనికి ప్రవేశమీయబడెను, ఆహంకారిక క్రియాస్థానమున ఒక దివ్య క్రియయొక్క సంభవత అతనికి జూపబడెను; కేవలము బౌద్ధికము, భావికము, ఇంద్రియాత్మకము, ప్రాణికము నగు జీవితమునకు బదులు ఒక దివ్య, ఆధ్యాత్మిక జీవితద్వారములు అతనికి తెఱవబడెను. ఇక నొక ప్రబల, అంధ యంత్రముగా నుండక, భగవంతునియొక్క ఒక సచేత నాంతరాత్మగాను, ఒక జ్ఞానదీప్త శక్తి మఱియు పాత్రముగా నుండ నతనికి పిలుపు వచ్చెను.

13. <u>ఆత్మవంతునకే ప్రకృతిప్రభుత</u> : ఏలన మనలోపల ఈ సంభవత గలదు : మన మానవ ఉచ్చతమ స్థితియందు సైతము ఇట్టి పర్యవసానము మఱియు

అతిక్రమణమునకు ద్వారము తెఱచుకొనియున్నది. మానవుని సాధారణ మనస్సు మఱియు ప్రాణము తనలో దాగియున్న ఒకానొక వస్తువుయొక్క ఒక అర్ధ-ప్రబుద్ధము, ప్రాయః ఒక అజ్ఞానమయ వికాసము మఱియు అపూర్ణ అభివ్యక్తియు నైయున్నది. అచ్చట తనకు మఱుగున, తన చేతనకు వెనుక, తన క్రియాకలాపముయొక్క తమోమయ ఆవరణము చాటున నిశ్చేష్టీకృతమగు నొక దేవత గలదు - నిజాని కా క్రియాకలాపము పూర్తిగా తనది గాదు మఱియు దాని రహస్యము నింకను అతడు స్వాయత్తము గావించుకొన లేదు. మానవుడు తనను దా నీ ప్రపంచమున ఒక చింతనాశీల, సంకల్పనాశీల, భావనాశీల, క్రియాశీల వ్యక్తిరూపమున గను గొనును, మఱియు తా నొక చింతనా, సంకల్పనా, భావనా, క్రియా స్వాతంత్ర్యము గల ఒక పృథగ్భూత, స్వతఃసిద్ధ ప్రాణి యని తన సహజజ్ఞానవశమున తలపోయును లేక బుద్ధిజ్ఞానముచేత భావించును లేక కనీస మట్లు తన జీవితమును నిర్వహించును. అతడు తన పాపము, ప్రమాదము మఱియు దుఃఖముయొక్క భారము వహించును, అటులే తన జ్ఞానము మఱియు పుణ్యముయొక్క కర్తృత్వము మఱియు ప్రాశస్త్య మును తన కాపాదించుకొనును; తన సాత్త్విక, రాజసిక లేక తామసిక అహం కారమును తృప్తిపఱచుకొను అధికారము తనకు గల దని భావించును, తన భాగ్య మును తానే నిర్మించుకొనుటకు, తన ఉపయోగార్థము ప్రపంచమును మార్చివేయు టకు తనకు శక్తి గల దని అహంకరించును. ఇదిగో, అతనికి తనను గుఱించి గల ఈ భావముద్వారానే, ప్రకృతి అతనియందు పనిచేయును, కాని ఈ పనిద్వారా తనలోపల గల మహత్తర పురుషుని సంకల్పమునే అనుక్షణము ఆమె పూరించు చుండును. అహందృష్టికి సంబంధించిన మానవుని ఈ భ్రాంతి, తన అధికాంశ భ్రాంతుల వలెనే, ఒకానొక సత్యముయొక్క వక్రీకరణము, ఈ వక్రీకరణము భ్రాంతిమయ మయినను ప్రయోజనాత్మక మూల్యముల ఒక సంపూర్ణ పద్ధతినే సృజించును. ఏది తన అంతఃపురుషుని పట్ల సత్యమో, దాని నతడు తన అహం వ్యక్తిత్వమున కాపాదించును. మఱియు దాని కొక మిథ్యాప్రయోగమును, మిథ్యా రూపమును, అజ్ఞానమయ పరిణామములను గల్పించును. అజ్ఞానము అతని ఉపరితల చేతనయొక్క మౌలిక అపూర్ణతయందు గలదు, ఈ అపూర్ణతచేత నతడు ప్రకృతికి అనుకూల సాధనమగు తనబాహ్యయాంత్రికభాగముతోను, ప్రకృతివ్యాపారములను తనలో ప్రతిబింబింపజేయుచు, తాను వానిలో ప్రతిబింబించు మేరకు అంతరాత్మతోను తాదాత్మ్యము జెందును. అతడు లోపలి మహత్తర అధ్యాత్మసత్తను పసికట్టడు, నిజాని

కీ సత్తయే అతని సమస్త మనస్సు, ప్రాణము, సృష్టి మఱియు క్రియను ఇంకను నెర వేరని ఒక ఆశను, ఒక గుప్త మర్మమును ప్రదానము చేయు వస్తువు. ఇచ్చట నొక విశ్వప్రకృతి జగదీశ్వరుడగు పరమపురుషుని ఆదేశమును పాలించుచు, ప్రతిజీవిని రూపొందించును, దాని స్వభావమును బట్టి దాని కర్మను నిర్ణయించును; అటులే మానవుని సైతము రూపొందించును, మఱియు నతని జాతి ప్రకృతియొక్క సామాన్య ధర్మము, అనగా ప్రాణశరీరములందు ఆబద్ధము, అజ్ఞానగ్రస్తము వగు మనోమయ జీవుని ధర్మమును బట్టి అతని కర్మను నిర్ణయించును, అటులే ప్రతిమానవుని రూపొందించును మఱియు నతని ప్రత్యేక ప్రకారము బట్టియు, అతని స్వీయ మూల స్వభావమునందు వచ్చిన మార్పులను బట్టియు అతని వైయక్తిక క్రియను నిర్ణ యించును. ఈ విశ్వప్రకృతియే శరీరముయొక్క యాంత్రిక వ్యాపారమునకును, ప్రాణిక మఱియు స్నాయవిక (నరముల) క్రియలకును రూపము దిద్ది, నడుపు చుండును; ఈ రెండు స్తరములయందును ఆమెకు మన అధీనత సుస్పష్టమే. మఱియు నిప్పటి దశలో ఏమంత తక్కువ యాంత్రికము గాని మన ఇంద్రియ-మనస్సు, సంకల్పము మఱియు బుద్ధియొక్క క్రియను సైతము ఆమెయే రూపొం దించి, నడుపును. అంతర మిదియే : పశువునందలి మనోవ్యాపారము యంత్రము వలె పూర్తిగా ప్రకృతికి విధేయమై నడువగా, మానవుడు ఒక సచేతన వికాసమునకు మూర్తరూప మగును, ఆ వికాసమునందు అంతరాత్మ ఎక్కువ చుఱుకుగా పాల్గొనును మఱియు నిందువలన తన కొక స్వాతంత్ర్యమును, తన ఉపకరణభూత ప్రకృతిపై నొక ప్రభుతయు గల వను అభిప్రాయము నతని బాహ్య మనస్సునకు గల్గును-ఈ అభిప్రాయ మతనికి ఉపయుక్తము, అపరిహార్యము నగును గాని, ప్రాయః పెడదారి బట్టించు నది గూడ నగును. కారణము, అది తన బంధనయొక్క కఠోర సత్యము పట్ల అతనిని గ్రుడ్డి వానిని గావించును మఱియు స్వాతంత్ర్యముయొక్క ఈ మిథ్యాభావము ఒక వాస్తవ స్వేచ్ఛను, ప్రభుతను గనుగొనుటయం దడ్డుపడును: మానవుడు తన లోపలి దేవత్వమును గుర్తించి, అహంకారము కంటెను అన్యమగు తన స్వీయ వాస్తవాత్మను, వాస్తవ సత్తను సచేతనముగా బొంద నంతవఱకు-"ఆత్మవాన్" (2-45)-తన ప్రకృతిపై నతని స్వేచ్ఛాప్రభుతలు ప్రాయః వాస్తవము సైతము గా వనిన, అవి సంపూర్ణము గాజాల వని చెప్పనేల ? మనః ప్రాణ శరీరములం దా దేవత్వమునే ప్రకృతి వ్యక్తముచేయ ప్రయాసపడుచున్నది; ఆ దేవత్వమే మన లోపలి అంతరాత్మ గమ్యమును, పరిణామమును రూపొందించు

చున్నది; ఆ దేవత్వమే ఈయా సత్తాధర్మమును, కర్మ ధర్మమును - "స్వభావమును" (18-47) - ఆమెపై విధించుచున్నది. కావున అతడు వాస్తవముగా నాత్మవంతుడైనపుడే, అతని ప్రకృతి భగవంతునియొక్క ఒక సచేతన కరణము మఱియు ప్రకాశమయ శక్తి గాగలదు.

14. సర్వోన్నత ధర్మము, మహత్తమ యోగము : కారణము, మన సత్తయొక్క ఆంతరతమ ఆత్మలోనికి మనము ప్రవేశించినపుడు, మనలోను, సర్వములోను ఒకే ఆత్మ మఱియు భగవంతుడు గలడని తెలియవచ్చును, అతనినే సర్వ ప్రకృతి సేవించును మఱియు వ్యక్తము జేయును; కాగా మనము స్వయముగా ఈ ఆత్మయొక్క ఒక ఆత్మయు, ఈ పురుషునియొక్క ఒక పురుషుడము, మన శరీరము అతని ప్రతినిధిభూత ఆకారము, మన జీవనము అతని జీవనలయయొక్క ఒక గమనము, మన మనస్సు అతని చేతనయొక్క ఒక కోశము, మన ఇంద్రియములు అతని కరణములు, మన భావములు మఱియు సంవేదనలు అతని సత్తానందముయొక్క అన్వేషణలు, మన కర్మలు అతని ప్రయోజనమునకు ఒక సాధనము, మన మజ్ఞానమునం దున్నపుడు మన స్వాతంత్ర్యము అతని అమర స్వాతంత్ర్యముయొక్క ఒక ఛాయ, సూచన లేక మెఱపు, కాని మన మతనిని, మనలను ఎఱింగినపుడు, అది దానియొక్క ఒక దీర్ఘీకరణము మఱియు కార్య సాధక వాహిని యగును. మన ప్రభుతలు అతని కర్మగత శక్తియొక్క ఒక ప్రతిబింబము, మన శ్రేష్ఠ జ్ఞానము అతని జ్ఞానముయొక్క ఒక ఆంశిక ప్రకాశము, మన ఆత్మయొక్క సర్వోన్నత, అత్యంత ప్రభావోపేత సంకల్పము జగదీశ్వరుడు, జగదాత్మయు నగు ఈ సర్వభూతస్థ ఆత్మయొక్క ఒక ప్రక్షేపము మఱియు ప్రతినిధి. ప్రతిప్రాణి హృదయమునందును ఆసీనుడై యున్న ఈ అధీశ్వరుడు మన సమస్త బాహ్యాభ్యంతర క్రియయందును మనలను నిమ్న ప్రకృతియొక్క మాయాచక్రమునందు, రంగుల రాట్నము నందువలె, త్రిప్పుచుండును (18-61). మఱియు అజ్ఞానమున తెలియక కాని, జ్ఞానమున తెలిసి కాని, మనయందును, ప్రపంచమునందును అవస్థితుడై యున్న అతని నిమిత్తమే మనము జీవించుచున్నాము. సచేతనముగను, సమగ్రముగను ఈ జ్ఞానమునందును, సత్యమునందును నివసించుట యన అహంకారమునుండి తప్పించుకొని, మాయావరణమును భేదించి, నిర్గమించుటయే యగును. ఏతదితర ఉచ్చతమ ధర్మము లన్నియు ఈ దివ్యధర్మమునకు ఒక సన్నాహము

[illegible] (18-66), అటుపై సర్వ యోగము ఒక సాధనము మాత్రమే; దానిచేత మన వ్యక్తియొక్క పరమేశ్వరుడు, పరమ పురుషుడు, పరమాత్మునితో మొదట ఒక ఏకత్వపు సంయోగమునకు, పిదపకు సంపూర్ణ ప్రకాశము ప్రాప్తించి నపుడు, ఒక సమగ్ర సాయుజ్యమునకు వచ్చిచేరును. మహత్తమ యోగ మన, మన ప్రకృతి యొక్క సమస్త సమ్మోహనములు మఱియు కఠినతలనుండి విడివడుటకుగాను, సమస్త విశ్వప్రకృతియొక్క ఈ ప్రభువును శరణు బొందుటయే, మన సమస్త సత్తతో అతని కభిముఖ మగుటయే – ప్రాణశరీరములతోను, ఇంద్రియమనోబుద్ధి హృదయములతోను, సంపూర్ణముగా తదర్పితమగు మన జ్ఞాన సంకల్పక్రియల తోను – "సర్వభావేన" (18-62) – మఱియు మన సచేత నాత్మయొక్కయు, అచేతనమైన ప్రకృతియొక్కయు సర్వప్రకారములందును అతని కభిముఖ మగుటయే. మఱియు సర్వవేళలయందును, సంపూర్ణముగను ఇట్లు చేయగలిగి నపుడు, దివ్య జ్యోతియు, ప్రేమయు, శక్తియు మనల నావహించి, ఆత్మ మఱియు నుప కరణములు – రెంటింటిని పూరించి, మన అంతరాత్మను, జీవనమును ఆవరించు కొనియుండు సందేహములు మఱియు కష్టములు, సంభ్రమములు మఱియు అపా యముల నడుమనుండి సురక్షితముగా నడుపుచు, ఒక పరమ శాంతికిని, మన అమర మఱియు శాశ్వత స్థానమునకును గొనిపోవును–"పరాం శాంతిం, స్థానం శాశ్వతం" (18-62).

15. <u>అంతిమ మహావాక్యము</u> : ఏలన ఇతఃపూర్వము గుహ్యమగు సత్యములను (2-47,....) ఆధ్యాత్మిక జ్ఞానముయొక్క రూపాంతరకారి ప్రకాశమున మానవ మానసమునకు ఆవిష్కరించి, ఇది (18-53,....62) ఒక గుహ్యతర సత్య మని ఇక్కడ ప్రతిపాదించి, గీత ఇపుడు అకస్మాత్తుగా ఇంకను తాను ప్రవ చింపవలసిన ఒక 'పరమ వచనము' (18-64) గల దనియు, 'సర్వగుహ్యతమ' (18-64) సత్యము గల దనియు ఉద్ఘాటించును. ఈ రహస్యాతిరహస్యమును అతని పరమ హితముగా అర్జునునకు దివ్యగురు వనుగ్రహించును; ఏలన అర్జునుడు తనకు 'ఇష్టము', ప్రియము నగు నొక విశిష్టాత్మ (18-64). మఱియు ఉపనిషత్తు (కఠ ఉప. 2-23) పూర్వమే ప్రవచించి యున్నట్లు, పరమాత్మ తన స్వరూపము యొక్క – "తనుం స్వాం" – ప్రకటనకు వరించియున్న అట్టి విరళ విశిష్ట ఆత్మయే ఈ గుహ్యతమ దీక్ష కర్హ మగును; కారణము, అతడే తన సమస్త

సత్తయందును తనలోని పరమాత్మకు యథార్థముగా ప్రతిస్పందించుటకును, అతనిని సజీవానుభవము గావించుకొనుటకును తన హృదయ మనో ప్రాణములందు అతనికి తగినంత సన్నిహితముగా నుండును. సర్వోన్నత గుహ్యమును ప్రకటించు నట్టి గీతయొక్క చరమ సమాపక పరమ వచనము రెండు సంక్షిప్త సుస్పష్ట సరళ శ్లోకములందు వచింపబడును మఱియు నివి ఇక నెట్టి వ్యాఖ్య గాని, విస్తరణ గాని లేక, మనసులోనికి ఇంకి, అంతరాత్మ అనుభవమునందు తమ సంపూర్ణార్థమును స్వయముగా ఆవిష్కరించు నిమిత్తము యథాతథముగా విడిచివేయబడును. ఏలన ఈ శ్లోకశబ్దములు స్వయముగా పైకి ఎంత స్వల్ప, సరళముగా గన్పించినను, అవి అనంత అర్థగౌరవముతో గర్భితమై యున్నవి, మఱియు నా అనంతార్థమును సంతతము విస్తరించు అంతరనుభవము మాత్రమే వ్యక్తము చేయగలదు. మఱియు నీ శబ్దము లుచ్చరించబడు నపుడు, శిష్యుని అంతరాత్మ వీనికొఱకే అనుక్షణము ఆయత్తముచేయబడుచు వచ్చిన దనియు, తక్కిన దంతయు ఒక జ్ఞానోద్భాసక, శక్తిప్రదాయక శిక్షణ మఱియు సిద్ధాంతము మాత్రమే యనియు మన కనిపించును. ఈ రహస్యాతిరహస్యము, ఈశ్వరునియొక్క ఈ పరమ సరళతమ సందేశము ఇట్లు నడుచును – "నాయందు మనసును గీలించినవాడవు గమ్మ, నాయం దను రక్తుడవు, భక్తుడవు గమ్మ, నాకు యజ్ఞము చేయువాడవు గమ్మ, నాకు నమస్కరింపుము; (అపుడు) నీవు తప్పక నన్ను బొందెదవు; నీవు నా ప్రియుడవు గనుక, నేను నీ కిట్టి ప్రతిజ్ఞావాగ్దానములను జేయుచున్నాను (18–65). సర్వధర్మములను పరిత్యజించి, నాయందే శరణు బొందుము. సర్వపాపము మఱియు నశుభమునుండి నిన్ను ముక్తుని చేసెదను, శోకింపకుము (18–66)."

16. <u>ధర్మములనుండి ధర్మాతీతతత్వనకు</u> : మహత్తరము, సునిర్మితము నగు ఒక యోగవిధానము (3–19,....), అటులే విశాలము, సునిర్దిష్టము నగు నొక దార్శనిక మతము; మఱియు స్వభావము (8–3, 18–42), అటులే స్వధర్మము (3–35); ఇంకను జీవనమునకు సంబంధించిన సాత్త్విక ధర్మము తననుదాను అతిక్రమించుచు పై కెగయుటద్వారా ఏది సర్వథా విశాలము మఱియు సాత్త్వికగుణమునకు సైతము ఎంతో పైన భాసించునో, అట్టి అజరామర అస్తిత్వము యొక్క ఒక విముక్త ఆధ్యాత్మిక ధర్మములోనికి గొనిపోవు సాత్త్విక ధర్మము; అటులే పరిపూర్ణతాప్రాప్తికి ఆవశ్యకమగు అనేకానేక నియమములు, ఉపాయములు,

పరిమిత మరియు నిబంధనలు - వీని నన్నింటిని సర్వత్ర గీత ప్రతిపాదించుచు వచ్చి, ఇప్పుడు ఆట్టి తన స్వీయ నిర్మాణమునే ఛేదించి, వెలువడి, మానవాత్మ నిట్లు ఉన్మోచింపబడినట్లు గమ్పించును, "సర్వధర్మములను పరిత్యజించుము, భగవంతునికి మాత్రమే, నీపైనను, చుట్టును, లోపలను గల పరమపురుషునకు మాత్రమే నన్నే నీ వర్పించుకొనుము (18-66) - అదియే నీకు కావలసిన ఏంతయు, అదియే సత్యతమ, మహత్తమ మార్గము, అదియే వాస్తవ విమోచనము..." దివ్య సారథి మరియు కురుక్షేత్ర ఉపదేష్ట రూపమున జగదీశ్వరుడు, భగవంతుడు, ఆత్మయు నగు పరమపురుషునికి సంబంధించిన మహాసత్యములను, జటిల ప్రపంచము యొక్క స్వభావమును, అంతఃపురుషునితో మానవుని మనః ప్రాణ హృదయేంద్రియముల సంబంధమును (7-5) ఆవిష్కరించియున్నాడు; అటులే తన స్వీయ ఆధ్యాత్మిక స్వయంశిక్షణ మరియు ప్రయత్నముద్వారా ఏ విజయశీల సాధనములు నవలంబించి, మానవుడు తన మర్త్యత్వమునుండి అమరత్వములోనికిని, తన పరిమిత మానసిక జీవనమునుండి తన అనంత ఆధ్యాత్మిక జీవనములోనికిని ఎగయ గలడో ఆ సాధనములను తెలిపియున్నాడు. ఇక నిప్పుడు మానవునియందును, సర్వవస్తువులయందును నిలిచియుండు అంతఃపురుషుడు మరియు భగవంతుని రూపమున ఆ జగదీశ్వరుడే ఇట్లు పలుకును, "ఈ వైయక్తిక ప్రయత్నము మరియు స్వయంశిక్షణ - ఇది యంతయు చివరి దశలో నీ కావశ్యకము గాదు; నీవు నాకు సంపూర్ణ సమర్పణ చేసికొనగలుగుదు వేని, నీలోపలను, సర్వవస్తువుల లోపలను గల పరమపురుషుడు మరియు భగవంతుని యందు మాత్రమే ఆధారపడి, కేవల వానిని మార్గదర్శనమందే నమ్మిక ముంతు వేని, నియమము ధర్మముల ననుసరించుట, అవి కల్పించు పరిమితత్వము - దీని నంతను ఒక ప్రతిబంధక భారముగా దలంచి నీవు త్రోసివేయ గలుగుదువు. (కనుక) నీ మనస్సు నంతను నా కభిముఖము గావించి, దానిని నాయొక్కయు, నా సన్నిధియొక్కయు చింతనతో నింపివేయుము. నీ హృదయము నంతను నా కభిముఖము గావించి, నీ ప్రతి కర్మను నాకు చేయబడు ఒక యజ్ఞము, ఒక నైవేద్యముగా నొనరింపుము. అట్లొనరించి, నీ అంతరాత్మను, ప్రాణమును, క్రియను నా ఇచ్చానుసారము నడువ నాకు వదలివేయుము; నీ మనోహృదయములతోను, జీవనకర్మలతోను నేను వ్యవహరించు తీరును జూచి, నీవు దుఃఖించకుము లేదా తికమకపడకుము, అథవా ఆ తీరు తన పరిమిత సంకల్పము మరియు మేధను నడుపుటకు మానవుడు తనపై విధించుకొనిన

నియమములు మఱియు ధర్మములను అనుసరించకపోవుటచే వ్యథచెందకుము (18-66). నా కార్యవిధానములు పరిపూర్ణ ప్రజ్ఞాశక్తిప్రేమలతో గూడిన విధానములు; అవి అన్ని విషయముల నెఱింగి, ఒక సర్వాంగపూర్ణ చరమ ఫలితము నుద్దేశించి, వాని వాని గతులను తదనుకూలముగా మేళవించును; ఏలన ఆ ఫలితము ఒక సమగ్ర సిద్ధియొక్క అనేకానేక సూత్రములను శోధించి, అల్లుటయే యగును. లోపలను, వెలుపలను నున్న జగదీశ్వరునిగా నన్ను ప్రకటించుకొని, నే నిచ్చట నీతో నీ యుద్ధరథమున నున్నాను మఱియు సర్వ దుఃఖము మఱియు అశుభముద్వారానే, వాని కావల భాసించు నాకడకే నిన్ను నడుపుకొనిపోవుదును—అను నిర్ద్వంద్వ ఆశ్వాసనము (హామీని) అమోఘ ప్రతిజ్ఞను మఱియొక సారి చేయుచున్నాను. ఎట్టి కష్టములు మఱియు కలవరములు ఉప్పతిల్లినను, విశ్వసత్తయందు ఒక సంపూర్ణ దివ్య జీవనమునకును, విశ్వాతీత సత్తయందు ఒక అజరామర అస్తిత్వమునకును నేను నిన్ను నడుపుచున్నా నని నిశ్చయముతో నుండుము."

17. ఆధ్యాత్మిక పురుషుడు 'గుహ్యము': సమస్త గంభీర ఆధ్యాత్మిక జ్ఞానము మన కొక 'గుహ్యమును' ఆవిష్కరించును; అదియే వివిధ బోధనల యందు ప్రతిబింబించుచు, అంతరాత్మ అనుభవమునందు ప్రామాణ్యమును బొందును. కాగా గీతాశాస్త్రమున కీ గుహ్యము మనలో నేది దాగియున్నదో, మనస్సు మఱియు బాహ్య ప్రకృతి దేనియొక్క అభివ్యక్తులు లేక ఆకారములో, అట్టి ఆధ్యాత్మిక పురుష దగును. గీతాగుహ్యము పురుషప్రకృతుల మధ్య గల నిత్యసంబంధరూప రహస్యము; ఎవడు సర్వసృష్టి కధీశ్వరుడో, ఎవడు దాని రూపములందును, గతులందును ఆవృతుడై యుండునో, అట్టి అంతఃస్థ భగవద్రూపమగు రహస్యము. ఈ పురుషాదులు వేదాంత, సాంఖ్య, యోగములచే అనేక విధముల బోధింపబడి, గీత యొక్క పూర్వాధ్యాయములందు సమన్వయీకృతములగు సత్యములు - వానిలో పైకి ఎన్ని విభేదములు గన్పించినను, అవి అన్నియు ఒకే సత్యము మఱియు యోగ విధానము లన్నియు ఆధ్యాత్మిక స్వయంసాధనయొక్క వివిధ సాధనములు (means)- వీనిచేత చంచల మానసము, అంధప్రాణము నిశ్చలము చేయబడి, బహుముఖమగు ఏకసత్యమునకు అభిముఖము చేయబడును; అపుడు ఆత్మ మఱియు భగవద్రూపమగు రహస్య సత్యము మనకు తగినంత వాస్తవము మఱియు సన్నిహితము కాగా, ఇక నేమాత్రము మానసిక అజ్ఞానముచేత బలాత్కరింపబడక, ఆ సత్యమునందు మనము

సచేతనముగా నివసింతుము, అథవా సనాతనునియందు మన పృథగాత్మలను కోల్పోదుము.

18. పురుషప్రపంచముల సమన్వయము 'గుహ్యతరము' : పై గుహ్యము కంటెను రహస్యమగు 'గుహ్యతరమును' గీత ఆవిష్కరించును; ఇది దివ్య పురుషోత్తముని యొక్క గంభీర సమన్వయసాధక సత్యము, ఇది పురుషోత్తముడు ఏకకాలమున ఆత్మయు, పురుషుడు నని చెప్పును, అనగా పరబ్రహ్మయు, ఏకమాత్ర సన్నిహిత రహస్యమయ, అనిర్వచనీయ భగవంతుడు నని చెప్పును. ఈ సత్యము అంతిమ జ్ఞానమునిమిత్తము బుద్ధికి విశాలతరము, ఎక్కువ లోతుగా అవగాహనాత్మకము నగు ఒక పునాది నేర్పఱచును, మఱియు ఆధ్యాత్మికానుభవమునకు అధికతరము, ఎక్కువ పూర్ణముగా సమన్వయకరము మఱియు సమగ్రము నగు నొక యోగము నిచ్చును. ఈ గుహ్యతరము ఆధ్యాత్మిక పరప్రకృతి (7-5) మఱియు జీవుని పైన (15-7) ఆధారపడి యుండును — ఈ జీవుడు ఆ సనాతన ప్రకృతియందును, ఈ అభివ్యక్త ప్రకృతియందును భగవంతునియొక్క ఒక అంశ (15-7) మగుచునే, భగవంతుని స్వయంభూ సత్తయందు అతనితో ఏకాత్మకము, ఏకమూలము నగును. ఈ గభీరతర జ్ఞానము పరమునకు, ఇహమునకు మధ్య ఆధ్యాత్మికానుభవము ప్రారంభములో చూచు ప్రాథమిక విభేదమున కందదు. ఏలన లోకముల కావల నున్న అతీతుడు (15-18) అదే సమయమున సర్వలోకములందలి సర్వవస్తువులు నగు వాసుదేవుడు గూడను (7-19); అతడు ప్రతిప్రాణి హృదయము నందు నిలిచియున్న ఈశ్వరుడు (18-61) మఱియు సర్వభూతముల ఆత్మ (10-20) మఱియు తన ప్రకృతియందు తాను వెలువరించిన ప్రతివస్తువుయొక్క మూలమును, దివ్యార్థమును అతడు తన విభూతులయందు అభివ్యక్తమై యుండును, అతడే కాలపురుషుడై జగత్కార్యమును నిర్బంధముగా జేయించును, అతడే సర్వజ్ఞానమునకు సూర్యుడు, అతడే అంతరాత్మయొక్క ప్రేమికుడు మఱియు ప్రియతముడు, అతడే సర్వ కర్మలు మఱియు యజ్ఞముల అధీశ్వరుడు (5-29). ఈ గభీరత, సత్యతర, గుహ్యతర రహస్యమునకు, చేయు అంతరతమ ఉన్మీలనముయొక్క ఫలితమే సమగ్ర జ్ఞానము, సమగ్ర కర్మ మఱియు సమగ్ర భక్తియొక్క గీతాయోగము. ఈ యోగము ఏకకాలమున ఆధ్యాత్మిక విశ్వమయతయొక్కయు, ఒక విముక్త, పరిపూర్ణిత ఆధ్యాత్మికవ్యక్తిత్వముయొక్కయు సమగ్రానుభవము, భగవంతునితో

సంపూర్ణసాయుజ్యముయొక్క సమగ్రానుభవము, చివరకు అంతరాత్మ అమరత్వము యొక్క ఆధారము (12-8), అటులే ప్రపంచము మరియు శరీరమునందు మన విముక్తి కర్మయొక్క ఆశ్రయము మరియు శక్తియగు భగవంతునియందు ఒక సంపూర్ణ నివాసము (6-31).

19. పరముని ధర్మాతీతత్వము 'గుహ్యతమము' : ఇక నిప్పుడు సర్వోత్తమ రహస్యము-"గుహ్యతమము" (18-64)-వచ్చును. అది యేమన, ఆత్మ మరియు భగవంతుడు సర్వధర్మమునుండి ముక్తము, స్వతంత్రము నగు ఒక అనంతము. అతడు ప్రపంచమును కొన్ని స్థిర నియమముల ననుసరించి నిర్వహించుచున్నను, మరియు నతడు మానవుని తన జ్ఞానాజ్ఞానములు, పుణ్యాపాపములు, యుక్తాయుక్త ములు, రాగద్వేషఉదాసీనతలు, సుఖదుఃఖముల ద్వారాను మరియు ఈ ద్వంద్వముల నిరాకరణమునకు సంబంధించిన ధర్మములద్వారాను నడుపుచున్నను, అటులే తన శారీరిక మరియు ప్రాణిక, బౌద్ధిక, భావిక, నైతిక మరియు ఆధ్యాత్మిక రూపములు నియమములు మరియు ప్రమాణములను బట్టి ముందుకు గొనిపోవుచున్నను, అతడు (భగవంతుడు) వీని కన్నింటికి పైన నుండును. కావున మనము సైతము ధర్మము లపై నాధారపడుటకు స్వస్తిచెప్పి, ఈ విముక్త మరియు సనాతన పరమాత్మకు ఆత్మసమర్పణము చేసికొనగలుగుదు మేని మరియు, అతనికి పూర్ణముగను, కేవలము గను ఉన్మీలితులమై యుండుటకు మాత్రమే జాగ్రత్త వహించుచు, మనలోని భగవంతునియొక్క జ్యోతి, శక్తి, ఆనందములయందు నమ్మక ముంచగలుగుదు మేని, ఇంకను భయపడక, శోకించక, అతని మార్గదర్శనమును మాత్రమే స్వీకరించ గలుగుదు మేని, అప్పుడు అది సత్యతమ, మహత్తమ ముక్తి యగును మరియు నది మన సత్త మరియు ప్రకృతియొక్క పరమ, అనివార్య సంసిద్ధిని గొనివచ్చును. ఇది భగవానునియొక్క, ఎన్నుకొనబడిన పుత్రులకు చూపబడిన పథము - ఎవరు ఆయనకు మిక్కిలి అంతరంగికులో, మరియు, ప్రకృతియొక్క ఉచ్చతమ శక్తి మరియు క్రియయందు ప్రకృతికి స్వచ్ఛందముగా తమ సమ్మతి నిచ్చుచు, ఆమెతో సుసంగతులై యుండుచు, ఆయనతో ఏకతాలాభమునకే గాక, ఆయన వలెనే అంత రాత్మ చేతనయందు విశ్వమయముగను, ఆత్మచేతనయందు విశ్వాతీతముగను ఉండు టకు మిక్కిలి సమర్థులో, కావుననే ఎవరియందు ఆయన అత్యంత ప్రీతుడో, అదిగో, అట్టివారికి చూపబడిన పథము.

20. యోగేశ్వరుడే మన యోగము చేయును : ఏలన మన ఆధ్యాత్మిక వికాసమున ఒక సమయము వచ్చును, అపుడు మన ప్రయత్నము మఱియు కర్మ యంతయు మన లోపలను, చుట్టును గల ఒక అధికతర భగవత్సన్నిధియొక్క నీరవ మఱియు గుప్త నిర్బంధమునకు మన మానసిక మఱియు ప్రాణిక ప్రతి క్రియలు మాత్రమే యని మనకు దెలియవచ్చును. మన యోగ మంతయు, ఆకాంక్ష యంతయు, ప్రయాస మంతయు పై నిర్బంధముయొక్క అపూర్ణ లేక సంకుచిత రూపములు; కారణము, మనసుయొక్క సంస్కారములచేతను, కోరికలచేతను, పూర్వనిర్ణయములచేతను, పక్షపాతములచేతను, విశాలతర సత్యమునకు అది చేయు అపానువాదములు లేక అర్థానువాదములచేతను అవి వికృతములు లేక కనీసము పరిమితము లగును – అని మనకు గట్టి నిశ్చయ మేర్పడును. మన భావములు, అనుభవములు మఱియు ప్రయత్నములు కొన్ని మహత్తమ వస్తువులయొక్క మానసిక ప్రతిబింబములు మాత్రమే – ఒక పరమ మఱియు చరమ బలము మఱియు ప్రజ్ఞయొక్క హస్తములలో మనలను మనము ఉపకరణరూపమున నిష్క్రియముగా నర్పించుకొందు మేని, ఈ మహత్తమ వస్తువులు మనలోని ఆ భగవత్సన్నిధి రూప శక్తిచేతనే ఎక్కువ పూర్ణముగా, ప్రత్యక్షముగా, స్వేచ్ఛగా, విశాలముగా, విశ్వగత మఱియు సనాతన సంకల్పముతో ఎక్కువ సామరస్యయుక్తముగా చేయ బడును. కాగా ఆ శక్తియు మనకంటె వేఱు గాదు; అది ఇతరు లందరి ఆత్మతోను ఏకమగు మన స్వీయ ఆత్మయే మఱియు నదే సమయమున అది అతీత పరమాత్మయు, అంతర్యామి పురుషుడు నగును. మన సత్తయు, కర్మయు ఈ మహత్తమ సత్తలోనికి స్వీకరించబడి నపుడు, ఇపుడు మనకు గన్పించు నట్లు, మనసు గల్పించు పార్థక్యమున ఇకముందు అవి కేవలము మనవియే నని తోచవు. అపుడు మన కర్మ ఒక అనంతతయొక్కయు, ఒక అంతరంగ, అనిర్వచనీయ సన్నిధి యొక్కయు విశాల వ్యాపారముగా నుండును; అది ఈ గంభీర విశ్వాత్మయొక్కయు, ఈ అతీత పరమాత్మయొక్కయు మనయందు జరుగు ఒక సంతత, స్వయంప్రవర్తి నిర్మాణము మఱియు ప్రకటనముగా నుండును. ఈ ప్రకటనము పూర్ణరూపమున జరుగు నిమిత్తము, మన సమర్పణలో మినహాయింపు లుండరా దని గీత సూచించును (18–62,65); మన యోగము, మన జీవనము, మన అంతఃసత్తయొక్క అవస్థ ఈ ధర్మముపట్లనో, ఆ ధర్మముపట్లనో, ఏ ధర్మము పట్లనో మన మనస్సునకు గల పట్టుచేతను గాక, ఈ సజీవ అనంతునిచేతచే స్వేచ్ఛగా నిర్ణయింప

బడవలెను. అప్పుడు దివ్య యోగేశ్వరుడు – "యోగేశ్వరః కృష్ణః" (18–78) – స్వయముగా మన యోగమును తాను చేపట్టి, మన అత్యంత సంభవ సంసిద్ధికి మనలను లేవనెత్తును – ఇది బాహ్య లేక మానసిక ప్రమాణము లేక పరిమితికర నియమము నాశ్రయించిన సిద్ధి గాక, మనస్సు తర్కించజాలని ఒక విశాల, సమగ్ర సంసిద్ధి యగును. అది సర్వదర్శియగు దివ్యప్రజ్ఞచేత పెంపొందించబడిన సంసిద్ధి యగును; ఈ ప్రజ్ఞ ముందు నిక్కముగా మన మానవ స్వభావముయొక్క సమగ్ర సత్యము ననుసరించియు, కాని తర్వాత అది దేనిలోనికి ఉన్మీలిత మగునో, అట్టి ఒక అధికతర వస్తువుయొక్క సమగ్ర సత్యము ననుసరించియు సంసిద్ధిని బెంపొందించును – ఈ అధికతర వస్తువు ఒక అపరిమేయ, అవినాశి, విముక్త మఱియు సర్వపరివర్తన సాధక సత్తా మఱియు శక్తి, ఒక దివ్య మఱియు అనంత ప్రకృతియొక్క ప్రకాశము మఱియు ప్రభావైభవము.

21. "సర్వధర్మాన్ పరిత్యజ్య" : సర్వము ఆ పరివర్తనద్రవ్యముగా సమర్పించబడవలెను. అప్పుడు ఒక సర్వజ్ఞ చేతన మన జ్ఞానాజ్ఞానములను, మన సత్యానృతములను చేపట్టి, వాని అపూర్ణతారూపములను పరిత్యజించి – "సర్వధర్మాన్ పరిత్యజ్య" (18–66) – సర్వమును తన అనంత ప్రకాశములోనికి రూపాంతర మొందించును. అటులే ఒక సర్వసమర్థ దివ్యశక్తి మన పుణ్యాపాపములను, మన న్యాయాన్యాయములను చేపట్టి, వాని జటిల రూపములను పరిత్యజించి – "సర్వధర్మాన్ పరిత్యజ్య" – సర్వమును తన అతీత శుద్ధతలోనికిని, విశ్వజనీన హితము లోనికిని, అమోఘ శక్తిలోనికి రూపాంతర మొందించును. మఱియు నొక అనిర్వచనీయ ఆనందము మన క్షుద్ర హర్షశోకములను, ప్రయాసమయ సుఖదుఃఖములను చేపట్టి, వాని విరోధవైషమ్యములను, వాని అపూర్ణ క్రమములను పరిత్యజించి – "సర్వధర్మాన్ పరిత్యజ్య" – సర్వమును తన విశ్వాతీత, విశ్వగత, అనూహ్య ఆహ్లాదములోనికి రూపాంతర మొందించును. అన్ని యోగములు చేయగలిగిన దంతయు చేయబడును, అధికము గూడ చేయబడును; కాని ఏ మానవ గురువు, సాధువు లేక జ్ఞాని మన కివ్వగలిగిన దానికంటె నొక అధికతర దృష్టితో గూడిన విధముగాను, ఒక అధికతర ప్రజ్ఞ మఱియు సత్యముతోను అది చేయబడును. ఈ పరమ యోగము మన నే ఆంతర, ఆధ్యాత్మిక స్థితికి గొనిపోవునో, అది యిచ్చటి సమస్తముకంటెను పైనుండును, అయినను అది ఈ మఱియు నితర

లోకములందు గల సర్వ వస్తువులను తనలో నిముడ్చుకొనును, కాని వాని పరిమితత్వము గాని, బంధనము గాని లేక - "సర్వధర్మాన్ పరిత్యజ్య" - అన్నింటిని ఆధ్యాత్మికముగా రూపాంతర మొందించి యిముడ్చుకొనును. భగవంతుని యొక్క అనంత సత్త, చేతన మఱియు ఆనందము తన ప్రశాంత నీరవతయందును, ప్రకాశమయ, నిస్సీమ వ్యాపారమునందును ఆ స్థితియందు నిలిచియుంటయే గాక, దాని సారభూత, ప్రాథమిక, విశ్వగత పదార్థము (stuff), ఆకృతి మఱియు స్వభావమే యగును. ఇట్లు అనంతతయొక్క అట్టి ఆకృతియందు వ్యక్తము చేయబడిన భగవంతుడు పూర్వమువలె యోగమాయాసమావృతుడు (7-25) గాక, ప్రత్యక్షముగా నివసించును, మఱియు నెప్పుడెప్పుడు, ఎటులెటుల తాను సంకల్పించునో, అటులే మనయందు అనంతునియొక్క ఆకారములను, మఱియు తన స్వయంసాధక సంకల్పము మఱియు అమర ఆనందము ననుసరించి జ్ఞానము, చింతన, ప్రేమ, ఆధ్యాత్మిక హర్షము, శక్తి మఱియు క్రియయొక్క వినిర్మల రూపములను నిర్మించును. అయినను విముక్త జీవుడు మఱియు అవికృత ప్రకృతిపై నెట్టి బంధనకారక ప్రభావము నుండదు; ఈ యా నిమ్నతర ధర్మములోనికి తప్పించు కొనలేని విధముగా నెట్టి ఘనీభవించుటయు జరుగదు. ఏలన సర్వ కర్మయు నొక దివ్యస్వేచ్ఛయందు - "సర్వధర్మాన్ పరిత్యజ్య" - దివ్యసత్తయొక్క శక్తిచే నిర్వహించబడును. పరమాత్మయందు - "పరంధామ" (10-12) - ఒక అచ్యుత నివాసము ఈ ఆధ్యాత్మిక స్థితియొక్క ఆధారమును, హామీయు నగును. విశ్వ పురుషునితోను, సర్వప్రాణులతోను ఒక అంతరంగ బోధపూర్ణ ఏకత - ఇది భేదకారి మనస్సుయొక్క అశుభ, దుఃఖములనుండి విముక్తము, కాని యథార్థ విభేదములను వివేకముతో నిరీక్షించును - ఆధ్యాత్మిక స్థితియొక్క నియామక శక్తి యగును. ఇంకను భగవంతునితోను, అతని సమస్త సృష్టితోను ఇచ్చట సనాతన జీవుని యొక్క (15-7) ఏకత మఱియు సామరస్యము మఱియు ఆనందము ఈ సమగ్ర విముక్తియొక్క భవ్య ఫల మగును. మన మానవ జీవితమును వేధించు అసాధ్య సమస్యలు - అర్జునుని సమస్య వీని కొక తీవ్రదృష్టాంతము - అజ్ఞానమునందలి మన పృథక్కర వ్యక్తిత్వముచేత కల్పితములే. ఈ యోగము మాన వాత్మను భగవంతునితోను: ప్రపంచగతితోను సరియగు సంబంధమున స్థాపించును మఱియు మన కర్మను భగవంతుని కర్మచేయును, ఆ కర్మను రూపొందించు జ్ఞానమును, సాధించు సంకల్పమును భగవంతుని జ్ఞానసంకల్పములు గావించును, అటులే

మన జీవనమును భగవంతుని ఒక స్వయమభివ్యక్తియొక్క సామరస్యవిలాసము గావించును గావున, ఈ యోగము కల్పిత మానవ సమస్యల అశేష అంతర్ధానము నకు రాజమార్గ మగును.

22. మోహనాశము, స్మృతిలాభము : సమస్త యోగము ప్రకటింపబడినది, గీతా మహావాక్యము ప్రోక్తమైనది, మఱియు భగవంతునిచేత ఎన్నుకొనబడిన మానవాత్మ, అర్జునుడు మరియొక సారి, ఇపుడిక తన అహంకారిక మనస్సునందు గాక, ఈ మహత్తమ ఆత్మజ్ఞానమునందు, దివ్యకర్మకు అభిముఖుడైనాడు. విభూతియగు నర్జునుడు మానవ జీవితమున దివ్యజీవనమునకు సిద్ధముగా నున్నాడు, అతని సచేతన ఆత్మ ముక్త జీవునియొక్క కర్మకు - "ముక్తస్య కర్మ" (4-23) - సిద్ధముగా నున్నది. మనస్సుయొక్క మోహము నష్టమైనది (18-73); మన జీవితముయొక్క భ్రాంతిజనక ఆడంబరములు మఱియు ఆకారములచేత ఇంత దనుక ఆవృతమైయున్న తన ఆత్మయొక్కయు, తన సత్యముయొక్కయు స్మృతి అంతరాత్మకిపుడు తిరిగి ప్రాప్తించి, అతని నిత్యసామాన్య చేతన అయినది (18-73): ఇట్లు సమస్త సంశయము మఱియు మోహము దూరము కాగా, అది భగవ దాదేశమును బాలింప నిపుడు ప్రవృత్తము గాగలదు, మఱియు మన సత్తాస్వామిచేత - కాలమునందును, విశ్వమునందును స్వయమభివ్యక్తమగు విశ్వపురుషుడు మఱియు పరమేశ్వరుని చేత - భగవంతునికొఱకును, విశ్వముకొఱకును తన భాగముగా నప్పగించబడిన ఎట్టి కర్మ నైనను ఇపు డంతరాత్మ నిష్ఠతో నిర్వహించగలదు.

# 23. గీతార్థ సారము

1. గీతాతత్త్వము సదా సజీవము : గీతాగ్రంథము వ్రాసిన పిమ్మట ఎంతో, ఎంతోకాలము గడచిపోయినది, ఆ కాలమునందు ఆలోచనానుభవములలో పెద్ద పెద్ద మార్పులు వచ్చినవి; అయినపుడు గీతాసందేశ మేమి యగును, ఇప్పటి మానవ మానసమునకు దాని క్రియాత్మక మూల్యము, దాని ఆధ్యాత్మికోపయోగ మే

మాత్ర ముండును ? మానవ మానసము సర్వదా ముందుకు సాగును, తన దృక్కోణ మును మార్చుకొనును, తన ఆలోచనావిషయమును విస్తృతపఱచుకొనును, మఱియు ఈ మార్పుల ఫలితముగా గత ఆలోచనారీతులు అంతరించిపోవును, లేక వానిని కొనసాగింతు మేని, వానిని విస్తృతపఱచుటయు, శోధించుటయు, అప్రకాశముగనో, ప్రకాశముగనో వాని మూల్యమును మార్చివేయుటయు జరుగును. ఒక ప్రాచీన సిద్ధాంతము ఏ మేరకు ఇట్టి మార్పున కవకాశ మిచ్చునో, ఆ మేరకు దాని సజీవత కొన సాగును; ఏలన, ఆ సిద్ధాంతముయొక్క ఆలోచనాబాహ్యరూపము లెంత పరిమితము లైనను, లేక ఇపుడు వ్యవహారములో లేకున్నను, ఆ సిద్ధాంత నిర్మాణమునకు ఆధార భూతమైన సారతత్త్వము (substance) యొక్క సత్యము, సజీవ దర్శనానుభవముల సత్యము ఇంకను అక్షతముగా నుండి, ఒక శాశ్వత ప్రామాణికతను, మార్మికార్థమును నిలుపుకొనిన దనియే తదవకాశమున కర్థ మగును. గీత అసాధారణరీతిలో చిరకాలము నుండి సజీవముగా సాగుచున్న గ్రంథరాజము. దానిని ఎప్పటికప్పుడు అనుభవమున పునర్నవీకరించుకొనవచ్చును, కావున మహాభారతమున అది మొదట దర్శన మిచ్చి నపుడు, లేక దానిలోనికి చొప్పించబడి నపుడు వలెనే, ఇపుడును అది అంత నవ్యము గాను, తన సారతత్త్వమునందు అంత నూతనముగాను ఒప్పారును. గీత భారతదేశ మున ఇప్పటికిని ధార్మిక చింతనను అత్యంతప్రామాణికముగా శాసించు మహాశాస్త్రము లలో నొకటిగా ఆదరింపబడుచున్నది మఱియు విభిన్న ధార్మిక విశ్వాసములు, అభిప్రాయములు గల దాదాపు అందరు దాని బోధనను శిరసావహించుచున్నారు, కనీసము దానికి అత్యుత్తమ మూల్యము నిచ్చుచున్నారు. దాని ప్రభావము దార్శ నికము (philosophic) మఱియు విద్యావిషయకము మాత్రమే గాదు, అది సన్ని హితము మఱియు సజీవము, ఇంకను దాని భావములు ఒక జాతి మఱియు నొక సంస్కృతియొక్క పునరుజ్జీవనమునందును, పునర్నవీకరణమునందును ఒక ప్రబల నిర్మాణకారి శక్తిగా వాస్తవరీతిని పనిజేయుచున్నవి. ఆధ్యాత్మిక జీవనముకొఱకు మనకు గావలసిన ఆధ్యాత్మిక సత్య మంతయు గీతలోనే లభించును - అని ఇటీవల ఒక మహావ్యక్తి చెప్పను గూడ చెప్పెను. అయితే ఈ వచనముయొక్క అక్షరార్థ మునే ఒత్తి చెప్పుదు మేని, అది గీతకు సంబంధించిన అంధవిశ్వాసమును ప్రోత్స హించుటయే యగును. ఏలన ఆత్మసత్యము అనంతము, దాని నట్లు సీమితము చేయ జాలము. అయినప్పటికి ప్రధాన సూత్రములలో అధికాంశము గీతలో గల వనియు, ఆధ్యాత్మిక అనుభవము మఱియు ఆవిష్కరణముయొక్క నిన్న మొన్నటి పరిణామ

ముల తర్వాత సైతము ఒక విశాల అనుప్రేరణ మఱియు మార్గదర్శనము నిమిత్తము మనము గీతవైపుకు తిరుగవచ్చు ననియు చెప్పవచ్చును. భారతమునకు వెలుపల సైతము ప్రపంచ మహాశాస్త్రములలో నొకటిగా గీత కొనియాడబడు చున్నది–అయితే యూరోపునందు దాని నిగూఢ ఆధ్యాత్మిక సాధనకంటెను దాని తాత్త్విక భాగమే బాగుగా గ్రహించబడినది. మంచిది, కాని గీతావిచారణకును, సత్యమునకును ఈ ప్రాణశక్తి నిచ్చుచున్న వస్తు వేది ?

2. <u>సమన్వయమే గీతాప్రాణశక్తి</u> : గీతా విచారణ మఱియు యోగము యొక్క ప్రధాన లక్ష్య మేమన, ఆంతర ఆధ్యాత్మిక సత్యముయొక్క అత్యంత పూర్ణ మఱియు సమగ్ర సాక్షాత్కారమునకును, మానవుని జీవనము మఱియు కర్మయొక్క బాహ్య వాస్తవికతలకును మధ్య సమన్వయమును, చివరకు ఒక విధమగు ఐక్యమును సైతము అది సాధింప బ్రయత్నించును; నిజానికి ఆ భావముతోనే గీత ఉపక్రమించును, ప్రవర్తించును మఱియు ఉపసంహరించును. అనేకులు ఈ రెండింటికి ఒక రాజీ చేయుదురు; కాని అది ఒక అంతిమ, సంతృప్తి కర పరిష్కార మెన్నటికిని గాజాలదు. ఆధ్యాత్మికతకు నైతికరూప మిచ్చుటయు సాధారణమే మఱియు ఒక ప్రవర్తనా సూత్రముగా దానికి విలువ గలదు; కాని అది ఒక మానసిక పరిష్కారము మాత్రమే, సంపూర్ణ జీవనసత్యముతో సంపూర్ణ ఆత్మ సత్యముయొక్క ఒక సంపూర్ణ క్రియాత్మక సమన్వయముతో అది సరిగాదు, మఱియు నది ఎన్ని సమస్యలను పరిష్కరించునో, మఱల అన్ని సమస్యలను లేవ నెత్తును. నిజానికి గీతా ప్రారంభబిందువే వీనిలో నొక సమస్య, గీత ఒక నైతిక సమస్యతో ప్రారంభించును, ఈ సమస్య భిన్న ధర్మముల సంఘర్షముచేత తలయెత్తును; ఈ సంఘర్షముయొక్క ఒక పక్షమున కర్మప్రధాన మానవుని ధర్మము గలదు – ఇత డొక రాజపుత్రుడు, యోధుడు, నాయకుడు, భౌతిక భూమికయందు, వాస్తవిక జీవన భూమికయందు సంభవించిన ఒక మహాసంకటముయొక్క ఒక సంగ్రామముయొక్క సమర్థకుడు; అది ధర్మము మఱియు న్యాయముయొక్క శక్తులకును, అధర్మము మఱియు అన్యాయముయొక్క శక్తులకును జరిగిన సంఘర్షము; ఒక భయంకర భౌతిక సంగ్రామము మఱియు ఘోర సంహారము ద్వారా యైనను అర్జునుడు ఎదిరించి, యుద్ధము సల్పి, ఒక నూతన శకమును, సత్య ధర్మ న్యాయముల రాజ్యమును స్థాపించితీరవలెను – అని జాతిభవితవ్యము (destiny)

అతని కీర్తి ఆవేశము ఈ సంఘర్షమునకు ఒక పక్షము కాగా, రెండవ పక్షము నైతిక బుద్ధి యున్నది: ఈ బుద్ధి యుద్ధసాధనమును, యుద్ధకర్మను ఒక పాపముగా ఖండించును, వైయక్తిక క్లేశము, సామాజిక కలహము మఱియు అశాంతి కల్లోల రూపమగు మూల్యమును చెల్లింప భయపడి వెనుదీయును, మఱియు హింసాయుద్ధ మునుండి చేయు విరమణమే ఏకమాత్ర మార్గమనియు, ఏకమాత్ర యోగ్య నైతిక భావ మనియు దలంచును. ఆధ్యాత్మిక గంధముతో గూడిన నీతిశాస్త్రము అహింసయే ఆధ్యాత్మిక జీవనముయొక్క పరమ ధర్మ మని పట్టుబట్టును. ఒకవేళ యుద్ధము చేయక తప్పనిచో, ఆధ్యాత్మిక భూమికయందే ఆ యుద్ధమును జేయవలెను, అనగా అస్త్రశక్తితో గాక, ఆత్మశక్తితో శత్రువును ప్రతిఘటించవలెను, పోగా బాహ్య భూమికయం దిట్టి ప్రతిఘటన ఫలించక, అన్యాయశక్తియే జయించి నప్పటికి, వ్యక్తి తన నీతిని రక్షించుకొని, తన దృష్టాంతముచే ఉత్తమాదర్శమును నిల బెట్టినవా డగును. ఈ నైతికాదర్శమున కావల, ఆధ్యాత్మికముగా మఱికొంత లోతునకు బోయిన సన్యాసప్రవృత్తి వచ్చును, అది సామాజిక విధికిని, శుద్ధ నైతి కాదర్శమునకును మధ్య రేగు సంఘర్షమును దాటిపోయి, జీవనమునుండియు దాని సర్వ లక్ష్యములు మఱియు కర్మప్రమాణముల నుండియు వెనుదిరిగి, మఱి, యొక స్వర్గావస్థనో, విశ్వాతీతావస్థనో లక్షించును, అట్టి అవస్థయందే మానవుని జనన జీవన మరణములయొక్క వ్యాకుల ఆడంబరము మఱియు భ్రాంతికి అవల విశుద్ధ ఆధ్యాత్మిక అస్తిత్వము సంభవ మని సన్యాసి తలపోయును. గీత ఈ మూడింటిలో తన స్థానమునుండి దేనిని త్రోసివేయదు – ఏలన అది సాంఘిక విధియొక్క అనుష్ఠానమును, సార్వజనీన కర్మలో పాల్గొనవలసిన మానవునికి ధర్మానుసరణమును ఒత్తి చెప్పును (2-47), అటులే ఉత్తమ ఆధ్యాత్మిక – నైతిక ఆదర్శములో అంతర్భాగముగా అహింసను ఆమోదించును (10-5), చివరకు ఆధ్యాత్మిక విముక్తికి ఒక మార్గముగా తపోమయ సన్యాసమును (18-52) గూడ గుర్తించును. అయినను గీత ఈ పరస్పరవిరుద్ధ స్థితు లన్నింటిని దాటి, సాహసముతో ముందుకు బోవును; సర్వజీవనము ఏకమాత్ర దివ్యపురుషునియొక్క ఒక అర్థయుక్త అభివ్యక్తియే యని చెప్పి, దానిని ఆత్మకు సమర్థించి చూపును, మఱియు అనంతునితో సాయుజ్యమున, అత్యున్న తాత్మతో సమస్వరముగాను, పరిపూర్ణ భగవంతునియొక్క ప్రకటనాత్మకముగాను జీవించు సంపూర్ణ ఆధ్యాత్మిక

జీవితముతో సంపూర్ణ మానవ కర్మయొక్క అవిరోధమును, సుసంగతత్వమును గీత వక్కాణించి చెప్పును.

3. సత్త ఏకవిధము గాదు : మన సత్తయొక్క సంకీర్ణత (complexity) నుండియు, దాని మూల తత్త్వముయొక్క అస్పష్టతనుండియు, దాని ధ్యేయమును, ప్రక్రియలను నిర్ణయించి, శాసించు ఆంతరతమ శక్తియొక్క గుహ్యత్వమునుండియు మానవ జీవితముయొక్క సమస్య లన్నియు ఉత్పన్నమగును. మన సత్త ఒకవేళ ఏకవిధమే యైనచో, అనగా కేవలము భౌతిక - ప్రాణికము గాని, కేవలము మానసికము గాని, కేవలము ఆధ్యాత్మికము గాని యైనచో, లేదా వీనిలో నొకదానిలో తక్కినవి అంతర్భూతముగా నైనను యుండినచో, లేదా మన అవచేతన లేక అతిచేతన భాగములలో సర్వథా సుప్తముగా నైనను యుండినచో, అప్పుడు మనకు భ్రమకలిగించునదేదియు నుండదు; ఏలన అపుడు భౌతిక - ప్రాణిక నియమము అనివార్య మగును ; అథవా మానసిక నియమము తన స్వీయ శుద్ధ అబాధిత తత్త్వమునకు విశదముగా నుండును ; అథవా ఆధ్యాత్మిక నియమము ఆత్మకు స్వత్వఃసిద్ధము, స్వయంపర్యాప్తము నగును. ఉదాహరణకు, పశువులకెట్టి సమస్యలు తెలియవు; అటులే ఒక శుద్ధ మనోమయ లోకమున నివసించు మానసిక దేవత ఏ సమస్యకు నవకాశ మివ్వదు, అథవా తన సమస్యల నన్నింటిని ఒక విశుద్ధ మానసిక నియమము ననుసరించి గాని, ఒక హేతుప్రధాన సామరస్య మిచ్చు తృప్తినిబట్టి గాని పరిష్కరించుకొనును; పోగా అమిశ్రితాత్మ సమస్యలకు పైన, అనంతమునందు స్వయంసంతుష్టమై యుండును. కాని మానవ సత్త ఒక త్రివిధ జాలము, అది ఏకకాలమున మిక్కిలి గుహ్యముగా శారీరిక - ప్రాణికము, మానసికము మఱియు నాధ్యాత్మికము; మఱియు నీ మూడింటియొక్క యథార్థ సంబంధము లేవియో అతనికి తెలియవు, తన జీవితముయొక్క వాస్తవ సత్యత ఏదియో అతనికి తెలియదు, తన భవితవ్య మెటు లాగుచున్నదో తెలియదు, తన సంసిద్ధి ధామ మెచ్చటున్నదో తెలియదు ;

4. శరీరావసరములు తీర్చక తప్పదు : ద్రవ్యము మఱియు ప్రాణము మానవుని వాస్తవి కాధారము; -దానినుండియే అతడు తన యాత్ర నారంభించును, దానిమీదనే అతడు నిలబడును మఱియు భువిపై, శరీరమున అతడసలు వర్తింపగోరు

నేని. దాని ఆవశ్యకతను, నియమమును అతడు పూరించక తప్పదు. భౌతిక మఱియు ప్రాణిక నియమ మన, పశ్చాజ్జీవన (survival, తర్వాత జీవించుట) విధానము, సంఘర్ష విధానము, కామనా మఱియు కామనా ప్రాప్తి విధానము, స్వాధికార స్థాపనా విధానము మఱియు శరీర, ప్రాణ, అహంకార తర్పణవిధానము. మానవుని ఉచ్చతర శక్తులు సాధ్యమగు ప్రపంచము నందలి బౌద్ధిక తర్క మంతయు, నైతిక ఆదర్శ వాదము మఱియు ఆధ్యాత్మిక నిరపేక్షతావాద (absolutism) మంతయు మన ప్రాణిక - భౌతిక ఆధారముయొక్క సత్యతను, ఆవశ్యకతను తుడిచివేయజాలవు, లేక మానవ జాతి ప్రకృతియొక్క అనివార్య నిర్బంధమునకు లోబడి, తదాధారము యొక్క లక్ష్యములను, ఆవశ్యకతల పరితృప్తిని అనుసరించుటను ఆపజాలవు, లేక మానవజాతి దాని ముఖ్య సమస్యలను మానవ భవితవ్యము, మానవ హితము మఱియు ప్రయత్నములలో ఒక గురుతర, న్యాయసమ్మత భాగ మొనరించుకొనుటను వారించజాలవు. ఆధ్యాత్మిక లేక ఆదర్శపరాయణ పరిష్కారములు సర్వమును పరిష్కరించును గాని, మన వాస్తవిక మానవ జీవనముయొక్క కఠోర సమస్యలను మాత్రము పరిష్కరించ జాల వని గ్రహించి, వానియందు తృప్తి నందక, మానవ బుద్ధి సైతము వానినుండి విముఖమై, ప్రాణిక మఱియు భౌతిక జీవనమును మాత్రమే ఆమోదించి, దాని అత్యంత సంభవ సామర్థ్యమును, క్షేమమును, సువ్యవస్థిత తృప్తిని హేతుబద్ధముగానో, సహజజ్ఞాన ప్రేరణచేతనో సాధింప గడంగును. హేతుశక్తి సంపన్న ప్రాణిక మఱియు శారీరిక సిద్ధికి సహజమగు జీవనసంకల్పము లేక అధికారప్రాప్తి సంకల్పముయొక్క సిద్ధాంతము మానవ జాతికి పరిగణిత ధర్మ మగును మఱియు తక్కిన దంతయు ఒక దాంభిక అసత్య మనియో, ఒక గౌణ వస్తువు, ఒక స్వల్పతర, సాపేక్ష పరిణామముయొక్క ఒక అముఖ్య ఫలిత మనియో తలంచబడును.

5. <u>మనస్సు ఎక్కువ ఆంతరంగికము :</u> అయినను శరీరప్రాణములు, వాని కెంత పట్టు మఱియు ప్రాముఖ్య మున్నను, మానవుని సర్వసత్తయు గావు: మఱియు మనస్సు ప్రాణశరీరముల ఒక ఉపకరణము మాత్రమే, అపుడపుడు తన సేవకు ప్రతిఫలముగా కొన్ని శుద్ధ మానసిక భోగముల అవకాశము దాని కివ్వ బడును - అను మాటను సైతము అతడు పూర్తిగా నంగీకరించజాలడు, అటులే మనస్సు ప్రాణి కావేగముయొక్క ఒక విస్తరణము మఱియు వికాసము, భౌతిక

జీవనముయొక్క తృప్తి నాశ్రయించి యుండు నొక ఆదర్శవిలాస మనియు అతడు తలంచజాలడు. శరీర ప్రాణములకంటె నెంతో ఎక్కువ ఆంతరంగికముగా మనస్సు మానవుడై యున్నది మఱియు నది పెంపొందిన కొలది శరీరప్రాణములనే తన విశిష్ట పరితృప్తులకొఱకును, తన స్వరూపసాక్షాత్కారముకొఱకును ఒక ఉపకరణము గావించుకొన దీక్షవహించును - ఈ ఉపకరణము ఆవశ్యకమే యైనను ఒక అసల్ప అవరోధము గూడను, లేనిచో (ఘర్షణ) సమస్యయే యుండదు. మానవ మనస్సు ఒక ప్రాణిక మఱియు భౌతిక ప్రజ్ఞ మాత్రమే గాదు, పరంతు (but) ఒక బౌద్ధిక, సౌందర్యమీమాంసక, నైతిక, ఆంతరాత్మిక, క్రియాశీల ప్రజ్ఞయు నగును, మఱియు తన ప్రవృత్తులయొక్క ప్రతిక్షేత్రమునందు వానియొక్క ఒక ఆదర్శరూపమును సాధింప ప్రయాసపడును, అదియే దాని ఉచ్చతమ, ప్రబలతమ స్వభావము; అయితే చంచలముగా నున్న ప్రాణము, ఆ రూపమును పూర్తిగా పట్టుకొని, మూర్తిమంతము గావించి, ఇచ్చట సర్వథా వాస్తవము చేయ నవకాశ మీయదు. మన ఆకాంక్షయొక్క ఆ మానసిక ఆదర్శరూపము ఆంశికముగానే పట్టువడిన ఒక ప్రకాశమయ లేక ప్రబల ఆదర్శముగనే నిలిచిపోవును; అయితే మనస్సు దానిని లోలోపల చక్కగా ప్రత్యక్షము గావించుకొనగలదు, లోలోపల తన ప్రయత్నమును శాసించునట్లు చేసికొనగలదు, మఱియు అంశికముగా దానిని సాధించను గూడ సాధించగలదు, కాని జీవిత వాస్తవముల నన్నింటిని నిర్బంధించి ఆ ఆదర్శ రూపమున ఇముడ్చజాలదు. ఇట్లు బౌద్ధిక సత్యము మఱియు యుక్తికి సంబంధించిన ఒక ఆదర్శరూపము, ఒక అనివార్య విధానము గలదు, దీనిని మన బౌద్ధిక సత్త అన్వేషించును; అట్లే ధర్మము మఱియు ప్రవర్తనకు సంబంధించిన ఒక ఆదర్శరూపము, ఒక అనివార్య విధానము గలదు, దీనిని మన సదసద్వివేక శక్తి (conscience) అన్వేషించును; ఇంకను ప్రేమ, సానుభూతి, కరుణ, ఏకతలకు సంబంధించిన ఒక ఆదర్శ రూపము, ఒక అనివార్య విధానము గలదు, దీనిని మన భావిక మఱియు ఆంతరాత్మిక ప్రకృతి లాలసతో అభిలషించును; తర్వాత హర్షము మఱియు సౌందర్యమునకు సంబంధించి ఒక ఆదర్శ రూపము, ఒక అనివార్య విధానము గలదు, దీనికై మన సౌందర్య గ్రాహి సత్త పరితపించును; చివరకు లోలోపలి ఆత్మస్వామ్యము మఱియు జీవన సంయమమునకు సంబంధించిన ఒక ఆదర్శ రూపము, ఒక అనివార్య విధానము గలదు, దీనికొఱకు క్రియాశీల సంకల్పము ప్రయాసపడును - ఇవి యన్నియు మనలో కలిసి యున్నవి మఱియు ప్రాణిక - దైహిక మనసు ఏప్రాప్తి మఱియు

నియమము, అటులనే ఏ సురక్షిత దైహిక జీవనముపై పట్టుబట్టునో, వానికి సంబంధించిన ఆదర్శరూపము మఱియు అనివార్య విధానముతో తలపడును. మఱియు మానవ మనస్సు అన్నింటిమాట నటుంచి, వీనిలో నేయొక దానిని పూర్తిగా సాధించ లేమి గాంచి, ప్రతి విభాగమునందు అనేక ప్రమాణములను, ధర్మములను నెల కొల్పును - సత్యము మఱియు యుక్తిని నిర్ణయించు ప్రమాణములు; ధర్మము మఱియు ప్రవర్తనమును; హర్షము మఱియు సౌందర్యమును; ప్రేమ, సానుభూతి మఱియు ఏకతను; ఆత్మస్వామ్యము మఱియు సంయమమును; సర్వరక్షణము, సంపత్తి, ప్రాణిక సామర్థ్యము మఱియు సుఖమును నిర్ణయించు ప్రమాణములు - మఱియు నా ప్రమాణములను జీవనముపై విధింప యత్నించును. ఆ భాసుర మగు ఆదర్శములు ఎంతోపైన, మన శక్తికి అందని తావున వర్తించును. మఱియు ఉత్సాహపూర్ణ వ్యక్తులు తమ యావచ్ఛక్తితో వానిని ఎక్కువెక్కువగా సమీపింతురు; నానా సమాజములు తక్కువ శోభాయమాన ఆదర్శము నొక దానిని, ఒకానొక పరిమిత, సుసాధ్య, సాపేక్ష ప్రమాణము ననుసరింతురు లేక అట్లు చెప్పుకొందురు. వ్యక్తిగతమైన మానవ జీవితము ఆదర్శముచేత ఆకర్షింపబడినను, (ఆచరణలో) దానిని పరిత్యజించును; తనదే యగు ఒక అస్పష్ట అనంతసత్తయొక్క బలమునందు అది ప్రవర్తించుగు నట్టి మానసిక మఱియు నైతిక వ్యవస్థనైనను ప్రతిఘటించి క్షీణింప జేయును లేక భగ్నముచేయును. మఱియు నిట్లుగాక తప్పదు, కారణము, మనః ప్రాణములు రెండును ఒకదానిపై నొకటి పనిసేయు తత్త్వములే యైనను, అవి పరస్పరము భిన్నములు మఱియు పృథగ్భూతములు లేక ప్రాణముయొక్క సంపూర్ణ సత్యతాసూత్రము మనస్సునకు చిక్కలేదు. ఆ సూత్రమును ఒకానొక అధికతర వస్తువునందు, మానవజీవుని మానసికతా, నైతికతలకు పైన ఒకానొక అజ్ఞాత వస్తువునందు వెదకవలెను.

6. <u>మతములు సైతము మార్చలేకపోయినవి</u> : మనస్సునకు స్వయముగా ఏ విధముగు ఒకానొక అతీత తత్త్వముయొక్క అస్పష్ట జ్ఞానము గలదు మఱియు తన ఆదర్శరూపముల అనుసంధానమునందు అది వానిని తఱచుగా స్పృశించుట జరుగును. తనకు దగ్గరగను, లోపలను, ఆంతరతమముగ నుండియు నేది తనకంటె అమేయముగా నధికతరము, తననుండి అపూర్వముగా దూరగతము (13-16), తనకు పరముగ అవస్థితము నగు ఒక స్థితిని, ఒక శక్తిని, ఒక సన్నిధిని మనస్సు

క్షణకాలము దర్శించును; తనకంటెను ఎక్కువ సారభూతము, తన ఆదర్శములకంటె నెక్కువ నిరపేక్షము, ఘనిష్ఠము, అనంతము, ఏకము నగు ఒకానొక వస్తువుయొక్క అంతర్దర్శనము దానికి లభించుచుండును మఱియు నా వస్తువునే మనము భగవంతుడు, ఆత్మ లేక బ్రహ్మ యని పిలుతుము. ఇంతకు మనస్సు దీనినే పూర్తిగా తెలిసికొనుటకును, ప్రవేశించుటకును, స్పృశించుటకును, చేజిక్కించుకొనుటకును ప్రయత్నించును, దానినే సమీపించగోరును లేక నదియే కాగోరును, దానితో నొక విధమగు ఐక్యమును బొందజూచును లేక ఆ 'ఆశ్చర్యముతో' (2-29) సంపూర్ణ తాదాత్మ్యమున తనను గోల్పోవ జూచును. కాని కఠినత ఏమన తన శుద్ధ తత్త్వమున ఈ బ్రహ్మము జీవిత వాస్తవికతలనుండి మానసిక ఆదర్శములకంటెను గూడ ఎక్కువ దూరముగా నున్నట్లు తోచును; తన స్వీయ పరిభాషలోనికి - జీవన, కర్మల పరిభాష మాట నటుంచుడు - మనస్సు అనువదించజాలని వస్తు విది. కావుననే కఠోర నిరపేక్షబ్రహ్మవాదులు మానసిక సత్తను నిరాకరింతురు మఱియు భౌతిక సత్తను గర్హింతురు, మఱియు నొక విశుద్ధ ఆధ్యాత్మిక సత్తనిమిత్తము అఱ్ఱులు చాతురు; చాచి, మనఃప్రాణములయందు మనకు గల సత్తనంతను లయము - "నిర్వాణము" - జెందించి, ఆ మూల్యముతో ఆధ్యాత్మిక అస్తిత్వమును కొనుక్కొందురు. ఈ కఠోర బ్రహ్మవాదులకు (నిర్వాణము గాక) తక్కిన ఆధ్యాత్మిక ప్రయత్నమంతయు ఒక మానసిక సన్నాహము లేక సమాధానము (compromise), అనగా సాధ్యమైనంత మనఃప్రాణముల ఆధ్యాత్మికీకరణము మాత్రమే. మానవుని ప్రాణమయ సత్తయొక్క అధికారములచేతను, అతని జీవన, వర్తన, కర్మలచేతను లేవదీయబడిన సమస్యయే నిరంతరము అతని మనోవ్యాపారమును పట్టువిడువక బాధించు కఠినత; కావున ఈ సన్నాహక ప్రయత్నము అంతరాత్మిక మనస్సుయొక్క ఆధారముపై నైతిక మనస్సుయొక్క ఆధ్యాత్మికీకరణ దిశగానే ముఖ్యముగా సాగును; ఇట్లు ప్రాప్తించిన ఆధ్యాత్మిక శక్తి మఱియు శుద్ధతవలన నైతిక మనస్సు నడవడికి సంబంధించిన తన సత్య ధర్మముల ఆదర్శమును, అంతరాత్మిక మనస్సు ప్రేమ, సానుభూతి మఱియు ఏకతకు సంబంధించిన తన ఆదర్శమును జీవనముపై అధికతర ప్రామాణ్యముతో ప్రయోగించగలుగును. ఈ ఆధ్యాత్మికీకరణముచేత, ఆత్మయొక్క నిరపేక్ష ఏకతకును, సర్వప్రాణులయొక్క మౌళిక ఏకతకును సంబంధించిన ఆధారభూత సత్యమునకు బుద్ధి మఱియు సంకల్పము ఇచ్చు సమ్మతివలన పై ఆదర్శములు ఒక అత్యున్నత అభివ్యక్తిని బొందుటకు సాయము లభించును, వానికి

విశాలతమ, ప్రకాశమయ ఆధారము ప్రదత్తమగును. మానవుని సాధారణ మనస్సు యొక్క అర్థ్యర్థపలతో ఏథోవిధముగా ముడిపెట్టబడి నట్టియు, ఉపయుక్తమగు సామాజిక కర్తవ్యమును, సామాజిక ప్రవర్తనయొక్క ప్రచలిత నియమావళిని అంగీకరింప సుముఖముచేయబడి నట్టియు, పూజ, సంస్కారము మఱియు మూర్తి ప్రతిష్ఠచేత ఆకర్షణీయముచేయబడి నట్టియు ఇవ్విధమగు, ఆధ్యాత్మికతయే ప్రపంచ మహామతములయొక్క బాహ్య తత్త్వము. ఈ మతములు కొన్ని వైయక్తిక విజయములు సాధించును - ఒక ఉచ్చతర జ్యోతియొక్క ఒకానొక కిరణమును గొని వచ్చును, విశాలతరమగు ఒక ఆధ్యాత్మిక లేక అర్ధ - ఆధ్యాత్మిక విధానము యొక్క ఒకానొక ఛాయను జీవనముపై విధించును, కాని పరిపూర్ణ విజయమును సాధించజాలక, చివరకు ప్రత్యక్షముగా ఒక రాజీలోనికి దిగును మఱియు ఆ రాజీ క్రియచేతనే జీవనరంగమున పరాజిత మగును. ఇట్లు జీవన సమస్యలు నిలిచి యుండుటయే గాక, అత్యుగ్ర రూపమున విజృంభించును గూడ — దారుణ కురుక్షేత్ర సమస్య అట్లు విజృంభించినదే. ఆదర్శములను సాధింప జూచు బుద్ధియు, నైతిక మానసమును ఈ సమస్యలను సదా తొలగింప నాశించును - తమ స్వీయ ఆకాంక్ష నుండి జనించిన ఒక సుఖమయ ఉపాయము నావిష్కరించి, తమ స్వీయ ప్రబల నిర్బంధముచే దానిని శక్తియుక్తము గావించి, అది జీవితముయొక్క ఈ అధోముఖ, అమంగళ రూపమును రూపమాపగల దని ఆశించును; కాని ఆ రూపము రూపు మాయక, నిలిచియే యుండును : రెండవ వైపున ఆధ్యాత్మికీకృతమగు బుద్ధి మతము యొక్క వాణిద్వారా భవిష్యత్తున విజయశీలియగు ఒకానొక రామరాజ్య మేర్పడు నని గట్టిగా వాగ్దానము చేయును, కాని ఈలోపల పార్థివ నిర్వీర్యతను గుఱించి తనకు చాలవఱకు నమ్మకము కలుగగా, ఆత్మ భువిపై బలాత్కారముగా ప్రవేశించిన పరదేశీయు డని నిర్ణయించుకొని, ఇట్లు ప్రకటించును : తుట్టతుదకు ఇచ్చట దైహిక వ్యష్టిజీవనమునందు గాని, మర్త్య మానవుని సమష్టి జీవనమునందు గాని కాక, ఒకానొక అజరామర పరతత్త్వమునందు విలసిల్లు స్వర్గము లేక నిర్వాణము నందు మాత్రమే మనము యథార్థ ఆధ్యాత్మిక అస్తిత్వమును (జీవనమును) కనుగొనగలము.

7. <u>గీతచే జీవనసమస్యా పరిష్కారము :</u> ఇదిగో, ఇచ్చటనే గీత ప్రవేశించి, బ్రహ్మయొక్కయు, ఆత్మయొక్కయు, ఈశ్వరునియొక్కయు, ప్రపంచ

ప్రకృతులయొక్కయు సత్యమును పునఃప్రతిపాదించును. ఉపనిషత్తులనుండి సేక రించి, తర్వాతి విజ్ఞానము పెంపొందించిన సత్యమును గీత విస్తృతపఱచి, దానికి నూతనాకృతి కల్పించి, జీవనము మఱియు కర్మల అసాధ్యసమస్యను పరిష్కరింప దాని పరిష్కారశక్తిని ప్రయోగించు ప్రయత్నమున సునిశ్చిత పదములతో ముందుకు బోవ సాహసించును. అయితే గీత చూపిన పరిష్కారము, ఆధునిక మనస్సున కా సమస్య ఏ రూపమున ప్రత్యక్షమగునో, ఆ రూపమున గల దాని చిక్కు నంతను విడదీయదు; గీతలో ఆ పరిష్కారము ప్రాచీన మనస్తత్వాని కనుకూలముగా ప్రతిపాదింపబడెను, సమష్టి ప్రగతిని గోరు ఇప్పటి మానవ మానసముయొక్క గట్టి పట్టును కదిమార్గము జూపదు, అటులే తుట్టతుదకు ఒక అధికతర బౌద్ధిక మఱియు నైతి కాదర్శమునకును, సంభవ మగుచో, ఒక క్రియాశీల ఆధ్యాత్మి కాదర్శమునకును సైతము రూప మివ్వగల సమష్టి జీవనము నిమిత్తము ఇప్పటి మనస్సు చేయు ఆక్రోశమునకు గీత జవా బివ్వదు. దాని ఆహ్వానము సంపూర్ణ ఆధ్యాత్మిక జీవనము నకు సామర్థ్యము సంపాదించిన వ్యక్తికి మాత్రమే; తక్కిన జాతి కంతకు గీత ఒక క్రమగత ప్రగతిని విధించును, తక్కిన వారు నిష్ఠతో తమ స్వభావ ధర్మము (18-47) ననుసరించుచు, వివేకపూర్వకముగా ఉన్నతిని సాధించవలెను, ఆ సాధనలోనికి వారు ఎక్కువెక్కువగా వివేచనను, నైతిక లక్ష్యమును, చివరకు ఆధ్యాత్మిక ప్రవృత్తిని (turn) ప్రవేశపెట్టవలెను. గీతాసందేశము ఇతర (సాంఘిక, నైతిక, తాపసిక) పరిష్కారములను గూడ ప్రస్తావించును గాని, వానిని గీత అంశికముగా ఆమోదించి నపుడు సైతము, వాని కావల నున్న ఒక ఉచ్చతర, సమగ్రతర సత్యము దిశగా వానికి దారి జూపుటకే వాని నామోదించును - ఆ సత్యమున ప్రవేశింప నింతవఱకు కొద్దిమంది వ్యక్తులు మాత్రమే తమ యోగ్యతను నిరూపించుకొని యున్నారు.

8. <u>ప్రాణిక మనస్సునకు గీతాసందేశము</u> : ప్రాణిక మఱియు దైహిక జీవనము వెంటదగులు మనస్సునకు గీతాసందేశ మేమన, సమస్త జీవనము నిక్కముగా వ్యక్తియందు విశ్వశక్తియొక్క (7-8) ఒక అభివ్యక్తియే, ఆత్మనుండి వచ్చిన ఒక అస్యమే (2-17. 13-31), భగవంతునియొక్క ఒక కిరణమే (15-7); అయినను అది వాస్తవమున మాయావేషమున మఱుగుపడియున్న (7-14) ఆత్మ మఱియు భగవంతునియొక్క అవృతరూపము మాత్రమే; కాగా అట్టి నిమ్నతర జీవనమును నిమ్నతర జీవనము నిమిత్తమే వెంటాడుట యన పతనకారక పథమున పాదుకొని

పోషటమే, మన ప్రకృతియొక్క తమోమయ అజ్ఞానమునకు పట్టముగట్టుటయే యగును గాని, జీవనముయొక్క యథార్థ సత్యమును, సంపూర్ణ ధర్మమును కనుగొనుట ఎంతమాత్రము గాదు. జీవన - సంకల్పము, అధికార - సంకల్పము యొక్కయు, కామనాతృప్తియొక్కయు, కేవల శక్తి బలముల ప్రకీర్తనముయొక్కయు, అహంకారము మఱియు దానియొక్క స్వైర అర్జన ప్రవృత్తియొక్కయు, అవిశ్రాంత స్వార్థ పరాయణ బుద్ధియొక్కయు నే సిద్ధాంతము గలదో, అది అసురుని సిద్ధాంతము మఱియు నది యొక ఘోర వినాశమునకును, అధఃపాతమునకును మాత్రమే దారితీయగలదు. ప్రాణప్రధాన మఱియు నుదరపరాయణ మానవుడు తనను శాసించుటకు ఒక ధార్మిక, సామాజిక మఱియు సాదర్శపరాయణ ధర్మము నంగీకరించవలెను; ఆ ధర్మముచేత నతడు కొన్ని సముచిత నియమములకు లోబడి తన కామనను, ప్రయోజనమును సాధించుకొనుచునే, తన నిమ్నతర వ్యక్తిత్వమునకు శిక్షణ గఱపి, దానిని వశము గావించుకొన గలడు మఱియు వ్యక్తిగతము, సామాజికము - ఉభయవిధమగు జీవనముయొక్క ఒక ఉచ్చతర నియమముతో సావధానముగా దానికి శ్రుతికలుప గలడు.

9. <u>బౌద్ధిక మనస్సునకు గీతాసందేశము :</u> ఏ మనస్సు బౌద్ధిక, నైతిక మఱియు సామాజిక ప్రమాణములను అనుసరించుటయందు లగ్నమై యుండునో, ఏ మనస్సు ప్రతిష్ఠిత ధర్మములను, నైతిక నియమమును, సాంఘిక విధి మఱియు వృత్తిని గాని, విముక్త ప్రజ్ఞ చూపు పరిష్కారములను గాని పాలించుటద్వారా విముక్తిని బొందవలె నని పట్టు బట్టునో, ఆ మనస్సునకు గీతాసందేశ మేమన, నిక్కముగా నది యొక మిక్కిలి ఆవశ్యక దశయే; ధర్మమును తప్పక పాలించ వలసినదే, కారణము, సరిగా పాలించినపు డది అంతరాత్మ ప్రాబల్యమును పెంచి, ఆధ్యాత్మిక జీవనమునకు సన్నాహము గావించి, సాయపడగలదు, కాని అట్లయినను ఈ ధర్మపాలనమే జీవితముయొక్క సంపూర్ణ, చరమ సత్యము గాదు. మానవుని అంతరాత్మ ఇంకను ముందుకు వెళ్లి, మానవుని ఆధ్యాత్మిక మఱియు అజరామర ప్రకృతియొక్క ఇంకను ఎక్కువ నిరపేక్షమగు ఒకానొక ధర్మమును చేరుకొనవలెను. మఱియు నట్లు చేరుకొనగలుగుటకు, మనము నిమ్నతర మానసిక తత్త్వముల అజ్ఞాన మయ రచనలను, అహంకారిక వ్యక్తిత్వముయొక్క అనృతత్వమును అడచివేసి, వదిలించు కొనవలెను; ప్రజ్ఞా, సంకల్పములను క్రియను నిర్వ్యక్తికము చేయవలెను;

అన్నింటియందును గల ఏకాత్మయొక్క తాదాత్మ్యమున నివసించవలెను; మఱియు అహం - మూసలను ఛేదించి వెలువడి, నిర్వ్యక్తి కాత్మలో ప్రవేశించవలెను. మనస్సు త్రివిధ నిమ్నప్రకృతియొక్క ప్రతి బంధక నిర్బంధమునకు లోబడి వర్తించుచు, తామసిక, రాజసిక, లేక ఉన్నత స్థానమున సాత్త్విక గుణముల ననుసరించి, తన ప్రమాణములను నెలకొల్పుకొనును; కాని అంతరాత్మ భవితవ్య మొక దివ్య సంసిద్ధి మఱియు విమోక్షము, మఱియు దానికి మన అత్యున్నతాత్మయొక్క స్వతంత్రతయే ఆధారము కాగలదు, మఱియు ఆత్మయొక్క విశాల నిర్వ్యక్తికత మఱియు విశ్వమయత ద్వారా మనస్సును అతిక్రమించి, సర్వధర్మములకు పరమున (7-13) విరాజిల్లు అపరిమేయ భగవంతుడు మఱియు పరమోన్నత అనంతుని యొక్క సమగ్ర జ్యోతియందు ప్రవేశించి నపుడే ఆ సంసిద్ధి రూపొందగలదు.

10. <u>సన్న్యాసపరాయణ మనస్సునకు గీతా సందేశము</u> : ఎవరు అనంతుని యొక్క అక్షరతత్త్వ - ఉపాసకులో, ఎవరు నిర్వ్యక్తికతను చరమావధివఱకు గొనిపోవుదురో, ఎవరు జీవనము మఱియు కర్మయొక్క నిర్వాణము నిమిత్తము ఇతరమును సహించలేని ఆవేగమును లోపల పోషించుకొందురో మఱియు నెవరు అనిర్వచనీయ బ్రహ్మముయొక్క విశుద్ధ మౌనమునందు వైయక్తిక సత్త నంతను ప్రయాసపూర్వకముగా లయముజేయుటయే తమ పరమ లక్ష్యము మఱియు నాదర్శముగా గల్గి యుందురో, అట్టివారికి గీతా సందేశ మేమన, నిజమే,పయనించి అనంతునిలో ప్రవేశించుట కిది యొక మార్గమే (12-4), కాని మిక్కిలి కఠినమార్గము;(12-5) ఉపదేశము లేక దృష్టాంతముద్వారా నిష్క్రియతా - ఆదర్శమును ప్రపంచమునుందుంచుట మిక్కిలి అపాయకరము (3-24); ఇది ఉత్కృష్ట మార్గమే యైనను, మానవునకు ఉత్తమ మార్గము మాత్రము గాదు మఱియు ఈ జ్ఞానము సత్యమే యైనను, సమగ్రము మాత్రము గాదు. పరమ పురుషుడు, సర్వ-చేతన ఆత్మ, పరమేశ్వరుడు, అనంతుడు దూరస్థము, అనిర్వచనీయము నగు ఒక ఆధ్యాత్మిక సత్త మాత్రమే గాడు; అతడు విశ్వమునందు గుప్తముగా నుండియు, తోడ్తోడ మానవుడు మఱియు దేవతల ద్వారాను, సర్వభూతముల ద్వారాను, ఉన్న సర్వమునందును ప్రకటమగుచున్నాడు. మఱియు నేదియో నిర్వికార మౌనమునందు మాత్రమే గాక, ప్రపంచమునందును, దాని జీవులయందును మఱియు సమస్త సత్తయందును, సమస్త ప్రకృతియందును అతనిని కనుగొనుటచేతనే, అటులే బుద్ధి

సంకల్ప హృదయ ప్రాణముల క్రియాకలాపము లన్నింటిని అతనితో అత్యున్నత సంయోగములోనికే గాక, అతిసమగ్ర సంయోగములోనికిని లేవనెత్తుటచేతనే మానవుడు ఆత్మ మఱియు భగవంతునికి సంబంధించిన తన ఆంతర ప్రహేళికను (riddle), తన సక్రియ మానవ జీవనమునకు సంబంధించిన బాహ్య సమస్యను పరిష్కరించుకొనగలడు. ఈ సంయోగమువలన భగవత్సదృశుడుగా చేయబడి, భగవంతు డగుచు, ప్రేమ జ్ఞానములకు తీసిపోని కర్మద్వారా ఒక పరమ ఆధ్యాత్మిక చేతనయొక్క అనంత ప్రాణము నతడు ఉపభోగించగలడు. ఇపుడు అమరుడు; ముక్తుడు నగు నతడు ఆ పరమోచ్చ స్థానమునుండి తన మానవ కర్మను పొగించగలడు మఱియు దానిని ఒక పరమ మఱియు సర్వ - సమగ్ర దివ్య కర్మకలాపములోనికి రూపాంతరము జెందించగలడు - అదియే నిక్కముగా ఇచ్చట జరుగు సమస్త కర్మలు, జీవనము, యజ్ఞము మఱియు ప్రపంచ ప్రయాసముయొక్క చరమ ఫలము మఱియు పరమ అర్థము.

11. <u>సామూహిక సిద్ధికి సైతము గీతాయోగము :</u> ఈ సర్వోన్నత సందేశము ముమ్మొందుగా ఎవరికి దీని ననుసరించ శక్తి గలదో, వారికి ఉద్దేశింపబడినది—వీరు శ్రేష్ఠ మానవులు, మహా తాత్ములు, ఈశ్వర-జ్ఞానులు, ఈశ్వర-కర్ములు, ఈశ్వర-భక్తులు; వీరు భగవంతునియందు, భగవంతునికొఱకు నివసించగలరు మఱియు ప్రపంచమున సంతోషముగా అతనికొఱకు తమ కర్మ నిర్వహించగలరు మఱియు ఆ కర్మ మానవ మానసముయొక్క సంక్షుబ్ధ అంధకారమునకును, అహంకారముయొక్క మిథ్యాపరిమితులకును పైన వెలుగు దివ్యకర్మ. అదే సమయమున మఱల గీత ఇట్లు ప్రకటించును : తమ కా సంకల్ప మున్నచో అధమాధములు, పాపిష్ఠ మానవులు సైతము (9-32) ఈ యోగమార్గమున ప్రవేశించగలరు - ఇచ్చట మనకు ఒక విశాలతర ప్రతిజ్ఞయొక్క ఆశాకిరణము గన్పించును, సిద్ధికి సామూహిక రూప మివ్వగోరు మన ఆశాభావమునకు సైతము దీనిని విస్తరింపజేసికొనవచ్చును. ఏలన వ్యక్తులకు ఆశ యున్నచో, జాతికి మాత్రము ఎందు కుండగూడదు ? మఱియు యథార్థ ఆత్మసమర్పణయు, అంతర్నివాసి భగవంతునియందు ఏకాంత (absolute), నిరహంకార విశ్వాసమును ఉన్నచో, ఈ మార్గమునందు విజయము నిశ్చితము. కావలసినది నిర్ణాయకమగు మలుపు; అంతఃపురుషునియందు ఒక సుస్థిర విశ్వాస ముండవలెను; భగవంతునిలో నివసించుటకును, ఆత్మయందు

అతనితో ఏకముగా నుండుటకును మఱియు ప్రకృతియందు - ఇచ్చట సైతము మన మతని సత్తయొక్క ఒక సనాతనాంశమే (15-7) - అతని మహత్తర ఆధ్యాత్మిక ప్రకృతితో నేకముగా వర్తించుటకును (14-2) ఒక దృఢ, హృదయపూర్వక సంకల్ప ముండవలెను, మన సర్వాంగములందును భగవ దావిష్టులము, భగవత్ సదృశులము గావలెను (14-2).

12. <u>కావలసిన సజీవ సాధనాంశము</u> : గీత తన సిద్ధాంతముయొక్క క్రమగత ప్రతిపాదనయందు ప్రకృతి నిర్ధాయకత్వము (3-33), విశ్వరూప అభివ్యక్తి యొక్క మార్మికార్థము (5-29), విముక్త ఆత్మయొక్క అంతిమ స్థితి (12-8) - ఇత్యాది అనేక సమస్యలనులేవనెత్తును మఱియు ఈ సమస్యలు అనంత, అనిర్ధాయక వాదవివాదానికి విషయములు. గీతయొక్క సారతత్త్వమును పరీక్షించి, విస్పష్టముగా ప్రతిపాదించుటయు, మానవజాతియొక్క చిరస్థాయి ఆధ్యాత్మిక విజ్ఞానమునకు దాని అనుదానమును మఱియు సజీవ సాధనారూపమగు దాని హృదయమును వెలికిదీసి చూపుటయు ఈ వ్యాసపరంపరయొక్క ఉద్దేశ్యము; కావున ఈ చర్చలలోనికి లోతుగా దిగుట మన కావశ్యకము గాదు; అటులే దాని దృక్కోణము లేక నిర్ణయము లతో మన మెక్కడ ఏకీభవించకపోవచ్చునో, ఎచ్చట మన మిచ్చు సమ్మతిలో ఎట్టి మినహాయింపులు చేయవచ్చునో, లేక తర్వాత తర్వాత లభించిన అనుభవబలముతో దాని దార్శనిక బోధనను గాని, దాని యోగసాధనను గాని మన మెక్కడ దాటి పోవచ్చునో, దానినంతను విచారించ నవసరము లేదు. నిత్యాన్వేషకుడు, నిత్యావిష్కారకుడు నయిన మానవునికి గీత ఇప్పటికిని గొనివచ్చు సజీవ సందేశముయొక్క సూత్రీకరణముతో ఈ గ్రంథమును ముగించిన సరిపోవును; ఏలన ఆ సందేశ మతనిని తన ప్రస్తుత భ్రమణములద్వారాను, తన ఆత్మయొక్క జ్యోతిర్మయ శిఖరములకు తన జీవితముయొక్క సంభవనీయ దుష్కర ఆరోహణద్వారాను తన గమ్యమునకు నడుపగలదు.

# 24. గీతా సందేశము

1. <u>జీవనసమన్యకు ఏకైకపరిష్కారము</u> : గీతాసందేశమును దివ్యగురు వచనములలో సంగ్రహముగా నిట్లు చెప్పుకొనవచ్చును : "ఏది సమస్త జీవనము మఱియు అస్తిత్వములయొక్క రహస్యమో, అదియే కర్మరహస్యము గూడను (10–8). అస్తిత్వము – జగదస్తిత్వము – దేనియందు అంతరాత్మ ఒక క్షణము గాని, కొన్ని యుగములు గాని తగుల్కొని యున్నదో (14–5) అట్టి ఒక ప్రకృతి యంత్రాంగము, ఒక నియమచక్రము మాత్రమే గాదు; పరంతు అది ఆత్మయొక్క ఒక సంతత అభివ్యక్తి (2–17). మఱియు జీవనము – జీవించుట – జీవనముకొఱకే గాదు, పరంతు భగవంతుని కొఱకు (8–4), మఱియు మానవుని జీవదాత్మ భగవంతుని ఒక సనాతనాంశము (15–7). పోగా కర్మ ఆత్మదర్శనముకొఱకు, ఆత్మపరిపూర్తికొఱకు, ఆత్మపరిపాకము కొఱకు గాని, నేడు లేక జేపు ప్రాప్తించు దాని స్వీయ, బాహ్య, గోచర ఫలములనిమిత్తమే గాదు (2–51). సర్వ వస్తువులకు ఒక ఆంతర ధర్మము మఱియు అర్థము నుండును; అవి ఆత్మయొక్క అభివ్యక్త ప్రకృతిని వలెనే దాని పరమ ప్రకృతి నాశ్రయించి యుండును; కర్మసత్యము దానియందు నిహితమై యుండును (18–61) మఱియు నది మనస్సు మఱియు దాని క్రియయొక్క బాహ్యాకారములందు ఆనుషంగికముగాను, అపూర్ణముగాను మాత్రమే తెలుపబడును మఱియు దాని కజ్ఞానము మాఱు వేషము కల్పించును. కావున నీ స్వీయ ఉచ్చతమ మఱియు ఆంతరతమ సత్తను గనుగొని, దానియందు నివసించుటయే, మఱియు నెట్టి బాహ్య ప్రమాణము మఱియు ధర్మము ననుసరించకపోవుటయే పరమ, దోషరహిత, వ్యాసకతమ కర్మధర్మ మగును. అంతదనుక సమస్త జీవనము మఱియు కర్మ ఒక అపూర్ణత, ఒక కష్టము, ఒక సంఘర్షము, ఒక సమస్య గాక తప్పదు. నీ సత్య ఆత్మను గనుగొని, దాని యథార్థ సత్యము మఱియు దాని వాస్తవిక వస్తుస్వరూపము ననుసరించి జీవించి నపుడే, ఆ సమస్యను అంతిమరూపమున పరిష్కరించగలవు, ఆ కష్టము మఱియు సంఘర్షమును తరించగలవు మఱియు మన

కర్మలు నూతనోపలబ్ధమైన ఆత్మ మఱియు ఆత్మసత్తయొక్క భద్రతయందు దివ్యప్రామాణ్యముగల కర్మలలోనికి మాఱగలవు. కావున నీ ఆత్మ నెఱుంగుము; నీ ఆత్మ భగవంతు డనియు, అందరి ఆత్మ యనియు నెఱుంగుము; నీ జీవాత్మను భగవంతుని ఒక అంశముగా నెఱుంగుము. ఇక నీకు తెలిసిన దానియందు నివసింపుము; నీ ఆత్మయందు నివసింపుము, నీ పరమ ఆధ్యాత్మిక ప్రకృతియందు నివసింపుము, భగవంతునితో యోగయుక్తుడవు, భగవత్సదృశుడవు గమ్ము. ఎవడు నీయందు పరమోన్నతుడు మఱియు నేకమాత్రుడో, అటులే జగత్తునందు ఎవడు పరమోన్నతుడు మఱియు నేకమాత్రుడో, ముందు అతనికి నీ కర్మల నన్నింటిని ఒక యజ్ఞముగా నివేదింపుము; తుదకు ప్రపంచమున తన స్వీయ సంకల్పమును, కర్మను పరమ మఱియు వైశ్వ పురుషుడు నీ ద్వారా నిర్వహించుకొనుటకు నీ సత్త నంతను, నీవు చేయు దాని నంతను అతని హస్తములలోని కర్పించివేయుము. ఇదిగో, ఇదియే నేను నీముందుంచునట్టి పరిష్కారము మఱియు చివరకు మఱియొక పరిష్కారమే లేదని నీవు కనుగొనెదవు. (3-30, 31, 32).

2. "పురుషుడు శ్రద్ధామయుడు" : సమస్త భారతీయ శాస్త్రము వలెనే గీతయు ఏ మూలభూత విరోధము నాశ్రయించి తన ఉపదేశము జేయునో, దాని నిచ్చట ప్రతిపాదించుట ఆవశ్యకము. ఈ యథార్థ ఆత్మయొక్క దర్శనమును, మన లోపలను, సర్వములోపలను వర్తించుచున్న భగవంతుని జ్ఞానమును ఒక సామాన్య సులభ వస్తువు గాదు; మఱియు నొకవేళ నది మనస్సుచే చూడబడినను, దానిని మన చేతనయొక్క ద్రవ్యము (stuff) గాను, మన కర్మయొక్క సంపూర్ణ నిబంధనము గాను మార్చుటయు సులభము గాదు. సమస్త క్రియయు మన సత్తయొక్క కార్య సాధక అవస్థచేత నిర్ణయింపబడును మఱియు నీ కార్యసాధక అవస్థ సంతత ఆత్మ దర్శియగు సంకల్పము చేతను, సక్రియ చేతనచేతను, తన కాధారమగు గతిమయ (kinetic) వృత్తిచేతను నిర్ణయించబడును. మన స్వరూపమును, ప్రపంచముతో మన సంబంధముల అర్థమును మన సంపూర్ణ సక్రియ ప్రకృతిలో నెట్లు చూచు చున్నామో మఱియు నమ్ముచున్నామో, అదియే, అనగా మన విశ్వాసమే, మన శ్రద్ధయే (17-3) మన స్వరూపరూపమును నిర్మించును. కాని మానవచేతన ద్వివిధము మఱియు నది సత్తయొక్క ద్వివిధ సత్యమును బోలియుండును; ఏలన ఆంతర వస్తుతయొక్క సత్యము, బాహ్య రూపముయొక్క సత్యము-రెండు సత్యములు

గలవు. మానవుడు బాహ్యరూపమున నివసించు నపుడు మానవ అజ్ఞానమున వాసము చేయు మనస్సుగను, అంతర వస్తుత (reality) యందు నివసించు నపుడు దివ్య జ్ఞానమున ప్రతిష్ఠితమగు అంతరాత్మగను వర్తించును.

3. <u>మానసిక జీవుడు ప్రకృత్యధీనుడు</u> : తన బాహ్య రూపమున జగత్ సత్యము, మనము దేనిని ప్రకృతి యని పిలుతుమో, కేవలము నదియే యగును. ఆ ప్రకృతి యొక శక్తి; అదియే సత్తయొక్క సమస్త నియమముగను, యంత్ర వ్యవస్థగను పనిచేయుచు; అదియే మనస్సు మఱియు ఇంద్రియముల విషయమగు ప్రపంచమును సృజించును; మఱియు నదియే జీవునకును, అతడు నివసించు బాహ్య ప్రపంచమునకును సంబంధమును గల్పించు సాధనముగా మన ఇంద్రియములను గూడ సృజించును. ఈ బాహ్యరూపమున మానవుడు తన అంతరాత్మ, తన మనస్సు, తన ప్రాణము, తన శరీరములందు ప్రకృతిమయ ఒక ప్రాణిగా గోచరించును, అతడు ఇతరులనుండి తన శరీర, ప్రాణ, మనస్సులయొక్కయు, విశేషించి తన అహంబుద్ధియొక్కయు పార్థక్యముచేత వేఱుచేయబడును - ఈ సమస్త ప్రబల పార్థక్యము మఱియు విభేదమును గాంచు తన చేతనను దృఢపఱచి, కేంద్రభూతము గావించుకొను నిమిత్తము తనకీ అహంబుద్ధిరూపమగు సూక్ష్మ యంత్రాంగము కల్పించబడును. అతనియందలి సమస్తము, అనగా నతని ప్రాణశరీరముల క్రియ వలెనే అతని మానసికాత్మయు, దాని క్రియయు గూడ అతని <u>ప్రకృతి</u> నియమము చేతనే నిర్ణయించ బడును, దానిని దాటిపోజాలదు, అన్యథా పనిచేయజాలదు - అను నది మిక్కిలి స్పష్టమే. నిజమే, అతడు తన స్వేచ్ఛకు, తన అహంకారేచ్ఛకు ఒక స్వేచ్ఛ గలదని తలంచును; కాని నిజాని కది లేనట్లే, ఏలన అతని అహంకారము ఒక బోధము (sense) మాత్రమే, అది ప్రకృతి అతనికి కల్పించిన రూపముతో, అతని పరివర్తనశీల మనఃప్రాణశరీరములతో నతడు తాదాత్మ్యము జెంద నిర్బంధించును, అంతే. అతని అహంకారము స్వయముగా ఆమె క్రియలయొక్క ఒక ఉత్పత్తియే, మఱియు అతని అహంకారముయొక్క స్వభావమును బట్టియే దాని సంకల్పముయొక్క స్వభావ ముండును మఱియు నట్టి సంకల్పమును బట్టియే అతడు కర్మ చేసితీరును గాని, అన్యథా చేయజాలడు.

4. <u>"ప్రకృతినుంచి పుట్టిన వాడను"</u> : కావున నిదియే మానవునికి తనను గుఱించి గల చేతన, ఇదియే తన స్వీయసత్తయందు తనకుగల విశ్వాసము -

నేను ప్రకృతినుంచి పుట్టిన ఒక ప్రాణిని, వేఱుపడి యుండు ఒక అహంకారమును, ప్రకృతి గీచిన గిఱిలో, నా జీవితమునందు ఆమెకు గల ఆశయముతో, లేక ఆమె విధించిన నియమముతో సుసంగతమగు కొన్ని సంబంధములను మాత్రమే ఇతరుల తోను, ప్రపంచముతోను నేను ఏర్పరచుకొందును, అట్టి స్వీయ వికాసమును మాత్రమే సాధించుకొందును, మనస్సుయొక్క అట్టి సంకల్పమును, కామమును, భావమును మాత్రమే తృప్తిపఱచుకొందును – అని మానవుని విశ్వాసము.

5. <u>నేను ఆత్మ నను రెండవ విశ్వాసము</u> : కాని మానవుని చేతనలో ఈ కఠోర సూత్రమునందు ఇముడని మఱియొక అంశ మున్నది; జీవితముయొక్క ఇతరము, ఆంతరము నగు మఱియొక సద్వస్తువునందు అతనికి నమ్మకము గలదు, అది అంతరాత్మ వికసించిన కొలది వృద్ధి నందును. ఈ సద్వస్తువునందు జీవితసత్యమిక ప్రకృతి గాక, ఆత్మ మఱియు సత్త యగును, అది ప్రకృతి గాక పురుషుడగును. ప్రకృతి ఈ పురుషుని శక్తి మాత్రమే. అన్నింటి యందును ఏకమాత్రమగు సత్త, ఆత్మ, పురుషుడు ఈ విశ్వమునకు అధీశ్వరుడు, విశ్వము అతని ఒక ఆంశిక అభివ్యక్తి మాత్రమే (10–42). ఆ ఆత్మయే ప్రకృతి మఱియు నామె కర్మయొక్క భర్త యగును, అనుమంత యగును (13–23), అట్టి ఆత్మచేతనే ప్రకృతినియమము అనివార్యము మఱియు ప్రకృతిశక్తియు, దాని విధానములును క్రియాన్వితములు నగును. ఆమె లోని ఈ ఆత్మయే జ్ఞాత (క్షేత్రజ్ఞుడు) (13–2); కాగా ఈ జ్ఞాతయే ఆమెకు ప్రకాశ మిచ్చి, మనయందు ఆమెను సచేతనము గావించును; అంతర్యామియు, అతిచేతనము నగు అతని సంకల్పమే ఆమె క్రియా కలాపము నంతను ప్రేరించి, నడుపును. ఆ భగవంతునియొక్క ఒక అంశమే యగు మానవునియందలి అంతరాత్మ ఆయన ప్రకృతినే పంచుకొనును. పోగా, మన ప్రకృతి మన అంతరాత్మయొక్క అభివ్యక్తి మాత్రము, దాని (అంతరాత్మ) అను మతిచేతనే వర్తించును మఱియు దాని నిగూఢ ఆత్మజ్ఞానమునకును, దాని ఆత్మ చేతస్సునకును, తన చలనములు, రూపములు మఱియు మార్పులందు దాని జీవన సంకల్పమునకును రూపము కల్పించును.

6. <u>రెండవ విశ్వాసమున నూతన జీవితము</u> : మనయొక్క వాస్తవ అంతరాత్మయు, ఆత్మయు మన బుద్ధికి మఱుగునం దుండును; ఆంతర వస్తువులను

గుఱించిన దాని అజ్ఞానమును, దాని మిథ్యాతాదాత్మ్యమును, మనఃప్రాణశరీరముల బాహ్య యాంత్రికతయందు దాని విలీనతయు అందుకు గారణము. కాని మానవుని సక్రియ ఆత్మ ఒకసారి ప్రాకృత ఉపకరణములతో తనకు గల ఈ తాదాత్మ్యము నుండి వెనుదగ్గి, ఆంతర వాస్తవము (reality) ను గాంచుచు, దానికి సంబంధించిన సంపూర్ణ విశ్వాసమునందు నివసింపగల్గుచో, అప్పుడు సర్వము నూతన రూపము ధరించును - జీవనము మఱియు అస్తిత్వము నూతన రూపము ధరించును, కర్మ ఒక విభిన్న అర్థమును, స్వభావమును సంతరించుకొనును. అప్పుడిక మన సత్త ప్రకృతి నిర్మాణ మగు క్షుద్రాహంకారముగా నుండక, ఒక దివ్య, అజరామర, ఆధ్యాత్మిక శక్తియొక్క మహత్త యగును; మన చేతన ఈ పరిచ్ఛిన్న, సంఘర్ష శీల మానసిక మఱియు ప్రాణిక జీవియొక్క చేతనగా నుండక, ఒక అనంత, దివ్య, ఆధ్యాత్మిక చేతన యగును; మన సంకల్పము మఱియు కర్మ ఈ సీమిత వ్యక్తిత్వము మఱియు దానియొక్క అహంకారమునకు జెందినవిగా నుండక, ఒక దివ్య, ఆధ్యాత్మిక సంకల్పము మఱియు కర్మ యగును - మానవ రూపముద్వారా స్వేచ్ఛగా వర్తించు విశ్వమయుడు, పరమపురుషుడు, సర్వాత్మ మఱియు పరమాత్మయొక్క సంకల్పము మఱియు శక్తి యగును.

7. విశిష్టులకే దివ్యజీవ నాహ్వానము : "ఇదియే మహాపరివర్తనము మఱియు రూపాంతరము," అని చెప్పి, మానవునియందలి భగవంతుడు, అవతార పురుష డగు దివ్యగురువుయొక్క సందేశము ముందుకు నడుచును - "ఇందు నిమిత్తమే నేను విశిష్టులను పిలచుచున్నాను, వారే ఎవరు ప్రకృతినిర్మిత కరణముల అజ్ఞానమునుండి మఱలించి, తమ ఇచ్ఛను అంతరాత్మయొక్క గభీరతమ అనుభవమునకును, లోపలి ఆత్మ మఱియు సత్తను గుఱించిన వాని జ్ఞానమునకును, భగవంతునితో దాని సంపర్కమునకును, పురుషోత్తమునిలో ప్రవేశింప దానికి గల శక్తికిని త్రిప్పుదురో, అదిగో వారు విశిష్టులు. ఈ విశ్వాసమును, ఈ మహత్తర నియమమును ఆమోదించువా రందరును విశిష్టులే, 'ఇష్టులే' (18-54). ఏ మానవ బుద్ధి తన అజ్ఞానమునుండి జనించిన అస్పష్ట రూపములందును, అర్ధప్రకాశము లందును, మానవుని మానసిక, స్నాయవిక (nervous) మఱియు దైహిక విభాగముల అస్పష్టతర అభ్యాసములందును సక్తమై యుండునో, అట్టి బుద్ధికి ఆమోదము మిక్కిలి కఠినమే; కాని ఒక్కసారి ఆమోదింపబడు నేని, అది యొక

సునిశ్చిత, సముద్ధారక మహామార్గ మగును, కారణము, అది మానవ సత్తయొక్క యథార్థ సత్యముతో ఏకము మఱియు అభిన్నము, మఱియు నది అతని ఆంతరతమ మఱియు పరమ ప్రకృతియొక్క యథాభూత వ్యాపారము.

8. భేదజ్ఞానమునుండి ఏకతాజ్ఞానమునకు : (దివ్యగురువు తన సందేశమును కొనసాగించును) "కాని ఇదియొక చాల పెద్ద మార్పు, ఒక అతిమహా పరివర్తనము; నీ సమస్త సత్తాప్రకృతులను పూర్తిగా మఱలించి, మార్చివేయనిదే, దానిని సాధించజాలవు. అందునిమిత్తము సర్వోన్నతునికి, దేనికిని గాక సర్వోన్నతునికి మాత్రమే, నీ ఆత్మ, నీ ప్రకృతి, మఱియు నీ జీవితములయొక్క సంపూర్ణ నివేదన మావశ్యక మగును; కారణము, ఆ పరమునికొఱకే నీవు సర్వమును ధరించవలెను, దేని నైనను, అది భగవంతునియం దున్న రూపమున దప్ప, భగవంతుని ఒక రూపముగా దప్ప, భగవంతునికొఱకు దప్ప, నీవు ఆమోదించ గూడదు. అటులే ఒక నూతన సత్యమునకు ప్రవేశ మిచ్చు టావశ్యక మగును, అనగా తాను మఱియు పరులు, విశ్వము మఱియు భగవంతుడు, అంతరాత్మ మఱియు ప్రకృతులను గుఱించిన ఒక నూతన జ్ఞానము దిశగా, ఒక ఏకతా జ్ఞానము దిశగా, వాసుదేవః సర్వ-మను జ్ఞానము దిశగా నీ మనస్సుయొక్క సంపూర్ణ పరివర్తన మావశ్యక మగును. ఈ జ్ఞానము మొదట బుద్ధియొక్క ఒక ఆమోదముగా నుండును గాని, చివరి కది ఒక అంతర్దర్శన మగును, ఒక చేతన యగును, అంతరాత్మయొక్క ఒక శాశ్వత స్థితియు, దాని క్రియాధారము నగును.

9. పరివర్తనకు పూర్ణయోగావశ్యకత : "ఈ నూతన జ్ఞానమును, అంతర్దర్శనమును, చేతనను తన క్రియాహేతువు, ఏకమాత్రి క్రియాహేతువు గావించుకొనునట్టి సంకల్పమును ఆవశ్యక మగును. మఱియు నది అరిష్టము, పరిమితము నగు ఒకానొక క్రియాహేతువు మాత్రమే గాక, ఏ కొలది ఆవశ్యక ప్రకృతి కృత్యములకో, ఒక సాంప్రదాయిక సిద్ధికి సహాయకముగా దోచునట్టి, ఒక మత ప్రవృత్తికి ఉచితమగునట్టి ఏ కొలది వస్తువులకో, లేక ఒక వైయక్తిక విముక్తికో సంబంధించిన క్రియాహేతువు మాత్రమే గాక, సమమగు ఆత్మచే (2-48) చేపట్టబడి, భగవంతునికొఱకును (11-55), సర్వభూతహితార్థమును (3-20) చేయబడు సర్వ మానవ క్రియకును హేతువు గావలెను. ఇంకను పరమ పురుషుని గోరు ఒక

అనన్య ఆకాంక్షయందును, దివ్యపురుషుని పట్ల ఒక అనన్య ప్రేమయందును, ఒక అనన్య భగవదారాధనయందును హృదయమును పైకెత్తుటయు ఆవశ్యక మగును. మఱియు మిక్కిలి ప్రశాంతము, ప్రకాశపూర్ణము చేయబడిన హృదయము సర్వభూతముల యందును గల భగవంతుని ఆలింగనము గావించుకొనుటకు (6–31), దాని విశాలీ కరణమును ఆవశ్యక మగును. చివరకు తా నిప్పు డున్న రూపమున మానవుని కే అజ్ఞానగత మఱియు సాధారణ ప్రకృతి గలదో, అది ఒక పరమ మఱియు దివ్య ఆధ్యాత్మికప్రకృతిలోనికి మాఱవలెను. ఒక్క మాటలో నేది ఏకకాలమున ఒక పూర్ణ జ్ఞానయోగము, ఒక పూర్ణ సంకల్ప మఱియు దాని కర్మయోగము, ఒక పూర్ణ ప్రేమ, ఆరాధనా మఱియు భక్తియోగము మఱియు సంపూర్ణ సత్త, దాని సర్వవిభాగములు, శక్తులు, స్థితులు మఱియు గతులయొక్క ఒక పూర్ణ ఆధ్యాత్మిక సిద్ధియోగము – ఇవి యన్నియు నగునో అట్టి సమగ్ర యోగము ఆవశ్యక మగును.

10. <u>గీతయందలి జ్ఞానస్వరూపము</u> : "అయితే బుద్ధి అంగీకరించవలసిన, అంతరాత్మ విశ్వాసము ధరించవలసిన, మనో హృదయ ప్రాణములకు వాస్తవము, సజీవము చేయబడవలసిన ఈ జ్ఞాన మేది యగును? అది తమ ఏకతయందును, సమగ్రతయందును పరమాత్మ మఱియు పరమసత్తయొక్క జ్ఞాన మగును. ఏ ఏకమాత్రుడు నిత్యుడో. తన సవ్యక్తిక మఱియు నిర్వ్యక్తిక భూమికల కావల నెంతో పైనుండునో, అయినను ఎవనినుండియే ఇది యంతయు ప్రభవించునో, మఱియు నే ఏకుని ఇది యంతయు నానావిధ ప్రకృతియందును, ఆమెయొక్క అసంఖ్యాక రూపములందును అభివ్యక్తము చేయునో, అట్టి ఏకుని జ్ఞాన మది. తర్వాత ఆ ఏకునియొక్క ఏ నిర్వ్యక్తిక, సనాతన, అక్షరపురుషరూపము గలదో (15–16), దాని జ్ఞాన మది, ఈ అక్షరపురుషుడు మనము ఆత్మ (6–29) యని పిలుచునట్టి శాంత, అనంత వస్తువు, ఇది సమము మఱియు ఏకరసము (same); ఈ సమస్త సంతత పరివర్తనమునందును, వ్యష్టిభూత వ్యక్తిత్వములు, అంతరాత్మ శక్తులు, ప్రకృతి శక్తులు మఱియు నీ క్షణభంగుర, బాహ్య జగత్తుయొక్క రూప ములు, శక్తులు మఱియు పర్యవసానముల గాఢ సంకులమునందును ఈ ఆత్మ చలించదు, మారదు, మాఱిపోదు. చివరకు ఆ ఏకునియొక్కయే, అదే సమయా మున ప్రకృతియందు క్షణక్షణము మారుచున్నట్లు గన్పించు ఏ క్షరపురుషుడు

మఱియు శక్తిరూపము (15-16) గలదో, దానియొక్క జ్ఞానమది; ఈ క్షర పురుషుడు అంతర్నివాసిగా నుండి, ప్రతిరూపమునకు సరిపడునట్లు తన రూపమును మార్చుకొనును మఱియు తన శక్తియొక్క ప్రతి అంతస్తునకును, ప్రతి అంశమునకును, ప్రతిక్రియకును అనురూపముగా తనను దిద్దుకొనును; ఈ పురుషుడు ఈ సమస్తముకంటెను సదా అనంతగుణంబు లధికుడయ్యును, ఈ సమస్తము నగుచు, చరాచరములందును, విషయి విషయములందును, అంతరాత్మ మఱియు మనఃప్రాణ ద్రవ్యములందును, ప్రతి సత్తయందును, ప్రతి శక్తియందును, ప్రతి జీవియందును నివసించును.

11. సర్వసమగ్ర ఏకత్వము : "సత్యముయొక్క ఈయా పార్శ్వమునే అభిమానింతు వేని, నీ వీ యోగసాధన చేయలేవు. నీవు అన్వేషించ వలసిన భగవానుడు, నీవు కనుగొనవలసిన సర్వాత్మ, నీ అంతరాత్మ ఎవని సనాతనాంశమో (15-7), ఆ పరమ పురుషుడు ఏకకాలమున ఈ మూడు (క్షర అక్షర ఉత్తములు) నై యున్నది. ఒక పరమ ఏకతయందు వానిని నీ వేకకాలమున తెలియవలెను, ఏక కాలమున ఆ మూడింటిలోనికి నీవు ప్రవేశించవలెను, మఱియు సర్వ స్థితుల యందును, సర్వవస్తువులయందును ఆ ఏకునే దర్శించవలెను. అతడు ప్రకృతి యందు నివసించు క్షరపురుషుడు మాత్రమే యగుచో, అపు డొక శాశ్వత, విశ్వ మయ సంభూతి (ప్రవాహము) మాత్రమే యుండును. నీ విశ్వాసమును, జ్ఞానమును ఆ పార్శ్వమునకే పరిమితము గావింతు వేని, నీ వ్యక్తిత్వమును, క్షణక్షణము మాఱుచుండు దాని రూపములను ఎప్పుడును దాటి పోజాలవు; ఆ పునాదిపై నీవు సర్వథా ప్రకృతిభ్రమణములందు చిక్కుకొని యుందువు. కాని నీవు కాలమునందలి అంతరాత్మ – క్షణముల పరంపర మాత్రమే గావు. నీలో నీ వ్యక్తిత్వప్రవాహ మునకు ఆధారముగా నుండుఒక నిర్వ్యక్తిక ఆత్మ గలదు, అది భగవంతుని వ్యాపక, నిర్వ్యక్తిక తత్త్వముతో ఏకము, అభిన్నము. మఱియు నీ నిర్వ్యక్తికతాసవ్యక్తికతల కావల అగణ్యుడవై, ఇచ్చటి నీ సత్తయొక్క ఈ రెండు నిత్య ధ్రువములపై నాధిపత్యము వహించుచు, సనాతన పరాత్పర సత్తయందు నీవు సనాతనుడవు, పరాత్పరుడవు నై చెలంగుదువు.

12. <u>నిర్గుణాత్మ యొక్కటియే యున్నచో</u> : "పరాత్పర ఒక సనాతన నిర్గుణాత్మ యొక్కటియే సత్య మగుచో, అపుడు ప్రపంచమును, నీ అంతరాత్మయు ఎట్టి వాస్తవాధారము లేని భ్రాంతిరూపము లగును; కారణము, నిర్గుణాత్మ కర్మను జేయదు, సృష్టిని జేయదు. నీ విశ్వాసమును, జ్ఞానమును ఒక్క యీ ఏకాకి పార్శ్వమునకే పరిమితము గావింతు వేని, జీవనము మఱియు కర్మల సన్యాసమే నీకు ఏకైక తరుణోపాయ మగును. కాని ప్రపంచమునందలి భగవంతుడును, ప్రపంచమునందలి నీవును వాస్తవ సత్యములు; ప్రపంచమును, నీవును పరమపురుషుని యొక్క సత్య, ప్రవర్తమాన శక్తులు మఱియు సభివ్యక్తులు కావున జీవన, కర్మలను ఆమోదించవలెనే గాని, నిరాకరించరాదు. నిర్గుణాత్మయందును, శుద్ధ సత్తయందును భగవంతునితో ఏకుడ వగు నీవు, ఆధ్యాత్మిక వ్యక్తిత్వమునందు భగవత్ ప్రకృతియొక్క ఒక సనాత నాంశమగు నీవు, తన స్వీయ మూలమగు అనంతునిపట్ల ఆ వ్యక్తిత్వమునకు గల భక్తిప్రేమలచేత అతని వైపునకు దిరిగి, నీ బాహ్య సత్తను భగవంతునియొక్క ఒక కర్మసాధనము, ఒక వాహిని, ఒక శక్తిని జేయుము; నిజానికి అందుకే అది ఉద్దేశింపబడినది. తన యథార్థ రూపమున అది ఎల్లపుడును అట్టి సాధనమే, కాని ప్రస్తుతము అది అచేతనముగను, అపూర్ణముగను, నిమ్నప్రకృతిద్వారా మాత్రమే అట్టి సాధనము; ప్రస్తుత మది నీ అహంకారముచేత తన భగవద్రూపముయొక్క వికృతీకరణమునకు గుఱియైనది. కావున దాని నిపుడు సచేతనముగను, పరిపూర్ణముగను, అహంకారకృతమగు ఎట్టి వక్రీకరణము వినా, తన పరమ ఆధ్యాత్మిక ప్రకృతియందు భగవంతునియొక్క ఒక శక్తి యగునట్లును, అతని సంకల్పము మఱియు కర్మలయొక్క ఒక వాహన మగునట్లును జేయుము. ఈ ప్రకారముగా నీవు నీ స్వీయ సత్తయొక్క సమగ్ర సత్యమునందు నివసించెదవు, సమగ్ర భగత్సాయుజ్యమును, అనగా సంపూర్ణ, లోప రహిత యోగమును బొందెదవు.

13. <u>పరాత్పరుడు పురుషోత్తముడు</u> : "కాగా పరమోచ్చ దేవుని పురుషోత్తము డందురు: అతడు సర్వాభివ్యక్తికిని అవల వర్తించు సనాతనుడు, కాలము గాని, దేశము గాని, నిమిత్తము (causality) గాని, తన అసంఖ్యాక గుణములు మఱియు లక్షణములలో నేది యైనను గాని కల్పించు సర్వ పరిమితికిని అవల విలసిల్లు అనంతుడు. కాని తన పరమ సనాతన రూపమున అతనికి నిచ్చట జరుగు

దేనితోను సంబంధ ముండ దనియు, ప్రపంచము మఱియు ప్రకృతినుండి అతడు విచ్ఛిన్ను డనియు, ఈ సర్వభూతములనుండి విడివడి యుండు ననియు దీని అర్థము కాదు. అతడు (ఏకకాలమున) అనిర్వచనీయ పరబ్రహ్మము, అతడు నిర్వ్యక్తిక ఆత్మతత్త్వము, అతడు ఈ సర్వ సవ్యక్తిక సత్తలును. ఇచ్చటి సత్తయు, ప్రాణ ద్రవ్యములును, అంతరాత్మ ప్రకృతులును, ప్రకృతి కర్మలును అతని అనంత, సనాతన సత్తయొక్క విభిన్న రూపములు మఱియు వ్యాపారములే. అతడే అతీత పరబ్రహ్మము, సర్వము అతనినుండియే అభివ్యక్తిలోనికి వచ్చును, సర్వము అతని రూపములు మఱియు స్వీయశక్తులే. ఏకమాత్ర ఆత్మరూపమున అతడు అచ్చట సర్వవ్యాపకుడు మఱియు మానవునియందును, పశువునందును, అటులే వస్తువు నందును, విషయమునందును, ప్రతి ప్రకృతిశక్తియందును సమముగను, నిర్వ్యక్తికము గను ఉండును. అతడు పరమ అంతరాత్మ మఱియు అంతరాత్మ లన్నియు ఈ ఏక మాత్ర అంతరాత్మయొక్క అశ్రాంత జ్వాలలు. సర్వ జీవులు తమ ఆధ్యాత్మిక వ్యక్తిత్వమునందు ఏకమాత్ర పురుషుడగు అతనియొక్క అవినాశి అంశములు (15-7). అతడే అభివ్యక్త జగత్తున కంతటికి శాశ్వత నియామకుడు, లోకములు మఱియు వాని యందలి ప్రాణులకు అధీశ్వరుడు (5-29). అతడు సర్వ క్రియల యొక్కయు సర్వశక్త ప్రవర్తకుడు, తన కర్మలచేత బద్ధుడు గానివాడు, మఱియు సర్వ క్రియ మఱియు ప్రయత్నము మఱియు యజ్ఞము అతనికే చేరును (9-24). అతడు అన్నింటియందును గలడు, అతనియందు అన్నియు గలవు (6-30); అతడే అన్నియు అయ్యెను, అయినప్పటికి గూడ అతడు సర్వమునకు పైనుండును, తన సృష్టికి పరిమితుడు గాడు (10-42). అతడు పరాత్పర భగవంతుడు (8-20); అతడే అవతారరూపమున అవతరించును; అతడు విభూతులయందు (10-20,....) తన శక్తిచేత అభివ్యక్తు డగును; అతడే ప్రతి మానవ జీవునియందు గుప్తముగా నుండు ఈశ్వరుడు (18-61). మానవులు పూజించు దేవత లందరు ఆ ఏకమాత్ర దివ్య భావముయొక్క కేవలము వ్యక్తిత్వములు, రూపములు, నామములు మఱియు మానసిక తనువులు.

14. <u>తన అభివ్యక్తి నిమిత్తము తన సృష్టి</u> : "పురుషోత్తముడు తన ఆధ్యాత్మిక సారతత్త్వమునుండియు, తన స్వీయ అనంత సత్తయందును ఈ ప్రపంచ మును సృజించి, అందు నానావిధముగా తన నభివ్యక్తము గావించుకొనియున్నాడు.

సర్వ వస్తువులు అతని శక్తులు మఱియు ఆకృతులు మఱియు నతడు స్వయముగా ననంతుడు గాన, అతని శక్తులకును, ఆకృతులకును అంతము లేదు (10–19). ఒక సర్వవ్యాపక, సర్వభృత్ (13–15), నిర్వ్యక్తిక, స్వయంభూ సత్తారూపమున అతడు దేశకాలగతమగు ఈ సమస్త అనంత అభివ్యక్తిని ప్రవేశించి, ధరించును–సమముగా ధరించును, ఎట్టి పక్షపాతము, అభిరుచి, లేక ఎవనితో గాని, దేనితో గాని, ఎట్టి సంఘటనతో గాని ఎట్టి సంగము వినా ధరించును. ఈ శుద్ధ, సమ ఆత్మ కర్మ చేయుడు గాని, అన్నింటి క్రియ నంతను సమముగా, నిష్పక్షపాతముగా ధరించును. ఐయినను మఱల ఆ పురుషోత్తముడే, కాని తన విశ్వపురుష మఱియు కాలపురుష భావమున, ప్రపంచ క్రియనంతను సంకల్పించి, నిర్ణయించి నడుపును – తన నానా విధ సృజనశక్తిద్వారా నడుపును, కాలపురుషుని ఈ శక్తినే మనము ప్రకృతి యందుము. జగత్తులను సృజించి, పాలించి, సంహరించు వా డతడే. మఱియు నతడే ప్రతిప్రాణి హృదయమునందు గూడ ఆసీనుడై యుండును మఱియు విశ్వము నందలి తన విశ్వమయ సన్నిధినుండి వలెనే, వ్యక్తియందలి ఒక గుప్త సత్తగా హృదయమునుండియు ప్రకృతిబలము ద్వారా తన రహస్యసత్యముయొక్క ఒకానొక రేఖను ప్రారంభించి, అభివ్యక్తము చేయును – ప్రకృతియొక్క గుణమునందు దానిని ప్రారంభించును, ప్రకృతియొక్క నిర్వాహక శక్తియందు దానిని అభివ్యక్తము చేయును మఱియు నటులే ప్రతి ప్రాణిని దాని జాతి ననుసరించి రూపొందించుచు, సర్వ క్రియను ప్రారంభించి, ధరించి యుండును. పురుషోత్తమునియం దుండి ప్రారంభించు ఈ అతీత ప్రథమారంభణమును, వస్తువులయందును, ప్రాణులయందును జరుగు అతని సంతత విశ్వగతాభివ్యక్తియును, వ్యక్తిగతాభివ్యక్తియును – ఈ త్రివిధత్వమే ప్రపంచ స్వభావముయొక్క జటిలతకు గారణము.

15. <u>మూడును శాశ్వత సత్యములే</u> : "ఈ మూడును పరమ పురుషుడు, భగవంతునియొక్క నిత్య, శాశ్వ తావస్థలు : 1, అతని ఈ ఏకమాత్ర సనాతన, అక్షర స్వయంసిద్ధ సత్త, అది ఎప్పుడు, శాశ్వతముగా నుండును, అది సర్వ, సత్తామయ (existent) వస్తువులకు మూలము మఱియు ఆధారము. 2, ప్రకృతి గతమగు అతని క్షరపురుష తత్త్వము (15–16), ఇదియు నెల్లపుడు, శాశ్వతముగా నుండును, ఈ క్షరపురుషుడు ప్రకృతిచేత నీ సర్వ భూతముల రూపమున వ్యక్తముచేయబడును. 3, అతని సర్వాతీత దివ్యభావము, ఇదియు సర్వదా, శాశ్వతముగా నుండునదే.

ఈ దివ్యపురుషుడు ఏకకాలమున తదితరమగు ఆ ఉభయపురుషులును కాగలడు – విశుద్ధ, ప్రశాంతపురుషుడును గాగలడు, సృష్టి చక్రములందు సక్రియ అంతరాత్మ మఱియు జీవనమును గాగలడు; ఏలన ఈ రెండింటిని విడిగా తీసికొన్నను, కలిపి తీసికొన్నను, వానికంటె నతడు అన్యుడు మఱియు నధికుడు. మనయందలి జీవుడు ఈ పురుషోత్తమునినుండి వెలువడిన ఒక పురుషుడే, అతనియొక్క ఒక సచేతన శక్తియే. అతడే తన గభీరతమ ఆత్మయందు అంతస్థ భగవంతుని (immanent Divine) సప్తమును వహించును మఱియు ప్రకృతిగతుడై విశ్వరూప భగవంతుని యందు (universal Divine) వసించును – ఈ విశ్వరూప భగవంతుడు ఒక తాత్కాలిక సృష్టి మాత్రమే గాక, సనాతన ఆత్మయందును, సనాతన అనంతునియందును (4–35) కర్మచేయుచు, చరించుచు నుండు ఒక సనాతన విశ్వాంతరాత్మ.

16. క్షరావస్థయందు నివసించి నప్పుడు: "మనలోని సచేతన జీవాత్మ పరమ పురుషునియొక్క ఈ మూడు అవస్థలలో దేని నైనను స్వీకరించ గలడు. మానవుడు ప్రకృతియొక్క క్షరభావమునందు, క్షరభావమునందు మాత్రమే నివసించ గలడు: అపు డతడు తన వాస్తవాత్మ నెఱుంగక, తనలోని భగవంతు నెఱుంగక, ప్రకృతిని మాత్రమే ఎఱుంగును: అత డామెను యాంత్రికమగు కార్యనిర్వాహక మఱియు సృజనాత్మక శక్తిగా దర్శించి, తనను, ఇతరులను ఆమె సృష్టిగా జూచు కొనును – తాను, ఇతరులు ఆమె సృష్టిలోని అహం – వ్యక్తులు, పృథగ్భూత సత్తలు. ఇట్లు ఉపరితలమున మాత్రమే అత డిపుడు నివసించును మఱియు నట్లు నివసించుచు, తన బాహ్యచేతన నతిక్రమించి, తన లోపలి సత్యమును తెలియనంత కాలము, అతని ఆలోచన మఱియు విజ్ఞాన (science) మంతయు తెరలపైనను, ఉపరితలములపైనను వచ్చి పడు లోని ప్రకాశముయొక్క బాహ్యచ్ఛాయ మాత్రమే కాగలదు. ఇట్టి అజ్ఞానము సంభవము మాత్రమే గాక, అతనిపై విహితము (imposed) గూడను; ఏలన లోని ఈశ్వరుడు తన స్వీయ శక్తియొక్క ఆవరణ చేతనే మఱుగుపడియుండును (7–25). ఆ ఈశ్వరునియొక్క అధికతర సత్యము మన దృష్టి కగుపించదు; కారణము అతడు తన ఒక ఆంశిక ఆవిర్భావమునందు తాను సృజించిన వస్తువులతోను, తన ప్రతిమలతోను పూర్ణముగా తనను తాదాత్మ్యము జెందించుకొనును మఱియు తాను సృజించిన మనస్సును తన స్వీయ ప్రకృతియొక్క వంచనశీల క్రియలయందు పూర్ణముగా లీన మొందించును. మఱియు

కూడ అజ్ఞానము సంభవమగుటకు మఱియొక కారణ మేమనగా, ఏ వాస్తవ, సనాతన, ఆధ్యాత్మిక ప్రకృతి వస్తువుల స్వరూపముయొక్క గంభీర రహస్యమో, అది ఆ వస్తువుల బాహ్య రూపమునం (దింకను) అభివ్యక్తము గాలేదు (15-16). బహిర్ముఖులమై నప్పుడు మన మే ప్రకృతిని జూతుమో, ఏ ప్రకృతి ఇంద్రియ మనః శరీరములందు పనిచేయునో, అది ఒక నిమ్న సామర్థ్యము, ఒక వికృతి, అది ఒక ఇంద్రజాలికుడు, అది పరమాత్మకు ఆకారములను గల్పించి, ఆ ఆకారములలో ఆతనిని మఱుగుపఱచును; సత్యమునకు మాయావేషము వేసి, మానవు లా వేషమునే చూచు నట్లు చేయును; ఆ నిమ్న సామర్థ్యముయొక్క పరిధిలో భగవదభివ్యక్తియొక్క గౌణ, హీన మూల్యముల రాశియే యుండును గాని, పూర్ణ శక్తి, మహిమ, ప్రహర్షము మఱియు మధురిమలయొక్క దివ్య సముదాయ ముండదు. మనయందలి ఈ ప్రకృతి అహంకారముయొక్క ఒక మాయ, ద్వంద్వముల ఒక గ్రంథి, అజ్ఞానముచేతను, త్రిగుణములచేతను గల్పించబడిన ఒక జాలము. కాగా ఎంతదనుక మానవుని అంతరాత్మ మనఃప్రాణదేహముల బాహ్య సత్యమునందే గాని, అతని ఆత్మ మఱియు మూల సత్తయందు నివసించదో, అంతదనుక తమ వాస్తవరూపమున భగవంతుని, తనను, ప్రపంచమును మానవుడు గనజాలడు, ఈ మాయను అతిక్రమించజాలడు, కావున ఆ మాయయొక్క అంశములతోను, రూపములతో తాను చేయగలిగినది చేయుచు, తృప్తిపడక తప్పదు.

17. <u>అక్షరావస్థయందు నివసించినపుడు</u> : "తన ప్రకృతియొక్క ఏ నిమ్న స్థితియందు వా డిప్పుడు నివసించుచున్నాడో, దానినుండి ఉపసంహరించుకొని, అంధకారమే యగు తన ఇప్పటి ప్రకాశమునుండి మేల్కొను నేని, మానవుడు సనాతనము, అక్షరము నగు స్వయంభూ ఆత్మసత్తయొక్క ప్రకాశమయ సత్యమునందు నివసించుట సంభవమే. అప్పు డిక నతడు తన వ్యక్తిత్వముయొక్క ఇఱుకు కారాగారమునందు బద్ధుడై యుండడు, కొంచెము నిమిత్తము, ఏది ఆలోచించుచు, కర్మచేయుచు, వేదనబొందుచు, ప్రయాసపడునో మఱియు శ్రమజేయునో, అట్టి చిన్న నేనుగా తన్ను జూచుకొనడు. అతడు విశుద్ధాత్మయొక్క వ్యాపక, విముక్త నిర్వ్యక్తికతయందు లీనమగును; అతడు బ్రహ్మ మగును; అన్నింటియందలి ఏకాత్మతో నేకముగా తన నెఱుంగును. అతని కిక అహంకారబోధమే యుండదు, అత డిక ద్వంద్వములచేత వ్యథితుడు గాడు, దుఃఖముయొక్క సంతాపమును గాని,

హర్షము యొక్క కల్లోలమును గాని అనుభవించడు, కామమునకు చలించడు, పాపముచేత పరితప్తుడు గాని (4-36) పుణ్యముచేత పరిమితుడు గాని కాడు. అథవా వీని ఛాయలు నిలిచియుండు నేని, తన గుణములయందు పనిచేయుచున్న (3-28) ప్రకృతిరూపములుగానే వానిని చూచును, మఱియు నెఱుంగును గాని, తా నిప్పుడు దేనియందు నివసించుచున్నాడో, అట్టి తన స్వీయ సత్యముయొక్క రూపములుగా గాదు. ప్రకృతియే కర్మచేయుచు (13-30), తన యంత్రప్రాయ ఆకృతులను రూపొందించును : కాని శుద్ధ ఆత్మ సదా నిశ్చలము, నిష్క్రియము, విముక్తము. శాంతము, ప్రకృతిక్రియలచేత అస్పృష్టము నగు ఆత్మ ఒక పూర్ణ సమతతో ఆ క్రియలను నిరీక్షించును మఱియు తనను వానికంటె భిన్నముగా నెఱుంగును. అయినను ఈ అధ్యాత్మికావస్థ తనతో నొక నిశ్చల శాంతిని మఱియు విముక్తినే గొనివచ్చును గాని, సక్రియ దివ్యతను గాదు, సమగ్ర సిద్ధిని గాదు. అది యొక మహాసోపానమే గాని, సమగ్ర భగవద్ - జ్ఞానమును, సమగ్ర ఆత్మ జ్ఞానమును గాదు.

18. <u>సమగ్ర భగవంతునియందు నివసించి నపుడు</u> : "పరమ మఱియు సమగ్ర భగవంతునియందు నివసించి నపుడు మాత్రమే పూర్ణ పరిపూర్ణత సిద్ధించగలదు. అప్పుడు మానవుని అంతరాత్మ, అది దేనియొక్క అంశమో, అట్టి భగవత్స్వరూపముతో యుక్తమగును; అప్పుడది ఆత్మయందును, సత్తయందును సర్వభూతములతో నేకముగా నుండును, భగవంతుడు మఱియు ప్రకృతి - రెండింటియందును సర్వభూతములతో నేకముగా నుండును; అప్పు డది విముక్తము మాత్రమే గాక, సంపూర్ణమునయి, పరమానందములో మునిగితేలుచు, చరమ సంసిద్ధికి సిద్ధపడును (18-53). ఇంకను మానవుడు ఆత్మను, సర్వవస్తువులను శాంతముగా ధరించుచున్న ఒక సనాతన, నిర్వికార సత్తగా జూచును; కాని అత డిక ప్రకృతిని, గుణముల యాంత్రికత ననుసరించి వస్తువుల రూపొందించు ఒక యాంత్రిక శక్తిగా మాత్రమే గాక, అభివ్యక్తియందు ఆత్మ సత్తయొక్క ఒక శక్తిగను, భగవంతుని యొక్క ఒక బలము (force) గను జూచును. నిమ్న ప్రకృతి ఆత్మ క్రియయొక్క అంతరతమ సత్యము గాదని అతడు చూచును; భగవంతునియొక్క ఒక సర్వోన్నత అధ్యాత్మిక ప్రకృతి నతడు తెలియవచ్చును, ఈ ప్రకృతిలోపలనే మనః ప్రాణ శరీరములం దిపుడు అపూర్ణముగా రూపొందియున్న సర్వమునకు మూలమును,

ఇంకను వ్యక్తముగావలసిన దాని అధికతర సత్యమును గలదని అతడు గుర్తించును. నిమ్నతర మానసిక ప్రకృతినుండి పరమ ఆధ్యాత్మిక ప్రకృతిలోనికి ఉద్గమించి, ఒప్పు డతడు సమస్తాహంకారము నుండియు బైటబడును. అప్పు డతడు, "నే నొక ఆధ్యాత్మిక పురుషుడను, నా మూలసత్తయందు సర్వ భూతములతో ఏకుడను, మఱియు నా సక్రియ ప్రకృతియందు ఏకమాత్ర భగవత్ ప్రకృతియొక్క ఒక శక్తిని మఱియు [illegible] అనంతునియొక్క సనాతనాంశమగు ఒక అంతరాత్మను."—అని తన తెలుసుకొనును. అతడు సర్వమును భగవంతునియందును, సర్వమునందును భగవంతుని గాంచును; మఱియు నతడు సర్వవస్తువులను వాసుదేవునిగా జూచును (7-19). హర్షశోకములను గల్గించు ద్వంద్వములనుండియు, ప్రియాప్రియములనుండియు, [illegible] మఱియు ఆశాభంగములనుండియు, పుణ్యాపాపములనుండియు ఇప్పు డతడు ముక్తుడు. ఇకనుండి సర్వమును అతని జ్ఞానమయ దృష్టికిని, అనుభవమునకును భగవంతునియొక్క ఇచ్ఛయు, ఇచ్ఛాక్రియయు నగును. అత డొక అంతరాత్మగను, దైవచేతన మఱియు శక్తియొక్క ఒక అంశముగను జీవించును మఱియు కర్మచేయును; అతడు లోకోత్తర దివ్యాహ్లాదముతో, ఆధ్యాత్మికానందముతో నిండి యుండును. అతని క్రియ దివ్య క్రియ యగును మఱియు నతని ప్రతిపత్తి (స్థానము) సర్వోన్నత ఆధ్యాత్మిక ప్రతిపత్తి యగును.

* * *

19. బుద్ధియోగము ప్రథమసోపానము : "ఎవరు తమ లోపలి దివ్యవాణి నాలకించగలరో, ఎవ రీ విశ్వాసమును, జ్ఞానమును ధరింప సమర్థులో, ఇదిగో, నేను వారిముం దుంచు పరిష్కార మిదియే, మోక్ష మిదియే, సంసిద్ధి యిదియే. కాని ఈ సర్వోత్కృష్ట స్థితి కారోహించదలంచిన, ప్రథ మావశ్యకతగా, ఆద్యమౌలిక సోపానముగా నిమ్న ప్రకృతికి జెందిన దాని యంతటినుండియు నీవు విముఖుడవు గావలెను (2-45), సంకల్పము మఱియు బుద్ధియొక్క ఏకాగ్రతద్వారా ఏది ఆ సంకల్పముకంటెను గాని, బుద్ధికంటెను గాని ఉచ్చతరమో; ఏది మనోహృదయములు మఱియు నింద్రియశరీరములకంటెను ఉచ్చతరమో, దానియందు నిన్ను నీవు స్థాపించుకొనవలెను (3-43. 2-53). మఱియు మున్ముందు నీవు, ఏది విశ్వాతీతమో మఱియు సర్వ ప్రాణులయందును ఏకమాత్రమో, అట్టి నీ స్వీయ

నిత్య, అక్షరాత్మ వైపునకు దిరుగవలెను. ఎంత కాలము నీవు అహంకారము నందును, మానసిక వ్యక్తిత్వమునందును నివసింతువో, అంత కాలము సదా ఒకే గాడిలో అనంతముగా పరిభ్రమింతువే గాని, దానివలన ఎట్టి పరిణామము నుండదు. కావున హృదయము మఱియు దాని కామనలు, ఇంకను ఇంద్రియములు మఱియు వాని ఆకర్షణల కావల నీ సంకల్పమును లోనికి ద్రిప్పుము; అటులే ఆ సంకల్పమును మనస్సు మఱియు దాని సాహచర్యములు, సంగములు మఱియు దాని పరిచ్ఛిన్న అభిలాషలు, ఆలోచనలు, ఆవేగముల కావల పైకి నుద్ధరింపుము. ఏది సనాతనము, నిత్య-నిర్వికారము, ప్రశాంతము మఱియు నిరాకులమో, ఏది సర్వ వస్తువులు, వ్యక్తులు మఱియు ఘటనల పట్ల సమము మఱియు నిష్పక్షపాతమో, అటులే ఏది కర్మచేత ప్రభావితము గాదో, ప్రకృతి గల్పించు రూపములచేత పరివర్తితము గాదో, అట్టి నీలోపలి ఒకానొక వస్తువును జేరుకొనుము. చేరుకొని, అదిగా నుండుము, సనాత నాత్మగా నుండుము, బ్రహ్మగా నుండుము (2-72). ఒక శాశ్వత ఆధ్యాత్మి కానుభవముచేత నీవది కాగల వేని, నీకొక సునిశ్చి తాధారము లభించును. దానియందు స్థితుడవై నీ మనఃసృష్ట పరిమితులనుండి బైటబడుదువు, శాంతి మఱియు జ్ఞానమునుండి ఎట్టి చ్యుతిభయము నెఱుంగని భద్రత నందెదవు, అహంకారమునుండి సర్వథా ముక్తుడ వగుదువు.

20. <u>కామము జ్ఞానశత్రువు</u> : "ఎంతదనుక అహంకారమును గాని, దానికి సంబంధించిన దేనినైనను గాని పాలించి పోషింతువో, దాని కంటిపట్టుకొని యుందువో, అంతదనుక నీవు నీ సత్తనిట్లు నిర్వ్యక్తికము చేయుట సాధ్యము గాదు. కామము మఱియు దానినుండి ఉద్భవించు క్రోధము (3-37) - ఇవియే అహంకారముయొక్క ప్రధాన లక్షణము మఱియు సుదృఢ గ్రంథి. నేను, నాది - యని సదా నీచే అనిపించునది కామమే మఱియు నది దృఢనివిష్టమగు ఆ నేను-ద్వారా తృప్తి మఱియు నతృప్తులకు, ఇష్టానిష్టములకు, ఆశానిరాశలకు, హర్షశోకములకును నిన్ను అధీనముచేయును; నీ క్షుద్రమగు రాగద్వేషములకు, క్రోధావేశములకును అధీనముచేయును; సాఫల్యము మఱియు ప్రియవస్తువులయందు నీ సంగమునకు, వైఫల్యము మఱియు అప్రియ వస్తువులు గొనివచ్చు శోకసంతాపలందు నీ సంగమునకును నిన్ను అధీనముచేయును. కామము సదా మనస్సును వ్యాకులపఱచును, ఇచ్ఛను పరిమితము చేయును, వస్తువులను అహం-కోణమునుండి వంకరగా జూపిం

చును, జ్ఞానమును స్ఫురించనీయక, మఱుగుపఱచును. కామము మఱియు దాని అభిరుచులును, ప్రవేగములును పాపము మఱియు పొరపాటుయొక్క ప్రథమ, ప్రబల మూలకారణము. నీవు కామమును పోషించు నంత కాలము, ఎట్టి నిశ్చింత, నిష్కళంక స్వస్థత గాని, ఎట్టి సుస్థిర ప్రకాశము గాని, ఎట్టి ప్రశాంత, విశుద్ధ జ్ఞానము గాని యుండజాలదు; ఎట్టి యథార్థ సత్తావస్థయు నుండజాలదు. కారణము, కామము సత్తయొక్క ఒక వికృతావస్థ; యథార్థ ఆలోచన, క్రియ మఱియు భావనలకు ఎట్టి గట్టి పునాదియు నుండజాలదు. ఏ రంగులో కామమును మన నిచ్చినను, అది ప్రాజ్ఞవర్యులకు సైతము సంతత భయకారణ మగును మఱియు మనస్సును, తాను అర్జించిన ఎంతో దృఢము, భద్రము నగు ఆధారమునుండి సైతము, వంచనతో గాని, ప్రసభముగా గాని, (2-60) నెట్టివేయగలదు. ఇట్లు కామము ఆధ్యాత్మిక సిద్ధికి ప్రధాన శత్రువు.

21. <u>కామమునుండి వేఱుపడుము</u> : "కావున కామమును వధించుము (3-41); పదార్థముల బాహ్యరూపముల పరిగ్రహము (possession) నందును, ఉపభోగమునందును సంగమును దూరముచేసికొనుము (4-21). బాహ్య స్పర్శలు మఱియు అభ్యర్థనల రూపమునను, మనస్సు మఱియు ఇంద్రియముల విషయ రూపమునను ఏది నీకడకు వచ్చునో, దానియంతటినుంచి నిన్ను నీవు వేఱుపఱచుకొనుము (3-28). కామాది వికారముల వేగమును సహించి, నిరాకరించ నేర్చుకొనుము (2-14, 15), మఱియు నవి నీ బాహ్యాంగములయందు చెలరేగుచున్న సమయమునందు సైతము నీ లోపలి ఆత్మయందు పదిలముగా నుండుటను అలవఱచుకొనుము; అట్లు చేసిన చివరి కవి నీ ప్రకృతియందలి ఏ భాగమును కదిలించలేని స్థితి వచ్చును (2-70). అటులే హర్షశోకముల బలవదాక్రమణలను, మందతమ సకపట స్పర్శలను సైతము సహించి, వెడలగొట్టుము. ఇష్టానిష్టములను దూరము చేయుము, రుచిని, అరుచిని మట్టుబెట్టుము, సంకోచ జుగుప్సలను పాఱదోలుము. వీని పట్లను, నీ ప్రకృతియందలి సమస్త కామనావిషయముల పట్లను శాంత ఉదాసీనతను పెంపొంద నిమ్ము (14-23). నిర్వ్యక్తి కాత్మయొక్క నీరవ, ప్రశాంత దృష్టితో వాని నవలోకించుము.

22. <u>సాక్షిత్వ ఫలితము పరమ సమత</u> : "దీని ఫలితము ఒక సర్వ సమత మఱియు చలించని శాంతిశక్తి యగును, ఈ సమతాశాంతులనే విశ్వాత్మ

తన సృష్టిసమ్ముఖమున ధరించియుండును, వానితోనే ప్రకృతియొక్క బహువిధ క్రియాకలాపమును సదా సంబాళించును. సమ దృష్టితో జూడుము; సాఫల్య వైఫల్యములను, సమ్మానావమానములను, మానవుల ఆదర ప్రేమలను మఱియు వారి తిరస్కార ద్వేష, హింసనములను, ఇంకను ఇతరులకు సంతోషకారణము లేక శోకకారణము నగు ప్రతిఘటనను—ఒక్క మాటలో నీకు ప్రాప్తించు సర్వమును సమచిత్తముతో (13–10), సమ హృదయముతో స్వీకరించుము. సజ్జన దుర్జనులను, ప్రాజ్ఞ పామరులను, బ్రాహ్మణ ఛండాలురను, మానవోత్తముని మఱియు క్షుద్ర కీటకమును సమదృష్టితో జూడుము (6–9). సుహృదుడు మఱియు మిత్రుడు, మధ్యస్థుడు మఱియు ఉదాసీనుడు, విరోధి మఱియు శత్రువు, ప్రేమి మఱియు ద్వేషి—ఇట్లు మానవులు నీతో నే సంబంధములు గలిగి యున్నను, నీవు మాత్రము వారిని సమభావముతో కలిసికొనుము. ఇవి అహంకారమును స్పృశించు సంబంధ ములు కాగా, నీ వా అహంకారమునుండి ముక్తుడవు గమ్ము : ఇది నీకు నా ఉపదేశము. ఇవి సవ్యక్తిక సంబంధములు మఱియు నీ వందరిని నిర్వ్యక్తిక సత్త యొక్క గభీరదృష్టితో నిరీక్షించవలెను. ఇవి కాలగత మఱియు వ్యక్తిగత విభేద ములు, నీవు వీనిని గుర్తించదగును గాని, వానిచేత ప్రభావితుడవు గాగూడదు; ఏలన నీ వీ విభేదములయందు నెలకొనక, ఏది అన్నింటియందును సమమో, అన్నియు నగు ఏకాత్మయో, దానియందు నెలకొనవలెను, ప్రతిప్రాణియందలి భగవంతునియందును, ఏకమాత్ర ప్రకృతిక్రియయందును నెలకొనవలెను—మానవులు, వస్తువులు, శక్తులు మఱియు ఘటనలందును, జగత్ప్రయాసముయొక్క సమస్త ప్రయత్నము మఱియు ఫలితము మఱియు సర్వవిధ పరిణామమునందును సమమగు భగవదిచ్ఛయొక్క వ్యక్తరూపమే ప్రకృతిక్రియ గనుక.

23. ఆత్మయందు నిష్క్రియత, అంగములందు సక్రియత : "నీయం దింకను కర్మ జరుగును, కారణము, ప్రకృతి సదా కర్మరతము; కాని నీ ఆత్మ మాత్రము కర్మకర్త గాదని నీ వెఱింగి, అనుభవించవలెను. ప్రకృతి క్రియాకలాప మును, ఆమె గుణముల ఖేలనమును, ఆమె విధానముల ఇంద్రజాలమును కేవలము చూచుచుండుము, చలించక చూచుచుండుము. నీలో ఈ ప్రకృతిక్రియను నిరీక్షిం చుము; నీ నలువైపుల దృష్టి సారించి, ఆ ప్రకృతిక్రియనే అందరిలోను జూడుము. తర్వాత, నీయొక్కయు, వారియొక్కయు కర్మఫలితము గూడ నీవు లేక వారు కోరిన

లేక ఉద్దేశించినది గాక, నీది గాని, వారిది గాని కాక, ఇచ్చట విశ్వప్రకృతియందు ఇచ్ఛించి, కర్మచేయునట్టి ఒకానొక మహత్తర శక్తిచేత అప్రతిహతముగా పూర్వమే నిర్ణీత మనియు నీవు గుర్తించుము. చివరకు నీ కర్మలయందలి ఇచ్ఛ సైతము నీది గాక, ప్రకృతిదే యని పరీక్షించుము. అది నీయందలి అహంభావముయొక్క ఇచ్ఛ మఱియు నది నీ స్వభావరచనయందలి ప్రధాన గుణముచేత నిర్ణీతమగును, కాగా ఆ ప్రధానగుణము ప్రకృతి నీయందు గతమున వికసింపజేసినది గాని, ఇపుడు చేయుచున్నది గాని కావచ్చును. ఆ యిచ్ఛ నీ ప్రాకృతవ్యక్తిత్వముయొక్క ఖేలనముపై నాధారపడును మఱియు ప్రకృతినిర్మాణమగు ఆ వ్యక్తిత్వము నీయందలి సత్య పురుషుడు గాదు. ఈ బాహ్య నిర్మాణమునుండి నీ లోపలి నిష్క్రియాత్మ లోనికి జరుగుము. అప్పుడు సత్యపురుషుడ వగు నీవు నిష్క్రియుడవు, కాని ప్రకృతి తన గుణముల ననుసరించి తన కర్మలను సదా సాగించుచునే యుండు నని నీవు చూచెదవు. ఈ ఆంతర నిష్క్రియత మఱియు నీరవతయందు నిన్ను నీవు స్థాపించు కొనుము : కర్తగా నిక నిన్ను నీవు చూచుకొనకుము. గుణముల విక్షుబ్ధ క్రియనుండి విముక్తుడవై, గుణఖేలనమునకు పైన, నీలోనే వంతఃస్థితుడవై యుండుము. నిర్వ్యక్తిక సత్తయొక్క విశుద్ధియందు భద్రముగా వాసముచేయుచు, నీ అంగములందింకను నిలిచియుండు మర్త్యతరంగములచే వ్యథితుడవు గాక విలసిల్లుము.

24. <u>ఆత్మస్థితివలన మహావిముక్తి</u> : " నీ విట్లు చేయగల వేని, ఒక మహావిముక్తిలోనికి, ఒక విశాల స్వాతంత్ర్యములోనికి, ఒక గభీర శాంతిలోనికి ఉద్ధరింపబడి నట్లు నిన్ను నీవు గనుగొందువు. అపుడు భగవంతుని ఎఱుకయు నీకు గలుగును మఱియు నీ వమరుడ వగుదువు, అనాది స్వయంభూ సత్త నీది యగును, మనః ప్రాణ శరీరములపై నాధారపడవు, నీ ఆధ్యాత్మిక సత్తపట్ల నీకు నిశ్చయ మేర్పడును, ప్రకృతిప్రతిక్రియలు నిన్ను స్పృశింపవు, చివరకు ప్రకోపము మఱియు పాపము, అటులే కష్టము మఱియు శోకములచేత కళంకితుడవు గావు. అపుడు నీ సంతోషముకొఱకు నీవు ఎట్టి మర్త్య లేక బాహ్య లేక లౌకిక వస్తువు మీద నాధారపడవు, దానిని కోరవు (3-18), పరంతు ప్రశాంత మఱియు సనాతన ఆత్మసత్తయొక్క స్వయంపర్యాప్త ఆనందము విడదీయరాని విధముగా నీదియగును. అప్పుడిక నీవు మానసిక ప్రాణిగా నుండుటను విరమించి, అపరిమేయ ఆత్మవు, బ్రహ్మవునై యుండెదవు. మఱియు నీ మనస్సునుండి సమస్త ఆలోచనాబీజమును, సమస్త

కామనామూలమును పెఱికివేసి, శరీరజన్మకు సంబంధించిన మనశ్చిత్రమును చెఱిపి వేసి, అంతకాలమున (8-10) శుద్ధ బ్రహ్మమునందు ఆ మనస్సు నేకాగ్రపఱచియు, ఆ అనంత, నిరపేక్ష బ్రహ్మములోనికి నీ చేతన నంతను ఒక మహాసంక్రమణము ద్వారా పంపించియు శాంతాత్మయొక్క అనాది సత్తలో నీవు లీనము కాగలవు (2-72).

***

25. <u>విముక్తికి పిమ్మట విముక్తకర్మ</u> : "అయినను ఇదియే యోగము యొక్క సమగ్ర సత్యము గాదు మఱియు ఈ పర్యవసానమును, ప్రస్థాన మార్గమును – అవి ఒక మహాపర్యవసానమును, ఒక మహామార్గము నయినప్పటికి – నేను నీకు ప్రస్తావించు లక్ష్యము మాత్రము గాదు. ఏలన నేను నీలోని సనాతన కర్మిని (worker) మఱియు నీనుండి కర్మల నపేక్షించుచున్నాను (18-61. 4-15). ఏ ప్రకృతిక్రియనుండి నీ ఆత్మయందు నీవు పూర్తిగా వేఱుపడి, ఉదాసీనుడవు, దూరస్థుడవు నయి ఉందువో, ఆ యాంత్రిక క్రియకు నీనుండి ఒక నిష్క్రియ (passive) అనుమతిని గాదు నే నపేక్షించునది, వరంతు భగవంతునికి ఒక ఇచ్ఛాపూర్వక, జ్ఞానయుక్త ఉపకరణరూపమున నీచే జేయబడు సర్వాంగీణ మఱియు దివ్య కర్మనే, నీయందును, ఇతరులయందును గల భగవంతునికొఱకును (6-31), లోకసంగ్రహార్థమును (3-25) చేయబడు దివ్యకర్మనే నీనుండి నే నపేక్షించుచున్నాను. నిజమే, పరమ, ఆధ్యాత్మిక ప్రకృతియందలి సిద్ధికి ఒక సాధనగా (3-19) ఈ కర్మను మున్ముందు నీముందుంచి నప్పటికి, తర్వాత ఆ సిద్ధిలో నొక భాగముగా గూడ దానిని నీకు విధించుచున్నాను (3-25) ; కర్మ భగవంతుని గుఱించిన సమగ్ర జ్ఞానముయొక్కయు, అతని అధికతర గుహ్య సత్యము యొక్కయు (15-17), భగవంతునియందు సంపూర్ణ నివాసముయొక్కయు (12-8) ఒక అంగము ; సిద్ధి మఱియు విముక్తి లభించిన పిమ్మట సైతము కర్మను చేయగలడు మఱియు చేయవలెను (3-20). నేను నీనుండి జీవన్ముక్తుని క్రియను (4-23), సిద్ధమానవుని కర్మను (4-41) అపేక్షించుచున్నాను. ఇంతకుముందు వర్ణించబడిన యోగమునకు మఱికొంత కలుపవలసియున్నది – ఏలన అది జ్ఞాన

ప్రధానమగు ప్రథమయోగము మాత్రమే. భగవదనుభవముయొక్క ప్రకాశమునందు జేయబడు ఒక కర్మయోగమును గలదు (3-25. 6-31); కర్మను జ్ఞానముతో ఏకాత్మకము చేయగలము (4-33). ఏలన పూర్ణ ఆత్మదర్శనమునందును, పూర్ణ భగవద్దర్శనమునందును చేయబడు కర్మలు, ప్రపంచమునందు భగవంతుని, ప్రపంచమును భగవంతునియందు జూచుచు జేయు కర్మలు జ్ఞానముయొక్క ఒక వృత్తియే, ప్రకాశముయొక్క ఒక వృత్తియే యగును, ఆధ్యాత్మిక సంసిద్ధికి ఒక అపరిహార్య సాధనమును (3-20), దానియొక్క అంతరంగ భాగమును (4-24) అగును.

26. <u>సక్రియ పురుషునిగా భగవద్దర్శనము</u> : " ఏ పరమ పురుషుని శుద్ధ, నీరవ ఆత్మరూపమున మనము కలిసికొనవచ్చునో, అతని నొక విశాల, సక్రియ పురుషరూపమున సైతము కలిసికొనగలము ; అతడే సర్వ కర్మల నారంభించును (10-8), అతడే లోకేశ్వరుడు, అతడే మానవుని యజ్ఞ తపః కర్మల నియామకుడు (5-29) - అని తెలియగలము. కావున, ఈ జ్ఞానమును సైతము మన మిపుడు ఉన్నత నిర్వ్యక్తిక తానుభవమునకు కలుపవలెను. పైకి స్వయముగనే సాగుచున్నట్లు గన్పించు ఈ యాంత్రిక ప్రకృతివ్యాపారమునందు ఒక అంతర్వాసి దివ్య సంకల్పము దాగియున్నది (17-6), అదియే దానిని నిర్బంధించి నడుపుచు, దాని లక్ష్యముల రూపమును నిర్ణయించును. కాని నీ వ్యక్తిత్వముయొక్క ఇఱుకు గదిలో మూయబడియు, అహంకారము మఱియు దాని కామముల దృక్కోణముచేత అంధీభూతుడవు, శృంఖలాబద్ధుడవు నయి యున్నంత కాలము ఆ దివ్య సంకల్పము నీకు తోచదు, నీకు తెలియదు (3-27). ఏలన జ్ఞానముచేత నీకు నిర్వ్యక్తికత ప్రాప్తించి నపుడే, అన్ని వస్తువులను ఆత్మ మఱియు భగవంతునియందును, అటులే ఆత్మను మఱియు భగవంతుని అన్ని వస్తువులయందును చూడదగు విశాలత నీకు అబ్బి నపుడే, నీ వా సంకల్పమునకు పూర్తిగా ప్రతిస్పందించగలవు. ఇచ్చట సర్వమును పరమ పురుషుని శక్తిచేతనే సంభవించును ; వస్తువులయందు భగవంతునియొక్క అంతఃస్థితిచేతనే మఱియు ప్రతిప్రాణి హృదయమునందు అతని సన్నిధిచేతనే అన్నియు తమ పనులను జేయును. జగత్స్రష్ట తన సృష్టిచేత పరిమితుడు గాడు (9-5); కర్మప్రభువు తన కర్మలచేత బద్ధుడు గాడు (4-13); భగవదిచ్ఛ తన శ్రమయందును, దాని ఫలితములందును సక్తము గాదు : ఏలన అది సర్వశక్తము, సర్వవంతము (all-possessing) మఱియు సర్వానందమయము. కాని

అట్లయినను ఈశ్వరుడు తన అతీతావస్థనుండి తన సృష్టిపై, క్రిందికి దృష్టి సారించును; అత డవతారరూపమున దిగివచ్చును (4–6); అత డిచ్చట నీయం దున్నాడు; అత డన్ని వస్తువులను లోపలినుంచి తమ ప్రకృతి ననుసరించి శాసించును. మఱియు నీవును అతనియం దుండి కర్మ చేయవలెను – పరిమితిచేత గాని, సంగముచేత గాని, బంధనముచేత గాని స్పృశింపబడని దివ్య ప్రకృతియొక్క విధానమును మఱియు క్రమము ననుసరించి కర్మచేయవలెను. అందరి పరమ కల్యాణమునకు (5–25) కర్మ చేయుము, ప్రపంచయాత్రను కాపాడుటకు కర్మ చేయుము, లోకసంగ్రహార్థము (3–20) కర్మచేయుము. నేను నీనుండి అపేక్షించు కర్మ – అది ముక్తయోగియొక్క కర్మ (4–23); అది భగవంతుడు ధరించి యుండు ఒక విముక్త శక్తియొక్క సహజసిద్ధ బహిఃప్రవాహము, అది సమచిత్తతతో గూడిన ఒక క్రియావిలాసము, అది ఒక నిస్స్వార్థ, నిష్కామ శ్రమపూరము.

27. కర్మయోగ ప్రథమసూత్రము : "ఈ విముక్త, ఈ సమ, ఈ దివ్య కర్మయోగమునందు ప్రథమ సోపాన మేమన, ఫలము మఱియు ప్రతిఫలమునందు ఆసక్తికి స్వస్తి చెప్పి, కర్తవ్య కర్మకొఱకే కర్తవ్యకర్మను జేయ నీవు పాటుపడవలెను (3–19). ఏలన ఫలములు నీకు గాక, లోకేశ్వరునికే చెందు నని అంతరాంతరములో నీ కనుభవ ముండవలెను. ఎవడు జగద్వ్యాపారమునందు తన నభివ్యక్తము చేసికొనుచు, కృతకృత్యు డగుచున్నాడో, అట్టి పరమ పురుషునికి నీ శ్రమను నివేదించి, వానికే దాని ఫలితములను వదలివేయుము (9–28). నీ కర్మపర్యవసానము అతని ఇచ్ఛచేత మాత్రమే నిర్ణయింపబడును మఱియు నది శుభ మైనను, అశుభ మైనను, జయ మైనను, అపజయ మైనను, తన ప్రపంచప్రయోజనమున కది యొక సాయముగానే మార్చబడును (11–33). కావున వైయక్తిక సంకల్పముయొక్కయు, సంపూర్ణ ఉపకరణాత్మక ప్రకృతియొక్కయు సర్వథా నిష్కామ, నిస్స్వార్థ క్రియవిధానము కర్మయోగముయొక్క ప్రథమ సూత్ర మగును. అందుచేత నెట్టి ఫలమును అపేక్షింపకుము, నీ కెట్టి ఫలిత మివ్వ బడినను స్వీకరింపుము; సమతతోను, ప్రశాంత ప్రసన్నతతోను స్వీకరింపుము : గెలిచినను, ఓడినను, సంపన్నుడ వైనను, విపన్నుడ వైనను, నిత్రమగు దివ్యకర్మపథమున నిర్భీకముగా, వ్యథజెందక, సందేహించక ముందుకు సాగుము.

28. ఆంతర సంకల్ప సన్న్యాసము రెండవ మెట్టు : "ఇది కర్మపథమున మొదటి మెట్టు మాత్రమే. ఏలన ఫలములయందు మాత్రమే గాక, నీ శ్రమయందును నీవు అనాసక్తుడవు గావలెను (3-25). నీ కర్మలు నీవి - యని తలంచుటను కట్టి పెట్టుము; నీవు నీ కర్మఫలములను పరిత్యజించిన యట్లే, కర్మను సైతము కర్మ మరియు యజ్ఞముల ఈశ్వరునికి అర్పించివేయుము (3-30). నీ కర్మలను నిర్ణయించునది నీ ప్రకృతియే యని గుర్తించుము; నీ ప్రకృతియే నీ స్వభావముయొక్క సాక్షాద్గతిని శాసించును (18-59) మరియు విశ్వప్రకృతియొక్క కార్యనిర్వాహక శక్తి అనుసరించు మార్గమున నీలోని పురుషునియొక్క అభివ్యక్తిపరమగు మలుపును, వికాసమును నిశ్చయించును. భగవన్మార్గము ననుసరించుటయందు నీ మనోగతిని భ్రమయు లోనుగావించు నెట్టి స్వేచ్ఛకు నిక తావివ్వకుము (18-55). నీ స్వభావము నకు అనురూపమగు కర్మను చేపట్టుము (18-47). మహత్తమము, మిక్కిలి అసాధారణము నగు ప్రయత్నమునుండి అత్యల్ప నిత్యకృత్యమువఱకు నీవు చేయు దాని నంతను - నీ మనస్సుయొక్క ప్రతిక్రియను, నీ హృదయముయొక్క ప్రతి క్రియను, నీ దేహముయొక్క ప్రతిక్రియను, ఆంతర మరియు బాహ్యమగు ప్రతి ప్రవృత్తిని (turn), ప్రతి ఆలోచనను, సంకల్పమును, భావమును, చివరకు ప్రతి అడుగును, విరామమును, ప్రతిచలనమును - సర్వమును యజ్ఞతపస్యల మహేశ్వరు నికి (5-29) ఒక యజ్ఞరూపమున జేయుము.

29. ఆంతర కర్మసన్న్యాసము చివరి మెట్టు : "నీవు పరమ సనాతనుని యొక్క ఒక సనాతనాంశమ (15-7) మనియు, అతడు లేనిచో, నీ ప్రకృతిశక్తులకు ఉనికియే యుండ దనియు, అవి అతని ఒక ఆంశిక స్వీయాభివ్యక్తియే గాని ఇతర మేమియు గాదనియు తర్వాత తెలిసికొనుము. భగవంతుడగు అనంతుడే నీ ప్రకృతి యందు అధికాధికముగా పూర్ణరూపము ధరించుచున్నాడు. పరమేశ్వరుని శక్తియే, అతని పరమోచ్చ సంభూతిశక్తియే నీ స్వభావమును రూపొందించుచు, దానియందు రూపొందుచున్నది. కావున నేను కర్త-ననే బుద్ధి సర్వథా విడిచివేయుము; సనాతను డొక్కడే కర్మకర్త యని దర్శించుము (13-31). నీయందలి ప్రాకృత పురుషుని అతనికి ఒక నిమిత్తము (11-33), ఒక ఉపకరణము, ఒక శక్తివాహిని, ఒక అభివ్యక్తిసాధనము గానిమ్ము. నీ యిచ్ఛను అతని కర్పించివేసి, అతని సనాతన నేచ్ఛతో ఏకము గావించుము. నీ ఆత్మ మరియు ఆధ్యాత్మిక పురుషుని నీరవ స్థితి

యందు నీ సర్వకర్మలను నీ ప్రకృతియొక్క పరమ ప్రభుపునకు సమర్పించుము (3-30). నీలో అహంభావము గాని, మానసిక స్వత్వము గాని, ప్రాణిక కోలాహలము గాని యున్నంత కాలము ఈ సమర్పణ యథార్థముగా లేక పూర్ణముగా సాధ్యము కాదు. ఏలన ఒక కర్మ ఏమాత్రము అహంనిమిత్తము చేయబడినను లేక అహంయొక్క కామన మఱియు సంకల్పముతో దూషితమైనను, అది పూర్ణ యజ్ఞము కాజాలదు. అటులే మనలో నెచ్చట నైనను అసమత గాని, అజ్ఞానకృత రాగద్వేషముల ముద్ర గాని యున్నంత కాలము ఈ మహత్ కార్యము బాగుగాను, యథార్థముగాను చేయబడజాలదు. కాని సమస్త కర్మలు, ఫలితములు, వస్తువులు మఱియు వ్యక్తుల పట్ల ఎప్పు డొక పరిపూర్ణ సమత నిలిచియుండునో, కామము లేక అహంకారమునకు గాక, పరమ పురుషునికే సమర్పణ చేయబడియుండునో, అపుడు నీ పరివర్తిత ప్రకృతియొక్క పవిత్రత మఱియు భద్రతయందు భగవదిచ్ఛ సర్వ కర్మలను ఎట్టి పొరపాటు గాని, విచలనము (deflection) గాని లేక నిర్ణయించగలుగును, అటులే భగవచ్ఛక్తి వానిని ఎట్టి నిమ్న హస్తక్షేపము (జోక్యము) గాని, బాధక ప్రతిక్రియ గాని లేక స్వేచ్ఛగా నిర్వహించగలుగును. తన నిష్కళంక పరమాధికారమునందు భగవదిచ్ఛ నీద్వారా నీ ప్రతికర్మను రూపొందించుట కవకాశమిచ్చుచే, యోగయుక్తుడవై (2-48) కర్మ చేయుటచేత - కర్మయోగముచేత - నీకు ప్రాప్తించు సిద్ధియొక్క పరాకాష్ఠ యగును. అది జరిగినపుడు, పురుషోత్తమునితో నొక సంపూర్ణ, నిత్య సాయుజ్యమునందు నీ ప్రకృతి తన విశ్వాంతర్గత మార్గము ననుసరించును, పరమ పురుషుని అభివ్యక్తము చేయును, పరమేశ్వ రాజ్ఞను పాలించును.

30. <u>కర్మమార్గము శ్రేష్ఠతరము</u> : "దివ్య కర్మల ఈ మార్గము జీవనము మఱియు కర్మల బాహ్య సన్న్యాసము కంటెను ఎంతో ప్రశస్యతర ముక్తియు, ఎంతో పూర్ణతర మార్గము మఱియు పరిష్కారమును అగును (5-2). బాహ్య సన్న్యాసము సంపూర్ణముగా సంభవమును గాదు (18-11) మఱియు సంభవమైనంతలో నైతము, అది ఆత్మయొక్క స్వాతంత్ర్యమునకు ఆవశ్యకమును గాదు ; మఱియు నది ఒక విపత్కర దృష్టాంతము, కారణము, దాని ప్రభావము సామాన్య మానవులను తప్పుదారి బట్టించును (3-26). ఏలనె శ్రేష్ఠులు, మహాత్ములు స్థాపించిన ప్రమాణమునే తక్కిన జాతి యంతయు అనుసరించ ప్రయత్నించును. అందుచేత,

క్రియ దేహధారి జీవునియొక్క ప్రకృతియే గావునను (3-5) మఱియు కర్మలు సనాతన కర్మియగు ఈశ్వరునియొక్క సంకల్పమే గావునను, మహాపురుషులు, మహామనీషులు ఈ కర్మదృష్టాంతమును స్థాపించవలెను (3-26). వారు ఎట్టి మినహాయింపు లేక ప్రపంచ కర్మల నన్నింటిని జేయుచు ప్రపంచ-కర్ములు గావలెను, - వారు స్వతంత్రులు, ప్రసన్నులు మఱియు నిష్కాములు నగు భగవత్-కర్ములు గావలెను, విముక్తమగు అంతరాత్మలును, ప్రకృతులును గావలెను.

***

31. ఆనందము కలిసి నపుడే పూర్ణ సంసిద్ధి : "జ్ఞానవిషయక మనస్సును, క్రియావిషయక సంకల్పమును - ఇవియే సర్వము గావు; నీలో ఆనందము నపేక్షించు హృదయమును గలదు. ఈ భాగమునందును, అనగా హృదయముయొక్క శక్తి మఱియు దీప్తియందును, దాని ఆనందాపేక్ష ననుసరించి, అంతరాత్మ తృప్తి నిమిత్తము నీ ప్రకృతిని భగవంతునితో అనన్యమగు సచేతన ఆనందానుభవమునకు మఱల్పుము, పిమ్మట రూపాంతరము జెందించుము మఱియు దానిలోని కుద్ధరించుము. నిజమే, నిర్వ్యక్తి కాత్మయొక్క జ్ఞానము తన స్వీయానందమును గొనివచ్చును; నిర్వ్యక్తికతకు సైతము ఒక ఆనంద మున్నది, అది శుద్ధ సత్తయొక్క కేవలానందము, ఆనంద కైవల్యము. కాని సమగ్ర జ్ఞానము ఒక అధికతర త్రివిధ ఆనందమును, సమ్మోదమును గొనివచ్చును. ఎట్లన, అది అతీ తానందముయొక్క కవాటములను తెఱచును; అది విశ్వగత నిర్వ్యక్తికతయొక్క ఒక నిస్సీమానందము లోనికి మనకు విడుదల గన్పించును; అది ఈ సమస్త, అసంఖ్యాక అభివ్యక్తియందు గల హర్షాతిరేకమును సైతము కనుగొనును : ఏలన ప్రకృతిస్థ సనాతన పురుషుని యందు సైతము ఒక ఆనందము గలదు (6-31). ఈ ఆనందము జీవలోకమునందిచ్చుట భగవంతునియొక్క ఒక అంశమైన (15-7) జీవునియందు ఒక హర్షాతిరేక రూపము ధరించును, ఇది జీవుని మూలమగు భగవంతునియందును, అతని సర్వోన్నతాత్మయందును, అతని ప్రాణేశ్వరునియందును ప్రతిష్ఠితమై యుండును. భగవంతుని లోనికి ప్రవహించు పూర్ణప్రేమయు, ఉపాసనయు ప్రపంచము పట్లను, దాని సమస్త రూపములు, శక్తులు మఱియు ప్రాణుల పట్లను పెంపెసగు విస్తృత

ప్రేమకు విస్తరించును. ఎట్లన, సర్వమునందును భగవంతుడు చూడబడును, పొందబడును, ఆరాధించబడును, సేవించబడును లేక ఏకతయందు తదనుభవము లభించును (6-31). జ్ఞానము మఱియు కర్మలకు సనాతన త్రివిధ ఆనందరూపమగు నీ పరమ కిరీటమును దొడుగుము; ఈ ప్రేమకు ప్రవేశ మిమ్ము, ఈ ఆరాధనను నేర్చుకొనుము: దానిని (భక్తిని) కర్మజ్ఞానములతో ఏకాత్మకము గావించుము. ఇదియే పరిపూర్ణ పరిపూర్ణతయొక్క (సంసిద్ధియొక్క) శిఖరాగ్రము.

32. పూర్ణప్రేమ పూర్ణజ్ఞాన కీలకము : "ఈ ప్రేమయోగము ఆధ్యాత్మిక మహత్త, ఏకత మఱియు స్వాతంత్ర్యము కొఱకు నీ కొక సర్వోన్నత గుప్త శక్తి నిచ్చును. కాని అది భగవజ్ జ్ఞానముతో అనన్య మగు ప్రేమ గావలెను. 1, దుఃఖమునందు ఓదార్పు, సాయము మఱియు విముక్తికొఱకు భగవంతు నన్వేషించు నొక భక్తి గలదు (7-16) : 2, భగవంతుని వరములకొఱకును, అతని సాహాయ్య సంరక్షణల నిమిత్తమును, తన కోర్కెలను పిదుకు కామధేనువుగాను భగవంతు నన్వేషించు నొక భక్తి గలదు : 3. ఇంకను అజ్ఞానమునం దుండి, ప్రకాశ జ్ఞానముల నిమిత్తము భగవంతునివైపునకు దిరుగు భక్తియు గలదు. మఱియు నీ మూడు రూపములకు పరిమితమై యున్నంత కాలము ఉచ్చతమ, ఉదారతమ భగవదభిముఖ వృత్తియందు సైతము త్రిగుణముల ఒకానొక క్రియ నిలిచియుండ వచ్చును. కాని ఈశ్వరప్రేమి ఈశ్వరజ్ఞాని గూడ అయినపుడు, ఆ ప్రేమి తన ప్రియునితో ఏకాత్మకు డగును (7-18); ఏలన అట్టి ప్రేమి దేవదేవున కిష్టుడు (18-54), పరమాత్మచేత వరింపబడినవాడు (కఠ ఉప.). కావున నీయం దీ భగవన్మగ్న ప్రేమను పెంపొందించుకొనుము; ఆధ్యాత్మికీకృతము, తన నిమ్న ప్రకృతి యొక్క పరిమితులనుండి పైకి ఉద్ధృతము నగు హృదయము భగవంతుని అమేయ సత్తయొక్క నిగూఢ రహస్యములను మిక్కిలి ఆంతరంగికముగా (intimate నీకు ప్రకటించును; నీలోనికి అతని దివ్యశక్తియొక్క సంపూర్ణ స్పర్శను, ప్రవా మును, మహిమను గొనివచ్చును; మఱియు నొక శాశ్వత హర్షాతిరేకముయొ పరమ గుహ్యముల ద్వారమును నీకు తెఱచును. పూర్ణప్రేమయే ఇట్లు పూర్ణ జ్ఞా నకు కీలకము (18-55).

33. ప్రేమ కర్మ జ్ఞానముల కిరీటము : "ఈ సమగ్ర భగవత్ప్రేమ నీయందును, సర్వభూతములయందును గల భగవంతునికొఱకు ఒక సమగ్ర కర్మను గూడ అపేక్షించును. పాపము లేక పుణ్యమగు ఒకానొక కామమునకో, నిమ్నము లేక ఉచ్చమగు ఒకానొక ప్రాణిక ప్రేరణకో, సామాన్యము లేక ఉదాత్తమగు ఒకానొక మానసిక కాభిరుచికో విధేయుడై గాని, ఒకానొక మిశ్ర మానసిక మఱియు ప్రాణిక హేతువుచేత గాని సాధారణ మానవుడు కర్మకు బూనుకొనును. కాని ఓ లక్ష్మణా, నీచేత చేయబడు కర్మ స్వతంత్రము, నిష్కామము గావలెను; నిష్కామముగా జేయబడిన కర్మ ఎట్టి ప్రతిక్రియను సృజించదు, ఎట్టి బంధమును విధించదు (4-20, 22). ఒక పూర్ణ సమతయందును (2-48), ఒక అవిచల స్థిరత మఱియు శాంతియందును (5-12) చేయబడు కర్మ ముస్ముందు ఒక ఆధ్యాత్మిక బాధ్యతయొక్క - "కర్తవ్య కర్మయొక్క" (3-19) - సూక్ష్మ భారరూపము ధరించును, కారణము, దానిలో దివ్యావేశ ముండదు; పిమ్మట ఆ కర్మ దివ్య యజ్ఞముయొక్క ఉన్నత రూపము ధరించును (4-25); తన ఉత్తమ రూపమున అది భగవంతునితో సక్రియ ఏకతకు సాధకుని శాంత, ప్రసన్న అంగీకారముయొక్క ఒక ప్రకటనము కాగలదు. కాని ప్రేమయందలి ఏకత ఇంకను ఎంతో ఎక్కువ సాధించును : అది ప్రథమ నిర్వికార శాంతిస్థానమున ఒక ప్రబల, గంభీర హర్షోల్లాసమును ప్రతిష్ఠించును, ఈ హర్షోల్లాసము అహంకారిక కామముయొక్క క్షుద్రావేశము గాక, అనంతానందముయొక్క మహాసాగర మగును. ప్రేమయందలి ఏకత నీ కర్మలలోనికి ప్రియతమ భగవత్సన్నిధియొక్క హృదయస్పర్శి అనుభూతిని, విశుద్ధ దివ్యావేశమును గొని వచ్చును; నీయందును, సర్వభూతములయందును అవస్థితుడై యున్న భగవంతుని కొఱకు జేయు కర్మయొక్క అవిచ్ఛిన్నానందము నీ సొత్తగును. ఇట్లు ప్రేమ కర్మమకుటమును, జ్ఞానమకుటమును అగును.

34. ప్రేమ సమగ్ర సాయుజ్య సాధనము : "జ్ఞానాత్మక మైన ఈ ప్రేమ, నీ కర్మయొక్క గంభీర హృదయము కాగల ఈ ప్రేమ అశేష నివేదనకును, సంపూర్ణ సంసిద్ధికిని నీ అత్యంత ప్రభావశాలి శక్తి యగును (11-54). భగవంతుని సర్వసత్తతో వైయక్తిక సత్తయొక్క సమగ్ర సాయుజ్యము పరిపూర్ణ ఆధ్యాత్మిక జీవనమునకు వలయు నిబంధన (condition) మగును (18-55). కావున సర్వాత్మనా భగవదభిముఖుడవు గమ్ము; జ్ఞాన ప్రేమ కర్మలచేత నీ ప్రకృతి నంతను అతనితో

ఏకముచేయుము. సర్వథా అతని వైపునకు దిరుగుము మఱియు నీ మనస్సును, నీ హృదయమును, నీ యిచ్ఛను నీ సమస్త చేతనను, చివరకు నీ ఇంద్రియములను, తనువును సైతము నిస్సంకోచముగా అతని హస్తములలోని కర్పించివేయుము. అర్పించి, నీ చేతనను అతని దివ్యచేతనయొక్క ఒక నిర్దోష ఆకృతిలోనికి రూపొందించ నిమ్ము. అటులే నీ హృదయమును భగవంతునియొక్క స్వచ్ఛ లేక సముజ్జ్వల హృదయము గానిమ్ము. నీ యిచ్ఛ అతని యిచ్ఛయొక్క ఒక నిర్దోష క్రియ గానిమ్ము. చివరకు నీ యింద్రియములును, శరీరమును సైతము భగవంతుని ఉల్లాసమయ ఇంద్రియవృత్తి మఱియు శరీరము గానిమ్ము. నీ సమస్త సత్తాప్రకృతులతో అతనిని ఆరాధించుము, అతనికి యజ్ఞము చేయుము; ప్రతి చింతనయందును, భావమునందును, ప్రతి ప్రేరణయందును, చేష్టయందును అతనిని స్మరింపుము. ఈ చింతనాదు లన్నియు సర్వథా అతనివే యగువఱకును, మఱియు నీ ఆధ్యాత్మిక సత్తయొక్క పవిత్ర గర్భాలయమునందు వలెనే నీ సర్వ సామాన్య, బాహ్యాతిబాహ్య వృత్తులయందు సైతము అతని సంతత, పరివర్తనసాధక సన్నిధి ప్రతిష్ఠితమగు వఱకును నీ విట్లు దీక్షవహించుము.

***

35. <u>పరివర్తనకు సర్వసమర్పణ</u> : "ఈ త్రివిధ మార్గము సాధనముగా నీవు నీ నిమ్న ప్రకృతినుండి పైకెగసి, నీ పరమ ఆధ్యాత్మిక ప్రకృతిలో ప్రవేశించ గలవు. అది గుప్తముగా నున్న అతిచేతన (super conscient) ప్రకృతి; సర్వోచ్ఛ అనంత భగవంతునియొక్క ఒక అంశమును, అతనితో సత్తాధర్మము (law of being) నందు ఘనిష్ఠముగా ఏకమును అగు జీవుడు (15-7) ఆ ప్రకృతిలో ప్రవేశించి, తన పరమ సత్యమున నివసించునే గాని, ఇక బాహ్యాకృత మాయయందు గాదు. కాగా, ఈ సంసిద్ధిని, ఈ ఏకతను తన స్వీయ సహజ స్థితియందు, అనగా ఒక పరమ విశ్వాతీత భావమునందు దూరముగా నుండి చవిచూడవచ్చును : కాని ఇచ్చట గూడ - మానవ శరీరమునందును, భౌతిక ప్రపంచమునందు గూడ - నీవు దానిని సాధించవచ్చును, మఱియు సాధించవలెను. ఈ లక్ష్యసిద్ధికి, లోపలి నిర్గుణాత్మయందు ప్రశాంత, నిష్క్రియముగా, గుణవిముక్తముగా నుండి, బాహ్య

అవయవములందు గుణముల యాంత్రిక వ్యాపారమును నిర్లిప్తముగా గమనించుచు, ఉదాసీనముగా అనుమతించి నంతమాత్రమున - అది చాలదు. ఏలన నిష్క్రియాత్మ వలెనే సక్రియ ప్రకృతియు భగవంతున కర్పించబడి (18-62), భగవంతుడు గావలసి యున్నది. నీ సత్త యంతయు పురుషోత్తమునితో ఏక సత్తాధర్మము లోనికి - "సాధర్మ్యములోనికి" (14-2) - పెరుగవలెను; సర్వము, అర్జునా, నా సచేతన ఆధ్యాత్మిక సంభూతిలోనికి - "మద్భావములోనికి" (14-19) - రూపాంతరితము గావలెను. ఇందునిమిత్తము సంపూర్ణ సమర్పణ మావశ్యకము. నీ ప్రకృతి యొక్క నానావిధమగు సమస్త మార్గములందును, సమస్త సజీవ ప్రకారములందును నాయందు శరణుబొందుము; ఏలన అట్టి శరణాగతి యొక్కటియే ఈ మహా పరివర్తనమును, పరమసంసిద్ధిని సాధించును (18-62).

36. కర్మసమస్య ఉండనే యుండదు : "ఈ సమున్నత యోగపరిణామము కర్మసమస్యను ఒకే సారి పరిష్కరించివేయును, కాదు, దానిని పూర్తిగా తుడిచివేయును, దాని మూలోచ్ఛేదము చేయును. మానవ కర్మ కష్టములతోను, కలవరములతోను నిండియుండును, అది గహనము, సంకులము నగు నొక అరణ్యము వంటిది; ఈ కర్మారణ్యము ద్వారా కాక, ఈ కర్మారణ్యములోనికి ఎక్కువ తక్కువ అస్పష్టముగా కొన్ని దారులు చేయబడినవి, అంతే; కాని ఈ కష్టతయు, సంకులతయు మానవు డిపుడు తన మానసిక, ప్రాణిక మఱియు భౌతిక ప్రకృతియొక్క అజ్ఞానమునందు నివసించుచున్నా డను ఒకే వాస్తవమునుండి ఉత్పన్నమగుచున్నవి. ఆ ప్రకృతిగుణము లతనిచేత బలాత్కారముగా పనిచేయించును (3-5), అయినను చేయవలసిన బాధ్యత నాకు గల దని తన సంకల్పమున అతడు పీడితు డగును; ఏలన తా నొక అంతరాత్మ ననియు, ఇపు డట్లు సుతరాము గాకపోయినను, లేక స్వల్పముగా మాత్రమే యైనను, అంతరాత్మగా తా నొకనాడు తన ప్రకృతికి స్వామి మఱియు శాసకుడు గావలసి యున్నదనియు అతనిలో నెక్కడో స్ఫురించుచుండును. తన జీవననియమము లన్నియు, తన ధర్మము లన్నియు ఇప్పటి పరిస్థితులలో అపూర్ణము, తాత్కాలికము మఱియు ఉత్తమపక్షమున ఆంశికముగా మాత్రమే ఉచితము లేక సత్యము గాక తప్పదు. ఎప్పు డతడు తనను తెలిసికొనునో, తన నివాసభూమియగు ప్రపంచ వాస్తవ ప్రకృతిని దెలిసికొనునో, మఱియు, నన్నింటిని మించి, తా నెవనినుండి వచ్చునో, ఎవనియందును, ఎవనిచేతను మనునో, ఆ పరమ

సనాతనుని దెలిసికొనునో, అదిగో, అప్పుడతని అపూర్ణత లన్నియు నంతమొందును (9-1). అత డొకసారి సత్యచేతనను, సత్యజ్ఞానమును అందుకొనునేని, అతని కిక నెట్టి సమస్యయు నుండదు; ఏలన అప్పుడతడు తన లోపలినుండియే (గుణముల బలాత్కారముచేత గాక) స్వేచ్ఛగా కర్మచేయును మఱియు తన సత్తయొక్కయు, తన ఉచ్చతమ ప్రకృతియొక్కయు సత్యము ననుసరించి సహజసిద్ధముగా నివసించును. చివరకు, ఈ జ్ఞానము యొక్క పూర్ణరూపమునందు, దాని పరమ శిఖరము నందు కర్మ చేయునది తాను గాక భగవంతుడే యగును, సనాతనుడు మఱియు ననంతుడు నగు ఏకేశ్వరుడే తనయందును, తనద్వారాను, తన (ఇప్పటి) విముక్త ప్రజ్ఞయందును, శక్తియందును, పూర్ణతయందును కర్మచేయును.

37. <u>ప్రాకృత మానవుడు—గుణధర్మములు</u> : "మానవుడు తన ప్రాకృత సత్తయందు ప్రకృత్యధీనుడగు ఒక సాత్త్విక, రాజసిక మఱియు తామసిక ప్రాణి యగును. ఆమె గుణములలో నేది అతనియందు ప్రాబల్యము వహించునో, అతడు దాని ననుసరించియే తన జీవన, కర్మల నియమము నేర్పఱచుకొనును మఱియు నవలంబించును. అతని తామసిక, దైహిక, ఇంద్రియాత్మక మనస్సు జడతా, భయ, అజ్ఞానములకు అధీనమై యుండి, కొంతవఱకు తన పరిసరముయొక్క నిర్బంధమును, కొంతవఱకు తన కామములయొక్క ఆకస్మిక ఆవేగములను అనుసరించును, లేదేని తామసిక, ఆచారబద్ధ బుద్ధియొక్క పరిపాటి - క్రియయందు తలదాచుకొనును. పోగా, కామాత్మకమగు రాజసిక మనస్సు, తాను దేనియందు నివసించునో, ఆ ప్రపంచము తోనే పోరుసల్పును మఱియు సదా క్రొత్తక్రొత్త వస్తువులను బొంద ప్రయత్నించును, అటులే శాసించుటకును, యుద్ధముచేసి జయించుటకును, నిర్మాణవినాశములందును, సంచయచేష్టయందును వ్యగ్రమై యుండును. జయాపజయములకు, హర్షశోకములకు, ఉల్లాసవిషాదములకు మధ్య విఘాతమగుచు, అది సదా ముందడుగు వేయును. కాని ఇంతకును, అది ఏ ధర్మము ననుసరించి నట్లు గన్పించినను, వస్తుతః నిమ్నమగు కామాత్మ మఱియు నహంకారముయొక్క నియమమును మాత్రమే, చంచల, అశ్రాంత, స్వభక్షక మఱియు సర్వభక్షకమగు, ఆ సురిక మఱియు రాక్షసిక మనస్సు యొక్క నియమమును మాత్రమే అనుసరించును. చివరకు సాత్త్విక బుద్ధి కొంతవఱ కీ స్థితిని అధిగమించును మఱియు కామాహంకారముల నియమము కంటెను శ్రేష్ఠ తరమగు నియమము నొక దానిని అనుసరించుటయొక్క అవశ్యకతను గాంచును;

కావున నొక సామాజిక, ఒక నైతిక, ఒక ధార్మిక నియమమును - ఒక ధర్మమును, ఒక శాస్త్రమును - ఏర్పఱచి, దానిని తనపైననే విధించుకొనును. మనస్సు మఱియు సంకల్పమునకు దారి జూప ఒక ఆదర్శమును లేక వ్యావహారిక నియమమును ఏర్పఱచి, దానిని జీవన, వర్తనములందు సాధ్యమైనంత చిత్తశుద్ధితో పాటించుట - ఇది మానవుని సాధారణ మానస మెంత పైకి పోగలదో, అంతటి ఉచ్చస్థితి. ఈ సాత్త్విక మనస్సు పెంపొంది పెంపొంది, తన శిఖరాగ్రము నందుకొనవలెను; అక్కడది అహంకార ప్రేరణతో గూడిన మిశ్రమమును సర్వథా పరిత్యజించ సమర్థమగును మఱియు నట్లు పరిత్యజించి, నిర్వ్యక్తికమగు నొక సామాజిక, నైతిక లేక మతనిర్దిష్ట ఆదర్శముగా, చేయుట సముచితము గావుననే నిస్స్వార్థముగా చేయబడదగిన వస్తువుగా - " కర్తవ్య కర్మగా " (3-19) - ధర్మముకొఱకే ధర్మము నాచరించును (17-11).

38. స్వధర్మ నిర్వచనము : " కాని, ఈ సమస్త ప్రకృతి క్రియయొక్క వాస్తవ సత్య మేమన, అది అల్పాంశమునందు బాహ్య మానసికము, అధికాంశము నందు ఆంతర ఆంతరాత్మికము. అనగా, మానవుడు భౌతిక మఱియు మానసిక ప్రకృతియందు మునిగియున్న ఒక దేహధారి అంతరాత్మ, మఱియు నత డా ప్రకృతి యందు తన వికాసము నిమిత్తము ఒక ప్రగతిశీల నియమము ననుసరించును మఱియు ఈ నియమము తన సత్తయొక్క ఒక ఆంతర ధర్మముచేత నిర్ధారితమగును; తన అంతరాత్మయొక్క ఆకృతియే తన మనఃప్రాణముల ఆకృతిని, అనగా తన " స్వభావమును " (8-3) నిర్మించును. ప్రతి మానవునకు ఒక "స్వధర్మ" (3-35) ముండును, అది తన అంతఃసత్తను బాలించు నియమము, దానినే అతడు గమనించి, కనిపట్టి, అనుష్ఠించవలెను. తన ఆంతర ప్రకృతిచేత నిర్ణీతమైన కర్మయే మానవుని వాస్తవ స్వధర్మము, దాని ననుష్ఠించుటయే అతని యథార్థ వికాసనియమము; దానిని విడిచి పెడ దారి పట్టుట యన సంకరమును, ప్రతిరోధమును (retardation), భ్రాంతనిర్ణయమును గొనితెచ్చుకొనుటయే. తన స్వధర్మమును కనిపట్టి, అనుష్ఠించుటకు మానవున కేది సాయపడునో, అట్టి సామాజిక, నైతిక, మతవిహిత లేక తదితర నియమము మఱియు నాదర్శమే అతనికి సర్వదా సర్వశ్రేష్ఠము.

39. ఆత్మజ్ఞానము × గుణగతాజ్ఞానము : " కాని తన ఉత్తమావస్థయందు సైతము ఈ స్వధర్మక్రియ యంతయు గూడ మనస్సుయొక్కయు, గుణఖేలనము

యొక్కయు అజ్ఞానమునకు అధీనమై యుండును. మానవుని అంతరాత్మ తన స్వరూపమును (ఆత్మను) కనుగొని నప్పుడే, గుణభూమికను దాటి, గుణముల అజ్ఞాన, సంకరములను తన చేతననుండి తుడిచివేయగలుగును. నిజమే, నిన్ను నీవు కనుగొని, నీ ఆత్మయందు నివసింప సాగినపుడు సైతము, నీ ప్రకృతి ఇంకను తన ప్రాత గాడులయందే నడుచుచు, కొంత కాలము తన నిమ్న రీతుల ననుసరించియే పనిచేయుచుండును; అయితే ఆ పని నిపుడు నీవు పరిపూర్ణఆత్మజ్ఞానముతో వెనుకనుండి గమనించుచు, దానిని నీ ప్రాణేశ్వరునికి ఒక యజ్ఞముగా నర్పించగలవు. కావున నీ స్వధర్మ - నియమము ననుసరించుచు, నీ స్వధర్మ-నియతమగు కర్మ నాచరింపుము- ఆ కర్మ ఏది యైనను గావచ్చును (18-47). అహంకారముయొక్క సర్వ ప్రేరణను ఆవలకు నెట్టివేయుము, నీ బాహ్యేచ్ఛయొక్క సర్వారంభణమును త్రోసివేయుము, కామముయొక్క సర్వశాసనమును కాల దన్నుము-నీ సత్తయొక్క సర్వ ప్రకారములను సర్వేశ్వరునికి సర్వథా సమర్పించగలుగువఱకు నట్లు చేయుము (18-65).

40. "సర్వ ధర్మాన్ పరిత్యజ్య" : "మఱియు నీ వీ సమర్పణ నొకసారి మనస్పూర్తిగా చేయగలుగుదు వేని, అదిగో, అది నీలోపలి పరమేశ్వరుని హస్తములలోనికి అశేషముగా నీ సర్వకర్మల ఆరంభణమును (initiation) సన్యసించుటకు (3-30) దగిన పరమ ముహూర్త మగును. అపుడు ఆచారవ్యవహారములకు సంబంధించిన సర్వ నియమములనుండియు, "సర్వ ధర్మములనుండియు" (18-66) విముక్తిని బొందెదము. నీలోని దివ్య శక్తియు, దివ్య సన్నిధియు పాప, అశుభములనుండి నిన్ను విడిపించి (18-66), పుణ్యపాపములకు సంబంధించిన మానవ ప్రమాణముల కంటెను ఎంతో పైకి లేవనెత్తును. ఆ ఎత్తున నీవు ఆధ్యాత్మిక సత్త మఱియు దైవ ప్రకృతియొక్క నిరపేక్ష మఱియు స్వతఃసిద్ధ ఋతము (right, ధర్మము) మఱియు శుద్ధతయందు నివసింతువు మఱియు కర్మచేతువు. అచ్చట నీవు గాక, దివ్య పురుషుడే తన స్వీయ సంకల్పమును, కర్మలను నీద్వారా నిర్వహించుకొనును - నీ నిమ్న ఆహంకారిక సుఖము మఱియు కామనాపూర్తికొఱకు గాక, జగత్ప్రయోజనము నిమిత్తమును, నీ దివ్య శ్రేయము నిమిత్తమును, సర్వుల ప్రకట లేక ప్రచ్ఛన్న హితము నిమిత్తమును (3-24) నిర్వహించును. ప్రకాశమున ఓలలాడుచు, ప్రపంచమునందును, కాలపురుషుని కర్మలయందును నీవు భగవంతుని రూపమును దర్శింతువు, అతని ఉద్దేశ్యమును గ్రహింతువు, అతని ఆదేశమును ఆలకింతువు. నీ ప్రకృతి ఒక ఉపకరణరూపమున, అది ఎట్టిదైనను, అతని ఇచ్ఛనే తనది గావించుకొని, ప్రశ్నించక అనుష్ఠించును; ఏలన నీ పైనుంచియు, లోపలి నుంచియు ఎట్లు నీ కర్మల ఆరంభణము వచ్చునో, అట్లే ఆ ప్రతి ఆరంభణముతోను భగవంతుని ప్రజ్ఞకును, దాని మర్మమునకును సంబంధించిన ఒక అనివార్య జ్ఞానమును,

ఒక ప్రకీ్ర్ణ స్ఫూర్తియు నీలోనుండి ఉద్భవించును. ఇట్లు యుద్ధమతనిది యగును, ఓటమి మతనిది యగును, సామ్రాజ్య మతనిది యగును (11–33).

41. జననమరణములు పీడించని సంసిద్ధి : "ప్రపంచమునందును, పరేమమునందును ఇది నీ సిద్ధి యగును మఱియు నశ్వర జన్మతోగూడిన ఈ లోకముల కావల, పరమ సనాతన అతిచేతన నీది యగును మఱియు నీవు పరమాత్మ యొక్క పరమోన్నత పదమునందు శాశ్వతముగా నివసించెదవు (18–62). ఈ జీవత్ సిద్ధిని బొందిన నిన్ను పునర్జన్మయు, మృత్యుభయమును వేధించవు (14–2); ఏలన ఇచ్చట ఐహిక జీవనమునందే నీవు భగవత్స్వరూపమును ప్రకటించినవాడ వగుదువు, మఱియు నీ అంతరాత్మ, అది మనఃశరీరములలోనికి దిగి యున్నప్పటికి, పరమాత్మయొక్క సువిశాల సనాతనతయందు నివసించుచున్నదియే యగును.

42. నీ యోగమును భగవంతుడే చేపట్టును : "కావున నిదియే నీ పరమ సాధన యగును: నీ సమస్త ఆత్మ మఱియు ప్రకృతియొక్క ఈ సంపూర్ణ సమర్పణము, నీ సర్వోన్న తాత్మయే యగు భగవంతునియందు సర్వ ధర్మముల పరిత్యాగము (18–66) మఱియు పరమ ఆధ్యాత్మిక ప్రకృతిని బొంద నీ సర్వాంగముల చేః అత్యంతి కాకాంక్ష. మార్గారంభమునందు గాని, తర్వాత చాల కాలమునకు గాని, ఒకసారి ఈ సమర్పణాది త్రయమును నీవు సాధింతువేని, ఇక బాహ్య ప్రకృతి యందు నీ పేదియై యున్నను, లేక ఉండినను, నీ మార్గము నిశ్చితము, నీ సిద్ధి అనివార్యము. ఏలన అప్పుడు నీలోని పరమ పురుషుడు నీ యోగమును తానే చేపట్టి, నీ స్వభావానుకూల మార్గముల వెంట దానిని తన పరమ పరిపూర్తిపర్యంతము గొనిపోవును (12–7). అట్టి పరిపూర్తి పిమ్మట నీ జీవనమార్గ మెట్టిదైనను, నీ కర్మప్రకార మెట్టిదైనను, భగవంతునియందే నీవు సచేతనముగా నివసించుచు, కర్మచేయుచు, చరించుచు, నుండెదవు (6–31) మఱియు భగవచ్ఛక్తి ఆంతర మఱియు బాహ్యమగు నీ ప్రతి గతియందును నీద్వారా పనిచేయును (11–33). ఇది ఉత్తమ రహస్యమును, గుహ్యతమమును (18–54) గాన, ఇదియే పరమ యోగము మఱియు అట్లయ్యును, అందరిచేతను అధికాధికముగా సాధించబడగల ఒక ఆంతర సాధనావిధానము (9–32). ఇదియే నీ వాస్తవ, నీ ఆధ్యాత్మిక సత్తయొక్క అత్యంత గంభీర, అత్యంత ఘనిష్ఠ (intimate) సత్యము."

సంపూర్ణము

శ్రీ కృష్ణార్పణమస్తు

ఓం తత్ సత్

# పారిభాషిక పదవివరణము

## (GLOSSARY)

పాఠక మహాశయులు దయచేసి ఈ గ్రంథముయొక్క ప్రథమ సంపుటము నందలి పదవివరణమును గూడ చూచెదరు గాక। పోతే ఇందలి సంఖ్యలు గ్రంథము నందలి పుటలను దెలుపును.

అంతస్థము = Immanent, లోపలనుండునది. ఉదాహరణకు, అంతస్థ భగవంతుడు = హృదయమునం దుండి నడుపు భగవంతుడు. 379

అనుసంధానము = Link, రెండింటిని కలుపునది. ఉదాహరణకు, భారతదేశము నందలి వివిధ భాషలకు హిందీ అనుసంధానభాష. 10

అవధారణ = Emphasis, ఒత్తి చెప్పుట. 290

ఆంతరికము = Subjective, విషయి, విషయిగతము. ఏది నా దృష్టికి విషయమో, అది బాహ్యము, విషయగతము, objective. పోతే, దేనిని 'నేను' గా భావింతునో, అది ఆంతరికము, విషయిగతము, subjective. ఉదాహరణకు బుద్ధ్యాదులు ఆంతరికములు. 16, 32.

ఆగ్రహము = Persistence, అది చెడ్డది యైనను, పట్టిన పట్టు విడువకుండుట. 331

ఆత్మస్వామ్యము = Self - possession. పనిలో మునిగి నపుడు, సామాన్యునికి ఆత్మబోధ ముండదు ; కనుక అతని కపుడు ఆత్మ లేనిదియే యగును. 310. పోతే, ఆత్మప్రభుత = Self - mastery, నిమ్న సత్తపై ప్రభుత.

ఆరామము = Ease, విశ్రాంతి, విశ్రాంతియందలి సుఖము. 190

ఉత్క్రమణము = పైకి బోవుట, బయలుదేరుట, (ఇచ్చుట) ప్రాణము శరీరమును విడిచి, పైకి బోవుట. 38

ఊర్జము = Energy, పనిచేయుటకు కావలసిన శక్తి, ఊర్జితము = అట్టి శక్తి కలిగినది. ఉదాహరణకు, ఊర్జమంత్రి = విద్యుచ్ఛక్తి మంత్రి. 35

ఋతము = Right, కుటిలము కానిది, సత్యమును చేర్చు సూటి మార్గము, ధర్మము. సత్యము ప్రాప్యము, ఋతము ప్రాపకము. 399

కల్పన, పరికల్పన = Concept, భావన. ఉదాహరణకు, దిక్కాలములను గురించి బుద్ధిలో ఏర్పడిన బౌద్ధికరూపములు కల్పన లగును. ఈ కల్పనలు మాఱుచుండ వచ్చును. 62, 144

క్షరము = Mutable, కదలునది, మాఱునది, నశించునది. దీనికి వ్యతిరేకము, అక్షరము = Immutable, కదలనిది, మాఱనిది, నశించనిది. ప్రకృతిగత ఆత్మ క్షరము, ప్రకృతికి ఎడముగా నుండి ఆత్మ అక్షరము. 34

గుణము = శక్తియొక్క సూక్ష్మరూపము. ఉదాహరణకు, 'తన్మాత్రలు'–అనబడు శబ్దస్పర్శరూపరసగంధములు గుణములు. ఈ తన్మాత్రలయొక్క స్థూల రూపములగు ఆకాశ వాయు తేజో జల పృథివీతత్త్వములు పంచభూతములు. ఇట్లు గుణముయొక్క పరమార్థమున, గుణము ద్రవ్యముయొక్క విశేషణము గాదు, ద్రవ్యమే గుణముయొక్క సంతానము. 11

గుహ్యము = Secret, mystic, రహస్యము, గుప్తము, ఇంద్రియములనుండి దాగి యుండునది. ఆత్మ గుహ్యము, పరమాత్మ గుహ్యతరము, అంతరాత్మ పరమాత్మల సంబంధము గుహ్యతమము (18–64). 52

ఘటకము, సంఘటకము = Constituting, సంయోజకము, సమకూర్చునది. ఉదాహరణకు, మట్టి కుండయొక్క ఘటకము; మట్టియందలి అణువులు కుండయొక్క ఘటకములు (Constituents). 107. పోతే, విఘటనము = (కుండను సమకూర్చిన ఆ అణువులు) విడిపోవుట. 231

జన్యము = Derivative, ఉత్పత్తి, సంతానము. ఉదాహరణకు, బ్రహ్మము జనకము, ప్రపంచము బ్రహ్మమునుండి వచ్చిన జన్యము; పండు వృక్షము యొక్క జన్యము. 9

జడవాది దార్శనికుడు = materialistic philosopher. 47

తుల్యత = Equilibrium, సమతూకము. తుల = త్రాసు, తుల్యత = సమతూకము. సంతోలనము = Balancing, సంతులిత = Balanced, సమీకృత, తుల్యతగలిగినది. 18

ధర్మము = Law, ఒక వస్తువుయొక్క స్థితిని కాపాడుచుండు నియమము. ఉదాహరణకు మానవజాతిని కాపాడునది (ధరించునది) మానవతాధర్మము. అటులే సత్తకు ఆధారమైనది సత్తాధర్మము, సంభూతికి ఆధారమైనది సంభూతి ధర్మము. 52

దిక్సంబంధి, దైశిక = Spatial, దిక్కునకు సంబంధించినది. అటులే, కాలసంబంధి, కాలిక = Temporal, కాలమునకు సంబంధించినది. 62. దైశిక = Local, కాలిక = తాత్కాలిక - అను అర్థములు గూడ గలవు.

నపాస్తమగును = Removed, 50.

నమనశీలత = Plasticity, కోరిన రూపములో వంచుటకు వీలగు స్వభావము గలది. ఉదాహరణకు, తక్కువ కులములో బుట్టిన కొందరి ప్రకృతి ఎక్కువ కులములోని వారి వృత్తికి అనురూపముగా మలచుటకు వీలుగావచ్చును. 295

నిమిత్తము = Causality, కార్యకారణ సంబంధము. దేశ, కాల, నిమిత్తములు మూడును సృష్టిక్రియకు మూలసూత్రములు. 376

నియామకత్వము = Determinism, నిర్ణాయకత్వము. నిమ్నప్రకృతి బద్ధులమై యున్నపుడు మన కర్మసంకల్పము, కర్మ - రెండును ప్రకృతివృత్తులే. కనుక నిమ్న ప్రకృతిలో మునిగియున్నంత కాలము మన స్వేచ్ఛ ఆభాస మాత్రమే. 218.

నిరపేక్షము = Absolute. కేవలము, తన ఉనికి లేక క్రియనిమిత్తము ఇతరము నపేక్షింపక, స్వయంసిద్ధము, స్వయంపర్యాప్తము నగునది. ఇట్టి నిరపేక్షములు గొన్ని గల వని చెప్పునది నిరపేక్షతావాదము. 321, 358.

నిర్ధారకము = Determinant, నిర్ణాయకము. కామము గాక, స్వభావము మన కర్మనిర్ధారకము గావలెను. 218

పరము, పరతరము = Superior, పరమున (పైన) నుండునది. ఆత్మ నిమ్న ప్రకృతికి పరతరము గావున, గుణకర్మలు ఆత్మను బంధించవు. 44

పరిగ్రహము = possession, ఒకని అధీనములో నుండునది. ఉదాహరణకు, గృహము, కారు, మున్నగునవి మన పరిగ్రహములు. 384

పాశవికము = పశుసహజము. 301

ప్రతిరోధము = Retardation, ముందుకు పోనీయక వెనుకకు లాగునది. అన్యధర్మము ననుష్ఠించుట ప్రగతికి ప్రతిరోధమే యగును. 398

ప్రతీకవాదము = Symbolism, ప్రతీకము = చిహ్నము, సంకేతము. చిహ్నముల ద్వారా ఆంతరసత్యమును సూచించు పద్ధతియే ప్రతీకవాదము. ఉదాహరణకు, బాహ్యముగా అగ్నిలో వేల్చునట్టి ద్రవ్యము ఆంతరముగా పరమాత్మ కర్పింపబడు అంతరాత్మకు ప్రతీకము. చూ. గీత (4-25). 256.

ప్రవర్తకము = Originative, ఆరంభకము. భగవదిచ్ఛ సర్వమునకు ప్రవర్తకము; ఆ ఇచ్ఛను నిర్వహించి, దానికి బాహ్యరూపమిచ్చునది బాహ్యప్రకృతి. కాన బాహ్యప్రకృతి నిర్వాహకము = Effective. 31

ప్రవృత్తి = Turn, మలుపు దిరుగుట. ఆధ్యాత్మిక ప్రవృత్తి = ఆత్మదిశగా దిరుగుట.

ప్రాప్తిరూప = Possessing, అధిష్ఠిత, అధికారయుత, అధిష్ఠించి వర్తించునట్టి. Possessing oneness = ప్రకృతి నధిష్ఠించి నపుడు ఏకత్వము. 194. ఇచ్చటి ప్రాప్తిరూప–పదమునకు బదులు అధికారయుత–పదమును వాడ దగును.

బోధము = Awareness, ఎఱుక. ఒకడు సమాధిలో మునిగి నపుడు, అతనికి ప్రపంచముయొక్క బోధము లేదు–ప్రపంచముయొక్క జ్ఞానము లేకపోవుటయే గాక, బోధము గూడ లేదు. అటులే మనకు ఆత్మయొక్క బోధము గూడ లేదు. 5.

భావము = ఉండుట, అగుట–ఇది మొదటి అర్థము. భావము = మనోవృత్తి–ఇది రెండవ అర్థము. భావము = అయిన వస్తువు–ఇది మూడవ అర్థము. అనులోమ, విలోమ పరిణామములచేత భగవంతునినుండియే ఏర్పడియున్న జగత్తు అంతయు భగవంతునియొక్క ఒక భావము. 61

భరించును = Contains. భారమును ఒకడు తన పైన భరించుట యను అర్థము కలదు సరే; భరించుట = లోపల ధరించుట–అను నర్థము ఇచ్చట వర్తిం చును. ఉదాహరణకు, నేను లోపల నెంతో దుఃఖమును భరించుచున్నాను. 63

మాదకము = Intoxicating, మత్తు కల్గించునది. రాజసిక సుఖము, తానే సమస్త సుఖము నను–మత్తును గల్గించును. తామసిక సుఖము కల్గించు మత్తు వేఱు. 280

మాధ్యమము = Medium, రెండింటి మధ్య నుండుచు, వాని ఆదాన ప్రదానమునకు సాధనమగునది. ఉదాహరణకు, వాయువు శబ్దమును మనకు చేర్చవేయు మాధ్యమము. 184

మద్భావము = భగవంతునియొక్క స్వీయభావము, స్వీయ సత్త మఱియు సంభూతి. జీవుడు గుణభావమునుండి వెలువడి, స్వభావము ద్వారా 'మద్భావమును' చేరుకొనును. అది అతని పరిపూర్ణత. 10

మనీషి = Thinker, మేధావి, బుధుడు; మనస్సును శాసించు సంయమి. 74

యోగము = భగవంతునితో సంయోగసాధకమగు సాధనావిధానము. సాంఖ్య

ము = సృష్టితత్త్వములయొక్క సంఖ్యను జెప్పి, వానిని విడదీసి చూపునట్టి శాస్త్రము. సాంఖ్య మట్లు విడదీసి, పై తత్త్వముయొక్క జ్ఞానము మనకు కల్గించుచుండగా, యోగ మా జ్ఞానము ననుష్ఠించి, క్రింది తత్త్వములను అజ్ఞానములోనికి లేవనెత్తును. 5

రహస్యవాదులు = Mystics, బాహ్యవస్తువులందు రహస్య సంకేతములను జూచువారు. ఉదాహరణకు, బాహ్య ప్రకాశము వారికి మానసిక జ్ఞానమునకు సంకేతముగా గన్పించును. 41

రసక్రియ = Alchemy, వస్తువును రూపాంతర మొందించు రసాయనిక ప్రక్రియ. ముఖ్యముగా మట్టిని బంగారము చేయగోరిన ప్రక్రియ ఇది. 103

వరణాత్మకము = Selecting, ఎన్నికచేయునట్టి, తక్కిన వానిని విడిచి, ఒక దానిని వరించునట్టి. సామాన్యముగా, భక్తిజ్ఞానకర్మలలో నొక దానిని మాత్రమే మనస్సు తన సాధనముగా వరించును. 233

విచలనము = Deflection, పెడదారి బట్టుట. 391

విధానము = Affirmation, విధించుట, ఇది కలదని చెప్పుట. విశ్వ మంతయు భగవంతుని విభూతి–యని చెప్పు విధానమును గలదు; అటులే భగవంతునికే విశేషములు లేవు – అని చెప్పు నిషేధము (negation) ను గలదు. 211

విభూతి = విస్తారము, మహత్త్వము, Greatness. విశ్వ మంతయు భగవంతుని విస్తారము. విస్తరణరూపమే గాక, విస్తరణశక్తియు విభూతియే, అనగా సంభూతిశక్తి విభూతి. వ్యష్టిగత అర్థమున, ప్రపంచమున గన్పించు ప్రతి విశేషము భగవంతుని ఒక విభూతి, ఒక కిరణ విశేషము. 104. చూ. గీత (10–41).

విలోమము – Reverse, తిరిగి మూలమునకు బోవునది. సచ్చిదానందము తన స్తరమునుండి దిగివచ్చి, జడద్రవ్యరూపము ధరించుట అనులోమ గతి, ఆ జడమునుండి తిరిగి సచ్చిదానందము వికసించుట విలోమ గతి. 54

వైశ్వము = Universal, విశ్వగతము, విశ్వసంబంధి. దీనికి వ్యతిరేకము, వ్యక్తిగతము = Individual, వైయక్తికము. 63

వ్యావృత్తము = Involved, ముకుళితము, సంవేష్టితము, నిలీనము, సంవృతము. దీనికి వ్యతిరేకము, పరిణతము = Evolved, వికసితము, వివృతము. 6.

ఉదయమున వ్యాప్తమైన చైతన్యము తిరిగి వివృతమగును.

సంకీర్ణత = Complexity, అనేకము అంతర్గతముగా నుండు స్థితి. ఉదాహరణకు, మన సంపూర్ణసత్తలో అంతర్భాగములుగా దేహమయ, ప్రాణమయ, మనోమయ సత్త లుండును. ఇంకను, నత్రజని, భాస్వరము, పొటాషు కలిసియుండు ఎరువును సంకీర్ణ-ఎరు వందుము. 357

సంక్రమణము = Transition, ఒక అవస్థలోనుండి ఇంకొక అవస్థలో ప్రవేశించుట, ఉదాహరణకు, నిమ్నప్రకృతినుండి పరప్రకృతిలోనికి సంక్రమణము. 328

సంతులనము = Balance, సమతూకముగా నుండుట. చూ. 'తుల్యత'. సత్త్వగుణము రజస్తమస్సుల మధ్య సంతులనమును సమకూర్చును. 232

సంవేదనము = Sensation, ఇంద్రియమునకు విషయముతో సంపర్కము కలిగినప్పుడు జనించు జ్ఞానము. సాంవేదనిక = Sensational. 67

సత్తావంతుడు = The existent. భగవంతుడు కేవల సత్తామాత్రము గాడు. అతడు సత్తావంతుడు, సత్తకు ఆధారమగు పరమపురుషుడు, అతడు I-am. 51

సదసద్వివేచనాశక్తి = సత్ + అసత్ + వివేచనాశక్తి, మంచిచెడులను వేఱుచేసి, లోనుండి సహజముగా తెలిసికొను శక్తి, అంతరాత్మ ప్రబోధము, Conscience. 359

సమవర్తనము = Coincidence, సమానవర్తనము, అనురూప్యము, ఐకమత్యము. ఆధ్యాత్మిక భూమికయందు జీవులకు సహవర్తనమే (Co-existence) గాక, సమవర్తనము గూడ సిద్ధించును. 62

సమాధానము = Response, బాహ్య స్పర్శకు సచేతన వస్తువులయందు గలుగు ప్రతిక్రియ. శీతస్పర్శకు పురుషునియందు గలుగు సమాధానము అసుఖము, అటులే దూషణకు గలుగు సమాధానము క్రోధము. 170

(మఱియొక అర్థమున) Compromise. రాజీ, సమాధానపడుచుట. కఠోర సన్న్యాసవాదులు కొంత కాలము మాత్రము కర్మచేయవలసి యుండు నని ఎటులో సమాధాన పడుదురు మఱియు సమాధానపడుతురు. 361

సమీచీనము = Right, యోగ్యము, సముచితము, ధర్మసమ్మతము. నేను భగవంతుని బిడ్డను - ఇది సమీచీన సంబంధము. 62

సరూపీకరణము = Assimilation, సమానరూపము నిచ్చుట, జీర్ణముచేసికొనుట. సంపాదించిన వస్తువును భోగయోగ్యము గావించుకొనుటకు, దానిని తదను

గుణరూపము నివ్వవలసియుండును. అదియే సరూపీకరణము. 233.

సర్వవంతము = All possessing, అంతయును తనదిగా గలిగియుండునది. లేనిది ప్రాప్తించి నపుడు సక్తు డగును. కాని సర్వము సదా తనదియే అయి ఉన్నది గాన, భగవంతునికి దేనియందు సంగ ముండదు. 288.

స్నాయవీయము = Nervous, నరములకుసంబంధించినది (స్నాయువు = నరము). నరములను నడుపు మనస్సు స్నానవీయ మనస్సు. 98

స్వరూపము = Eternal form of the divinity. 55

స్వసంప్రజ్ఞము = Self-conscious, తన ఎఱుక కలిగినది. స్వసంప్రజ్ఞ ప్రజ్ఞ = తన ఎఱుకను స్వయముగా గలిగియుండు ప్రజ్ఞ. మానసిక ప్రజ్ఞ బాహ్య విషయముల నెఱుంగగలదు గాని, దానికి తనను గుఱించిన ప్రజ్ఞయుండదు. అందుచేతనే మానసిక ప్రజ్ఞ అజ్ఞానము, అనగా అపూర్ణ జ్ఞానము. 95

* * *

## ధనము సమర్పించిన ధన్యాత్ములు.

| | |
|---|---|
| శ్రీ పోలవరపు మధుసూదనరావు | పునాదిపాడు |
| శ్రీమతి పోలవరపు మాధవరావు | పునాదిపాడు |
| శ్రీ కె. శ్రీనివాసబాబు | తెనాలి |
| శ్రీ జి. సత్యనారాయణ | తెనాలి |
| శ్రీ తాళ్లూరి వెంకటరామకృష్ణయ్య | యలమంచిలి |
| శ్రీ కలగ రామనీడు | ఏలూరు |
| శ్రీ గంధం పేర్రాజు | ఏలూరు |
| శ్రీమతి గుత్తా లక్ష్మి | ఏలూరు |
| శ్రీ వి. లక్ష్మణరావు | చింతల్లంక |